# కాయ చికిత్స

## (తృతీయ పత్రము)

[వాత, మానస, ఆత్యయిక వ్యాధులు - చికిత్స]

(సి. సి. ఐ. యం. పాఠ్యక్రమము ననుసరించి)


గ్రంథకర్త

డా॥ గంజాం పురుషోత్తమాచార్యులు

యం.డి. (ఆయు) కాయచికిత్స

ప్రొఫెసర్

కాయ చికిత్సా విభాగము

అనంతలక్ష్మి ప్రభుత్వాయుర్వేద కళాశాల

వరంగల్



ప్రచురణ

ఎ. పి. ఆయుర్వేదిక్ లిటరేచర్ ఇంప్రూవ్ మెంట్ ట్రస్టు

హైదరాబాదు

# KAYACHIKITSA
PAPER - III

By
Dr. G. PURUSHOTHAMACHARYULU



First Edition : July '89

PRICE : Rs. 120/-



Published by : A. P. Ayurvedic Literature Improvement Trust, HYDERABAD.

For Copies :
Dr. Y. KRISHNA MANOHAR
Prop ; Indian Remedies
18-4-54, 2nd Lane, Kedareswara pet,
VIJAYAWADA-3.

Printed at :
"RAGHAVENDRA"
S. N. Puram,
VIJAYAWADA-11,

## మా వ్యవస్థాపకులు



కీ. శే. డా॥ వై సూర్యనారాయణరావు గారు

( 1906 - 1980 )



శ్రీ ఎన్. వి. హెచ్. శాస్త్రిగారు, ఐ. ఎ. ఎస్.,

అధ్యక్షులు

ఎ. పి. ఆయుర్వేదిక్ లిటరేచర్ ఇంప్రూవ్‌మెంట్ ట్రస్టు

# ముందుమాట

ఆంధ్రప్రదేశ్ ఆయుర్వేదిక్ లిటరేచర్ ఇంప్రూవ్‌మెంటు ట్రస్టువారు ప్రచురించుచున్న ఆయుర్వేద పుస్తకమాలలలో ఈ "కాయచికిత్స—తృతీయ పత్రము" పదమూడవది. తక్కువ వ్యవధిలో ప్రచురింపబడిన పుస్తకములలో ఇది ఒకటి. దీనికి ముఖ్య కారణము గ్రంథకర్త తీసికొన్న శ్రద్ధ.

"కాయచికిత్స—ప్రథమ పత్రము" ఇప్పటికే ప్రచురించబడినది. ఈ తృతీయ పత్రముద్రణ కూడా పూర్తి అయినందున, ద్వితీయ మరియు చతుర్థ పత్రములకు సంబంధించిన పుస్తకములు కూడా కొద్దిరోజులలోనే ట్రస్టువారు చేపట్టెదరని మరియు 1989 సెప్టెంబరు నెలలో ముద్రణ పూర్తికావించుటకు తగిన చర్యలు తీసికొనడమైనదని తెలుపుటకు సంతసించుచున్నాను. ఈ గ్రంథకర్త డా.జి. పురుషోత్తమాచార్యులు గారు ఎంతో శ్రమ వహించి విద్యార్థులకు ఉపయోగపడే రీతిలో ఉండవలెనని కృషిచేసి ఈ పుస్తకము నందించినారు. వారి కృషి శ్లాఘనీయము. రాష్ట్రంలోని ఆయుర్వేద కళాశాలల విద్యార్థులకు, అధ్యాపకులకే కాకుండా ఆయుర్వేద వైద్యులందరకు ఈ పుస్తకము మిక్కిలి ఉపయోగకారిగా నుండునని ఆశించుచున్నాను.

రానున్న మాసములలో మరికొన్ని పాఠ్య పుస్తకములు కూడ ట్రస్టు వారు ప్రచురించగలరని నమ్ముచున్నాను.

శ్రీ. మో. హ. శాస్త్రి.

హైదరాబాదు,
28.7.89.

అధ్యక్షులు
ఆం. ప్ర. ఆయుర్వేదిక్ లిటరేచర్
ఇంప్రూవ్‌మెంట్ ట్రస్ట్.

# అభిప్రాయము

ఆయుర్వేద శాస్త్రములో కాయచికిత్సకు అత్యంత ప్రాముఖ్యము కలదు. బి. ఎ. యం. ఎస్. పాఠ్యక్రమములో కాయచికిత్స చతుర్థ, పంచమ వర్షములలో బోధింపబడుచున్నది. ఇందులో నాలుగు పరీక్షా పత్రములు కలవు. ప్రస్తుత పాఠ్య పుస్తకము కాయచికిత్స తృతీయ ప్రశ్న పత్రమునకు సంబంధించినది.

ఈ పాఠ్య గ్రంథమును డా. గంజాం పురుషోత్తమాచార్యులు, ప్రొఫెసర్ అనంతలక్ష్మి ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, వరంగల్ గారు వ్రాసినారు. ఈ రచయిత మంచి అధ్యాపకులు, మరియు మంచి చికిత్సకులు కూడా. వారు ఈ గ్రంథమును విద్యార్థులకు ఉపయోగపడునట్లు వ్రాసినారు. ఈ యువ రచయిత ఇకముందు కూడా మరికొన్ని గ్రంథములు వ్రాయవలెనని ఆశిస్తూ, ఆయనను నేను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. త్వరలోనే మిగతా భాగములు కూడా ముద్రణలోకి రాగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు

**డా. పి. శేషిరెడ్డి**

అదనపు సంచాలకులు (ఆయుర్వేద)

భారతీయ వైద్య మరియు హోమియోపతి శాఖ,

హైదరాబాదు.

ది. 13-7-1989.

# మా మాట

ఆంధ్రప్రదేశ్, ఆయుర్వేదిక్ లిటరేచర్ ఇంప్రూవ్ మెంట్ ట్రస్ట్ 1967లో ఆంధ్ర ఆయుర్వేద బోర్డు అధ్యక్షులు డా॥ వై. సూర్యనారాయణరావు L. I. M విజయవాడ వారిచే స్థాపించబడినది.

"వైద్య విద్యార్థి" అను గ్రంథము అమ్మగా వచ్చిన సొమ్ముతో ఈ ట్రస్ట్ నిధిని ఏర్పాటుచేసిరి. దాదాపు 10 సం॥ల తర్వాత వారి కుమారులు డా. వై. కృష్ణ మనోహర్ ప్రభుత్వము వారిని ఈ ట్రస్ట్ బోర్డును పునర్నిర్మించ వలసినదిగా కోరిరి.

1982లో ప్రభుత్వమువారు బోర్డు ఆఫ్ ట్రస్టీస్‌ను, డైరెక్టర్, ఇండియన్ మెడిసిన్స్ & హోమియోపతి డిపార్టుమెంటు వారి అధ్యక్షతన నియమించిరి.

ఇందు ఎడిషనల్ డైరెక్టర్ (ఆయుర్వేద) వారిని, ప్రిన్సిపల్, Dr. బి. ఆర్. కె. ఆర్ గవర్నమెంట్ కాలేజి, డా. డి. యల్. నారాయణ మరియు డా. వై. కృష్ణ మనోహర్ గార్లను సభ్యులుగా నియమించినది.

సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్ వారిచే నిర్ధారింపబడిన పాఠ్యక్రమము ననుసరించి వ్రాయబడిన గ్రంథములను మాత్రమే పాఠ్యగ్రంథములుగా అచ్చు వేయుటకు నిర్ణయము తీసికొనబడినది.

ఆ విధంగా C. C. I. M. సిలబస్ ప్రకారము వ్రాయబడిన 1. ఆయుర్వేద ఇతిహాసము & పరిచయము, 2. శరీర క్రియా విజ్ఞానము, 3. స్వస్థవృత్తము, 4. పదార్థ విజ్ఞానము, 5. శల్యతంత్రము, 6. శాలాక్య తంత్రము, 7. శరీర రచనా విజ్ఞానము, 8. రసశాస్త్ర విజ్ఞానము, 9. కాయ

చికిత్స - మూల సిద్ధాంతములు, 10. భైషజ్య కల్పన, 11. కాయ చికిత్స-తృతీయ పత్రము అను పాఠ్యపుస్తకములు పూర్తి చేయబడినవి.

విద్యార్థులకు, అధ్యాపకులకు కూడా ఉపయోగముగా ఉండునని తలచి సెంట్రల్ కౌన్సిల్ వారి సిలబస్‌ను కూడా మేము ముద్రించినాము.

ఇలా అనతి కాలములోనే ఇన్ని పాఠ్య గ్రంధములు చక్కగా అచ్చు వేయుటకు మాకు సహకరించినవారు ఎందరో, ఏ ఒక్కరైనను సహకరించనిచో ఈ పుస్తకముల ప్రచురణ ఇంత త్వరగా పూర్తి అయి ఉండేదికాదు.

అచ్చు వేయించిన పాఠ్య గ్రంధములను చూచి అనేకులు పండితులు, అధ్యాపకులు, విద్యార్థులు, అధికారులు మమ్ములను ఉత్సాహ పరచుచు మరికొన్ని గ్రంధములను కూడా అచ్చు వేయమని కోరుచుండిరి. ఇందరి ప్రోత్సాహము, ఉత్సాహము వలన మరికొన్ని పుస్తకములను అచ్చువేయుటకు ట్రస్ట్ బోర్డు నిర్ణయము తీసుకొన్నది. వానిలో:

a. కాయచికిత్స, ద్వితీయ, చతుర్థ పత్రములు, b. రోగ నిదానము, c. శరీర రచనా విజ్ఞానము - ద్వితీయ పత్రము, d శల్యతంత్రము - ద్వితీయ పత్రము, e శాలాక్య తంత్రము - ప్రధమ పత్రములు. ఇంకా....

మాకు, ఈ మహాయజ్ఞమునందు అందరి సహాయ సహకారములు ఇటులనే ఉండగలవని, మా యీ కార్యక్రమమును ఆయుర్వేద అభిమానులు అందరు ప్రోత్సహించెదరని ఆశించెదము.

—ఛైర్మన్ & ట్రస్ట్ బోర్డు

# ప్రస్తావన

"ధాతుసామ్యక్రియా చోక్తా తన్త్రస్యాస్య ప్రయోజనమ్"

అను చరక వచనానుసారము ఆయుర్వేదమునకు ముఖ్య ప్రయోజనమును నెరవేర్చుటకు ఉద్దేశించిన వానిలో ప్రధానమైనది కాయచికిత్స.

ప్రస్తుత కాలమునందు అధికముగా ఆచరణలో నుండి జాతీయ అంతర్జాతీయ స్థాయిలలో ఆయుర్వేదమునకు గౌరవప్రతిష్ఠలను ఇనుమడింప చేయుచున్న అంగమును యిదియే. ఈ కాయ చికిత్స అతి విస్తృతమయిన విషయమగుటచే సి.సి.ఐ.యం, పాఠ్య ప్రణాళికలో నాలుగు భాగములుగా విభజింపబడినది.

సర్వసాధారణంగా ఆయుర్వేదౌషధాలచే సంతృప్తికరంగా చికిత్సింపబడే పక్షవాతము, సంధివాతము, గృధ్రసీవాతము, వాతవ్యాధులు, చర్మ వ్యాధులు యకృత్ ప్లీహవ్యాధులు, మానసిక వ్యాధులవంటి అనేక వ్యాధులు ప్రస్తుత గ్రంథమగు కాయ చికిత్స తృతీయ భాగమునందు చేర్చబడినవి. అందుచేత ఈ గ్రంథము వైద్య విద్యార్థులకే కాక వైద్యులకు ఆయుర్వేద చికిత్సను గూర్చిన అవగాహన పొందదలచిన జిజ్ఞాసువులకు ఎంతగానో ఉపకరించగలదు.

మానసిక వ్యాధుల ప్రకరణంలో భగవద్గీత, యోగశాస్త్రము, ఇతర దార్శనిక గ్రంథములందలి విషయములు మౌలిక వివేచనకై సందర్భానుసారము చేర్చబడినవి. అహితములయిన యింద్రియార్థములనుండి మనస్సును నిగ్రహించుట మానసిక వ్యాధుల నిరోధానికి నివారణకు ప్రధానమైనది. ధ్యానము, యోగము, సమాధి మనోనిగ్రహానికి సహకరిస్తాయి. భవిష్యత్తులో మానసికారోగ్యరక్షణలో ప్రపంచానికి ఈ భారతీయ విధానాలే మార్గదర్శకాలు కాగలవని నా విశ్వాసము.

ఆత్యయిక చికిత్సలో వైద్యునికి కావలసినవి సత్వర కార్యదక్షత, ధైర్యము మాత్రమే. ఆయుర్వేదంలో సత్వర ఫలప్రదాయకమగు ఔషధములకు కొరతలేదు.

ఆత్యయిక చికిత్సలలోనూ యితర వ్యాధులలోనూ వివరింపబడిన ఔషధ యోగములు ఉదాహరణ మాత్రములే. అట్టి ఔషధయోగములు సంహితలలోనూ

సంగ్రహ గ్రంథములలోనూ అసంఖ్యాకములుగా గలవు. ప్రస్తుతం వాడుకలో ఉన్న యోగాలకు అధిక ప్రాధాన్యత ఇవ్వటం జరిగింది.

ఈ కాయ చికిత్స తృతీయ భాగమును రచించుటకు నన్నన్ని విధములా ప్రోత్సహించి పీఠికను గూడా వ్రాసిన నా గురువరేణ్యులును ఎడిషనల్ డైరెక్టరు గారును ఐన డా॥ పి. శేషిరెడ్డిగారికి నా వినమ్రతా పూర్వక కృతజ్ఞతాభివందనములు. ఈ గ్రంథ రచనలో తమ అమూల్య సలహాలనిచ్చిన డా॥ యం. రాఘవాచారి, రిటైర్డు మెడికల్ ఆఫీసరు (ఇండియన్ మెడిసిన్ ఫార్మసీ) వారికిని, డా॥యన్. గంగా సత్యం ప్రిన్సిపాల్ నోరి రామశాస్త్రి ప్రభుత్వఆయుర్వేదకళాశాల విజయవాడ వారికిని, కీ॥ శే॥ డా॥ ముదిగొండ శరభయ్యా శర్మగారికిని నా కృతజ్ఞతలు.

అడుగడుగునా మాకు ప్రేరణ నిచ్చుచూ అతి త్వరగా ఈ గ్రంథము ప్రచురింపబడుటకు కారకులయిన ఆయుర్వేద లిటరేచర్ ఇంప్రూవ్‌మెంటు ట్రస్టు చైర్మన్ మరియు ఇండియన్ మెడిసన్స్ అండ్ హోమియోపతి డైరెక్టరు గారయిన శ్రీ యన్. వి. హెచ్. శాస్త్రిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ప్రచురణలో సహకరించిన ట్రస్టుమెంబరు డా॥ వై. కృష్ణ మనోహర్‌గారికి నా ధన్యవాదాలు.

ఈ గ్రంధ రచనలో సహకరించి ప్రోత్సహించిన డా॥ ఐ. డి. శాస్త్రి ప్రొఫెసర్ అండ్ హెడ్ స్నాతకోత్తర కాయచికిత్సా విభాగము వారికిని మిత్రులు డా॥ వి. వరదాచారి, డా॥ ఎస్. మాణిక్యశర్మ, డా॥ పి. బి. ఎ. వెంకటాచారి, డా॥ వి. విజయబాబు గారలకును, నా నమస్సులు.

ఈ గ్రంథపు వ్రాతప్రతి తయారు చేయుటలో అనేక విధములుగా సహకరించిన నా సతీమణి శ్రీమతి డా॥ అరుంధతీ పురుషోత్తానికి, నా కుమార్తె చి॥సౌ॥ జి॥ గాయత్రీదేవికి నా శుభాశీస్సులు.

అతి త్వరలో అందంగా ఈ గ్రంథాన్ని ముద్రించిన రాఘవేంద్ర ప్రింటింగ్ ప్రెస్సువారికి ప్రత్యేక ధన్యవాదాలు.

— గంజాం పురుషోత్తమాచార్యులు.

# గ్రంథకర్త పరిచయము

## డాక్టర్ గంజాం పురుషోత్తమాచార్యులు



జననం : 10-8-1942

జన్మస్థలం : కరవది, ప్రకాశంజిల్లా

జననీ జనకులు : శ్రీమతి గంజాం పేరిందేవమ్మ, డా॥ వెంకటలక్ష్మీ నారాయణా చార్యులు గారలు.

విద్యార్హతలు : బి. ఎ. ఎమ్. & ఎస్. (5 1/2Yrs) 1965 యం.డి. (ఆయు) కాయ చికిత్స (ఉస్మానియా) 1977

ప్రభుత్వ సర్వీసులో 1966న ప్రవేశించి గ్రామీణ ప్రాంతములలో మెడికల్ ఆఫీసరుగను, విజయవాడ ప్రభుత్వాయుర్వేద హాస్పటల్‌నందు కాయచికిత్స విభాగాధిపతిగను, నోరి రామశాస్త్రి ప్రభుత్వాయుర్వేద కళాశాలలో అసిస్టెంటు ప్రొఫెసర్‌గను, హైదరాబాదులోని డా॥ బూర్గుల రామకృష్ణారావు ప్రభుత్వాయు ర్వేద కళాశాలలోని కాయచికిత్స స్నాతకోత్తర విభాగమున ఉపన్యాసకులుగను పని చేసి, ప్రస్తుతము అనంతలక్ష్మీ ప్రభుత్వాయుర్వేద కళాశాల వరంగల్‌నందు కాయచికిత్సా విభాగమున ప్రొఫెసర్‌గా పని చేయుచున్నారు.

Awards- (బహుమతులు)-

జాతీయస్థాయిలో అనేక మారులు ప్రథమ బహుమతులు పొందిరి.

ముఖ్యముగా వాసుదేవ విలాసం నర్సింగ్‌హోమ్ త్రివేంద్రము వారి ద్వారా 1. వాత రక్తము (Rheumatoid arthritis) చికిత్స 2. పక్షఘాత చికిత్స- వీనిపై వ్రాయబడిన నిబంధములకును, 3. ఆయుర్వేద మహా విద్యాలయము నాసిక్ వారి ద్వారా "రాజయక్ష్మ నిదాన చికిత్స" నిబంధమునకును, ఆర్య వైద్య శాల కొట్టకల్, కేరళవారి ద్వారా ఈ క్రింది విషయములలో నిబంధములకును జాతీయస్థాయిలో ప్రథమబహుమతులు పొందిరి. 4. ప్రవాహిక (Amoebiasis) 5. గృధ్రసీవాతము 6. కర్ణనాసాముఖ రోగములు; ఇవియే కాక "రక్త మ్మర్దము (Hypertension) చికిత్స"కు జాతీయ స్థాయిలో బహుమతి పొందిరి.

ప్రచురణలు-

ఆయుర్వేద మరియు వైజ్ఞానిక పత్రికలలోనూ, మోనోగ్రాఫ్ లందును 20కి పైగా పరిశోధనా వ్యాసములు ప్రచురించిరి. AIDSను గురించి వ్రాయ బడిన వ్యాసము దేశ విదేశములందు ఖ్యాతిని పొందినది.

ఆర్యవైద్యశాల, కొట్టక్కల్ కేరళవారిచే రెండు గ్రంథములు ప్రచురింప బడినవి. అవి 1. ప్రవాహిక (Amoebiasis) 2. గృధ్రసీవాతము. కర్ణనాసా ముఖరోగములు (ENT diseases) ప్రచురణలో నున్నది.

వైజ్ఞానిక గోష్ఠులు మొ॥-

జాతీయస్థాయిలోజరిగిన అనేక వైజ్ఞానిక పరిషత్తులందును U.G.C. గోష్ఠు లందును ఇతరసమావేశములందును 40కి పైగా పరిశోధనా పత్రములుసమర్పించిరి.

ఇతరములు-

కేరళ ప్రభుత్వము వారిచే నిర్వహింపబడిన ఆయుర్వేద పాఠ్యగ్రంథ రచయితల వర్క్‌షాప్‌నందు మూడు మారులు పాల్గొని కాయచికిత్స పాఠ్య గ్రంథమును ఆంగ్లములో వ్రాసిరి.

"వాగ్భట" అంతర్జాతీయ ఆయుర్వేద మాసపత్రిక (త్రివేంద్రము) సలహా సంపాదకమండలి సభ్యులుగను, ఆయుర్వేద విశేషజ్ఞ (ఢిల్లీ) సంపాదక మండలి సభ్యులుగను పని చేసిరి.

# ఆధార గ్రంథములు - సంకేతములు


1. అగ్నిపురాణము
2. అథర్వణ వేదము
3. అష్టాంగ సంగ్రహము, ఇందుకృత శశిలేఖావ్యాఖ్యా సహితము (అ. సం)
4. అష్టాంగ హృదయము, అరుణదత్త హేమాద్రి వ్యాఖ్యాసహితము(అ.హృ)
5. ఉపస్కారటీకా
6. ఐతిరేయోపనిషద్ (ఐ.ఉ)
7. చరక సంహిత-చక్రపాణివ్యాఖ్యతో (చ.సం.)
8. ఆయుర్వేద దీపికా వ్యాఖ్య, చక్రపాణికృత (చక్ర)
9. చక్రదత్త (1976) చౌఖంబా శాంస్క్రిట్ సీరీస్ ఆఫీస్ వారణాసి(చ.ద)
10. చికిత్సాదర్శ, రాజేశ్వరదత్త శాస్త్రి
11. న్యాయదర్శనము (న్యా.ద)
12. నిబంధ సంగ్రహ వ్యాఖ్య, డల్హణకృత (డ/డల్హణ)
13. పాలకావ్య తంత్రము
14. బసవరాజీయము (1951)వావిళ్ళ రామస్వామి శాస్త్రులు,మద్రాసు (బ.రా)
15. భావప్రకాశ, యం. వెంకటశాస్త్రి, ఆంధ్ర ఆయుర్వేద పరిషత్, విజయవాడ (భా.ప్ర)
16. భేళసంహిత (1977) వి. ఎస్. వి. ఎస్. శాస్త్రి & సి.ఆర్.ఆర్. శర్మ, సి. సి. ఆర్. ఐ. యం. హెచ్. న్యూఢిల్లీ
17. భగవద్గీత-గీతాప్రెస్, గోరఖ్‌పూర్ (భ.గీ)
18. భైషజ్య రత్నావళి (1961) గోవిందదాస సేన్, రాజేశ్వరదత్తశాస్త్రి, చౌఖంబా (భై.ర)
19. మాధవ నిదానము (1955) మధుకోశ ఆతంక దర్పణ వ్యాఖ్యా సహితము (మా. ని)
20. మానసరోగ విజ్ఞాన్ (1977) డా॥ బాలకృష్ణ అమర్‌జీ పారక్, బైద్యనాథ్ ఆయుర్వేద భవన్

21. యోగసూత్ర (యో.సూ)

22. యోగరత్నాకరము(1931) వేటూరి శ్రీనివాసాచార్యులు నెల్లూరు(యో.ర)

23. రస చండాంశు (ర.చం)

34. రసరత్న సముచ్ఛయము (1963) ఐ.వి. శాస్త్రి-ఇంకాప్స్ (ర.ర)

25. రసతంత్రసారవ సిద్ధ ప్రయోగ సంగ్రహ, కలేడా కృష్ణగోపాల్ ఆయుర్వేద భవన్ (ర.త.సా/ర.తం)

26. రసేంద్రసార సంగ్రహము (ర.సా.సం)

27. వైశేషిక సూత్రము (వై.శే.సూ)

28. తర్కసంగ్రహము

29. విశ్వనాధ కారక

30. వ్యాస భాష్యము

31. వైద్య చింతామణి (1955) డి. వెంకటేశ్వర్లు బుక్‌డిపో, సికింద్రాబాద్ (వై. చిం)

32. శారంగధర సంహిత (1966) చౌఖమ్బా వారణాసి (శా.సం)

33. సుశ్రుత సంహిత (1938) డల్హణ వ్యాఖ్య సహిత (సు.సం)

34. హారీత సంహిత (1974)

35. ఔషధ గుణ ధర్మ వివేచన (1949) కలేడా కృష్ణగోపాల్ ఆయుర్వేద భవన్

36. John Meceloid (1987) Davidson's Principles and Practice of Medicine

37. A.P.I.Text book of Medicine

38. Richard Greens etal (1986) Adult Orthopaedics Churchil and Livingstone.

39. Weatheroll K.L. etal (1984) Oxford Text book of Medicine.

40. Bra!ns Diseases of the Nervous system.


[సంహితల స్థానములకు ఆ స్థానప్రారంభాక్షరము సంకేతముగా వాడబడినది. ఉ: చ. ని. చరక సంహిత నిదానము]

# కాయ చికిత్స

## తృతీయ పత్రము

## పాఠ్యప్రణాళిక మరియు విషయసూచిక

ఈ క్రింది వ్యాధుల నిదానము, సంప్రాప్తి, లక్షణములు మరియు ప్రతీకార జ్ఞానము.

క్రింద పేర్కొనబడిన విషయముల జ్ఞానము.

# వాత వ్యాధులు

శరీరము యొక్క ఉత్పత్తికి, స్థితికి సాధారణ స్థితిలో ఆరోగ్యానికి వికృతి చెందినపుడు అనారోగ్యానికి కారణమైన త్రిదోషములలో వాతము ప్రధానమైనది[1].

వాతము పంచ మహాభూతములలో వాయువు, ఆకాశ భూతములను ప్రధానముగా కలిగియున్నది [2]. అందు చేతనే దీనికి ఆకారముగాని, రూపముగాని లేకుండా ఉండును. వాతమును దాని పనులను బట్టి మాత్రమే గుర్తించవలసి యుండును [3].

---

1. i) వాతపిత్తశ్లేష్మాణ ఏవ దేహసంభవ హేతవః। తైరేవావ్యాపన్నై రధోమధ్యోర్ధ్వ సన్నివిష్టైః శరీరమిదం ధార్యతేఽగారమివ స్థూణాభిస్తిసృభిరతశ్చ త్రిస్థూణ మాహురేకే త ఏవ వ్యాపన్నాః ప్రలయ హేతవః

   (సు.సూ. 21/3)

   ii) దోషాః పునస్త్రయః వాతపిత్తశ్లేష్మాణః తే ప్రకృతి భూతాః శరీరోపకారకా భవన్తి వికృతి యాపన్నాస్తుఖలు నానావిధైర్వికారైః శరీరముపతప్తయన్తి

   (చ.వి 1/5)

   iii) వాయురిత్యాది।అత్ర ప్రధానత్వాదగ్రే వాయురుక్తః

   (చక్రపాణి చ.సు. 1/57 పై)

2. i) త్రత్రవాయో రాత్మైవాత్మా (సు.సూ.)

   ii) వాయునా వాతోత్పత్తి రిత్యర్థః — డల్లణ

   iii) వాయ్వాకాశధాతుభ్యాం వాయుః (అ.సం.సూ 26/3)

3. అవ్యక్తొ వ్యక్త కర్మాచ (సు.ని. 1/7)

ఆయువు, బలము, శరీరముయొక్క సర్వచేష్టలు అనగా హస్తపాదముల యొక్క ఇతర అవయవముల యొక్క కదలికలు వీటన్నింటికి వాతము యొక్క ప్రాకృత స్థితియే కారణము.

మనస్సు దాని విషయములను గ్రహించేటట్లు చేయటము, ఉత్సాహము కల్గించటము, చూపు, రుచి, వాసన, స్పర్శ, శబ్దము, ఇవి గ్రహించేటట్లు చేయటము, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, మాట్లాడునట్లు చేయటము, జఠరాగ్నిని రగుల్కొలపటము ఆహారమును మింగునట్లు చేయటము, మల, మూత్రములు, చెమట ఇవి సక్రమముగా వెడలునట్లు చేయటము మొదలైన అన్నిరకముల శారీరక మానసికక్రియలు ప్రాకృతావస్థలో వాతము నిర్వహిస్తూ ఉంటుంది[1].

వాతము చేసే క్రియలన్నీ ప్రధానముగా రెండు విధములుగా విభజించవచ్చు. 1. గతి-శరీరమందలి బాహ్య ఆభ్యంతర అవయవములందలి కదలికలు వీనిలో కొన్ని ఐచ్ఛికముగను కొన్ని అనైచ్ఛికముగను ఉంటాయి. 2. గన్ధనము—జ్ఞానము జ్ఞానేంద్రియముల ద్వారా విషయములను గ్రహించటము, మానసిక కర్మలు మొదలగునవి [2].

---

1. i) వాయుస్తన్త్రయన్త్రధరః ప్రాణోదానసమానవ్యానాపానాత్మా ప్రవర్తకచేష్టానాముచ్చావచానాం నియన్తా ప్రణేతా చ మనసః సర్వేన్ద్రియాణాముద్యోజకః సర్వేన్ద్రియార్థానామభివోఢా సర్వశరీరధాతువ్యూహకరః సన్ధానకరః శరీరస్య ప్రవర్తకో వాచః, ప్రకృతిః స్పర్శశబ్దయోః శ్రోత్రస్పర్శనయోర్మూలం హర్షోత్సాహయోర్యోనిః సమీరణోఽగ్నేః దోషసంశోషణః క్షేప్తా బహిర్మలానాం స్థూలాణుస్రోతసాంభేత్తా కర్తా గర్భాకృతీనాం ఆయుషోఽనువృత్తిప్రత్యయభూతో భవత్యకుపితః (చ.సూ. 12/8)

ii) వాయురాయుర్బలం వాయుర్వాయుర్ధాతా శరీరిణామ్ (చ.చి. 28/3)

2. 'వా' గతిగన్ధనయోరితి ధాతుః (సు.సూ. 21/5)

ఈ కర్మలు స్థూలముగా ఆధునిక శారీర శాస్త్రానుసారము నాడీమండలము ద్వారా నిర్వహింపబడునవగుటవలన వాతమును నాడీమండలమునకు పోల్చుచుందురు.

వాతము, స్థానము, కర్మలను అనుసరించి ఐదు విధములు అవి: 1. ప్రాణ వాతము, 2. ఉదానవాతము, 3. వ్యానవాతము, 4. సమానవాతము, 5. అపాన వాతము.

వాతము వికృతి చెందుటవలన కలిగే వ్యాధులు వాత వ్యాధులనబడును. వాత నానాత్మజ వ్యాధులు 80 గా వర్ణింపబడినాయి. వ్యాధుల సంఖ్యలో గూడా వాతము ప్రధానమైనది.

వాత వ్యాధులు వర్తమానకాలమునందు గూడా అతి ఎక్కువ సంఖ్యలో వ్యాపించి ఉన్నాయి. వాతవ్యాధులలో ప్రధానమైనవి పక్షవాతము, సంధివాతము, వాతరక్తము, గృధ్రసీవాతము మొదలైనవి.

## వాతవ్యాధుల నిదానము :-

వాత ప్రకోపకారణములన్నియు వాత వ్యాధులకు నిదానముగా పరిగణింపబడతాయి. ఈ క్రింది కారణములు వాతమును ప్రకోపింపచేయును [1].

ఆహార సంబంధ కారణములు :– రూక్ష, శీత, లఘు గుణములుగల ఆహారములు తిక్త, కటు, కషాయరస ద్రవ్యములు సేవించుట, అనశనము

---

1. i) రూక్షశీతోఽల్ప లఘ్వన్నవ్యవాయాతి ప్రజాగరైః విషమాదుపచారాచ్చ దోషాసృక్స్రవణాదతి లఙ్ఘనప్లవనాత్యధ్వవ్యాయామాతివిచేష్టితైః ధాతూనాం సంక్షయాచ్చిన్తాశోకరోగాతికర్షణాత్ దుఃఖశయ్యాసనాత్ క్రోధాద్ దివాస్వప్నాద్ భయాదపి వేగసంధారణాదామాదభిఘాతాదభోజనాత్ మర్మాఘాతాద్ గజోష్ట్రాశ్వశీఘ్రయానాపతంసనాత్ (చ.చి. 28/15-18)

(పరిమితికన్న తక్కువగా భుజించుట) విషమాశనము (విధిననుసరింపక భుజించుట), అధ్యశనము (భుజించిన ఆహారము జీర్ణము కాకముందే మరల భుజించుట); దప్పిక కలిగివున్నపుడు భుజించుట, ఆకలి కలిగినపుడు నీరు త్రాగుట, లంఘనము (ఉపవాసము) విష్టమ్భ కరాహార సేవన; ఎండిన పదార్థములు సేవించుట; కోరదూషము (కొర్రలు); చామలు (శ్యామకము), నివ్వరి ధాన్యము, పెసలు, చిరిశనగలు, కందులు, హరేణుకములు, బఠానీలు, నిష్పావములు, శనగలు, మొలకెత్తిన ధాన్యములు, తృణ ధాన్యములు-వీటిని అధికముగా భుజించుట వరసలు, కరీరము, సొరకాయ (ఆనప), పుచ్చ, దోస, తామరతూండ్లు, తామర దుంపలు, నేరేడు, తుమికి మొదలగునవి. ఎండిన మాంసములు సేవించటము.

విహారమునకు సంబంధించిన కారణములు—దుముకుట, పరుగెత్తుట, గెంతుట అధికముగా నడుచుట, ఈతకొట్టుట, ఎత్తునుండి దుముకుట, విషమముగా నుండు ప్రదేశమున దుముకుట, పరుగెత్తు జంతువులను బలముగా పట్టుకొని ఆపుట, ఎక్కువ బరువుమోయుట, గట్టిగానుండు ధనస్సును బలవంతముగా ఎక్కుపెట్టుటకు ప్రయత్నించుట ఎక్కువ బరువులు ఎత్తుట, బిగ్గరగా చదువుట, అధికముగా వ్యాయామము చేయుట.

---

ii) తత్ర బలవద్విగ్రహాతి వ్యాయామ వ్యవాయాధ్యయన ప్రపతన ప్రధావన ప్రపీడనాభిఘాత ప్లవన లఙ్ఘన ప్రతరణ రాత్రిజాగరణ భారహరణ గజ తురగ రథ పదాతిచర్యా కటు కషాయ తిక్త రూక్ష లఘు శీతవీర్య శుష్క శాక వల్లూర వరకొద్దాలక కోరదూష శ్యామాక నీవార ముద్గ మసూరాఢకీ హరేణు కలాయ నిష్పావానశన విషమాశనాధ్యశన వాత మూత్ర పురీష శుక్ర ఛర్ది క్షవథూద్గార బాష్పవేగ విఘాతాదభి ర్విశేషైర్వాయుః ప్రకోప మాపద్యతే ॥ (సు.సూ. 21/19)

iii) రూక్ష లఘు శీత దారుణ ఖర విశదాః
షడిమే వాత గుణాః భవన్తి। (చ.సూ. 12/4)

విషమమైన ఆసనము, విషమమైన శయనము, అధికముగా వాహనములం పైన ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱములు, రథములు మొదలగు వానిపై శీఘ్ర ప్రయాణము చేయుట, వాహనములపై గుంౘముగా తిరుగుట.

తనకన్న బలవంతులతో యుద్ధము చేయుట.

అభ్యంగనము, మర్దనము, ఉత్సాదము అధికముగా చేయించుకొనుట.

మూత్రము, మలము, శుక్రము, వాంతి, తుమ్ము, త్రేన్పులు, అశ్రువులు వీని వేగములను ఆపుకొనుట.

రాత్రులు నిద్రమేల్కొని యుండుట, పగలు నిద్రించుట, విషమచేష్టలు, విషమ ఉపచారములు.

కాలమునకు, వాతావరణమునకు సంబంధించిన కారణములు——చలిగాలి, చల్లని వాతావరణము, వర్షాకాలము, ఎండాకాలము, ప్రాతఃకాలము, సాయం కాలము, రాత్రియొక్క అంతమున, ఆహారము జీర్ణమైన తదుపరి, వృద్ధావస్థ నందు వాతము ప్రకోపించును.

వ్యాధులు —శరీరమునకు అభిఘాతమును కలిగించు కారణములు.

ఉదా :- వేగముగా పోవుచున్న వాహనములనుండి క్రిందపడుట, ఎత్తు నుండి పడుట మొదలగునవి.

---

iv) సత్త్వేవం గుణైరేవం ద్రవ్యైరేవం ప్రభావైశ్చ కర్మభి రభ్యస్య మానైర్వాయుః ప్రకోపమాపద్యతే సమాన గుణాభ్యాసోహి ధాతూనాం వృద్ధికారణమితి । (చ.సూ. 12/5)

v) అ.హృ.ని. 1/14-15

vi) వ్యాయామాదప తర్పణాత్ప్రపత నాద్భంగాత్ క్షయాజ్జాగరాత్ వేగానాం చ విదారణాదతి శుచశ్శైత్యాదతిత్రాసతః రూక్ష క్షోభ కషాయ తిక్త కటుకైరాభిః ప్రకోపం వ్రజేద్వాయుర్వారిధరాగమే పరిణతే చాన్నే ఽపరాహ్ణేహిచ (చికిత్సా కారిక)

అధికముగా రక్తస్రావము, దీర్ఘకాలమునుండి బాధించుచున్న వ్యాధుల వలన శరీరము అధికముగా కృశించుట, ధాతుక్షయము.

దోషము అధికముగా స్రవించుట, ఆమము, మర్మాభిఘాతము (శిరస్సు, హృదయము, వస్తి), వీనికి వ్యాధులవలనగాని ఇతర కారణములవలనగాని అభిఘాతము కలుగుట.

ఇతర కారణములు—చింత, శోకము, కోపము, భయము, అధికముగా శోధనము చేయించుకొనుట.

సంప్రాప్తి :-

పై కారణములచే శరీరమునందలి స్నేహాది గుణశూన్యమైన స్రోతస్సులలో బలముగానున్న వాతము ప్రకోపించి పూరించును. వాతము సర్వాంగములందుగాని లేక ఏదయినా ఒక అంగమునందుగాని వేరు వేరు వ్యాధులను కలిగించును [1].

వాతము ధతుక్షయము వలనగాని మార్గావరణము వలనగాని ప్రకోపించును [2].

వాతము వలన 80 రకముల నానాత్మజ వ్యాధులు కలుగునని తెలుపబడినది.

---

1. దేహే స్రోతాంసి రిక్తాని పూరయిత్వాఽనిలో బలీ కరోతి వివిధాన్ వ్యాధీన్ సర్వాఙ్గైకాఙ్గ సంశ్రితాన్ (చ.చి. 28/19)

2. i) వాయోర్ధాతు క్షయాత్ కోపో మార్గస్యావరణేనవా (చ) (చ.చి. 28/58)

ii) ధాతుక్షయ కరైర్వాయుః క్రుద్ధత్యతి నిషేవితైః చరస్రోతస్సు రక్తేషు భృశం తాన్యేవపూరయన్ తేభ్యోఽన్య పూర్ణేభ్యః ప్రాప్యవాఽఽవరణం బలీ (అ.సం.ని. 15/8)

**సామాన్య పూర్వ రూపములు**- ఆయా వాత వ్యాధులకు చెప్పబడిన లక్షణములు అస్పష్టముగా కనిపించుటయే పూర్వరూపము.

సామాన్య రూపము—ఆయా వాత వ్యాధులకు చెప్పబడిన లక్షణములు స్పష్టముగా కనిపించుట సామాన్య రూపము [1].

## సామాన్య లక్షణములు :

వాతము ప్రకోపించుటచే కలుగు వ్యాధులు అసంఖ్యాకములుగా నుండును. కాని తంత్రకారులు వారి వారి కాలములందు అధికముగా ప్రబలియున్న ఎనుబది రకముల వ్యాధులను మాత్రము ఉదాహరణ రూపముగా పేర్కొనిరి.

వాతముయొక్క స్వాభావిక స్వరూపమును, కర్మను, సూచించు లక్షణములు దోషము ఆశ్రయించిన అంగములందు అనగా సర్వాంగములందుగాని లేదా కొన్ని లేక ఒకే అంగమునందుగాని అన్నియుగాని కొన్నిగాని ఉన్నచో వాత వ్యాధియని నిస్సందేహముగా నిర్ధారణ చేయవచ్చును.

రౌక్ష్యము (గరుకుతనము), తేలికతనము, వైశద్యము, చల్లగానుండుట, కదులుట, అస్థిరత్వము, రూపము లేకపోవుట ఇవి వాతముయొక్క స్వాభావిక గుణములు.

ఈ గుణములు వాత వ్యాధులందు ఆయా అవయవములందు కలిగించు లక్షణములు—స్రంస (జారుట), భ్రంశ (విడిపోవుట), వ్యాస (విస్తరించుట) సంగ (అడ్డగింపబడుట), అవయవములందు వగులగొట్టుచున్నట్లు బాధ, కృశించుట, గగుర్పాటు, దప్పిక, వణుకు, మెలివేయుట, అదురుట, సూదులతో గుచ్చి

---

1. అవ్యక్తం లక్షణం తేషాం పూర్వరూపమితిస్మృతం ఆత్మరూపం తు యద్వ్యక్తం (చ.చి. 28/19-20)

నట్లు నొప్పి, మెలివేసినట్లుబాధ, వికృతచేష్టలు, గరగరలాడుట, గట్టిగానుండుట, విశదముగానుండుట, రంధ్రములేర్పడుట, గోళ్ళు, చర్మము లేక ఆయా అవయవముల శ్యావ (కొంచెము నలుపు) వర్ణములోగాని లేక అరుణ వర్ణములోగాని యుండుట, నోరు వగరుగాగాని, రుచి తెలియనట్లుగాని ఉండుట, అవయవములు ఎండిపోవుట, శూలముతో పొడిచినట్లుబాధ, మొద్దుబారినట్లుండుట, ముడుచుకొని పోవుట, బిగుసుకొని చాచుట ముడుచుటకు వీలుకాకుండ యుండుట, వంకర తిరుగుట ఈ లక్షణములు వాత వ్యాధిని సూచించును [1].

ఆయా అంగ ప్రత్యంగములు సంకోచించుట, పర్వములు స్తంభించుట, సంధులందు, వేళ్లకణుపులయందు పగల దీసినట్లు బాధ, వెంట్రుకలు నిక్కబొడుచుకొనుట, ప్రలాపము, చేతులు, వీపు, తల స్తంభించిపోవుట, ఖంజత్వము (గూని), కుంటితనము, గుజ్జారితనము, అవయవములు ఎండిపోవుట, నిద్రపట్టక పోవుట, గర్భము నిలువకపోవుట, పురుషులకు శుక్రము నశించుట, స్త్రీలకు రజస్సు క్షీణించుట, శరీరము వణుకుట, మొద్దుబారి నట్లుండుట, తల,

---

1. సర్వేష్వపి ఖల్వేతేషు వాతవికారేషూక్తేష్వన్యేషు చానుక్తేషు వాయోరిదమాత్మరూపమపరిణామి కర్మణశ్చ స్వలక్షణం యదుపలభ్య తదవయవం వా విముక్త సందేహా వాతవికారమేవాధ్యవస్యన్తి కుశలాః తద్యథా —రౌక్ష్యం లాఘవం వైశద్యం శైత్యం గతిరమూర్తత్వం అనవస్థితత్వంచేతి వాయోరాత్మరూపాణి ఏవంవిధత్వాచ్చ కర్మణః స్వలక్షణమిదమస్య భవతి తం తం శరీరావయవమావిశతః వితద్యథా స్రంస భ్రంస వ్యాససఙ్గ భేద సాద హర్ష తర్ష వర్త మర్ద కమ్ప చాల తోద వ్యథా చేష్టాదీని తథా ఖర పరుష విశద సుషిరారుణవర్ణ కషాయ విరస ముఖత్వ సంకోచన శోష శూలసుప్తి స్తంభన ఖఞ్జతాదీని చ వాయోః కర్మాణి నిత్వంతైర వాతవికారమేవాధ్యవస్యేత్॥

ముక్కు, జత్రు (మెడకొంకులు), మొదలైనవని వంకరపోవుట లేక అణిగి పోవుట శరీరమున పగులదీసినట్లు, సూదులతో పొడిచినట్లు బాధ, అవయవములు కొట్టుకొనుట (ఆక్షేపము), మోహము, శ్రమ చేయకున్నను అలసట మొదలగు నవి వాతము ప్రకోపించినపుడు కలుగు సామాన్య లక్షణములు.

అట్టి వాతము కారణ భేదముచేత స్థాన భేదముచేత వేర్వేరు వాత వ్యాధు లను కల్గించును [1]

నానాత్మజ వాత వ్యాధులనుగురించి ప్రథమ (వస్త్రము) భాగమున వివర ములు చూడనగును.

వాత వ్యాధులలో ఈ క్రిందివి ముఖ్యమైనవి. మరియు గంభీర స్థానము నాశ్రయించినవై యున్నవి.[2]

1. సన్ధిచ్యుతి (కీళ్ళు తొలగుట)
2. హనుస్తంభము
3. కుఞ్జనము (శరీరము వక్రమగుట)

---

1. సఙ్కోచః పర్వణాం స్తమ్భో భేదోఽస్థ్నాం పర్వణామపి రోమహర్షః ప్రలాపశ్చ పాణి పృష్ఠ శిరోగ్రహః శఞ్జ పాఙ్గుల్య కుబ్జత్వం శోషోఽఙ్గానామనిద్రతా గర్భ శుక్ర రజోనాశః స్పన్దనం గాత్రసుప్తతా శిరోనాసాక్షి జత్రూణాం గ్రీవాయాశ్చాపి హుణ్డనమ్ భేదస్తోదార్తిరాక్షేపః మోహశ్చాయాస ఏవ చ ఏవం విధాని రూపాణి కరోతి కుపితోఽనిలః హేతుస్థానవిశేషాచ్చ భవేద్రోగ విశేషకృత్ (చ.చి. 28/20-23)

2. సన్ధిచ్యుతి హనుస్తమ్భః కుఞ్జనం కుబ్జతోఽర్దితః పక్షఘాతోఽఙ్గసంశోషః పఙ్గుత్వం ఖుడ వాతతో స్తమ్భనం చాఢ్యవాతశ్చ రోగామజ్జాస్థిగశ్చయే ఏతే స్థానస్య గామ్భీర్యాత్ (చ.చి. 28)

4. కుబ్జత్వము (గూని)

5. అర్దితము (ముఖము వంకరపోవుట)

6. పక్షఘాతము (పక్షవాతము)

7. అంగ సంశోష (అవయవములు ఎండిపోవుట)

8. పంగుత (కుంటితనము)

9. ఖుడవాతము (జంఘ, పాద సంధులందు వాతప్రకోపము లేక వాత రక్తము)

10. స్తంభనము (అవయవములు పట్టుకొని పోవుట)

11. ఆఢ్యవాతము (ఊరు స్తంభము)

12. అస్థి, మజ్జాగత వ్యాధులు.

## వాత వ్యాధులకు ఉపద్రవములు-సాధ్యాఽసాధ్యత.

పైన పేర్కొనబడిన వాత వ్యాదులు అవి ఆశ్రయించిన స్థాన గాంభీర్యత చేత ప్రయత్న పూర్వకముగా చికిత్స చేసినను ఒకప్పుడు శమించును. ఒకప్పుడు శమించక పోవచ్చును.[1]

రోగి బలవంతుడుగానుండి, వ్యాధి నూతనముగా జనించియుండి ఉపద్రవములు ఏవియు లేకున్నచో సాధ్యముగానుండును.[2]

సుశ్రుతుడు స్వభావము చేతనే దుశ్చికిత్స్యములుగానుండు అష్టవిధ మహా వ్యాధులందు వాత వ్యాధులనుగూడా పేర్కొనెను.

---

1. ఏతే స్థానస్య గామ్భీర్యాత్ యత్నాత్సిధ్యన్తి వా నవా (చ.చి. 28)
2. నవాన్ బలవత స్త్వేతాన్ సాధయే న్నిరుపద్రవాన్

అసాధ్యతను, ప్రత్యాఖ్యేయతను సూచించు ఉపద్రవములు - బలక్షయము, మాంస క్షయము, శ్వాస, తృష్ణ, శోష, వమి, జ్వరము, మూర్ఛ, అతిసారము, హిక్క - ఈ ఉపద్రవములతో కూడిన వాతవ్యాధి వర్జనీయము అనగా అసాధ్యము.

వాపు, స్పర్శజ్ఞానము లేకుండుట, అస్థ్యాదులు భగ్నమగుట, కంపము, అధ్మానము, అధిక వేదన - ఈ ఉపద్రవములతో కూడిన వాత వ్యాధి అసాధ్యము.[1]

విసర్పము, మంట, నొప్పి, మూర్ఛ, అరుచి, అగ్నిమాంద్యము, బల మాంసక్షయముతో కూడిన పక్షాఘాతాది వాత వ్యాధులు శమించవు.[2]

## వాత వ్యాధులందు సామాన్య చికిత్స :

ఆవరణము లేకుండగనున్న శుద్ధ వాత వ్యాధులందు మొట్టమొదట ఘృతము, వస, తైలము, మజ్జ—మొదలగు స్నేహములను పానము చేయించవలెను. స్నేహపానముచే అలసియున్న రోగికి ఆశ్వాసనమునిచ్చి పాలు మొదలగు వానితో మరల స్నేహమును కలిగించవలెను. అందులకై ఈ క్రింది క్రియలచే ఉపచరింపవలెను.

---

1. వాతవ్యాధిః ప్రమేహశ్చ కుష్ఠమర్శో భగన్దరమ్ అశ్మరీ మూఢగర్భశ్చ తథైవోదర మష్టమమ్ అష్టావేతే ప్రకృత్యైవ దుశ్చికిత్స్యా మహాగదాః ప్రాణ మాంస క్షయ శ్వాస తృష్ణా శోష వమీ జ్వరైః మూర్ఛాఽతిసార హిక్కాభి పునశ్చైతైరుపద్రుతాః వర్జనీయా విశేషేణ భిషజాసిద్ధి మిచ్ఛతా శూనం సుప్తత్వచం భగ్నం కమ్పాధ్మాన నిపీడితమ్ నరం రుజార్తిమన్తశ్చ వాత వ్యాధి ర్వినాశయేత్ (సు. సూ. 22/4-7)

2. తత్ర ప్రాణమాంసక్షయ పిపాసా జర్వ మూర్ఛా శ్వాస కాస స్తమ్భ శోష రోచకావిపాక విసర్ణ సంకోచనైరనుపద్రుతం బలవన్త మాత్మవన్తముప కరణవంతంచోపక్రమేత (సూ.చి. 5/6)

1. పాలు, యూషము, గ్రామ్య, జలీయ, లేక ఆనూప పశు పక్షులయొక్క మాంస రసములతో ఘృతాది స్నేహములను చేర్చి సేవింపచేయుట.
2. అమ్ల, లవణ, యుక్త కృశరముగాని లేక పాయసముగాని సేవింప చేయుట.
3. అనువాసన వస్తి
4. స్నిగ్ధ నస్యములు.
5. బాగుగా స్నేహనముచేసి స్వేదనములు చేయించుట.
6. ఘృతము, తైలము, వస, మజ్జ-వీనియొక్క పానము, అభ్యంగనము, వస్తికర్మలు.
7. మాంస రసములు. పాలు, మధుర, అమ్ల, లవణ రసములతో కూడిన భోజనములు, ఇతర తర్పణకరమైన ఆహారములు.
8. బృంహణకరములైన అన్ని క్రియలు.
9. గాలి చొరని ఆవరణముకల ప్రదేశంలో రోగిని ఉంచుట.
10. మందమైన దుస్తులు ధరింపచేయుట, కంబళి మొదలైనవి కప్పి యుంచుట.[1]

---

1. i) కేవలం నిరుపస్తమ్భ మాదౌస్నేహైరుపాచరేత్ వాయుం సర్పిర్వసా
తైలమజ్జాపానైర్నిరంతతః స్నేహక్లాన్తంసమాశ్వాస్య పయోభిః స్నేహ
యేత్ పునః యూషైర్గ్రామ్యామ్బుజానూపరసైర్వా స్నేహసంయుతైః
పాయసైః కృశరైః సామ్ల లవణై రనువాసనైః
నావనై స్తర్పణైశ్చాన్నైః సుస్నిగ్ధం స్వేదయే త్తతః
(చ. చి. 28/75-78)

ii) సర్పిస్తైలం వసా మజ్జా సేకాభ్యంజన వస్తయః స్వేదాః స్నిగ్ధాని వాతం
చ స్థానం ప్రావరణాని చ రసాః పయాంసి భోజ్యాని స్వాద్వమ్ల
లవణానిచ బృంహణం యత్తు తత్ సర్వం కర్తవ్యం వాతరోగిణామ్
(చ. చి. 28/104-105)

iii) స్వాదమ్లలవణైః స్నిగ్ధైరాహారైర్వాతరోగిణః
అభ్యంగ స్నేహవస్త్యాద్యైః సర్వానేవోపపాదయేత్ (చక్రదత్త 22/1)

### స్నేహకర్మ :-

స్నేహనక్రియచే శుష్కించియున్న ధాతువులు శీఘ్రముగా పుష్టినిచెందును శరీరమునందు బలము, అగ్ని, పుష్టి, ప్రాణశక్తి వృద్ధి పొందును. స్నేహనముచే మృదుత్వము నొందిన కోష్ఠమునందు వాతవ్యాధులు నిలువజాలవు.[1]

వాతవ్యాధులలో తైలముయొక్క శ్రేష్ఠత్వము- వాతమును శమింపచేయు ఔషధములలో తైలమును (తిలతైలమును) మించినవి మరొకటిలేదు. అట్టితైలమును వాతనాశక ఔషధములచే సంస్కరించినపుడు అది అత్యధిక వాతశామక గుణములు కలదిగా రూపొందును. అందుచే వాతనాశక ద్రవ్యములచే నూరు మారులుగాని వేయిమారులుగాని పక్వము చేయబడిన తైలము సూక్ష్మమార్గములందు కలుగువ్యాధులను కూడా శీఘ్రముగా శమింప చేయగలిగి యుండును.[2]

### కొన్ని ముఖ్యములగు తైలములు :-

సహరాచది తైలము
శ్వదంష్ట్రా తైలము
బలా తైలము
అమృతాది తైలము

---

1. స్నేహశ్చ ధాతూన్ సంశుష్కాన్ పుష్ణాత్యాసు ప్రయోజితః బలవాగ్ని బలం పుష్టిం ప్రాణాంశ్చాప్యభివర్ధయేత్ అసకృత్తం పునః స్నేహైః స్వేదశ్చాప్యుపపాదయేత్ తదాస్నేహమృదుకోష్టేన తిష్ఠన్త్య నిరామయాః
చ. చి. 28/81.82)

2. నాస్తి తైలాత్ పరం కించిదౌషధం మారుతాపహమ్ వ్యవాయ్యుష్ణా గురుస్నేహాత్ సంస్కారాద్బలవత్తరమ్ గణైర్వాత హరైస్తస్మాత్ శతశోఽథ సహస్రశః సిద్ధం క్షిప్రతరం హన్తి సూక్ష్మమార్గస్థితాన్ గదాన్
(చ. చి. 28/181.182)

రాస్నా తైలము

అశ్వగంధాది తైలము

మూలకాది తైలము (చరక)[1]

ప్రసారిణీ తైలము (అ. సం.)

ధన్వంతర తైలము

మాహామాష తైలము

నారాయణ తైలము

ఈ తైలములు సామాన్యముగా పాన, అభ్యంగ, నస్య, అనువాసనవస్తి ద్వారా ప్రయోగించుటవలన అత్యంత వాతశామకములుగా నుండును.[2]

పైన చెప్పబడిన తైలములేగాక శీతజ్వర చికిత్సలోచెప్పబడిన అగర్వాది తైలము వాతరక్త చికిత్సలో చెప్పబడిన తైలములు కూడా ఆయా అవస్థ లనను సరించి ఆయాతైలములనుపక్వముచేసిన ఔషధద్రవ్యముల గుణముల ననుసరించి వాతవ్యాధులందు ప్రయోగించవలయును.[3]

తైలములేకాక ఘృతయోగములు యితర స్నేహయోగములు పాన అభ్యంజన వస్తులకు ప్రయోగింపబడును.

**కొన్ని ముఖ్యములగు స్నేహయోగములు :-**

దశమూలాది ఘృతము

చిత్రకాది ఘృతము

---

1. చ. చి. 28/144-169.
2. సర్వవాతవికారాణాం తైలాన్యన్యాన్యతః శృణు
   చతుష్ప్రయోగాణ్యా యుష్యబలవర్ణక రాణిచ (చ. చి. 28/142-143)
3. చ.చి. 28/179-180

దశమూలాది మజ్జాస్నేహము

దశమూలాది వసాస్నేహము

త్రిఫలాది చతుస్నేహము[1]

రూక్షగుణము వలన శుద్ధవాతముచేకలుగు అనేక విధములగు వాతవ్యాధులందు స్నేహములు అమృతతుల్యముగా పనిచేయును.[2]

ఆధునిక మతానుసారం నాడీసంస్థాన రచనలో స్నేహాంశ అధికముగా నుండును. నాడీ సంస్థానవ్యాధులలో స్నేహాంశ అధికముగా వికృతి చెందుతుంది. ఈ స్నేహ ప్రయోగములచే అది సామ్యస్థితినిపొందే అవకాశము కలదు.

స్నేహనము సక్రమముగా జరిగినపిదప శరీరమంతటాగాని లేక వాతము ప్రకోపించిన ఆయా అంగములందుగాని వాతనాశక తైలములతో బాగుగా అభ్యంగనముచేసి స్నేహయుక్త నాడీస్వేదము, ప్రస్తర స్వేదము, సంకరస్వేదము, పిండస్వేదము, ఉపనాహ స్వేదము లేక అవశ్యత ననుసారము ఇతర స్వేదన విధానములద్వారాగాని చక్కగా స్వేదనము చేయించవలయును.

స్నేహస్వేదములు చేసిన ఎండిన కట్టెనుగూడా ఇష్టమువచ్చినట్లు వంచగలము. అదేవిధముగా బాగుగా స్నేహస్వేదములు చేయుటవలన వక్రముముగాను స్తబ్ధముగను ఉన్నఅంగములు మెల్లమెల్లగా ఇచ్ఛానుసారము కదలించుటకు వీలగును. స్వేదమువలన రోమహర్షము తోద, ఆయామము, శోథ, స్తబ్ధత, అంగ

---

1. చ.చి. 28/119-133

2. రూక్షశుద్ధానిలార్తానామతః స్నేహాన్ ప్రవక్ష్మహే
   వివిధాన్ వివిధ వ్యాధిప్రశమాయామృతోపమాన్ (చ.చి. 28/118)

గ్రహము మొదలగు వాతవికారములు శీఘ్రముగా శమించి అవయవములకుమృదుత్వము కలుగును.[1]

ఈ విధముగా స్నేహస్వేదములచే శమించనిచో మాటిమాటికి తిరిగి స్నేహ స్వేదములు ప్రయోగించవలయును.[2]

స్నేహయోగములు, స్వేదన యోగములు సామాన్యంగా ప్రయోగించునవి తదుపరి వర్ణింపబడును.

## మృదు విరేచనము :-

స్నేహస్వేదములు, సిద్ధ వస్తువులు, నావనము మొదలగు ఉపక్రమములచే శమించనపుడు అధిక దోషయుక్తముగా తెలిసికొని మృదువుగను స్నేహ సంయుక్తముగను ఉండు విరేచనౌషధము ఇచ్చి శోధన చేయించవలయును.[3]

---

1. స్వభ్యక్తం స్నేహసంయుక్తైర్నాడీప్రస్తర సంకరైః తదాన్యైర్వివిధైః
   స్వేదైర్యథాయోగముపాచరేత్ స్నేహాక్తం స్విన్నమఙ్గం తు
   వక్రం స్తబ్ధమథాపివాశనైర్నామయితుం శక్యం యథేష్టం శుష్కదారువత్
   హర్ష తోద రుగాయామ తోద స్తమ్భగ్రహాదయః స్విన్నస్యాశు
   ప్రశామ్యన్తి మార్దవం చోపజాయతే (చ.చి. 28/78-80)

2 (i) అసకృత్తం పునః స్నేహైః స్వేదైశ్చాప్యుపపాదయేత్
   తథా స్నేహ మృదౌకోష్ఠే న తిష్ఠత్యనిలామయాః (చ.చి. 28/82)

(ii) అ. సం. చి. 21/5

3. యద్యనేన సదోషత్వాత్ కర్మణా న ప్రశామ్యతి
   మృదుభిః స్నేహసంయుక్తైరౌషధైస్తంవిరోధయేత్ (చ.చి. 28/83)

అందుకై ఈ క్రింది పేర్కొనబడిన యోగములలో ఏదేని ఒకటి అను కూలత ననుసరించి ప్రయోగించవలయును.

1. తిల్వక సిద్ధఘృతము.

2. పాతలా సిద్ధఘృతము

3. ఏరండ తైలము, దుగ్ధము కలిపి.[1]

4. స్రంసన ద్రవ్యములతో కూడిన భోజనము[2]

5. స్నిగ్ధ, అమ్ల, లవణ. ఉష్ణాది ఆహారముల వలన కఫము, పిత్తము ఏకత్రితమై స్రోతస్సుల నడ్డగించి వాతము యొక్క అవరోధమునకు కారణ మగును. అందుచే వాతమునకు అనులోమనము కల్గించవలెను.[3]

పైన చెప్పబడిన మృదురేచకౌషధాలచే వాతమునకనులోమగతి కలుగును.

కఫము పక్వాశయమును చేరినపుడు వాతవ్యాధులందు విరేచనము చేయించ వలెను. పిత్తము శరీరమందంతటను వ్యాపించినపుడు కూడా విరేచనము ద్వారా శోధనచేయవలయును.[4]

---

1 (i) ఘృతం తిల్వకసిద్ధంవా సాతలా సిద్ధమేవ వా
పయసైరణ్డతైలం వా పిబేద్దోషహరం శివమ్ (చ.చి. 28/84)
(ii) అ.సం.చి. 23/6.

2. భోజ్య యుక్తం వా స్రంసనముపచారయేత్ (అ.సం. 23/8)

3. స్నిగ్ధామ్ల లవణోష్ణాద్యైరాహారైర్హిం మలశ్చితః
స్రోతో బద్ధ్వానిలం రుద్ధ్యాత్తస్మాత్తమనులోమయేత్ (చ.చి. 28/85)

4. ఆమాశయగతం హత్వా కఫం వమనమాచరేత్
పక్వాశయే విరేకం తు పిత్తే సర్వత్రగే తథా (చ.చి.28/189)

శోధనానంతరము సంసర్జన క్రమము ననుసరించి ఉపచరించి జఠరాగ్నిని సామ్యస్థితికి తీసికొని రావలయును.[1]

## వమనము :-

సాధారణముగా వాత వ్యాధులందు వమనము చేయించవలసిన ఆవశ్యకత ఉండదు. వమనము వాత ప్రకోపకరమగును. వాత వ్యాధులందు నిషిద్ధముగను పేర్కొనబడినది.

అయినప్పటికిని ఆమాశయము కఫముతో నిండియున్నప్పుడు రోగి అర్హుడుగా నున్నచో వమనము చేయింపవలయును.[2]

## వస్తికర్మ :-

వస్తికర్మ వాతమునకు ప్రధాన చికిత్సగా పేర్కొనబడినది. సర్వాంగము లందుగాని ఏకాంగమునందు గాని ఆశ్రయించిన వాతమును కేవలము వస్తి ఒక్కటియే వాయువేగమును పర్వతము అడ్డుకొనునట్లు అడ్డుకొనగలదు.[3]

రోగియొక్క అర్హత అనర్హతలను దృష్టిలో నుంచుకొని విధిననుసరించి వస్తికర్మను చేయించవలసి యుండును.

దుర్బలుడుగా నుండుటచే విరేచనమునకు అర్హుడుకాని వాతరోగిని నిరూహ వస్తి ద్వారా చికిత్సించవలయును.

అట్టిస్థితిలో పాచన దీపన ద్రవ్యములతో కూడిన నిరూహవస్తిని ప్రయోగించవలయును.

---

1. చ.చి. 28/87.
2. చ. చి. 28/189
3. సర్వాంగ గతమేకాంగస్థితం వాఽపి సమీరణమ్
   యణద్ధి కేవలో వస్తిర్వాయువేగమివాచలః (సు. చి. 4/20)

మరియు పాచన దీపన ద్రవ్యములతో కూడిన ఆహారములు నివ్వవలయును.[1]

ఈ క్రింది అవస్థలలో వస్తిద్వారా నిర్హరణము చేయవలసియుండును.[2]

**1.** వాత వ్యాధులందు స్వేదనము ద్వారా కఫము ద్రవీభూతమై పక్వాశయమును చేరినపుడు.

2. ప్రకోపించిన పిత్తము శరీరమునందు తన లక్షణములను కల్గించినపుడును.

**అవస్థానుసారవస్తులు :-**

**1.** శ్లేష్మానుగతమైన వాతమునందు ఉష్ణ గోమూత్రముతో కూడిన నిరూహవస్తిని ఇవ్వవలయును.

2. పిత్తముతో కూడిన వాతమునందు క్షీరముతో కూడిన నిరూహవస్తి నిచ్చి దోష నిర్హరణము చేయించవలెను.

---

3. i) దుర్బలో యోఽవిరేచ్యః స్యా త్తం నిరూహైరుపాచరేత్
పాచనై ర్దీపనీయైర్వా భోజనైస్తద్యుతైర్నరమ్ (చ. చి. 28/36)
ii) అ. సం. చికిత్స (23/8)
iii) చ. చి. 28/77)

4. i) స్వేదైర్విష్యన్దితః శ్లేష్మా యదా పక్వాశయస్థితః।
పిత్తం వా దర్శయేల్లిఙ్గం వస్తిభిస్తావినిర్హరేత్। (చ. చి. 28/90)
ii) అ. హృ. చి. (21/82.)

3. పై రెండు అవస్థలయందు మధురౌషధములతో సిద్ధము చేయబడిన తైలముతో అనువాసనవస్తి చేయించవలయును.[1]

4. బలా తైలముతో అనువాసనవస్తి చేయించుట ఎక్కువ గుణకరముగా నుండును.

## సంశోధన అనంతర కృత్యము :-

సంశోధనము చేయించిన తదుపరి సంసర్జన క్రియల ద్వారా జఠరాగ్నిని వృద్ధిపొందించి మరల స్నేహ స్వేదములు ప్రయోగించవలయును.[2]

వాతరోగికి ఎల్లప్పుడు మధుర, ఆమ్ల, లవణ, స్నిగ్ధ, ఆహారముల ద్వారా చికిత్సింపవలెను.[3]

## నస్య-ధూమపానాదులు :-

వాతము శిరస్సు నాశ్రయించి కఫయుక్తముగా నున్నపుడు ధూమపానము, నస్యము మొదలగు శిరోవిరేచక క్రియలు ఆచరించవలయును.[4]

స్నైహిక ధూమపానము, స్నైహిక నస్యము సామాన్యముగా వాత వ్యాధులందు ప్రయోగింపదగును. అవపీడక నస్యము వాత వ్యాధులందు సంజ్ఞా ప్రబోధక చికిత్సలు చేయవలసిన అవసరము వచ్చినపుడు ప్రయోగింపబడును.

---

1. శ్లేష్మణానుగతం వాతముష్ణైర్గోమూత్ర సంయుతైః
నిరూహైః పిత్తసంసృష్టం నిర్హరేత్ క్షీరసంయుతైః
మధురౌషధసిద్ధైశ్చ తైలైస్తమనువాసయేత్ (చ. చి. 28/191-19-)
2. సంశుద్ధస్యోత్థితే చాగ్నౌ స్నేహస్వేదౌ పునర్హితౌ (చ. చి. 28/87)
3. స్వాద్వమ్ల లవణ స్నిగ్ధైరాహారైః సతతం పునః (చ. చి. 28/88)
4. i) శిరోగతే తు స కఫే ధూమ నస్యాది కారయేత్। (చ. చి. 28/193)
ii) చ. చి. (28/88)

### రక్తదుష్టి చికిత్సలు-రక్తమోక్షణము :-

వాత వ్యాధులు, శీత, ఉష్ణ, స్నిగ్ధ, రూక్ష ఉపక్రమములచే శమించినపుడు రక్తదుష్టి వలన కలిగినవని తెలుసుకొనవలయును.[1]

ఈ అవస్థలో రక్తదుష్టి చికిత్సయైన రక్తశామక, పిత్తశామక క్రియలు, విరేచనము, ఉపవాసము, రక్తమోక్షణము మొదలగు ప్రక్రియలచే ఉపచరింప వలెను.[2]

త్వక్కు, మాంసము, రక్తము, సిరలను ఆశ్రయించి వాత వ్యాధులు కలిగినపుడు విశేషించి రక్తమోక్షణము చేయింపవలసి యుండును.[3]

### బహిః పరిమార్జన చికిత్సలు :-

వాత వ్యాధులందు ఆయా అవయవములందు కలుగు తోద, భేద, సుప్తత, వేదన, ఆయామము, సంకోచము, స్తబ్ధత, గ్రహము (పట్టుకొనుట), కంపము, స్రంసము (జారుట), భ్రంశము (తొలగుట), హర్షము, చలనము (కదలుట), రూక్షత్వము, పారుష్యము, శోష మొదలగునవి త్వరితముగా శమింప చేయుటకై బహిః పరిమార్జన చికిత్సలు ఎక్కువగా ఉపకరించును.

---

1. i) శీతోష్ణ స్నిగ్ధరూక్షాద్యైర్వాతజో యోనకామ్యతి
   వికారస్తత్ర విజ్ఞేయం దుష్టమేవాత్ర శోణితమ్। (గదనిగ్రహ 19/19)
   ii) శీతోష్ణస్నిగ్ధ రూక్షాద్యైరుపక్రాన్తాశ్చ
   యే గదాః సమ్యక్సాధ్యాన సిద్ధ్యన్తి రక్తజాంస్తాన్విభావయేత్ (చ. సూ. 24)
2. కుర్యాచ్ఛోణితరోగేషు రక్తపిత్తహరీం క్రియామ్।
   విరేకముపవాసం చ స్రావణం శోణితస్య చ (చ. సూ. 24/18)
3. త్వఙ్మాంసాసృక్ సిరాప్రాప్తే కుర్యాచ్చాసృన్।
   విమోక్షణమ్॥ (చక్రదత్త సు. చి.)

అభ్యంగనము, స్వేదనము, ఉపనాహము, సుఖోష్ణ పరిషేకము, ప్రదేహము, అవగాహము, ఉపవేష్టనము, ఉన్మర్దనము, సంవాహనము, మొదలగునవియు, ధార, పిండస్వేదము, కాయసేకము, అన్నలేపనము మొదలగు కేరళీయ పంచకర్మలను ఆయా వ్యాధవ్యస్థల ననుసరించి ప్రయోగింపబడును.

**ఉపనాహములు :-**

**1. శాల్వణ ఉపనాహము :-**

కాకోల్యాది మధుర గణద్రవ్యములు, భద్ర దార్వ్యాది వాతహర ద్రవ్యములు, మాదీఫలము మొదలగు ఆమ్ల ద్రవ్యములు వీనితో అనూప ఔదక జంతువుల యొక్క మాంసమును చతుర్విధ స్నేహములను కలిపి లవణము నధికముగా చేర్చి పక్వము చేయవలయును. దీనిని సుఖోష్ణముగా ఉండగా వాత వ్యాధుల నన్నింటియందు ఆయా స్థానములందు వేసి ఉపనాహముగా కట్టుచుండవలెను. ఇది సాల్వణ స్వేద మనబడును.[1]

2. కోలాది ఉత్కారికా ఉపనాహము (వృద్ధ వాగ్భట)

3. ఆహారోపయోగమునకు చెప్పబడిన అజాశీర్షము, అంబుజ, అనూపజ మాంసములు బాగుగా వండి అస్థులను తీసివేసి ఘృతము, తైలము, అమ్ల ద్రవ్యములలో బాగుగా మర్ధించి పీడిత అవయవములకు వేసి కట్టుట ద్వారా ఉపనాహ స్వేదము చేయించవలెను. (చ.చి. 28/108)

4. మస్తాది ఉపనాహము

---

1. కాకోల్యాది సతాతీఘ్న సర్వామ్ల ద్రవ్యసంయుతః
సానూపౌదక మాంసస్తు సర్వ స్నేహసమన్వితః
సుఖోష్ణ స్పృష్టలవణః సాల్వణః పరికీర్తితః
తేనోపనాహం కుర్వీత సర్వదా వాతరోగిణామ్ (సు. చి. 4/)

5. వేశవారాది ఉత్కారికా ఉపనాహము.

6. స్నేహముతో కూడిన వాత నాశక గంధ ద్రవ్యముల ఉపనాహము.

7. పాయస కృశరములు స్నేహముతో కలిపిన ఉపనాహము.

8. శీతల ప్రదేహములు (చ.చి. 28/113-118)

9. పట్టు, నూలు, రోమములతో నేయబడిన పట్టాలతో బంధించుట.

10. పిల్లి, ముంగిస, లేడి మొదలగు వాని చర్మములతో చేయబడిన సంచి శాల్వణ స్వేద ద్రవ్యములచే ఆవరింపబడిన శరీర భాగమునకు ప్రవేశ పెట్టి బంధించవలెను. (సు.చి. 4/16-17)

**అవగాహములు :-**

వాత నాశక పత్రములతోగాని, లేక వాతనాశక ద్రవ్యములతోగాని సిద్ధము చేయబడిన క్వాథములతో గాని, కాంజికముతోగాని, క్షీరములతోగాని, తైలము లతోగాని, అవగాహముగాని పరిషేకముగాని చేయించవలయును.

(చ.చి. 28/109)

**లేపనములు :-**

వృద్ధ దార్వాది లేపము, శిగ్రు త్వచాది లేపము, మొదలగునవి ఆయా అవయవములకు లేపనము చేయబడును.

**ఆహారము :-**

ఈ క్రింది ఆహారకల్పము వాత వ్యాధులందు విశేష హితకరముగా నుండును.

బల, బృహత్పంచ మూలములు లేక దశమూలములు-వీని క్వాథముతో మేక మస్తిష్క మాంసమునుగాని లేక జలజ ప్రాణులగు మత్స్యములు మొదలగు

వాని మాంసమునుగాని, అనూప పశు పక్ష్యాదుల మాంసములనుగాని వేరువేరుగా పక్వముచేసి ఆట్టి మాంస రసములందు ఘృతము మొదలగు స్నేహములను కలిపి పక్వమగు సమయమందు పుల్లని పెరుగు త్రికటు చూర్ణము అధికముగా సైంధవలవణము కలిపి పక్వము చేసిన మాంస రసముతో ఆహారము నివ్వవలెను.[1]

## వాత వ్యాధులందు పథ్యా - అపథ్యములు

1. రసములు :-

పథ్యము—మధుర, ఆమ్ల, లవణ రసములు గల ద్రవ్యములు.

అపథ్యము—కటు, తిక్త, కషాయ రసములు గల ద్రవ్యములు.

2. ధాన్యములు :

పథ్యము – పురాణ రక్తశాలి ధాన్యము, ఉలవలు, మినుములు, గోధుమలు

అపథ్యము— శనగలు, బఠానీలు, చామలు, జొన్నలు, పెద్ద సంబావులు, నీవారమను తృణ ధాన్యము, కొఱ్ఱలు, పెసలు, యవలు.

3. గుణములు :-

పథ్యము — ఆహారపదార్థములన్నియు వేడివేడిగా నుండవలయును. మృదు స్నిగ్ధ, ఉష్ణ, స్థిర, వృష్య, పౌష్టిక గుణములు గల ఆహారములు, ఔషధములు.

అపథ్యము — అనశనము, లఘ్వాశనము, రూక్ష, శీతలము, గురు, అభిష్యంది కర ద్రవ్యములు.

---

1. బలాయాః పంచమూలస్య దశమూలస్య వా రసే।
అజశీర్షాంబుజానూపమాంసాద పిశితైః శృతాన్।
సాధయిత్వా రసాన్ స్నిగ్ధాన్ దధ్యమ్లవ్యోషసంస్కృతాన్।
భోజయేద్వాతరోగార్తం తైర్వ్యక్త లవణైర్నరమ్॥ చ. చి. 28/106-107

4. శాకములు :-

పత్ర శాకములు —పథ్యము :- వాస్తూకము, కాసమర్ద, పునర్నవ, ముండి
అపథ్యము—మృణాల

ఫల శాకములు

పథ్యము—కూష్మాండము (గుమ్మడి) లేత వంకాయ, పెద్దములక,కాకర, పొట్ల, మునగ.

అపథ్యము—దొండ, బీర, సొర, దోస కంద,శాకాదులు.

పథ్యము—ముల్లంగి, సూరణ కందము పుట్టకొక్కు.

అపథ్యము—ఇతర కంద శాకములు, వరగులు.

5. ఫలములు :-

పథ్యము—దానిమ్మ, చిట్టీతపండ్లు, రేగుపండ్లు, ద్రాక్ష, మామిడి.

అపథ్యము—నేరేడు, తాటిపండు, మేడిపండు, పోకలు.

6. మాంసములు :-

పథ్యము—గుర్రము, మేక, గాడిద, ఏనుగు, హంస, చక్రవాకము, కప్ప, ఉడుము, మొసలి, కోడి, నెమలి-వీని మాంసములు.

అపథ్యములు :-

చేపలు, అట్లు అనగా స్నిగ్ధ ద్రవ్యయుక్తమైన మేధ్యములగు జలజ, అనూప జంతువుల మాంస రసములు, బిలేశయ, ప్రసహ జంతువుల మాంసములు.

7. పానములు :-

పథ్యము—సుర, ఆసవ, క్షీరము, కొబ్బరి నీరు, వేడినీరు.
అపథ్యము—ఉదమంథము, చెరకునీరు, తేనె, ఏటినీరు.

8. ఇతర ద్రవ్యములు :-

పథ్యము—అన్ని విధములగు స్నేహములు, ఘృత తైల, వస, మజ్జ, దీపనీయ, వాతహర, విరేచనీయ ద్రవ్యములతో పక్వము చేయబడిన ఘృత తైల, వస, మజ్జాది స్నేహములు, జీరకము, హింగు, లశునములు.

విహారములు :

1. శారీరక :-

పథ్యము—అభ్యంగనము, ఉత్సాదనము, మూర్ధ్న తైలము, జేంతాక స్వేదము, కూప స్వేదము, ఇతర స్వేదములు, ఉపవేష్టనము, ఉన్మర్దనము, పీడనము, వాతహర ద్రవ్యసిద్ధ ఉష్ణ అవగాహములు పరిషేకములు.

అపథ్యము—నిదానముగా పేర్కొన బడినవియు, వాత ప్రకోపకములగు శారీరక క్రియలు, అతి వ్యవాయము, వ్యాయామము, పతనము, విరుద్ధ చేష్టలు, వేగ ధారణము, జాగరణము మొదలగునవి.

2. మానసిక :-

పథ్యము—విశ్రాంతాసనము, విస్మరణము విస్మాపనము, ఆయా అవస్థానుసార సౌఖ్య వృత్తి.

అపథ్యము—చింత, ఉద్వేగము.

3. ఆవాసాదులు :-

పథ్యము—గాలి, ఎండ తగలని ఉష్ణ ప్రదేశమున నివసించుట, హేమంత ఋతు చర్యలో చెప్పబడిన విధులు సేవించుట, లోపలగానుండు వెచ్చగానుండు గర్భ గృహమున నివసించుట, లేక భూ గృహమున నివసించుట, మెత్తనిశయ్య, శయన ఆసనములకు మెత్తని మందమైన ఆస్తరణములు విశేషించి మందమైన వస్త్రములు, ఉన్నివస్త్రములు జంతుచర్మములతో చేసిన కవచాలు వెచ్చని మందమైన వస్త్రములు ధరించుట.

అపథ్యము :-

చల్లని వాతావరణము, చలిగాలి, మంచముపై పరుండుట.

# స్థానానుసారముగా వాత ప్రకోపముచే కలుగు లక్షణములు విశేష చికిత్సలు

## 1. కోష్ఠగత వాతము :-

వాతము కోష్ఠము నాశ్రయించినపుడు మూత్రము, మలము బంధించుట, బ్రధ్నము (   ), హృద్రోగము, గుల్మము అర్శస్సు, పార్శ్వశూల, ఈ లక్షణములు కలుగును[1].

**చికిత్స** : క్షారమును గాని, క్షీరమును గాని ఆయా అవస్థానుసారము త్రాగింపవలెను. లేక పాచన దీపన యుక్తమైన ఆమ్ల ద్రవ్యములను ఇచ్చి మలమును పచింపచేయవలెను. అర్శస్సు, గ్రహణి వ్యాధులకై చెప్పబడిన మల ప్రాచీన క్రియలు, క్షార ప్రయోగములు, అన్తర్గుల్మ చికిత్సలో చెప్పబడిన ఉపక్రమములు ఆచరింపవలెను.[2]

## 2. సర్వాంగాశ్రితవాతము :

వాతముసర్వాంగములనాశ్రయించినపుడు అవయములుఅదురుట, విరుగుట, సంధులన్నింటియందు పగులదీసినట్లు వేదన, శరీర స్తంభము, ఆక్షేపము, సుప్తత, శోఫ, శూల ఈ లక్షణములు సర్వాంగములందును కలుగును.[3]

---

1. తత్ర కోష్ఠాశ్రితే దుష్టే నిగ్రహో మూత్ర వర్చసోః
   బ్రధ్న హృద్రోగ గుల్మార్శః పార్శ్వశూలం చ మారుతే॥
   (చ.చి. 28/24)

2. విశేషస్తు కోష్ఠస్థే వాతే క్షారం క్షీరం పిబేన్నరః
   పాచనైర్దీపనైర్యుక్తైరమ్లైర్వా పాచయేన్మలాన్ (చ. చి. 28/89)

3. i) సర్వాంగకుపితే వాతే గాత్ర స్ఫురణ భఞ్జనే
   వేదనాభిః పరీతశ్చ స్ఫుర న్తీవాస్య సన్ధయః (చ. చి. 28/25)

   ii) స్తమ్భాక్షేపణ స్వాపశోఫ శూలాని సర్వగః (సు.ని. 1/30)

చికిత్స:- వాతహర తైలములతో అభ్యంగనము, వాతహార ద్రవ్యములతో సిద్ధము చేయబడిన అనువాసనవస్తి, నిరూహవస్తులు ప్రయోగించుట, అవగాహనము, కుటీస్వేదము, కర్షు స్వేదము, ప్రస్తరస్వేదము, రక్తమోక్షణము వీనిని అవస్థానుసారము ప్రయోగించవలెను.[1]

### 3. ఆమాశయము నాశ్రయించిన వాతము:

వాతము ఆమాశయము నాశ్రయించినపుడు హృదయము, నాభి, పార్శ్వములు, ఉదరము లందు వేదన, తృష్ణ, ఉద్గారము, విసూచిక, కాస, కంఠము, నోరు ఎండిపోవుట, కంఠోపరోధము, మోహము, మూర్ఛ, శ్వాస ఈ లక్షణములు కలుగును.[2]

చికిత్స : శోధనము అనగా వమనము చేయించి సంసర్జన క్రియానంతరం ఏడురోజులు ఉష్ణోదకముతో షడ్ధరణ యోగమును ఇవ్వాలి అగ్ని వృద్ధి కలిగిన తదుపరి కేవలవాతహర చికిత్సలు ఆచరించాలి.[3]

---

1. i) సర్వాంగ కుపితేఽభ్యఙ్గో వస్తయః
సానువాసనాః (చ.చి. 28/91

ii) అవగాహ కుటీ కర్షూ ప్రస్తరాభ్యఙ్గ వస్తిభిః
జయేత్ సర్వాఙ్గజం వాతం సిరామోక్షైశ్చ బుద్ధిమాన్ (సు.చి. 4/11)

2. i) హృన్నాభి పార్శ్వోదరరుక్తృష్ణోద్గారవిసూచికాః
కాసః కణ్ఠాస్యశోషశ్చ శ్వాసశ్చామాశయస్థితే।। (చ.చి. 28/27)

ii) మోహం మూర్ఛా పిపాసాం చ హృద్గ్రహం పార్శ్వవేదనాం

iii) కంఠోపరోధముద్గారాన్ వ్యాధీనూర్ధ్వం చ నాభితః (సు.ని 1/21)

3. i) ఆమాశయే శుద్ధిస్య యథాదోషహరి క్రియాః (చ.చి. 28/91)

ii) ఆమాశయగతే వాతే ఛర్దయిత్వా యథాక్రమమ్
దేయః షడ్ధరణోయోగః సప్తరాత్రా సుఖామ్బునా (సు.చి. 4/3)

## 4. పక్వాశయగత వాతము :

వాతము పక్వాశయము నాశ్రయించినపుడు ఆంత్రకూజనము, శూల, ఆటోపము, ఆనాహము, మూత్రకృచ్ఛము. మలబంధము, బ్రధ్నము, అర్శస్సు, త్రికము, పృష్ఠము, కటి ప్రదేశములందు స్తబ్ధత లేక గ్రహము- ఈ లక్షణములు కలుగుతాయి.[1]

### చికిత్స :-

స్నేహవిరేచనము, శోధనీయవస్తి లవణ ప్రధాన ఆహారము సేవించుట మొదలగు ఉదావర్తమునందు చెప్పబడిన చికిత్సలు చేయాలి [2].

## 5. గుదగత వాతము :-

వాతము గుదము నాశ్రయించినపుడు మలము, మూత్రము, అపానవాతము అడ్డగింపబడుట, ఉదరశూల, ఆధ్మానము, అశ్మరి,శర్కర, జంఘ,ఊరు, త్రిక, పాద, పృష్ఠములందు వేదన, శోష-ఈ లక్షణములు కలుగును [3].

### చికిత్స :-

ఉదావర్త చికిత్సయందు చెప్పబడిన ఉపక్రమములు ఆచరించాలి .[4]

---

1. i) పక్వాశయస్థోఽన్త్రకూజనం (శూలాటోపౌ) కరోతి చ (అ.సం.ని. 15/11)
   కృచ్ఛమూత్రపురీషత్వ మానాహం త్రికవేదనామ్ (చ.చి. 28/28)
   ii) మలరోధశ్నబధ్నార్శ త్రిక పృష్ఠ కటీగ్రహమ్
   కరోత్యధరకాయేషు తాంస్తాన్కృచ్ఛ్రానుపద్రవాన్ (అ.సం.ని. 15)
2. i) గుదపక్వాశయస్థే తు కర్మోదావర్తనుద్ధితమ్ (చ.చి. 28/99)
   ii) పక్వాశయగతే చాపి దేయం స్నేహ విరేచనమ్
   వస్తయః శోధనీయాశ్చ ప్రాశాశ్చలవణోత్తరాః (సు.చి. 4/5)
3. గ్రహో విణ్మూత్ర వాతానాం శూలాధ్మానాశ్మశర్కరాః
   జంఘోరుత్రిక పాత్పృష్ఠరోగశోషా గుదస్థితే (చ.చి. 28/26)
4. చూడుడు 4 (i)

6. ఇంద్రియగత వాతము :-

వాతము ఇంద్రియములను ఆశ్రయించినపుడు శ్రోత్రాది ఇంద్రియములు కార్యములు క్షీణించును. లేక వికృతి చెందును. ఉదా: శ్రోత్రేంద్రియము నాశ్రయించిన బాధిర్యముగాని కర్ణనాదముగాని కల్గును [1].

చికిత్స :

శ్రోత్రాది ఇంద్రియముల నాశ్రయించినపుడు స్నేహాభ్యంగము, ఉపనాహము, స్నైహికనస్యము, ధూమము, శిరోవస్తి, మర్దనము, ఆలేపనము ఆయా స్రోతస్సులకు ఇంద్రియములకు ప్రీణనము కలిగించు తర్పణ క్రియలు—వీనిచే ఉపచరింపవలెను .[2]

7. త్వగ్గత లేక రసగత వాతము :-

వాతము త్వక్‌ను ఆశ్రయించినపుడు చర్మము రూక్షముగా నుండుట, పగులుట, మొద్దుబారినట్లుండుట, కృశించుట, తనుత్వము నొందుట, వర్ణముమారుట, అదరుట, చిమచిమలాడుట, తోద, కృష్ణవర్ణము, రాగము, భేదము, పరిపాటనము, కణుపులందు బాధ, ఈ లక్షణములు కలుగును [3].

---

1. i) శ్రోత్రాదిరష్విన్ద్రియవధం కుర్యాత్ దుష్టసమీరణః (చ.చి. 28/29)
   i') సు.ని. 1/24.
2. i) స్నేహాభ్యంగోపనాహాశ్చ మర్దనా లేపనాని చ (సు.చి. 4/7)
   ii) శ్రోత్రాదిగతే శిరోగతే చ విశేషేణ స్నైహికం నస్యం ధూమం
   శిరోవస్తి మర్దనా లేపనాన్యథాస్వ చ స్రోతసాం ప్రీణనం
   (అ.సం.చి. 23/10)
3. i) త్వగ్రూక్షా స్ఫుటితా సుప్తా కృశా కృష్ణా చ తుద్యతే
   ఆతన్యతే సరాగా చ పర్వరుక్ త్వక్స్థితేఽనిలే (చ.చి. 28/30)
   ii) వైవర్ణ్యం స్ఫురణం రౌక్ష్యం సుప్తిం చుమచూమాయనమ్ త్వక్స్థో నిస్తోదనం కుర్యాత్ త్వగ్భేదం పరిపాటనమ్ (సు.ని. 1/24)

చికిత్స :

స్వేదనములు, అభ్యంగనము, అవగాహములు, ఉపనాహము, మర్దన, ఆలేపము హృద్యములైన భోజనములు, రక్తమోక్షణము - వీనిచే ఉపచరించవలెను.[1]

ధాత్వాశ్రిత వాతములు :-

**1. రసగత వాతము :-** పైన పేర్కొనబడినది.

**2. రక్తగత వాతము :-**

శరీరమునందు తీవ్రమైన వేదన సంతాపము, వివర్ణత్వము, కృశత్వము, అరుచి, శరీరమంతట అరూంషికలు (పుండ్లు) అన్నవిష్టమ్భము, అరుచి, భ్రమ, ఈ లక్షణములు కలుగును.[2]

స్నేహాభ్యంగనము, ఉపనాహము, మర్దన, ఆలేపనము, రక్తమోక్షణము, ఈ ప్రక్రియలు సుశ్రుతమతానుసారము త్వక్‌గత, మాంసగత, రక్తగత, సిరాగత వాత వ్యాధులందు ప్రయోగింపవలెను.

---

1. i) స్వేదాభ్యఙ్గావగాహాశ్చ హృద్యం చాన్నం త్వగాశ్రితే (చ.చి.28/92)
   ii) స్నేహోభ్యఙ్గోపనాహాశ్చ మర్దనాలేపనాని చ
   త్వఙ్మాంసాసృక్సిరాప్రాప్తే కుర్యాచ్చాసృక్విమోక్షణమ్ (సు.చి. 4/7)
2. i) రుజస్తీవ్రాః స సంతాపా వైవర్ణ్యం కృశతాఽరుచిః
   గాత్రే చారూంషి భుక్తస్య స్తమ్భశ్చాసృగ్గతేఽనిలే॥ (చ.చి. 28/31)
   ii) అ.సం.ని. 15/12.

**రక్తగత వాత చికిత్స :-**

విరేచనము, రక్తమోక్షణము, శీతల ప్రదేహములు వీని ననుసరింపవలెను [1].

**3. మాంసగత వాతము :**

అవయవములందు గురుత్వము, అధికముగా సూదులతో పొడిచినట్లు వేదన కర్కశమైన గ్రంథులు, భ్రమ, శ్రమ—ఈ లక్షణములు కలుగును [2].

**చికిత్స :-**

విరేచనము, నిరూహవస్తి, శమన చికిత్సలు, రక్తమోక్షణము [3].

**4. మేదోగత వాతము :-**

మాంసగత వాత లక్షణములు మరియు గ్రంథులు, మంద వేదనతో కూడిన వ్రణములు కలుగును [4].

**చికిత్స :-**

మాంసగత వాత ప్రకోపమునందు చెప్పబడిన చికిత్సలు ప్రయోగించవలెను [5].

---

1. i) శీతాః ప్రదేహా రక్తస్థే విరేకో రక్తమోక్షణమ్ (చ.చి. 28/92)
2. i) గుర్వఙ్గం తుద్యతేఽత్యర్థం దణ్డముష్టిహతం తథా
   సరుక్ శ్రమితమత్యర్థం మాంసమేదోగతేఽనిలే (చ.చి. 28/32)
   ii) మాంసమేదో గతాన్ గ్రన్థీ స్తోదా ఢ్యాన్కర్కశాన్ భ్రమమ్ (అ.సం.ని. 15)
3. i) విరేకో మాంసమేదఃస్థే నిరూహాః శమనాని చ (చ.చి. 28/92)
   ii) సు.చి. 4/7.
4. i) తదా మేదాశ్రితః కుర్యాద్ గ్రన్థీ మన్దరుజోఽవ్రణాన్ (సు.ని. 1/26)
   ii) చ.చి. 28/32 [2(i)]
5. చూడుడు 3.

## 5. అస్థిగత వాతము :-

అస్థిభేదము, పర్వభేదము, సన్ధిశూల, అస్థిశోష, సన్ధిశూల, మాంస క్షయము, బలక్షయము, నిద్రానాశము, సతతవేదన ఈ లక్షణములు కలుగును [1].

## చికిత్స :-

బాహ్య అభ్యంతర స్నేహనము, ఉపనాహము, అగ్నికర్మ, బన్ధనము, మర్దనము, అస్థియందు వాతము అవరుద్ధమైనపుడు, ఆరాశస్త్రముతో వేధించి నాడీ యంత్రముతో ఆచూషణము చేయవలెను [2].

## 6. మజ్జాగత వాతము :-

అస్థిగత లక్షణములు మరియు అస్థులందు సౌషిర్యము, స్తబ్ధత కలుగును [3].

---

1. i) భేదోఽస్థిపర్వాణాం సన్ధిశూలం మాంసబలక్షయః
అస్వప్నః సంతతా రుక్ చ మజ్జాస్థికుపితేఽనిలే (చ.చి. 28/33)
ii) అస్థిశోషం చ భేదం చ………….. (సు.ని. 1/28)
iii) అస్థిస్థః సక్థి సన్ధ్యస్థి శూలం………… (అ.సం.ని. 15/14)

2. i) బాహ్యాభ్యన్తరతః స్నేహైరస్థిమజ్జాగతం జయేత్ (చ.చి. 28/93)
ii) స్నేహోపనాహాగ్నికర్మ బన్ధనోన్మర్దనాని చ
స్నాయు సన్ధ్యస్థి సంప్రాప్తే కుర్యాద్వాయావతన్ద్రితః
నిరుద్ధేఽస్థినా వా వాయౌ పాణిమన్థేన దారితే
నాడీం దత్త్వాఽస్థని భిషక్ చూషయేత్పవనం బలీ (సు.చి. 4/8-9)

3. i) మజ్జస్థోఽస్థిషు సౌషిర్య మస్వప్నం స్తబ్ధతాం రుజమ్ (అ.సం.ని.15/15)
ii) సు.ని. 1/29.

**చికిత్స :-**

ఆస్థిగత వాత చికిత్సకు వలె.[1]

## 7. శుక్రగత వాతము :-

శుక్రము వెంటనే స్రవించుట లేక అసలు స్రవించక బంధించుట, గర్భము శీఘ్రముగా పతనమందుట, లేక గర్భము చిరకాలము ధరించుట జరుగును. మరియు శుక్రమునందు గర్భమునందు అనేక వికృతులు కలుగును [2].

**చికిత్స :**

హర్షణకరమైన, బలకరమైన, శుక్రకరమైన అన్నపానములు, విబద్ధ మార్గమున విరేచనము చేయించి తదుపరి ఇతర చికిత్సలు చేయవలయును. పుత్ర కామోక్త చికిత్సలు ప్రయోగించవలయును.[3]

## 8. స్నాయుగత వాతము :

స్తబ్ధము, కంపము, శూల, ఆక్షేపణము, బాహ్యాయామము, ఆభ్యన్తరాయామము, ఖల్లీకుబ్జత్వము, గృధ్రసీవాతము, సర్వాంగరోగము, ఏకాంగరోగము.[4]

---

1. చూడుడు పేజీ 33 F.N. 2
2. క్షిప్రం ముంచతి బధ్నాతి శుక్రం గర్భమథాఽపి వా
   వికృతిం జనయేచ్చాపి శుక్రస్థం కుపితేఽనిలః (28/34)
3. హర్షోఽన్నపానం శుక్రస్థే బలశుక్రకరం హితమ్
   విబద్ధమార్గం దృష్ట్వా వా శుక్రం దద్యాద్విరేచనమ్
   విరిక్తప్రతిభుక్తస్య పూర్వోక్తాం కారయేత్క్రియాం
   (చ. చి. 28/94-95)
4. i) బాహ్యాభ్యన్తరాయామం ఖల్లీం కుబ్జత్వమేవ చ
   సర్వాంగైకాంగరోగాంశ్చ కుర్యాత్స్నాయుగతేఽనిలః (చ. చి. 28/35)

చి కి త్స :

అస్థిగత వాతమునకు చెప్పబడిన చికిత్సలు చేయవలెను.[1]

## 9. సిరాగత వాతము :

శరీరమునందు మందవేదన, శోధ, శోష, స్పన్దనము కలుగుట, సిరలు పలుచగానగుట, పెద్దవగుట, సిరలందు శూన్యత్వము ఏర్పడుట, సిరాకుంచనము, సిరాపూరణము మొదలగు లక్షణములు కలుగును.[2]

చి కి త్స :

త్వగ్గత వాతమునకు చెప్పబడిన చికిత్సలు చేయవలెను.[3]

## 10. సన్ధిగత వాతము :

వాతముచే నింపబడిన తిత్తివంటి స్పర్శ సంధులందు కలుగుట, శోధ, ఆ సంధియొక్క ప్రసారణాకుంచనములందు వేదన, కార్యనాశము-మొదలగు లక్షణములు కలుగును.[4]

---

Contd....

ii) స్నాయుప్రాప్తః స్తమ్భ కమ్పౌ శూలమాక్షేపణం తథా (సు.ని. 1/27)

iii) స్నాయ్వస్థితః కుర్వాద్గృధ్రస్యాయామ కుబ్జతాః (అ.సం.ని. 15/16)

1. సు. చి. 4/8-9.

2. i) శరీరం మన్దరుక్ శోఫం శుష్యతి స్పన్దతే తథా
సుప్తాస్తనో్వ్యః మహత్యో వా సిరా వాతే సిరాగతే (చ చి. 28/36)

ii) కుర్యాత్సిరాగతః శూలం సిరాకుంచన పూరణమ్ (సు. ని. 1/27)

3. సు. చి. 4/7.

4. i) వాతపూర్ణదృతిస్పర్శః శోథః సన్ధిగతేఽనిలే ప్రసారణాకుఞ్చన
యోఽప్రవృత్తిశ్చ సవేదనా (చ. చి. 28/37)

ii) హన్తిసన్ధిగతః సన్ధీన్ శూలశోషౌ కరోతిచ (సు. ని. 1/27)

చి కి త్స :

అస్థిగత వాతమునకు చెప్పబడిన చికిత్సలు చేయవలయును.[1]

## 11. హృదయగత వాతము :

చి కి త్స :

శాలపర్ణీ సిద్ధ క్షీరము ప్రయోగించవలెను.[2]

## 12. శిరోగత వాతము :

వాతము శిరస్సు నాశ్రయించినపుడు శిరస్సుకు సంబంధించిన వాత వికారములు కలుగును.

చి కి త్స :

ఇంద్రియగత వాతమునకు చెప్పబడిన చికిత్సలు, మరియు భోజనానంతరము వాతహర ఘృతపానము లేక తైలపానము.[3]

మరికొన్ని ఇతర స్థానముల నాశ్రయించిన వాతమునందు చికిత్సలు :-

నాభిగతమున-బిల్వశాలాటు సిద్ధ మత్స్యములు ప్రయోగించవలెను.[4]

బాహు శీర్షగత వాతమున-నస్యము, భోజనానంతరము హితకరమైన ఘృతమును గాని తైలమునుగాని పానము చేయించుట.[5]

---

1. సు. చి. 4/8-9.
2. హృది ప్రకుపితేసిద్ధమంశు మత్యాపయోహితమ్ (చ. చి. 28/96)
3. అ. సం. చి. 23/10.
4. మత్స్యాన్నాభిప్రదేశస్థే సిద్ధాన్ బిల్వశలాటుభిః (చ.చి. 28/97)
5. బాహుశీర్షగతే నస్యం పానం చౌత్తరభుక్తికమ్ (చ.చి. 28/98)

అధోగత వాతమున-వస్తికర్మ, అవపీడకము.[1]

వస్తిగత వాతమున-వివిధ వస్తి విశోధన చికిత్సలు.[2]

గర్భమునాశ్రయించిన వాతమున-యష్టిమధు, కాశ్మరీ, శారిబ వీనిచే కాచబడిన క్షీరము శర్కరాయుక్తముగా పానము చేయించవలెను. బృంహణీయములు అగు మాంసాది మాంసరసములను స్నేహయుక్తముగా ప్రయోగించవలెను.

## ఆవృత వాతములు

వాత ప్రకోపము ప్రధానముగా రెండు కారణములచే కలుగును. 1) ధాతు క్షయము. 2) ఆవరణము.[3]

వాతము-పిత్త కఫాది దోషములచేగాని, రస రక్తాది ధాతువులచేగాని, పురీషాది మలములచేగాని ఆయా స్థానములందుండు వాతము ఇతర స్థానగత వాతములచేగాని ఆవరింపబడుట ప్రకోపమునకు కారణమగును.[4] ఆవరణము అనగా మార్గమును అడ్డగించుట అని అర్థము. దోషములు, ధాతువులు లేక మలములు వృద్ధి చెందుటవలన వాతముయొక్క ప్రాకృత కర్మలకు అవరోధముగా పరిణమించును. వాతముయొక్క మార్గమును అడ్డగించి వాతముయొక్క శక్తిని మందగింప చేసినపుడు ఆయా దోషములద్వారా వాతము ఆవృతమైనదని పేర్కొనబడును. ఆవరింపబడిన ఆవృతమనియు, ఆవరించిన దోష ధాత్వాదులను ఆవరకము లనియు వ్యవహరింపబడును.

---

1. వస్తికర్మ త్వధో నాభేః శస్యతే చావపీడకః (చ.చి. 23/99)
2. కార్యోవస్తిగతే చాపివిధిర్బస్తి విశోధనః (సు.ని. 4/6)
3. వాయోర్ధాతు క్షయాత్కోపో మార్గస్యావరణేనవా (చ.చి. 28/)
4. కేవలోదోషయుక్తో వా ధాతుభిర్వాఽఽవృతోఽనిలః

సామాన్యముగా ఆవరకము యొక్క కర్మలు వృద్ధిచెందియుండి, ఆవృత వాయువుయొక్క కర్మలు క్షీణించియుండును. కనుక ఆయా దోషాదుల కర్మల యొక్క వృద్ధి హ్రాసములననుసరించి ఆవరణములను నిర్ణయించవలసియుండును.

ఉదాహరణ రూపములుగా కొన్ని ఆవరణములు వాని - లక్షణములు చికిత్సలు.

## పిత్తావృత వాతము :

లక్షణములు-దాహము, సన్తాపము, తృష్ణ, శూల, భ్రమ, తమ, కటు, అమ్ల, లవణ, ఉష్ణకర ఆహార సేవనచే విదాహము, మూర్ఛ, శీతగుణముకల ద్రవ్యములందు ఇష్టము-ఈ లక్షణములు కలుగును.!

## చికిత్స :

శీతల క్రియలు, ఉష్ణక్రియలు మార్చి మార్చి చేయుట, జీవనీయ సర్పి సేవింపచేయుట, ఆహారమునందు జాంగల మాంస రసములు, యవశాలి ధాన్యము ఉపయోగించుట, క్షీరములతో గూడిన మృదురేచనౌషధములు, క్షీర వస్తులు, బలా పంచమూల సిద్ధ క్షీర సేవనము, మధుర ద్రవ్య సిద్ధ తైలముతో అవస్థానుసారము అనువాసన వస్తి, యష్టిమధు తైలముతోగాని, బలాతైలము, ఘృతము, క్షీరము, పంచమూల క్వాథము, వీనిలో దేనితోనైనను సేచనము-ఈ

---

1. i) లింగం పిత్తాఽఽవృతే దాహః తృష్ణా శూలం భ్రమస్తమః (క్లమః)
కట్వమ్లలవణోష్ణైశ్చ విదాహశ్శీత కామితా (చ.చి. 28/61)

ii) సు. ని. 1/32.

ప్రక్రియలతో ఉపచరింపవలెను. వాతమునకు విరోధము కానటువంటి, పిత్తమును శమింప చేయునట్టి చికిత్సలు చేయవలయును.[1]

**కఫావృత వాతము :**

లక్షణములు : చలిగానుండుట, బరువుగా నుండుట, శోథ, వేదన, కటు, అమ్ల, లవణ, ఉష్ణద్రవ్య ప్రయోగముచే ఉపశమించుట, లంఘనము, శ్రమ, రూక్ష, ఉష్ణద్రవ్య సేవనయందు ఇచ్ఛ-ఈ లక్షణములు ఉండును.[2]

చి కి త్స :-

ఆహారము యవాన్నము, జాంగల పశుపక్షుల మాంసములు, పురాణ ఘృతము, తిలతైలము, సర్షపతైలము, యితరములు, స్వేదములు, తీక్ష్ణ నిరూహ వస్తి, విరేచనము, వమనము, కఫహర, వాతానులోమక చికిత్సలు చేయవలయును.[3]

---

1. i) పిత్తావృతే విశేషేణ శీతముష్ణాం తథా క్రియాం
వ్యత్యాసాత్కారయేత్ సర్పిర్జీవనీయం చ శస్యతే
ధన్వమాంసం యవాశ్శాలిః యాపనాః క్షీరవస్తయః
విరేకః క్షీరపానం చ పఞ్చమూలీ బలాశ్శృతమ్
మధుయష్టి బలాతైలఘృత క్షీరైశ్చ సేచనం
పఞ్చమూల కషాయేణ కుర్యాద్వా శీతవారిణా (చ.చి. 28/184-86)

ii) అ. హృ. చి.

2. i) శైత్య గౌరవ శూలాని కట్వాద్యుపశయోఽధికమ్

3. కఫావృతే యవాన్నాని జాఙలాః మృగపక్షిణాం స్వేదాస్తీక్ష్ణాః
నిరూహాశ్చ వమనం సవిరేచనమ్ జీర్ణం సర్పిః తథా తైలం తిలసర్షపం
హితం (చ. చి. 28/18.)

కఫ పిత్త సంసర్గ ఆవరణములందు ముందు పిత్తావృత చికిత్సలు చేసి తదుపరి కఫావృత చికిత్సలు చేయించవలెను.[1]

**రక్తావృత వాతము :-**

త్వక్కునకు మాంసమునకు మధ్యలో దాహము తీవ్రవేదన కలుగును. ఎఱుపుదనముతో కూడిన శోథ, మండలములు, సూదులతో పొడిచినట్లు తోద, సుప్తత, స్పర్శముచే ద్వేషము, ఇతర పిత్తవికారములు కలుగును.[2]

చి కి త్స :-

వాత శోణితమునకు చెప్పబడిన చికిత్సలు చేయవలయును.[3]

**మాంసావృతవాతము :-**

లక్షణములు :-

కఠినముగను, వివర్ణముగను, ఉండు పుండ్లు ఏర్పడుట, శోథ రోమ హర్షము, చీమలు సంచరించినట్లుండుట ఈ లక్షణములు కలుగును.[4]

---

1. సంసృష్టే కఫపిత్తాభ్యాం పిత్తమాదౌ వినిర్జయేత్ (చ.చి. 28/188)

2. i) రక్తావృతే సదాహార్తిః త్వఙ్మాంసాఽన్తరజో భృశమ్
భవేత్సరాగః శ్వయథుః జాయన్తే మణ్డలాని చ (చ. చి. 28/63)

ii) సూచీభిరివ నిస్తోదః స్పర్శద్వేషః ప్రసుప్తతా
శేషాః పిత్తవికారాః స్యుర్మారుతే శోణితాన్వితే (సు. ని. 1/33)

3. శోణితేనావృతే కుర్యాద్వాతశోణితకీం క్రియామ్ (చ. చి. 28/194)

4. కఠినాశ్చ వివర్ణాశ్చ పిడకాశ్శ్వయథుస్తథా
హర్షం పిపీలికానాం చ సఞ్చార ఇవ మాంసగే (చ. చి. 28/64)

చికిత్స :-

స్వేదనము, అభ్యంగనము, మాంసరసములు, క్షీరములు, స్నేహములు, వీనిచే ఉపచరింపవలెను.[1]

### మేదో౽౽వృతవాతము :-

లక్షణములు :-

అవయవములు అదరుట, స్నిగ్ధముగను, మృదువుగను, చల్లగను ఉండుట, వాపు, అరుచి, ఆఢ్యవాతము, కలుగును. ఇది కష్టసాధ్యము.[2]

చికిత్స :

ప్రమేహమును, వాతమును, మేదస్సును శమింపచేయు చికిత్సలు, మేదోవృత, అస్థ్యావృత, మజ్జావృత వాతమునందు ప్రయోగించవలెను.[3]

### అస్థ్యావృత వాతము :-

లక్షణములు :-

ఉష్ణస్పర్శ పీడనమువలన ఉపశమనము, అవయవములు విరుగగొట్టినట్లు బాధ సూదులతో గుచ్చినట్లు వేదన ఈ లక్షణములు కలుగును.[4]

---

1. స్వేదాభ్యఙ్గరసక్షీరస్నేహా మాంసావృతే హితాః (చ. చి. 28/19)

2. i) చలస్స్నిగ్ధో మృదుః శీతః శోథో౽ఙ్గేష్వరుచిస్తథా
ఆఢ్యవాత ఇతి జ్ఞేయః స కృచ్ఛ్రో మేదసా౽౽వృతః
(చ. చి. 28/65, 66)

ii) అ. సం. ని. 16/37.

3. ప్రమేహ ....... భిషగ్జితమ్ (అ. హృ. చి. 22/59)

4. i) స్పర్శమస్థ్నా౽౽వృతే ఉష్ణం పీడనం చాభినన్దతి
సంభజ్యతే సీదతి చ సూచీభిరివ తుద్యతే (చ. చి. 28/66)

ii) అ. సం. ని. 16/38



చికిత్స :-

మేదో ఆవృతమున చెప్పబడిన చికిత్సలు, మహాస్నేహములు ప్రయోగించవలెను.[1]

**మజ్జావృత వాతము :-**

**లక్షణములు :-**

శరీరము వంగిపోవుట, జృంభ, పరివేష్టనము, శూల, హస్తములతో పిసికిన సుఖముగా నుండుట ఈ లక్షణములు కలుగును.[2]

చికిత్స :-

అస్థ్యావృతమునకు చెప్పబడిన చికిత్సలు చేయవలెను.

**శుక్రావృత వాతము :-**

**లక్షణములు :-**

శుక్రవేగము లేకుండుట లేక అధికవేగముతో కూడియుండుట, శుక్రము నిష్ఫలమగుట ఈ లక్షణములు కలుగును.[3]

చికిత్స :-

శుక్రగత వాతమునకు చెప్పబడిన చికిత్సలు చేయవలయును.[4]

---

1. మహాస్నేహోఽస్థిమజ్జస్థే పూర్వవద్రేతసావృతే (చ. చి. 28/196)
2. మజ్జాఽఽవృతే వినామాస్స్యాత్ (వినమతి) జృమ్భణం పరివేష్టనమ్ శూలస్తు పీడ్యమానే చ పాణిభ్యాం లభతే సుఖం (చ. చి. 28/67)
3. శుక్రవేగోఽతివేగో వా నిష్ఫలత్వం చ శుక్రగే (చ. చి. 28/68)
4. పూర్వోక్తం రేతసావృతే (అ. హృ. చి. 22/60)

## అన్నావృత వాతము :-

లక్షణములు :-

భోజనానంతరము ఉదరశూల కలుగుట, భోజనము జీర్ణమైన తదుపరి శూల శమించుట కలుగును.[1]

చికిత్స :-

వమనము, పాచనీయ, దీపన లఘు ద్రవ్యములతో ఉపచరించుట.[2]

## మూత్రావృత వాతము :-

లక్షణములు :-

మూత్రము ప్రవర్తింపకుండుట, వస్తియందు ఆధ్మానము ఈ లక్షణములు కలుగును.[3]

చికిత్స :-

మూత్రలౌషధములు, స్వేదనము, ఉత్తరవస్తి వీనిని ప్రయోగింపవలెను.[4]

---

1. భుక్తే కుక్షౌ చ రుక్ జీర్ణే శామ్యత్యన్నావృతేఽనిలే (చ. చి. 28/68)
2. అన్నావృతే తదుల్లేఖః పాచనం దీపనం లఘు (చ. చి. 28/196)
3. మూత్రాఽప్రవృత్తిరాధ్మానం వస్తౌ మూత్రావృతేఽనిలే (చ. చి. 28/69)
4. మూత్రలాని తు మూత్రేణ స్వేదాః సోత్తరవస్తయః (చ. చి. 28/196)

**విడావృతవాతము :-**

లక్షణములు:-

అధిక మలవిబంధము పక్వాశయమున పరికర్తక, భోజనానంతరము స్నేహము, శీఘ్రముగా జీర్ణమగును. లేక ఆనాహము కలుగును. అన్నముచే పీడింపబడిన శోషించిన మలము, ఆలస్యముగా బాధతో విసర్జింపబడును. శ్రోణీ, వంక్షణ పృష్ఠములందు వేదన, వాత విలోమత, హృదయమునందు అస్వస్థత ఈ లక్షణములు కలుగును.[1]

చికిత్స :-

ఏరండ తైలము, స్నిగ్ధ ద్రవ్యములు ప్రయోగించుట, ఉధావర్త శామక క్రియలు- వీనిచే ఉపచరింపవలెను.[2]

## పరస్పరావరణములు

**ప్రాణవాతము :-**

జీవితము ప్రాణవాతముపైన బలము ఉదానవాతముపైన ఆధారపడి యుండును.[3]

---

1. వర్చసోఽతివిబద్ధోఽధః స్వే స్థానే పరికృన్తతి
వ్రజత్యాశు జరాం స్నేహః భుక్తే చానహ్యతే నరః
చిరాత్పీడితమన్నేన దుఃఖం శుష్కం శకృత్ సృజేత్
శ్రోణీవంక్షణపృష్ఠేషు రుగ్విలోమశ్చ మారుతః
అస్వస్థం హృదయం చైవ వర్చసా త్వావృతేఽనిలే (చ.చి. 28/70,72)
2. శకృతా తైలమేరణ్డం స్నిగ్ధోదావర్తవత్క్రియాః (చ. చి. 28/196)
3. విశేషాజ్జీవితం ప్రాణే ఉదానే సంశ్రితం బలమ్
స్యాత్ తయోః పీడనాత్ హానిః ఆయుషశ్చ బలస్య చ
(చ. చి. 28/234)

ప్రాణవాతము, వ్యానవాతముచే ఆవరింపబడినపుడు అధికస్వేదనము, రోమహర్షము, సుప్తత మొదలగు లక్షణములు కలుగును. ఈ స్థితిలో స్నేహ యుక్త విరేచనౌషధము ఇవ్వవలయును.[1]

ఉదానవాతముచే ప్రాణవాతము ఆవరింపబడినపుడు శారీరక చేష్టలు, ఓజస్సు, బలము, వర్ణము క్షయించి మరణమునకు దారి తీయును. ఈ స్థితిలో శీతోదకము చల్లుట, అశ్వాసనము సుఖకరమైన పూర్తి విశ్రాంతి, ఇతర సుఖ కర క్రియలచే ఉపచరింపాలి.[2]

పిత్తముచే ప్రాణవాతము ఆవరింపబడినపుడు మూర్ఛ, దాహము, భ్రమ, శూల; విదాహము, శీతల ద్రవ్యములపై ఇచ్ఛ, విదగ్ధాహారము యొక్క వమనము వేదన - ఈ లక్షణములు కలుగును.[3]

కఫముచే ప్రాణవాతము ఆవరింపబడినపుడు కఫష్ఠీవనము, తుమ్ములు, త్రేన్పులు, ఉచ్ఛ్వాస, నిః శ్వాసములు అడ్డగింపబడుట, అరుచి, వమనము దౌర్బల్యము, కృశత్వము, తంద్ర, వైవర్ణ్యము-ఈ లక్షణములు కలుగును.[4]

---

1. స్వేదోఽత్యర్థం రోమహర్షః త్వగ్దోషః సుప్తగాత్రతా
ప్రాణే వ్యానావృతే తత్ర స్నేహయుక్తం విరేచనమ్ (చ.చి. 28/ 202)

2. ఓజోబలవర్ణానాం నాశో మృత్యురథాపి వా
ఉదానేనావృతే ప్రాణే, తం శనైశ్శీతవారిణా
సిఞ్చేత్ ఆశ్వాసయేచ్చైనం సుఖం చైవోపపాదయేత్ (చ.చి. 28/208)

3. i) మూర్ఛా దాహో భ్రమశ్శూలం విదాహశ్శీతకామితా
చర్దనం చ విదగ్ధస్య ప్రాణే పిత్తసమావృతే (చ. చి. 28/221)
ii) అ. సం. సి. 16/44.

4. i) ష్ఠీవనం క్షవథూద్గారనిశ్శ్వాసోచ్ఛ్వాససంగ్రహః
ప్రాణే కఫావృతే రూపాణ్యరుచిశ్ఛర్దిరేవ చ (చ. చి. 28/222)
ii) దౌర్బల్యం సదనం తన్ద్రా వైవర్ణ్యం చ కఫావృతే (సు. ని. 1/35)

## ఉదానవాతము

ప్రాణవాతముచే ఉదానవాతము ఆవరింపబడినపుడు శిరోగ్రహము, ప్రతిశ్యాయము, శ్వాసనిరోధము, హృద్రోగము, ముఖశోష మొదలగు లక్షణములు కలుగును. ఇందు జత్రూర్ధ్వగత వ్యాధులకు చెప్పబడిన చికిత్సలు, అశ్వాసనము-వీనిచే ఉపచరింపవలెను.[1]

అపాన వాతముచే ఉదానవాతము ఆవరింపబడినపుడు మోహము, అగ్నిమాంద్యము, అతిసారము-ఈ లక్షణములు కలుగును. ఇందు వమనము, దీపన గ్రాహి ద్రవ్యములతో కూడిన ఆహారముచే ఉపచరింపచేయవలెను.[2]

పిత్తముచే ఉదానవాతము ఆవరింపబడినపుడు మూర్ఛ మొదలగు పిత్తావృత ప్రాణవాతమున చెప్పబడిన లక్షణములు, దాహము, అంతర్దాహము, నాభి, ఉరఃక్లమము, ఓజోభ్రంశము, అవసాదము-ఈ లక్షణములు కలుగును.[3]

కఫముచే ఉదానవాతము ఆవరింపబడినపుడు వైవర్ణ్యము, వాక్కు, స్వరాలందు అవరోధము, దౌర్బల్యము, గురుగాత్రత, అరుచి, స్వేదము లేకుండుట, రోమ హర్షము అగ్నిమాంద్యము, శైత్యము, స్తంభము-ఈ లక్షణములు కలుగును.[4]

---

1. శిరోగ్రహః ప్రతిశ్యాయః నిఃశ్వాసోచ్ఛ్వాస సంగ్రహః
   హృద్రోగో ముఖశోషశ్చాఽప్యుదానే ప్రాణసంవృతే
   తత్రోర్ధ్వభాగికం కర్మకార్యమాశ్వాసనం తథాకర్మచ
   (చ. చి. 28/205-206)
2. మోహోఽల్పోఽగ్నిరతీసారః ఊర్ధ్వగేఽపానసంవృతే
   వాతేస్యాత్, వమనం తత్ర దీపనం గ్రాహి చాఽశనమ్ (చ. చి. 28/210)
3. మూర్ఛాద్యాని చ రూపాణి దాహో నాభ్యురసః క్లమః
   ఓజోభ్రంశశ్చ సాదశ్చాప్యుదానే పిత్తసంవృతే (చ. చి. 28/222)
4. ఆవృతే శ్లేష్మణోదానే వైవర్ణ్యం వాక్స్వరగ్రహః
   దౌర్బల్యం గురుగాత్రత్వం అరుచిశ్చోపజాయతే (చ. చి. 28/224)

## వ్యాన వాతము

ప్రాణవాతముచే వ్యానవాతము ఆవృతమైనపుడు సర్వేంద్రియ శూన్యత, స్మృతి నాశము, బలక్షయము కలుగును. ఈ లక్షణములందు ఊర్ధ్వ జత్రుక చికిత్సలు చేయవలయును.[1]

ఉదానావృత వ్యానవాతమునందు స్తబ్ధత, అగ్నిమాంద్యము, స్వేదాభావము, చేష్టాహాని, నేత్రనిమీలనము. ఈ స్థితిలో లఘ్వాహారమును మితముగా ఇచ్చుట పథ్యముగా నుండును.[2]

సమానవాతముచే వ్యానవాతము ఆవరింపబడినపుడు మూర్ఛ, తన్ద్రి, ప్రలాపము, అంగసాదము, అగ్ని, ఓజో బల క్షయము-ఈ లక్షణములు కలుగును. ఇందు వ్యాయామము, లఘు భోజనముచే ఉపచరింపవలెను.[3]

అపాన వాతముచే వ్యానవాతము ఆవరింపబడినపుడు మలము, మూత్రము, శుక్రము, అధికముగా ప్రవర్తించును. అట్టి స్థితిలో సంగ్రాహక గుణములు గల ఔషధములు ఆహారాదులతో ఉపచరింపవలెను.[4]

---

1. సర్వేన్ద్రియాణామ్ శూన్యత్వం జ్ఞాత్వా స్మృతిబలక్షయమ్
   వ్యానే ప్రాణావృతే లింగం కర్మ తత్రోర్ధ్వజత్రుకమ్ (చ. చి. 28/202)
2. స్తబ్ధతాఽల్పాగ్నితా స్వేదః చేష్టాహానిః నిమీలనమ్
   ఉదానేనావృతే వ్యానే తత్ర పథ్యం మితం లఘు (చ. చి. 28/213)
3. మూర్ఛా తన్ద్రా ప్రలాపోఽంగసాదోఽగ్న్యోజోబలక్షయః
   సమానేనావృతే వ్యానే వ్యాయామో లఘుభోజనమ్ (చ. చి. 28/212)
4. అపానేనావృతే వ్యానే భవేద్విణ్మూత్రరేతసామ్
   అతిప్రవృత్తిః తత్రాపి సర్వం సంగ్రహణం మతమ్ (చ. చి. 28/211)

పిత్తముచే వ్యానవాతము ఆవరింపబడినపుడు సర్వాంగ దాహము, క్లమము గాత్రవిక్షేపమునందు అవరోధము సంతాపముతో కూడిన వేదన-ఈ లక్షణములు కలుగును.[1]

కఫముచే వ్యానవాతము ఆవరింపబడినపుడు శరీరమంతట గురుత్వము, సర్వసంధులందు అస్థులందు వేదన, అధికముగా గతి అవరోధము, చేష్టాస్తంభము ఈ లక్షణములు కలుగును.[2]

## సమాన వాతము

ప్రాణవాతముచే సమానవాతము ఆవృతమైనపుడు శరీరమునందు జడత్వము గద్గదత, మూకత్వము-ఈ లక్షణములు కలుగును. ఈ అవస్థలో స్నేహము యొక్క నాలుగు ప్రయోగములచే అనగా వమనము, విరేచనము, నిరూహము, అనువాసనములచే ఉపచరింపవలెను.[3]

పిత్తముచే ఆవరింపబడినపుడు అధిక స్వేదము, తృష్ణ, మూర్ఛ, అరుచి, అరతి, ఉష్ణత్వము, అగ్నిమాంద్యము-ఈ లక్షణములు కలుగును.[4]

---

1. వ్యానే పిత్తావృతే తు స్యాత్ దాహః సర్వాంగః క్లమః
   గాత్రవిక్షేపసంగశ్చ ససన్తాపస్సవేదనః (చ. చి. 28/226)
2. గురుతా సర్వగాత్రాణాం సర్వసన్ధ్యస్థిజా రుజః
   వ్యానే కఫావృతే లింగం గతిసంగస్తథాధికః (చ. చి. 28/227)
3. ప్రాణావృతే సమానే స్యుః జడగద్గదమూకతాః
   చతుష్ప్రయోగాశ్శస్యన్తే స్నేహాస్తత్ర సయాపనాః (చ. చి. 28/204)
4. అతిస్వేదస్తృషా దాహో మూర్ఛా చ అరుచి (అరతి) రేవ చ
   పిత్తావృతే సమానే స్యాత్ ఉపఘాతస్తథోష్మణః (చ. చి. 28/224)

కఫముచే సమానవాతము ఆవరింపబడినపుడు స్వేదరాహిత్యత, అగ్ని మాంద్యము, రోమహర్షము, శరీరము అంతటా అతిశైత్యత, మలము, మూత్రము, కఫము అధికమగుట, రోమహర్షము-ఈ లక్షణములు కలుగును.[1]

## అపాన వాతము

సమానవాతముచే అపానవాతము ఆవరింపబడినపుడు గ్రహణి, పార్శ్వ శూల, హృద్రోగము, ఆమాశయ శూల-ఈ లక్షణములు కలుగును. ఇందు అగ్ని దీపకములైన ఘృతములతో ఉపచరింపవలెను.[2]

ఉదానవాతముచే అపానవాతము ఆవరింపబడినపుడు వమనము, శ్వాస, కాస-ఈ లక్షణములు కలుగును. ఇందు వస్తి ప్రయోగముచేత వాతానులోమ కములగు ఆహారముల నిచ్చుట చేత ఉపచరింపవలెను.[3]

వ్యానవాతముచే అపానవాతము ఆవరింపబడినపుడు వమి, ఆధ్మానము, ఉదావర్తము, గుల్మము, పరికర్తిక ఈ లక్షణములు కలుగును. ఇందు స్నిగ్ధ ద్రవ్యముల నిచ్చుటచే వాతమున కనులోమనము కల్గించవలెను.[4]

---

1. అస్వేదో వహ్నిమాన్ద్యం చ లోమహర్ష స్తథైవ చ
   కఫావృతే సమానే స్యాత్ గాత్రాణాం చాతిశీతతా (చ. చి. 28/225)
2. సమానేనావృతేఽపానే గ్రహణీపార్శ్వహృద్గదాః
   శూలం చామాశయే తత్ర దీపనం సర్పిరిష్యతే (చ. చి. 28/205)
3. ఊర్ధ్వగేనావృతేఽపానే ఛర్దిశ్వాసాదయోగదాః
   స్యుర్వావృతే తత్ర వస్త్యాది భోజ్యం చైవానులోమనమ్ (చ. చి. 28/208)
4. వమ్యాధ్మానముదావర్తగుల్మార్తిపరికర్తికాః
   లింగం వ్యానావృతేఽపానే తం స్నిగ్ధైరనులోమయేత్ (చ. చి. 28/210)

పిత్తముచే అపానవాతము ఆవరింపబడినపుడు మలము మూత్రము పసుపు వర్ణములో నుండుట; గుదము, యోని మేఢ్రమునందు తాపము, అధికవేదన రజస్సు యొక్క అతి ప్రవృత్తి, అస్నిగ్ధము- ఈ లక్షణములు కలుగును.[1]

కఫముచే అపానవాతము ఆవరింపబడినపుడు మలము భిన్నముగను ఆమముచేత కఫముచేత మిశ్రితముగను, గురువుగను, ప్రవర్తించును. కఫజ ప్రమేహము కలుగును. కఫయుక్త మూత్రప్రవృత్తి కలుగును.[2]

## ద్వంద్వ ఆవరణములు :-

పైన ఐదు విధములగు వాతములకు పిత్తముచేత గాని కఫముచేత గాని ఆయా వాతములు ఆవరింపబడినపుడు కలుగులక్షణములు వివరింపబడినవి. అయా వాతములకు పిత్తముచేత, కఫముచేత ఆవరింపబడినపుడు కలుగునట్లు చెప్పబడిన లక్షణములు మిశ్రమంగా కలిగినపుడు ఆయా వాతములు పిత్తకఫములచే (ద్వంద్వ దోషములచే) ఆవరింపబడినవని గ్రహించవలెను.[3] ఆయా వాతములకు నిర్దేశింప బడిన స్థానములందు ఇతర కఫ, లేక పిత్త లేక రెండును చేరినచో వాటి వాటి లక్షణములతో కూడిన వ్యాధులను కలిగించును.[4]

---

1. హారిద్రమూత్రవర్చస్త్వం తాపశ్చ గుదమేఢ్రయోః
   లింగం పిత్తావృతేఽపానే రజసశ్చాతివర్తనం (చ. చి. 28/229)
2. భిన్నామశ్లేష్మ సంసృష్ట గురువర్చః ప్రవర్తనమ్
   శ్లేష్మణా సంవృతేఽపానే కఫమేహస్య చాగమః (చ. చి. 28/230)
3. లక్షణానాన్తు మిశ్రత్వం పిత్తస్య చ కఫస్య చ
   ఉపలక్ష్య భిషగ్విద్వాన్మిశ్రమావరణం వదేత్ (చ. చి. 28/331)
4. యద్యస్య వాయోర్నిర్దిష్టం స్థానం తత్రేతరౌస్థితౌ
   దోషౌ బహువిధాన్ వ్యాధీన్ దర్శయేతాం యథానిజాన్
   (చ. చి. 28/ 232)

### ఆవృత వాతముల సాధ్యాఽసాధ్యత :-

ఈ ఆవృత వాతములన్నింటియందు గమనింపక ఒక సంవత్సరము వరకు ఉపేక్షించినను, చికిత్సింపకున్నను అసాధ్యములుగా గాని కృచ్ఛ్రసాధ్యములుగా గాని అగును.[1]

ఉపేక్షచే కలుగు ఉపద్రవములు- ఆవృత వాతములను ఉపేక్షించినచో హృద్రోగము, విద్రధి, ప్లీహవ్యాధి, గుల్మము, అతిసారము, ఈ ఉపద్రవములు కలుగును. అందుచే వాతముచే, పిత్తముచేత, కఫముచేత కలుగు ఆవరణములను గురించి సరియగు జ్ఞానమును కలిగి యుండవలయును.[2]

ప్రాణవాత, ఉదానవాతములకు కఫ పిత్తములచే కలుగు ఆవరణము చాలా కఠినతరముగా వుండును. జీవితము ప్రాణవాతము నాశ్రయించియు, బలము ఉదానవాతము నాశ్రయించియు ఉండును. అందుచేత ఈ రెండు వాతములు పీడింపబడినచో ఆయువునకు, బలమునకు హాని కలుగును. ముఖ్యముగా ప్రాణవాతము వికృతి చెందినచో మరణము ఉదానవాతము వికృతి చెందినచో బలక్షయము కలుగును.[3]

---

1. సర్వేఽప్యేతేఽ పరిజ్ఞాతాః పరిసంవత్సరాస్తథా
   ఉపేక్షణాదసాధ్యాస్స్యుః అథవా దురుపక్రమాః (మాః)
   (చ. చి. 28/235)
2. హృద్రోగో విద్రధిః ప్లీహా గుల్మోఽతిసార ఏవ చ
   భవన్త్యుపద్రవాస్తేషాం ఆవృతానాముపేక్షణాత్
   తస్మాదావరణం వైద్యః పవనస్యోపలక్షయేత్ (చ. చి. 28/236-237)
3. ఆవృతం శ్లేష్మపిత్తాభ్యాం ప్రాణం చోదానమేవ చ
   గరీయస్త్వేన పశ్యన్తి భిషజశ్శాస్త్రచక్షుషః
   విశేషాజ్జీవితం ప్రాణే ఉదానే సంశ్రితం బలమ్
   స్యాత్ తయోః పీడనాత్ హానిః ఆయుషశ్చ బలస్య చ
   (చ. చి. 28/232-233)

**ఆవృతవాత చికిత్స :-**

కొన్ని ఆవృతవాత లక్షణములతోపాటు వాని చికిత్సలు కూడా పైన వివ వివరింపబడినవి. సామాన్య ఆవృతవాత చికిత్సలు, కొన్ని విశేష ఆవృతవాత చికిత్సలు ఇచ్చట వివరింపబడును.

ఆవరణములను సక్రమముగా పరీక్షించి నిర్ణయించిన పిదవ స్నిగ్ధములుగను, స్రోతో శోధకములుగను ఉండి కఫకరములు కానటువంటి ద్రవ్యముల ద్వారా చికిత్సింపవలయును.

వాతముయొక్క స్థానమును స్వాభావిక కర్మలయొక్క వృద్ధి, హానులను విచారించి, ఆవరణమును నిర్ణయించి అభ్యంగనము, స్నేహపానము, వస్తి మొదలగు అన్ని వాతహర చికిత్సలతో ఉపచరింపవలెను. ఉష్ణ, శీతల క్రియలు అభ్యంగనములందు వ్యత్యస్తముగా మార్చి మార్చి చేయుచుండవలయును.[1]

ఉదానవాతము వికృతి చెందినపుడు చికిత్సలద్వారా ఊర్ధ్వమునకు తీసికొని పోవలయును. అపానవాతమును అనులోమక అన్నపాన ఔషధములద్వారా అనులోమనము చేయవలయును. అపానవాతము ఆవృతమయినపుడు అగ్నిదీపకములు, గ్రాహి, వాతానులోమకముగా నుండునవియు పక్వాశయ శోధకములుగా

---

1. i) క్షయం వృద్ధిం సమత్వం చ తథైవావరణం భిషక్
విజ్ఞాయ పవనాదీనాం న ప్రముహ్యతి కర్మసు (చ. చి. 28/247)

ii) స్థానాన్యవేక్ష్య వాతానాం వృద్ధిం హానిం చ కర్మాణామ్
ద్వాదశావరణాన్యన్యాన్యభిలక్ష్య భిషగ్జితమ్
కుర్యాదభ్యఞ్జనస్నేహపానవస్త్యాది సర్వశః (సస్యపానాదిసర్వతః)
క్రమముష్ణమనుష్ణం వా వ్యత్యాసాదవచారయేత్
(చ. చి. 28/216-217)

నుండునవియు అగు ఔషధములు ప్రయోగించవలయును. సమానవాతమును శమన చికిత్సలతో శాంతింప చేయవలయును.

వ్యానవాతము ప్రకోపించినపుడు ఊర్ధ్వమార్గము, అధోమార్గము, తిర్యక్ మార్గములకు కొనిపోవలయును. ప్రాణవాతమును మిగిలిన నాలుగు వాతముల నుండి రక్షించవలెను. ప్రాణవాతము తన స్థానమునందున్నచో శరీరము సరియగు స్థితిలో నుండును. ఈ విధముగా వాతములు విమార్గ గమనమును పొందినపుడు దోషములచే ఆవృతములైనపుడు వానిని తమ తమ స్థానములకు చేర్చవలయును.[1]

అన్ని స్థానములందు వాతము ఆవృతమైనపుడు కఫ పిత్తములకు విరోధముకానటువంటి, వాతానులోమకములైనటువంటి శీఘ్రముగా హితమును కలిగించునటువంటి, చికిత్సలు చేయవలయును. సాధారణముగా మధుర అనువాసన వస్తులతోపాటు యాపన వస్తులను ఇచ్చుట ఆవృత వాతములందు హితకరముగా నుండును. లేక రోగియొక్క బలమునననుసరించి మృదు విరేచనౌషధములను ప్రయోగించుట హితకరముగా నుండును.[2]

---

1. ఉదానం యోజయేదూర్ధ్వం అపానం చానులోమయేత్
   సమానం శమయేచ్చైవ త్రిధా వ్యానం తు యోజయేత్
   ప్రాణో రక్ష్యశ్చతుర్భ్యోఽపి స్థానే హ్యస్య స్థితిర్ధ్రువా
   స్వం స్థానం గమయేదేవం వృతానేతాన్విమార్గగాన్
   (చ. చి. 28/218-219)

2. అనభిష్యన్దిభిః స్నిగ్ధైః స్రోతసాం శుద్ధికారకైః
   కఫపిత్తాఽవిరుద్ధం యత్ యచ్చ వాతానులోమనమ్
   సర్వస్థానావృతేఽప్యాశు తత్కార్యం మారుతే హితం
   యాపనా వస్తయః ప్రాయో మధురాస్సానువాసనాః
   ప్రసమీక్ష్య బలాధిక్యం మృదువా స్రంసనం హితం
   (చ. చి. 28/238-240)

ఆవృతవాతములందు అన్నివిధములగు రసాయనౌషధములను ఆవశ్యకతాను సారము ప్రయోగింపవచ్చును. శిలాజిత్తు క్షీరముతో గుగ్గులు ప్రయోగము, క్షీరాహారముతోపాటు కొన్ని దినములవరకు భార్గవప్రోక్తచ్యవనప్రాశావలేహ్యము గాని ప్రథమ బ్రాహ్మీ రసాయనముగాని (అభయామలకీ ప్రథమ రసాయన పాద చరక చికిత్స) సేవింపచేయవలయును[1]. పిత్తరక్తములచేత ఆవరింపబడిన వాత వ్యాధులందు తప్ప మిగిలిన అన్ని ఆవృత వాతములందు లశున ప్రయోగము శ్రేష్టము.

## వాత వ్యాధులందు అభ్యంతరౌషధములు మొదలగునవి :-

వాత హరమైన ఈ క్రింది ఔషధములు ఆహార కల్పనలకు, ఔషధములకు బాహ్య ప్రయోగములకు అన్ని వాత వ్యాధులందును సామాన్యముగా ఆయా అవస్థలననుసరించి వాడవలెను.

1. అనూప ఔదక మాంసములు, స్నేహములు, తిలతైలము, ఘృతము వస, మజ్జ, దధి, ఏరండము, అమ్ల ద్రవ్యములు, దశమూలములు, శతావరి కులత్థములు, బదరి, మాష, తిల, రాస్నా, యవ, బల, ఆరనాళము-ఈ ద్రవ్యములు నాడీస్వేదమునకు, ఉపనాహస్వేదమునకు ఘృత తైలాదులుగా నిర్మించి బాహ్య అభ్యంతర ప్రయోగములకు ఉపయోగించవలెను.[2]

---

1. రసాయనానాం సర్వేషాముపయోగః ప్రశస్యతే
శైలస్య జతునోఽత్యర్థం పయసా గుగ్గులోస్తథా
లేహం వా భార్గవప్రోక్తం అభ్యసేత్ క్షీర భుజ్నరః
అభయామలకీయోక్తం ఏకాదశసితాశతం (చ.చి. 28/240-241)

2. చ.చి. 28/అ

2. సుశ్రుతోక్త భద్రదార్వాది గణమునందలి ద్రవ్యములు, దశమూలములు విదారిగంధాది గణద్రవ్యములు, లాజాగంధాది గణద్రవ్యములువీరతర్వాది గణద్రవ్యములు ఇవన్నియు వాతశామక గుణములు కలిగియుండును.

**చూర్ణములు :-**

1. షడ్ధరణయోగము- (సుశ్రుత) చిత్రక, ఇంద్రియవ, పాఠ, కటుక, అతివిష అభయ- వీటి చూర్ణము అన్ని విధములగు వాతరోగములందును ఉష్ణోదకముతో 1 గ్రా. ఇవ్వవలెను.

2. సొంఠి లశునము సమభాగములు ఘృత భర్జితముచేసి అగ్నిబలానుసారము సేవించిన ముఖ్యముగా పక్షఘాతమును సామాన్యముగా ఇతర వాతవ్యాధులను శమింపచేయును. (వైద్యచింతామణి)

3. జీవనీయగణ చూర్ణము (సుశ్రుత) బృంహణము వాతహరము.

**కషాయములు :**

మహారాస్నాది క్వాథము (భై.ర.) అన్ని వాత వ్యాధులను శమింపచేయును. సంధిగత, మజ్జాగత వాతములు, కంపవాతము, కుబ్జత్వము పక్షఘాత, అర్థిత జాను జంఘావేదన, గృధ్రసీ, హనుగ్రహము వీటన్నింటిని శమింపచేయును.

రాస్నా సప్తక క్వాథము (భై.ర.) జంఘ, ఊరు, పార్శ్వ, త్రిక శూలలను శమింపచేయును.

సహచరాది క్వాథము, వాజిగంధాదిక్వాథము (యో. ర.) దశమూల క్వాథము, ఇవి అన్ని వాత వ్యాధులను శమింపచేయును.

మాషబలాది క్వాథము (చ.ద.) పక్షఘాతము, మన్యాస్తంభము, కర్ణనాదముతో గూడిన తీవ్ర అర్దితవాతము వీనిని 7 దినములలో శమింపచేయును.

బలాదిక్వాథము (చ. ద.) విశ్వాచీ, అపబాహుకములను శమింప చేయును.

మాషాత్మ గుప్తాది క్వాథము (చ.ద.)పక్షాఘాత శామకము.

లేహ్యములు :

రసోనపిండము (చ.ద.) లఘులసున పిండము (గ.ని.) పక్షాఘాత అర్దిత శామకము ఏరండపాకము (యో.ర.)అశ్వగంధావలేహ్యము.

ఆసవారిష్టములు :

బలారిష్టము, అశ్వగంధారిష్టము, దశమూలారిష్టము.

వటి :

శృంగుత్వచాదవటి, వీరతర్వాదివటి

గుగ్గులు యోగములు :

ద్వాత్రింశతి గుగ్గులు (వై.చి.) అన్ని వాతరోగములను ముఖ్యముగా పక్షాఘాత అర్ధితములను శమింపచేయును.

షడశీతి గుగ్గులు (వై.చి.)

త్రయోదశాంగ గుగ్గులు (చ.ద.) అర్దిత, గృధ్రసీ మొదలగు యోగరాజ గుగ్గులు (శా.సం.) అన్ని వాతరోగములను శమింపచేయును.

రాస్నాది గుగ్గులు (యో.ర.)

రసౌషధములు :

స్వర్ణభస్మము, రజతభస్మము, అభ్రకభస్మము ఇవి వాతశామక గుణములు బల్యరసాయన గుణములు కలిగియుండుటచే వాతవ్యాధులందు ప్రయోగింపబడును.

బృహద్వాత చింతామణి (భై.ర.) స్వర్ణ, రౌప్య, అభ్రక, లోహ, ముక్త మొదలగు ప్రధాన ద్రవ్యములు. బల్య రసాయన, వాత,పిత్త శామక గుణములు కలిగియుండును. పక్షాఘాతాది అన్ని వాత వ్యాధులందు ప్రయోగింపదగినది. మాత్ర 100 మి.గ్రా.—300 మి.గ్రా.

యోగేంద్ర రసము (భై.ర.) స్వర్ణ మధికముగానుండును. అందుచే బృ. వాత చింతామణి కన్నా అధిక బల్యముగా రసాయనముగను ఉండును.

రసరాజరసము (ర.సా.) పక్షాఘాత, అర్దిత, ఆక్షేపకాదులలో ప్రయోగ్యము.

వాతకులాంతకరసము(భై.ర.) ఆక్షేపక అర్దిత, శామకము.

చతుర్భుజరసము, స్వర్ణవాతరాక్షసము, త్రైలోక్యచింతామణిరసము- ఇవి కఫానుబంధ వాతరోగములందు పనిచేయును.

ఏకాంగవీర రసము తీక్ష్ణగుణము కలిగి స్రోతో శోధకముగా నుండును.

అర్ధాంగ వాతారిరసము (ర.తం) లేఖనగుణముకలిగి కఫవాతహరముగా నుండును. అర్ధాంగ వాతశామకము 150-200 మి.గ్రా.

మహావాతవిధ్వంసి (ర.త.) శుద్ధవాత ఆక్షేపకములందును ఇతర వాతవ్యాధులందును ఉపయోగింపవచ్చును.

వాత గజాంకుశము (ర.త.) కఫ అనుయుక్త నూతనవాత రోగములందు ప్రయోగింపవచ్చును.

## జీర్ణవాత వ్యాధులందు :-

మహాయోగ రాజగుగ్గులు (శా.సం) మల్లాదివటి, సమీరగజకేసరి వీని ప్రయోగింపవచ్చును.

**ఫిరంగాది జనితవాత వ్యాధులలో :-**

నవగ్రాహిరసము, మల్ల సింధూరము, అష్టమూర్తి రసాయనము ఇతర మల్ల కల్పములు తగిన మాత్రలో ప్రయోగింపవలెను.

**కంపవాతములందు :-**

స్వర్ణ భూపతిరసము, ఏకాంగవీర రసము, అర్ధాంగ వాతారిరసము, తాప్యాది లోహము, అభ్యంతరముగా ఇవ్వవలెను.

సహచరాది తైలము, నిర్గుండీతైలము అభ్యంగాదులకు ప్రయోగింపవలెను.

సంధివాతములందు వాతారిగుగ్గులు, మహాయోగరాజ గుగ్గులు, సింహనాద గుగ్గులు, మహారాస్నాది క్వాథము ప్రయోగింపవలెను.

## పక్షాఘాతము

పక్షాఘాతము యొక్క లక్షణములను చరకుడు సుశ్రుతుడు వేర్వేరు విధములుగా వివరించిరి.

సుశ్రుతుని వర్ణన ప్రారంభస్థితిలో నుండు తీవ్రావస్థ [ఆధునిక వైద్యమునందు చెప్పబడు స్ట్రోక్ (Stroke)]కు తుల్యముగను చరకోక్త పక్షాఘాత లక్షణములు హెమీ ప్లెజీయా (Hemi plegia) అనబడు జీర్ణావస్థకు తుల్యముగను కన్పించుచున్నవి.

**సుశ్రుతోక్త పక్షాఘాతము :-**

అత్యధికముగా ప్రకోపించిన వాతము శిరస్సు (ఊర్ధ్వ దేహము) నందలి అధోగమన మరియు తిర్యగ్గమన ధమనులను పొంది ఏ వైపు ధమనులను పొందినదో దానికి అన్యతర పక్షమందలి సన్ధి బంధములను విడివడునట్లు (విమోక్షణము) చేయును. అందుచే మనుజునికి శరీరమంతయుగాని అర్ధభాగమునందుగాని కర్మలు (చేష్టలు), చైతన్యము (స్పర్శ) నశించును. ఈ వ్యాధిని పక్షము (అర్ధభాగము)

నందలి క్రియలను చైతన్యమును నశింపచేయుటచే పక్షఘాతము అందురు. ఈ పక్షఘాత రోగి క్రిందపడిపోవుటగాని లేక వ్యాధి వృద్ధి చెందినచో మరణించుట గాని జరుగును [1]

## చరకోక్త పక్షాఘాత లక్షణము :-

ప్రకోపించిన వాతము దక్షిణ పక్షమును గాని లేక వామ పక్షమునుగాని ఏదో ఒక పక్షమును వినాశనముచేసి శారీరక చేష్టలను నశింపచేయును, వాక్స్తంభము వేదన కూడా కలుగును. ఇది పక్షఘాతమనబడును .[2]

## ఏకాంగవాతము లేక ఏకాంగరోగము :-

ప్రకోపించిన వాతము శరీరమందలి అర్ధభాగములో ఆశ్రయించి ఆభాగ మందలి సిరాస్నాయువులను శోషింపచేసి ఒక పాదమును గాని లేక ఒక హస్తమును గాని సంకోచింపచేసి తోదను, శూలను కలిగించును. ఈ వ్యాధిని ఏకాంగ రోగము అందురు .[3]

---

1. అధోగమాః సతిర్యగ్గా ధమనీరూర్ధ్వదేహగాః
యదా ప్రకుపితోఽత్యర్థం మాతరిశ్వా ప్రపద్యతే
తదాన్యతరపక్షస్య సన్ధిబన్ధాన్ విమోక్షయన్
హన్తి పక్షం తమాహుర్హి పక్షాఘాతం భిషగ్వరాః
యస్య కృత్స్నం శరీరార్ధమకర్మణ్యామచేతనమ్
తతః పతత్యసన్ వాఽపి జహాత్యనిలపీడితః (సు.ని. 1/60-62)

2. హత్వైకం మారుతః పక్షం దక్షిణం వామమేవ వా కుర్యాచ్చేష్టానివృత్తిం
హి రుజం వాక్స్తంభమేవ చ (చ.చి. 28/53)

3. గృహీత్వాఽర్ధం శరీరస్య సిరాః స్నాయూర్విశోష్య చ పాదం సంకోచ
యత్యేకం హస్తం వా తోదశూలకృత్ ఏకాంగరోగం తం విద్యాత్
సర్వాంగం సర్వదేహజమ్ (చ.చి. 28/54-55)

### సర్వాంగ రోగము :-

వాతము సర్వ శరీరమున ఆశ్రయించుట వలన ఈ విధమగు వికృతి శరీరమునందు కలిగినచో దానిని సర్వాంగ రోగము అందురు.

ఏకాంగ రోగము Mono Plegia (మోనో ప్లెజియా)కు సర్వాంగ రోగము Quadri Plegia కు పక్షఘాతము Hemiplegia కు తుల్యముగా నుండును.

### పక్షాఘాత సాధ్యాఽసాధ్యత :-

కేవల వాత ప్రకోపముచే కలిగిన పక్షాఘాతము కృచ్ఛ్ర సాధ్యముగా నుండును. పిత్తాది ఇతర దోషములచే కూడిన వాత ప్రకోపముచే కలిగిన పక్షాఘాతము సాధ్యముగా నుండును. రక్తాదిధాతు క్షయములతో కూడిన పక్షాఘాతము అసాధ్యముగా నుండును [1].

పక్షాఘాతమును ప్రారంభావస్థలో స్ట్రోక్‌నకును తదనంతరావస్థలో హెమిప్లెజియాకును తుల్యముగానుండును.

### స్ట్రోక్ (Stroke) :-

స్ట్రోక్ చాలా త్వరగా సంప్రాప్తించు వాత వికృతి. 24 గంటలలో మరణమును కాని లేక 24 గంటలకన్నా అధిక సమయమునరకు నిలచియుండు సంజ్ఞా చేష్టాది వికృతులను గాని కలిగించునని నిర్వచింపబడినది. దీనికి ముఖ్యకారణము మస్తిష్క స్రోతోవరోధము. అది కోష్ఠకు లేక ధమనులు పగిలి రక్తస్రావము కలుగుటకు కారణమగును. మస్తిష్కమునందలి ఏ భాగమున ఇట్టి వి



---

1. శుద్ధవాతహతం పక్షం కృచ్ఛ్రసాధ్యతమం విదుః సాధ్యమన్యేన సంసృష్టమసాధ్యం క్షయహేతుకమ్ (సు.ని. 1)

జరుగునో తత్సంబంధ వ్యతిరేకార్థ శరీరమునందు అకర్మణ్యత. అచైతన్యత కలుగును.

ఈ వ్యాధి అధికముగా ప్రబలియున్న దారుణమైన వాతవహ సంస్థానవ్యాధి. మరణ కారకమైన వ్యాధులలోనూ అంగవైకల్యము కలిగించు వ్యాధులలోనూ ప్రధానమైనది. అనేక దేశములలో వెయ్యిమందిలో ఇద్దరిలో ఈ వ్యాధి ఉన్నట్లు గమనింపబడినది.

పక్షఘాత వ్యాధి వచ్చినవారిలో సుమారు నూటికి 40 మంది మొదటి నెలలోనే మరణించెదరు. 25నుండి 30శాతం మందికి పూర్తిగా వ్యాధి శమిస్తుంది. సుమారు 35 శాతం మందికి శాశ్వత అంగవైకల్యం కలుగుతుంది.

ఇది ముఖ్యంగా వృద్ధులలో అధికముగా ఉండును. 55 సంవత్సరములు పై బడిన వారిలో అధికము. 80సంవత్సరములు పైబడిన వారిలో ప్రతిముగ్గురిలో ఒకరికి స్ట్రోక్ ఉంటుంది.

ఆయుర్వేద సంహితలలో పేర్కొనిన వాతప్రకోపకారణాలు దాదాపుగా అన్నీ కొన్ని స్ట్రోక్ కేసులలో వాటి ప్రభావాన్ని చూపుతున్నట్లు గమనింప బడినది.

వృద్ధాప్యమువలన శరీర రూక్షత్వము, మాంస శైథిల్యము, అధిక మేదస్సంచయము, మజ్జాక్షయము మొదలగునవి చరకునిచే చికిత్సా స్థానమున చెప్పబడినవి. ఇవి పక్షఘాత సంప్రాప్తికి కారణములుగా గమనింపబడు తున్నాయి.

అధికశ్రమ, లవణపదార్థ సేవన యివి రూక్షత్వవృద్ధికి ధమనీ ఆవరోధానికి సహకరిస్తాయి. మద్యపానము, ధూమపానము, పిత్తప్రకోపానికి మస్తిష్కాంతర రక్తస్రావానికి కారణమవుతాయి.

రక్తసమ్మర్దము, హృద్రోగాలు, రక్తవికారములు మధుమేహము, స్థౌల్యము, అభిఘాతము. మస్తిష్కధమనీ వికృతులు, మొదలైనవి, మానసికాందోళనలు, అధికశ్రమ మొదలైనవి స్ట్రోక్ కలగటానికి వ్యంజక కారణాలవుతాయి.

## పక్షాఘాత లక్షణాలు (STROKE)

ప్రపంచ ఆరోగ్య సంస్థవారి 1978 టెక్నికల్ రిపోర్టు ననుసరించి స్ట్రోక్ ఈ క్రింద విధముగా విభజింపబడింది.

1. **ఆవేగాత్మక పక్షాఘాతము** (Transient Ischaemic Atta k)
ఆంశికమైన వాత వికృతి లక్షణములు ధమనీ అవరోధముచే అకస్మాత్తుగా కలిగి 24 గంటల లోపల పూర్తిగా శమించునట్టి వ్యాధి ఆవేగాత్మక పక్షాఘాత మనబడును.

2. **పక్షాఘాతము** (Stroke or Cerebrovascular accident)
మస్తిష్కధమనుల శోష లేక రక్తస్రావము వలన అకస్మాత్తుగా కలిగి త్వర త్వరగా వృద్ధి చెందుచు 24 గంటల తర్వాత గూడా అనువర్తించి యుండు సంజ్ఞా, చేష్టావహాది వాత సంస్థాన వికృతి పక్షాఘాతము లేక Stroke అనబడును.

3. **తిరిగి శమించు పక్షాఘాతము** [ Reversible ischaemic Neurologic disability (Rind) ]
వాత వికృతి 24 గంటలకు మించి అనువర్తించియుండి తదుపరి పూర్తిగా శమించినచో ఈ విధముగా పేర్కొందురు.

4. **ఆంశిక స్థిరపక్షాఘాతము** (Partial Non Progressing Stroke)
మస్తిష్కధమనీ శోషచే ఆంశికముగా వాతవహ వికృతి కలిగి అంతటితో నిలచిపోయినపుడు ఈ పదము ప్రయోగింపబడును.

5. వర్ధమాన పక్షఘాతము (Progressing Stroke or Stroke in evolution) పక్షఘాతము ఆకస్మికముగా కలిగి నిమిష నిమిషమునకు వృద్ధి చెందుచు కొన్ని నిముషములలో పూర్తిగా సంప్రాప్తించును. అట్లుకాక ఒక్కొక్కప్పుడు మెల్లమెల్లగా కొద్ది దినములలో లేక వారములలో పూర్తి పక్షఘాతముగా రూపొందును. అట్టిస్థితిలో ఈ విధముగా పేర్కొనబడును.

పక్షఘాత లక్షణములు కారణముననుసరించియు అవరోధింపబడిన ధమనీ భాగము ననుసరించియు రక్తస్రావము జరిగిన మస్తిష్క భాగము ననుసరించియు అనేక భేదములతో నుండును.

ఆ వృత వాత లక్షణములుగా పేర్కొనబడిన లక్షణములు ఆయా పక్షఘాతములలో కనిపిస్తాయి.

ధమనీ అవరోధానుసారము కొన్ని ప్రధాన లక్షణాలు ఈ క్రింది విధంగా ఉంటాయి.

మధ్యమస్తిష్కధమని (Middle cerebral artery) వ్యతిరేకదిశలో ముఖము, పాదము, హస్తము చేష్టాహీనతను, స్పర్శానాశనమును పొందుట, అపుడపుడు అర్ధభాగపు అంధత్వము అకస్మాత్తుగా కలిగినపుడు ప్రారంభములో పేశీ శైధిల్యము కలిగి తదుపరి సంకోచము, స్తబ్ధత, వక్రత కలుగును.

ముఖ శిరోర్ధ భాగము (సామాన్యముగా ఎడమ భాగమున) వికృతి కలిగిన మిన్మినత, అక్షరములు వ్రాయలేక పోవుట కలుగును.

మధ్య శాఖ అవరోధమున వాక్సంగము, చదువలేక పోవుట, వ్రాయలేక పోవుట ఈ లక్షణములు కలుగును.

కుడిపైపు వికృతి యున్నచో అమర్చుటాయుచుశక్తి లోపించుట, వస్త్రు ధారణ చేయలేక పోవుట కలుగును,

పృష్ఠ, మస్తిష్కధమనీ అవరోధము (Posteri or cerebral artery) వ్యతిరేక భాగములో స్పర్శానాశము లేకుండా పక్షఘాతము కంపము, విచేష్టనము అర్ధభాగమున మరియు ఊర్ధ్వభాగమున దౌర్బల్యము.

పరిసరీయ ధమనులు అవరోధించిన దృష్టిమాంద్యము, స్మృతి నాశము, రూపగ్రహణశక్తి లోపము, మొదలగు లక్షణములు కలుగును.

పార్శ్వ మస్తిష్కధమని (Anterior cerebre) పాదము అధికముగా అచేష్టత్వమును పొందుట, వాక్సంగము.

ఆభ్యంతర మన్యధమని (Internal carotid)- అనియమిత హస్తాంగుళీ చేష్ట, స్పర్శ వికృతులు

సుషుమ్నాధమని (Vertebro basilar artery) అదే పార్శ్వమున వికృతి లక్షణములు లేక వ్యతిరేక దిశలో గాని రెండు వైపులగాని స్పర్శా చేష్టావికృతి. మతిభ్రమణము, బాధిర్యము, దృష్టి వికృతి కర్ణనాదము, స్మృతి నాశము, మిన్మినత్వము - ఈ లక్షణములు కలుగును.

కపాల ధమని (Brain stem) తీవ్ర శిరఃశూల, భ్రమ, తంద్ర, హస్తపాద విక్షేపము, ద్వంద్వ దృష్టి, నేత్రకంప, ఏదో ఒకటిగాని లేక కొన్ని గాని కపాలనాడులు వికృతి చెందును. మిన్మినత్వము, గద్గదత్వము కలుగును.

మస్తిష్క రక్తస్రావము పక్షఘాతమునకు మరొక ముఖ్య కారణము సాధారణముగా సబ్ ఆర్ధనాయిడ్ రక్తస్రావము వలన పక్షఘాతము కలుగుచుండును.

ఇందు ప్రధానముగా అకస్మిక శిరఃశూల, స్మృతి సంజ్ఞానాశము వమి, అపస్మారముల వంటి ఆవేగములు కలుగును.

మన్యాస్తంభము, నేత్రగోళముఉత్సేదములగుట, మస్తిష్క శోధ మస్తిష్కాంతర క్షోభ సూచక చిహ్నములు కలుగును.

మస్తిష్కాంతరగ్రంధులు, మస్తిష్కధమనీ వికృతులు గూడా పక్ష ఘాతమునకు కారణములుగా నుండును.

## రోగ నిర్ణయము

పక్షఘాతము తీవ్రావస్థలో ప్రారంభావస్థలో నిర్ణయించుట కష్టముగా నుండును.

వ్యాధి కారణము నిర్ణయించుట ఇంకను కష్టముగా నుండును.

ఆవేగాత్మక పక్షఘాత చరిత్ర యున్నచో సాధారణముగా అవరోధ శోష జన్య పక్షఘాతముగా భావించవచ్చును. నిద్రలో కలుగు పక్షఘాతము అవరోధ జన్యము అగుటకు అధిక అవకాశము కలదు.

రక్తసమ్మర్దము చిన్నవారిలో సాధారణముగా రక్తస్రావజ పక్షఘాతమును కలిగించును.

## పరీక్షలు

మస్తిష్క సుషుమ్నాద్రవముపరీక్ష, (C.S.F. exam) ఎకో ఎన్సెఫలో గ్రఫీ, రక్తపరీక్షలు, ఎక్స్‌రే బ్రెయిన్ స్కాన్, కంప్యూటరైజుడ్ ఏక్సియల్ టోమోగ్రఫీ, మొదలగు పరీక్షలు పక్షఘాత కారణమును తెలిసికొనుటకు సహ కరించును. సాధారణ వాతవహ సంస్థాన పరీక్షలు పూర్వచరిత్ర తీసికొనుట మొదలగునవి ఎంతో అవసరము.

## సాధ్యాఽసాధ్యత

ఆధునిక శాస్త్రవేత్తలు పక్షఘాత సాధ్యాసాధ్యతను గురించి గమనించిన విషయములు చాలా వరకు ఆయుర్వేద సంహితోక్త విషయములను నిర్ధారించు చున్నవి.

తీవ్ర సంమోహము మూర్ఛలో ఎక్కువకాలము ఉన్నవారు ముఖ్యముగా 24 గంటలకన్నా ఎక్కువకాలము మూర్ఛలో ఉన్నవారు జీవించుట కఠినము. మూర్ఛ తీవ్రత మస్తిష్క వికృతి తీవ్రతకు సూచకము.

దృష్టి వికృతి, కాంతికి ప్రతిక్రియ లేకపోవుట ఇవి రక్తస్రావమునకు సూచకములు. కంటిపాప విస్తరించి యుండుట మరణాసన్న సూచకము. ఛిన్న శ్వాసతో కూడియుండుట తీవ్ర అసాధ్య సూచకము.

సంజ్ఞానాశము, మోహము లేని పక్షఘాత రోగులకు ప్రాణభయము అంతగా ఉండదు కాని హృదయము, వస్తి, పుప్ఫుసములు వీటికి సంబంధించిన వికృతులున్నచో సాధ్యాఽసాధ్యత ఆవికృతులపై ఆధారపడి యుండును.

**చికిత్సార్హ పక్షాఘాత లక్షణములు :-**

పక్షఘాత రోగి శరీరము మ్లానము కాకుండాయుండి నొప్పులతో కూడి (నొప్పులు తెలియుచుండుట లేక చైతన్యము నశింపకుండా యుండుట) యుండి ఆత్మవంతుడుగను ఉపకరణవంతుడుగను ఉన్నచో చికిత్సకు అర్హుడుగా నుండును.[1]

**పక్షాఘాత చికిత్స :-**

ప్రారంభమున స్నేహ స్వేదములు చేయించి మృదువుగా సంశోధనములు అనగా ముఖ్యముగా విరేచనము చేయింపవలెను. తదుపరి అనువాసన ఆస్థాపన వస్తులను ప్రయోగింప వలయును.

---

1. పక్షఘాతోపద్రుతమమ్లానగాత్రం సరుజమాత్మవన్తముపకరణవన్తం చోపక్రమేత్॥ (సు.చి 5-19)

తగిన కాలమునందు ఆక్షేపక (అపతానక) వాతమునకు చెప్పబడిన విధానములో ఉపచరింప వలెను.

అందు విశేషించి మస్తిష్క్యము (తైల పిచును వేయుట), శిరోవస్తి ఈ క్రియలను శిరస్సు యొక్క శుద్ధికొరకు చేయవలెను.

అభ్యంగనమునకు అణుతైలము వాడవలయును. సాల్వణ స్వేదమును ఉపనాహనమునకు వాడ వలయును.

బలాతైలమును అనువాసన వస్తికి వాడవలయును.

ఈ విధమైన చికిత్సను ఏమరు పాటు లేకుండగ మూడు నాలుగు మాసములు ప్రయోగింపవలెను.[1]

పక్షఘాత ప్రారంభావస్థలో స్మృతి సంజ్ఞానాశము ఉన్నపుడు మూర్ఛాదులందు చెప్పబడిన సంజ్ఞా ప్రబోధక ఔషధములు ప్రయోగింప వలెను. రోగి ప్రాణమును రక్షించుటకై ఆహారము, శ్వాస, హృదయగతి, మూత్రము మొదలగు వానిని జాగ్రత్తగా రక్షింపవలెను.

బృహద్వాత చింతామణి, రసరాజరసము, యోగేంద్ర రసము—వీనిలో తగిన ఔషధము ఇవ్వవలెను.

ఆక్షేపకములు ఉన్నచో వాత కులాంతక రసము ఇచ్చుట ప్రశస్తముగా నుండును.

---

1. తత్ర ప్రాగేవ స్నేహస్వేదోపపన్నం మృదునా శోధనేన సంశోధ్యానువాస్యాస్థాప్య చ యథాకాల మాక్షేపక విధానేనోపచరేత్ వైశేషికశ్చాత్ర మస్తిష్క్యః శిరోవస్తిః అణుతైలమభ్యంగార్థే సాల్వణముపనాహార్థే బలాతైలమనువాసనార్థే ఏవమతంద్రితః త్రీంశ్చతురో వా మాసాన్ క్రియాపథముపసేవేత॥ (సు చి. 5-19)

మనో విభ్రమము, వాక్సంగములందు బ్రాహ్మీవటి, రసరాజరసము, స్మృతి సాగర రసము, శంఖ పుష్పీ స్వరసము మొదలగునవి ప్రయోగింపవలెను.

కఫము అధికముగా నున్నచో ఏకాంగ వీరరసము, నవగ్రాహి రసము. ఇవి యివ్వవలయును.

జీర్ణావస్థలోను, ఫిరంగలీన విషయుక్త అవస్థలందును సమీర గజకేసరీ, మల్ల కల్పములు, మహాయోగరాజగుగ్గులు పై యోగములతో పాటు యివ్వ వలెను.

శిరోవస్తి, షష్టికశాలి పిండ స్వేదము, అభ్యంగములు బాగుగా చేయింప వలెను.

పక్షాఘాతమునకు అను బంధముగను, కారణముగను ఉండు రక్తదబాద్ వృద్ధి, మధుమేహము, ధాతుక్షయము మొదలగు వానిని దృష్టిలోనుంచుకొని వానికి వ్యతిరేకము కాకుండా యుండు ఔషధములు, ఉపక్రమములు, ఆహారములు ప్రయోగింపవలెను.

వానికి తగిన చికిత్సలు గూడా చేయుచుండవలెను.

## అర్దిత వాతము

ముఖము యొక్క అర్ధభాగమునకు వక్రమును కలిగించు వ్యాధి అర్దితము లేక అర్దిత వాతము అనబడును. ముఖమునుగాని లేక శరీరార్ధ భాగమునందు గాని వక్రత్వాదులు కలిగించు నదర్దితమని చరకమతము.

**నిదానము :-**

గర్భిణీస్త్రీ, ప్రసవించినస్త్రీ, బాలురు, వృద్ధులు క్షీణించి యున్నవారు— వీరలకు రక్తక్షయము కలుగుట చేతను, పెద్దగా మాట్లాడుటచేతను, అత్యన్తకఠిన

పదార్థములు నమలుట చేతను, నవ్వుట, ఆవలించుట, బరువులు ఎత్తుట, విషమముగా ఎత్తు పల్లములుగా ఉండు ప్రదేశమునందు పరుండుట, ఈ కారణములచే అర్దితవాతము కలుగును.[1]

## సంప్రాప్తి :-

పై కారణములచే ప్రకోపించిన వాతము శిరస్సు, నాసిక, ఓష్ఠములు, చిబుకము, లలాటము, అక్షి మధ్యము వీనియందు ఆశ్రయించి ముఖమును పీడించుచు అర్దితవాతమును కలిగించును. చరక మతానుసారము శరీర అర్ధభాగమును ఆశ్రయించి ఆ భాగమునందలి రక్తమును స్రవింపనీయక శోషింప చేసి అర్దిత వాతమును కలిగించును.

## లక్షణములు :-

నోటియందు సగభాగము వక్రముగానగుట గ్రీవము గూడ వక్రమగుట, తలవణకు చుండుట వాక్సంగము, నేత్రములు, కనుబొమలు మొదలగునవి సంకోచించి వక్రత్వమును ఇతర వికృతులను పొందుట వ్యాధికలిగిన పార్శ్వమున ము కంఠము, చుబుకము, దన్తములు వీనియందు వేదనలు కలుగుట భోజనము చేయునపుడు ముక్కు వంకరగనై నోరు ఒక పక్కకు ఒరిగి ఉండుట వలన ఒక పక్కగనే ఆహారమును గ్రహింపగలుగును. మాట్లాడునపుడు ముక్కు వంకరగనుండును. నేత్రములు స్తంభించును. క్షవథు (తుమ్ము) సరిగా వెడలక అడ్డుపడి ఆగిపోవును. మాట్లాడునపుడు మాట దీనముగను, వక్రముగను, స్వరభేదముగను,

---

1. i) అర్దయిత్వాఽనిలో వక్త్రమర్దితం జనయత్యతః (సు.ని 1-70)
 ii) అర్దే తస్మిన్మఖార్దే వా కేవలే స్యాత్తదర్దితమ్ (చ.చి. 28-42)
2. గర్భిణీ సూతికా బాల వృద్ధ క్షీణేష్వసృక్షయే
 ఉచ్చైర్వ్యాహరతోఽత్యర్థం ఖాదతః కఠినానిచ
 హసతో జృమ్భతో భారాద్ విషమాచ్ఛయనాదపి (సు.ని1/68-69)

అస్పష్టముగను గొంతునుంచి బయల్వెడలును. దంతములు చలించును. రెండు చెవులయందును నొప్పి కలుగును. స్వరభేదముకల్గును. వ్యాధికలిగిన భాగమందలి కన్ను, శంఖము, చెవి గడ్డము వీనియందు నొప్పికలుగును.[1]

అర్దిత పూర్వరూపములు :-

రోమహర్షము, వణకు, కన్నులుకలకబారియుండుట, వాతము ఊర్ధ్వముగ సంచరించుంట, చర్మమున స్పర్శజ్ఞానము లేకుండుట, తోద, మన్యాగ్రహము, హనుగ్రహము ఈ లక్షణములు అర్దితవాతము రాబోవుటకు ముందు కలుగు పూర్వ రూపములుగా నుండును.[2]

చరకమతానుసారము అర్దితవాతము రెండు విధములు :-

1. కేవలము ఖార్ధ భాగమునకు కలుగునది. దీని వివరణము పైన ఇవ్వబడినది. సుశ్రుతుడు ఈ విధమగు అర్దితమును మాత్రమే వర్ణించెను.

---

1. i) శిరోనాసౌష్ఠచిబుకలలాటేక్షణసంధిగః అర్దయిత్వాఽనిలో వక్రమర్దితం జనయత్యతః వక్రీభవతి వక్త్రార్ధం గ్రీవా చాప్యపవర్తతే శిరశ్చలతి వాక్సంగో నేత్రాదీనాం చ వైకృతమ్ గ్రీవాచిబుకదంతానాంతస్మిన్ పార్శ్వే తు వేదనా (సు.ని. 1/69-61)

ii) అతివృద్ధశ్శరీరార్ధం ఏకం వాయుః ప్రపద్యతే యదా తదోపశోష్యాఽసృక్ బాహుం పాదం చ జాను చ తస్మిన్ సంకోచయత్యర్ధే ముఖం జిహ్మం కరోతి చ వక్రీకరోతి నాసాభ్రూలలాటాక్షిహనూస్తథా తతో వక్రం వ్రజత్యాస్యే భోజనం వక్రనాసికమ్ స్తబ్ధం నేత్రం కథయతః క్షవథుశ్చ నిగృహ్యతే దీనా జిహ్వా సముత్క్షిప్తా కలా సజ్జతి చాస్య వాక్ దంతాశ్చలన్తి బాధ్యేతే శ్రవణౌ భిద్యతే స్వరః పాదహస్తాక్షిజంఘోరుశంఖశ్రవణగండరుక్ అర్ధే తస్మిన్ముఖార్ధే వా కేవలే స్యాత్ తదర్దితమ్ (చ.చి. 28/38-42)

2. యస్యాగ్రజో రోమహర్షో వేపథుర్నేత్రమావిలమ్ వాయురూర్ధ్వం త్వచి స్వాపస్తోదో మన్యాహనుగ్రహః తమర్దితమితి ప్రాహుర్వ్యాధిం వ్యాధివిశారదాః (సు.ని. 1/70-72)

2. ముఖార్ధ భాగముతోపాటు శరీరార్ధ భాగమునందు గూడా వేదనాదులు కలుగునది. వృద్ధ వాగ్భటుడు గూడా దీనిని వర్ణించి దీనినే కొందరు ఏకాయామమందు రని తెలిపెను.[1]

శరీరార్ధ భాగముతో కూడా కలసియుండు అర్దితవాత లక్షణములు.

పై లక్షణముల (ముఖార్ధ వేదనాదుల)తో పాటు వ్యాధి కలిగిన పార్శ్వమునందు హస్తము, పాదము, జాను—ఇవి సంకోచించుట; పాదమునందు, హస్తమునందు, జంఘము (తొడ)యందు నొప్పికలుగుట; గంధ జ్ఞానము, స్మృతి నశించుట—ఈ లక్షణములు కలుగును.[2]

## దోషానుసార అర్దితభేదములు :-

అర్దితము దోషానుసారము మూడు విధములుగా నుండును. 1. వాతజము 2. పిత్తజము 3. శ్లేష్మజము.

వాతజ అర్దితమునందు లాలాస్రావము, వ్యథ (బాధ) కంపము, అదురుట, హనుగ్రహము, వాగ్గ్రహము, ఓష్టములందు శోథ, శూల ఈ లక్షణములు కలుగును.

పిత్తజ అర్దితమునందు జ్వరము, తృష్ణ, మూర్ఛ లేక మోహము, పొగలు వెడలునట్లు ఊష్మ వెడలుట ఈ లక్షణములు కలుగును.

---

1. అ.సం.ని. 15/34-39.
2. i) చ. చి. 28/38-39
   ii) అ. సం. ని. 15/34

కఫజ అర్దితమునందు గండమునందు, శిరస్సునందు, మన్యయందు శోధ, స్తబ్ధత్వము కలుగును.[1]

అర్దిత అసాధ్య లక్షణములు :-

రోగి క్షీణించి యుండుట, కన్నులు మూతపడకుండుట, అస్పష్టముగా అడ్డుకొనుచున్నట్లు మాట్లాడుట, మూడు సంవత్సరములు గడుచుట లేక నాసా ముఖ నేత్రముల నుండి స్రావము, వణుకు కలుగుట—ఈ లక్షణములు గలవానికి అర్దిత వాతము శమించదు. అనగా అసాధ్యముగా నుండును[2].

అర్దిత వాతమునందు అవస్థానుసారము వేగము కలుగుచు వేగములేనపుడు నివర్తించుచు ఉండును. పీడాజనక మగు ఆయా కారణములచేత ఎడతెగని బాధలతో రూక్షియున్నచో అట్టి అర్దితవాతము వర్జనీయము అనగా అసాధ్యము.[3]

అర్దిత వాతము ఫేషియల్ పెరాలిసిస్ అనబడును. ఈ వ్యాధి సూప్రా న్యూక్లియర్, (Supra nuclear) న్యూక్లియర్ (Nuclear) మరియు ఇన్‌ఫ్రా న్యూక్లియర్ (Infranuclear) వికృతుల వలనను ముఖగత పేశీ వికృతుల వలనను కలుగును. మెదడువాపు, పోలియో మస్తిష్క-గోళ వికృతులు, మస్తిష్క-

1. వాతాత్పిత్తాత్కఫాచ్చ స్యాత్త్రివిధం తత్ర మానతః లాలాస్రావో వ్యథా కంపః స్ఫురణం హనువాగ్గ్రహః ఓష్ఠయోశ్చ్వయథుః శూలం చార్ధితే వాతజే భవేత్ పీతమాస్యః జ్వరస్తృష్ణా పిత్తజే మోహధూపనే గండే శిరసి మన్యాయాం శోథస్తంభం కఫాత్మకే (భా. ప్ర.)
2. క్షీణస్యానిమిషాక్షస్య ప్రసక్తం వక్తభాషిణః న సిధ్యత్యర్దితం గాఢం త్రివర్షం వేపనస్య చ (సు.ని. 1/73)
3. స్రస్తస్య స్యాదర్దితాహ్వానాం ముహుర్వేగే గతేఽగతే పీడ్యతే పీడనైస్తైస్తైః షడ్గగేలాన్ వివర్జయేత్ (చ. చి. 28/52)

ప్రవాహము, మధ్యకర్ణ పూయము, మధ్యకర్ణగత పూయ శోధయుక్త వ్యాధులు, రాజయక్ష్మజ, ఉపదంశ మస్తిష్క వ్యాధులు, అభిఘాతములు బెల్స్‌పాలెసీ ఈ కారణములు అర్దితమునకు సాధారణ కారణములుగా నుండును.

## అర్దిత వాత చికిత్స

సామాన్య వాతవ్యాధి చికిత్సా క్రమమును అర్దితమునందును ప్రయోగింప వలెను.

విశేషించి మూర్ధతైలము, మస్తిష్కము, శిరోవస్తి, నస్యము, ధూమపానము, ఉపనాహము,నాడీ స్వేదము అందును అనూపజంతువుల మాంసములతో ఉపనాహస్వేదములు, తర్పణములు, స్నేహపానములు ఈ క్రియలచే అర్దితమునందు ఉపచరింపవలెను.[1]

తృణపంచమూలా ఉశీర తైలమును, అర్దితమునందు పాన అభ్యంగాదులకు ఉపయోగింపవలెను.

క్షీర ఘృతమును అక్షితర్పణమునకు ప్రయోగింపవలెను. ఘృతమును ఉత్తర భక్తకముగా సేవించుట నవనీతములో మాషాండరీలు (ఇడ్లీలు) సేవించుట

---

1. అర్దితే నావనం మూర్ధ్ని తైలం తర్పణమేవ చ నాడీస్వేదోపనాహాశ్చాప్యానూపపిశితైర్హితాః (చ.చి. 28/99)

ii) అర్దితాతురం బలవన్తమాత్మవన్తముపకరణవన్తం చ వాతవ్యాధి విధానేనోపచరేత్ విశేషికైశ్చ మస్తిష్క్యశిరోవస్తి నస్య ధూమోపనాహ స్నేహ నాడీస్వేదాదిభిః (సు.చి. 5/22)

iii) అర్దితేనామనీతే న ఖదేన్మాషాండరీనరః క్షీరమాంసరసైర్భుక్త్వా దశమూలీరసంపిబేత్ స్నేహాభ్యంగం శిరోవస్తి పాన నస్యపరాయణః అర్దితం నజయేత్ సర్పిఃపిబేదధభక్తకం (చ.ద.)

దుగ్ధము మాంసరసము, వీనిచే భోజనము చేయుట నవనీతముతో రసోనకల్కము సేవించుట-ఇవన్నియు అర్దితమునందు మిక్కిలి గుణకారులుగా నుండును.[1] దశమూలరసము త్రాగించవలెను.

వాతజ అర్దితమునందు దశమూల క్వాథ సిద్ధ క్షీరము మాదీఫల, బల, పంచమూలములు వీనిలో దేనితో నైనను సిద్ధముచేసిన క్షీరములు ప్రయోగించుట హితకరముగా నుండును. మాంసపిష్టమును ఘృతముతోను నవనీతముతోను భుజింపచేయవలెను. క్షీరముతోగాని మాంసరసముతోగాని భోజనము నివ్వవలెను.[2]

పిత్తజ అర్దితమునందు శీతములైన ఘృతాది స్నేహములను ప్రయోగింపవలెను. ఘృతముచే శిరోవస్తులను సేకములను ప్రయోగింపవలయును. క్షీరముచే గూడా సేకములు వస్తులు ప్రయోగింపవచ్చును.

వక్రభూతమైన ముఖము కలిగి దాహము, మూకత్వముకల అర్దిత రోగికి వాత పిత్తహర క్రియలు చేయవలెను.

శ్లేష్మజ అర్దితమునందు శోధ కలిగినప్పుడు శ్లేష్మహరమగు వమనము చేయించియు, నస్య స్వేదములను ప్రయోగించియు శ్లేష్మమును క్షీణింపచేసి తదుపరి బృంహణ చికిత్సలచే ఉపచరింప వలెను.

---

1. i) సు. చి. 5/22 ii) యోగరత్నాకర వాతవ్యాధి

2. దశమూల కషాయేణ మాతులుంగరసేన వా బలయా పంచమూల్యా వా క్షీరం వాతాత్మకే హితమ్ పిష్టం మాంసఘృతం జగ్ధ్వా నవనీతేన సోఽర్దితీ క్షీర మాంసరసైర్భుక్త్వా దశమూలీరసం పిబేత్ (భా. ప్ర.)

శ్లేష్మానుబంధ అర్దితమునందు రసోన కల్కమును తిలతైలముతో సేవింపచేసిన నిశ్చయముగా శమింప చేయును.[1]

## అర్దితమునందు కొన్ని అనుభవసిద్ధ ప్రయోగములు :-

ఘూనాగ తైలమును స్నేహస్వేదములు చేయించి నస్యము చేయించిన అర్దితము శమించును. ఘూనాగతైలము 10 నుండి 30 చుక్కలు క్షీరముతో భోజనాత్పూర్వము పానము చేయింపవలెను.

## కుక్కుటాండ నింబ స్వేదము :-

ఈ ప్రక్రియ హైదరాబాదు ప్రభుత్వాయుర్వేద వైద్యాలయమున చాలా కాలము నుండి ఆచరింపబడుచు మంచి ఫలితములనిచ్చు చున్నది.

అర్దిత రోగి ముఖమునకు స్నేహాభ్యంగము తగిన తైలములతో చేయించి, కోడిగుడ్డు తెల్లసొనను ఆమ్లెట్ వలె వేసి ముక్కలు చేసి నిమ్మకాయను ముక్కలుగా చేసి రెండింటిని కలిపి వేడిచేసి వస్త్రములో వేసి పోట్లిగా చేసి ఆ పోట్లితో స్వేదనము చేయింపవలెను. ఈ స్వేదనము చాలామంచి ఫలితములను ఇచ్చు చున్నది.

## అర్దితవాత హర శామక యోగములు :-

అర్దితారి రసము, రసరాజరసము, ఖంజనికారి సమీర పన్నగరసము, స్వర్ణ భూపతి రసము, వాతగజాంకుశ రసము -వీనిని అవస్థాను సారము ప్రయోగింపవలెను.

---

1. అర్దితే పిత్తజే శీతాన్ స్నేహాంశ్చైవ విరిర్దిశేత్ ఘృత వస్తి ప్రసేకం చ క్షీరమేకం తథైవ చ జిహ్మీభూతాననో మూకో దా హావాన్యోర్దితీ భవేత్ కుర్యాత్తత్ప్రతిక్రియాం తస్య వాతపిత్త వినాశినీమ్ శ్లేష్మభాగే క్షయం నీతే బృంహణైః సముపాచరేత్ అర్దితే రోగసంయుక్తే వమనం చ ప్రశస్యతే (భా.ప్ర)

ఆక్షేపకయుక్తముగాను వేదనతో కూడియున్నచో మహావాత విధ్వంసినీ రసము యివ్వవలెను.

పక్షఘాతముతో కూడియున్నచో పక్షఘాతోక్త చికిత్సలు చేయవలెను.

ఆమలక్షణములున్నచో మహాయోగ రాజగుగ్గులు యివ్వవలయును.

పిత్తానుబంధము లేనపుడు రసోనపాకము, రసోనపిండము ప్రయోగింపవచ్చును.

ధాత్రీ భల్లాతకము, పథ్యా భల్లాతకము అవస్థానుసారము ప్రయోగింపవచ్చును.

రౌప్యభస్మము, శిలాజిత్ ప్రయోగించిన ప్రశస్తముగా నుండును.

జీర్ణావస్థలో చతుర్భుజ రసము, రసోనగుగ్గులు మొదలగునవి ప్రయోగించవలయును.

మాష బలాదిక్వాథము, మాషాత్మగుప్తాది క్వాథము త్రయోదశాంగ గుగ్గులు హితకరముగా నుండును.

## ఆక్షేపక వాతము — అపతానక వాతము

వాతము దేహముయొక్క సకల ధమనులను ఆశ్రయించి ప్రకోపించినపుడు హస్త పాదము లంచలి సిరా స్నాయు కండరములను శోషింప చేసి దేహమును మాటిమాటికి ఏనుగుమీద కూర్చొనిన వాని శరీరము కదలినట్లు కదల్చుచు విదల్చుచు చలింపచేయుచుండును. దీనిని ఆక్షేపక వాతము అందురు. ఈవిధముగా ప్రకోపించిన వాతము మధ్యమధ్యలో రోగిని పడవేయుచున్నచో అది అపతానక

మనబడును[1]. వాతము కఫపిత్తములతో కలసిగాని లేక కేవలవాతముగాని ప్రకోపించి ఆక్షేపక వాతములను కలిగించును.

ఆక్షేపక వాతము యొక్క భేదములు.

ఆక్షేపక వాతము నాలుగు విధములుగా నుండును.

1. దండాపతానకము 2. అన్తరాయామము

3. బహిరాయామము 4. అభిఘాతజము

## దండాపతానక వాతము

కఫముతో కూడిన వాతము ధమనుల యందు వ్యాపించి యుండి దేహమును దండము (కఱ్ఱ) వలె స్తంభింపచేయును. ఈ వ్యాధియందు ప్రకోపించిన వాతము పాణి, పాదము, శిరస్సు, పృష్ఠము, శ్రోణి ప్రదేశము వీటన్నింటిని దండమువలె స్తంభింపచేయును. ఈ వ్యాధిని దండక రోగమనియు (చరక) దండా పతానక మనియు (సుశ్రుతుడు) అందురు. ఈ వ్యాధి అసాధ్యము.[2]

---

1. i) తదాక్షిపత్యాశు ముహుర్ముహుర్దేహం ముహుశ్చరః ముహుర్ముహుస్త దాక్షేపాదాక్షేపక ఇతి స్మృతః సోఽపతానకసంజ్ఞో యః పాతయత్యంత రాఽంతర (సు.ని. 1/51)

ii) ముహురాక్షిపతి క్రుద్ధో గాత్రాణ్యాక్షేపకోఽనిలః పాణిపాదం చ సంశోష్య సిరాస్సస్నాయుకండరాః (చ.చి 28/50-54)

2. i) కఫాన్వితో భృశం వాయుస్థాస్వేవ యది తిష్ఠతి స దండవత్ స్తంభయతి కృచ్ఛ్రో దండాపతానకం (సు.ని. 1/52-53)

ii) పాణిపాదశిరఃపృష్ఠశ్రోణీః స్తభ్నాతి మారుతః దండవత్ స్తబ్ధగాత్రస్య దండకస్సోఽనుపక్రమః (చ.చి.28/51-52)

## అన్తరాయామాదులు

**హనుగ్రహము :-**

హనుమూలమున నున్నట్టి వాత ప్రకోపముచే హనుసంధి స్తంభించి అన్నము సేవించుటకు కష్టముగా నున్నచో దానిని హనుగ్రహము అందురు. హనుబంధనముల రెంటినుండి దవడ స్రంసనమునంది వివృతాస్యతను వేదన లేనటువంటి స్తబ్ధత్వమును కలిగించును. హనువును స్తంభింపచేసి సంవృతాస్యతను కలిగించిన అది హనుగ్రహమనబడును[1].

**ధనుస్తమ్భము**

ముందు చెప్పిన విధముగా ప్రకోపించిన వాతము చేత శరీరము ధనస్సువలె వంగిన యెడల అది ధనుస్తమ్భ వాతమనబడును.[2]

హనుగ్రహము, ధనుస్తమ్భము — ఈ లక్షణములు అన్తరాయామ బహిరాయామ వాతములకు సామాన్య లక్షణములుగా నుండును. Tetanusకు ఇది తుల్యముగా నుండును.

## అన్తరాయామ వాతము

బలముగా ప్రకోపించిన వాతము అంగుళులు రెండు మన్యానాడులు గుల్ఫము, ఉదరము, హృదయము, వక్షము, కంఠము — ఈ ప్రదేశముల నాశ్ర

---

1. i) హనుగ్రహ స్తదాఽత్యర్థ సోఽన్నం కృచ్ఛ్రాన్ని షేవతే (సు.ని 1/53)

ii) హనుమూలే స్థితో బంధాత్ సంస్రయత్యనిలో హనూ వివృతాస్యత్వమథవా కుర్యాత్ స్తబ్ధమవేదనమ్ హనుగ్రహం చ సంస్తభ్య హనుం సంవృతవక్త్రతామ్ (చ.చి. 28/19)

2. ధనుస్తుల్యం నమేద్యస్తు స ధనుః స్తంభసంజ్ఞకః (సు.ని. 1/54)

యించి శరీరమందలి సిరలు, స్నాయువులు, కండరములు వీనికి, వేగముగ ఆక్షేపములను కలిగించును. ఆసమయమునందు నేత్రములు నిశ్చలముగా నుండును. మన్యా స్తంభము లేక హను స్తంభము, పార్శ్వ భగ్నము కలుగును, కఫమును వాంతి చేసికొనును. శరీర మధ్య భాగము లోపలికి ధనస్సువలె వంగును. దీనిని అభ్యన్తరాయామము అందురు. పళ్ళు కొరకుచుండుట, వీపు వెనుకకు ఈడ్వబడుట, శిరోగ్రహము, జృంభ నోరుపట్టుకొని పోవుట—ఈలక్షణములును కలుగును.[1]

## బాహ్యాయామ వాతము :-

ముందు చెప్పబడిన విధముగా ప్రకోపించిన వాతము శరీరమునకు వెలుపలి వైపున ఉండు స్నాయు సిరా కండరాదులను ఆశ్రయించి శోషింపచేసి పృష్టమును గళమును వెనుకవైపునకు వంగునట్లు చేయును. వక్షము, కటి, ఊరువులను వెనుకకు వంచును. ఇది బాహ్యాయామమనబడును. ఇది అసాధ్యముగా నుండును. ధనువువలె శరీరము స్తంభించును. ఉరస్సు ముందునకు ఉబికి యుండును. మెడ కొంకులు స్తంభించును, గ్రీవము వక్రమగును. పళ్ళుకొరుకుచుండును. జృంభ, లాలాస్రావము, వాగ్గ్రహము—ఈ లక్షణములతో పాటు

---

1. i) అంగులీగుల్ఫజఠరహృద్వక్షోగలసంశ్రితః స్నాయుప్రతానమనిలో యదాఽఽక్షిపతి వేగవాన్ విష్టబ్ధాక్షః స్తబ్ధహనుర్భగ్నపార్శ్వః కఫం వమన్ అభ్యంతరం ధనురివ యదా నమతి మానవః తదాఽస్యాభ్యంతరాయామం కురుతే మారుతే బలీ (సు.ని. 1/54-56)

ii) మన్యేసంశ్రిత్యవాతోఽన్తః యదానాడీః ప్రపద్యతేమన్యా**స్తంభం**తదా కుర్యాత్ అన్తరాయామసంజ్ఞితమ్ అన్తరాయమ్యతే గ్రీవా మన్యా చ స్తభ్యతే భృశమ్ దన్తానాం దంశనం లాలావృష్ఠాక్షేపః శిరోగ్రహః జృంభావదనసంజ్ఞశ్చాఽప్యన్తరాయామ లక్షణమ్ (చ.చి. 28/44-45)

ఆవేగము కలిగి రోగి మరణించును. మరణము కలుగనప్పటికిని అంగవైకల్యము మాత్రము తప్పక కలుగును.[1]

**అభిఘాతజ అపతానకము :-**

దండము మొదలగువాని అభిఘాతముచే ఆక్షేపక వాతము కలిగిన అది అభిఘాతజ ఆక్షేపకమనబడును.[2]

## అక్షేపకాదులందు అసాధ్య లక్షణములు

గర్భపాతజనిత అధిక రక్తస్రావముచే జనించిన ఆక్షేప వాతము, అభిఘాతముచే జనించిన అపతానకము, అసాధ్యములుగా నుండును.[3]

అర్దితము మొదలగు ఆక్షేపయుక్త వ్యాధులందు వాతవేగము శమించిన రోగికి స్వస్థత కలుగును. కాని వాతవేగము నశింపక మరల ఆ వేగము కలిగి నచో కష్టకరమైన లక్షణములచే పీడింపబడును. ఈ వ్యాధులు సామాన్యముగా వర్జనీయములుగా నుండును.[4]

---

1. i) బాహ్యస్నాయుప్రతానస్థో బాహ్యాయామం కరోతి చ తమసాధ్యం బుధాః ప్రాహుర్వక్షః కట్యూరుభంజనమ్ (సు. ని. 1/57)

ii) పృష్టమన్యాశ్రితాః బాహ్యాః శోషయిత్వా సిరాః బలీ వాయుః కుర్యాద్ధమస్తంభం బహిరాయామసంజ్ఞకమ్ చాపవన్నామ్యమానస్య పృష్ఠతో నీయతే శిరః ఉర ఉత్క్షిప్యతే మన్యా స్తబ్ధా గ్రీవాఽవమృద్యతే దన్తానాం దంశనం జృంభా లాలాస్రావశ్చవాగ్గ్రహః జాతవేగో నిహన్త్యేషః వైకల్యం వా ప్రయచ్ఛతి (చ. చి. 28/44, 45)

2. కుర్యాదాక్షేపకం త్వన్యం చతుర్థ మభిఘాతజమ్ (సు. ని. 1/58)

3. గర్భపాతనిమిత్తశ్చ శోణితాతిస్రవాంజ యః అభిఘాతనిమత్తశ్చ న సిధ్యత్య పతానకః (సు. ని. 1/59)

4. స్వస్థస్స్యాదర్ధితాదీనాం ముహుర్వేగే గతేఽగతే పీడ్యతే పీడనైస్తైస్తైః భిషగేతాన్ వివర్జయేత్ (చ. చి. 28/52)

అపతానకమున రోగికన్నులు లోనికి ఈడ్చుకొని పోవుట, కనుబొమలు వక్రముగా నుండుట, మేఢ్రము ఏ విధముగాను ఉత్థితము కాకుండుట, స్వేదము, కంపము, ప్రలాపము, మంచముమీద నుండి క్రిందకు పడుట, బహిరాయామము ఈ లక్షణములు కలిగియున్న అపతానక రోగి చికిత్సకు అర్హుడుగా నుండడు అనగా అసాధ్యము.[1]

## ఆక్షేపక, అపతానకాదుల చికిత్స :-

ఆక్షేపక అపతానకాదులందు మొట్టమొదట స్నేహాభ్యంగము చేసి స్వేదన కర్మ చేయించి శిరఃశుద్ధి కొరకు తీక్ష్ణమగు అవపీడన నస్యము ప్రయోగింప వలెను.[2]

తదుపరి విదారి గంధాదిఘృతమును పానము చేయింపవలెను. దానివలన వికృత వాత మధికముగా శరీరములోనికి ప్రసరింపక నిరోధింపబడును.

భద్రదార్వాది వాతఘ్న గణ ద్రవ్యములు మొదలగు వానిచే సిద్ధము చేయ బడిన త్రైవృత ఘృతమును పరిషేకము, అవగాహము, అభ్యంగము, పానము, భోజనము, అనువాసనవస్తి, నస్యము, వీనికై ప్రయోగింపవలెను.

---

1. అపతానకినమ ప్రస్తాక్షమ వక్రభ్రువమ స్తబ్ధ మేఢ్రమస్వేదనమ వేపనమ ప్రలాపిన ముఖట్వపాతిన మబహిరాయామినం చోపక్రమేత్
(సు. చి. 5/17)

2. తత్ర ప్రాగేవ స్నేహాభ్యక్తం స్విన్నశరీర మవపీడనేన తీక్ష్ణేనోపక్రమేత శిరఃశుద్ధ్యర్థం అనన్తరం విదారిగంధాదిక్వాథ మాంసరసక్షీరదధిపక్వం సర్పిరచ్ఛం పాయయేత్ తథా హి నాతిమాత్రం వాయుః ప్రసరతి తతో భద్రదార్వాది వాతఘ్న గణ మాహృత్య తదేతత్త్రైవృత మపతానకినాం పరిషేకావగాహాభ్యంగ పానభోజనాను వాసన నస్యేషు విదధ్యాత్ యథో క్తైశ్చ స్వేదవిధానైః స్వేదయేత్ (సు. చి. 5/18)

స్వేదనములు :-

స్వేదన విధానము ననుసరించి స్వేదనము చేయింపవలెను. ఈ క్రింది స్వేదనములు గూడా అపతానకాదులందు హితకరముగా నుండును.

వాతము బలవత్తరముగా నున్నపుడు సుఖోష్ణముగా నుండు ఉముక, పొట్టు, ఎండుపేడ, కరీషము మొదలగు వానిచే నింపబడిన కూపము (గోయి) నందు మెడవరకు దింపి కప్పియుంచవలెను. లేక తప్తమైన భట్టీపైగాని లేక అరుగువలె నుండు రాతిపైగాని వేడిగానుండునపుడు సురను చల్లి తడిపి పైన మోదుగాకులు పరచి రోగిని పరుండబెట్టుట ద్వారా స్వేదనము చేయింపవలెను.

లేక కృశర, వేశవార పాయసాదులచే సుఖోష్ణముగా స్వేదనము చేయింపవలెను.

పరిషేకము :-

మూలకాది తైలమును పరిషేకాదులకు ఉపయోగింపవలెను.

పానములు :-

అపతానక రోగికి ఆహారము నివ్వక అమ్లదధియందు వసచూర్ణము, మరిచ చూర్ణము కలిపి త్రాగింపవలెను. లేక మరిచవస చూర్ణములను తైలము, ఘృత, వస మధు కలిపి త్రాగింపవలెను.

సంసృష్ట చికిత్స :-

వాతముతోపాటు ఇతర దోషములు సంసృష్టముగా నున్నచో ఆయా దోషానుసార చికిత్సలను గూడా కలిపి చేయవలసి యుండును.

వేగాన్తర సమయమునందు అవపీడక నస్యము ప్రయోగింపవలయును.

తామ్రచూడ, కర్కట, కృష్ణమత్స్య, శిశుమార, వరాహ- వీని వసను పానము చేయింపవలెను.

వాతహర సిద్ధక్షీరమును పానము చేయింపవలెను. లేక

యవ, కోల, కులుత్థ మూలకదధి, ఘృత, తైలాదులతో సిద్ధము చేయ బడిన యవాగును పానము చేయింపవలెను.[1]

## జీర్ణ అపతానక చికిత్స - శోధన చికిత్స :-

పది దినముల వరకు అపతానక వేగములు శాంతింపనిచో స్నేహకర్మ, విరేచనము, అస్థాపనము, అనువాసనవస్తి- ఈ చికిత్సలచే ఉపచరింపవలెను.

వాత వ్యాధులకు సామాన్యముగా చెప్పబడిన చికిత్సలను అవస్థానుసారము ప్రయోగింపవలెను. రక్షాకర్మలు చేయవలెను.[2]

---

1. అభుక్తవతా పీతమమ్లం దధి మరీచ వచాయుక్తం అపతానకం హన్తి తైలసర్పిర్వ సాక్షౌద్రాణి వా ఏవమ్చుద్ధవాతాపతానక విధానముక్తం సంసృష్టే సంసృష్టం కర్తవ్యమ్ వేగాన్తరేషుచావపీడం దద్యాత్ తామ్ర చూడ కర్కటకృష్ణమత్స్య శిశుమార వరాహవసా శ్చాసేవేత క్షీరాణి వా వాతహర సిద్ధాని యవకోలకులుత్థ మూలక దధి ఘృత తైలసిద్ధా వా యవాగూః (సు. చి. 5/18)

2. i) స్నేహ విరేచనాస్థాపనానువాసనైశ్చైవం దశరాత్రాహృతవేగముపక్ర మేత వాతవ్యాధి చికిత్సితం చావేక్షేత రక్షాకర్మ చ కుర్యాదితి (సు. చి. 5/18)

ii) హంతి ప్రాగ్భోజనాత్ పీతం దధ్యమ్లం సవచోషణమ్
అపాతానకమన్యోఽపి వాతవ్యాధిక్రమో హితః (చ. ద. 22/35)

ఇతర శామక యోగములు :-

1. హరీతక్యాది చూర్ణమును ఘృతముతో సేవింప చేయవలెను. (చ. ద)

అపతంత్రకము, అపస్మారము వాతవ్యాధులందు వివరింపబడిన యోగములను అవస్థానుసారము ప్రయోగింపవలెను.

ముఖ్యముగా రసరాజరసము, వాతకులాంతక రసము, బృహద్వాత చింతామణి రసము, చింతామణి చతుర్ముఖ రసము, బ్రాహ్మీవటి, సమీరపన్నగరసము, లక్ష్మీనారాయణ రసము, మహావాత విధ్వంసినీ రసము, స్వర్ణభూపతి రసము— రోగి రోగబలమును మొదలగు వానిని గమనించి వీనిని ప్రయోగింపవలయును.

జీర్ణావస్థలోను ఉపదంశాది లీనవిషజనిత స్థితులలోను అష్టమూర్తి రసాయనము, మల్ల సింధూరము, సమీర పన్నగరసము ప్రయోగింపవలెను.

## మన్యాస్తమ్భ చికిత్స

వక్షము, త్రికము, స్కన్ధము, మన్య వీని నాశ్రయించిన వాతమునందు వమనము, నస్యములచే ఉపచరింపవలెను.[1] పక్షాఘాతమున చెప్పిన క్రియలు విశేషించి వాతశ్లేష్మహర నస్యములు రూక్ష స్వేదములు ప్రయోగ్యము.[2]

మన్యాస్తమ్భమున విశేషించి పంచమూల క్వాథమును గాని దశమూల క్వాథమును కాని పానము చేయింపవలెను. రూక్షస్వేదము చేయింపవలెను.[2]

---

1. వక్షస్త్రికస్కన్ధగతం వాయుః మన్యాగతం తథా
   వమనం హంతి నస్యంచ కుశలేన ప్రయోజితః (చ. ద)

2. మన్యాస్తంభేఽప్యేతదేవ విధానం విశేషతో వాతశ్లేష్మ హరైర్నస్యై
   రూక్ష స్వేదైశ్చోపచరేత్ (సు. చి. 5/20)

యోగరాజ గుగ్గులు, వాతగంజాంకుశము, త్రయోదశాంగ గుగ్గులు, మొదలగు వానిలో తగిన ఔషధములను మహారాస్నాదిక్వాథముతో ఇవ్వవలెను.

వాతహర తైలములతో అభ్యంగము చేయించి సాల్వణ ఉపనాహము చేయింపవలెను.

## గ్రీవాస్తమ్భ చికిత్స

గ్రీవాస్తమ్భమున ప్రారంభమున సర్షప తైలముతో అభ్యంగనము చేయించి అశ్వగంధను గోమూత్రముతో నూరి లేపనము చేయించిన తీవ్రశూలతో కూడిన గ్రీవాస్తమ్భము శమించును.[1]

## హనుస్తమ్భ చికిత్స

హనుప్రదేశము స్తంభించుటచే ముఖము తెరచుకొని యున్నచో హను ప్రదేశమునందు స్వేదనము చేయించి బాగుగా స్వేదనము జరిగిన తదుపరి అంగుష్టములచే గట్టిగా నొక్కిపట్టి చూపుడు వేళ్ళచే జారిన దవడను పైకెత్తి గడ్డమును పైకి నొక్కి హనుసంధిని స్వస్థానమునకు వచ్చునట్లు చేయవలెను.

నోరుమూసుకొని యుండి తెరచుటకు వీలుకాక స్తమ్భించి యున్నచో స్వేదనము చేయించి మెల్లగా తెపవవలెను.[2]

---

1. i) పంచమూలీకృతః క్వాథో దశమూలీకృతోఽథవా
రూక్షః స్వేదస్తథా నస్యం మన్యాస్తంభే ప్రశస్యతే (భై. ర. 26/25)

ii) కటుతైలేనాభ్యక్తే తప్తే కల్కేన వాజిగంధాయాః
శామ్యేద్ గ్రీవాస్తంభః శూలం మహదప్యనాయాసమ్ (భై. ర. 26/26)

2. వ్యాత్తాననే హనుం స్విన్నాం అంగుష్ఠాభ్యాం ప్రపీడ్యచ
ప్రదేశినీభ్యాం చోన్నామ్య చిబుకోన్నామనం హితం
ప్రస్తం స్వం గమయేత్ స్థానం స్తబ్ధం స్విన్నం వినామయేత్
(చ. చి. 28/102-103)

ఔషధములు :-

1. పిప్పలి ఆర్ద్రికము మాటిమాటికి నమలుచు ఉష్ణోదకముతో ష్ఠీవనము చేయించి ముఖ శోధన చేయుచున్న హనుగ్రహము శమించును.

2. లశునము, సైంధవము, తిలతైలము కలిపి సేవింపచేయవలెను.

3. రసోనము, మాషవిదళములు, సైంధవ ఆర్ద్రిక, హింగు కలిపి పిష్టము చేసి వడలవలె తైలమును పాకము చేయించి సేవింప చేయవలెను.

4. ప్రసారిణీ తైలముతో అభ్యంగము, శిరోవస్తి చేయింపవలెను.[1]

## శిరోగ్రహ చికిత్స

శిరోగతవాతమునకు చెప్పబడిన చికిత్సలు చేయవలెను. దశమూల మాతులుంగ సిద్ధతైలాభ్యంగము చేయింపవలెను. శిరోవస్తి చేయింపవలెను.

## ధనుర్వాతాది చికిత్స

బాహ్యాయామము, అంతరాయామము, ధనుస్తంభము కుబ్జకము మొదలగు వ్యాధులందు గూడా వాతవ్యాధి సామాన్య చికిత్సలచే ఉపచరించుచు ప్రసారణీ తైలమును ప్రయోగింపవలెను.[2]

ధనుర్వాతమునందు విశేషించి పూయవ్రణములచే కలిగినపుడు ఏకాంగ వీరరసము, లేక తాప్యాదిలోహము, కాలకూట రసము వీనిని అవస్థాను సారము ప్రయోగింపవలెను.

---

1. భా.ప్ర. వాతవ్యాధి చికిత్స Page 502-503.
2. బాహ్యాయామేంతరాయామే ధనుస్తంభే చ కుబ్జకే
యోఽయం ప్రసారిణీతైలం తేన తేషాం శమో భవేత్
వాతవ్యాధిషు సామాన్యాః యాః క్రియాః కథితాః పురా
కర్తవ్యా ఏవ తా స్సర్వాస్తైలమేతద్విశేషతః (భా.ప్ర. 545)

# గృధ్రసీ వాతము

## గృధ్రసీవాత లక్షణములు

### సామాన్య లక్షణములు

స్తబ్ధత, వేదన, తోద (చురుకులు) సుప్తత, లాగినట్లుండుట - ఈ లక్షణములు తుంటి నుండి ప్రారంభమై కటిప్రదేశమునకు, వృష్ఠభాగమునకు క్రమముగా తొడలు, మోకాళ్ళు, పిక్కలు తదుపరి పాదములకు వ్యాపించుచు ఆయా భాగములందు మాటిమాటికి స్పందనమును కలిగించుట, పార్ష్ణి (మడమ) పాదాంగుళుల వరకు గల కండరములు వాతముచే వికృతి నొందుట వలన తొడలను పైకెత్తుటకు (ఉత్క్షేపమునకు) అవక్షేపమునకు అవరోధము కలుగును.[1]

## గృధ్రసీ భేదములు

గృధ్రసీ రెండు విధములుగా నుండును.

1. వాతజము. 2. వాతకఫజము.

## వాతజ గృధ్రసీ లక్షణములు

అధికమైన తోద (సూదులతో పొడిచినట్లు బాధ) శరీరము వక్రమగుట (Scoliosis) జానువుల (మోకాళ్ళు),పిక్కలు, ఊరువులు, సంధులు ఇవి అధి

---

1. i) స్ఫిక్పూర్వా కటిపృష్ఠోరుజానుజంఘాపదంక్రమాత్ గృధ్రసీ స్తంభరుక్తోదైః
గృహ్ణాతి స్పందతే మృదుః వాతాత్ వాతకఫా త్తంద్రాగౌరవాఽరోచకాన్వితా
(చ. చి. 28/56)

ii) పార్ష్ణిప్రత్యంగులీనాం తు కండరా యాఽనిలార్దితా
సక్థ్నః క్షేపం నిగృహ్ణీయాద్ గృధ్రసీతి హి సా స్మృతా
(సు. ని. 1/74)

iii) అ. సం. ని. 5/56

కముగా స్ఫురించుట.(అదరుట), స్తంభించియుండుట - ఈ లక్షణములు వాతజ గృధ్రసీయందు కలుగును.

## వాతశ్లేష్మజ గృధ్రసీ లక్షణములు

శరీర గౌరవము, అగ్నిమాంద్యము, తంద్ర, ప్రసేకము, అన్న ద్వేషము, అరుచి ఈ లక్షణములు కలిగియుండును.[1]

ఖల్లీ-గృధ్రసీయందు తీవ్రవేదన యున్నచో ఖల్లీ అనబడును.

గృధ్రసీ వాతము, కటివాత అనంతరముగాని లేక ప్రారంభము నుండియే గాని 30 నుండి 50 సంవత్సరముల వయస్సు గలవారిలో అతి సాధారణముగా కలుగు వాత వ్యాధి.

కటివాతముతో గూడ కలిపి చూచినచో మధ్య వయస్కులలో నూటికి 30 నుండి 90 వరకు ఈ వ్యాధిని అనుభవించి యుందురని పరిశోధకుల అంచనా, ఇది మధ్య వయస్కులలో అధికమగుట చేత ఈ వ్యాధి మాటిమాటికి బాధపెట్టుట ఈ కారణముల వలన వారు పనులకు గైరు హాజరగుట వలన కలుగు కార్మిక లేక ఉత్పత్తి నష్టము ఎంతో ఎక్కువగా నుండునని అంచనా వేయబడినది.

కటిగ్రహము కటివాతము మొదలగునవి దీనికి పూర్వరూపములుగా కలుగుచుండును.

---

1. i) వాతజాయాం భవేత్తోదో దేహస్యాపి ప్రవక్రతా జానుకట్యూరు సంధీనాం స్ఫురణం స్తబ్ధతా భృశమ్ వాతశ్లేష్మోద్భవాయాం తు నిమిత్తం వహ్ని మార్దవం తంద్రా ముఖప్రసేకశ్చ భక్తద్వేషస్తథైవ చ

(భా. ప్ర. వా. వ్యాధిచికిత్స. 533)

ii) సైవాపి గృధ్రసీచోక్తా ఖల్లీ తీవ్రరుజాన్వితా (అ. సం. 15/57)

## పర్యాయములు

ఆయుర్వేద వాఙ్మయమునందు ఈ వ్యాధికి ఈ క్రింది పర్యాయ పదములు ప్రయోగింపబడినవి.

1. గృధ్రసీ
2. రింఘిణి
3. రంధ్రణీ
4. రాధన

ముఖ్యముగా సంహితాకారులు సంగ్రహ కారులు, అధికముగా ప్రయోగించిన పదము "గృధ్రసీ" మాత్రమే.

## నిర్వచనములు

గృధ్రసీ-గృధ్ర అనగా గద్ద అనబడు పక్షి. ఈ వ్యాధియందు రోగి గద్దవలె ఒక కాలును పట్టి పట్టి నడుచును. కనుక గద్దవంటి నడకను కలిగించు వ్యాధి అగుటచే గృధ్రసీ అను పేరు వచ్చి యుండవచ్చును.

గృధ్రసీ నాడి లేక సియాటిక్ నర్వ్ గద్దముక్కువలె వంకర తిరిగి యుండును. అందుచేత ఆ నాడికి గృధ్రసీనాడి అని పేరు అదేనాడి నాశ్రయించి కలుగు వ్యాధి కనుక ఈ వ్యాధికి గృధసీవాతము అనుపేరును ఇవ్వబడినదని హరి యొక అభిప్రాయము.

**2. రింఘిణి** :- వాచస్పతి మిశ్ర మాధవనిదాన వ్యాఖ్యయందు ఈ శబ్దమును గృధ్రసికై ప్రయోగించెను. ఈ పదము స్ఖలనమును సూచించును. కటిక శేరు కాంతర త్రయజాస్థి స్ఖలన సూచకముగా దీనిని ప్రయోగించి యుండవచ్చును.

**3. రంధ్రణి** :- డల్హణుడు ఈ పదము ప్రయోగించెను. (సు.ని 1/75) ఈ పదము దుర్బలత్వమును సూచించును. కటీక శేరు కాంతర తరుణాస్థి దౌర్బల్య తకు ఇది సూచకము.

**4. రాధనా** :- శారంగధర సంహితపై గూడార్థ దీపికా వ్యాఖ్యానమున ఈ పదము ప్రయోగించబడినది. ఈ పదము వత్తిడిని, పీడనమును సూచించును.

మొత్తము మీద ఈ పర్యాయ పదములన్నియు గృధ్రసీ వాతమున ఆధుని కులచే గమనింపబడిన సంప్రాప్తి, నిదానములలోని అంశములను సూచించునవిగా నుండుట గమనించ దగిన విషయము.

ఆధునిక వైద్యము నందు సియాటికా వ్యాధి గృధ్రసీ వాతమునకు సరిపోలు వ్యాధి. లుమ్బాగో సియాటికా సిండ్రోమ్, హెర్నియేటెడ్ న్యూక్లియస్ పల్పోసస్, డిస్క్ ప్రోట్రూజన్, అనునవి సమానార్థ సూచకములుగా వాడబడును.

వేరు వేరు పదములు పయోగించుట సందిగ్ధతకు కారణమగునను ఉద్దేశ్య ముతో అట్టి సందిగ్ధత నివారణకై ఇటీవల అమెరికన్ అకాడమీ ఆఫ్ ఆర్థోపెడిక్ సర్జన్సు ప్రామాణికమైన పదజాలమును నిర్ధారించిరి. వారి పదజాలముపై ఆధారిత మైన లోబాక్ డిసార్డర్స్ (కటి వాతాది వ్యాధుల) విభజన ఈ క్రిందఇవ్వబడినది.[1]

తీవ్రావస్థ :- 0-3 నెలల కాలము ఆకస్మిక వ్యాధ్యుత్పత్తి.

మధ్య తీవ్రావస్థ (Sub acute) :- 0-3 నెలలు క్రమాను గత వ్యాధు త్పత్తి.

జీర్ణావస్థ :- మూడు నెలలకు మించిన కాలము.

పునారావర్తకావస్థ :- పూర్తిగా శమించుట మరల మరల సంప్రాప్తించుట.

---

1. Adult Arthopaedics : Richard cruess Etal (1936) Churchill Edvinstone.

**లక్షణములు :-**

**మృదు కటిశూల :-** కటిగ్రహము, కటిదౌర్బల్యము కటిప్రదేశమును కదలించుట, వంగుట పక్కకు తిరుగుట వంటి కదలికల వలన బాధ, వేదనా శామక ఔషధములు వాడవలసినంత తీవ్రవేదన లేకపోవుట. వేదన కటిభాగమునకు మాత్రము నియమితమై ఉండుట.

**కటి త్రికశూల :-** (లోబాక్ పైన్) కటి ప్రదేశమున వేదన బాధ పరిమితముగా ఉన్నప్పటికిని అపుడపుడు వేదన ఊరు భాగములకు ప్రసరించు చుండుట. తీవ్రావస్తలో ఏ మాత్రము కటి ప్రదేశమును కదల్చినను వేదన అధికమగుట కాని జీర్ణావస్తలో కటిక శేరుకలకు సంబంధించిన కొన్ని ప్రత్యేకమైన కదలికల వలన మాత్రమే వేదనాధిక్యత కలుగుట, నాడీ వికార సంబంధ లక్షణములు మాత్రము కలుగవు. ఇది మంద, తీవ్ర, జీర్ణావస్థలను కలిగియుండును.

**మందావస్థలో :-** మంద వేదన కదలికల వలన మాత్రమే కలుగు చుండును.

సక్థ్యుత్క్షేపము (కాలు పైకి లేపినపుడు) కటిప్రదేశమున వేదన కలుగదు.

**తీవ్రా వస్థలో :-** పక్కలకు తిరుగుట వలన వేదనాధిక్యత, కటిగత పేశీలపై ఉద్విగ్నత, కదలికలో అవరోధము కదలికలవలన వేదనాధిక్యత, పాద ఉత్క్షేపమున అవరోధము, దగ్గుట, ముక్కుట, తుమ్ముట మొదలైన క్రియలచే వేదన అధికమగుట—ఈ లక్షణములు కలుగును.

జీర్ణావస్థ :- కటి ప్రదేశమును స్పృశించుట వలన అపుడపుడు వేదన, గతి యందు అవరోధము, పాద ఉత్క్షేపమునందు అవరోధము.

గృధ్రసీ :- బాధ ప్రసరణశీల వేదన ఒకే పాదమునగాని రెండు పాదములకుగాని తొడల క్రిందివరకు కలుగుచుండును. తీవ్రావస్థలో ఏ కొంచెము కదలికజనను బాధను అధికము చేయును. కాని జీర్ణావస్థలో కొన్ని కదలికల వలన

మాత్రమే వేదన అధికమగును. లక్షణములు ఆకస్మికముగా గాని లేక ప్రారంభ మైన తదుపరి కొంతకాలమునకు ఏర్పడుటగాని జరుగును. రెండు పాదములందు గాని లేక ఒకే పాదమునందుగాని సుప్తత, తోద, దౌర్బల్యము సాధారణముగా అనువర్తించి యుండును.

స్పర్శనముచే కటి, పాదములందు వేదనయుండును. పాద ఉత్క్షేపమునందు అవరోధముండును. నాడీ వికార సంబంధిత లక్షణములు గూడా యుండును.

**కటిత్రిక శూల మరియు గృధ్రసీ :-** పైన వేర్వేరుగా పేర్కొనబడిన ఈ రెండింటి లక్షణ సముచ్చయములు కలసి యుండుట.

**నిదానము :-**

గృధ్రసీ వాతమునకు ప్రత్యేక నిదానము వర్ణింపబడక పోవుటవలన వాత వ్యాధులకు చెప్పబడిన సామాన్య నిదానమే గృధ్రసీ వాతమునకు గూడా వర్తిం చును.

వాత వ్యాధులకు చెప్పబడిన నిదానములలోనే కొన్ని ప్రత్యేకముగా గృధ్రసీ నిదానమున ప్రముఖ పాత్ర వహించునని ఇటీవల జరిగిన ఆధునిక పరి శోధనలు నిరూపించినవి. వానిలో కొన్ని ముఖ్యమైనవి క్రింద పేర్కొన బడినవి.

**ఆహార సంబంధ కారణములు :-**

ఆహార లోపము, అనశనము వలన గృధ్రసీ నాడికి పోషణ జరుగక ప్రవాహము కలుగును. గురు స్నిగ్ధ ఆహార అధిక సేవనగూడా శైథిల్యావస్థ (డి జనరేషన్) ను ప్రేరేపించును.

**మానసిక కారణములు :-**

మానసిక ఒత్తిడులు, ఉద్వేగము, భయము, నిరాశ, మొదలగు కారణ ములు దీర్ఘ కాలిక కటిగత పేశీ సంకోచమునకు దారి తీయుటచే కటి దౌర్బల్యము, వేదన, పాదవేదనకు క్రమముగా కారణమగును.

శారీరక స్థితి మొదలగునవి—విషమ ఆసనము, శయనము, విషమస్థితిలో నుల్చొనుట, దగ్గుట, శరీరమును వక్రముగా నుంచుట.

అభిఘాతములు, దూకుట, పరుగెత్తుట అధికమైన భారము మోయుట, ముఖ్యముగా శరీరమును విషమస్థితిలో ఉంచి అధిక భారము మోయుట, పడుట, కుకుందరమర్మ, కూర్చమర్మ గుల్ఫమర్మ వీనిపై అభిఘాతము కల్గుట; ఉత్పిష్ట, వివర్తిత భగ్నములు.

**ఇతర కారణములు :-**

అవ్యాయామము, గర్భిణి, మధుమేహజన్య నాడీ వికృతులు, రాజయక్ష్మ జన్య వికృతి, ఉపదంశము, ఆమవాత, వాతరక్తజ వికృతి.

**సంప్రాప్తి :-**

పైన చెప్పబడిన కారణములచే వాతము ప్రకోపించి కటికశేరు కాంతర తరుణాస్థి ఫలకములను ఆశ్రయించి వానిని తమస్థానమునుండి చ్యుతము చేయును. వానియందు పగుళ్ళను కలిగించి లోపలనుండి శ్లేష్మమును బయటకు వచ్చునట్లు చేయును. అట్టి శ్లేష్మము పృష్టను వైపునకు పొడుచుకొని వచ్చినపుడు పృష్టము వైపున దీర్ఘముగా నుండు స్నాయువులపై వత్తిడి కలిగి పృష్టనాడీ కవచము (Dura metter)ను స్పృశించును.

ఈ స్థితిలో పూర్వ రూపములనదగిన కటివాతము, కటి గ్రహము వంటి లక్షణములు కలుగును.

శ్లేష్మము అధికముగా బయల్వెడలుట తరుణాస్థి ఫలకము అధికముగా చిట్లుట జరిగినపుడు దాని తీవ్రతనుస్థానమును అనుసరించి, దాని ప్రత్తికి లోనగు నాడీ తంతువులను అనుసరించియు గృధ్రసీ అనుబంధ లక్షణములు మారు చుండును. ఆయా కటికశేరు కాంతర తరుణాస్థి చ్యుతములననుసరించి లక్షణములు మారుచుండును.

పృష్ఠచ్యుతము అల్పముగా జరిగినపుడు మోకాళ్ళపై గొంతుక కూర్చున్నపుడు వంగి బరువు ఎత్తునపుడు, లేచునపుడు కటియందు వేదన కలుగును. నిలబడినపుడు విశ్రాంతిగా నున్నపుడు వేదన ఉండదు.

అధిక పృష్ఠచ్యుతమున తీవ్రకటిశూల వేదన పాదమునకు ఉదరమునకు ప్రసరించుట, దగ్గు, తుమ్ముల వలన వేదనాధిక్యత కలుగును.

పృష్ఠస్నాయువునకు అభిఘాతము కలిగి కౌడా యీక్వినా, నితంబనాదులు గృధ్రసీనాడి ఇవి రెండు పార్శ్వములందు అత్యధిక తరుణాస్థిచ్యుతము వలన పీడింపబడినపుడు ఉభయ పార్శ్వ గృధ్రసీ కలుగును. వస్తికి క్రియానాశము కలుగును. మూత్రము తెలియకుండనే పోవుట జరుగును.

పార్శ్వ పృష్ఠచ్యుతి వలన అప్పుడప్పుడు కటివాతము, క్రమముగా ఏకపాద వేదన కలుగును. సామాన్య గృధ్రసీ లక్షణములు కలుగును.

గృధ్రసీ ముఖ్యముగా 5వ కటినాడి మొదటి నితంబనాడీ తంతువులు దుష్టి చెందినపుడు కలుగును. ప్రథమ, ద్వితీయ- తృతీయ, కటినాడుల వలన కలుగు లక్షణములు ప్రధానముగా కటి పురోభాగమునకు వంక్షణ నాభి భాగమునకు మాత్రము పరిమితమై యుండును.

రెండవ కటినాడి దూషింపబడినపుడు కటివేదన వంక్షణ భాగము వరకు వ్యాపించుచు ఉండును. తొడకు ముందు భాగమున వంక్షణమునందు సుప్తత, స్పర్శానాశము ఉండును.

మూడవ కటినాడి దూషింపబడినపుడు ఊరువునకు పురోభాగమునకు మధ్య భాగమునకు జాను మధ్యభాగమునకు వేదన, సుప్తత స్పర్శానాశము కలుగును. వెల్లికిల పరుండి పాదమును పైకెత్తుటకు బోర్లపడుకొని మోకాలి వద్ద వెనుకకు వంచుట కష్టముగా నుండును.

నాల్గవకటి నాడి దూషింపబడినపుడు లక్షణములు పిక్కల వరకు వ్యాపించి యుండును. మెడను వంచినచో రెండు కాళ్ళ పైకెత్తుట అవరోధింపబడును.

ఐదవ కటినాడి దూషింపబడినపుడు గుల్ఫము, పాదములు, అంగుష్ఠము, వరకు వేదన సుస్తత వ్యాపించును. రెండవ వేలు పృష్ఠభాగమున స్పర్శానాశము కొందరియందు పాదము వేలబడి పోవుట మొదలగు లక్షణములు కలుగును. వ్యాధితమైన పాదమున ఉత్క్షేపణము అవరోధింపబడును.

ప్రథమ నితంబనాడి దూషింపబడినపుడును యించు మించు యివే లక్షణములు కలుగును.

## వ్యాధి నిర్ణయము

నడకగతి, శరీర అవయవములస్థితి, వక్రత, స్తబ్ధత, పాద ఆకుంచన ప్రసారణ, ఉత్క్షేపణ, అవక్షేపణములు బాగుగా పరీక్షించి వ్యాధి నిర్ణయము చేయవలెను.

మాంసపేశీలు, స్పర్శ-వీనిని పరీక్షింపవలెను. సాధారణ స్థితిలో వెల్లికిల పడుకొని పాదమును 90° వరకు పైకి లేపగలిగి ఉండవలెను. లేనిచో వికృతి చెందినట్లు భావింపవలసి యుండును. స్ట్రైట్ లెగ్ రైజింగ్ టెస్ట్ అందురు.

బోర్లా పడుకొని మోకాలును వంచుట చేయించి పరీక్షింపవలెను.

రక్త, మూత్ర పరీక్షలు, కటిప్రదేశ X రే పరీక్ష, సి. ఏ. టి మొదలగు పరీక్షలు వ్యాధి కారణమును తీవ్రతను నిర్ణయించుటకు సహకరించును.[1]

ఊరుస్తంభము, సంధివాతము, వీనినుండి గృధ్రసీని వేరు చేయవలసి యుండును.

---

1. i) Richard Cruess Etal (1936) Adult Arthopaedics : Churchill

   ii) Cyriese J. Livingstone - Text book of Arthopaedic medicine.

పాదదాహము, పాదహర్షము, మొదలగు వానినుండి గూడా గృధ్రసీ వేరు చేయవలసిన అవసరము ఒక్కొక్కపుడు కలుగు చుండును.

## గృధ్రసీ చికిత్స

గృధ్రసీ వ్యాధియందు ప్రారంభమున వమనము చేతగాని విరేచనముచే గాని శోధనలు, పాచన క్రియలు నిరామముగ నుండి అగ్ని దీప్తి కలిగించిన తదుపరి వస్తికర్మ చేయింపవలెను. ప్రారంభమున ఊర్ధ్వ శోధనము చేసిన తదుపరియే వస్తికర్మ చేయింపవలెను. అట్లు చేయనిచో బూడిదలో పోసినట్లు స్నేహము నిరర్ధకమగును.[1]

సిరావ్యధనము గుల్ఫ కండరమునకు మధ్యనుండు సిరను వ్యధనము చేయవలెను. అదే ప్రదేశమున అగ్ని కర్మను చేయుట గూడా ప్రశస్తముగా నుండును.

---

1. i) అన్తరాకండరా గుల్ఫం సిరావస్త్యగ్ని కర్మచ గృధ్రసీషు ప్రయుంజీత ఖల్లాం తూష్ణోపనాహనమ్ పాయసైః కృసరైర్మాంసైః శస్తం తైల ఘృతాన్వితైః (చ. చి. 28/101-102)

ii) చక్రపాణి పైదానికి

iii) గృధ్రసీ విశ్వాచీ క్రోష్టుక శిరః ఖంజ పంగులవాత కంటక పాదదాహ పాదహర్షాపబాహుక బాధిర్య ధమనీగత వాతరోగేషు యధోక్తం యధోద్దేశం చ సిరావ్యధనం కుర్యాత్ అన్యత్రావబాహుకాత్ వాతవ్యాధి చికిత్సితం చావేక్షేత (సు. చి. 5/23)

iv) గృధ్రసీస్యార్తం సమ్యక్ పాచనాద్యై విశోధితమ్ జ్ఞాత్వోదరం ప్రదీప్తాగ్నిం వస్తిభిః సముపాచరేత్ నాదౌవస్తివిధిం కుర్యాద్ యావదూర్ధ్వం న శుద్ధ్యతి స్నేహో నిరర్ధకం స్తస్యభస్మన్యేవాహుతిర్యధా (చక్ర. దత్త)

v) గృధ్యస్యార్తం వరం సమ్యగ్రేకేణ వమనేన వా జ్ఞాత్వా విరామం దీప్తాగ్నిం వస్తిభిస్సముపాచరేత్ (భా. ప్ర.)

## శస్త్రకర్మ

జంఘా ప్రదేశమున స్నేహ స్వేదములు చేయించి పాదమును బాగుగా మర్దించి గృధ్రసీని మెల్ల మెల్లగా కనిష్ఠికా అంగుళి కండరములోనికి నేర్పుగ గ్రంథివలె వచ్చునట్లు చేసి దానిని శస్త్రముచే విదారణముచేసి ప్రవాళాంకురమువలె నుండు దానిని గుర్తించి తీసివేసి అస్థానమునందు అగ్ని కర్మను చేయవలెను. తదుపరి యష్టిమధుకము చన్దనము వీని కల్కమును లేపనము చేయవలెను.

ఇంద్రవస్తి మర్మకు నాలుగంగుళములు క్రింద సిరావ్యధనము చేయవలెను.

ఈ క్రియలన్నింటిని చేసినను శమించనిచో కనిష్ఠికాంగుళిపై దాహకర్మ చేయవలెను,

## శామక యోగములు

1. ఏరండ తైలము గోమూత్రము కలిపి పిప్పలీ చూర్ణయుక్తముగా త్రాగవలెను. దీర్ఘకాలజ వాతకఫజ గృధ్రసీ శమించును.

2. తగర మూలము త్రకముతో నూరి పానము చేయింపవలెను.

3. దశమూల కషాయముతో గాని శొంఠి కషాయముతోగాని ఏరండ తైలము కలిపి సేవింప చేయవలెను.

4. బృహన్నింబ సారము నీటితో పానము చేసిన అసాధ్య గృధ్రసీ గూడా శమించును.

5. శేఫాలీ పత్రక్వాథము సేవించిన దుస్తరమైన గృధ్రసీ గూడా శమించును.

6. ఏరండ బీజకల్కసిద్ధ క్షీరపానముచే గృధ్రసీ, కటిశూల శమించును.

7. ఏరండ మూలాది క్వాథముచే వంక్షణ వస్తి గృధ్రసీ శూలలు శమించును.

8. సహస్ర్యాది క్వాథము ఏరండ తైలంతో సేవించిన నష్టగతి, సుప్తతతో కూడిన గృధ్రసీ గూడా శీఘ్రముగా శమించును. శీఘ్రగతికల వాడగును.

9. రాస్నా సప్తక క్వాథము జంఘ ఊరుపృష్ఠ త్రికపార్శ్వ శూలలతో గూడిన గృధ్రసీని శమింపచేయును. (భా. ప్ర.)

10. వాజి గంధాది తైలము (యో. ర.) పానమునకు వస్తికి ప్రయోగించిన గృధ్రసీ శమించును.

11. సైంధవాది తైలము (యో. ర.) పై విధముగనే గృధ్రసీ శామకము.

12. ఆభాది చూర్ణము (యో. ర.) అస్థి, సంధి, స్నాయు మజ్జాగత వాతములను కటిగ్రహము, గృధ్రసీ వీనిని శమింప చేయును.

13. పథ్యాది గుగ్గులు (భా. ప్ర.)

14. త్రయోదశాంగ గుగ్గులు, ద్వాత్రింశతి గుగ్గులు, షడశీతి గుగ్గులు, సింహనాద గుగ్గులు, ఆభాగుగ్గులు, లాక్షాది గుగ్గులు-వీనిని అవస్థాను సారము ప్రయోగింప వచ్చును.

15. రసోన సిండము, కుబేరపాక, లశునపాక, ఏరండపాక మొదలగునవి అవస్థానుసారం ప్రయోగ్యము.

గృధ్రసీయందు వస్తి కర్మకై సైంధవాది తైలము, బలాతైలము, ప్రసారిణీ తైలము, మహానారాయణ తైలము మొదలగునవి వాడదగును.

## బాహ్య ప్రయోగములు

గుంజాఫల లేపము గృధ్రసీ హరముగా మంచిపని చేయును.

విషగర్భ తైలము, రాస్నా పూతీక తైలము పైనవస్తి కొరకై చెప్పబడిన తైలములు, నిర్గుండీ తైలము. ఇవి అభ్యంగమునకు ప్రయోగింపదగెను.

### ఇతర ఔషధములు

కుబ్జ వినోదరసము (ర. ర. స.) వాతగజాంకుశము (భై. ర.) వాత గజేంద్ర సింహరసము (భై. ర.) వాతరాక్షసము గుంజా గర్భరసము (యో.ర.) మొదలగునవి ప్రయోగింపవచ్చును.

భుజంగా సనము గృధ్రసీ, కటిశూలలను శమింప చేయుటలో ప్రశస్త ముగా నుండును.

## విశ్వాచీ వాతము

బాహువు యొక్క పృష్ట పై భాగము నుండి చేతివేళ్ళ యొక్క పై భాగము వరకు వ్యాపించియుండు కండరము (లేక మహాస్నాయువు Brachial nerve) ను ప్రకోపించిన వాతము ఆశ్రయించి వేదన తోదలను కలిగించుచు హస్తము యొక్క ఆకుంచన ప్రసారణాది కర్మలను క్షీణింప చేయును. ఈ వ్యాధిని విశ్వాచీ అందురు.[1]

ఈ వ్యాధి మన్యా ప్రదేశమందలి పృష్ట వంశ కశేరు కాంతర తరుణాస్థి ఫలకముల చ్యుతి వలన గృధసీ వలెనే కలుగు అవస్థ. హస్తగత నాడులు దూషింప బడుట వత్తిడి కలుగుట వలన ఈ వ్యాధి కలుగును.

చికిత్స :

1. విధిననుసరించి సిరావ్యధనము చేయింపవలయును. వాతనాశకమైన ఇతర క్రియలు చేయవలెను.[2]

---

1 (i) తలం ప్రత్యంగులీనాం తు కండరా బాహుపృష్ఠతః
వాహ్వోః కర్మక్షయకరీ విశ్వాచీతి హి సా స్మృతా (సు.ని.1/75)

2 సు. చి. 5/23

2. దశ మూలములు, బలా, మాష వీనిక్వాథమున తైలము ఘృతము కలిపి సాయంకాలమున భోజనానంతరము పానము, నస్యము చేయించిన విశ్వాచీ వాతము శమించును. అపబాహుకమును హరించును.

3. మాషాదితైలము భోజనాంతరము పానము చేసిన బాహుశోష, అపబాహుక, విశ్వాచీ పక్ష ఘాతాదులు శమించును.[3]

4. ప్రతాప లంకేశ్వర రసము, లక్ష్మీ విలాసము అవస్థానుసారము ఇవ్వవలెను. (ర. తం. సా)

## ఖల్లీ వాతము

తీవ్రమైన వేదనతో కూడిన గృధ్రసీ, విశ్వచీ వాతములు ఖల్లీ అనబడును.

ఖల్లీ యందు పాదములు పిక్కలు, తొడలు, చేయి యొక్క మూలము- వీటన్నింటియందు మెలిపెట్టుచున్నట్లు బాధ కలుగును.[2]

### ఖల్లీ వాత చికిత్స

ఖల్లీవ్యాధియందు తైలము, ఘృతము కలిపిన పాయసము, కృశరము మాంసము, వీనిని సుఖోష్ణముగా ఉపనాహముగా ప్రయోగింపవలెను.[3]

---

1 (i) చ. ద. (ii) భా ప్ర. వాతవ్యాధి చికిత్స

2 (i) విశ్వచీ గృధ్రసీచోక్తా ఖల్లీ తత్ర రుజాన్వితా (అ. సం. ని. 15/57)

(ii) ఖల్లీ తు పాదజంఘోరుకరమూలావమోటనీ (చ.చి. 28/57)

3 ఖల్లాంతూష్ణోపనాహనం పాయసైః కృసరైర్మాంసైఃశస్తం తైలఘృతాన్వితైః చ.చి. 28/101)

స్నిగ్ధ, ఆమ్ల, లవణ ద్రవ్యములతో చేర్చిన స్వేదనములు, మర్దనములు, ఉపనాహములు ప్రయోగింపవలెను.[1]

కుష్టము సైంధవ లవణము కల్కముచేసి చుక్రతైలముతో కలిపి సుఖోష్ణముగా మర్దన చేసిన ఖల్లీశూల శమించును.[2]

ప్రతాప లంకేశ్వర రసము స్వర్ణ ప్రధాన లక్ష్మీ విలాస రసము ఆవస్థాను సారము ఇవ్వవలెను. (ర. తం.సా)

## క్రోష్టుక శీర్షక వాతము

జాను మధ్య భాగము నందు వాత రక్తముల వికృతిచే అధికమైన వాపు కలిగి నక్కతల వంటి ఆకారముతో మిక్కుటమైన వేదనతో కూడి యున్నచో దానిని క్రొష్టుక శీర్షక వాతము అందురు.[3]

చికిత్స :

విధి ననుసరించి సిరావ్యధనము చేయించి సామాన్య వాత వ్యాధి చికిత్సలచే ఉపచరింపవలెను.[4]

గుడూచి, త్రిఫలా క్వాథముతో గుగ్గులును ప్రయోగింపవలెను.

---

1. ఖల్ల్యాం సిద్ధామ్లలవణైః స్వేదమదోపనాహనమ్ (చ.ద 22/65)
2. కుష్ఠ సైంధవయోః కల్కరచుక్రతైల సమన్వితః సుఖోష్ణోమర్ధనేయోజ్యః ఖల్లీశూల నివారణః (చ.ద. 22/64)
3. వాతశోణితజః శోఫో జానుమధ్యే మహారుజః
   శిరః క్రోష్ఠుకపూర్వం తు స్థూలః క్రోష్ఠుకమూర్ధవత్ (సు.ని. 1/76)
4. సు.చి. 5/23

ఏరండ తైలమును 10.15 మి.లీ నాలుగు రెట్లు పాలతో సేవింప చేయవలెను.

విదారీకంద చూర్ణమును దుగ్ధముతో పానము చేయింపవలెను.[1]

## ఖంజ వాతము

ప్రకోపించిన వాతము కటి ప్రదేశము నాశ్రయించి ఒక తొడ యందలి కండరములందు (సిరా స్నాయు నాడు లందు) వ్యాపించినపుడు కుంటి తనమును కలిగించును. దీనిని ఖంజవాతమని అందురు.[2]

ఈ లక్షణములు మోనోప్లజియా (Manoplegia) కు పోలియుండును.

చికిత్స :

విరేచనము, ఆస్థాపనవస్తి స్వేదనము, గుగ్గులు ప్రయోగము, స్నేహ వస్తి- ఈ క్రియలచే నవీనముగా జనించిన ఖంజవాతమును ఉపకరింపవలెను.[3]

విధ ననుసరించి సిరావ్యధనము, సామాన్య వాత వ్యాధి చికిత్సలచే ఉప చరింప వలెనన్ని సుశ్రుతుని అభిప్రాయము.[4]

---

1. గుగ్గులుంక్రోష్టుశీర్షె చ గుడూచీ త్రి ఫలాఽమ్భసా క్షీరేణైరండతైలం వా పిబేద్వా వృద్ధదారకమ్ (చ.ద. 22/62)
2. వాయుః కట్యాశ్రిత స్థితః సక్థ్నః కండరామాక్షిపేద్యదా ఖంజస్తదా భవేజ్జంతుః పంగుః సక్త్వనోర్ద్వయోర్వధాత్ (సు.ని. 1/77)
3. ఉపచారేదభినవం ఖంజం పంగుమథాపి వా విరేకాస్థాపన స్వేద గుగ్గులు స్నేహబస్తిభిం(భా.ప్ర)
4. సు.చి. 5/23

## పంగు వాతము

ఖంజ వాతమునకు చెప్పిన విధముగనే ప్రకోపించిన వాతము రెండు తొడ లందలి కండరములందును వ్యాపించి కుంటితనమును రెండు పాదములకు కలిగించిన అది పంగువాతము అనబడును.[1] ఈ స్థితిని Diplegia (డైప్లేజియా) అనదగును.

చికిత్స :

ఖంజ వాతమునకు చెప్పిన విధముగా ఉపచరించవలెను.

## కలాయ ఖంజము

నడచుటకు ప్రారంభించు సమయమున వణుకు కలుగుట, కాళ్ళు కుంటుచు నడచుట, పాదములందలి సన్ధిబన్ధము లన్నియు శిథిలములగుట. ఈ లక్షణములు కలాయ ఖంజవాతము నందు కలుగును.[2]

ఇది లేథరిజమ్ (Lathyrism) అనబడును. కలాయజాతికి చెందిన కేసరీ పప్పు తినుటచే ఇది ఉత్పన్నమగును మరికొన్ని ఇతరపప్పు ధాన్యములు గూడా ఈ స్థితి కలుగుటకు కారణములుగా గుర్తింపబడినవి. ఉదా : అంకటా (Viseia Sative).

చికిత్స :

ఖంజవాతమునకు చెప్పిన విధముగా చికిత్సింపవలెను. స్నేహకర్మను విశేషముగా చేయవలెను.[3]

---

1. సు.ని. 1/77
2. ప్రక్రమన్ వేపతే యస్తు ఖంజన్నివ చ గచ్ఛతి
   కలాయఖంజం తం విద్యాన్ముక్తసంధిప్రబంధనమ్ (సు.ని. 1/78)
3. క్రమః కలాయఖంజస్య ఖంజ పంగు గ్వోరివ స్మృతః
   విశేషాత్స్నేహనం కర్మకార్యమత్ర విచక్షణైః (భా.ప్ర)

## కుబ్జవాతము

ప్రకోపించిన వాతము వక్షస్థలమునగాని పృష్ఠమునందుగాని క్రమముగా ముందుకు పొడుచుకొని వచ్చునట్లు చేసిన అది కుబ్జత్వమని అనబడును.

చికిత్స :

కుబ్జత్వమునందు వాతహరములైన స్నేహములు దశమూలములు మరియు మాంసరసము సేవింప చేయవలెను. అధికముగా వృద్ధిచెందిన కుబ్జత్వము అసాధ్యముగా నుండును.[1]

## వాతకంటకము

కాలిమడమ (ఖుడకము) నందు ఆశ్రయించియున్న వాతము విషమస్థలము లందు నడచుటవలన గాని శ్రమచేతగాని ప్రకోపించి వేదనను కలిగించును[2] ఇది వాతకంటక వ్యాధి లేక కాల్కేనియస్ స్పూర్ (Calcaneous spur) అనబడును. Sprain Ankle నందును ఇవియే లక్షణములుండును.

వాతకంటక వ్యాధియందు మాటిమాటికి సిరావ్యాధనము చేయించి రక్త

---

1. i) హృదయం యది వా పృష్ఠమున్నతం క్రమశః సరుక్
క్రుద్ధో వాయుర్యదా కుర్యాత్తదా తం కుబ్జమాదిశేత్ (భా.ప్ర)

ii) వాతఘ్నైర్దశమూల్యా చ నవం కుబ్జముపాచరేత్
స్నేహైర్మాంసరసైర్వాఽపి ప్రవృద్ధంతం వివర్జయేత్ (చ.ద. 22/7౬)

2. i) న్యస్తేతు విషమం పాదేరుజః కుర్యాత్ సమీరణః వాతకంటక ఇత్యేష విజ్ఞేయః ఖుడకాశ్రితః (సు.ని. 1/79)

ii) అ. సం. ని. 15/55

మోక్షణము చేయింపవలెను. ఏరండ తైలమును పానము చేయింపవలెను. తప్త సూచీతో దాహకర్మ చేయింపవలెను.[1]

## పాదదాహము

పిత్తము రక్తములతో కూడిన వాతము విశేషించి నడుచునపుడు రెండు పాదములందును (పాదతలములందు) దాహమును కలిగించును. దీనిని పాదదాహ మందురు.[2]

చికిత్స :

వాతకంటకమునకు చెప్పిన విధముగా సిరా వ్యధనాది క్రియలచే ఉపచరింప వలెను. వాతరక్త చికిత్సా క్రమమునాచరింపవలెను. శతధౌతఘృతమునందు నాగ కేసరకంటక చూర్ణముకలిపి లేపనముచేసి దశమూల క్వాథములో సేకము చేయింప వలెను. దీనిచే పాదదాహము శమించును.

నవనీత లేపముచేసి స్వేదనము చేయించిన హస్తపాద దాహము శమించును. మసూరపప్పు శృతశీత జలముతోనూరి లేపనము చేయవలెను.[3]

---

1. రక్తావసేచనం కుర్యాదభీక్ష్ణం వాతకంటకే పిబేదేరండతైలం వా దహేత్ సూచీభిరేవ వా (చ.ద. 22/63)
2. i) పాదయోః కురుతే దాహం పిత్తాసృక్సహితోఽనిలః విశేషతశ్చంక్రమణాత్ పాదదాహం తమాదిశేత్ (సు.ని. 1/80)
   ii) అ. సం. ని. 15/59)
3. i) శిరావ్యధః పాదదాహే వాతకంటకవత్ క్రియా శతధౌత ఘృతోన్మిశ్రై ర్నాగకేశర కంటకైః పిష్టైః ప్రలేపః సేకశ్చ దశమూల్యంబునేష్యతే ఆలిప్య నవనీతేన స్వేదో హస్తా విదాహహా (చ.ద. 22/58-9)
   ii) భా.ప్ర. 161

## పాదహర్షము

కఫము వాతముతోకూడి ప్రకోపించుట చేత రెండు పాదములందు హర్షము సుప్తత (స్పర్శజ్ఞాన రాహిత్యము) కలుగును. ఇది పాద హర్షము అనబడును.[1]

చికిత్స :

అగ్నితోతప్తము చేయబడిన ఇటుక ముక్కలను కాంజికములో వేయుట వలన ఉత్పన్నమైన భాష్పముచే స్వేదనము చేయించినచో పాదహర్షము శమించును.[2] సిరావ్యధనము చేయింపవలెను కఫవాతహర చికిత్సలు చేయవలెను.

## అంసశోష మరియు అపబాహుక వాతము

అంస ప్రదేశమునందుండు వాతము అంసము యొక్క సన్ధి బన్ధములను శోషింప చేయుటచే అంసశోష కలుగును.

అంస ప్రదేశము నందుండు వాతము అచటి సిరలను సంకోచింప చేయుటచే అపబాహుకము అను వ్యాధి కలుగును.[3] వాగ్భటుడు రెండింటిని కలిపి అపబాహుకముగనే పరిగణించెను.

---

1. హృష్యతశ్చరణౌ యస్య భవతశ్చ ప్రసుప్తవత్ పాదహర్షః విజ్ఞేయః కఫవాత ప్రకోపజః (సు.ని. 1/81)

2. i) అగ్నితప్తేష్టకాఖండం కాంజికైః పరిషిచ్య తు తద్బాష్పస్వేదనం కార్యం పాదహర్ష వినాశనమ్ (చ.ద. 22/60)

   ii) పాదహర్షే తు కర్తవ్యః కఫవాత హరో విధిః (భా.ప్ర 164)

3. హంసదేశస్థితో వాయుః శోషయత్వాంఒసబంధనమ్‌శిరాశ్చాకుంచయ తత్ర స్థోజనయత్యపబాహుకమ్ (సు.ని. 1/82)

చికిత్స :

బాహుశోషమునందు భోజనానంతరము మహాకల్యాణక ఘృతమును పానము చేయింపవలెను.

ఇతర వాతవ్యాధి చికిత్సలచే ఈ రెండు వ్యాధులను ఉపచరింపవలెను. ఈ వ్యాధియందు రక్తమోక్షణము చేయింపరాదు. అపబాహుకము కఫస్థానమందు కఫావృతవాత జనిత మగుటచే రూక్ష స్వేదములు హితకరముగా నుండును.[1]

బలామూల క్వాథము సైంధవలవణముతో కలిపి పానము చేయింపవలెను. దీనిచే బాహుశోష శమించును.[2]

అపబాహుక చికిత్స :

శీతల జలముతో నస్యము చేయింపవలెను. మాషరసముతో నస్యము చేయించిన బాహువు వజ్రముతో సమానముగా బలమును కలిగించును. జింగినీ క్వాథముతో గుగ్గులును పానము చేయింపవలెను.

బలామూల క్వాథముగాని పారిభద్ర క్వాథముగాని ఆత్మగుప్తా స్వరసమును గాని పానము చేయించిన అపబాహుకము శమించును.[3]

## త్రికశూల

స్ఫిక్ (తుంటి) అస్థులకును పృష్టవంశ అస్థులకును గల సంధి భాగమునకు త్రికమని పేరు. ఆ సంధియందు వాత ప్రకోపముచే శూల కలిగినచో అది త్రిక శూల అనబడును.[4]

---

1. i) బాహుశోషే పిబేత్ సర్పిర్భుక్త్వా కల్యాణకం మహత్ (చ.ద. 22/28)
   ii) సు.చి. 5/23 మరియు డల్లణ వ్యాఖ్య
2. భా.ప్ర. వాతవ్యాధి చికిత్స 820
3. భా.ప్ర. 82,83
4. స్ఫిగ్ధస్థ్నోః పృష్టవంశాస్థ్నోర్యస్సంధి స్త్రికం మతం తత్ర వాతేన యా పీడా త్రికశూలం తదుచ్యతే (భా. ప్ర. 1/4)

ఇ Lumbaso అనబడును.

చికిత్స :

త్రికశూల యందు వాలుకా స్వేదము బాగుగాచేయుట హితకరముగా నుండును.

మంచముపై వెలికిల పరుండునట్లు చేసి త్రికసంధి ప్రదేశమునకు స్వేదము కలుగునట్లు పిడకల నిప్పుగల కుంపటితో ఊష్మస్వేదము చేయించిన త్రికశూల శమించును. వమనము, నస్యము హితకరముగా నుండును.[1]

త్రయోదశాంగ గుగ్గులు 1 గ్రా యిచ్చినను త్రికశూల త్రికగ్రహము, జానుగ్రహము, హృద్గ్రహము, ఖంజ, గృధ్రసి, పక్షఘాతము అస్థి, సంధి, మజ్జాగత వాత వ్యాధులు శమించును.

## వంక్షణ సంధిశూల చికిత్స

తగరమూలము తక్రముతో నూరి పానము చేయించిన వంక్షణ ప్రదేశముని కలుగు శూల శమించును.[2]

## కర్ణశూల

హనుసంధి, శంఖ ప్రదేశము శిరస్సు, గ్రీవము ఈ స్థానములందు భేదనము చేయుచున్నట్లు కర్ణమునందు శూల వాతప్రకోపముచే కలిగినచో అది కర్ణశూల అనబడును.[3]

---

1. i) కారయేద్వాలుకాస్వేదం త్రికశూలే ప్రయత్నతః
యద్వాదస్తాత్కరీషాగ్నిం ధారయేత్సతతం నరః (భా.ప్ర. 115)
ii) చ.ద. 22/22
2. భై.ర. 26/73
3. హనుశంఖశిరోగ్రీవం యస్య భిందన్నివానిలః
కర్ణయోః కురుతే శూలం కర్ణశూలం తదుచ్యతే (సు.ని 1/84)

చికిత్స :

తైలము, మధు, సైంధవ లవణము కలిపి సుఖోష్ణముగా కర్ణపూరణము చేయవలెను.

అజామూత్ర మధుతైలములను కలిపి కర్ణపూరణము చేయవలెను.

మాతులుంగాది తైలము లేక శుక్తాదితైలము కర్ణమునందు వేయవలెను.

నాడీ స్వేదముచే స్వేదనము చేయింపవలెను. వాత వ్యాధి చికిత్సలు ఉత్తర తంత్రమున చెప్పబడిన చికిత్సలు చేయవలెను.[1]

## బాధిర్యము

శబ్దవహ స్రోతస్సులందు శుద్ధ వాతముగాని కఫావృత వాతముగాని అవరోధించినచో బాధిర్యము కలుగును.[2]

ఉత్తర తంత్రమున కర్ణరోగములందు చెప్పబడిన చికిత్సావిధానముచే ఉపచరింపవలెను. సిరా వ్యధనము ఇతర వాత వ్యాధి చికిత్సలచే ఉపచరింపవలెను.[3]

## మూక మిన్మిన గద్గత వాతము

కఫముతో కూడిన వాతము శబ్దమును వహించు ధమనులను అవరోధించుటచే మనుజుని భాషణాది క్రియలను నశింపచేయుచు మూకత్వమును, మిన్మినత్వమును లేక గద్గదత్వమును కలిగించును.[4]

---

1. సు. చి. 5/24
2. యదా శబ్దవహం స్రోతో వాయురావృత్య తిష్ఠతి
   శుద్ధః శ్లేష్మాన్వితో వాఽపి బాధిర్యం తేన జాయతే (సు.ని.1/83)
3. సు. చి. 5/24.
4. ఆవృత్య సకఫో వాయుర్ధమనీః శబ్దవాహినీః
   నరాన్ కరోత్యక్రియకాన్ మూకమిన్మినగద్గదాన్ (సు.ని. 1/85)

చి కి త్స :

స్నేహగండూష ధారణము. కల్యాణకా లేహము 1గ్రా. సేవింపచేసిన శమించును.[1] సారస్వతఘృతము పానము చేయింపవలెను. (భా. ప్ర.)

## జిహ్వా స్తంభము

వాతము జిహ్వాయందలి వాక్కును వహించు శిరలను ఆశ్రయించి జిహ్వను స్తంభింపచేసిన అన్నపాన సేవనకును, వాక్కునకును అశక్యత కలుగును.[2]

చి కి త్స :

అవస్థానుసారము వాత వ్యాధి చికిత్సలు అర్ధిత వాతోక్త చికిత్సలు చేయవలెను.[3]

## ప్ర లా ప ము

స్వకారణములచే ప్రకోపించిన వాతము అసంబద్ధముగాను నిరర్థకముగను మాట్లాడుటను కలిగించిన అదే ప్రలాపము అనబడును.[4]

చి కి త్స :

తగరాది క్వాథము పానము చేయించిన ప్రలాపము శీఘ్రముగా శమించును.[5]

---

1. వాతాద్వాగ్గ్రహమనీదృష్టౌ స్నేహ గండూషధారణమ్ (చ.చ. 22/19)
2. వాగ్వాహినే శిరాసంస్థో జిహ్వాం స్తంభయతేఽనిలః
   జిహ్వాస్తంభః సతేనాన్న పానవా క్యేష్వనీశతా (భా.ప్ర. 44)
3. జిహ్వాస్తంభే యథావస్థం వాతవ్యాధి చికిత్సితం
   సామాన్యోక్తా క్రియాచత్రార్దితస్యాపి హి తా మతా (భా.ప్ర. 45)
4. స్వహేతు కుపితాద్వాతా సంబద్ధం నిరర్థకం వచనం యన్నరో భ్రూతే
   స ప్రలాపః ప్రకీర్తితం (భా. ప్ర. 50)
5. భా. ప్ర.

## రసాజ్ఞానము

భుజించునపుడు మధురాది రసములయొక్క జ్ఞానము జిహ్వకు తెలియ నిచో దానిని రసాజ్ఞానమని అందురు.[1]

చికిత్స :

సైంధవలవణము, త్రికటుకములు అమ్లవేతసము-వీనితో నాలుకపై ఘర్ష ణము చేయవలెను.

కిరాత తిక్తాది కల్కము ఘర్షణము చేసినను రసాజ్ఞానము, శూన్యత శమించును.[2]

## త్వక్శూన్య వాతము

స్పర్శగాని, శీతోష్ణములనుగాని, మృదు కర్కశత్వములనుగాని చర్మము గ్రహింపలేనిచో దానిని త్వక్శూన్యత అందురు.[3]

చికిత్స :

త్వక్శూన్యతయందు మాటిమాటికి ఆ ప్రదేశమున రక్తమోక్షణము చేయించవలెను. సైంధవ లవణము, ఆగార ధూమము, తైలముకలిపి లేపనము చేయవలెను.[4]

---

1. భుంజానస్య నరస్యాన్నం మధురప్రభృతీన్రసాన్ రసజ్ఞాయన్నజానాతి రసాజ్ఞానం తదుచ్యతే (భా. ప్ర)
2. భా. ప్ర. 55-58.
3. స్పృశ్యమానా త్వచా యాతు శీతోష్ణం మృదు కర్కశం న జానాతి బుధైస్త్వక్ఛూన్యేతి పరికీర్తితా (భా. ప్ర. 59)
4. సుప్తవాతేత్వసృగ్మోక్షం కారయేద్బహుశో భిషక్ దద్యాచ్చ లవణాంగారధూమైస్తైలసమన్వితైః (భా.ప్ర. 60)

## తూనీ వాతము

మలాశయ మూత్రాశయములనుండి వేదన ఉత్పన్నమై క్రింది భాగమునకు వ్యాపించి గుదమును మూత్రేంద్రియములను పీడించుచున్నచో అది తూనీ వాతము అనబడును.[1]

ఇది Renal colic (రీనల్ కొలిక్)నకు తుల్యముగా నుండును.

చికిత్స :

స్నేహలవణముగాని లేక పిప్పల్యాది చూర్ణముగాని ఉష్ణోదకముచే పానము చేయింపవలెను. హింగు యవక్షారము ఘృతముతో సేవింప చేయవలెను.

వస్తులను, స్నేహ వస్తులను ప్రయోగింపవలెను. హింగ్వాది చూర్ణము (సు.చి) ఉదరశూల, వస్తిశూల, ఆనాహ, ఆధ్మాన, తూనీ ప్రతి తూనీవాతములను శమింపచేయును.

## ప్రతి తూనీ వాతము

గుదము, ఉపస్థలనుండి వేదన ప్రారంభమై ఊర్ధ్వభాగమునకు వ్యాపించి వేగ పూర్వకముగా పక్వాశయమునందు వేదన కలిగించుచున్న ప్రతి తూనీ అనబడును.[3]

ఇవి ఆంత్రశూల లేక Intestinal colic కు తుల్యముగా నుండును.

చికిత్స : తూనీ చికిత్సవలెనే ఉపచరింపవలెను.[4]

---

1. అధోయా వేదనా యాతి వర్చోమూత్రాశయోత్థితా
   భినత్తీవ గుదోపస్థం సా తూనీత్యభిధీయతే (సు. ని. 1/86)
2. సు. చి. 5/25, 28.
3. గుదోపస్థోత్థితా సైవ ప్రతిలోమవిసర్పిణీ వేగైః పక్వాశయం
   యాతి ప్రతితూనీతి సా స్మృతా (సు. ని. 1/87)
4. సు. చి. 5/25.

## ఆ ధ్మా న ము

ప్రకోపించిన వాతము అధో భాగమున అవరోధము కలుగుటచే ఉదరము నందు నిలచి ఆటోపము (గుడగుడ శబ్దము), మిక్కిలి బాధ, ఉదరము పూరింప బడుట-ఈ లక్షణములను కలిగించును. దీనిని ఆధ్మానము అందురు.[1]

ఇది టంపానైటిస్ (Tympanites)లేక మిటియోరిజమ్ (Meteorism) వీనికి తుల్యముగా నుండును.

చి కి త్స :

ఆధ్మానమునందు అపతర్పణము, పాణితలముచే సేకము, అగ్నిదీపక చూర్ణములు, ఫలవర్తులు, పాచనక్రియలు, వస్తి ప్రయోగములు-వీనిచే తను శోధనకర్మలచే తను ఉపచరింపవలెను.

లంఘనానంతరము ఆహార కాలమునందు ధాన్యకము జీరకము మొదలగు దీపన ద్రవ్యములతో సిద్ధము చేయబడిన ఆహారము నివ్వవలెను.[2]

పిప్పలి, త్రివృత్, సితా-వీని చూర్ణము ఆధ్మానమును శమింపచేయును. నారాచ రసము రేచకముగ పనిచేసి ఆధ్మానము, ప్రత్యాధ్మానము, శూల ఉదావర్తములను శమింపచేయును.

దారుషట్క లేపము ఉష్ణముగా లేపము చేయవలెను.[3]

---

1. సాటోపమత్యుగ్రరుజమాధ్మాతముదరం భృశమ్
 ఆధ్మానమితి జానీయాద్ఘోరం వాతనిరోధజమ్ (సు.ని. 1/88)
2. i) ఆధ్మానేలంఘనం పూర్వం దీపనం పాచనం తతః
 ఫలవర్తిక్రియాం కుర్యాద్వస్తికర్మ చ శోధనమ్ (భా.ప్ర. 94)
 ii) సు. చి. 5/26.
3. భా. ప్ర.

### ప్రత్యాధ్మాన వాతము :

వాతము కఫముతో కూడి ఆమాశయము నుండి ఆధ్మానమును ఉత్పన్నము చేసి ఆటోపాది లక్షణములతో కూడి పార్శ్వమును హృదయమును వదలి బాధించు చున్న యెడల దానిని ప్రత్యాధ్మాన వాతమని అందురు[1]

ఇది gastro tympanites కు తుల్యముగా నుండును.

### చి కి త్స :

ప్రత్యాధ్మానమునందు వమనము. అపతర్పణము, దీపన ద్రవ్యముల ప్రయోగము, వస్తికర్మ వీనిచే ఉపచరింపవలెను.[2]

### అష్ఠీలా వాతము :

నాభికి క్రింది భాగమున కదలుచుగాని కదలకుండ స్థిరముగా గాని కంసాలి వాని యినుప దాక వలెనుండు కఠినమైన, ఉన్నతమైన, విస్తీర్ణమై వర్తులముగా నుండు గ్రంధి జనించిన దానిని అష్ఠీలావాతము అందురు. ఈ గ్రంధి వాత మూత్ర పురీషాది బహిర్మార్గములను నిరోధించును.[3]

---

1. విముక్తపార్శ్వహృదయం తదేవామాశయోత్థితమ్
ప్రత్యాధ్మానం విజానీయాత్ కఫవ్యాకులితానిలమ్ (సు. ని. 1/89)

2. i) ప్రత్యాధ్మానే ఛర్దనాపతర్పణ దీపనాది కుర్యాత్ (సు. చి. 5/26)

ii) ప్రత్యాధ్మానే సముత్పన్నే కుర్యాద్వమన లంఘనే దీపనాదీని యుంజీత పూర్వ వద్వస్తి కర్మ చ (భా. ప్ర. 106)

3. i) నాభేరధస్తాత్సంజాతఃసంచారే యదివాఽచలః అష్ఠీలావద్ఘనో గ్రంధిమార్ధ్వ మాయత ఉన్నతః వాతాష్ఠీలాం విజానీయాద్బహిర్మార్గ నిరోధినీమ్ (భా. ప్ర. 106)

ii) సు. ని. 1/60

**చికిత్స :**

గుల్మమునకు, అభ్యంతర విద్రధికి చెప్పబడిన చికిత్సలు చేయవలెను. హింగ్వాది చూర్ణమును ఉష్ణోదకముతో ఇవ్వవలెను.[1]

**ప్రత్యష్ఠీలా వాతము :**

పై చెప్పబడిన విధముగనే మిక్కిలి బాధతో కూడి వాత విణ్మూత్రములను అడ్డగించు యినుపడాక వంటి గ్రంధి ఉదరమునందు అడ్డముగా ఉత్పన్నమైన అది ప్రత్యష్ఠీలా అనబడును. ప్రత్యష్ఠీల ఉదరమునందు అడ్డముగా ఉత్పన్న మగును అష్ఠీల నాభి క్రింద పొడవుగాను ఎత్తుగాను ఉత్పన్నమగును. వీని రెండింటికి యిదియే భేదము[2].

**చికిత్స :**

అష్ఠీలకు చెప్పబడిన విధముగ ఉపచరింపవలెను.[3]

**మూత్ర నిరోధక వాతము :**

వస్తిగతమైన వాతము అనులోమనముగా నున్నపుడు మూత్రము యొక్క ప్రవృత్తి ఏ విధమైన బాధకలుగకుండా ప్రాకృతముగా జరుగును. ఆ వాతమే

---

1. అష్ఠీలా ప్రత్యష్ఠీలయోర్గుల్మాభ్యంతర విద్రధివత్ క్రియావిధాన ఇతి (సు. చి. 5/29)

2. i) ఏతామేవ రుజాయుక్తాం వాతవిణ్మూత్రరోధినీం ప్రత్యష్ఠీలామితి వదేజ్జఠరే తిర్యగుత్థితాం ఏతామేవ అష్ఠీలామేవ జఠరేతిర్యగుత్థితమితి భేదః (భా. ప్ర. 108)

ii) సు. ని. 1/61

3. సు. చి.5/27

దూషితమై ప్రతిలోమముగా నున్నపుడు వస్తిగతమైన వివిధ వ్యాధులు కలుగును. ఉదా : మూత్రకృచ్ఛ్ర, మూత్రాఘాత. అశ్మరి మొ॥నవి.[1]

ప్రధానముగా ముహుర్మూత్రము గాని మూత్రావరోధము గాని కలుగును.

**ముహుర్మూత్ర చికిత్స :**

1. బలా, మూర్వా, త్వక్, సిత- వీనిచూర్ణము దుగ్ధముతో సేవింపవలెను.

2. త్రిఫల చూర్ణము, లోహభస్మము, తేనెతో సేవింపవలెను.

**మూత్ర నిగ్రహ చికిత్స :**

1. యవక్షారము పంచదార కలిపి సేవించుచు నియమముగా భుజించిన మూత్ర నిగ్రహము శమించును.

2. కూష్మాండ బీజములు, లేక త్రపుస బీజకల్కము లేక ఆమలకీ కల్కము వస్తియందు వేశి కట్టిన మూత్రావరోధము శమించును.

3. మేహన లేక యోని ముఖద్వారమున కర్పూరవర్తిని ధరింపచేసిన మూత్ర నిగ్రహము శమించును.[2]



---

1. మారుతేఽవిగుణే వస్తౌ మూత్రం సమ్యక్ప్రవర్తతే
వికారా వివిధాశ్చాపి తస్మిన్ దుష్టే భవంతి హి (భా. ప్ర. 121)

2. భా. ప్ర. 121-127.

# వాతరక్తము

వాతము ప్రకోపించి స్వకారణములచే ప్రకోపించిన రక్తము చేత ముఖ్యముగా సంధులందు అడ్డగింపబడుట చేత కలుగు వ్యాధియైనందున ఇది వాతరక్తమని అనబడుచున్నది.[1]

**పర్యాయములు :**

వాతరక్తము, ఖుడవాతము, వాతశోణితము, వాతబలాసకము, ఆఢ్యరోగము అను పర్యాయములు వాతరక్తమునకు కలవు.[2]

**వాతరక్త నిదానము -**

వాతరక్తము నందు రక్తము వాతము రెండును తమతమ కారణములచే ప్రకోపించుట వలన కలుగు వ్యాధియగుటచే చరకమునందు 'లవణామ్లనుండి శోణితేనృణామ్' వరకు చెప్పబడిన కారణములు రక్త ప్రకోపకరములనియు "కషాయ కటు నుండి వేగనిగ్రహాత్" వరకు చెప్పబడిన కారణములు వాత ప్రకోపకారణములుగను భావింబడుచున్నవి.

---

1. వాయుర్వివృద్ధో వృద్ధేన రక్తేనావారితః పథిః కృత్స్నం సందూషయేద్రక్తం తత్ జ్ఞేయం వాతశోణితం (చ. చి. 29/10)

2. i) ఖుడం వాతబలాసాఖ్యం ఆఢ్యవాతం చ నామభిః (చ. చి. 29/11)

ii) ఆఢ్యరోగం ఖుడం వాతబలాసం (తయలాశం) వాతశోణితం తదాహుర్నామభిః (అ. హృ.ని. 16/4)

### రక్త ప్రకోపక కారణములు :

లవణ, అమ్ల, కటు పదార్థములు, క్షారపదార్థములు, స్నిగ్ధ ఆహారములు, ఉష్ణ పదార్థములు, అజీర్ణకరములైన పదార్థములు, క్లిన్న, శుష్క పదార్థములు, విరుద్ధాహారములు, అధ్యశనము, తీక్ష్ణమైన పదార్థములు- ఇవి సేవించుట అంబుజ, అనూప మాంసములు, పిణ్యాకము, మూలకము, కులత్థములు, మాష ములు,నిష్పావములు, ఆకుకూరలు, మాంసము, దధి, ఆరనాళము, సౌవీరము, శుక్తము, తక్రము, సుర ఆసవాదులు- వీనిని సేవించుట.

అభిఘాతము కల్గుట, శోధనములు ఋత్వనుసారము చేయించుకొనక పోవుట, క్రోధము, దివాస్వప్నము. జాగరణము, సంతాపము- విదాహకరాహార సేవన ఈ కారణములచే రక్తము దూషింపబడును. వాతమార్గము నడ్డగించి వాత రక్తమును కలిగించును.

ఏనుగులు, గుర్రములు, ఒంటెలు మొదలగు వానిపై ప్రయాణించుట, ఆటలాడుట, ఈతకొట్టుట, దూకుట ఎండలో విషమమార్గమున దూరప్రయాణము చేయుట అధికమైధునము, వేగనిగ్రహము, బలముగానుండు జంతువులను ఆపుటకు ప్రయత్నించుట మొదలగు ఇతర వాత ప్రకోప కారణములు.

కషాయ, కటు, తిక్త, రూక్ష, ఆహారపదార్థ సేవన, అల్పభోజనము, లేక అభోజనముగా నుండుట.

వ్యాయామము చేతగాని ,వ్యాధులచేత గాని కృశించుట ఈ కారణములచే వాతము ప్రకోపించును తద్వారా వాతరక్తమును కలిగించును.

### ఇతర కారణములు :

ఋతు విపర్యయము, సాత్మ్య విపర్యయము, స్నేహాది కర్మలయొక్క మిథ్యాయోగము, వ్యాయామము చేయకపోవుట. ఎచ్చటకును తిరుగకపోవుట అలవా

టుగా కలిగియుండుట, సుకుమారులుగా నుండుట, స్థౌల్యత్వము కలిగియుండుట సుఖ జీవనమునకు అలవాటుపడి మిథ్యాహార విహారములు చేయువారికి ముఖ్యముగా వాతరక్తవ్యాధి కలుగును.1

## వాతరక్తసంప్రాప్తి :

పైన పేర్కొనబడిన ఆయా కారణములచే రక్తము దూషింపబడుటయు, వాతము ప్రకోపించుటయు జరుగును. దూషింపబడిన రక్తము ద్రవరూపములో నుండి రసగుణము కలిగియుండుట చేత అన్ని స్రోతస్సులందు సంచరించుచుండును. సూక్ష్మగుణము కలిగిన వాతము అన్ని సంధులందును మార్గములందును సిరలయందును తిరుగు చుండును. ఈ గుణములచే వాతము రక్తము కలసి సిరల రూపమైన మార్గములలో శరీరమంతయు సంచరించుచు గణుపులు వక్రములుగా ఉండుటవలన అచ్చట నిరోధింపబడుటచే సరిగా వెడలలేక అభిఘాతమును పొంది గణుపుల (పర్వముల) యందే నిలబడిపోవును. ఇచ్చట వాతమార్గమును రక్తము గణుపులు, సంధులయందు అడ్డగించుటచే వాతము మరింత క్రుద్ధమై రక్తము నింకను దూషించును. సంధులను గూడా దూషించును.

---

1. i) లవణామ్ల కటుక్షారస్నిగ్ధోష్ణా జీర్ణభోజనైః క్లిన్నశుష్కాఽమ్బుజానూప మాంసపిణ్యాకమూలకైః కులత్థమాషనిష్పావశాకా విపలేక్షుభిః దధ్యార నాళ సౌవీరశుక్త తక్రసురాసవైః విరుద్ధాఽధ్యశనక్రోధదివాస్వప్న ప్రజాగరైః ప్రాయశస్సుకుమారాణాం మిష్టాఽసుఖభోజనామ్ అచంక్రమణ శీలానాం కుప్యతే వాతశోణితం అభిఘాతాదశుద్ధ్యా చ ప్రదుష్టే శోణితే నృణామ్ కషాయకటుతిక్తాల్పరూక్షాహారదభోజనాత్ హయోష్ట్రయానయానాంబు క్రీడాప్లవనలంఘనైం ఉష్ణేచాత్యధ్వవైషమ్యాత్ వ్యవాయాద్వేగ నిగ్రహాత్ (చ. చి. 29/5-10)

ii) సు. ని. 1/40-42

iii) సు. చి. 5/4-5

ఈ పర్వ సంధులందు చేరియున్న పిత్తముతోగాని కఫముతోగాని కలసి నచో ఆయాదోషానుసార లక్షణములను కలిగించును.[1]

## వాత రక్త స్థానములు–వ్యాపించు విధము :

వాత రక్తమునకు హస్తములు, పాదములు, వ్రేళ్ళు శరీరమందలి అన్ని సంధులు స్థానములుగా నుండును.[2]

వాతరక్తము ప్రారంభమున సాధారణముగా పాదములను ఒక్కొక్క ప్పుడు హస్తములను మూలస్థానముగా చేసికొని (కొందరి మతానుసారము పాద

---

1. i) క్షిప్రం రక్తం దుష్టిమాయాతి (శీఘ్రంరక్తవిద్రవత్వాళు)తచ్చ వాయోర్మార్గం సంరుణాధ్యాశు యాతః క్రుద్ధోఽత్యర్థం మార్గరోధాత్ సవాయురత్యు ద్రిక్తం (అత్యుదృత్తం)మాషయేద్రక్తమాశు తత్ సంపృక్తం వాయునా దూషితేన తత్ప్రాబల్యాదుచ్యతే వాతరక్తమ్ తద్వత్ పిత్తం దూషితేనా సృజాఽక్తంశ్లేష్మా దుష్టో దూషితేనాసృజాఽఽక్తః (సు.ని. 1/42-44)
   ii) చ.చి. 29/10-11
   iii) సౌక్ష్మ్యత్ సర్వసరత్వాచ్చ పవనస్యాసృజస్తథాతద్రవత్వాత్ సరత్వాచ్చ దేహం గచ్ఛన్ సిరాయనైః పర్వస్వభిఘాతం క్షుబ్ధం వక్రత్వాదవతిషలుతే స్థితం పిత్తాది సంసృష్టం తాస్తాః సృజతి వేదనాః కరోతి దుఃఖం తేష్వేవ తస్మాత్ ప్రాయేణ సంధిషు భవన్తి వేదనాస్తాస్తా అత్యర్థం దుఃసహా నృణామ్ (చ.చి. 29/13-15)
2. తస్య స్థానం కరౌ పాదావంగుల్యః సర్వసంధయః కృత్వాఽఽదౌ హస్త పాదే తు మూలం దేహే విధావతి (చ.చి. 29/12)

మూలమునుగాని హస్తమూలమును గాని స్థానముగాచేసికొని)తదుపరి ఆఖు విషము వలె మెల్లమెల్లగా ప్రకోపించి దేహమందంతటను వ్యాపించును.[1]

ఈ వ్యాధి లక్షణములు కలుగుచు మరల శమించుచు ఉండు స్వభావము కలిగియుండును.

## పూర్వ రూపములు :

శరీరమునందు స్వేదము అధికముగా కలుగుట, లేక స్వేదము అసలు లేకుండుట, పారుష్యము, సిరాస్నాయుధమనీ స్పందనము, శరీరము శ్యామవంత ముగా అగుట, స్పర్శజ్ఞానము నశించుట, గాయము కలిగిన ఎడల అధికమైన బాధ కలుగుట, సంధులందు శైథిల్యము కలుగుట, అలసత్వము, శరీరము కృశిం చుట, పిడకలు జనించుట, జానువులు, జంఘములు, ఊరువులు, కటిస్థలము, భుజము, శిరస్సు, హస్తపాదములు, వీని యొక్క సంధులందు సూదులతో పొడిచినట్లు బాధ కలుగును. శరీరము అదరుట, పగులుట, ఓష, గురుత్వము కలిగివుండుట, కండూ సంధులందు వేదన కలిగి కొంతసేపటికి శమించుట, శోథ, స్తంభత్వము, వర్ణము మారుట, హస్తపాదతలములందు, అంగుళులందు, గుల్ఫ మణిబంధాదులందును అకస్మాత్తుగా శ్యావ అరుణమండలోత్పత్తికలుగుట, ఈ లక్షణములు అన్నియు వాతరక్తవ్యాధి జనించకముందు కలుగు పూర్వరూపము లుగా ఉండును.[2]

---

1. స్వేదోఽత్యర్థం న వా కార్ష్ణ్యం స్పర్శాఽజ్ఞత్వం క్షతేఽతిరుక్ సంధి శైథిల్యమాలస్యం సదనం పిడకోద్గమః జానుజంఘోరుకట్యంసహస్త పాదాంగసంధిషు నిస్తోదస్స్ఫురణం భేదో గురుత్వం సుప్తిరేవ చ కండూస్సంధిషు రుగ్భూత్వా భూత్వా నశ్యతి చాసకృత్ వైవర్ణ్యం మండ లోత్పత్తిర్వాతాసృక్పూర్వ లక్షణమ్ (చ.చి. 29/6-17)
2. పాదయోర్మూలమాస్థాయ కదాచిద్ధస్తయోరపి ఆఖోర్విషమివ క్రుద్ధం తద్దేహముపసర్పతి (సు. ని. 1/48)

ఈపూర్వరూపావస్థకు సంబంధించిన లక్షణములు కనిపించినపుడు తగిన చికిత్సలతో ఉపచరించక పోయినచో వాతరక్తము వ్యక్తావస్థను పొందును.

**భేదములు :**

వాతరక్త భేదములు ఆశ్రయములను అనుసరించియు, దోషములను అనుసరించియు వేరువేరుగా ఉండును.

1. ఆశ్రయానుసార భేదములు—మూడు విధములుగా ఉండును. అవి:

1. ఉత్తానము, 2. గంభీరము 3. ఉభయాశ్రితము.

2. దోషానుసార భేదములు—ఇవి ఎనిమిది విధములుగా ఉండును.

1. వాతజ, 2. పిత్తజ, 3. రక్తజ, 4. కఫజ, 5. వాతపిత్తజ, 6. వాతకఫజ, 7. కఫపిత్తజ, 8. సన్నిపాతజ.[1]

చక్రపాణి ఇంకను అనేక భేదములున్నవను ఒక మతమును పేర్కొనెను. ఆ మతానుసారము వాతాధిక వాత రక్తము 35 విధములుగాను; పిత్తాధిక వాత రక్తము 30 విధములుగాను; కఫాధిక వాత రక్తము 10 విధములుగాను చెప్పబడినవి.

ఆశ్రయానుసార వాతరక్త విశేష లక్షణములు.

**ఉత్తాన వాత రక్తము :**

త్వక్ ను, మాంసమును ఆశ్రయించిన వాతరక్తము ఉత్తాన వాతరక్తము అనబడును.

---

1. చ. చి. 29/19-23
2. తత్ర వాతాధికే వా స్యాత్ రక్తే పిత్తే కఫేఽపివా
   సంసృష్టేషు సమస్తేషు యచ్చ తచ్ఛృణు లక్షణమ్ (చ.చి. 29/26)

త్వక్కునందు కండూ, దాహము, కలిగి ముడుచుకొని వుండును. సూదు లతో గ్రుచ్చినట్లు తోద కలిగి అమయచుండును. సంకుచితములగును. ఈ లక్షణ ములు ఉత్తాన వాతరక్తమునందు కలుగును.[1]

## గంభీర వాత రక్త లక్షణములు :

అభ్యంతరముగా వుండు మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రాది ధాతువుల ఆశ్రయించినది గంభీర వాతరక్తము అనబడును.

గంభీర వాతరక్తమున స్తబ్దత, కఠినత కలిగి,లోపలి భాగము అధికబాధను కలిగి, శ్యామవర్ణము లేదా తామ్రవర్ణము కలిగినది, దాహము, వేదన, అదురు పాటు కలిగినది, పక్వమై అధికమైన మంటను, నొప్పిని కలిగినది అయిన వాపు ఏర్పడును. ప్రకోపించిన వాతము సంధులందు, అస్థులందు, మజ్జయందు విశేషముగా సంచరించుతూ, విపరీతమైన బాధను కలిగించుచూ, శరీరముయొక్క లోప్రదేశమందే సంచరించుచూ, అధికమైన వేగముతో కూడి, అవయవము లకు వక్రత్వము కలుగ చేయుచు, ఖంజవాతము, పంగువాతములను కలిగించును. ఈ వ్యాధులన్నియు శరీరమందంతటా వాతము సంచరించినపుడే కలుగును.[2]

## ఉభయాశ్రిత వాత రక్త లక్షణములు :

ఉత్తాన వాత రక్తమునకు గంభీర వాత రక్తమునకు వేరువేరుగా చెప్ప బడిన లక్షణములు అన్నియు కలిసియున్న ఉభయాశ్రిత వాతరక్తము అని అన బడును.

---

1. కండూదాహరుగాయాసతోదస్ఫురణకుంచనైః
అన్వితా శ్యావరక్తా త్వక్ బాహ్యే తామ్రా తథేష్యతే (చ.చి. 29/20)
2. గంభీరేశ్వయథుః స్తబ్ధః కఠినో౽న్తర్భృశార్తిమాన్ శ్యావస్తామ్రో౽ థవా దాహతోదస్ఫురణపాకవాన్ రుగ్విదాహాన్వితో౽భీక్ష్ణం వాయుః సన్ధ్యస్థిమజ్జసు ఛిన్దన్నివ చరత్యన్తః వక్రీకుర్వంశ్చ వేగవాన్ కరోతి ఖంజం పంగుం వా శరీరే సర్వతశ్చరన్ (చ.చి. 29/21-22)

సుశ్రుతుడు ఉత్తాన గంభీరములని రెండు విధములుగా విభజించుట సరి కాదని పేర్కొనెను. వాతరక్తము కూడా కుష్ఠమువలె ప్రారంభమున ఉత్తానము (త్వగ్మాంసాశ్రితము)గా వుండి కాలాంతరమున అవగాఢము(అభ్యంతర ధాతువులను ఆశ్రయించునది) గా ఉండును. కనుక రెండు అనుట సరికాదని సుశ్రుతమతము.

## దోషానుసార వాతరక్త లక్షణములు

### వాతాధిక వాతరక్త లక్షణములు

వాతరక్తమునందు వాతము అధికముగా ఉన్నప్పుడు సిరాయామము, శూల, అవయవములు అదురుట,తోద, వేదన, వాపు అధికముగా రూక్షమై కృష్ణవర్ణముగా లేదా శ్యామ వర్ణముగా వుండి ఒకొక్కసారి వృద్ధినొందుచు ఒకొక్కసారి క్షీణించుచు, ధమనులు, వ్రేళ్ల మధ్య సంధులు ముడుచుకుపోయి వుండుట, సర్వ అంగములు అదిమి పట్టినట్లు ఉండుట, అధికమైన వేదన కలిగియుండుట, శీత పదార్ధములందు ద్వేషము, అటువంటివి సేవించుట వలన వ్యాధి అధికమగుట, అవయవములు స్తంభించి వుండుట, కంపము, స్పర్శజ్ఞానము నశించివుండుట, లేక స్పర్శ అసహిష్ణుత, తోద ఈ లక్షణములు కలుగును.[1]

### రక్తాధిక వాతరక్త లక్షణములు

వాతరక్తమునందు రక్తము అధికముగా వున్నపుడు అధికమైన వాపు, తోద, పోట్లు, తామ్ర వర్ణము లేక అరుణ వర్ణములో వుండి కండూ కలిగి

---

1. వాతాఽధికేఽధికం తత్ర శూల స్ఫురణ భంజనమ్
శోధస్య రౌక్ష్యం కృష్ణత్వం శ్యావతా వృద్ధిహానయః
ధమన్యంగులిసంధీనాంసం కోచోఽంగగ్రహోఽతిరుక్
శీతద్వేషానుపశయౌ స్తంభ వేపధు సుప్తయః
(మా. ని. వా. రక్తనిదానం 8.9)

వుండుట, స్నిగ్ధ పదార్థములు, రూక్షపదార్థములు సేవించుట వలన శమించక పోవుట, ఉత్క్లేదనము కలిగివుండుట ఈ లక్షణములు కలుగును.[1]

## పిత్తాధిక వాతరక్త లక్షణములు

వాతరక్తమునందు పిత్తము అధికముగా వున్నపుడు అధికమైన సంతాపము, స్వేదము, మోహము, మూర్ఛ, తృష్ణా, స్పర్శించినచో సహింపలేకుండుట, పోట్లు రక్త వర్ణముకల వాపు, శోధ కలుగుట, అధికమైన ఉష్ణత్వము కలుగుట, మృదుత్వము ఏర్పడుట మొదలైన లక్షణములు కలుగును.[2]

## కఫాధిక వాతరక్త లక్షణములు

కఫాధిక వాతరక్తమునందు శరీరస్తైమిత్యము, గురుత్వము, స్నిగ్ధత్వము, శీతత్వము, కండు, స్వల్పముగా తృష్ణ, శ్వేత వర్ణత, మొదలగు లక్షణములు కలుగును.[3]

## సంసర్గ సన్నిపాత వాతరక్త లక్షణములు

పైన చెప్పబడిన వాటిలో దోషద్వయ లక్షణములు కలిసి ఉన్న ఎడల ద్వంద్వజము అనియు, దోషత్రయ లక్షణములతో కూడియున్నది సన్నిపాతజ మని గ్రహింపవలెను.

## సాధ్యాఽసాధ్య వాతరక్త లక్షణములు

మోకాలి వరకు వ్యాపించి వున్నను, ప్రభిన్నమైనను, పగిలి నీరు కారుచున్నను, ఉపద్రవములతో కలసి ఉన్నను, శరీరముయొక్క బలము, మాంసము

---

1. రక్తేశోథోఽతిరుక్తోదస్తామ్రశ్చిమచిమాయతే
   స్నిగ్ధరూక్షైశ్శమం నైతికండూక్లేద సమన్వితః
2. పిత్తే విదాహ సమ్మోహస్వేదో మూర్ఛా మదస్తృషా
   స్పర్శాసహత్వం రుగ్రాగః శోథః పాకో భృశోష్మతా
3. కఫే స్తైమిత్య గురుతా సుప్తి స్నిగ్ధత్వ శీతతాః
   కండూర్మన్దా చ రుగ్ద్వంద్వం సర్వలింగం చ సంకరాత్

పీడించినను, ఈ లక్షణములు కలిగిన వాతరక్తవ్యాధి అసాధ్యము, సంవత్సర కాలముకన్నా ముందు పుట్టునది యాప్యము, మరియు సంవత్సర కాలమునకు లోపల పైన చెప్పిన స్ఫుటితాది లక్షణములు లేనిచో సాధ్యమని భావము.[1]

అనిద్రత, అరుచి, శిరోవేదన, మూర్ఛ, మదము, మాంసము క్రుళ్లిపోవుట, శ్వాసము, మోహము, తృష్ణ, జ్వరము, కంపము, మొదలగునవి అధికముగా వుండుట, హిక్కా, కుంటితనము, విసర్పము, పుండు ఏర్పడు, తోద, భ్రమ, బడలిక, వ్రేళ్లు వంకరగా అగుట, పిడకములు, తాపము, మర్మ స్థానములందు వేదన, అర్బుదవ్రణము, ఈ ఉపద్రవములతో కూడిన వాతరక్తము, పైన చెప్పిన అన్ని లక్షణములు లేకపోయినను మోహముతో కూడుకొన్న వాతరక్తము అసాధ్యమై వుండును. పైన చెప్పిన వాటిలో కొన్నింటితోనే కూడుకొని వున్నఎడల యాప్యమై వుండును. ఉపద్రవములు ఏమియు లేనిచో సాధ్యమై వుండును. మరియు ఏకదోషముచే జనించిన వీనమై వున్నచో సాధ్యము. ద్విదోషములచే జనించిన ఎడల యాప్యము దోషత్రయముచే జనించినవి, సర్వోపద్రవములతో కూడినది అసాధ్యము.[2]

---

1. అజానుస్ఫుటితం యచ్చ ప్రభిన్నం ప్రస్రుతం చ యత్
   ఉపద్రవైశ్చ యజ్జుష్టం ప్రాణ మాంస క్షయాదిభిః
   వాతరక్తమసాధ్యం స్యాద్యాప్యం సంవత్సరోత్థితమ్ (సు. ని. 1/50-51)
2. అస్వప్నా౽రోచక శ్వాస మాంసకోథ శిరోగ్రహాః
   మూర్ఛాతి మదరుక్తృష్ణా జ్వర మోహ ప్రవేపకాః
   హిక్కా పాంగుల్య వీసర్పపాక తోద భ్రమ క్లమాః
   అంగులీవక్రతా స్ఫోట దాహ మర్మగ్రహార్బుదాః
   ఏతైరుపద్రవైర్వర్జ్యం మోహేనైకేన వా౽పియత్
   అకృత్స్నోపద్రవం యాప్యం సాధ్యం స్యాన్నిరుపద్రవమ్
   ఏకదోషానుగం సాధ్యం నవం యాప్యం ద్విదోషజమ్
   త్రిదోషజమసాధ్యం స్యాద్యస్య చ స్యురుపద్రవాః

వాతరక్తము వ్యాధి లక్షణములను పరిశీలించిన బహుసంధిగత వ్యాధులన్నియు యిందు అంతర్భూతమగునని తోచును.

మాధవకరుడు మాత్రమే ఆమవాతమును వర్ణించెను. ప్రాచీన కాలమున బహుశా అన్ని సంధిగత వ్యాధులు వాతరక్తముగనే భావింపబడి యుండును.

ఆధునిక వైద్యమతానుసారము రుమాటిక్ డిసీజస్ అనబడు వ్యాధులన్నియు వాతరక్తమునకే దగ్గరగా ఉండును.

ప్రధానముగా ఏదో ఒక మాంసపేశీ లేక సంధిప్రదేశపు వేదన స్తబ్ధతతో కూడిన వ్యాధులన్నియు రుమాటిక్ డిసీజస్ అని నిర్వచింపబడినవి.

యివి ప్రాథమిక సంప్రాప్తిననుసరించి మూడు విధములుగా నుండును. అవి ఈ క్రింద వివరింపబడినవి.

## రుమాటిక్ డిసీజస్[1]

I. శోధ ప్రధాన వ్యాధులు (Imflammatory diseases)

1. అధిక సంస్థానముల వికృతితో కూడినవి.
   రుమాటాయిడ్ ఆర్థ్రైటిస్

2. శోధ ప్రధాన.
   సంక్రమణ జన్యసంధి శోధ (Infective Arthritls)
   స్పాండార్థ్రైటిస్

II. ధాతుపరిణామ వికృతి జన్యవ్యాధులు
   (Metabolic disorders)
   స్ఫటిక సంచయజన్య వ్యాధులు.

---

1. John Maceloid (1987) Davidson's Principles and Practice of Medicine.

అ) గౌట్ (gout)

ఆ) కొంౘ్రడో కాల్సినోసిస్ (Chondrocalcinosis)

III. ధాతుక్షయజన్య వ్యాధులు (Degenerative diseases)

అ) ఆస్టియో ఆర్థరైటిస్ (Osteo arthritis)

ఆ) స్పాన్డైలోసిస్ (Spondylosis)

పై వివరింపబడినవానిలో ముఖ్యముగా గౌట్ (gout) లక్షణములను రుమాటాయిడ్ ఆర్థరైటిస్ లక్షణములను వాతరక్తమునకు దగ్గరగా ఉండును. వాని లక్షణములు క్రింద సంక్షిప్తముగా ఇవ్వబడినవి.

## గౌట్ (gout)

ముఖ్యముగా పాదాంగుళులందు తీవ్రశోథతో గూడిన ఆవేగములతో ఈ వ్యాధి ప్రారంభమగును. యూరిక్ ఏసిడ్ క్రిస్టల్సు సంచయమగుట ఈ వ్యాధికి ముఖ్య కారణము.

కారణములు:- మూత్రికామ్లమును ఎక్కువచేయు ఆహారములు,ఔషధములు దీనికి వ్యంజక కారణములుగా నుండును.

ముఖ్య లక్షణములు :-అకస్మాత్తుగా పాదాంగుష్ఠము లేక అంగుళులందు శోధ రాగముతో ప్రారంభమై 7 నుండి పది రోజులలో శమించును. జ్వరము, అరతి పాదాంగుష్ఠముతో సాధారణముగా ప్రారంభమగును. ఇతర అంగుళులు, గుల్ఫము, జానుసంధి, మణిబంధము, అంగుళీ పర్వములు గూడా అరుదుగా వ్యాధి ప్రభావమునకు లోనగును.

ఈ విధమైన ప్రత్యేకలతో గూడిన వ్యాధి లక్షణములతో పాటు యూరిక్ ఏసిడ్ వృద్ధి మరియు ప్రారంభావస్థలో సంధిస్థిత ద్రవము (Synovial fluid)న యూరిక్ ఏసిడ్ స్ఫటికములుండుట వ్యాధి నిర్ణయమునకు సహకరించును.

జీర్ణావస్థలో చికిత్స సరిగా జరగని వారిలో విశేషమైన అంకురములు **(Topi)** ముఖ్యముగా వ్యాధిత అంగుళీ వద్ద ఏర్పడుటయు, అట్టి అంకురములందు యూరిక్ ఏసిడ్ క్రిస్టల్సు కన్పించుటయు వ్యాధి నిర్ధారణకు తోడ్పడును.

ఈ స్థితిలో ఎక్స్రేలో సంధులందు ప్రత్యేకమైన వికృతులు కనిపించును.

## రుమాటాయిడ్ ఆర్థ్రైటిస్

రుమాటాయిడ్ ఆర్థ్రైటిస్ లక్షణముల సముచ్ఛయమును బట్టియే ప్రధాసముగా వ్యాధి నిర్ణయము చేయబడును.

ఉభయ పార్శ్వము లందలి హస్త లేక పాదతలము, అంగుళులు మొదలగు బహు సంధులందు శోథతో కూడి ప్రధానముగా హస్తాపాదాంగుళులు, మణిబంధము అంసనంధి, జాను,గుల్ఫములు లోనగు వ్యాధిగా నిర్వచింపబడినది.

రుమాటాయిడ్ ఫాక్టర్, చర్మాంతర్గత గ్రంధులు, నేత్ర, పుప్పుస, వాత నాడీ వికృతులు, పాదవ్రణములు మొదలగు లక్షణములు వ్యాధి నిర్ణయమునకు సహకరించును.

షీప్‌సెల్, ఎగ్లుటినేషన్ టెస్ట్, లాటెక్సు ఫిక్సేషన్ టెస్ట్, రోజ్‌వాలర్ టెస్ట్ మొదలైనవి. ఎక్స్‌రే-వీనిద్వారాపరీక్షలు జరుపవలెను

ఈ వ్యాధి కొందరిలో శాశ్వత అంగవైకల్యమును కలిగించును.

వాతరక్తము ఈ వ్యాధికి దగ్గరగా ఉండునని కొందరి అభిప్రాయము.

## రోగ నిర్ణయము

వాతరక్తమును ఆమవాతము నుండి వేరు చేయవలసి యుండును.

వాతరక్తము పూర్వరూపములతో మెల్లమెల్లగా కలుగువ్యాధి. ఆమవాతము నకు పూర్వరూపములు చెప్పబడలేదు గాన అకస్మాత్తుగా కలుగునని భావింప వలెను.

వాతరక్తమున పూర్వరూపావస్థలోనే సంధిశోథ వేద నాదిలక్షణములు కన్పించును. ఆమవాతములో సంధిశోథాదులు జీర్ణావస్థ లక్షణములు.

వాతరక్తమున రక్తము, పిత్తము, ధమనులు వికృతి చెందును. ఆమవాత మున ఆమము, కఫము దుష్టి చెందును,

వాతరక్తమున ఆఖువిషమువలె ఆవేగాత్మకముగా నుండును. ఆమవాత మున వృశ్చికదంశమువంటి వేదన కల్గును.

వాతరక్తమున సంధి వికృతి లక్షణములు అధికముగా నుండును. ఆమవాత మున అంగమర్దము, జ్వరము అరుచి మొదలగు లక్షణములు ప్రధానముగా నుండును.

వాతరక్తమున అంగవైకల్యము కలుగును.

వాతరక్తము పిత్తశామక చికిత్సలచే శమించును. ఆమవాతము కఫ ఆమశామక చికిత్సలచే శమించును.

వాతరక్తము అనేక విభేధములతో కూడియుండుటచే పిత్తజవాతరక్తము గౌట్ కు దగ్గరగను, కఫజ వాతరక్తము ఆమవాతమునకు దగ్గరగను ఉండునని భావింపబడుచున్నది.

## వాతరక్త చికిత్స

స్థాన విశేషమును దోషముల యొక్క బలాబలములను గమనించి ఊహాపోహలతో అంశాంశ వికల్పములు చేసి వాతరక్తమునందు చికిత్సలు ప్రయోగింపవలసియుండును.[1]

రక్తమోక్షణము- వాతరక్తమున ప్రారంభమునందే వాతాధిక్యత రూక్షత్వము, మ్లానాంగత్వము- ఈ లక్షణములు లేకుండగ చూచి వాత మార్గమును రక్తము ఆవరించి అవరోధించుచుండుటచేత ఆ దూషిత రక్తమును కొద్దికొద్దిగా అనేక మారులు తీసివేయవలెను. రక్తమోక్షణమును అధిక పరిమాణములో ఒకే మారు చేయించినచో వాతము ప్రకోపించును.[2]

వాతరక్తమునందు ఆయా దోషములయొక్క బలము ననుసరించి శృంగము, జలౌక సూచి, అలాబు ప్రచ్ఛానము, సిరావ్యధనము- ఈ ప్రక్రియల ద్వారా రక్తమోక్షణమును చేయింపవలెను.[3]

వేదన, దాహము, శూల, తోద- ఈ లక్షణములున్నచో జలౌకా ప్రయోగముచే రక్తమోక్షణము చేయింపవలెను.

సుప్తి (శూన్యత), కండు, చిమచిమలాడుచుండుట- ఈ లక్షణములున్నచో శృంగముతో గాని అలాబుతోగాని రక్తమోక్షణము చేయింప వలయును.

---

1. బుద్ధ్వా స్థానవిశేషాంశ్చ దోషాణం చ బలాఽబలం
   చికిత్సితమిదం కుర్యాత్ ఊహాఽపోహవికల్పవిత్ (చ.చి. 29/155)
2. తత్ర ఆదావేవ బహువాత రూక్షమ్లానాంగాదృతే మార్గావరణా
   ద్దుష్టశోణిత యసకృదల్పాల్పమవసించే ద్వాత కోపభయాత్ (సు.చి.5)
3. తత్ర ముంచేదసృక్ శృంగజలౌకసూచ్యలాబుభిః
   ప్రచ్ఛనైర్వా సిరాభిర్వా యథాదోషం యథాబలమ్ (చ.చి. 29/36)

వాతరక్తజనిత ఉపద్రవములు ఒక స్థానమునుండి మరియొక స్థానమునకు మారుచున్నపుడు సిరావ్యధనము ద్వారాగాని లేక రోగాక్రాన్త స్థానమున ప్రచ్ఛానము చేయించుట ద్వారాగాని రక్తమోక్షణము చేయింపవలెను.[1]

రాగము వేదన దాహముతో కూడియున్న వాత రక్తమునందు రక్తమోక్షణము చేయించి శీతల ప్రలేపములు చేసిన దాహము మొదలగునవి శమించును.[2]

పాదములందు. బాహువులందు లలాటమునందు సిరావ్యధనము చేసి రక్త మోక్షణము చేయింపవలెను.[3]

రక్తమోక్షణ నిషేధము.

అంగములందు గ్లాని ఐనను, రూక్షత్వమైనను అధికముగా ఉన్నపుడును వాత ప్రధాన వాత రక్తము నందును రక్తమోక్షణము చేయింపరాదు.

అట్టి అవస్థలలో రక్తమోక్షణము చేయించినచో రక్తక్షయము కలుగుట చేత ప్రకోపించిన వాతము గంభీరమైన శోధ, స్తబ్ధత, శరీర కంపము, స్నాయు సిరాగత వ్యాధులు, అంగముల సంచకోచ గ్లాని ఈ లక్షణములను కలిగించును.

రక్తమును అధిక పరిమాణములో స్రవింపచేసినను ఖంజత్వము మొదలగు వాతరోగములుగాని మృత్యువు గాని సంభవించును. అందుచేత స్నేహనా

---

1. రుగ్దాహశూలతో దార్తాత్ (రుగ్దాహతోదరాగార్తాత్)అసృక్ స్రావ్యం
 జలౌకసా శృంగైస్తుంబైర్హరేత్ సుప్తికండూచిమాయనాత్
 దేశాద్దేశం ప్రజత్ స్రావ్యం సిరాభిః ప్రచ్ఛనేన వా (చ.చి. 29/37-38)
2. చ.చి.29/131
3. భై.ర 27/193

నంతరము అట్టి స్థితులలో తగిన ప్రమాణములో మాత్రమే రక్తమోక్షణము చేయింపవలెను.[1]

రక్తమును ఆశుద్ధముగా నున్నపుడు ఒక ప్రసృతము పరిమాణములో నిర్హరణము చేయవలెను.[2]

## శోధనము

వాతరక్తము నందు సామాన్యముగా దోషములధికముగా నున్నచో మొట్ట మొదటగా స్నేహనము చేయించి తదుపరి స్నేహయుక్త విరేచన ద్రవ్యములచే గాని లేక రూక్ష మృదు విరేచక ద్రవ్యములచేగాని విరేచనము చేయింపవలెను. మాటిమాటికి అనువాసన నిరూహ వస్తులను ప్రయోగింపవలెను.[3]

ఆవశ్యకతననుసరించి వమనము చేయింపవలెను. శోధనానంతరము క్రమ క్రమముగా పేయ విలేపాది క్రమములతో భుజింపచేయుచు ఉపచరింపవలెను.[4]

## విరేచనమునకు యోగములు

1. దోషము అధికముగానున్నచో దుగ్ధముతో ఏరండ తైలమును విరేచనము కొరకు పానము చేయింపవలెను. ఔషధము జీర్ణమయిన తర్వాత దుగ్ధాహారమును ఇవ్వవలయును.

2. అభయా కషాయమునుగాని ఘృతభృష్ట అభయాగాని లేక త్రివృత్ చూర్ణమును క్షీరముతోగాని ద్రాక్ష రసముతోగాని యిచ్చి విరేచనము చేయింపవలెను.

---

1. చ.చి. 29/38-40
2. భై.ర. 27/194
3. విరేచ్యః స్నేహయిత్వాఽదౌ స్నేహయుక్తైర్విరేచనైః
   రూక్షైర్వా మృదుభిః శస్తం అసకృత్ వస్తికర్మ చ (చ.చి. 29/41)
4. తతో వమనాదిభి రుపక్రమైరుపపాద్య వ్రతి సంసృష్టభక్తం (సు.చి. 5)

3. త్రిఫలా క్వాథమున తేనె కలిపి పానము చేయించవలెను.

4. వాత రక్తమునందు మలముచేత వాతము ఆవరింపబడుటను గుర్తించి నపుడు కల్పస్థానమున చెప్పబడిన స్నేహయుక్త మృదు విరేచన యోగములను మాటి మాటికి ప్రయోగించి విరేచనము చేయింపవలెను.[1]

## వస్తికర్మ

వాత రక్త వ్యాధియందు వస్తితో సమానమైన చికిత్స మరియొకటిలేదు.

క్షీరము ఘృతము కలిపి వస్తి నిచ్చినచో వాతముతోపాటు దూషిత రక్తాది మలములును నిర్హరణమగును.[2]

వస్తి ప్రదేశమునందు, వంక్షణములు, పార్శ్వములు, ఊరు, పర్వ, అస్థి ఉదరములందు వేదన ఉదావర్తములతో పీడింపబడుచున్నపుడు అనువాసన వస్తితోపాటు నిరూహవస్తిని ప్రయోగించుట ప్రశస్తముగా నుండును.[3]

ఉదరమునందు దాహము శూలయున్న వాత రక్తమునందు వాత రక్త శామకములైన తైలములతో వస్తికర్మ చేయింపవలెను.[4]

## శమన చికిత్సలు

శిలాజితు, శుద్ధ గుగ్గులు, మధు వీని ప్రయోగము వాతరక్తమును శమింప చేయును[5] శోధనానంతరము గుడూచి క్వాథముతో శిలాజితు 200 మి.గ్రా. సేవింప చేయవలెను.

---

1. చ.చి. 29/83, 86-87.
2. చ.చి. 29/88.
3. వస్తివంక్షణపార్శ్వేషు పర్వాఽస్థిజఠరార్తిషు ఉదావర్తే చ
   శస్యన్తే నిరూహాః సానువాసనాః (చ.చి. 29/89)
4. దద్యాత్తైలాని చేమాని వస్తికర్మణి బుద్ధిమాన్ (చ.చి. 29/40)
5. చ.చి. 29/159.

## ఘృత యోగములు

ఈ క్రింది ఘృతయోగములు వాత రక్తమునందు పానము చేయించినచో వాతరక్తము శమించును.

1. శ్రావణ్యాది ఘృతము

2. బలాది ఘృతము

3. ద్రాక్షాది ఘృతము

4. జీవకాది మహాస్నేహము-వాత రక్తమును ఘోరమైన ఇతర వాత వ్యాధులను శమింపచేయును.

5. స్థిరాది ఘృతము-త్రిదోషజ వాతరక్తమును శమింపచేయును.

6. పరూషక ఘృతము-వాత రక్తము, క్షతక్షీణము, విసర్పము మొదలగు వానిని శమింపచేయును.

7. జీవనీయ ఘృతము-వాతరక్త, ధాతుక్షయ, సర్వాంగ ఏకాంగ వాతాది వ్యాధులను శమింపచేయును. రసాయనము, వృష్యము.[1]

8. పురాణ ఘృతమునుగాని ఆమలక సిద్ధ ఘృతమునుగాని పానము చేయింపవలెను.[2]

9. గుడూచిఘృతముగాని శతావరీఘృతమునుగాని పానముచేయింపవలెను.[3]

10. అమృతాది ఘృతము (చ.ద) అన్ని విధములగు వాత రక్తములను త్రికజంఘ, ఊరుజానువుల నాశ్రయించిన వాతరక్తము, క్రోష్టుశీర్షకము, తీవ్ర శూల, ఆమవాతము, వాతరోగములు-వీనిని శమింపచేయును. రసాయనము.

ఘృతములన్నింటిని 5 గ్రా. నుండి 10 గ్రా. వరకు సేవింపచేయవలెను.

---

1. చ.చి. 29/55-76.
2. సు.చి. 5 అ.
3. చ.ద. 22/24-26.

## దుగ్ధములు

ఈ క్రింద క్షీరపాకములు రక్తశామక పిత్తశామకములుగా ఉండుటచే వాత రక్తమును శమింపచేయును.

1. గుడూచీ స్వరస సిద్ధక్షీరము
2. అంశుమత్యాది క్షీరము
3. శ్యామాది క్షీరము
4. బలాది క్షీరము
5. గోమూత్రముతో కలిపిన ధారోష్ణ దుగ్ధమును పానము చేయించిన దోషములు అనులోమనము చెందును.
6. పిత్తము రక్తములచే వాయువుయొక్క మార్గము ఆవృతమైనచో త్రివృత్ చూర్ణముతో, ధారోష్ణ దుగ్ధమును పానము చేయింపవలెను.
7. దుగ్ధము, తైలము, శర్కర వీనిని మథించి తాగించినను వీనితో ఘృతము మధు కలిపిగాని పానము చేయించిన వాత రక్తమునందు ప్రశస్తముగా నుండును.
8. దశమూల సిద్ధ క్షీరము పానము చేయించిన వాత రక్తమునందు కలుగు శూల శమించును.[1]

ఈ దుగ్ధములు 30మి.లీ నుండి 60మి.లీ వరకు పానము చేయింపవలెను.

---

1. చ.చి. 29/71-82, 124.

సుశ్రుతుడు అజాక్షీర ప్రయోగములను వాతరక్త శామకములుగా వర్ణించెను. ఈ క్రింద సిద్ధ అజాక్షీరములు వాత రక్తమునందు పానము చేయింపవలెను.

1. సగము తైలము కలిపిన అజాక్షీరము.

2. యష్టిమధు కలిపిన లేక యష్టి మధుతో సిద్ధముచేసిన అజాక్షీరము[1]

3. శృగాల సిద్ధ అజాక్షీరము.

4. శుంఠ్యాది అజాక్షీరము.

5. శ్యామాది సిద్ధ అజాక్షీరము.

## చూర్ణములు మొదలగునవి

1. గుడహరీతకీ అన్ని విధములగు వాత రక్తములను శమింప చేయును.

2. వర్ధమాన పిప్పలి. పిప్పళ్ళను పాలతోగాని నీటితోగాని నూరి పానము చేయింపవలెను. 5 పిప్పళ్ళతో ప్రారంభించి రోజుకు 5 చొప్పున వృద్ధిచేయుచు సేవింపవలెను. లేక 10 చొప్పున ప్రారంభించి రోజుకు పది పది వృద్ధి చేయవలెను. తిరిగి అదే క్రమముతో తగ్గించవలెను. ఇట్లు పది దినములు సేవించవలెను. సేవనా కాలమున పాలు అన్నము మాత్రము భుజింపవలెను. వీనిని వర్ధమాన పిప్పలి అందురు. ఈ ప్రయోగముచే వాత రక్తము, పాండు, ప్లీహోదరము, హృద్రోగము, ఉదరము-ఇవన్నియు శమించును.[2]

3. ముండీ చూర్ణమును మధు ఘృతముతో సేవింపవలెను. మాత్ర 2 గ్రా.

4. గుడూచి-క్వాథము సేవించినను, ఏరండ తైలముతో సేవించినను, గుడూచి స్వరసము, కల్కము, లేక చూర్ణమును అధిక సమయము వరకు

1. సు. చి. 5/10.
2. సు. చి. 5/27.

సేవించినను వాతరక్తము శమించును. గుడూచి చూర్ణము 6-12గ్రా. సేవింప చేయవలెను.[1]

5. నింబాది చూర్ణము (భై. ర.) 2గ్రా. గుడూచి క్వాథముతో సేవింప చేసిన తీవ్రమైన వాత రక్తము ఆమవాతము, కుష్ఠములు, ప్లీహము మొదలగునవి శమించును.[2]

## క్వా థ ము లు

ఈ క్రింది క్వాథములు వాతరక్తములందు ఇతర ఔషధములకు అనుపానముగను స్వతంత్రముగను ఉపయోగింపదగును. మాత్ర సామాన్యముగా 30-60 మి.లీ పానము చేయవలెను.

1. పిప్పలి, శొంఠి క్వాథము
2. పటోలాది క్వాథము (చ.ద) దాహముతో కూడిన వాతరక్తము శమించును.
3. అమృతాది క్వాథము
4. వత్సాదనీ క్వాథము
5. వాసాది క్వాథము
6. నవకార్షక క్వాథము (చ.ద)
7. ఏరండాది క్వాథము (భై.ర) చిరకాలము నుండి బాధించుచు ఆజాను స్ఫుటితము, ఊర్ధ్వగతము అగు వాతరక్తమును శమింప చేయును.
8. కోకిలాక్షాది క్వాథము (యో.ర) సేవించుచు పథ్యపాలన చేసిన 3 వారములలో వాతరక్తము శమించును.
9. సింహాస్యాది క్వాథము (భా.ప్ర) వాతరక్త, ఆమవాత, కటిశూలాదులు శమించును.
10. త్రివృతాది క్వాథము (భా.ప్ర)

---

1. చ.ద. 23.
2. భై. ర. 27.

## తైలములు

తైలములు ప్రధానముగా వాతహరములుగా నున్నప్పటికిని విశిష్ట ద్రవ్యములచే పాకము చేయబడుటచే రక్త, పిత్త శామకములుగా నుండి వాతరక్తమును శమింప చేయగలుగును. ఈ తైలములు సాధారణముగా పానమునకు, నస్యమునకు, అభ్యంగమునకు, మరియు వస్తికర్మకు ఉపయోగింపబడును. పరిషేకాదులకును ప్రయోగింపబడును. వీని ప్రయోగముచే వాతరక్తమును విశేషముగా దాహము, శూల మొదలగు లక్షణములను శమించును.[1]

1. మధు పర్ణ్యాది తైలము-సర్వశరీరమున వ్యాపించిన వాతరక్తమును శమింప చేయును.
2. సుకుమార తైలము—వాతరక్తము, మన్యాస్తంభ, హనుగ్రహ, సర్వాంగవాత, ఏకాంగవాతాది వ్యాధులను శమింపచేయును.
3. అమృతాది తైలము వాతరక్తము వాతవ్యాధులు అపస్మారము మొదలగు వ్యాధులను శమింపచేయును.

బల్యము, పుష్టికరము

4. మహాపద్మ తైలము
5. ఖుడ్డాక పద్మ తైలము
6. శతపాక మధుక తైలము
7. శతపాక మధు పర్ణీ తైలము—వాతరక్త, విసర్ప, పాండుహృద్రోగ, త్రిదోషజ వ్యాధులను శమింపచేయును.
8. శతపాక లేక సహస్రపాక బలాతైలము వాతరక్తము, వాతవ్యాధి హరము రసాయనము, బల్యము. (చరక)

---

1. దద్యాత్తైలాని చేమాని వస్తికర్మాణి బుద్ధిమాన్
నస్యాభ్యఞ్జన సేకేషు దాహశూలోపశాన్తయే (చ.చి. 29/90)

9. నాగబలా తైలము (చ.ద)

10. గుడూచ్యాది తైలము (చరక)

11. బృహత్ గుడూచి తైలము(చ ద)అన్ని విధములగు వాతరక్తము లను విశేషించి త్రిదోషజ వాతరక్తమును శమింప చేయును.

12. ఆరనాలాది తైలము (చరక) అభ్యంగము మాత్రమే జ్వరము, దాహము, వేదన శమించును.

13. పిండతైలము (చరక) అభ్యంగమునకు మాత్రమే ఉపయోగింప వలెను.

14. ద్విపంచమూలాది తైలము (సు.చి)

ఈ క్రింది తైలములు అభ్యంగమునకు మాత్రమే ఉపయోగింపదగినవి.

అ) మహాపిండతైలము—వాతరక్త. ఆమము, కుష్ఠ, గ్రంధి మొదలగు వానిని శమింపచేయును.

ఆ) మహారుద్ర గుడూచీ తైలము

ఇ) విషతిందుక తైలము

ఈ) రుద్ర తైలము

ఉ) మహారుద్ర తైలము (భై.ర)

## గుగ్గులు

గుగులు తీక్ష్ణోష్ణ గుణములచే కఫవాతములను, సరగుణముచే పిత్తమును శమింప చేయును. అస్థి, సంధి, మజ్జాలను నాశ్రయించిన వాతమును శమింప చేయును. హృదయమునకు హితమును కలిగించును.[1]

---

1. సు. చి. 5 అ.

వాతరక్తమునందు ఈ క్రింది గుగ్గులు యుక్త ఔషధములు ప్రయోగింపబడును. మాత్ర సామాన్యముగా 500 మి.గ్రా నుండి 1 గ్రా. వరకు ఉండును. గుడూచి మొదలగు వాని క్వాథములతో ఇవ్వబడును.

1. కైశోర గుగ్గులు (చ.ద) అన్ని విధములగు వాతరక్తములు, ప్రమేహ పిటక, వ్రణము—మొదలగువానిని శమింపచేయును.

2 అమృతా గుగ్గులు (చ.ద) 1-2 గ్రా. సేవించిన వాతరక్త, కుష్ట, ఆమవాత, వ్రణ, ఆఢ్యవాతాదులను శమింపచేయును.

3. పునర్నవా గుగ్గులు (చ.ద) వాతరక్త, దుష్టవ్రణ, ఆమవాత, ఊరుస్తమ్భాది వ్యాధులను శమింపచేయును.

4. రసాభ్ర గుగ్గులు (భై.ర) కజ్జలి, లోహభస్మ, అభ్రకభస్మ, గుగ్గులు మొ॥ ప్రధాన ద్రవ్యములు వాతరక్త, కుష్ట, అపచి, గండమాల మొదలగు వానిని శమింప చేయును.

## ఇతర యోగములు

యోగసారామృతము (చ ద) శతావరీ, భూమ్యామలక, నాగబల, వృద్ధదారు ముఖ్య ద్రవ్యములు అగ్నిబలానుసారము సేవించిన వాతరక్తము, కుష్టము, క్షయ మొదలగు వానిని శమింప చేయును. రసాయనము.

## రసౌషధాదులు

1. హరతాళ భస్మ 50 మి.గ్రా తేనెతో సేవింపచేసి గుడూచి క్వాథము తాగింపవలెను. జీర్ణ ఉపద్రవములందు [illegible]ము, మొ॥ రక్త శోథ కౌషధములతో సే[illegible] ఇది ప్రధానముగా వాత[illegible]హరము.



2. వాతరక్తాన్తక రసము (భై.ర) ఖజ్జలి, అభ్రక భస్మ, హరతాళ, మణి శిల, శిలాజతు, గుగ్గులు ముఖ్య ద్రవ్యములు 300-600 మి.గ్రా నింబ పత్ర పుష్పత్వక్ చూర్ణము 1గ్రా. కలిపి గోఘృతముతో ఇచ్చిన అన్ని విధములగు ఉపద్రవ సహవాత రక్తములు శమించును.

3. విశ్వేశ్వర రసము (ర.సా.సం) ఖజ్జలి, విషము, శుద్ధము ముఖ్య ద్రవ్య ములు 100-200 మి.గ్రా సేవించిన వాతరక్తము, కుష్టములు, త్వగ్రోగములు శమించును.

4. ద్వాదశాయసరసము (భై.ర) ఖజ్జలి, స్వర్ణమాక్షిక, స్వర్ణభస్మ, నాగ, తామ్ర, అభ్రక భస్మాదులు ముఖ్య ద్రవ్యములు 100 మి.గ్రా—200 మి.గ్రా సేవింపచేసిన వాతరక్త కుష్ట ఆఢ్యవాతాదులను శమింపచేయును.

5. మహాతాలేశ్వరరసము (ర.సా.సం) కూపీపక్వము.

6. సర్వేశ్వరరసము (శా. సం) ఖజ్జలి, లోహ, అభ్రక, తామ్ర, స్వర్ణ, రజత వజ్ర భస్మాదులు. కూపీపక్వము. 200 మి.గ్రా వాతరక్తమును శమింప చేయును.

7. తామ్రభస్మము, ఖజ్జలి, తాలకము కలిపి సేవింపచేయవలెను.

8. తాళ సింధూరము (ర.సా.సం.) 100-200 మి.గ్రా. తేనెతో వాత ప్రధాన కఫప్రధాన వాతరక్తమును శమింపచేయును.

9. మాణిక్యరస (ర.చం) వాతకఫ వాత రక్త శామకము.

10. గుడూచ్యాది లోహము (భై.ర) 100-300 మి.గ్రా.

11 పిత్తాంతకలోహము (భై.ర) ఖజ్జలి, అభ్రక, తామ్రలోహ భస్మములు ముఖ్య ద్రవ్యములు 200 మి.గ్రా పటోల ధాన్యక క్వాథముతో దాహయుక్త వాత రక్తము శమించును.

**12.** లాంగల్యాది లోహము (భై.ర) లాంగలీమూల, గుగ్గులు, లోహ భస్మ ముఖ్య ద్రవ్యములు 300 మి.గ్రా డోసుపర్యంతము స్ఫుటనము మొదలగు ఉపద్రవములతో గూడిన వాతరక్తమును శమింప చేయును.

## వాతరక్తము నందు బహిః పరిమార్జన చికిత్సలు

వాతరక్తమున ముఖ్యముగా ఉత్తానవాత రక్తమునందు (బాహ్య) ఆలేపన, అభ్యంగ, పరిషేక ఉపనాహాదులచే చికిత్సింపవలయును.

## శీతల లేపములు—ఉష్ణ లేపములు

కఫ ప్రధాన వాతప్రధాన వాతరక్తములందు శీతల ద్రవ్యములతో లేపనము చేసినచో దోషములు స్తంభించి దాహము, శోథ, వేదన, కండు వృద్ధి చెందును. శీతల లేపములచే శరీరోష్మ లోపలనే స్తంభించి ఇట్టి హానికలుగును. అందుచేత ఈ కఫవాత ప్రధాన స్థితులలో ఉష్ణ ప్రలేపములు ప్రయోగించవలెను.

రక్త ప్రధాన, పిత్త ప్రధాన వాత రక్తములందు ఉష్ణ ద్రవ్యములచే లేపనములు చేసినచో దాహము, క్లేదము త్వగవదారణము జరుగును. అట్టి స్థితిలో శీతల దాహశామక ప్రలేపములు ప్రయోగింపవలెను.

అందుచే వాతరక్తమున దోషముల బలాబలములను గమనించి ప్రలేపములు ప్రయోగింపవలసి యుండును.[2]

---

1. i) బాహ్యమాలేపనాఽభ్యంగపరిషేకోపనాహనైః (చ.చి. 29/43)
   ii) ఉపనాహ పరిషేక ప్రదేహాభ్యంజనాని చ శరణాన్యప్రవాతాని మనోజ్ఞాని మహాన్తి చ మృదునందోపధానాని శయనాని సుఖాని చ వాతరక్తే ప్రశస్యన్తే మృదుసంవాహనాని చ (సు.చి. 5 అ.)

2. కఫవాతోత్తరే శీతైః ప్రలిప్తే వాతశోణితే దాహ శోథ రుజా కండూవివృద్ధిః స్తంభనాద్భవేత్ రక్తపిత్తోత్తరే చోష్ణైః దాహః క్లేదోఽవదారణం భవేత్తస్మాద్భిషగ్దోషబలం బుద్ధ్వాఽఽచరేత్క్రియామ్ (చ.చి. 29/47-48)

## పరిషేకములు

జీవనీయ ఘృతము, కాకోల్యాది ఘృతము, కారవేల్లక సిద్ధఘృతము, సుషలీ సిద్ధఘృతము వీనిలో దేనితోనైనను వాతరక్తమునందు పరిషేకము అవగాహము చేయవలెను.

వాతరక్తమున స్తంభము, ఆక్షేపము, శూల-ఈ లక్షణములున్నపుడు జీవనీయసిద్ధి మహాస్నేహములచే వేడివేడిగా పరిషేచనము చేయవలెను.

వాతరక్తమున దాహమున్నచో శీతలమైన జీవనీయ మహాస్నేహము చేపరిషేకము చేయవలెను.

వాతరక్తమున దాహము శూల ఉన్నచో ఈ క్రింది పరిషేకములు చేయింపవలెను. అ) తైలమున గో, అవి లేక ఛాగదుగ్ధము కలిపి లేక ఆ) జీవనీయ క్వాథమున తైలముకలిపి లేక ఇ) లఘు పంచమూల క్వాథమున తైలముకలపి. వాతరక్తమున దాహమునందు ద్రాక్షారసము, ఇక్షురసము, మద్యము, దధిమస్తు అమ్లకాంజికము, తండు లోదకము లేక క్షౌద్రశర్కరాంబుతో పరిషేకము చేయింపవలెను.

వాతహరములగు దశమూలాదిగణ సిద్ధ క్షీరములతోగాని, దాడిమాది అమ్ల రసములతోగాని పరిషేకము చేయించిన వాతరక్తము శమించును.

## ప్రలేపములు

వాతరక్తమునందు రాగము, వేదన, దాహము ఉన్నచో రక్తమోక్షణము చేయించి ముందు చెప్పబడు ప్రలేపములు ప్రయోగింపవలెను. అ) మధుకాది లేపము ఆ) జలజపత్ర లేపము, 3) యష్టాహ్వాది లేపము ఈ) జీవనీయాది లేపము ఉ) తిలాదిలేపము లేక గోధూమాది లేపము.

## ప్రదేహములు

యవాది ప్రదేహము, సహదేవాది ప్రదేహము, లేక సైరేయకాది ప్రదేహము ప్రయోగించినచో వాతరక్తము శమించును.

## దాహశామక స్పర్శాదులు

వాతరక్తమున శీతల చందన జలముచే ప్రోక్షణ చేయబడిన కుముద ఉత్పల పద్మ పుష్పములు మణిహారముల స్పర్శ దాహమును శమింప చేయుటలో ప్రశస్త ముగా నుండును.

చంద్రకిరణములు మరియు శీతల జలముతో కూడిన క్షౌమ వస్త్రములు, కమల పుష్పములు పత్రములతో ఆచ్ఛాదింపబడి శీతల పవనముతో కూడిన నదీతీరమున పరువబడిన శయనము దాహమును వేదనను క్లమమును పోగొట్టి సుఖమును కలిగించును.[1]

## వాతరక్త విశేష చికిత్సలు

### ఉత్తాన వాతరక్త చికిత్స

ఉత్తాన లేక బాహ్య వాతరక్తమునందు ఆలేప, అభ్యంగ పరిషేక, ఉపనాహాదులతో ఉపచరింపవలెను.

### గంభీర వాతరక్త చికిత్స

గంభీర వాతరక్తమునందు విరేచనము, ఆస్థాపన వస్తి, స్నేహపానము వీనిచే ఉపచరింపవలెను.[2]

గంభీర వాతరక్తమునందు రక్తము వాతము ద్వారా ఆక్రాంతమైనపుడు అనగా వాతము అధికముగా వృద్ధిచెంది రక్తముయొక్క క్రియలను ఆచ్ఛాదితము

---

1. i) చ. చి. 29/125-133,
   ii) సు. చి. 5/13-14, 28, 30
2. బాహ్యమాలేపనాఽభ్యంగపరిషేకోపనాహనైః
   విరేకాస్థాపన స్నేహపానైః గంభీరమాచరేత్ (చ. చి. 29/43)

చేసినపుడు వాతరోగమున చెప్పబడిన చికిత్సలచే ఉపచరింపవలెను. వాతము శమించి రక్తము మరియు వాతము సమానస్థితికి చేరిన తదుపరి వాతరక్తమును శమింపచేయు క్రియలచే ఉపచరింపవలెను.[1]

## ఆవృత వాత చికిత్స

మేదస్సు గాని కఫముగాని అధికముగా వృద్ధిచెందుటచే వాతము యొక్క మార్గము అడ్డగింప బడినచో వాతము మిక్కిలి ప్రకోపించును. అట్టి స్థితిలో మొట్టమొదటనే స్నేహన చికిత్సలు, బృంహణ చికిత్సలు ప్రయోగింపరాదు.[2]

## వాతప్రధాన వాతరక్త చికిత్స

ఘృతము, తైలము, వస, మజ్జ-వీనియొక్క పానము, అభ్యంగము, ఈ స్నేహములతోనే అనువాసన వస్తుల ప్రయోగము, సుఖోష్ణమైన ఉపనాహములు వీనిచే వాతప్రధాన వాతరక్తమునందు ఉపచరింపవలెను.[3]

ఉపనాహాదులు-వాతప్రధాన వాతరక్తమునందు వాతఘ్న ద్రవ్యములతో పాకము చేయబడిన స్నిగ్ధమైనవియు క్షీరము చేర్చబడినవియు అగు ముద్గపాయసముచేగాని లేక తిల, సర్షపముల పిండములచేగాని ఉపనాహము చేయించినచో వాతరక్తముచే కలిగిన వేదన శమించును.

బాగుగా సంస్కరింపబడిన జలీయ, ప్రసహ, అనూప మాంసములయొక్క వేశవారములందు జీవనీయ గణౌషధముల కల్కము మరియు స్నేహము కలిపి

---

1. గంభీరే రక్తమాక్రాన్తం స్యాచ్చేత్ తద్వాతవజ్జయేత్
పశ్చాద్వాతే క్రియాం కుర్యాత్ వాతరక్త ప్రసాదనీమ్ (చ. చి. 29/160)
2. కుపితే మార్గసంరోధాత్ మేదసో వా కఫస్య వా
అతివృద్ధ్యాఽనిలే నాఽఽదౌ శస్తం స్నేహనబృంహణమ్
(చ. చి. 29/156)
3. సర్పిస్తైలవసామజ్జాపానాభ్యంగనవస్తిభిః
సుఖోష్ణైరుపనాహైశ్చ వాతోత్తరముపాచరేత్ (చ. చి. 29/44)

వాతరక్తఆక్రాంత ప్రదేశమున ఉపనాహముగా ప్రయోగించినచో స్తంభము, తోద వేదన, ఆయామము, శోధ, అంగగ్రహము-ఈ లక్షణములు శమించును.

జీవనీ యౌషధ సిద్ధకల్కము, క్షీరము, వస వీని ఉపనాహమును పైవిధముగనే గుణమిచ్చును.

యవాది ఉపనాహముగాని, స్నేహఫలోత్కారికా ఉపనాహముగాని యవాది వేశవారోపనాహముగాని బిల్వాది ఉపనాహముగాని మాతులుంగాది లేపముగాని వాతప్రధాన వాతరక్త జనిత వేదనలను శమింప చేయును. దాహశామక లేపములు సహచర, జీవంతీ వీనిని గాని, భర్జితముచేసి క్షీరములో నాన్చిన తిలలనుగాని ఛాగ క్షీరముతో నూరి లేపనము చేసిన దాహము శమించును.

శామక లేపములు-వాతాధిక్యముచే కలుగు శూలయందు అతసీ బీజములను గాని, ఏరండ బీజములనుగాని, శతాహ్వాగాని అజాదుగ్ధముతో నూరి లేపనము చేయవలెను.

మధూచ్ఛిష్టాది లేపము శూల, సంధివాతము, సంధిచ్యుతి, సంధిభగ్నము, ఖంజము, కుబ్జత్వము మొదలగు లక్షణములతో కూడిన వాతరక్తములో ప్రశస్తముగా నుండును.[1]

### పిత్తప్రధాన రక్తప్రధాన వాతరక్త చికిత్స

రక్తప్రధాన, పిత్తప్రధాన వాతరక్తములందు విరేచన కర్మ చేయింపవలెను. ఘృతపానము, దుగ్ధపానము, పరిషేకము, అనువాసన వస్తులు వీనిచేతను[2]

---

1. i) చ. చి. 29/44, 135-144
   ii) సు. చి. 5/15-16

2. విరేచనైః ఘృతక్షీరపానైః సేకైః సవస్తిభిః శీతైర్నిర్వాపణైశ్చాపి రక్తపిత్తోత్తరం జయేత్ (చ. చి. 29/45)

శీతల దాహశామక ప్రలేపాదుల చేతను ఉపచరింపవలెను. రక్త ప్రధాన వాత రక్తమున విశేషించి రక్త మోక్షణము, శీతల తమ ప్రదేహములు ప్రయోగింప వలెను.[1]

## ఆభ్యంతర ఔషధములు

1. శర్కర మధుతో కూడిన ఈ క్రింది కషాయములను పిత్త ప్రధాన వాత రక్తమున పానము చేయింపవలెను.

అ) ద్రాక్షాది క్వాథము

ఆ) శతావర్యాది క్వాథము

ఇ) గుడూచీ క్వాథము

ఈ) పిత్తజ్వర హరి చందనా క్వాథము

2. మధుర తిక్త గణసిద్ధ ఘృతము[2]

3. గంధక రసాయనము (యో. ర.) 300 మి. గ్రా. 600 మి. గ్రా. శర్కరతో కలిపి పాలతో సేవింప చేయవలెను.

4. పంచనింబ చూర్ణము (శా. సం.) 2-4 గ్రా. గుడూచీ క్వాథముతో ఇవ్వవలెను.

## ఉపద్రవాది చికిత్స

వాతరక్తమునందు రక్తము, మరియు పిత్తము అత్యధికముగా వృద్ధి చెందినచో రోగాక్రాన్త ప్రదేశము శీఘ్రముగా పాకమును పొందును. తదుపరి పగిలి విదగ్ధ రక్తముగాని పూయముగాని స్రవించును.

---

1. రక్త ప్రబలేఽప్యేవం బహుశశ్చ శోణితముపసేచయేత్ శీతత మాశ్చ ప్రదేహాః కార్యాయితి (సు. చి. 5 అ)

2. సు. చి. 5 అ.

ఇట్టిస్థితిలో వ్రణములకు వలె భేదన, శోధన, రోపణాది క్రియలచే చికిత్సింప వలెను.

ఈ స్థితులలో ఇతర ఉపద్రవములేమైనను కలిగినచో తత్తదనుసార చికిత్సలచే ఉపచరింప వలెను.[1]

బాహ్య చికిత్సలు :-

1. ప్రపౌండరీకాది లేపము పిత్త, రక్తప్రధాన వాతరక్తమున కలుగు వేదన, దాహము, విసర్పము, రాగము, శోఫ వీనిని శమింపచేయును.
2. బిసాది కషాయ యుక్త క్షీరముగాని, క్షీరే క్షురసాదులుగాని, ద్రాక్షాది క్వాథమునుగాని పరిషేకముగా ప్రయోగింపవలెను.
3. కాకోల్యా ఘృతముతోగాని, శతధౌతఘృతముతోగాని అభ్యంగనము చేయింపవలెను.
4. శాలి షష్టికాది పిష్టమున ఘృతము కలిపి ప్రదేహము చేయవలెను.
5. విశేషించిరక్త ప్రబల వాతరక్తమున అత్యంత శీతల ప్రదేహములు ప్రయోగింపవలెను.[2]

## కఫ ప్రధాన వాతరక్త చికిత్స

కఫప్రధాన వాతరక్తమునందు మృదువుగా వమనము చేయింపవలెను.

---

1. రక్తపిత్తాఽతి వృద్ధ్యా తు పాకమాశు నియచ్ఛతి భిన్నం స్రవతి వా రక్తం విదగ్ధం పూయమేవ వా తయోః క్రియా విధాతవ్యా భేదశోధనరోపణైః కుర్యాదుపద్రవాణాం చ క్రియాం స్వాం స్వాచ్చికిత్సితాత్
(చ. చి. 29/161-162)

1. i) చ.చి. 29/134
ii) సు.చి. 5/18-21

స్నేహసేకములు, లంఘనము అత్యధికముగా చేయింపరాదు. కోష్ణ లేపములచే ఉపచరింపవలెను.[1]

కఫము మేదస్సు అధికముగా వృద్ధి చెందినచో వ్యాయామము, శోధనము, అరిష్టములు, మూత్రములు—వీని పానము, విరేచనము, తక్రాభయా ప్రయోగము. ఈ క్రియలచే కఫమును మేదస్సును క్షీణింప చేయవలెను.[2].

**ఆభ్యంతరౌషధములు :-**

1. ధాత్రీ హరిద్రా ముస్తా — వీని కషాయము పానము చేయింపవలెను.
2. త్రిఫలా క్వాథము తేనె కలిపిగాని
3. మధు కాది క్వాథము తేనె గోమూత్రము కలిపిగాని పానము చేయింప వలెను.
4. గుడ హరీతకీ ఉదకముతో ఇవ్వవలెను.[3]
5. కటుకాది కల్కము మధు కలిపి గోమూత్రముతో పానము చేయింప వలెను.
6. ధాత్ర్యాది క్వాథము
7. గుడ ఘృత ప్రయోగము.[4]

---

1. వమనం మృదు నాత్యర్థం స్నేహసేకౌ విలంఘనం
   కోష్ణా లేపాశ్చ శస్యన్తే వాతరక్తే కఫోత్తరే (చ.చి. 29/46)
2. వ్యాయామశోధనాఽరిష్టమూత్రపానైః విరేచనైః
   తక్రాఽభయాప్రయోగైశ్చ శమయేత్కఫమేదసీ (చ.చి. 29/157)
3. i) చ.చి. 29/86
   ii) సు.చి. 5/22
4. చ.ద. 23/114-17

బాహ్య చికిత్సలు :-

కఫ ప్రధాన వాత రక్తమునందు శోథ, గౌరవము, కణ్డు మొదలగు ఉప ద్రవములున్నచో మూత్రక్షార సురాపక్వ ఘృతమును అభ్యంగము చేయింపవలెను.

పద్మకాది ఘృతమునుగాని, క్షారాది తైలముగాని అభ్యంగ పరిషేకములకు ప్రయోగింపవలెను.

మస్తు మూత్రాది ఘృతము అభ్యంగము చేయింపవలెను.

తైల మూత్రాది క్వాథముచే పరిషేకము చేయవలెను.

సర్షపాది లేపము, కపిత్థాదిలేపము, కఫప్రధాన వాతరక్తమున ప్రశస్తముగా నుండును.

ప్రదేహములు—తిలాది ప్రదేహమునుగాని, లేక ఈ క్రిందివానిని క్షారోదకముతో నూరి సుఖోష్ణముగా ప్రదేహముగా ప్రయోగించిన కఫప్రధాన వాతరక్తము శమించును.

శ్వేత సర్షప కల్కము, తిలాశ్వగంధా కల్కము, ప్రియాలాది కల్కము, మధుశిగ్రాదికల్కము, లేక వ్యోషాది కల్కముగాని లేక శాలి పర్ణ్యాదికల్కము పాలతో నూరిగాని ప్రదేహముగా ప్రయోగింపవలెను.[1]

## సంసర్గజ వాతరక్తచికిత్సలు

సంసర్గ సన్నిపాత దోషజ వాతరక్తములందు ఆయాదోషానుసారము చెప్పబడిన చికిత్సలను కలిపిచేయవలెను.[2]

---

1. i) చ.చి. 29/145-148
   ii) సు.చి. 5/23-25

2. సు.చి. 5/26

## వాతకఫజ వాతరక్త చికిత్స

వాతకఫజ వాతరక్తమునందు గృహధూమాది లేపము, లేక తగరాది లేపము ప్రయోగింపవలెను.

మధుశిగ్రు బీజములను కాంజికముతో నూరి లేపనము చేసి తదుపరి కాంజికముతో పరిషేచనము చేయవలెను.[1]

## త్రిదోషజ వాత రక్త చికిత్స

1. త్రిఫలాది కల్కము సేవింపుచు దధి, శుక్త క్షీరాదులను విరుద్ధాహారములను త్యజించి పథ్యములను పాటించుచున్న శూలతో కూడిన సర్వదోషజ వాతరక్తము శమించును.

2. బోధి (అశ్వత్థ) వృక్ష త్వక్ క్వాథము తేనెతో కలిపి సేవించిన దారుణమైన త్రిదోషజ వాతరక్తము శమించును[2].

---

1. చ.చి. 29/149-151
2. చ.చి. 29/152-154, 158.

# వాత రక్తమునందు పథ్యాపథ్యములు

## పథ్యములు[1]

**ఆహారములు :-**

పురాణయవలు, గోధుమలు, నీవారధాన్యము, శాలి షష్టికధాన్యములు కలమ ధాన్యము.

ఆఢకములు, చణకములు, ముద్గలు (పెసలు), మసూరములు, సమకుష్ఠక ములు.

సునిషణ్ణకము, వేత్రాగ్రములు, కాకమాచి, శతావరి, వాస్తూకము, ఉపోదిక (బచ్చలి), కారవేల్లకము, తండులీయకము, ప్రసారిణీ, దత్తూరము, వృద్ధ కూష్మాండము, శమ్యాకి పల్లవములు, పటోలము, మృద్వీకము, గుడూచి — ఇతర తిక్తశాకములు.

నవనీతము, ఘృతము, ఏరండతైలము, అజ, మహిష, గోదుగ్ధము మాంసములు:- లావక, తిత్తిర, మయూర, కుక్కుట మొ॥ విష్కిర పక్షుల ప్రాణుల మాంసములు, శాక, దత్యూహ (పక్షి విశేష) కపోత, చటక మొ॥ ప్రతుద పక్షుల మాంసము.

శ్వేత శర్కర——వీని సేవన వాతరక్తములందు హితకరముగా నుండును.

---

1. i) పురాణా యవగోధూమనీవారాః శాలిషష్టకాః భోజనార్థం రసార్థం వా విష్కిరప్రతుదాః హితాః ఆఢక్యశ్చణకాః ముద్గాః మసూరాస్సమకుష్ఠకాః యూషార్థం బహుసర్పిష్కాః ప్రశస్తా వాతశోణితే (చ.చి. 29/50-51)

ii) చ.చి. 29/52-53,159

iii) సు.చి. 5/30,34,35

iv) భై.ర. 27/195-202

## విహారములు

అభ్యంగము, పరిషేచనము, ప్రలేపనములు మృదు సంవాహనములు ఇవి హితకరముగా నుండును.

కషాయ, ఘృత, తైలాదులతో పరిషేకము, గాలి తగులకుండా ఉండు గృహమున ఆవాసము, మనోజ్ఞముగను, విశాలముగను ఉండు గృహమున మృదువయిన తలగడలు, బాలీసులతో సుఖకరమగు శయనములపై పరుండుట.

## అపథ్యములు

**ఆహారములు :-**

కటు, ఉష్ణ, అమ్ల, లవణ, గురు, అభిష్యంది కఫకారక ఆహారములు సేవించుట.

మాష, కులత్థ, నిష్పావములు, కలాయములు, క్షారములు, మూలకము, పిణ్యాకము, సక్తు, విరుద్ధాహారములు, దధి అమ్ల కాంజికము. అంబుజ అనూప మాంసములు, ఇవన్నియు వాతరక్తమున అపథ్యములు కాన వర్జింపవలెను.

**విహారములు :-**

దివాస్వప్నము, ఆతప, అగ్ని సేవన, వ్యాయామము, మైథునము, కోపము- ఇవన్నియు వాతరక్తమున వర్జింపవలెను.[1]

---

1. i) దివాస్వప్నం ససన్తాపం వ్యాయామం మైథునం తథా
 కట్వుష్ణం గుర్వభిష్యంది లవణామ్లం చ వర్జయేత్ (చ.చి.29/49)

 ii) వ్యాయామం మైథునం కోప ముష్ణామ్ల లవణాశనమ్
 దివాస్వప్నమభిష్యన్ది గురు చాన్నం వివర్జయేత్ (సు.చి. 5)

 iii) భై.ర. 27/203-205

# ఊరుస్తంభము

## నిరుక్తి :

మేదస్సుతోపాటు కఫము, వాతము, పిత్తము కలసి ధిక్కరించి అత్యధిక మైన తనయందలి స్థైర్య శైత్య గుణములచేత ఊరు ప్రదేశమునకు చేరి ఊరువులను స్తంభింపచేయు వ్యాధి అగుటచే దీనికి ఊరుస్తంభము అని పేరు కలిగినది.[1]

## నిదానము :

భుజించిన ఆహారము కొద్దిగా జీర్ణమై మిగిలినది అజీర్ణముగా ఉండు అవస్థ యందు స్నిగ్ధ ఉష్ణములను, లఘు-శీతములను, ద్రవ-శుష్కములను అగు పరస్పర విరుద్ధమైన గుణములు కలిగిన పదార్థములన్నింటిని ఒకటిగా చేర్చి భుజించినను, పెరుగు పాలు, గ్రామ్య-అనూప జౌదక జంతువుల మాంసములను ఒకటిగా చేర్చి భుజించినను, పిష్టముతో చేసిన భక్ష్యాదులను, చెడిపోయిన మద్యమును అధికముగా త్రాగినను, పగటియందు అధికముగా నిద్రపోయినను, రాత్రులందు జాగరణచేసినను, ఉపవాసము ఉండినను, భుజించిన వెంటనే మరల భుజించినను, శరీరమునకు అధికశ్రమను కలిగించు పనులను విశేషముగా చేసినను, భయపడినను, మలమూత్ర వాతాది వేగములను నిరోధించినను, స్నేహమును అధికముగా పానము చేయుటవలన మొదలైన కారణముల వలన ఊరుస్తంభము జనించును.[2]

---

1. ఊరూ శ్లేష్మా సమేదస్కో వాతపిత్తేఽభిభూయ తు
   స్తంభయేత్ స్థైర్యశైత్యాభ్యాం ఊరుస్తంభస్తతస్తు సః (చ.చి. 27/14)
2. స్నిగ్ధోష్ణలఘు(గురు)శీతాని జీర్ణాఽజీర్ణే సమశ్నతః ద్రవశుష్కదధిక్షీర గ్రామ్యానూపౌదకామిషైః పిష్టవ్యాపన్నమద్యాతిదివాస్వప్న ప్రజాగరైః లంఘనాఽధ్యశనాయాసభయవేగవిధారణైః స్నేహాచ్చామం చితం కోష్ఠే వాతాదీన్ మేదసాపహా రుద్ధ్వాశు గౌరవాదూరూ యాత్యధోగైః సిరాదిభిః
   (చ.చి. 27/8-10)

## సంప్రాప్తి :

పైన పేర్కొనబడిన కారణములచేత రసశేష రూపమైన ఆమము కోష్ఠము నందు రోజు రోజుకు సంచితమై నిలిచి వృద్ధిపొంది మేదస్సుతో కలసి వాతపిత్త కఫ మార్గములను అడ్డగించి ఆ త్రిదోషములతో కలసి గురుత్వము కలిగివుండుట చేత హృదయమునుండి క్రిందికి వ్యాపించిన సిరలు మరియు ధమనులందును వ్యాపించి ఆ సిరాధమనులద్వారా శీఘ్రముగా క్రిందికి జారి, మేదస్సుయొక్క బలమువలన మరింత బలమును పొంది తొడల ప్రదేశమందు పిక్కలయందు పూరించును. ఈ విధముగా కఫముతోను, మేదస్సుతోను కలసిన వాతము ప్రకోపించి పిత్తమును నశింపచేసి, తొడలను చెంది వాని యొక్క అస్థులందలి ద్వారమును శ్లేష్మమేదస్సులచేత నింపి స్తంబింపచేయును.[1]

## పూర్వరూపము :

అధికమగు చింతారూపమైన మనోవ్యాపారము ఊరుస్తంభము కలుగక ముందు మనుజునకు కలుగును. అధికమైన నిద్ర, శరీర జడత్వము, జ్వరము, అరుచి, రోమహర్షము, ఛర్ది, జంఘములు ఊరువులు కృశించుట. ఇవి ఊరుస్తంభమునకు పూర్వరూపములు అని తెలియవలెను.[2]

---

1. i) స్నేహాచ్చామం చితం కోష్ఠే వాతాదీన్మేదసా సహ
రుద్ధ్వాశు గౌరవాదూరూ యాత్యధోగైః సిరాదిభిః
పూరయన్ పక్థిజంఘోరు దోషో మేదోబలోత్కటః
అవిధేయపరిస్పందం జనయత్యల్పవిక్రమమ్
మహాసరసి గంభీరే పూర్ణేఽంబు స్తిమితం యథా తిష్ఠతి స్థిరమక్షోభ్యం
తద్వయాయుగతః కఫః (చ.చి. 27/10-12)

ii) సశ్లేష్మమేదః పవనః సామమత్యర్థ సంచితమ్
అభిభూయేతరం దోషమూరూ చేత్ప్రతిపద్యతే (మా.ని. 24/2)

2. ప్రాగ్రూపం ధ్యాననిద్రాఽతి స్తైమిత్యాఽరోచకజ్వరాః
లోమహర్షశ్చ ఛర్దిశ్చ జంఘోర్వోస్సదనం తథా (చ.చి. 27/15)

**లక్షణములు :**

ఊరుస్తంభమునందు ఊరువులు మిక్కిలి శీతలముగ, స్పర్శరహితముగ, చలన రహితముగ, స్వశరీర సంబంధము లేక, మిక్కిలి భారములుగనై వేదనతో కూడియుండును. తొడలయందు కఫము నిలిచి యుండి సంచలనము లేక స్థిరముగా ఉండును. అందువలన భారవంతములై అధిక వేదన కలిగివుండును. స్పర్శ జ్ఞానము నశించి కంపము కలుగును. ఈ విధముగా అనేక బాధలను కలిగించి ప్రాణమును హింసించును.

ఊరు స్తంభమందు ఊరువులు, జంఘములు వీనియందు తీవ్రమైన వేదన కలుగును. కాళ్ళయందు వెంటవెంట వేదన కలుగుచుండును పాదములను నేలపై ఉంచినఎడల బాధకలుగును. శీతల స్పర్శను ఎరుగకుండును,పాదములను సమముగా క్రిందకు ఉంచుట, పీడనము, నడచుట, కదలించుట, ఈ పనులందు సామర్థ్యము లేకుండును జంఘములు, ఊరువులు, పాదములు స్వశరీరమునకు సంబంధించినట్లు ఉండవు. విరిగినట్లు తోచుచుండును. ఈ లక్షణములన్నియు ఊరు స్తంభమునందు కలుగును.[1]

---

1. i) గౌరవాయాససంకోచదాహరుక్సుప్తికంపనైః
భేద స్ఫురణ తోదైశ్చ యుక్తో దేహం నిహన్త్యసూన్
జంఘోరుగ్లానిరత్యర్థం శశ్వచ్చాదాహవేదనా
పదం చ వ్యథతే న్యస్తం శీతస్పర్శం న వేత్తి చ
సంస్థానే పీడనే గత్యాం చాలనే చాప్యనీశ్వరః
అన్యనేయౌ హి సంభగ్నౌ ఊరూ పాదౌ చ మన్యతే
(చ.చి. 27/13,17,18)

ii) కఫమేదోవృతో వాయుర్యదోరు ప్రతిపద్యతే
తదాఽంగమర్దమిత్సరోమహర్షరుజాజ్వరైః
నిద్రయాచాద్దితౌ స్తబ్ధౌశీతలావప్రచేతనౌ
తమూరుస్తమ్భమిత్యాహురాఢ్యవాతమథాపరే (సు.చి. 5/31-32)

స్నేహముచే అనుపశయము :

ఊరు స్తంభమున కలుగు కంపము, సంకోచము మొదలగు లక్షణములను బట్టి వాతవ్యాధి అని భ్రమసి వాతమును హరించుటకై స్నేహనమును పానమునకు అభ్యంగాదులకు ఉపయోగించిన ఎడల పాదములందు తీవ్రమైన వేదన కలిగి స్పర్శజ్ఞానము నశించును. కాలును పైకెత్తుటకు మిక్కిలి కష్టముగా వుండును.[1]

**అసాధ్య లక్షణములు :**

ఊరు స్తంభమునందు దాహము, పోట్లు, ఆర్తి, సూదులు గ్రుచ్చినట్లు బాధ, కంపము, ఈ లక్షణములు కలిగిన ఎడల ఆసాధ్యమై మనుజుని చంపును. ఈ లక్షణములు లేక నూతనమై వుండునది సాధ్యమైనది చికిత్సచేయ దగినది అని తెలియవలెను.[2]

స్నేహనాది కర్మ నిషేధ కారణము :

ఊరుస్తంభ వ్యాధియందు స్నేహమును పాన అభ్యంగములకు, నిరూహ అనువాసన వస్తి కర్మలకు విరేచనము, వమనము చేయుటకు ఉపయోగింపరాదు ఎందువలననగా

స్నేహనము, స్నేహ ఔషధములచే చేయు వస్తి కర్మలును కఫదోష మును వృద్ధి చేయును కావున స్నేహనము చేయరాదు. అంతేకాక కఫమును కఫ స్థానమున ఉండు పిత్తమును, మూలమునుండి సుఖవమనము ద్వారా బయటకు వెడలింపవచ్చును. ఆమాశయమున ఉండు పిత్తమును, కఫమును కూడ విరేచనము ద్వారా సుఖముగా మూలము నుండి వెడలింప సమర్థమగును. అటువంటి వాత

1. వాతశంకిభిరజ్ఞానాత్ తస్య స్యాద్ స్నేహనాత్పునః
పాదయోస్సదనం సుప్తిః కృచ్ఛ్రాదుద్ధరణః తదా (చ.చి. 27/16)
2. యదా దాహార్తి తోదార్తో వేపనః పురుషో భవేత్
ఊరుస్తంభస్తదా హన్యాత్ సాధమేదన్యథా నవమ్ (చ.చి. 27/19)

పిత్త కఫములు మూను పక్వాశయమును ఆశ్రయించి వున్నపుడు వానిని వస్తి కర్మచే వెడలింప వీలగును. కాని అట్లుకాక దోషములు ఊరువులయందు వ్యాపించి మేదస్సుచేత నిరోధింపబడి స్థిరముగ నిలిచి యున్నచో దోషములను పైనచెప్పిన వమన విరేచన వస్తి కర్మల ద్వారా బయటకు వెడలింప వీలుకాదు. కావున శోధన కర్మ ద్వారా ఊరువులందు వ్యాపించిన దోషములను వెడలించుటకు సమర్థము కాదు.

ఇంతేకాక వాత స్థానమైన జంఘమునందు ఊరువులందు, చేరిన దోషములు, వాతము స్తంభించి ఉండుటవలన, దానియందలి శీతగుణము వలన శరీరము నందలి క్రింది భాగమైన ఊరువులందు వుండు దోషములను పైకి వ్యాపింపచేసి అచటినుండి వెడలింపచేయుటకు వమన-విరేచన- వస్తి రూపములైన శోధనములు సమర్థవంతములు కాలేవు.[1]

---

1. తస్య న స్నేహనం కార్యం న వస్తిర్న విరేచనం
న చైవ వమనం యస్మాత్తన్నిశోధిత కారణమ్
వృద్ధయే శ్లేష్మణో నిత్యం స్నేహనం వస్తికర్మ చ
తత్సనోద్ధరణే చైవ న సమర్థం విరేచనమ్
కఫం కఫస్థానగతం పిత్తం చ వమనాత్సుఖం
హర్తు మామాశయస్థౌ చ స్రంసనాత్తావుభావపి
పక్వాశయస్థాస్సర్వేఽపి వస్తిభిర్మలనిర్జయాత్
శక్యాః న త్వామమేదోభ్యాం స్తబ్ధాః జంఘోరు సంస్థితాః
వాతస్థానే హి తచ్చైత్యాత్ వాయోస్తమ్భాచ్చ తద్గతాః
న శక్యాః సుఖముద్ధర్తుం జలం నిమ్నాదివ స్థలాత్ (చ.చి. 27/20-24)

# ఊరుస్తమ్భ చికిత్స

**చికిత్సా సూత్రము :**

శ్లేష్మమును నశింప చేయునవి, కాని వాతమును ప్రకోపింప చేయనివి అగు ఆహారములు, విహారములు మరియు ఔషధములతో ఎల్లప్పుడును ఊరుస్తమ్భ రోగిని ఉపచరించవలెను. ఈ క్రియలు రోగియొక్క శరీరము, బలము, అగ్ని వీనిని రక్షింపుచు చేయుచుండవలెను.[1]

ఊరుస్తంభమున ముందు వివరింపబడిన విధముగా స్నేహనమును గాని వస్తినిగాని విరేచనమునుగాని ప్రయోగింపరాదు. పాన, నస్య, అభ్యంగ, ఆస్థాపన వస్తి- మొదలగు వానికి వేనికిని స్నేహప్రయోగము చేయరాదు.

ఊరుస్తంభమున కఫము ఆమ దోషము అధికముగా ఉండును గాన ప్రారంభమున దోషశామక క్రియలు, క్షపణ, శోషణ చికిత్సలు చేయవలెను. మొట్టమొదట కఫనాశకమగు రూక్ష క్రియలచే ఉపచరించి తదుపరి వాతహర చికిత్సలు చేయవలెను.[2]

---

1. శ్లేష్మణః క్షపణం యత్స్యాత్ న చ మారుతమావహేత్
   తత్సర్వం సర్వదా కార్యం ఊరుస్తంభస్య భేషజం
   శరీరం బలమగ్నిం చ కార్యేష్వా రక్షతా క్రియా (చ.చి. 27/60-61)

2 i) తస్య న స్నేహనం కార్యం న బస్తి ర్న విరేచనమ్ పశ్చో రూక్షక్రమః
   కార్యస్తత్రాదౌ కఫనాశనః పశ్చాద్వాతవినాశాయ కృత్స్నః కార్యః
   క్రియా క్రమః (భై.ర.28/2)

ii) తస్య సంశమనం నిత్యం క్షపణం శోషణం తథా
   యుక్త్యపేక్షీ భిషక్కుర్యాదధికత్వాత్కఫామయోః (చ.చి. 27/25)

కఫహర, రూక్షణ చికిత్సలచే నిద్రానాశము అరతి మొదలగు లక్షణము లతో పాటు వాతము ప్రకోపించుటయు కఫము మేదస్సులు అధికముగా క్షీణించు టయు జరిగినచో స్నేహ స్వేదాది వాతహర చికిత్సలు చేయవలెను.[1]

శమన యోగములు మొదలగునవి.

క్షారములు, అరిష్టములు- వీనియొక్క ప్రయోగము, హరీతకీ ప్రయోగము, మధూదకము, పిప్పలీ ప్రయోగము-ఇవి ఊరు స్తంభమును శమింపచేయును.[2]

గుగ్గులును శోధన చేసి గోమూత్రమున రాత్రి అంతయు నాన్చి ప్రాతః కాలమున పానము చేసిన ఊరు స్తమ్భము శమించును. 500 మి.గ్రా. సేవింప చేయవలెను.

శోధిత శిలాజితు 200 మి.గ్రా. గో మూత్రముతో ఇవ్వవలెను.

గగ్గులు మరియు పిప్పలీ చూర్ణము కలిపిగాని శొంఠి చూర్ణమును గాని గోమూత్రముతో పానము చేయింప వలెను.

వర్ధమాన క్రమములో పిప్పలీప్రయోగము తేనెతోగాని గుడముతోగాని సేవింపుచు స్నేహమును వర్జింపవలెను.

పిప్పల్యాది గణ చూర్ణము

షడూషణ చూర్ణము

---

1 i) రూక్షణాద్వాతకోపశ్చేత్ నిద్రానాశా_ర్తిపూర్వకః
స్నేహస్వేదక్రమ_స్తత కార్యో వాతామయాపహః (చ.చి. 27/40)

ii) యదాస్యా తాం పరీక్షిణే భూయిష్ఠే కఫమేదసీ
తదా స్నేహాదికం కర్మ పునరత్రావచారయేత్ (సు.చి. 5/39)

2. క్షారాఽరిష్టప్రయోగాశ్చ హరీతక్యా_స్తథైవ చ
మధూదకస్య పిప్పల్యాః ఊరు స్తంభ వినాశనాః (చ.చి.27/28)

షడ్ధరణ చూర్ణము- వీనిలో దేనినైనను ఉష్ణోదకముతో సేవింప చేయ వలెను. వీనిచే కఫమేదస్సులచే ఆవరింపబడిన వాతము శమించును.[1]

మూర్వాది చూర్ణము

స్వర్ణక్షీర్యాది చూర్ణము

ఫలీవ్యాఘ్ర నఖాది చూర్ణము

త్రిఫలాది చూర్ణము

సమంగాది చూర్ణము

శ్రీ వేష్టకాది చూర్ణము- వీనిలో దేనినైనను మధుతోగాని లేక మధూదక ముతో గాని సేవింపచేయవలెను.[2]

ఊరుస్తంభము ఈ క్రింది ఔషధములతో తగిన వానిని కల్కముగా చేసి మధుయుక్తముగా పానము చేయించిన శమించును.

1) ముస్త, హరీతకి, లోధ్ర, పద్మకము, కటుకరోహిణి

2) దేవదారు, హరిద్రద్వయము, వచ, కటుకరోహిణి

3) పిప్పలి, పిప్పలీమూల, సరళ, దేవదారు

4) చవ్య, చిత్రకము, దేవదారు, హరీతకి

5) భల్లాతకి, పిప్పలి, పిప్పలీమూలము.

శార్ఙ్గేష్టాది చూర్ణమును జలముతోగాని, మధుతోగాని, దధి మండముతో గాని సేవింపచేసిన ఊరుస్తంభము శమించును.[3]

ఈ క్రింది క్వాథములు ఊరుస్తంభమును శమింపచేయును.

1. భల్లాతకాదిక్వాథము

---

1. సు.చి. 5/60-62

2. చ.చి. 27/29, 35-38.

3. చ.చి. 27/32-34

2. రాస్నాదికాథము

3. పిప్పల్యాదికాథము

సంజాభద్ర రసము (భై.ర) ఖజ్జలి, గుంజ (శోధిత) జయన్తి నింబ బీజములు, జయపాల బీజములు ముఖ్యద్రవ్యములు 400 మి.గ్రా, హింగుచూర్ణము 200 మి.గ్రా. కలిపి సేవించిన తీవ్రమైన ఊరుస్తంభము గూడా శమించును.

గండీరారిష్టము సేవించినను ఊరుస్తంభము శమించును.[1]

## తైల యోగములు :

రూక్షణ క్రియలచే వాత ప్రకోపము కలిగినపుడు ఈ క్రింది తైలములను ఊరుస్తంభమునందు పానము చేయింపవలెను.

1. పీలుపర్ణ్యాది తైలము

2. కుష్ఠాది తైలము

3. సైంధవాది తైలము - ఈ తైలము గృధ్రసీ ఊరుస్తంభము అన్ని విధములగు వాత రోగములు, వంధ్యత్వము, వీనిని శమింపచేయును.[2]

4. అష్టకట్వర తైలము పానము చేసిన గృధ్రసీ, ఊరుగ్రహము శమించును.

ఊరుస్తంభము నందు కఫమును శమింప చేయుటకు ఈ క్రింది ఉత్సాదన, లేప పరిషేకాదులను ప్రయోగించుట హితకరముగా నుండును.

## ఉత్సాదనములు :

అ) వల్మీకమృత్తిక, కరంజ మూలత్వక్, ఫలము, ఇష్టికా చూర్ణము.

---

1. భై.ర. 286.

2. చ.చి. 27/41-46.

ఆ) అశ్వగంధా గాని అర్కము గాని నింబమూల త్వక్ చూర్ణముగాని, దేవదారు చూర్ణముగాని, మధుసర్షపములతో పై ద్రవ్యములన్నింటిని కలిపిగాని ఉత్సాదనమునకు ప్రయోగింపవలెను.

ప్రలేపములు :

అ) దన్త్యాది ప్రలేపము

ఆ) సర్షపాది ప్రలేపము

ఇ) వత్సకాది ప్రలేపము

ఈ) శ్యోనాకాది ప్రలేపము[1]

ఉ) రసోనాది ప్రలేపము (భై. ర) ఉష్ణగాఢ లేపనముచే ఊరుస్తంభ జనిత పీడ శమించును.

పరిషేకములు :

అ) తర్కార్యాది ద్రవ్యసిద్ధ ఉష్ణజల పరిషేకము

ఆ) శ్యోనాకాది పరిషేకము[2]

ఉపద్రవ చికిత్స :

ఊరుస్తంభము నందు ఉపద్రవముగా కలుగు హృద్రోగము, అరుచి, గుల్మము, అభ్యన్తర విద్రధి- వీనియందు ఈ క్రింది విధముగా చికిత్సింపవలెను.

అ) క్షారము, గోమూత్రములతో కూడిన రూక్షౌషధములను సేవింప చేయుట.

---

1. చ. చి. 27/47-55

2. చ. చి. 27/52, 56-57

అ) స్వేదకర్మ

ఇ) రూక్షకరమైన ఉత్సాదనములు

ఈ) కరంజ ఫలము, సర్షపములు గోమూత్రముతో నూరి లేపము చేయుట[1]

## ఊరుస్తంభమునందు పథ్యములు :

రూక్షత్వమును కలిగించుటకై ఎల్లపుడును జలము అల్పతైలములతో లవణ రహితముగా సిద్ధము చేయబడిన శాకములతో యవలు, చామలు, కొర్రలు, వీనితో సిద్ధము చేయబడిన అన్నమును భుజింప చేయవలెను.

సునిషణ్ణకము, నింబపత్రము, అర్కపత్రము, వేత్రాగ్రములు, ఆరగ్వధ పత్రము, వాయసీ, వాస్తూకము, పటోలాది ఇతర తిక్తశాములు సేవించుట హిత కరముగా నుండును.

అపతర్పణాదులచే వాతము ప్రకోపించినపుడు జాంగల పశుపక్షుల మాంస రసములతో పురాణ శాల్యాన్నమును సంతర్పణము కొరకు సేవింప చేయవలెను.

ఉద్దాలశాలి ధాన్యము, శుష్కమూలకము మొదలగునవి ఉపయోగింప వచ్చును.

శోభాంజనము, కారవేల్లకము. లశునము, కాకమాచీ, వార్తాకము, ధత్తూ రము, శంపాకశాకము, పిణ్యాకము, కటుతిక్త కషాయ ద్రవ్యములు, క్షారము.[2]

---

1. హృద్రోగమరుచిం గుల్మం తథాఽభ్యన్తర విద్రధిమ్
   సక్షార మూత్రస్వేదాంశ్చ రూక్షాణ్యుత్సాదనాని చ
   కుర్యాద్దిహ్యాశ్చ మూత్రాద్యైః కరంజఫలసర్షపైః (సు. చి. 5/63)

2. i) చ. చి. 27/26, 27, 39

ii) సు. చి. 5/64-65

iii) భై. ర. 4-6

**విహారాదులు :**

ఊరు స్తంభము నందు కఫమును శమింప చేయుటకై సామర్థ్యము ననుస రించి వ్యాయామము చేయుచుండవలయును. ఎత్తునుండి దుముకుటకు అలవాటు చేయింపవలెను. కంకర, ఇసుక ఉన్న ప్రదేశములలో మాటి మాటికి దుముకుట అభ్యాసము చేయింపవలెను.

స్వచ్ఛమైన జలములు గల నదీ ప్రవాహమునకు విపరీతముగా ఈద వలయును. స్వచ్ఛముగను శీతలముగను ఉండు, స్థిరముగానుండు హోటల్‌లో మాటి మాటికి జలక్రీడలాడినచో కఫము శోషించిన ఊరు స్తంభమును శమింప చేయును.[1]

**అపథ్యములు :**

గురు, శీత, ద్రవ, అతిస్నిగ్ధ ద్రవ్యములతో కూడినవియు, విరుద్ధాహార సేవన అసాత్మ్యాహార సేవన స్నేహనము, ఇవి అహితకరముగా నుండును. కాన త్యజింపవలయును.[2]

విరేచనము, స్నేహనము, వమనము, రక్తమోక్షణము, వస్తి- ఈ క్రియలు గూడా ఊరు స్తంభమున నిషిద్ధము.

---

1. చ. చి. 27/58-59
2. భై. ర. 28/32



# స్థౌల్య - కార్శ్య ప్రకరణము

చరకుడు అతిస్థౌల్యము, అతికార్శ్యము ఈ రెండు స్థితులను అష్టవిధ నిందిత పురుషులలో పేర్కొనెను.[1]

సుశ్రుతుడు శరీరము స్థూలత్వము పొందుటగాని కృశత్వము పొందుటగాని ఆహార రసముపై ఆధారపడి యుండునని వివరించెను.[2]

మధ్యమ శరీరము కలిగియుండుట ఆరోగ్యకరము. అతి స్నిగ్ధములు గాని అతి రూక్షములు గాని అగు ఆహారములను కాక ఉభయ సాధారణమగు ఆహార ద్రవ్యములను సేవించుచున్నచో ఆహార రసము ప్రాకృతముగా నుండి శరీరమంతను ప్రసరించుచు రసాది ధాతువులను సమములుగా చేయుచు వృద్ధినందింప చేయును. ధాతువులు సమస్థితిలో నున్నచో మధ్యమ శరీరుడుగ నుండును.

శరీరమున మాంస ప్రమాణము సమముగా నుండి శరీర సంహననము సమముగా నుండి యున్నచో అట్టి మనుజుడు అన్ని శారీరక వ్యాపారములను సమర్థవంతముగా నిర్వహింప గలిగియుండును. దృఢమైన ఇంద్రియములు కలిగి ఆకలి జరణశక్తి సమముగా నుండును.

---

1. చ. సూ. 21/3

2. రసనిమిత్తేన స్థౌల్యం కార్శ్యం చ (సు. సూ. 15/32)

అట్టి మనుజుడు ఆకలి, దప్పి, శీతము, ఉష్ణము, వర్షము, ఎండ వ్యాయామము, వీనిని ఓర్చుకొనగలిగినవాడుగను, బలవంతుడుగను ఆరోగ్యవంతుడుగను ఉండును. ఏవిధమైన వ్యాధులును అతనిని బాధింపవు.[1]

శరీరముయొక్క ధారణ, తర్పణ, పోషణ, యాపనములకొరకు ఆహారము మరియు సుఖకరమైన నిద్ర అత్యావశ్యకములు. స్థూలతగాని కృశతగాని ముఖ్యముగా ఆహారము మరియు నిద్రలపై ఆధారపడియుండును.[2]

## శుక్రశోణిత సంయోగము-స్థౌల్య-కార్శ్యములు

గర్భాధాన కాలమందలి మార్పులు స్థూలకృశత్వమునకు కారణములగును. తండ్రియొక్క శుక్రము అధికముగానుండి మాతా పితరులయొక్క మేదస్సు (మేదోజనక బీజ భాగము) అల్పముగానున్నచో అట్టి బీజమునుండి ఉత్పన్నమైన సంతానము కృశుడుగా నున్నప్పటికిని బలిష్టముగానుండును.

అట్లుకాక గర్భాదాన కాలమున మేదస్సుయొక్క ఆధిక్యత, శుక్రము (శుక్రజనక బీజ భాగము)యొక్క అల్పత ఉన్నచో ఉత్పన్నమైన సంతానము

---

1. i) యః పునరుభయ సాధారణాన్యనేవేత తస్యాన్నరసః శరీరమనుక్రామన్ సమాన్ ధాతూనూపచినోతి సమధాతుత్వాన్మధ్యశరీరో భవతి సర్వ క్రియాసు సమర్థః క్షుత్పిపాసాశీతోష్ణ వాతవర్షాతపసహో బలవాంశ్చ స సతమనుపాలయితవ్య ఇతి (సు. సూ. 15/34)

ii) సమమాంస ప్రమాణస్తు సమసంహననో నరః దృఢేన్ద్రియత్వాద్వ్యాధీనాం నబలేనాభిభూయతే క్షుత్పిపాసాతపసహః శీతవ్యాయామసంసహః సమపక్తా సమజరః సమమాంసచయో మతః (చ. సూ. 21/18-19)

2. దేహవృత్తౌ యథాఽఽహార స్తథా స్వప్నః సుఖో మతః స్వప్నాహారసముత్థే చ స్థౌల్యకార్శ్యే విశేషతః (చ. సూ. 21/5)

చూచుటకు పుష్టికరముగా నున్నప్పటికిని దుర్బలత్వము కలిగియుండును.

— ఇది భావమిశ్రునిచే వివరింపబడినది.[1]

## స్థౌల్యము

స్థౌల్యము అనేక ప్రమాదకరమైన వ్యాధులకు దారి తీయునదిగా గుర్తింప బడినది. ముఖ్యముగా ఆయుర్వేదమునందు చెప్పబడిన మూడు ప్రధాన మర్మలు స్థౌల్యమువలన వ్యాధితములగును. హృద్రోగములు, ధమనీ వికారములు, రక్త పీడానాధిక్యత, మస్తిష్క్యధమనీ వ్యాధులు పక్షఘాతము, వృక్కరోగములు—ఈ వ్యాధులు స్థూలురలో అధికముగా నుండును.

అధ స్థౌల్యముగలవారి ఆయుర్దాయము తక్కువగానుండునని జీవిత భీమా వారి అంచనాలు తెలుపుతున్నాయి.

### స్థౌల్యమునకు కారణములు

**ఆహారము :**

అధికమాత్రలో, గురు, మధుర స్నిగ్ధ ఆహార పదార్థములు సేవించుట శ్లేష్మవర్ధకమగు ఆహారములు సేవించుట, భుజించిన ఆహారము జీర్ణము కాక మునుపే మరలా భుజించుట పిచ్ఛిల పదార్థములు, అనూప ఔదకమాంసములు, దుగ్ధము, ఘృతము మొదలగు గోరసములు, గుడముతోను పిష్టముతోను చేసిన భోజ్య పదార్థములు, నూతన అన్నములు, నూతన మద్యములు.

**విహారములు :**

వ్యాయామము చేయకపోవుట అతిగా దివాస్వప్నము సేవించుట మైథునము

---

1. అథానసమయే యస్య శుక్రభాగోఽధికో భవేత్
మేదోభాగాస్తు హీనస్స్యాత్సకృశోఽపి మహాబలః (భా.ప్ర. 39/5)

చేయకపోవుట ఏ విధమైన శారీరక చేష్టలు చేయకుండుట, అధికముగా శయనించుట లేక సుఖకరమైన ఆసనముపై కూర్చొని యుండుట అలవాటుగా చేయుట.

**మానసిక కారణములు :**

ఎల్లప్పుడు ప్రసన్న చిత్తముతో నుండుట. చింత శోకాది మానసిక విషయములకు దూరముగా నుండుట.

**ఇతర కారణములు :**

మాతా పితరులయొక్క బీజస్వభావము.

శ్లేష్మవర్ధక, మేదోవర్ధక ఇతర ఆహార విహారాదులు.[1]

**సంప్రాప్తి :**

పై కారణములచే అన్నరసము పక్వముకాక మిగుల మధురమై శరీరము నాక్రమించుచు అతి స్నేహమువలన మేదస్సును అధికముగా ఉత్పన్నము

---

1. i) తదతిస్థౌల్యమతి సంపూరణాద్గురు మధురశీతస్నిగ్ధోపయోగాదవ్యాయామో దవ్యవాయా ద్దివాస్వప్నాద్ధర్ష నిత్యత్వాదచిన్తనాద్బీజ స్వభావాచ్చోప జాయతే (చ. సూ. 21/4)

 ii) తత్ర శ్లేష్మలాహార సేవినో ఉధ్యశనశీలస్యావ్యాయామినో దివాస్వప్నరతస్య చామఏవాన్నరసో మధురతరశ్చ శరీరమనుక్రామన్నతి స్నేహాన్మేదో జనయతి తదతిస్థౌల్యమాపాదయతి (సు. సూ. 15)

 iii) చ. సూ. 23/3-4.

 iv) అవ్యాయామ దివాస్వప్న శ్లేష్మలాహారసేవినః మధురోఽన్నరసః ప్రాయః స్నేహాన్మేదః ప్రవర్ధయేత్ (మా. ని. 34/1)

చేయును. అట్టి మేదస్సుచే రసాది స్రోతోమార్గములు అడ్డగింపబడుటవలన రసాది ధాతువులు వృద్ధిచెందక మేదస్సు మాత్రము వృద్ధిచెందును. అందుచేత మనుజుడు అన్ని కర్మలయందును అశక్తుడుగా నుండును.[1]

## అతిస్థౌల్యముచే కలుగు దోషములు

మేదోధాతువు వృద్ధి చెందుటవలన స్రోతో మార్గములన్నియు మేదస్సుచే ఆవరింపబడును. అందుచే వాతము అధికముగా వృద్ధినొంది కోష్ఠమునందు సంచరించుచు అగ్నిని అధికముగా ప్రజ్వలింపచేయును. ఆ అగ్ని ఆహారమును శోషింపచేయును. ఆహారము అతి శీఘ్రముగా జీర్ణమగుటచే అట్టి మనుజుడు మాటి మాటికి అధికమైన ఆహారమును కోరుచుండును. ఆహారమును కావలసిన కాలమునందు ఇవ్వనిచో దారుణమైన వాత పిత్త వికారములు కలుగును.

ముఖ్యముగా జఠరాగ్ని, వాతము ఇవి రెండును వృద్ధిచెంది అనేక ఉపద్రవములను కలిగించును. దావాగ్ని వనమును నశింపచేయునట్లు ఇవి స్థౌల్యుని శరీరమును దహింపచేయును.

మేదో ధాతువు అత్యధికముగా వృద్ధి పొందినపుడు వెంటనే ప్రకోపించిన వాత పిత్త కఫములు దారుణమైన వ్యాధులను కలిగించి జీవితమును హరింపచేయును.[2]

---

1. i) తస్య హ్యతిమాత్రంమేదస్వినో మేద ఏవోపచీయతే న తథేతరే ధాతవః (చ. సూ. 21/4)

2. మేదసావృతమార్గత్వాద్వాయుః కోష్ఠే విశేషతః చరన్ సంధుక్షయత్యగ్నిమాహారం శోషయత్యపి తస్మాత్స శీఘ్రం జరయత్యాహారమభికాంక్షతి వికారాంశ్చాప్నుతే ఘోరాన్ కాంశ్చిత్కాలవ్యతిక్రమాత్ ఏతావుపద్రవకరౌ విశేషాదగ్నిమారుతౌ ఏతౌ హి దహతః స్థూలం వనదావో వనం యథా మేదస్యతీవ సంవృద్ధే సహసైవానిలాదయః వికారాన్ దారుణాన్ కృత్వా నాశయన్త్యాశు జీవితమ్ (చ. సూ. 21/5-6)

## అతిస్థూల లక్షణములు

మేదస్సు, మాంసము ఇవి అధికముగా వృద్ధిచెంది యుండుటవలన ఉదరము, పిరుదులు స్తనములు ఇవి అధికముగా వృద్ధిచెంది చలించుచుండుట, అప్రాకృతిక శరీర వృద్ధివలన ఉత్సాహములేకుండా యుండును. ఈ లక్షణములు గల మనుజుడు అతి స్థూలుడని చెప్పబడును.[1]

మేదస్సు పై అవయవములందు సంచయమునొందు స్వభావము కలిగి వుండుటవలన ఆ అవయవములు అధిక వృద్ధిని పొందును.[2]

స్థౌల్యము వలన అతి శీఘ్రముగా ఈ క్రింది లక్షణములు కలుగును. చరకుడు ఈ ఎనిమిది దోషములను వివరించెను.

1. ఆయువు క్షీణించుట
2. జవోపరోధము (చురుకుదనము లేకుండుట)
3. మైథునమాచరించుట కష్టముగా నుండుట
4. దౌర్బల్యము
5. దౌర్గన్ధ్యము
6. స్వేదము అధికముగా జనించుట
7. ఆకలి అధికముగా నుండుట
8. దప్పిక అధికముగా నుండుట[3].

---

1. మేదోమాంసాతివృద్ధత్వాచ్చలస్ఫిగుదర స్తనః అయధోపచయోత్సాహో నరోఽతిస్థూల ఉచ్యతే (చ.సూ. 21/9-10)
2. మేదస్తు సర్వభూతానాముదరేష్వస్థిషు స్థితమ్ అతఏవోదరే వృద్ధిః ప్రాయో మేదస్వినో భవేత్ (మా.ని. 34/4)
3. అతిస్థూలస్య తావదాయుషో హ్రాసో జవోపరోధః కృచ్ఛ్రవ్యవాయతా దౌర్బల్యం దౌర్గన్ధ్యం స్వేదాబాధః క్షుదతిమాత్రం పిపాసాతియోగశ్చేతి భవ న్త్యష్టౌ దోషాః (చ.సు. 21/4)

సుశ్రుతుడు- అధికముగా క్షుద్రశ్వాస, అధికనిద్ర, క్రథనము (గురక పెట్టుట) గద్గద భాషణము- ఈ లక్షణములను అధికముగా పేర్కొనెను.[1]

ఈ లక్షణములకు కారణములు ఈక్రింది విధముగా నుండును.

1. ఆయువు క్షీణించుట- మేదస్సు అధికముగా వృద్ధినొంది ఇతర ధాతువులు వృద్ధినందక పోవుటవలన ఆయువు క్షీణించును.[2]

2. జవోపరోధము- చురుకుదనము లేకుండుట-అవయవశైథిల్యమువలన మేదస్సు యొక్క సౌకుమార్యము వలన, గురుత్వము వలన చురుకుదనము లేకుండాయుండి అన్నిక్రియలందును అసమర్థుడుగా నుండును.[3]

3. కృచ్ఛ్రమైథునత- మైథున మాచరించుట కష్టముగా నుండుట- శుక్రము అధికముగా లేకపోవుట వలనను, కఫము మేధస్సులచే స్రోతో మార్గములావరింపబడి యుండుట వలనను మైథునము కష్టముగను అల్పముగను ఆచరించును.[4]

---

1. తమతిస్థూలం క్షుద్రశ్వాస పిపాసా క్షుత్స్వప్న స్వేదగాత్ర దౌర్గంధ్య క్రథనగాత్ర సాద గద్గదత్వాని క్షిప్రమేవావిశంతి (సు.సూ.15)

2. i) తస్యాతిమాత్రం మేదస్వినో మేద ఏవోపచీయతే న తథేతరే ధాతవః తస్మాదస్యాయుషో హ్రాసః (చ.సు. 21/4)

ii) ఆ వృతమార్గత్వాదేవ శేషాధాతవో నాప్యాయంతేఽత్యర్థమతో ఽల్పప్రాణో భవతి (సు.సం.15)

3) i) శైథిల్యాత్ సౌకుమార్యాద్గురుత్వాచ్చ మేదసః జవోపరోధః (చ.సు 21/4)

ii) సౌకుమార్యాన్మేదసః సర్వక్రియాస్వసమర్థః (సు.సూ.15)

4. శుక్రాబహుత్వాన్మేదసావృతమార్గత్వాచ్చ కృచ్ఛ్రవ్యవాయతా (చ.సూ.21/4)

ii) కఫమేదోనిరుద్ధమార్గత్వాచ్చాల్పవ్యవాయో భవతి (సు.సూ.15)

4. దౌర్బల్యము- ధాతువులు సమానముగా లేకపోవుటచే దౌర్బల్యము కలుగును.

5. దౌర్గన్ధ్యము-మేదో దోషము (మేదస్సు యొక్క స్వభావము వలనను, స్వేదలత్వము వలనను శరీర దౌర్గన్ధ్యము కలుగును.

6. స్వేదాధిక్యత- మేదస్సు శ్లేష్మముతో కూడుకొని యుండుట వలన, మేదస్సు యొక్క విష్యన్దత్వ గుణము వలనను, బహుత్వము వలనను వ్యాయామ అసహత్వము వలనను స్వేదము అధికముగా జనించును.

7. అధికమైన ఆకలి

8. అధిక దప్పి-

జఠరాగ్ని అధికముగా నుండుట వలనను, కోష్ఠము నందు వాయువు ప్రభూతముగా నుండుట వలనను ఆకలి, దప్పిక అధికముగా నుండును.[1]

వ్యాయామ అసహత్వముచే క్షుద్రశ్వాస, మేదస్సుచేత కఫము చేత స్రోతస్సులు ఆవరింపబడుటచే అధికనిద్ర, క్రథనము, గద్గదభాషణముకలుగును.

## స్థౌల్యము వలన కలుగు ఉపద్రవములు -

ప్రమేహ, పిడక. జ్వర, భగందర, విద్రధి, వాత వికారములు, కుష్ఠు, విసర్ప, భగంధర, జ్వర, అతీసార, మోహ, అర్శ, శ్లీపద, అపచి, కామల, దుర్గన్ధముచే కృమి ఉత్పత్తి- ఇవియును ఇతర సంతర్పణ జన్య వ్యాధులు కలుగును.

---

1. దౌర్బల్యమసమత్వాద్ధాతూనాం, దౌర్గన్ధ్యం మేదో దోషాన్మేదసః స్వభావాత్స్వేదన త్వాచ్చ మేదసః శ్లేష్మసంసర్గాద్విష్యన్ది త్వాద్బహుత్వాద్వ్యాయామాసహత్వాచ్చ స్వేదాబాధః తీక్ష్ణాగ్ని త్వాత్ప్ర భూతకోష్ఠవాయుత్వాచ్చ క్షుదతిమాత్రం పిపాసాతి యోగశ్చేతి (చ.సూ. 21/4)

ఇతర సంతర్పణ జన్యవ్యాధులు :

కోఠ, కణ్డు, పాణ్డు, ఆమదోషము, మూత్రకృచ్ఛ్రము, అరుచి, తన్ద్రి, నపుంసకత్వము, శోథ, ఆలస్యము, సమగాత్రత, ఇంద్రియములు మరియు స్రోతస్సులు కఫముతో లిప్తముగుట, బుద్ధియొక్క మోహము, ప్రమీలకము (ఎల్లప్పుడు చింతించు చుండుట), స్థూలునకు స్రోతో మార్గములు ఆవరింపబడి యుండుటచే అన్ని వ్యాధులును బలవత్తరముగా నుండును.[1]

ఆధునిక వైద్యము ననుసరించి స్థౌల్యము (Obsity)నకు సరియగు నిర్వచనము చెప్పుట కష్టము. ప్రామాణిక పరిమాణములు జీవితాభీమావారి రికార్డుల ననుసరించినవి ఒక మార్గదర్శకము మాత్రమేనని భావింపవలసి వచ్చును.

ఉండవలసిన బరువుకన్న 10 శాతం లేక 20 శాతం లేక అంతకన్న ఎక్కువ ఉన్నచో స్థౌల్యము యొక్క అవస్థలుగా భావింపవచ్చును. 10 శాతం-ప్రారంభావస్థ, 20 శాతం మధ్యమస్థౌల్యము 20 కన్నా ఎక్కువ ఉన్నచో తీవ్ర స్థౌల్యమనదగును.

---

1\. i) ప్రమేహపిడకా జ్వర భగందర విద్రధి వాతవికారాణామన్యతమం ప్రాప్య పంచముత్వముపయాతిసర్వఏవచాస్యరోగా బలవంతో భవంత్యావృత) మార్గత్వాత్ స్రోత్రసామ్ (సు.సూ.15/37)

ii) స్థూలే స్యుర్దుస్తరాః కుష్ఠావిసర్పాస్స భగందరాః జ్వరాతీసార మేహార్శః శ్లీపదా పచికామలాః మేదసః స్వేదదౌర్గంధ్యా జాయంతే జంతవోఽణవః (భా.ప్ర. 38/10-11)

iii) ప్రమేహ కండూపిడకాః కోఠపాండ్వామయజ్వరాః కుష్ఠాన్యామప్రదోషాశ్చ మూత్రకృచ్ఛ్ర
మరోచకః తంద్రాక్లైబ్యమతి స్థౌల్యమాలస్యం గురుగాత్రతా ఇంద్రియ స్రోతసాం
లేపో బుద్ధేర్మోహః ప్రమీలకః శోఫాశ్చైవంవిధాశ్చాన్యే శీఘ్రమ ప్రతి కుర్వతః (చ.సూ. 23/5-7)

50 సంవత్సరముల వయస్సులో ఉండవలసిన బరువుకన్నా 25 పౌనులు (11.3kg) బరువు ఎక్కువ ఉన్న వ్యక్తి ఆయుర్దాయము 25 శాతం తగ్గునని అంచనా వేయబడినది.

వంశపారంపర్యత, తీపి పదార్థాలు, పిండి పందార్థాలు, ఇతర ఆహారాలు మాటి మాటికి అధిక పరిమాణంలో తీసికోవటం, ఏమీ శ్రమ చేయకపోవటం మొదలైనవి స్థౌల్యానికి ముఖ్య కారణాలు.

స్థౌల్యముతో అనుబంధంగా ఉండే వ్యాధులు :- స్థూల ప్రమేహము (Non Insulin dependent II Diabetes) పిత్తాశ్మరా రక్తదబాతే వృద్ధి, స్నేహరక్తమయత (Hyperlipiolaemia), హృదయ, మస్తిష్క ధమనీ వ్యాధులు, సంధివాతము (Arthritis) వాతరక్తము (Gout) శ్వాసకోస వ్యాధులు.

మానసిక మాంద్యము, శారీరక మాంద్యము.

స్థౌల్యము గలవారికి కాన్సర్ వచ్చే అవకాశాలు హెచ్చు, శస్త్రచికిత్సలు జరపటం కష్టముగా నుండును.

ఆకస్మిక గుండెపోటు వచ్చే అవకాశాలు స్థూలురలో ఎక్కువ. యకృత్ వికారాలు, అధిక బరువును మోయవలసి రావటంవల్ల పాదసంధులలో ధాతుక్షయ (Degeneretive) లక్షణాలు సంధివాతము, చర్మము ముడతలు పడుటచే ముడతల మధ్యలో కృమిజన్య చర్మ వికారములు (Fungal infections)

రోగ నిర్ణయము—ఎత్తు, ఛాతీకొలత, బరువు పరీక్షించుట, చర్మపు మందము (Skin fold thickness) బ్లడ్ షుగర్, ట్రెగ్లిసరాయిడ్స్ మొదలగు పరీక్షలు జరుపవలయును.

## స్థౌల్యము యొక్క చికిత్స

స్థౌల్యమునకు కారణమునైన వాటిని వర్జింప చేయవలయును.[1]

స్థౌల్యరోగికి మేదస్సుచే ఆవరింపబడి ప్రకోపించియున్న వాతమును సామ్యావస్థకు తెచ్చుటకై కఫమును, మేదస్సును క్షీణింపచేయు తిక్త కటు కషాయ రసములతో కూడినటువంటివియు, విరూక్షణములును, అగు అన్న పానములతో ఉపచరింపవలెను.

రూక్ష, ఉష్ణ, తీక్ష్ణ లేఖన వస్తులు మరియు రూక్ష ఉద్వర్తనములు హిత కరములుగా నుండును. ఇవే రసములు, గుణములు, కర్మలతో కూడిన ఔషధ ద్రవ్యములను ప్రయోగింప వలయును.[2]

ఈ చెప్పబడిన విరూక్షణ ద్రవ్యములు మేదస్సుయొక్క స్నిగ్ధగుణము నకు విరుద్ధముగా నుండుట వలన మేదస్సును క్షీణింప చేయును.

ఛేదనీయములనగా స్రోతో శోధకములని అర్థము చేసికొనవలయును. స్రోతోపలేపమును, స్రోతోవరోధము ఈ ఔషధాదులచే శమించును.

గురు గుణము కలిగి కర్శనమును కలిగించు ఆహార పదార్థములు ఇవ్వ వలయును. గురు గుణము కలిగియుండుటచే తీక్ష్ణముగా నున్న జఠరాగ్నికి తృప్తి కలిగించ గలుగును. అయినను శరీరమును బృంహితము చేయక కృశింపచేయు గుణము కలిగి యున్నందున స్థూలురకు హితకరముగా నుండును.[3]

---

1. అత స్తస్యోత్పత్తిహేతూన్ పరిహరేత్ (సు.సూ. 15/37)
2. వాతఘ్నాన్యన్నపానాని శ్లేష్మమేదో హరాణి చ రూక్షోష్ణా వస్తయస్తీక్ష్ణా రూక్షాణ్యుద్వర్తనాని చ (చ.సూ. 21/21)
3. గురుచాతర్పణం చేష్టం స్థూలానాం కర్శణం ప్రతి (చ.సూ. 21/20)

గురు గుణము అపతర్పణగుణము కలిగిన ద్రవ్యములకు ఉదాహరణముగ మధు (తేనె), శాలూకము (కమల కన్దము), ప్రియంగు, గోధుమలు ప్రశాతకి మొదలగునవి.[1]

స్థూలురకుగాని కృశులకుగాని తగిన ఆహార విహారములు సతతము అభ్యసించుచునే యుండవలయును. లేనిచో తిరిగి స్థూల ప్రవృత్తి యున్నవారికి స్థూలత్వము కలుగుచునే యుండును[2].

స్థూల కృశత్వములలో తారతమ్యత——రెండు స్థితులూ నిన్ద్యములుగా చెప్పబడినప్పటికిని కృశునకన్న స్థూలునికి అధిక ప్రబలమైన వ్యాధులు కలుగును. అంతేకాక స్థౌల్య చికిత్సకూడా కఠినముగా నుండును. స్థూలునికి వాతహర మేదోహర చికిత్సలు అవసరమగును. లంఘనముచే అగ్ని, వాతము వృద్ధిపొందుటచే మేదస్సును శమింప చేసినను ఇతర ధాతువులు క్షీణించును. వాత వికారములు కలుగును. బృంహణ చికిత్సలు అగ్నిని వాతమును శమింప చేయు గుణము కలిగి యున్నప్పటికిని, మేదస్సును గూడా వృద్ధి చేయును. అందు దురుపక్రియ మగుటచే చికిత్స కఠినముగా నుండును. కృశునికి బృంహణ చికిత్సలచే వాతము శమించును. ధాతువులు పుష్టినొందును కనుక చికిత్స సుకరముగా నుండును.[3]

---

1. చక్రపాణి (చ.సూ. 21/20)
2. సతత వ్యాధితావేతావతిస్థూలకృశౌ సదా సతతం చోపచర్యౌ హి కర్షణై ర్బృంహణైరపి (చ.సూ. 21/16)
3. i) స్థౌల్యకార్శ్యే వరం కార్శ్యం సమోపకరణౌహితౌ యద్యుభౌ వ్యాధిరాగచ్ఛేత్స్థూలమే వాతిపీడయేత్ (చ.సూ. 21/17)
   ii) కార్శ్యమేవవరం స్థౌల్యాన్నహి స్థూలస్య భేషజమ్ బృంహణం లంఘనం నాలమతి మేదోఽగ్ని వాతజిత్ (అ.హృ.సూ. 14/32)
   iii) చక్రపాణి (చ.సూ. 21/17)
   iv) అరుణదత్త మరియు హేమాద్రి (అ.హృ.సూ. 14/32)

## స్థూలునకు పథ్యములు

**ఆహారములు :-**

ధాన్యములు—యవలు, ముద్గలు, కోరదూషము (కొఱ్ఱలు), ప్రశాతిక (నివ్వరి ధాన్యము) ప్రియంగు, శ్యామాక (చామలు), చిన్న యవలు, జూర్లా (జొన్నలు) కోద్రవ (అరికలు), కులుత్థ, పచ్చపెసలు, ఆఢకీ (కందులు), ఉద్దాలకము (అడవి ఉలవలు) పురాణ గోధుమలు, పాతశాలిధాన్యము, పురాణవంశ ధాన్యము, చణక, మసూర, అన్ని ధాన్యములు పురాణముగానున్నవియే ఉపయోగించుట హితకరము.

శాకాదులు—పటోల, ఆమలక, వార్తాకము పత్రశాకములు.

ఇతరములు—కటు, తిక్త, కషాయరసములు, రూక్ష గుణము కలిగిన ఆహార పానీయాదులు. భోజనమునకు ముందు నీరు త్రాగుట, భోజనానంతరము మధు మిశ్రితజలము త్రాగుట, లాజలు, మస్తు, తక్రము, అరిష్టములు, చిర్భట మత్స్యములు, త్రికటుకములు, సర్షపతైలము, ఏల, తిలతైలము, ఉష్ణజలము, ఇతర అపతర్పణకర ఆహారములు.

**విహారములు :-**

చిన్త, జాగరణము, వివిధరకములైన వ్యాయామములు చేయుట. మైధునము అసుఖ ప్రదమైనశయ్య, తమోగుణమును జయించి సత్వగుణమును వృద్ధి చేసుకొనుట ఈ క్రియలను అవలంభించ వలయును.

ఉద్వర్తనము, ఆతపసేవన, వాహనములపై ప్రయాణించుట, నడుచుట, అగరు మొదలగు వాని లేపములు.

ఇతరములు—వమనము, లేఖన గుణము గల వస్తికర్మలు, ధూమ పానములు, రక్తమోక్షణము.[1]

## స్థూలునకు అపథ్యములు

**ఆహారములు :**

నూతనశాలి ధాన్యము, ఇతరధాన్యములు, దుగ్ధ వికృతులు కిలాట కూర్చి కాదులు, ఇక్షువికృతులు, సిత, శర్కర, గుడము, మాషములు, మత్స్యములు, మాంసములు, అధికపరిమితిలో భుజించుట, స్నేహపదార్థములు, భోజనానంతరము అధికముగా నీరు త్రాగుట-వీటినన్నింటిని వర్జించవలయును.

**విహారములు మొదలగునవి :**

సుఖముగా కూర్చొని యుండుట, పడుకొనుట, దివాస్వప్నము, స్నేహాభ్యంగము, పుష్పమాలలు, సుగంధ ద్రవ్యములు తైలములు లేపనము చేయుట.

నిదానముగా చెప్పబడిన అన్ని ఆహార విహారములు వర్జింపవలయును.

---

1. i) ప్రశాతికా ప్రియంగుశ్యామాకా యవకా యవాః జూర్ణాహ్వాః కోద్రవా ముద్గాః కులత్థాశ్చక్రమర్దకాః అఢకీనాం చ బీజాని పటోలామలకైస్సహ భోజనార్థం ప్రయోజ్యాని పానం చాను మధూదకమ్ "అరిష్టాంశ్చాను పానార్థే మేదోమాంసకఫాపహాన్ అతిస్థౌల్యవినాశాయ సంవిభజ్య ప్రయోజయేత్" ప్రజాగరం వ్యవాయం చ వ్యాయామం చిన్తనాని చ స్థౌల్యమిచ్ఛన్ పరిత్యక్తుం క్రమేణాభిప్రవర్ధమేత్ (చ.సూ. 21/25-28)
   ii) సు.సూ. 15/32
   iii) అ.హృ.సూ.24/32
   iv) భై.ర.
2. భై. ర.
3. చ. సూ. 21/22-24

ఔషధములు :

1. గుడూచి, భద్రముస్త చూర్ణము-1 గ్రాము. తేనెతో
2. త్రిఫలా చూర్ణము- 2-4 గ్రా. తేనెతో
3. విడంగము. శొంఠి, యవక్షారము, కాల లోహచూర్ణము (లోహభస్మము) సమభాగములు కలిపి 500 మి. గ్రా. తేనెతో ఇవ్వవలయును.
4. యవలు-ఆమలకము కలిపి సేవింప చేయ వలయును.
5. బృహత్ పంచమూల క్వాథము తేనెతో
6. శిలాజతును అగ్ని మంథస్వరసముతో ఇవ్వవలయును.
7. తక్రారిష్ట ప్రయోగము శ్రేష్టమైనది.
8. గుగ్గులు ప్రయోగము
9. రసాంజనము ప్రయోగించుట[1]
10. వ్యోషాది సక్తుమన్థము-స్థౌల్యము, ఇతర సంతర్పణ జన్య వ్యాధులందు మంచిపని చేయును.[2]
11. ఉష్ణ అన్న మణ్ణము పానము చేయుట స్థౌల్యమున హితకరముగా నుండును.
12. చవ్యాది సక్తు- పెరుగుమీద తేటతో సేవించిన అగ్ని దీప్తి మేదోశమనము కలుగును.
13. బదరీ పత్రకల్కమును కాంజికముతో పక్వము చేసి సిద్ధముచేయబడిన పేయ స్థౌల్యమును శమింప చేయును.
14. అమృతాది గుగ్గులు-అమృత, ఏలా, వత్సక, విడంగ, త్రిఫల గుగ్గులు ముఖ్య-ద్రవ్యములు స్థౌల్యము పిడక భగంధరములను శమింప చేయును. మాత్ర 0.5 నుండి 1 గ్రా.

---

1. సు. సూ. 15
2. చ. సూ. 23/18-24

15. నవక గుగ్గులు : త్రిఫల, త్రికటు, త్రిమద, గుగ్గులు, కఫమును, మేదస్సును, ఆమమును వాతమును శమింపచేయుటలో ఉత్తమమైనది మాత్ర 0.5 గ్రా. నుండి 1 గ్రా.

16. లోహ రసాయనము-గుగ్గులు, త్రిఫల, లోహ భస్మ గుగ్గులు మొ॥నవి ముఖ్య ద్రవ్యములు స్థౌల్యహరము రసాయన గుణములు కలది. మేధ్యము వాజీకరము మాత్ర 0.5 గ్రా. నుండి 1 గ్రా.

17. త్రిఫలములు, త్రికటుకములు (చక్రదత్త 36 అ) సైంధవ లవణము-వీనిని తిలతైలముతో ఆరు మాసములు సేవించిన కఫము, మేదస్సు, వాతము శమించును.

18. మూలకము త్రిఫలా చూర్ణము తేనెతో సేవింపవలయును.

19. పటోల, చిత్రక, వీనిక్వాథమున శివపుష్ప హింగు చూర్ణము కలిపి సేవించిన సర్వదేహము నందుగల మేదోవృద్ధిని శమింపచేయును.

20 వాతారి (ఏరండ) పత్ర క్షారమున హింగు కలిపి సేవించుచు అన్నమండము సేవించిన మేదోవృద్ధి శమించును.

21. అతిముక్త (బండ గురివింద) బీజమజ్జ తేనెతో సేవించిన స్థౌల్యము హరించును. (భావప్రకాశ)

22. అసన క్వాథము తేనెతో పానము చేయించిన స్థౌల్యము శమించును. (వైద్యమనోరమ)

23. మేదోహర ద్రవ్యములు :-

శిలాజిత్తు, గోమూత్రము, భృంగరాజము, లోహము, గుగ్గులు, లాక్ష, అపామార్గ-ఇవియే దోషహర ద్రవ్యములు, శిలాజిత్తు, గోమూత్రము, జలమిశ్రిత మధు వీనిలో మేదోహర గుణములు అధికముగా కలవు. సుశ్రుతోక్త వరుణాదిగణము కఫమేదో నాశకముగా చెప్పబడినది.

వరుణాది గణద్రవ్యములు-వరుణ, ఆర్తగల (ముల్లుగోరింట లేక ఏపు మద్ది), శిగ్రు, తర్కారి (ఎర్రమునగ), మేషశృంగ, పూతీక, నక్తమాల (నల్ల క్రానుగ), మోరట (ఊడుగు) అగ్నిమంథ, సైరేయక, (పచ్చపూల గోరంట) చించి, వసుక (అగస్త్య ఒకపుష్ప) వసిక (అపామార్గ) చిత్రక, శతావరీ,బిల్వ, అజశృంగీ, కుశ, బృహతీద్వయము-ఈ ద్రవ్యములు కఫమేదో హరములుగను, శిరశ్శూల, గుల్మ, అంతర్విద్రధి శామకములుగను పేర్కొనబడినవి. ఈ ద్రవ్య ములను ఆవశ్యకతానుసారము మేదోవృద్ధిలో ప్రయోగింపవచ్చును.

(సు. సూ. 28/9-10)

24. లేఖన ద్రవ్యములు-లేఖన ద్రవ్యములు గూడా మేదోహరములుగా నుండును. రసాది ధాతువులను మలములను శోషింపచేసి బహిర్గతము చేయుట ద్వారా శరీరము తేలికగా చేయు ద్రవ్యములు లేఖనములు అన బడును. ఇవి శరీరములో స్నేహాంశను గూడా శోషింప చేయును. ఈ ద్రవ్యములు అగ్ని గుణ భూయిష్ఠములుగను, కటు, తిక్త, కషాయరసములు ఉష్ణ,లఘు,రూక్షగుణములు కలిగి యుండును. లేఖన ద్రవ్యములచే శరీరమున రూక్ష, ఖర, చల, లఘు గుణములు వృద్ధిచెంది శరీరము కృశత్వమును పొందును.[1]

**లేఖన ద్రవ్యములు :**

చరకోక్త లేఖనీయ ద్రవ్యములు-ముస్త, కుష్ఠ, హరిద్ర, దారుహరిద్ర వచ, అతివిష, కటుక రోహిణి, చిత్రక, చిరబిల్వ, శ్వేతవచ.[2]

ఇవికాక-లౌహభస్మము, శిలా సింధూరము, రసకర్పూరము, కాసీసభస్మము లనంతమూలము, వాస, సాలసరాదిగణ ద్రవ్యములు, క్షారములు గూడా లేఖన

1.
2. చ. సూ. 4/9

గుణము కలిగియుండును. వీనిని ఆవశ్యకతానుసారము మేదోవృద్ధిలో ప్రయోగింప వచ్చును.[1]

25. లేఖనవస్తి:-త్రిఫలా క్వాథము,గోమూత్రము, మధుక్షారము-వీనితో సిద్ధము చేసి ఊషకాది గణద్రవ్యములు ప్రక్షేపముగా చేర్చి ఇవ్వబడిన వస్తిలేఖన గుణము కలిగియుండుటచే స్థౌల్యమున చాలా ప్రశస్తముగా నుండును.[2]

26. త్రిఫలాది తైలము-పాన, నస్య, అభ్యంగ, కవలవస్తులకుపయోగించిన స్థౌల్యమును శమింపచేయును. (చక్రదత్త)

27. లోహారిష్ట-15-30 మి.లీ సమజలంతో సేవించిన స్థౌల్యము, ప్రమేహము, పాండు, కుష్టము మొదలగువానిని శమింప చేయును. అభిష్యందమును స్రోతోవరోధమును శమింపచేయును. (భై. ర.)

28. ఆరోగ్యవర్ధనీవటి[3] :- ఆరోగ్యవర్ధనీవటియందు శిలాజిత్,గుగ్గులు,తామ్ర, లోహభస్మములు కటుక రోహిణి మొదలగు మేదోహరగుణములు కల ద్రవ్యములుండుటచే ఇది ఉత్తమ స్థౌల్యహరముగా నుండును. ధాత్వాంత రాగ్ని ప్రదీపకము, రక్తవర్ధకము అగుటవలన, స్రోతోశోధక గుణములు కలిగియుండుట వలన మేదస్సును తగ్గించి యితర రక్తాది ధాతువుల వృద్ధికి దోహదము చేయును. ఇటీవల జరిపిన ఆయుర్వేద పరిశోధనలలో ఆరోగ్యవర్ధని స్థౌల్యమునందేకాక స్థౌల్యజనిత హృద్వికారాదులందు గూడా హితకరముగా నుండునని గమనింపబడినది.

ఆరోగ్యవర్ధని 0.5 గ్రా. శిలాపింఘారము బాకుచీచూర్ణముతో కలిపి రోజుకు రెండు మాత్రలు త్రిఫలా ఫాంటముతో ఇవ్వవలయును.

---

1.

2. సు. చి. 38/82

3. రసరత్న సముచ్చయ

ఇతర ఔషధములు:- త్ర్యూషణాది లోహము, విడంగాది లోహము, శిలాసింధూరము, నవాయసలోహము, దశాంగ గుగ్గులు మొదలగు ఔషధములు ఆవశ్యకతను అనుసరించి ఉపయోగింపవచ్చును.

## స్థౌల్యమునందు బాహ్యప్రయోగములు :

స్థౌల్యమునందు రూక్షకరమైన ఉద్వర్తనములును, స్వేదాధిక్యతచే కలుగు దౌర్గన్ధ్యము ఇతర చర్మవికారములు తొలగుటకు బాహ్యప్రయోగములు అవసరమగును.

1. శిరీషత్వక్, లామజ్జక, నాగకేసరములు - వీనితో ఉద్ఘర్షణము చేసిన స్వేదాధిక్యత శమించును.
2. పత్రకము, నేత్రబల, అగరు, ఉశీరము, శ్వేత చందనము-వీనితో ప్రదేహము చేసిన శరీర దౌర్గన్ధ్యము శమించును-
3. వాసాపత్ర స్వరసమున శంఖ చూర్ణము కలిపిగాని
4. బిల్వపత్ర స్వరసమును గాని లేపనము చేసిన శరీర దౌర్గన్ధ్యము శమించును.
5. హరతాళమునుగాని హరీతకినిగాని హరిద్రా, దారుహరిద్ర దుగ్ధములతో నూరి లేపనము చేసిన కక్షాది ప్రదేశములందలి దౌర్గన్ధ్యము శమించును.
6. చించా పత్ర స్వరసమున దగ్ధహరిద్రా చూర్ణము కలిపి ఉద్వర్తనము చేసినను పై విధముగనే దుర్గంధమును శమింపచేయును.
7. ముణ్డీ చూర్ణమును కాంజికముతో ఆభ్యంతర సేవన చేసినను దేహ దౌర్గన్ధ్యము శమించును.

8. హస్త పాదములందు కలుగు అతి స్వేదము పంచతిక్త గుగ్గులు ఘృతమునుగా పంచతిక్త ఘృతమునుగాని ఆభ్యంతరముగా సేవించిన శమించును.[1]

9. హరీతకీ కల్కముతోకాని, బబ్బూల పత్ర కల్కముతోగాని, చందాది చూర్ణముతోగాని ఉద్వర్తనము చేసికొనిన చెమట దుర్గంధము శమించును.

10. బిల్వాద్యాది ధూపము స్నానానంతరము వేసుకొనినను దుర్గంధము శమించును.[2]

11. మహాసుగంధ తైలాభ్యంగము స్వేదము, దౌర్గన్ధ్యము శమింపచేయును.[2]

స్థౌల్యము వలన కలుగు యితర ఉపద్రవములకు తత్తదను సారమైన చికిత్సలు స్థౌల్య చికిత్సలతో పాటు చేయవలయును.



1. చక్రదత్త 36 అధ్యాయం
2. భావప్రకాశ 38 అధ్యాయం

# కార్శ్యము

కార్శ్యము గూడా స్థౌల్యమువలె నింద్యమైనది. కాని కార్శ్య చికిత్స సమోపక్రమము అగుటవలన స్థౌల్యమున కన్న సులభముగా నుండును.

కార్శ్యము వలన కలిగిన బలక్షయము వ్యాధి బల విరోధిత్వ శక్తి తగ్గించుట, ధాతుక్షయమును కలిగించుట—వీనివలన అనేక వ్యాధులు సులభంగా కలిగే అవకాశాలు పెరుగుతాయి. వాతవ్యాధులు కలుగుతాయి.

## కృశత్వమునకు కారణములు

**ఆహారములు :-**

వాతవర్ధకమైన ఆహారములు సేవించుట, అతి రూక్షకరమైన ఆహారములు పానీయములు సేవించుట, ఉపవాసము చేయుట లేక స్వల్పముగా భుజించుట, కషాయరసము గల ఆహారములను అధికముగా భుజించుట, అతి భోజనము.

**విహారములు :-**

పిపాసను, ఆకలిని నిగ్రహించుట, జాగరణముచేయుట, శారీరక మానసిక వాచిక కార్యములను అధికముగా చేయుట, వమనాది క్రియలచే అధికముగా సంశోధనము జరుగుట.

అధికముగా అధ్యయనము చేయుట, అధిక మైథునము, అధిక వ్యాయామము.

రూక్షుడుగా ఉన్నప్పటికిని రూక్ష ఉద్వర్తనములు, రూక్ష స్నానములు చేయుట.

**ఇతర కారణములు :-**

మానసిక—భయము, శోకము, ధ్యానము (ఒకే విషయముపై ఏకాగ్రత కలిగి ఆహారపానీయ నిద్రాదులు నిర్లక్ష్యము చేయుట) క్రోధము మొదలగు మానసిక వికారముల అతియోగము.

కృశత్వముగా నుండు శరీర ప్రకృతి కలిగి యుండుట లేక వాత ప్రకృతి.

వృద్ధావస్థ; చాల దీర్ఘ కాలము నుండి వ్యాధులతో బాధపడుచుండుట; నిత్య రోగి గ్రస్థత[1].

రాజయక్ష్మ, మధుమేహ, హైపర్ థైరాయిడిజమ్ (Hyperthyroidism) మరియు కాన్సర్ (Cancer) వంటి వ్యాధులలో క్షీణత వర్ధమానముగా నుండును.

**సంప్రాప్తి :-**

పై కారణములచే రసధాతువు శోషింపబడి అల్పముగా నుండుటచే శరీరమున వ్యాపింపక తన కృత్యములగు ప్రీణనమును ఇతర ధాతు పోషణను కలిగించలేకపోవును. అందుచే అనులోమ శోషవంటి కార్శ్యము కలుగును.[2]

---

1. i) సేవా రూక్షాన్నపానానాం లంఘనం ప్రమితాశనమ్ క్రియాతియోగః
శోకశ్చ వేగనిద్రావినిగ్రహః రూక్షస్యోద్వర్తనం స్నానస్యాభ్యాసః
ప్రకృతిర్జరా వికారానుశయః క్రోధః కుర్వన్త్యతికృశం నరమ్
(చ. సూ. 21/11-12)

ii) తత్ర పునర్వాతలాహారసేవినోఽతివ్యాయామవ్యవాయాధ్యయన భయ
శోక ధ్యాన రాత్రిజాగరణ పిపాసాక్షుత్కషాయాల్పాశన ప్రభృతి
భిరుపశోషితో రసధాతుః శరీరమననుక్రామన్నల్పత్వాన్న ప్రీణాతి
తస్మాదతికార్శ్యం భవతి (సు. సూ. 15)

iii) భా. ప్ర. (iv). 1 (ii) వ౨.

అతి మైథునాదులచే శుక్ర క్షయము తద్వారా వాతము ప్రకోపించి ప్రతిలోమముగా ధాతువులు క్షయించి, మిగిలిన ఉపధాతువులు గూడా క్షీణించి శరీరము కృశించును.

**అతి కార్శ్యముచే కలుగు దోషములు :-**

శరీరమునందు ముఖ్యముగా పిరుదులు ఉదరము, మెడ ప్రదేశము ఇవి కృశించి యుండుట, ధమనీజాలములు శరీరము పైకి కనిపించుచుండుట, చర్మము, ఎముకలు మాత్రము మిగిలియున్నట్లు కనిపించుట, కణుపులు లావుగా కనిపించుట ఇవి అతి కృశ పురుషుని స్వరూపముగా నుండును.[1]

అతి కృశుడు వ్యాయామమును, అధిక భోజనమును, ఆకలి, దప్పిక, అధికమైన శీతము, ఉష్ణము, ఆహార విహారములు, మైథునము, గాలి, వర్షము, భారవహనము, తీవ్రమైన ఔషధములు, వ్యాధులు — వీటిని సహింపలేక యుండును.

స్వల్ప బలము కలిగియుండి శరీర వాఙ్మనస క్రియలు నిర్వహించుటకు తగిన శక్తిలేనివాడై వాత వ్యాధులచేతను క్రింద చేర్చానబడిన ఇతరవ్యాధుల చేతను పీడింపబడుచుండును.

శరీర బలము స్వల్పముగా నుండుటచే అన్ని వ్యాధులు బలిష్ఠములై యుండును. శోధనాది తీవ్ర చికిత్సా ప్రక్రియలకు తగిన బలము లేకపోవుటచే ఏ వ్యాధి వచ్చినను చికిత్సించుట కష్టముగా నుండును.

కృశునకు కలుగు వ్యాధులు—ప్లీహవృద్ధి, కాసశ్వాస, రాజయక్ష్మ, క్షయ,

---

1. శుష్కస్ఫిగుదరగ్రీవో ధమనీజాల సంతతః త్వగస్థిశేషోఽతికృశః స్థూలపర్వా నరోమతః (చ.సూ. 21/15)

ప్లీహోదరము, అగ్ని మాంద్యము, గుల్మము, అర్శస్సు, రక్తపిత్తము, గ్రహణి ఈ వ్యాధులు తీవ్రమగుటచే మరణమును గూడా పొందును.[1]

ఇవియేకాక కృశుడు ఇతర అపతర్పణ జనిత వ్యాధులను గూడాపొందును.

అన్య అపతర్పణజ వ్యాధులు—బలము, వర్ణము, శుక్రము, ఓజస్సు మాంసము ఇవి క్షీణించుట, జ్వరము, పార్శ్వశూల, అరుచి, శ్రోత్ర దౌర్బల్యము, ఉన్మాదము, ప్రలాపము, హృదయమునందు వ్యథ, మల మూత్రములు బంధించుట, జంఘ (పిక్కలు) తొడలు, త్రికప్రదేశము—వీని యందు శూల; పర్వము లందు అస్థి సంధుల యందు భేదము (బద్ధలుకొట్టుచున్నట్లు వేదన) ఊర్ధ్వవాతము ఇవి కలుగును.[2]

---

1. i) వ్యాయామమతిసౌహిత్యం క్షుత్పిపాసామహౌషధమ్ కృశో న సహతే ఉద్వరతిశీతోష్ణమైథునమ్ "ప్లీహా కాసః క్షయః శ్వాసో గుల్మార్శాంస్యుదరాణి చ కృశం ప్రాయోఽభిధావన్తి రోగాశ్చ గ్రహణీగతాః
(చ.సూ. 21/13-14)

ii) సోఽతికృశః క్షుత్పిపాసాశీతోష్ణవాతవర్షభారాదానేష్వసహిష్ణుర్వాతరోగప్రాయోఽల్పప్రాణశ్చ క్రియాసు భవతి, శ్వాసకాసశోషప్లీహోదరాగ్నిసాదగుల్మరక్తపిత్తానామన్యతమమాసాద్య మరణముపయాతి సర్వ ఏవ చాస్య రోగా బలవంతో భవంత్యల్పప్రాణత్వాత్ అతస్తస్యోత్పత్తిహేతుం పరిహరేత్
(సు.సూ. 15/35)

2. దేహాగ్నిబలవర్ణౌజఃశుక్రమాంసపరిక్షయః జర్వః కాసానుబన్ధశ్చ పార్శ్వశూల మరోచకః శ్రోత్రదౌర్బల్యమున్మాదః ప్రలాపో హృదయవ్యధా విణ్మూత్రసంగ్రహః శూలం జంఘోరుత్రికసంశ్రయమ్ పర్వాస్థిసంధిభేదశ్చ యే చాన్యే వాతజా గదాః ఊర్ధ్వవాతాదయః సర్వే జాయన్తే తేఽపతర్పణాత్
(చ.సూ. 23/27-29)

కొందరు మాత్రము కృశించియున్నను బలముగా కనిపించుచుందురు. అది వారి స్వభావము. బీజస్వభావము.[1]

## కార్శ్యము నందు సాధ్యాఽసాధ్యత

కార్శ్యము ఇతర వ్యాధులకు ఉపద్రవముగా కలుగుట అధికము. అందు చేత దీనికి కారణమగు వ్యాధియొక్క సాధ్యాఽసాధ్యతలు ఆధారపడియుండును.

స్వాభావికముగనే కార్శ్యమును, అగ్నిమాంద్యమును దౌర్బల్యము కలిగి యున్నవానికి చికిత్సలేదని భావమిశ్రుడు చెప్పెను.[2]

కాని పూర్తిగా శమించకున్నను యాపనము చేయవచ్చును.

## కార్శ్య చికిత్స

కార్శ్యము ఏ వ్యాధి వలన కలిగినదో గమనించి తత్తదనుగుణముగా చికిత్స చేయవలసి యుండును. కార్శ్యమునకు కారణములను వర్జింపవలయును.

సాధారణ కార్శ్య చికిత్సలు ఈ క్రింది విధముగా ప్రయోగింపవలయును.

లఘువుగానుండి సంతర్పణకరములుగా నుండు ఆహారములచే ఉపచరించ వలెను. బృంహణములుగను వృష్యములుగను రసాయనములుగ నుండు ఆహార ఔషధములు సేవింపచేయవలయును.[3]

---

1. కశ్చిదన్యః కృశోఽతీవబలాన్ దృశ్యతే తదా (భా.ప్ర. 39/4)
2. స్వభావాదతికార్శ్యో యః స్వభావాదల్పపావకః
   స్వభావాదబలోయశ్చ తస్య నాస్తి చికిత్సితమ్ (భా.ప్ర.39/11)
3. i) కృశానాం బృహంణార్థంచ లఘు సంతర్పణంచయత్ (చ.సూ. 21/20)

ఆహారములు-

నవాన్నములు, నూతనముగా నిర్మించిన మద్యములు, దధి, ఘృతము, దుగ్ధము, యవలు, గోధుమలు, మాషములు.

గ్రామ్య, అనూప, జలచరమాంస రసములు, కటు ద్రవ్యములతో సంస్కరించిన మాంసములు, మాంసాదములగు ప్రాణుల మాంసములు.

గుడము, గుడ నిర్మిత వస్తువులు, స్నిగ్ధ మధుర ద్రవ్యములు.

## విహారములు

నిద్ర, సుఖకరమైన శయ్య, తైలాభ్యంగము స్నిగ్ధ ఉద్వర్తనములు, స్నిగ్ధ ద్రవ్య సంస్కార జల స్నానములు, సుగంధలేపములు, మాల్యాదిధారణములు, శ్వేత వస్త్ర ధారణము, దివాస్వప్నము

బ్రహ్మచర్య పాలన-

మానసిక క్రియలు- హర్షము, మానసిక విశ్రాంతి, మానసిక శాంతి, వీటిని అవలంబించుట, చింతను త్యజించుట, ప్రియ వస్తువులను ప్రియదృశ్యములను చూచుట, ఏ పనులందైనను నిశ్చింతగా ఉండుట.

ఇతరములు-

దోషములు తగు కాలము నందు బయలు వెడలించుట, రసాయనములు, వృష్యములు ఐన యోగములు సేవించుట[1]

---

1. i) స్వప్నో హర్షః సుఖా శయ్యా మనసో నిర్వృతిః శమః చిన్తావ్యవాయ వ్యాయామవిరామః ప్రియదర్శనమ్ నవాన్నాని నవం మద్యం గ్రామ్యానూపౌదకా

(Contd....

**ఔషధములు.**

ఈ క్రింది ఔషధములు కార్శ్యము నందు ఉపయోగించుటకు శ్రేష్టమైన విగా నుండును.

**పయస్య,** అశ్వగంధ, విదారిగంధ, శతావరి, బల, అతిబల, నాగబల మరియు యితర మధుర ద్రవ్యములు ఉపయోగించుట వలన కార్శ్యమును శమించును.

1. పీతాశ్వగంధను పాలతోగాని, నేతితోగాని, నూనెతోగాని, వేడినీటితోగాని 15 రోజులు సేవించిన మంచి పుష్టి కలిగించును.

2. అశ్వగంధాది ఘృతము 10 గ్రా క్షీరముతో సేవింపచేసిన మంచి బలమును కలిగించును.

3. శర్కర, పిప్పలి, తైలము, మధు. ఇవి సమాన భాగములుగా కలిపి రెండింతలు సక్తును కలిపి నీటితో మంథము చేసి పానము చేయించిన జ్వరము, కాస, తృష్ణ, మూత్రకృచ్ఛ్రము, ఊర్ధ్వ వాతము మొదలగు వానితో కూడిన కృశత్వము శమించును.

---

రసాః సంస్కృతాని చ మాంసాని దధి సర్పిః పయాంసి చ ఇక్షవః శాలయో
మాషా గోధూమా గుడవైకృతమ్ వస్తయః స్నిగ్ధమధురాస్తైలాభ్యంగశ్చ
సర్వదా స్నిగ్ధముద్వర్తనం స్నానం గంధమాల్య నిషేవణమ్ శుక్లం వాసో యథా
కాలం దోషాణమవసేచనమ్ రసాయనానాం వృష్యాణాంయోగానాముపసేవ
నమ్ హత్వాఽతికార్శ్యమాదత్తే నృణాముపచయం పరమ్

(చ.సూ. 21/29-33)

4. యవసక్తుతో సమభాగము శర్కర తేనె మద్యములో కలిపి సేవించిన వాతము, మలము, మూత్రము, కఫము, పిత్తము అనులోమనము చెంది కృశత్వము శమించును.

5. మధురముగను ఆమ్లముగను ఉండి జలముతో తయారుచేయబడి స్నేహముతో గాని స్నేహ రహితముగా గాని సేవించిన మంథము వెంటనే సంతర్పణమును కలిగించును.[1]

వాతవ్యాధి యందును, రాజయక్ష్మయందును రసాయన ప్రకరణమునందును వివరింపబడిన ఘృతములు, లేహ్యములు ఇతర పౌష్టిక యోగములు ఆవశ్యకత ననుసరించి ఉపయోగింపవలయును.

ఏ కార్యములనుగురించియు ఆలోచింపకుండుట, తృప్తిగభుజించుట, అధికముగ నిద్రించుట వీనివలన మనుజుడు వరాహము వలె పుష్టిని పొందును.[2]



1. చ.సూ. 23/35, 36, 39

2. అచిన్తనాచ్చ కార్యాణాం ధ్రువం సంతర్పణేన చ స్వప్నప్రసంగాచ్చ నరో వరాహ ఇవ పుష్యతి (చ.సూ. 21/31)

# ప్లీహ వికారములు-యకృద్వికారములు

ఆయుర్వేద సంహితలందు ప్లీహ యకృత్ వికారములను గురించి ఉదర వ్యాధి ప్రకరణమునందు మాత్రమే (ప్లీహోదర-యకృతోదరముల) వివరణ కనిపించును. భావమిశ్రుడు మాత్రము ప్లీహరోగము ప్రత్యేకముగా వివరించెను.

ప్లీహ వికారములు యకృత్ వికారములన్నియు ప్రధానముగా సంహితాకారులు ఈ వర్ణనలోనే అంతర్భూతము చేసియున్నట్లు కనిపించును.

ప్లీహ వృద్ధివలన ఉదరరోగము కలుగునని చరకుడు ప్రత్యేకించి పేర్కొనెను.[1]

రక్తదుష్టి, మేదోక్షయముగూడా ప్లీహవృద్ధికి దారితీయును. మాంసవృద్ధి వలన గూడా ప్లీహదుష్టి కలుగు అవకాశముకలదు.[2]

యకృత్ మరియు ప్లీహములు రక్తవహస్రోతస్సులకు మూలములు.[3]

ఈ కారణములచే ప్లీహోదర కారణములతోపాటు రక్తదుష్టి కారణములు మేదోక్షయ కారణములు మాంస దుష్టి కారణములు యకృత్ ప్లీహ వికార నిదాన సంప్రాప్తులందు ముఖ్యపాత్ర వహించును.

ఈ రెండు వ్యాధులకు కారణములు సమానముగా నున్నప్పటికిని దోష దూష్యములు సమానములైనప్పటికిని అవి స్థాన సంశ్రయావస్థలో యకృత్తును

---

1. ప్లీహాభివృద్ధ్యా జ్జఠరం (చ.ని. 8/18)

2. i) చ. సూ. 28/12.

ii) మేదసి స్వప్నం కట్యాః ప్లీహోవృద్ధ...... (అ.హృ.సూ.)

ఆశ్రయించిన యకృత్ వికారములు, ప్లీహము నాశ్రయించిన ప్లీహవికారములు కలుగును.

## యకృత్ప్లీహనిదానము

పైన వివరించినట్లు ప్లీహోదరనిదానము, రక్తదుష్టి నిదానము, మాంస దుష్టి నిదానము, మేదోక్షయ కారణములు-ఇవన్నియు యకృత్ప్లీహ వికారములకు కారణములుగా నుండును. కఫదుష్టి, రస వృద్ధికూడా కారణములుగా నుండును.

## ప్లీహోదర నిదానము

విదాహికరమైన పదార్థములు, అతి అభిష్యందకరమైన పదార్థములు నిత్యము సేవించుట.

భోజనానంతరము అతి క్షోభకరమైన కర్మలుచేయుట, అధికమైన శారీరక చేష్టలు, రథము మొదలగు వాహనములపై ప్రయాణము, వ్యాయామము, అతి మైథునము, అధికముగా భారమును మోయుట, అధికముగా నడచుట.

వమనము, జ్వరము మొదలగు వ్యాధులవలన శరీరము కృశించుట-ఇవి ప్లీహోదర కారణములు.[1]

## రక్తదుష్టి కారణములు

**ఆహారములు :**

అతితీక్ష్ణ, ఉష్ణ, లవణ, క్షార, అమ్ల, కటు, విదాహి, ద్రవ, గురు, స్నిగ్ధ, ప్రకృతివిరుద్ధ, మాత్రాధిక, క్లిన్నపూతి ఆహారసేవన, అధ్యశనము, అతి మాత్రా భోజనము.

---

1. i) అశితస్యాతి సంక్షోభ్యానయానాతి చేష్టితైః
అతివ్యవాయ భారాధ్వ వమన వ్యాధి కర్శనైః (చ.చి. 136)

ii) సు. ని. 7అ. iii) అ. సం. ని. అ. 12

తిలతైల, పిణ్యాక, కులుత్థ, మాష సర్షప, అతసీ, హరితవర్గ, ఆహార ద్రవ్యములు, పిణ్యాక దధి, శుక్త, తక్ర, కూర్చిక, మస్తు, సౌవీరకాది వివిధ మద్యములు అమ్ల ఫలములు కట్వరము-వీని అతిసేవన.

గోధా, మత్స్యములు, అజ, అవి, మొదలగు జాంగల జంతువుల, అనూప బిలేశయ ప్రసహ ప్రాణుల మాంసములు.

## విహారములు మొదలగునవి

ఉపవాసము, మైధునము, అధ్వగమనము (తిరుగుట), అధికశ్రమ, విదగ్ధత, అగ్ని, ఆతపము, వాయువు-వీనియొక్క అతియోగము.

భోజనానంతర దివాస్వప్నము, వమనవేగమును ఆపుట, తగిన సమయము నందు రక్తమోక్షణము చేయించుకొనకపోవుట, శరదృతు స్వభావము.

## మానసిక కారణములు

క్రోధము, శోకము, చింత, భయము.

ఇతర పిత్త ప్రకోపక కారణములు, ఇవన్నియు రక్తప్రకోపమునకు కారణములగును.[1]

## మాంసదుష్టి కారణములు

అభిష్యందికరమైన, స్థూలమైన, గురు అహారములను అధికముగా భుజించుట భోజనానంతరము దివాస్వప్నము - ఈ కారణములచే మాంసవహ స్రోతస్సులు దుష్టములగును.

1. i) సు. సూ. 21/11,15
   ii) చ. సూ. 24/5-10

మాంసవహ స్రోతస్సులు దుష్టమైనపుడు యకృత్ప్లీహములందు అధిమాంస, అర్బుద, పూతిమాంసాది వికృతులకు సంబంధించిన వికారములు కలుగును.[1]

పైన పేర్కొనబడిన కారణములే కాక రసదుష్టి పాండువ్యాధిని కలిగించి తదుపరి యకృత్ప్లీహ వికారములను కలిగింపవచ్చును.

శరీర కృశత్వము ప్లీహవృద్ధిని కలిగించును. కనుక అపతర్పణకర కారణములును ప్లీహవృద్ధికి కారణములగును. మేదక్షయ కారణములు ప్లీహ వృద్ధిని కలిగించును.

ఈ విధముగా యకృత్ప్లీహవృద్ధి కారణములు అనేకముగా ఉండును. కొన్ని కారణములు పరస్పర విరుద్ధముగా ఉండుటచే అన్ని కారణములు ఒకే మారుగాకాక ఆయా మనుజులలో వేరువేరు కారణములు ఆయా అనుబంధ కారణములతో కలసి యకృత్ప్లీహ వికారములను కలిగించును. కారణానుసారము లక్షణములు, చేయవలసిన చికిత్సలు మారుచుండును.

## యకృత్ప్లీహ వికారముల సంప్రాప్తి

### ప్లీహోదరముల సంప్రాప్తి :

యకృత్ప్లీహవికారముల సంప్రాప్తి ప్లీహోదర సంప్రాప్తిని అనుసరించి యుండును.

పైన పేర్కొనబడిన కారణములచే ఉదరమునందు వామపార్శ్వము నందుండు ప్లీహము తన స్థానమునుండి చ్యుతమై వృద్ధినిపొందుచు రక్తమును

1. i) చ. వి. 5/15
ii) చ.సూ. 28/13,14 iii) సు.సూ. 15అ, 24అ.

కఫమును అధికముగా ప్రకోపింపచేయుట ద్వారా పూర్వమే వృద్ధిపొందియున్న ప్లీహము ఇంకను పెరుగును. ఈ వ్యాధియందు ప్లీహము అష్టీలా (రాయివలె కఠినముగానుండు దిమ్మెవంటి)వలె కఠినముగను, కచ్ఛప పృష్ఠమువలె ఉన్నతముగను ఉండును. దీనిని ఉపేక్షించినచో ఇది క్రమముగా కుక్షిని, జఠరమును, గ్రహణినిపీడించుచు ఉదరమును వృద్ధి పొందించును. ఈ వ్యాధిని ప్లీహోదరము అందురు. ఇదే విధముగు వృద్ధి దక్షిణ పార్శ్వమున యకృత్తునందు కలిగిన యెడల దానిని యకృతోదరము అందురు.

## ప్లీహోదర లక్షణములు

దౌర్బల్యము, అరుచి, అవిపాకము, మల మూత్రావరోధము, తమః ప్రవేశము, కళ్ళముందు చీకట్లు కమ్ముట, పిపాస, అఙ్గమర్దము, వమనము, అవయములందు దౌర్బల్యము లేక అవయములు కృశించుట, కాస శ్వాస, మృదు జ్వరము, ఆనాహము, అగ్నిమాంద్యము, శరీరకృశత్వము, ఆస్యవైరస్యము, సన్ధులందు వేదన, కోష్ఠమునందు వాతవృద్ధి, ఉదరశూల, బలక్షయము, అతి పాండుత్వము-ఈ లక్షణములు కలుగును. ఉదరము అరుణ వర్ణముగాగాని వివర్ణముగాగాని ఉండును. ఉదరముపై నీల, హరిత, హారిద్ర వర్ణపురేఖలు ఉత్పన్నమగును.[1]

---

1. i) అశితస్యాతి సంక్షోభాత్ యానయానాతిచేష్టితైః అతివ్యవాయభారాధ్వవమన వ్యాధికర్శనైః వామపార్శ్వాశ్రితః ప్లీహా చ్యుతః స్థానాత్ప్రవర్తతే శోణితం వా రసాధిభ్యో వివృద్ధం తం వివర్ధయేత్ తస్య ప్లీహా కఠినోష్ఠీలేవాదౌ వర్ధమానః కచ్ఛపసంస్థాన ఉపాత్యభిఖ్యతే స చోపేక్షితః క్రమేణ కుక్షిం జఠరమగ్న్యధిష్ఠానం చ పరిక్షిపన్నుదరమభినిర్వర్తయతి తస్య రూపాణి- దౌర్బల్యారోచకావిపాకవర్చో మూత్రగ్రహతమః ప్రవేశపిపాసాంగ

(Contd....

## ప్లీహోదర భేదములు

ప్లీహోదరమును దోషాను బంధమును అనుసరించి మూడువిధములు.

1. వాతజ అనుబంధ ప్లీహోదరము
2. పిత్తజ ప్లీహోదరము
3. శ్లేష్మజ ప్లీహోదరము

**వాతజ ప్లీహోదర లక్షణములు :-**

వాతజ ప్లీహోదరమునందు ఉదావర్తము పీడ, ఆనాహము కలుగును.

**పిత్తజ ప్లీహోదర లక్షణములు :**

పిత్తజ ప్లీహోదరమునందు మోహము తృష్ణ, దాహము (మంట) జ్వరము కలుగును.

**కఫజ ప్లీహోదరముయొక్క లక్షణములు :**

శ్లేష్మజ ప్లీహోదరమునందు ఉదరము బరువుగా నుండుట, అరుచి, కాఠిన్యము కలిగియుండును.

---

మర్ద ఛర్దిమూర్ఛాఽంగసాదకాసశ్వాస మృదుజ్వరాఽఽనాహాఽగ్నినాశ కార్శ్యాఽఽస్యవైరస్య సర్వభేదకోష్ఠవాతశూలాని అపి చ ఉదర మరుణ వర్ణం వివర్ణం వా నీలహరితహారిద్రరాజియద్భవతి ఏవమేవ యకృదపి దక్షిణపార్శ్వస్థం కుర్యాత్ తుల్యహేతులింగౌషధత్వాత్ తస్య ప్లీహజఠర ఏవాఽవరోధః ఇతి ఏతత్ప్లీహోదరమితి విద్యాత్ (చ.చి. 13/35-38)

i) ప్లీహోదరం కీర్తయతో నిబోధ విదాహ్యభిష్యందిరతస్య జంతోః ప్రదుష్టమత్యర్థమసృక్ కఫశ్చ ప్లీహాభివృద్ధిం సతతంకరోతి ప్లీహోదరం తత్ ప్రవదంతి తజ్జ్ఞాః వామే చ పార్శ్వే పరివృద్ధిమేతి విశేషతః సీదతి చాతురోఽత్ర మందజ్వరాగ్నిః కఫపిత్తలింగైరుపద్రుతః క్షీణబలోఽతి పాండుః (సు.ని. 7) ii) అ.సం.ని. 12.

ప్లీహోదరమందు రక్తాధిక్యత ఉన్నపుడు విధిశోణితీయాధ్యాయమున చెప్పబడిన రక్తదుష్టి లక్షణములతో కూడియుండును.[1]

## ప్లీ హ రో గ ము

సంహితలందు ప్లీహరోగము ప్రత్యేకముగా వివరింపబడక పోయినప్పటికిని ఒక్క భావమిశ్రుడు మాత్రము ప్రత్యేకముగా వీనిని వర్ణించెను. ప్లీహము రక్తము వలన ఉత్పన్నమై హృదయము యొక్క వామ అధోభాగమున నుండి రక్తవాహినీ సిరలకు మూలముగా నుండునని భావమిశ్రునిచే వివరింపబడినది.[2]

భావమిశ్రుడు చరక సుశ్రుతాదులు ప్లీహోదరమున చెప్పిన విషయములకు తుల్యముగనే ప్లీహనిదాన సంప్రాప్తులు సంక్షిప్తముగా వివరించి దోషానుసార లక్షణములను కొన్ని చికిత్సలను మాత్రము అధికముగా వివరించెను.

భావమిశ్రునిచే వివరింపబడిన ప్లీహరోగ వర్ణన ఈ క్రింది విధముగా నుండును.

## ని దా న ము

విదాహకరములైన కుళుత్థములు, మినుములు, ఆవకూర మొదలైన ఆహార పదార్థములును, అభిష్యందకరములైన మాహిషదధి మొదలైన పదార్థములును, లధికముగా సేవించుట దివాస్వప్నము-ఈ కారణములచే ప్లీహవ్యాధి కలుగును.

---

1. i) ఉదావర్తరుజానాహైః దాహమోహతృషా జ్వరైః
గౌరవారుచికాఠిన్యైశ్చానిలాదీన్యథాక్రమమ్ లింగైః ప్లీహ్న్యధికాన్దృష్ట్వా
రక్తం చాపి స్వలక్షణైః (చ. చి. 13/75-76)
ii) అ. హృ. ని. 12/27.

2. శోణితాజ్జయతే ప్లీహా వామతో హృదయాదధః
రక్తవాహి శిరాణాం సమూలం ఖ్యాతో మహర్షిభిః
(భా. ప్ర. ప్లీహాధికారం - 1)

## సంప్రాప్తి

పైన వివరింపబడిన కారణములచే రక్తము కఫము అధికముగా వృద్ధి చెంది ప్లీహమును దూషింపచేసి వృద్ధి పొందింప చేయును. దీనిని ప్లీహవ్యాధి అందురు.[1]

## కఫజ ప్లీహరోగ లక్షణములు

మందమైన వ్యథ కలిగియుండుట, ప్లీహస్థానము స్థూలముగను కఠినముగను గౌరవముతో కూడి యుండుట, అరోచకము మొదలగు కఫ లక్షణములతో కూడి యుండుట ఈ లక్షణములు కఫజ ప్లీహరోగమునందు కలుగును.[2]

## వాతజ ప్లీహరోగ లక్షణములు

నిత్యము కోష్ఠము పూరింపబడి యుండుట, ఉదావర్తముతో కూడియుండుట, వేదనతో బాధపడుచుండుట, ఈ లక్షణములు వాతజ ప్లీహరోగమునందు కలుగును.[3]

## సన్నిపాతజ ప్లీహరోగ లక్షణములు

సన్నిపాతజ ప్లీహరోగమునందు పై మూడు దోషములకు వేర్వేరుగ చెప్పబడిన లక్షణములన్నియు కలసి యుండును.

సన్నిపాతజ ప్లీహరోగము అసాధ్యముగా నుండును.[4]

---

1. విదాహ్యభిష్యంది రతస్య జంతోః ప్రదుష్టమత్యర్థమసృక్కఫశ్చ
   ప్లీహాభివృద్ధిం కురుతః ప్రవృద్ధౌ తం ప్లీహసంజ్ఞం గదమామనంతి
   (భా. ప్ర. ప్లీ. 2)
2. ప్లీహా మందవ్యథః స్థూలః కఠినో గౌరవాన్వితః
   అరోచకేన సంయుక్తః ప్లీహా కఫ ఉచ్యతే (భా. ప్ర. ప్లీహ. 6)
3. నిత్యమానద్ధ కోష్ఠస్స్యాన్నిత్యోదావర్తపీడితః
   వేదనాభిః పరీతశ్చ ప్లీహా వాతిక ఉచ్యతే (భా. ప్ర ప్లీహా. 7)
4. దోషత్రితయరూపాణి ప్లీహాసాధ్యే భవంత్యపి (భా. ప్ర. ప్లీ. 8)

## సామాన్య ప్లీహరోగ లక్షణములు

ప్లీహము వామపార్శ్వమునందుండుట వలన ఆపార్శ్యము వృద్ధిపొందినట్లు కనిపించును. అతి శరీర కృశత్వము, మందజ్వరము, మందాగ్ని అధిక బల క్షయము ఇతర కఫపిత్త లక్షణములతో కూడియుండును. అన్ని ప్లీహ రోగము లందు కఫము, పిత్తము (రక్తముతో సహా) ప్రధానముగా నుండును.

## ప్లీ హ రో గ భే ద ము లు[1]

ప్లీహరోగమును భావమిశ్రుడు ఐదు విధములుగా వర్ణించెను. అవి-

1. రక్తజ ప్లీహరోగము
2. పిత్తజ ప్లీహరోగము
3. కఫజ ప్లీహరోగము
4. వాతజ ప్లీహరోగము
5. సన్నిపాతజ ప్లీహరోగము

## రక్తజ ప్లీహరోగము యొక్క లక్షణములు

క్లమము (బడలిక) భ్రమ, విదాహము వైవర్ణ్యము, శరీర గౌరవము, మోహము, ఉదరము ఎర్రగా ఉండుట-ఈ లక్షణములు కలుగును.[2]

## పిత్తజ ప్లీహరోగ లక్షణములు

పిత్తజ ప్లీహరోగమునందు జ్వరము దప్పిక, దాహము (మంట) మోహము, శరీరము విశేషమైన పీత వర్ణములో ఉండుట-ఈ లక్షణములు కలుగును.[3]

---

1. వామేన పార్శ్వే పరివృద్ధమేతి విశేషతస్సీదతి చాతురోఽత్ర మందజ్వరాగ్నిః కఫపిత్త లింగై రుపద్రుతః క్షీణబలోఽతిపాండుః (భా. ప్ర. ప్లీహ. 3)
2. క్లమో భ్రమో విదాహశ్చ వైవర్ణ్యం గాత్రగౌరవం మోహో రక్తోదరత్వ చ జ్ఞేయం రక్తజ లక్షణం (భా. ప్ర. ప్లీహ. 4)
3. సజ్వరః సపిపాసశ్చ సదాహో మోహసంయుతః పీతగాత్రో విశేషేణ ప్లీహా పైత్తిక ఉచ్యతే (భా. ప్ర. ప్లీహ. 5)

## ప్లీహోదరము యొక్క చికిత్స

ప్లీహోదరమునందు అవస్థాను సారము స్నేహనము, స్వేదనము, విరేచనము, నిరూహవస్తి అనువాసన వస్తి—వీనిని ప్రయోగించ వలయును.[1]

**సిరా వ్యధనము :-**

పై ప్రక్రియలతో వ్యాధి శమించనిచో మరలా స్నేహస్వేదములు చేయించి వధయుక్తమైన ఆహారమును సేవింపచేసి వామహస్తము యొక్క కూర్పర ప్రదేశమున ఆభ్యంతరముగా నుండు సిరను వేధించి ప్లీహప్రదేశమును మర్దించుట ద్వారా రక్తమోక్షణము చేయించ వలయును[2].

యకృతోదరమున దక్షిణహస్తమున సిరావ్యధనము చేయవలెను.

**దాహకర్మ :-**

వామహస్తమున మణిబంధమును లాగి వామ అంగుష్టము పైపుకు వెళ్ళుచున్న సిరను తప్త శరముతో శీఘ్రముగా దహింపవలెను.

యకృతోదరమున దక్షిణ మణి బంధసిరను దహింపవలెను.

---

1. స్నేహం స్వేదం విరేకం చ నిరూహ మనువాసనమ్
సమీక్ష్య కారయేద్బాహౌ దాయే వా వ్యధయేత్సిరామ్ (చ.చి. 13/77)

2. ప్లీహోదరిణో స్నిగ్ధస్విన్నస్య దధ్నా భుక్తవతో వామబాహౌ కూర్పరాభ్యంతరతః సిరాం విధ్యేత్ విమర్దయేత్ పాణినా ప్లీహానాం రుధిరస్యందనార్థమ్ (సు.చి. 14/13)

3. మణిబంధం సవ్యన్నామ్య వామాంగుష్ఠసమీరితామ్
దహేచ్ఛిరాం శరేణాశు ప్లీహ్నో వైద్యః ప్రశాన్తయే (సు.చి. 14/16)

ప్లీహోదరమున దోషముల యొక్క రోగి రోగముల యొక్క బలా బలమును గమనించి చికిత్స చేయవలయును. ఆయా దోషాను సార చికిత్సలు సాధారణ ఉదరరోగోక్త చికిత్సలు అవస్థాను సారము ప్రయోగింపవలయును.

## ప్లీహోదరము నందు శామక చికిత్సలు

ప్లీహోదరమున ఆవశ్యకతానుసారము శోధనానంతరముగాని, రక్తమోక్షణాది క్రియల అనంతరముగాని ఈ క్రింది ఔషధములు ప్రయోగింప వలయును

1. షట్పల ఘృతము పానము చేయించవలయును.
2. పిప్పలీ వర్ధమాన రసాయనమును రసాయన విధ్యను సారము ప్రయోగించ వలయును.
3. గుడహరీతకీ ప్రయోగము చేయవలయును.
4. గ్రహణీ చికిత్సయందును, అర్శో చికిత్సయందును చెప్పబడిన క్షార యోగములను, అరిష్టయోగములను ప్రయోగించవలయును.
5. విడంగాది క్షారము (చరక)—500 మి.గ్రా తేనెతో.
6. రోహితకీ కాండమును అభయాక్వాథములోగాని గోమూత్రమునందు కాని 7 రోజులు నానబెట్టియుంచి వడగట్టి పానము చేయించుచుండవలయును. ఔషధ జీర్ణానంతరము జాంగల పశు పక్షులమాంస రసముతో భోజనమివ్వ వలయును.
7. రోహితక ఘృతమును పానము చేయించిన శ్వాస, పాండు కామలాదులతో కూడిన ప్లీహోదరము శమించును.
8. పిప్పల్యాది చూర్ణము 2గ్రా. ఉష్ణజలముతో సేవింపచేయవలెను.[1]

---

1. చ.చి. 13/78-88

9. శుక్తి భస్మమును

10. హింగు సౌవర్చలవణము 500 మి.గ్రా దుగ్ధముతో సేవింపచేయ వలయును.

11. పలాశ క్షారముతో యవక్షారము కలిపి పానము చేయించవలయును.

12. బాగుగా వడగట్టిన కింశుక క్షారోదకముతో యవక్షారమును పానము చేయించవలయును.

13. పారిజాత క్షారముగాని, ఇక్షురక క్షారముగాని అపామార్గ క్షారముగాని సేవింపచేయవలయును.

14. శోభాంజన క్వాథమునందు పిప్పలి, సైంధవ లవణము, చిత్రమూలము కలిపి పానము చేయించవలయును.

15. కాంజికముతో కలిపి వడగట్టిన పూతీకరంజ క్షారమునందు బిడాలవణము అధికముగా పిప్పలీ చూర్ణము కలిసి సేవింప చేయవలయును.[1]

16. అర్క లవణము 1గ్రా.
ప్లీహోదరమును శమింపచేయును.

17. శిగ్రు క్వాథమున పిప్పలి, మరిచ, అమ్లవేతస సైంధవ చూర్ణములు కలిపి సేవింప చేయవలయును.

18. ఇంద్రవారుణీ ఉత్పాటన ప్రయోగము.
ప్లీహోదర రోగి పేరు ఉచ్చరించి ఇంద్రవారుణీ మూలమును పీకి పడ వేసిన వ్యాధిశమించును.

19. గుడూచీ మూల కల్కము పానము చేయించిన ప్లీహోదరము శమించును. (రాజమార్తాండము)

---

1. సుశ్రుత చికిత్స 14అ.

20. పాఠామూలము తండులోదకముతో కల్కము చేసి సేవించిన ప్లీహోదరము శమించును. (రాజమార్తాండము)

21. భల్లాతక, అభయ, జీరకము వీనిని మోదకములుగా చేసి సేవించిన దారుణ ప్లీహోదరము గూడా ఏడు దినములలో శమించును. (వంగసేన)

22. పక్వ ఆమ్ర ఫలరసము తేనెతో సేవించిన ప్లీహోదరము శమించును. (చక్రదత్త)

23. కాక జంఘా లేక లతాకరంజ క్వాథమునందు సైంధవ లవణము తింతిడీక క్షారము కలిపి సేవింప చేసిన ప్లీహోదరము శమించును.

24. i) యమానికాది చూర్ణము 2-4గ్రా ఉష్ణజలముతో సేవించినను.
ii) రోహితకాది చూర్ణము 1గ్రా శీతల జలముతో సేవించినను.
iii) గుడూచ్యాది చూర్ణము 2-4గ్రా మందోష్ణ జలముతో సేవింప చేసినను. యకృత్ ప్లీహోదరములు శమించును.

25. తాల పుష్ప క్షారము గుడముతో సేవించి ఉష్ణ జలము పానము చేసినను ప్లీహోదరము శమించును.

26. చిత్రకవటి, రోహితకాదివటి మానకాది వట, బృహత్ గుడ పిప్పలి అభయాలవణము—వీనిని ఆవశ్యకతాను సారము ప్రయోగింపవలయును.

27. శంఖ ద్రావక రసము 1-4 బిందువులు జలములో కలిపి సేవించిన శూల ఆధ్మాన యకృత్ప్లీహ రోగములు శమించును.

28. చిత్రక ఘృతము, పిప్పలీ ఘృతము, చిత్రక పిప్పలీ ఘృతము, బ్రహ్మ ఘృతము ఈ ఘృతములు యకృత్ ప్లీహ రోగములు శమింపచేయును.

29. రోహిత కారిష్ట 15-30 మి.లి సమజలంతో యకృత్, ప్లీహ రోగములను శమింప చేయును. (భై.ర.)

30. కుమార్యాసవము-15-30 మి.లీ. ఇది యకృత్ బల్యము యకృత్ వృద్ధి యందు జీర్ణప్లీహవృద్ధి యందు బాగుగా పని చేయును.

31. శరపుంఖ మూల చూర్ణము లేక క్వాథము ప్లీహవృద్ధిని శమింపచేయును.

## రసౌషధములు మొదలగునవి

శంఖభస్మము, 200-400 మి గ్రా రేచకౌషధములతో ఇవ్వవలయును. యకృత్ ప్లీహ వృద్ధిని శమింప చేయును.

తామ్రభస్మము :- 35-70 మి.గ్రా తేనె పిప్పలీ చూర్ణము, కుమార్యా సముతోగాని పునర్నవాది క్వాథముతోగాని యకృతోదరము ప్లీహోదరములందు ఇవ్వవలయును. దీని వలన యకృత్ పిత్త స్రావము నియమితమగును. పిత్తా శ్మరి జనితశూల శమించును. పిత్తాశ్మరి బేధింపబడును. యకృత్ ప్లీహవికారము లన్నింటియందును మంచి గుణకారి.

స్వర్ణమాక్షిక భస్మము—ప్రవాళభస్మము శుక్త భస్మములతో కలిపి యిచ్చిన కామల యకృద్వికార శామకము. (ర.త.సార.)

ఆరోగ్య వర్ధనీ వటి—యకృత్ప్లీహవృద్ధులలో శ్రేష్టమైన ఔషధము అపామార్గ క్షారము నౌసాదర్ కలిపి యిచ్చిన విశేష గుణకారిగా నుండును. 500 మి.గ్రా. నుండి 1 గ్రా వరకు పునర్నవాష్టక క్వాథముతోగాని రోహిత కారిష్టముతోగాని యివ్వవలెను.

యకృత్ప్లీహారిలోహము, ప్లీహాంతక వటి, క్రవ్యాద రసరాజరసము రసము, ప్లీహశార్దూలరసము, ప్లీహారి రసము, యకృదారి లోహము, యకృత్ప్లీ హోద రారి లోహము ఈ ఔషధములు ఆవశ్యకతాను సారము యకృత్ ప్లీహవ్యాధు లందు ప్రయోగింప వలయును. (భై.ర.; ర. తం. సా)

రసరాజరసము—ప్రధాన ద్రవ్యములు తామ్రము, గంధకము మాత్ర 65 మి.గ్రా. తేనెతో యకృత్ ప్లీహవృద్ధి జ్వరశూల శామకము రసాయనము.

ప్లీహాన్తకరసము—ప్రధాన ద్రవ్యములు తామ్ర, రజత, అభ్రక, లోహ, ముక్త, 200 మి.గ్రా పాండు, శ్వాస, కఫప్రకోపయుక్త ప్లీహ యకృద్వికార శామకముగా నుండును.

వాసుకీ భూషణరసము—వంగభస్మ, తామ్రభస్మ, ఖజ్జలి మొ॥నవి కలవు. గుల్మ ప్లీహశామకము.

విద్యాధర రసము—తామ్రము, మణిశిల మొ॥నవి కలవు. ప్లీహ, గుల్మ శామకము.

లోకనాధరసము—ఖజ్జలి, అభ్రకము, లోహము, తామ్రము ప్రధాన ద్రవ్యములు. పిప్పలీ చూర్ణముతో సేవించిన యకృత్ ప్లీహవర్ధి, జీర్ణజ్వరము. పాణ్డు కామల మొదలగు వ్యాధులు శమించును.

ప్లీహారిరసము—ఖజ్జలి, వత్సనాభి, జయపాల-రేచక గుణయుక్తము ప్లీహ యకృత్ వికార శూల ఉదావర్త శామకము జ్వరహరము. (భై.ర)

# యకృత్ వ్యాధులు

ఆయుర్వేదాను సారము ప్లీహమునకు చెప్పబడినదంతయు యకృత్తునకు వర్తించును. యకృత్ కుక్షిలో కుడిభాగమున హృదయమునకు క్రిందగా ఉండునని చెప్పబడినది.

యకృత్ రోగకారణములు లక్షణములు చికిత్సలు ప్లీహమునకు తుల్యముగా ఉండును.

ఆధునిక మతానుసారము యకృద్వికారములు ఈ క్రింది విధముగా నుండును.

## యకృద్వికారములు

ప్రధాన కారణములు—ధాతుపరిణామ వికృతులు, రక్తప్రసరణ వికృతులు విషపరిణామములు, కీటాణు సంక్రమణము, కృములు, కాన్సర్, పరాన్ఫైమా

వికృతి, వైరస్, శోథ, మొదలగునవి రక్త వికృతులు, అర్బుదములు, పిత్త నాళికా వికృతులు.

## ప్రధాన యకృద్వ్యాధులు

### 1. కామల :

త్వక్‌నేత్ర నఖముఖ జిహ్వామూత్ర పీతత్వము రక్తములో బైల్ పిత్తాంశ 100 మి లీ 2 మి.గ్రా మించుట అనునది ప్రధాన వికృతి.

ఇది మూడు విధములు అ) రక్తక్షయ జన్యము (Haemolytic) ఆ) యకృత్‌కణ వికృతి జన్యము (Hepetocellular), ఇ) పిత్తావరోధజ (Cholestic or obstructive).

చికిత్స—స్నేహపానము చేయించి విరేచనము చేయింపవలెను.

కటుకరోహిణి, త్రిఫల, గుడూచి, భూమ్యామలకి, భృంగరాజ, మొదలగునవి ప్రయోగింపవలెను.

పర్పటాద్యరిష్ట, కుమార్యాసవ, ఆరోగ్యవర్ధనీ వటి, లోహభస్మ, స్వర్ణమాక్షికభస్మ, మండూరభస్మ మొదలైనవి సామాన్యముగా అవస్థానుసారము ప్రయోగింపవలెను.

కారణానుసారము, యకృత్ వికృతి అనుసారము తగిన చికిత్సలు చేయవలెను.

### 2. సిర్రోసిస్ (యకృత్ సంకోచము) :

యకృత్ రచన శాశ్వతముగా వికృతి చెందును. తంతుధాతువు, అర్బుదములు ఏర్పడును. యకృత్ వికృతికర ఆహారవిహారములు మద్యపానము దీని వలన కలుగు లక్షణము.

ప్లీహవృద్ధి, యకృత్‌వృద్ధి, ఆమాశయ మహాస్రోతస్సు నుండి రక్త స్రావము, రక్త పిత్తము, జలోదరము, వేళ్ళువాచుట, హస్తపాదఉష్ణత నాడీ మాంద్యము మన్యా స్పందన.

ముఖ్యముగా యకృత్ కణములు దూషింపబడును. మందజ్వరము ఉదరముపై రేఖలు తీరుట, రక్తనాళములు ముఖము, కంఠము, ఊర్ధ్వ ఉదరమునందు, చేతులందు, అరతి, కృశత్వము, అగ్నిమాంద్యము, పూతి ఆస్యత, పూతి విశ్వాసము పూతిగంధము క్రమముగా యకృత్ జనిత మూర్ఛకు దారితీయును.

యకృత్‌జన్య మూర్ఛకు ముందు మనోవిభ్రమము, శీలవిభ్రంశము అధిక ముఖగత రక్తస్రావము, అధిక మాంసకృత్తులు గల ఆహారసేవన వంటివి గమనింపదగును.

కామల గూడా ఉండును. అదికముగా నుండుట దుస్సాధ్యసూచకము.

సిర్రోసిస్ యొక్క తీవ్రత అనుబంధ లక్షణములపై సాధ్యాఽసాధ్యతలు ఆధారపడి యుండును.

రోగనిర్ణయము బి.ఎస్.పి పరీక్ష, సీరమ్ ఆల్బ్యూమిన్ సీరమ్ ట్రాన్సమినేస్ నీడిల్ బయోప్సీ పరీక్షలు చేయవలెను.

సాధ్యాఽసాధ్యత :

ప్రారంభావస్థలో ఉండి రోగి బలవంతుడుగా నుండి ఉపద్రవములు లేకుండా యుండినచో ఆయుర్వేదౌషధములతో యకృత్ సంకోచము చికిత్సింపవచ్చును.

కారణాను సారము, లక్షణానుసార చికిత్సలు యకృత్ బల్యములగు ఔషధముల ప్రయోగము చేయవలెను. ముందు వివరింపబడిన యకృత్ప్లీహోదర చికిత్సలతో ఉపచరింపవలెను.

ముఖ్యముగా ఆరోగ్య వర్ధనీవటి, పంచసూతరసము, తాప్యాదిలోహము యకృత్ప్లీహారరసము ఉపయోగింపవలెను. యకృత్ పిప్పలీ ప్రయోగము చేయవలెను.

**3. యకృత్ ధమనుల సిరల వ్యాధులు (Diseases of the hepatic veins & arteries) :**

అ) హీన సంపహనము
మూర్ఛ కలుగవచ్చును.

ఆ) పోర్టల్ హైపర్‌టెన్షన్
(ప్రతిహారిణీ సిరా సమ్మర్దము)

ప్రతిహారిణీ అవరోధము కలిగినపుడు శూల, ప్లీహవృద్ధి, రక్తవమి, జలోదరము కలుగును.

యకృత్ సిరావరోధము కలిగినపుడు అకస్మాత్తుగా వమనము, యకృద్వృద్ధి, కామల, జలోదరము కలుగును.

ఈ వ్యాధులు అసాధ్యముగా నుండును. లాక్షణిక చికిత్సలు చేయుచుండవలెను.

యకృత్ బల్య ఔషధము లివ్వవలెను.

ఇ) తీవ్ర లేక జీర్ణ సిరావరోధము
చికిత్సలు పైవలెనే.

**4. తీవ్ర యకృత్ శోధ (Acute Hepatitis):**

వైరసస్ సంక్రమణము, సామాన్య కారణము విషపూరిత ఔషధములు, మొదలగునవి గూడా కారణమగును.

యకృత్ శోథ జనక క్రిములు మూడు రకములు :

"A" రకము – సంచయకాలం 20-40 రోజులు మలము ద్వారా వ్యాప్తి చెందును.

B బి) రకము వైరస్, సంచయకాలము 60-160 రోజులు లాలాజలము, యోనిస్రావము, శుక్రము, రక్తములందుండి సంభోగము, రక్తమిచ్చుట వంటి వానివలన వ్యాపించును.

ఎ కాని బి కాని కానిది–రక్తము మార్పిడి వలన కలుగును.

ఎ రకము తీవ్రముగా నుండును. జ్వరము హృల్లాసము అగ్నిమాంద్యము. పృష్టశూల జ్వరముతో ప్రారంభమై ఒక వారం లోపల కామల కలుగును. యకృద్వృద్ధి, స్పర్శాసహ్యత కొద్దిమందిలో ప్లీహవృద్ధి, పురీషము తెల్లగాను మూత్రము గాఢ పీతవర్ణంలో ఉండును.

కొందరు కామల బయటపడకమునుపే మరణించెదరు. కొందరికి యకృత్ వికృతి అధికమై యకృత్ సంకోచమునకు దారితీయును.

చికిత్స – విశ్రాంతి, లాక్షణిక చికిత్స కామల ఉన్నతదనుసార చికిత్స.

## 5. జీర్ణ యకృత్ శోథ (Chronic Hepatitis) :

కృమిజన్య యకృత్ శోథ, వ్యాధిక్షమత్వ వికృతి జన్య కారణములు, విష పూరిత ఔషధములు కారణములుగా నుండును.

లక్షణములు-కామల, యకృత్ప్లీహవృద్ధి, స్త్రీలలో రజోబద్ధము, కీళ్ళ నొప్పులు, తద్వికారములు, వృక్కవికృతి.

రోగనిర్ణయము-యకృత్ బైయోప్సీ పరీక్ష, వ్యాధిక్షమత్వ ఏంటీబాడీ పరీక్షలు.

చికిత్స-లాక్షణిక చికిత్సలు, యకృత్ బల్య ఔషధములు ఆహారములు, యకృత్‌నకు హాని కలిగింపకుండా యుండు రసాయన ఔషధములు.

## 6. మద్యపాన జనిత యకృద్రోగము (Alcoholic liver disease)

యకృద్వృద్ధి, జ్వరము, యకృత్ ప్రవాహము కామల, జలోదరము, ఆంత్రమునందు రక్తస్రావము పరిసరీయ నాడీవికృతులు, లూకోసైటోసిస్, యకృత్తున మేదో సంచయము యకృత్ రచనా వికృతులు.

చికిత్స-దుస్సాధ్యము. లాక్షణిక చికిత్సలు.

## 7. యకృత్ అర్బుదములు మొ॥నవి

కాన్సరు వల్లగాని ఇతర కారణముల వలనగాని అర్బుదములు కలుగును. ఎమీబియాసిస్ వలన యకృత్ పాకము కలుగవచ్చును.

యకృత్‌నందు గ్రంధులు కలుగవచ్చును.

రోగ నిర్ధారణకై బయాప్సీ, స్కానింగ్ యకృత్ క్రియాపరీక్షలు చేయింపవలెను.

లాక్షణిక చికిత్స ప్రారంభించి కారణానుసారము శస్త్ర చికిత్స సాధ్యమైన చేయవలెను.

తామ్ర భస్మము, నాగ భస్మము, తాప్యాదిలోహము స్వర్ణపర్పటి, పంచామృత పర్పటి మొదలగునవి అవస్థానుసారము వాడవచ్చును.



# పానాత్యయాది రోగ ప్రకరణము

మద్యపానము అధికముగా విధి ననుసరింపక సేవించుటచే కలుగు వ్యాధులు నాలుగు విధములుగా సుశ్రుతునిచే వివరింపబడినవి. వానిలో పానాత్యయము మొదటిది.

చరకుడు, వాగ్భటుడు మదాత్యయమను పేరుతో ప్రధానముగా మద్యపాన జనిత వ్యాధులు వివరించిరి.

మద్యముయొక్క నిరుక్తి :

మదిర యోని ననుసరించి, సంస్కారములననుసరించి, నామభేదముల ననుసరించి ఎన్నో విధములుగా ఉన్నప్పటికిని మదమును ఉత్పన్నముచేయుట అను సామాన్య గుణము కలిగియుండుటచే మద్యము లేక మదిర అనతగి యున్నది.[1]

మద్య సేవనచే జనించు గుణములు :

విధిని, మాత్రను, కాలమును అనుసరించి హితకరమైన ఆహారములను సేవించిన శరీరమునకు ఏ విధముగా బలము కలుగునో అదే విధముగా విధిని, ప్రమాణమును కాలమును అనుసరించి సంతుష్టుడై మద్యపానముచేసిన యెడల అట్టి మద్యము అమృతమువలె శరీరమునకు ఆరోగ్యకరముగా నుండును.[2]

---

1. యోనిసంస్కారనామాద్యైః విశేషైర్బహుధా చ యా
భూత్వా భవేత్యేకవిధా సామాన్యాన్మదలక్షణాత్ (చ.చి. 24/6)

2. విధినా మాత్రయా కాలే హితైరన్నైర్యథాబలం
ప్రహృష్టో యః పిబేన్మద్యం తస్య స్యాదమృతం యథా (చ.చి. 24/27)

మద్యమును స్నిగ్ధములగు భక్ష్యములతోను మాంసములతోను, శ్రేష్ఠమైన పౌష్టికమైన యితర ఆహారములతోను పానముచేసిన యెడల ఆయువు, బలము, శరీరపుష్టి-ఇవి వృద్ధిపొందును. సౌందర్యము, మనస్తుష్టి (సంతోషము), తేజస్సు పరాక్రమము-యివన్నియు విధ్యనుసార మద్యసేవనచే వృద్ధిపొందు చుండును.[1]

మద్యము భోజనమునందు రుచిని కలిగించును. అగ్నిదీప్తిని కలిగించును. హృదయమునకు హితకరముగా నుండును స్వరమునకు వర్ణమునకు ప్రసాద మును కలిగించును. శరీరమునకు తృప్తిని కలిగించును. భయమును, శోకమును, శ్రమను శమింపచేయును నిద్రను కలిగించును.[2]

అన్నము, పానము, వయస్సు, రోగము, బలము, మరియు కాలము-ఈ ఆరింటియొక్క మూడు మూడు భేదములను మూడు శారీరక దోషములను. మూడు విధములగు సత్త్వములను బాగుగా విచారించి తగు విధముగా మద్యమును పానము చేయవలయును.[3]

ఆహారములందు, పానీయములందు వాతకారకత. పిత్త కారకత, కఫకార కతను విచారింపవలయును.

---

1. స్నిగ్ధైస్తదన్నై ర్మాంసైశ్చ భక్ష్యైశ్చసహ సేవితమ్ భవేదాయుః ప్రకర్షాయ బలాయోపచయాయ చ కామ్యతా మనసస్తుష్టిర్ధయిర్యంతేజోఽతివిక్రమః విధివత్ సేవ్యమానే తు మద్యే సన్నిహితా గుణాః (సు.ఉ. 47/7-8)

2. రోచనం దీపనం హృద్యం స్వరవర్ణప్రసాదనం ప్రీణనం బృంహణం బల్యం భయశోకశ్రమాపహమ్ (చ.చి. 24/82)

3. అన్నపానవయోవ్యాధిబలకాలత్రికాణిషట్ త్రీన్-దోషాన్-త్రివిధం సత్త్వం జ్ఞాత్వా మద్యం పిబేత్సదా (చ.చి. 24/68)

వయస్త్రికము — బాల్యావస్థ, యువావస్థ, వృద్ధావస్థ

రోగ త్రికము—మృదు, మధ్యము, దారుణ

బలత్రికము—ఉత్తమ, మధ్యమ, అవర

కాలత్రికము—శీత, ఉష్ణ, వర్ష

దోషములు: వాత, పిత్త, కఫ, సత్త్వములు-సాత్త్విక, రాజస, తామస-వీటన్నింటిని యోచించి తగిన విధముగా పానముచేసిన మద్యము హితకరముగా నుండును.[1]

మద్యముయొక్క గుణములు-కర్మలు :

మద్యము, ఉష్ణవీర్యము, తీక్ష్ణ, సూక్ష్మ, విశద, రూక్ష, ఆశుకారి, వ్యవాయి, వికాసి-అను అగుణములతో కూడియుండును.[2]

మద్యమందలి ఉష్ణవీర్యముచేత శీతోపచారము లందిచ్చ కలిగియుండును. తీక్ష్ణగుణమువలన మనస్సంచారము అడ్డగింపబడును. సౌక్ష్మ్య గుణమువలన సూక్ష్మ అవయవములలోనికి గూడా ప్రవేశించును. విశదగుణము వలన కఫ శుక్రములను క్షీణింపచేయును. రౌక్ష్య గుణమువలన వాత ప్రకోపమును కలిగించును. ఆశు కారిత్వముచే వెంటనే తన కర్మను వ్యక్తము చేయును. వ్యవాయి గుణముచే శరీరమునకు హర్షమును కలిగించును. వికాశీ గుణముచేత ప్రసరించు

1. చక్రపాణి

2. మద్యముష్ణం తథా తీక్ష్ణం సూక్ష్మం విశదమేవ చ
రూక్షమాశుకరం చైవ వ్యవాయి చ వికాశి చ (సు.ఉ. 47/3)

చుండును. మద్యము సామాన్యముగా ఆమ్లరసముకలిగి లఘువుగా నుండును. లవణవర్జిత పంచరసములు ఉండునని కొందరి అభిప్రాయము.[1]

## విధి ననుసరింపని మద్యపాన జనిత దోషములు

ఆహారమును భుజింపనివాడు, రూక్షమైన శరీరము గలవాడు మద్యము సేవించినను శ్రేష్ఠముకాని మద్యము సేవించినను, మాత్రాధికముగను, అనేక మారులును విధి ననుసరింపక సేవించినను ఆ మద్యము విషమువలె ప్రాణములను హరించును.

విధిననుసరింపక సేవించిన మద్యము శరీరోష్మతో కలసి అగ్ని నధికము చేసి అధికమైన మదమును కలిగించును.[2]

విధిననుసరింపని మద్యపానము వలన మనస్సు క్షోభను పొందును. రజస్సు మోహములచే దూషింపబడి అనేక వ్యాధులను కలిగించును. జ్ఞానము, విజ్ఞానము, సాత్త్విక గుణము నశించును. మోహము, భయము, శోకము, క్రోధము, ఉన్మాదము, మదము, మూర్ఛ, అపస్మారము, అపతానకము స్మృతి విభ్రంశము, మొదలగు వ్యాధులకు దారితీసి మరణమును కూడా కలిగించును.[3]

---

1. ఔష్ణ్యాచ్ఛీతోపచారం తత్తైక్ష్ణ్యాద్ధంతి మనోగతిమ్ విశత్యవయవాన్
సౌక్ష్మ్యాద్వైశద్యాత్కఫశుక్రనుత్ మారుతం కోపయేద్రౌక్ష్యాదాశుత్వాచ్చా
శుకర్మకృత్ హర్షదం చ వ్యవాయిత్వాద్వికాశిత్వాద్విసర్పతి తదమ్లంరసతః
ప్రోక్తం లఘురోచనదీపనమ్ కేచిల్లవణవర్జ్యాస్తు రసానత్రాదిశంతిహి
(సు. ఉ. 47/4-6)

2. i) తదేవాన్నన్న మత్తేన సేవ్యమానమమాత్రయా
కాయాగ్నిగా హ్యగ్నిసమం సమేత్య కురుతే మదమ్ (సు. ఉ. 47/9)

ii) రూక్షవ్యాయామనిత్యేన విషవద్యాతి తస్య తత్ (చ. చి. 24/28)

3. మద్యే మోహో భయం శోకః క్రోధో మృత్యుశ్చ సంశ్రితః
సోన్మాదమదమూర్ఛాయాః సాఽపస్మారాఽపతానకాః (చ. చి. 24/56)

**హృదయము ఓజస్సులపై మద్యము యొక్క ప్రభావము :**[1]

మద్యము యొక్క పది గుణములు ఓజస్సుయొక్క పది గుణములకు విరుద్ధముగా ఉండుటచే ఓజస్సును ఓజస్సునకాశ్రితమైన హృదయమును మద్యము ఈ క్రింది విధముగా ప్రభావితము చేయును.

మద్యము తనయొక్క లఘు గుణముచే ఓజస్సుయొక్క గురుగుణమును, తన ఉష్ణగుణముచే శీత గుణమును, ఆమ్లగుణముచే మధురగుణమును, తీక్ష్ణగుణముచే మృదుగుణమును, ఆశుగ గుణముచే స్రోతస్సులందు శీఘ్రముగా వ్యాపించి ఓజస్సుయొక్క నిర్మల గుణమును, రూక్షగుణముచే స్నిగ్ధగుణమును, వ్యవాయి గుణముచే స్థిరగుణమును, వికాసి గుణముచే శ్లక్ష్ణ గుణమును, విశద గుణముచే పిచ్ఛిల గుణమును, సూక్ష్మ గుణముచే బహల గుణమును నశింపచేయును. ఈ విధముగా మద్యము తన గుణములచే ఓజోగుణములను నశింప చేయుటచే ఓజస్సును ఆశ్రయించియున్న మనస్సు క్షోభమునుపొంది మదము ఉత్పన్నమగును.[2]

హృదయము రసమును వాతమును వహించు మార్గములకును, మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, ఆత్మ మరియు పరఓజస్సు వీనికిని స్థానముగా నుండును. మద్యమును అధికమాత్రలో పానము చేసినచో ఓజస్సు నశించును. ఓజస్సు నశించినపుడు దానికి ఆశ్రయమైన హృదయము వికృతి చెందును. హృదయము

---

1. చ. చి. 24/53-55, 57-58
2. గురుత్వం లాఘవాత్ శైత్యమౌష్ణ్యాత్ అమ్లస్వభావతః
   మాధుర్యం మార్దవం తైక్ష్ణ్యాత్ ప్రసాదం చాశుభావనాత్
   రౌక్ష్యాత్ స్నేహం వ్యవాయిత్వాత్ స్థిరత్వం శ్లక్ష్ణతామపి
   వికాసిభావాత్ పైచ్ఛిల్యం వైశద్యాత్ సాన్ద్రతాం తథా
   సౌక్ష్మ్యాత్ మద్యం నిహన్త్యేవమోజసః స్వగుణైర్గుణాన్
   సత్వం తదాశ్రయం చాశు సంక్షోభ్య జనయేన్మదమ్
   (చ. చి. 24/32-34)

వికృతి చెందినపుడు హృదయము నాశ్రయించియున్న పై భావములన్నియు అనగా మనస్సు, బుద్ధి, ఇంద్రియములు మొదలగునవి వికృతి చెందును. దానిచే మదము మదాత్యయాది వికారములు జనించును.[1]

## మ ద ము

హృదయము వికృతి చెందుటవలన మనస్సు క్షోభించి జ్ఞానము నశించి మోహము కలుగు అవస్థ మద మనబడును. దీనిని మత్తు అని అనదగును.

మద్యమువలన కలుగు మదము మూడు అవస్థలలో నుండును. ఇవి ఒక దాని తర్వాత మరియొకటి కలుగును. అందుచేత వీనిని పూర్వావస్థ (ప్రథమ,) మధ్యమావస్థ, అంతిమావస్థ అనబడును[2].

మద్యము హృదయమున ప్రవేశించుటచే హర్షము, అతితృష్ణ, ప్రీతి, సుఖము, మోహము, నిద్ర- ఇవియును, రాజస, తామసాది అనేక మనోవికార ములు కలుగును. దీనిని "మద్య విభ్రమము" లేక మదము అందురు.[3]

---

1. రసవాతాదిమార్గాణాం సత్త్వబుద్ధీంద్రియాత్మనాం ప్రధానస్యౌజసశ్చైవ
హృదయం స్థానముచ్యతే అతిపీతేన మద్యేన విహతే నౌజసా చ తత్
హృదయం యాతి వికృతిం తత్రస్థాయే చ ధాతవః
(చ. చి. 24/35-36)

2 i) పీయమానస్య మద్యస్య విజ్ఞాతవ్యాస్త్రయో మదాః
ప్రథమో మధ్యమోఽన్త్యశ్చ లక్షణైస్తాన్ప్రచక్ష్మహే (చ. చి. 24/41)

ii) త్ర్యవస్థశ్చ మదో జ్ఞేయః పూర్వో మధ్యోఽథపశ్చిమః (సు. ఉ. 47/11)

3. హృది మద్యగుణావిష్టే హర్షస్తర్షో రతిస్సుఖం వికారాశ్చ యథా సత్వం
చిత్రా రాజస తామసాః జాయన్తే మోహనిద్రాన్తా మద్యస్యాతి నిషేవ
ణాత్ స మద్యవిభ్రమో నామ్నా మద ఇత్యభిధీయతే
(చ. చి. 24/39-40)

## అవస్థానుసార మద లక్షణములు

### ప్రథమ మద లక్షణములు :

మద్యము ఓజస్సును నశింపచేయక హృదయమును ఆశ్రయించి యున్న బుద్ధి మొదలగు వానిని తమ తమ కార్యములకై ప్రతిబోధనము చేయుట ప్రథ మావస్థలో జరుగును.

ఈ అవస్థలో మనుజునికి వీర్యము, రతి, ప్రీతి, హర్షము, భాషణము- ఇవి సాధారణ స్థితికన్న అధికముగా నుండును. సేవించిన ఆహారాది గుణములు శరీరముపై కనిపించును. వాయిద్యములు వాయించుట, పాటలు పాడుట, చదువుట, నవ్వుట, కథలు చెప్పుట మొదలగు క్రియలు అధికముగా చేయును. సుఖమైన నిద్ర, ప్రబోధములు కలిగి సుఖముగా నుండును.[1]

## మధ్యమ మద లక్షణములు

### ప్రారంభ మధ్యమ మదము :

ఓజస్సు కొద్దిగా వికృతి చెందినపుడు ద్వితీయ మదము కలుగును. స్మృతి మోహము మాటి మాటికి కలుగుచుండును. స్మృతి కొంతసేపు ప్రాకృతికముగను కొంతసేపు మోహము చెందియు యుండును. బుద్ధి స్మృతివాక్కు అస్ఫుటముగా నుండును. అందుచే అధికముగా అసంబద్ధపు మాటలాడుట, అధిక హర్షము,

---

1. i) ఓజస్యవిహతే పూర్వః హృది చ ప్రతిబోధితే
మధ్యమో విహతేఽల్పే చ విహతే తూత్తమో మదః (చ. చి. 24/37)

ii) పూర్వేవీర్యరతిప్రీతి హర్షభాష్యాది వర్ధనమ్ (సు. ఉ. 47/11)

iii) బుద్ధిస్మృతిప్రీతికరస్సుఖశ్చ పానాఽన్న నిద్రారతివర్ధనశ్చ
సంపాఠ గీత స్వరవర్ధనశ్చ ప్రోక్తోఽతిరమ్యః ప్రథమోమదోహి
(మా. ని. 18/7)

iv) చ. చి. 24/42-43

యుక్తాయుక్త కర్మలు కలిపి చేయుచుండుట- అను లక్షణములతో కూడి యుండును. మాటలు, ప్రచలాయతనము, ఒకచోట నుండుట, పానములు, అన్నము భుజించుట, మాట్లాడుట- ఇవన్నియు కొంతసేపు యుక్తమైన పద్ధతి లోను, కొంతసేపు అయుక్తముగ చేయుచుండును. ఈ లక్షణములు మధ్యమ మద ప్రారంభావస్థలో కలుగును.

మధ్యమ మద తదుపరి అవస్థలో తృతీయ మదమునకు చేరని స్థితిలో రజోతమో గుణములచే గూడిన మనుజుడు ఎట్టి దుష్కర్మలనైనను చేయగల సమర్థుడుగా నుండును. భయానకమైన ఉన్మాదివలె ఎట్టి వినాశకరమైన దోష యుక్తమైన పనులనైనను అతడు చేయును.[1] మాధవకరుడు దీనిని తృతీయ మద మని వివరించి పొందతగని దానిని పొందుట కుద్యమించుట, తినగూడనివి తినుట, రహస్య విషయములు వెల్లడించుట- మొదలగు లక్షణములు పేర్కొనెను.[2]

### తృతీయ మద లక్షణములు :

ఓజస్సు అధికముగా నశించుటచే ఈ స్థితి కలుగును. ఈ స్థితిలో అజ్ఞాన ముచే ఆవరింపబడిన మనస్సు కలవాడై క్రియారహితుడై తెలివితప్పి క్రిందపడి యుండును. జీవమాత్రావశిష్ఠుడై మరణించిన వానివలె పడియుండును. రమణీయ

---

1. i) చ. చి. 24/44-47
ii) ప్రలాపో మధ్యమే మోహోయుక్తాయుక్త క్రియాస్తథా (సు. ఉ. 47/12)
iii) అవ్యక్తబుద్ధిస్మృతివాగ్విచేష్టః సోన్మత్తలీలాకృతిరప్రశాన్తః
అలస్య నిద్రాభిహతో ముహుశ్చ మధ్యేన మత్తః పురుషో మదేన
(మా. ని. 18/8)

2. గచ్ఛేదగమ్యాన్ న గురూంశ్చమన్యేత్ ఖాదేదభక్ష్యాణి చ నష్టసంజ్ఞః
బ్రూయాచ్చ గుహ్యాని హృదిస్థితాని మదే తృతీయే పురుషోఽస్వతంత్రః
(మా. ని. 18/9)

మైన విషయములను గాని, తనవారిని గాని, గుర్తింపలేడు. దేనికొరకై మద్యము సేవించెనో ఆ ప్రీతిని కూడ పొందలేడు. ఈ స్థితిలో కార్యా కార్యములను సుఖ దుఃఖములను హితాహితములను తెలిసికొనలేక నిందాపాత్రుడుగా నుండి మిక్కిలి క్రూరమైన మదాత్యయ వ్యాధిని పొందును.[1] మాధవకరుడు దీనిని చతుర్థమదమని వివరించెను.[2]

## పానాత్యయాది రోగములు

**నిదానము :-**

భోజనము భుజించకుండ ఎల్లప్పుడు అధికముగా మద్యమును పానము చేసినచో మిగుల కష్టతరములైన వ్యాధులు అట్టి మనుజునికి కలిగి శరీరమును నశింపచేయును.

మనుజుడు క్రోధముగా వున్నను, భీతి చెందివున్నపుడును, పిపాస కలిగి వున్నపుడు, దుఃఖముచే తాపము చెంది వున్నపుడు, ఆకలి కలిగి వున్నపుడు దేహ పరిశ్రమచేత, మార్గాయాసము చేత, భారమును మోయుటచేత, కృశించి యుండుటవలన, మలమూత్రాది వేగములను అడ్డగించుటవలన అభిఘాతము చెందినవాడు, అధికముగా ఉదకమును పానము చేయుట వలన ఉదరము నిండి వున్నవాడు, భుజించిన ఆహారము జీర్ణము కాక మునుపే మరల భుజించువాడు,

---

1. i) విసంజ్ఞః పశ్చిమే శేతే నష్టకర్మక్రియాగుణః (సు. ఉ. 47/12)
   ii) చ. చి. 24/48-51

2. చతుర్థేతు మదే మూఢో భగ్నదార్వివ నిష్క్రియః
   కార్యాకార్యవిభాగాజ్ఞో మృతాదప్యపరో మృతః
   కోమదం తాదృశం గచ్ఛేదున్మాదమివ చాపరమ్
   బహుదోషమివామూఢః కాన్తారం స్వవశంకృతే (మా. ని. 18/10-11)

దుర్బలుడు, ఉష్ణముచే తపింపబడినవాడు ఇట్టి వారు మద్యమును పానము చేసినచో పానాత్యయాది వికారములు అనేకమైనవి జనించును.[1]

**భేదములు :-**

పానాత్యయము, పరమదము, పాన అజీర్ణము, పాన విభ్రమము అనునవి మద్యపానము వలన కలుగు నాలుగు విధములైన వ్యాధులు.[2]

చరకుడు, వాగ్భటుడు ఈ విధమైన నాలుగు భేదములు వర్ణింపక మదాత్యయమును మాత్రమే వర్ణించి నాలుగు బేధములను కూడా వివరించిరి. సుశ్రుతునిచే వర్ణింపబడిన పానాత్యయము మదాత్యయమునకు తుల్యముగా భావింపవచ్చును.

## పానాత్యయము లేక మదాత్యయము

**సామాన్య లక్షణములు :-**

శరీమునందు దుఃఖము, సమ్మోహము, హృదయమునందు బాధ, అరుచి, తీవ్రమైన తృష్ణ, శీతజ్వరము, శిరస్సునకు ఇరుప్రక్కలయందలి అస్థులందు విద్యుత్తును పోలినట్లుగా క్షణకాలము వేదన కలుగును. అధికముగా ఆవలింతలు, శరీరము మాటి మాటికి అదురుట, అవయవములందు కంపము కలుగుట, శ్రమ,

---

1. విర్భక్తమేకాంతతఏవమద్యం నిషేవ్యమాణం మనుజేన నిత్యమ్
ఉత్పాదయేత్కష్టతమాన్ వికారానాపాదయేచ్చాపి శరీర భేదమ్
క్రుద్ధేన భీతేన పిపాసితేన శోకాభితప్తేన బుభుక్షితేన
వ్యాయామభారాధ్వపరిక్షతేన వేగావరోధాభిహతేన చాపి
అత్యమ్లభక్ష్యావతతోదరేణ సాజీర్ణభుక్తేన తథాఽబలేన
ఉష్ణాభితప్తేన చ సేవ్యమానం కరోతి మద్యం వివిధాన్ వికారాన్
(సు.ఉ. 47/15-16)

2. పానాత్యయం పరమదం పానాజీర్ణమథాపి వా
పానవిభ్రమముగ్రం చ తేషాం వక్ష్యామి లక్షణమ్ (సు.ఉ. 47/17)

ఉరః ప్రదేశమందు బంధించినట్లుండుట, కాసము, హిక్కా, శ్వాస, జాగరణము, కర్ణ, అక్షి, ముఖములందు ఆయా అవయవములకు సంబంధించిన వ్యాధులు కలుగుట, త్రికసంధియందు వేదన, ఈ లక్షణములు మదాత్యయాములు అన్నింటి యందు త్రిదోషములు ప్రకోపించుటచే సామాన్యముగా కలుగును.

మరియు మదాత్యయముచే పీడింపబడువానికి భ్రమ, ప్రలాపము, లేని రూపములను చూచినట్లు భ్రమించుట, భూమిపైనవుండు తృణములను, భస్మమును, లతలను, పర్ణములను, ధూళిని చేతులతో ఊడ్చి శరీరముపై జల్లుకొనుట చిత్తము భ్రమించి పక్షులచే బెదిరింపబడినట్లు భావించి వ్యాకులత చెందుట, అపశస్తము లైన స్వప్నములను చూచుట ఇవి కూడ మదాత్యయమున కలుగు లక్షణములు.[1]

మద్యము విషమునకు సమమైన గుణము కలిగి ఉండుటచే త్రిదోషములను ప్రకోపింపచేయును. అయినను త్రిదోషములలో ఏదోష లక్షణములు అధికముగా ఉన్న ఆ దోషముచే జనించిన మదాత్యయముగా వ్యవహరింపబడును.

---

1. శరీరదుఃఖం బలవత్ సమ్మోహో హృదయవ్యథా అరుచిః ప్రతతా తృష్ణా జ్వరశ్శీతోష్ణలక్షణః శిరఃపార్శ్వాస్థిసన్ధీనాం విద్యుత్తుల్యా చ వేదనా జాయతేఽతిబలా జృమ్భా స్ఫురణం వేపనం శ్రమః ఉరోవిబంధః కాసశ్చ హిక్కా శ్వాసః ప్రజాగరః శరీరకంపః కర్ణాక్షిముఖరోగః త్రికగ్రహః ఛర్ద్యతీసారహృల్లాసాః వాతపిత్తకఫాత్మకాః భ్రమః ప్రలాపో రూపాణాం అసతాం చైవ దర్శనమ్ తృణభస్మలతాపర్ణపాం సుభిశ్చావ పూరణం ప్రధర్షణం విహంగైశ్చ భ్రాన్తచితాస్స మన్యతే వ్యాకులానామశస్తానాం స్వప్నానాం దర్శనాని చ మదాత్యయస్య రూపాణి సర్వాణ్యేతాని లక్షయేత్ (చ.చి. 24/101-106)

**భేదములు :-**

మదాత్యయము నాలుగు విధములుగా ఉండును. అవి **1.** వాతిక మదాత్యయము 2. పైత్తిక మదాత్యయము 3. శ్లైష్మిక మదాత్యయము 4. సన్నిపాతిక మదాత్యయము.

## మదాత్యయ (పానాత్యయ) విశేష లక్షణములు

### వాతిక మదాత్యయము

**నిదానము :-**

స్త్రీ సంభోగము అధికముగా చేయుట, శోకము, భయము, అధికభారమును మోయుట, నడుచుట, అధికముగా పనులు చేయుట, మొదలగు కారణములచే అధికముగా కృశించినవాడు, రూక్షాహారమునుగాని, అతి స్వల్పమాత్రలో భుజించినగాని, ఉపవాసమున్న వాడును, రూక్షగుణము కలిగి ప్రాతదైనను మద్యమును అధికముగా త్రాగి రాత్రి నిద్రపోకున్న అట్టి వానికి వాతము అధికముగా కల మదాత్యయము కలుగును.[1]

**లక్షణములు :-**

హిక్క, శ్వాసము, శిరఃకంపము, పార్శ్వశూల, అనిద్రత, అర్థములేని

---

1. స్త్రీశోకభయభారాధ్వకర్మభిః యోఽతికర్శితః
రూక్షాఽల్పప్రమితాశీ చ యః పిబత్యతిమాత్రయా
రూక్షం పరిణతం మద్యం నిశి నిద్రాం విహత్య చ
కరోతి తస్య తచ్ఛీఘ్రం వాతప్రాయం మదాత్యయమ్
(చ.చి. 24/89-90)

మాటలు మాట్లాడుట, ఈ లక్షణములు కలిగినది వాత ప్రకోపముచే కలిగిన మదాత్యయమని తెలియవలెను.[1]

## వాతజ పానాత్యయ లక్షణములు

వాతజ పానాత్యయమునందు శరీరము స్తంభించుట, అంగమర్దము, హృదయమందు తీవ్ర వేదన, శరీర కంపము, శిరోవేదన ఈ లక్షణములు కలుగును.[2]

## పిత్తజ మదాత్యయము

**నిదానము :-**

అమ్లత్వమును, ఉష్ణగుణమును, తీక్ష్ణగుణమును కలిగి వుండు ఆహార పదార్థములను సేవించినవాడు తీక్ష్ణగుణము, ఉష్ణవీర్యము, అమ్లరసము కలిగిన మద్యము త్రాగినను, అధికమైనకోపము కలిగి మద్యమును త్రాగినను, అగ్నిచేత, ఎండ చేత శరీరమున వేడి జనించియున్నపుడు మద్యమును అధికముగా సేవించినను, వానికి పిత్తము అధికముగా ప్రకోపించి మదాత్యయమును కలిగించును.[3]

---

1. హిక్కాశ్వాస శిరఃకంప పార్శ్వశూల ప్రజాగరైః
విద్యాద్బహుప్రలాపస్య వాతప్రాయం మదాత్యయమ్ (చ.చి. 24/91)

2. స్తంభాంగమర్ద హృదయగ్రహ తోద కంపాః
పానాత్యయేఽనిలకృతే శిరసోరుజశ్చ (సు ఉ. 47/18)

3. తీక్ష్ణోష్ణం మద్యమమ్లం చ యోఽతిమాత్రం నిషేవతే
అమ్లోష్ణతీక్ష్ణభోజీ చ క్రోధనోఽగ్న్యాతపప్రియః
తస్యోపజాయతే పిత్తాత్ విశేషేణ మదాత్యయః
స తు వాతోల్బణస్యాశు ప్రశమం యాతి హన్తి వా (చ.చి.24/92-93)

**లక్షణములు ::**

పిత్తజ మదాత్యయమునందు తృష్ణ, దాహము, జ్వరము, స్వేదము, మూర్ఛ, అతిసారము భ్రమ, మోహము, శరీరము హరిత వర్ణముగానుండుట, ఈ లక్షణములు కలగును.[1]

**పిత్తజ పానాత్యయ లక్షణములు :-**

పిత్తజ పానాత్యయమునందు స్వేదము, ప్రలాపము, ముఖశోష, దాహము, మూర్ఛముఖము, నేత్రములు పీతవర్ణములో ఉండుట ఈ లక్షణములు కలుగును.[2]

## శ్లైష్మిక మదాత్యయము

**నిదానము :**

మధుర రసము, స్నిగ్ధ గురుగుణములు కల ఆహారమును భుజించిన వాడు, శరీర వ్యాయామము చేయనివాడు, మధ్యాహ్నమున విశేషముగా నిద్రించువాడు, శయనించుటయందు, ఏ పని లేక కూర్చొని వుండుటయందు, సుఖము మరిగిన వాడు-క్రొత్తది, తీపి అధికముగా కలది అయిన మద్యమును గాని, బెల్లముచేత పిష్టముచేత చేయబడిన మద్యమునుగాని అధికముగా త్రాగినచో వానికి కఫ జనితమైన మదాత్యయము త్వరితముగా సంభవించును.[3]

---

1. తృష్ణాదాహజ్వరస్వేదమూర్చాఽతీసారవిభ్రమైః
   విద్యాద్ధరితవర్ణస్య పిత్తప్రాయం మదాత్యయమ్ (చ.చి.24/94)
2. స్వేదప్రలాపముఖశోషణదాహమూర్చాః పిత్తాత్మకే వదనలోచనపీతతా చ (సు.ఉ. 46/18)
3. తరుణం మధురప్రాయం గౌడం పైష్టికమేవ వా
   మధురస్నిగ్ధగుర్వాశీ యః పిబత్యతిమాత్రయా
   అవ్యాయామ దివాస్వప్న శయ్యాసనసుఖేరతః
   మదాత్యయం కఫప్రాయం స శీఘ్రమధిగచ్ఛతి (చ.చి. 24/95-96)

**లక్షణములు :**

కఫజనిత మదాత్యయమందు ఛర్ది, అరుచి, హృల్లాసము, తంద్ర, శరీర గురుత్వము, శరీరమును నీటితో తడిపినట్లుండుట, శరీరము చల్లబడి వుండుట-ఈ లక్షణములు కలుగును.[1]

## శ్లైష్మిక పానాత్యయ లక్షణములు

శ్లేష్మ జనిత పానాత్యయమునందు ఛర్ది, శీతలత్వము, నోటియందు కఫము వచ్చుట ఈ లక్షణములు కలుగును.[2]

## సన్నిపాతజ మదాత్యయము

పైన చెప్పిన త్రిదోష లక్షణములతో కూడినది సన్నిపాతముచే జనించిన మదాత్యయమని తెలియవలెను.[3]

చరక మతానుసారము సామాన్య లక్షణములుగా చెప్పబడినవియును సన్నిపాతజ మదాత్యయ లక్షణములు.

**పరమద లక్షణము :**

నాసాది స్రోతస్సులందు శ్లేష్మము అధికముగా స్రవించుట, శరీర గురుత్వము, నోరు రసహీనమై వుండుట, కఫమధికము అగుట, మలమూత్రాది వేగము

---

1. ఛర్ద్యరోచకహృల్లాసతంద్రాస్తైమిత్యగౌరవైః
విద్యాచ్ఛీతపరీతస్య కఫప్రాయం మదాత్యయమ్ (చ.చి. 4/97)
2. శ్లేష్మాత్మకే వమథు శీతకఫ ప్రసేకాః
సర్వాత్మకే భవతి సర్వవికార సంపత్ (సు.ఉ. 47/18)
3. జ్ఞేయస్త్రిదోషశ్చాపి సర్వలింగైర్మదాత్యయః (మా. ని. 18/18)

లను బంధించుట, పిపాసా, శిరోవేదన, శరీర సంధులయందు వేదన ఈ లక్ష ణములు పరమదమందు కలుగును.[1]

## పానాజీర్ణ లక్షణములు :

పానాజీర్ణమునందు ఆధ్మానము, ఉద్గారములు వచ్చుట, సంతాపము కలుగుట అరుచి, హృదయమందు మంట, ఈ లక్షణములు పాకము చేసిన మద్యము జీర్ణము కానిచో కలుగును. ఈ పానాజీర్ణమునకు పిత్త ప్రకోప కారణములే హేతువులు అని నిశ్చయింపబడినది.[2]

## పానవిభ్రమ లక్షణములు :

పానవిభ్రమునందు హృదయములోన, శరీర అవయవములలోన తోద, వమథు, జ్వరము, కంఠమునుండి ధూమము వెడలుచున్నట్లుండుట, మూర్ఛ, నోటినుండి కఫము వచ్చుట, శిరోవేదన, ఉదరమందు వేదన, సుర, మద్యము అన్నము మొదలగు వానియందు అసహ్యము ఇట్టి లక్షణములు అన్నియు కలుగునని చెప్పబడినది.[3]

---

1. శ్లేష్మప్రచ్ఛయోఽంగగురుతా విరసాస్యతా చ విణ్మూత్రసక్తిరథతంద్రిరరోచకశ్చ
లింగం పరస్య చ మదస్య వదన్తి తద్జ్ఞాః
తృష్ణా రుజా శిరసి సన్ధిషు చాపి భేదః (సు.ఉ. 47/19)
2. ఆధ్మానముద్గిరణమప్లరసో విదాహో
అజీర్ణస్య పానజనితస్య వదంతి లింగమ్
జ్ఞేయాని తత్ర భిషజా సువినిశ్చితాని
పిత్తప్రకోప జనితాని చ కారణాని (సు.ఉ. 47/20-21)
3. హృద్గాత్రతోద వమథు జ్వర కంఠధూమ మూర్ఛాకఫస్రవణమూర్ధరుజో
విదాహః ద్వేషః సురాన్నవికృతేషు చ తేషు తేషు తం పానవిభ్రమము
కంత్యఖిలేనధీరాః (సు.ఉ.47/21-22)

## మద్యాత్యయాదులందు అసాధ్య లక్షణములు

పై పెదవి వ్రేలాడుచుండుట, శరీర బహిర్భాగమున అధిక శీతము, అంతరమునందు మిక్కిలి సంతాపము, నోటియందు నూనె పూసినట్లు నిగనిగ లాడుట, జిహ్వ, ఓష్ఠములు, దంతములు ఇవి నల్లగా గాని నీలవర్ణముగా గాని వుండుట, నేత్రములు పీత వర్ణములో పుండుట, ఈ లక్షణములు మద్యపానము చేసిన వానికి కలిగినచో ఆ మనుజుడు బ్రతుకుట దుర్లభము. కాపున చికిత్స చేయుట సాధ్యముకాదు. ఇట్టి లక్షణములు కలిగిన మదాత్యయము కష్టసాధ్యము. మరియు హిక్క, జ్వరము, ఛర్ది, కంపము, పార్శ్వశూల, కాస, భ్రమ, ఇవన్నియు మదాత్యయ ఉపద్రవములని భావము. ఈ ఉపద్రవములతో కూడిన మదాత్యయము కృచ్ఛ్రసాధ్యమని భావము.[1]

## పానాత్యయ (మదాత్యయ) చికిత్స

మదాత్యయములన్నియు త్రిదోషములుగా నున్నప్పటికిని చికిత్స చేయు నపుడు అధికముగానున్న దోషమునకు చికిత్స చేయవలెను. లేక కఫస్థానాను పూర్వముగా చికిత్స చేయవలెను. మదాత్యయమునందు ప్రాయికముగా పిత్తము వాతము తదనంతరము ప్రకోపమును పొందును. అందుచే ప్రారంభమున కఫము నకును తదుపరి పిత్తమునకును అంతమున వాతమునకును చికిత్స చేయవలెను.[2]

---

1. హీనోత్తరౌష్ఠమతిమశీతమందదాహం
తైలప్రభాస్య మతిపానహతం విజహ్యాత్
జిహౌష్ఠదంతమసితం త్వథవాఽపి నీలం
పీతే చ యస్య నయనే రుధిరప్రభే చ
హిక్కాజ్వరౌ వమథు వేపథు పార్శ్వశూలాః
కాస విభ్రమావపి చ పానహతం భజంతే (సు.ఉ. 47/22-23)

2. సర్వం మదాత్యయం విద్యాత్ త్రిదోషమధికం తు యం దోషం మదాత్యయే
పశ్యేత్ తస్యాదౌ ప్రతికారయేత్ కఫస్థానానుపూర్వ్యా చ క్రియా కార్యా
మదాత్యయేపిత్తమారుతపర్యన్తః ప్రాయేణ హి మదాత్యయః
(చ.చి. 24/107-108)

మద్యప్రయోగము :-

మద్యమును అనుచితముగా అనగా అధిక మాత్రలోగాని హీన మాత్రలో గాని విరుద్ధముగా గాని పానము చేయుటవలన ఉత్పన్నమైన మదాత్యయాది వ్యాధు లందు మద్యమును విధిననుసరించి సంస్కరించి ప్రయోగించిన హితకరముగా నుండును.[1]

మద్యము వలన ఉత్క్లిష్టమైన దోషములచే స్రోతస్సులందు అడ్డగింపబడిన వాతము శిర, అస్థి, సంధులందు తీవ్రవేదనను కలిగించును. అట్టిస్థితిలో దోషము లను విష్యందనము చేయుటకై అమ్ల ద్రవ్యములతో కూడి యున్నప్పటికిని వ్యవాయి, తీక్ష్ణ, ఉష్ణ గుణములు కలిగియున్న మద్యమే ప్రశస్తమైనదిగా నుండును.[2]

దుగ్ధప్రయోగము :-

మద్యపానము చేతను ఇతర ఆహార విహారాది క్రియలచేతను మదాత్య యము శమించనిచో మద్యమును విసర్జించి దుగ్ధమును ప్రయోగింపవలెను.

మద్యమును త్యజించి లంఘనము, పాచనము, దోషశోధనము మరియు శమన చికిత్సలచే కఫము క్షీణించి దౌర్బల్యము శరీర లఘుత్వము కలిగియున్న మనుజునికి మద్యముచే విదగ్ధత పొంది వాతపిత్త ప్రధాన లక్షణములతో కూడి యున్నపుడు దుగ్ధము అత్యంత హితకరముగా నుండును. గ్రీష్మకాలపు సూర్య కిరణములచే సంతప్తము చెందిన వృక్షములకు వర్షము ఎంత హితమును

---

1. మిథ్యాతిహీనపీతేన యో వ్యాధిరుపజాయతే
సమపీతేన తేనైవ స మద్యేనోపశామ్యతి (చ.చి. 24/109)

2. చ. చి. 24/117-118

చేకూర్చునో దుగ్ధము మదాత్యయ రోగికి ఈ స్థితిలో అంతటి హితమును కలిగించును.[1]

## హర్షణ క్రియలు :

మద్యసేవనచే మనస్సున క్షోభ జనించి శరీరము ఉపఘాతము చెందుటచే మదాత్యయము ఉత్పన్నమగును. అందుచే హర్షణ క్రియలచే ఉపచరించిన మనస్సు శరీరము స్వస్థత చెందుటకు హితకరముగా నుండును.[2]

ఈ క్రింది హర్షణక్రియలు మదాత్యయమును శమింప చేయును- సుందరమైన ఉపవనములు కమలములచే శోభించు జలాశయములు, స్వచ్ఛమైన సుందరమైన అన్నపానములు సంతోషమును కలిగించు మిత్రులు, సుగంధముతోగూడిన పుష్పమాలలు, స్వచ్ఛమైన సుందరమైన వస్త్రధారణము, మధురమైన గానశ్రవణము, హృదయానుకూలురైన మిత్రుల కూటమి, హాస్య సంభాషణలు, గీత వాయిద్యములు మొదలగు వాని యోజన, ఇష్టురైనటువంటి వారును ఆజ్ఞానుసారము ప్రవర్తించువారును అగు స్త్రీల యొక్క పరిచర్యలు- వీటిసేవన మదాత్యయ శామకముగా నుండును.[3]

---

1. ఆభిః క్రియాభిస్సిద్ధాభిః శమం యాతి మదాత్యయః న చేత్ మద్యవిధిం ముక్త్వా క్షీరమస్య ప్రయోజయేత్ లంఘనైః పాచనైః దోషశోధనైః శమనైరపి విమద్యస్య కఫేక్షీణే జాతేదౌర్బల్యలాఘవే తస్య మద్యవిదగ్ధస్య వాతపిత్తాధికస్య చ గ్రీష్మోపతప్తస్య తరోః యథా వర్షం తథా పయః (చ.చి. 24/195-197)

2. నాఽక్షోభ్య హి మనో మద్యం శరీరమవిహత్య చ కుర్యాన్మదాత్యయం తస్మాత్ ఏష్టవ్యా హర్షణీ క్రియా (చ. చి. 24/194)

3. చ. చి. 24/191-193

యౌవ్వనవతులు ఇష్టులు ఐన స్త్రీ సేవనచే పంచేంద్రియములు తృప్తి నంది పానాత్యయము శాంతించును.

పంచేంద్రియములకు తృప్తిని కలిగించు పైన చెప్పబడిన క్రియలును అన్ని విధములగు మదాత్యయములను శమింప చేయును.[1]

దోషానుసార సంశోధన సంశమన క్రియలను లంఘనమును సామాన్య ముగా మదాత్యయములందు చేయింపవలెను. శ్రమించుట హిత కరముగా నుండును.[2]

## మదాత్యయములందు పథ్యములు

**ఆహారములు, పానములు :-**

ఒక సంవత్సరము గడచిన శాలిధాన్యము షష్టిక ధాన్యము, యవ, ముద్గ, మాష, గోధుమలు, బఠానీలు,

మామిడి మురబ్బ, రాగములు, షాడవములు. సౌవర్చలము మొదలగు ద్రవ్యములచే గాని, బీజపూర రసాదులచే గాని సంస్కరించబడిన మద్యము మాత్రానుసారము పానము చేయుట, ఘృతము, దుగ్ధము, శీతల జలపానము.

సితా (కలకండ), తండులీయకము, పొట్ల, మాదీఫలము, పరూషకము. ఖర్జూరపండ్లు, దాడిమఫలము, ఉసిరిక, నారికేళము, ద్రాక్ష మొదలగునవి.

కోడి, నెమలి, కుందేలు, లేడి, తిత్తిరిపక్షి, లావకము, వీని మాంస రసములు

పేశ వారము అనేక విధములగు రుచికరములగు చిత్రాన్నములు

---

1. సు. ఉ. 47/43-44

2. సంశోధనం సంశమనం స్వపనంలంఘనం శ్రమః (భై.ర. 22/34)

## విహారాదులు

జలాశయ తీర విహారము, శీతల వాయువు సేవన, ధారా గృహమున నివాసము, శయనము, చంద్రకిరణముల సేవన

శీతల జల స్నానము, చందన కర్పూరాది లేపములు ముక్తామణి హారాదుల ధారణ సూక్ష్మవస్త్రధారణము ప్రియా లింగనములు మొదలగునవన్నియు పానాత్యయాది వికారము లందు హితకరముగా నుండును.[1]

## అపథ్యములు

స్వేదనము, అంజనము, ధూమపానము, నస్యము, దంతఘర్షణము తాంబూలసేవన. వీనిని మదాత్యయాది వ్యాధులందు వర్జింపవలెను.

మదాత్యయములందు శామక యోగములు.

1. త్వగా దిపానీయము
2. త్వక్క్షీరాదిపానకము
3. మధుకాదికల్కపానము
4. కార్పాసమూల, నాగబలామూల, సౌవర్చలమూల వీని కల్కము.

ఈ నాలుగు పానములును అన్ని మదాత్యయము లందు సేవింప చేసిన ప్రశస్తముగా నుండును.[2]

---

1. (i) చ.చి. 24
 (ii) యోగ రత్నావళి
 (iii) భై.ర.
2. సు. ఉ. 47/31, 33, 34

5. ఖర్జూరాది మంథము పానము చేయించిన మద్యపాన జనిత వికారము లన్నియు శమించును.

6. ద్రాక్షాది పానకము సేవింప చేసిన మద్యపాన జనిత భ్రమ శమించును.[1]

7. మదాత్యయము నందు దోషములు పచింపబడుటకు ఈ క్రింది వానిలో ఏదేని ఒక కషాయము త్రాగింపవలెను.

(అ) దుఃస్పర్శ ముస్తా కాథ్వము

(ఆ) ముస్త, పర్పాటక క్వాథము

(ఇ) ముస్తా క్వాథము[2]

8. మరిచాది చూర్ణమును మాంసరసముతో పానము చేయించిన అన్నివిధము లగు మదాత్యయములను శమించును.[3]

9. కూష్మాండస్వరసమున సితాది చూర్ణము కలిపి పానము చేయించినను అన్ని మదాత్యయము లందు ప్రశస్తముగా నుండును.[4]

10. వర్షాభ్వాది దుగ్ధపానము మదాత్యయమున సుఖమును కలిగించును.[5]

11. చవ్యాది చూర్ణము 500 మి.గ్రా మద్యముతో సేవింప చేయవలెను.

12. ఫలత్రికాది చూర్ణము మాత్రానుసారము శీతల జలముచే సేవింప చేయవలెను.

---

1. చ.ద. 18/1, 15
2. యో.ర. మదాత్యయ చి. 41-45
3. సు. ఉ. 47/42
4. సు. ఉ. 47/45
5. సు. ఉ. 47/46

13. ఏలాది మోదకము 5-10 గ్రా దుగ్ధముతోగాని ముద్గయూషముతోగాని సేవింపచేయవలెను.[1]

14. హరీతకీ క్వాథము మరియు దుగ్ధము పానము చేసిన మదాత్యయము శమించును [2]

15. పునర్నవాది ఘృతము-మద్యపాన జనిత వికారములచే కల్గిన ఓజోధాతు క్షయమును శమింపచేసి పుష్టిని కలిగించును.[3]

16. శ్రీ ఖండాసవము-(భై.ర) 15 మి.లీ సమభాగము జలముతో కలిపి సేవింపచేసిన మదాత్యయము, పరమదము, పానాజీర్ణము, పాన విభ్రమము లను శమింపచేయును.

17. మహాకల్యాణవటి (భై.ర) స్వర్ణ భస్మ, అభ్రక భస్మ, కజ్జలి, లోహ భస్మ, ముక్తా భస్మ ముఖ్యద్రవ్యములు 200 మి.గ్రా తిలచూర్ణము మధుతో సేవించిన అన్ని విధములగు అహితకర అన్నపాన సేవన జనిత వ్యాధులు శమించును.

18. స్వర్ణమాక్షిక భస్మము 100 మి.గ్రా కటుక, పునర్నవ గుడూచి క్వాథ ముతో ఇవ్వవలయును.

19. రాజావర్తరసము (ర.చం) 100 మి.గ్రా-200 మి.గ్రా సితా, ఘృతము, మధుతో ఇచ్చిన అన్ని విధములగు మద్యపాన జనిత వికారములు శమించును. (ర.త.సా)

---

1. భై.ర.
2. పథ్యాక్వాథేన సంయుక్తం పయః పానం మదాత్యయే (హరీత చి.17)
3. చ.ద. 18/10

## వాతికపానా (మదా)త్యయ చికిత్స

వాతిక మదాత్యయము నందు బీజపూరకాది సంస్కృత మద్యమును పానము చేయింపవలెను.

చుక్రాది కల్కముతోగాని, హింగ్వాది చూర్ణముతో గాని లేక సౌవర్చల వ్యోష జలయుక్త మద్యమును గాని ఇవ్వవలయును.

ఆమ్రాతకాది ఫలములతో చేయబడిన షాడవ పానకములను తాగింపవలెను.

అనూప, భూశయ, ప్రసహవర్గ మాంసరసములను స్నిగ్ధ అమ్లద్రవ్యములచే సంస్కరించి వానితో శాల్యాన్నమును సేవింప చేయవలెను.

వాతహర ద్రవ్యయుక్త వేశవారములు, గోధుమ భక్ష్యములు, మాషపూవలికములు, మరిచ, ఆర్ద్రిక, ఆమలకీ. త్రిజాతకాదులతో వేర్వేరుగాగాని ధాన్య మరిచ ఆర్ద్రికములతో గాని బాగుగా లేపమునరె పక్వము చేసిన మాంసములను భుజింప చేయవలెను.

వారుణీ మండముగాని, అమ్ల దాడిమ స్వరసముగాని, పంచమూల శృత జలముగాని, ధాన్యనాగర జలముగాని దధి మందముగాని పానమునకై ఇవ్వవలెను.

ఉష్ణమును కలిగించు వస్త్రములు, లేపములు, శయనాసనాదులు, యువస్త్రీలాలింగనములు, అభ్యంగ ఉత్సాదనాదులు వాతిక మదాత్యయమున హితకరముగా నుండును.

---

1. i) చ. చి. 24/121-135
   ii) సు. ఉ. 47/24-25
   iii) మద్యం సౌవర్చలవ్యోషయుక్తం కించిజ్జలాన్వితమ్ జీర్ణమద్యాయదాతవ్యం వాతపానాత్యయాపహమ్
   (చ. ద. 18/4)

## పిత్తజ మదా (పానా) త్యయ చికిత్స

పిత్తజ మదాత్యయము నందు ముద్గ యూషమును కలకండతోగాని లేక మధురవర్గసిద్ధ మాంసరసములను గాని సేవింపచేయవలెను. అన్ని విధములగు శీతల క్రియలచే ఉపచరించుట హితకరముగా నుండును.[1]

మధురవర్గ కషాయముతో సంస్కరించిన మద్యమును గాని, భవ్యాదిసిద్ధ మద్యమునుగాని సేవింప చేయవలెను.

లావుక, ఏణ, తిత్తిరపక్షి, శశ, కపింజలాదుల మాంసరసములు, శాలిషష్టిక ధాన్యములు, పటోల, ముద్గయూషములు, దాడిమ, ఆమలకీ, ద్రాక్ష, శీతలమైనవి, శీతల గుణముకలవి అగు అన్నపానములు సేవింప చేయవలెను. ఘృతము, చక్కెరలతో ఆహారములను ఇవ్వవలెను.

దోషము అధికముగానుండి దాహము, తృష్ణతో కూడియున్నచో అమాశయము నందు కఫము పిత్తము ఉత్క్లేశము చెందియున్నవని గ్రహించి మద్యములో చెరకురసము కలిపి కంఠ పర్యంతము త్రాగించి క్షణకాలముండి వమనము చేయింపవలెను.

మద్యములో ద్రాక్షరసము జలము కలిపి యిచ్చిగాని లేక తర్పణమున యవసక్తు కలిపి త్రాగించిగాని శీఘ్రముగా పూర్తిగా వమనము చేయించిన ఉత్క్లేశము చెందిన కఫ పిత్తములు బహిర్గతమై పిత్తజ మదాత్యయము శమించును.

శోధనానంతరము ఆహార కాలమున తర్పణమును ప్రయోగింపవలెను.

కాస, రక్తష్ఠీవనము ఉన్నచో గుడూచీ ముస్తా స్వరసమును గాని లేక

---

1. ముద్గయూషః సితాయుక్తః స్వాదురాప్తైః శితోరసః
పిత్తపానాత్యయే యోజ్యాః సర్వతశ్చ క్రియాహిమాః (చ. చ. 18/5)

...టోల పత్రరసమున శొంఠి చూర్ణమును కలిపిగాని పానము చేయించి జీర్ణానంత రము తిత్తిరి మాంసరసముతో శాలి లేక షష్టిక అన్నమును భుజింపచేయవలెను.[1]

అధికముగా వృద్ధిచెందిన వాతపిత్తములు ఉత్క్లిష్టములై తృష్ణ అధిక మైనచో దోషములు అనులోమనము చెందుటకు శీతల ద్రాక్షారసమును పానము ...యింపవలెను. జీర్ణానంతరము అమ్లరస సంస్కృత అజామాంస రసముతో ఆహా ...ము నివ్వవలెను. తదుపరి అధికజలము కలపిన మద్యము కొద్దికొద్దిగా యివ్వ ...యును.

తృష్ణా శమనము కొరకు ఈ క్రింది పానీయములలో వేనినైనను శీతల ముగా ప్రయోగింపవచ్చును. (అ) పరూషక లేక పీలు శీతలరసము (ఆ) శీతలీ కృత జలము (ఇ) పర్ణినీ చతుస్తృణ శిశిరజలము (ఈ) ముస్తా దాడిమ లాజ సిద్ధ శీతలజలము.

కోలాది ముఖ లేపనము తృష్ణను శమింప చేయును.

## శీతల క్రియలు :

పిత్తజ మదాత్యయమునందు శీతల శయ్యాసనములు, శీతల వాయుసేవన, శీతల వనసంచారము, శీతల చందనాది లేపములు, శీతలద్రవ్య స్పర్శ, శీతవీర్య ద్రవ్యప్రయోగము. జలయన్త్ర వాత యన్త్రాదులచే శీతలీకృతము చేయబడిన ధారా గృహావాసము, శీతలజల పరిషేక అవగాహాదులు, అమ్లద్రవ్య పరిషేకావగాహా దులు, నీనిచే దాహము శమించి పిత్తజ మదాత్యయమునందు హితకరముగా నుండును.

---

1. i) చ. చి. 24/136-145
ii) సు. ఉ. 47/26-27

ప్రియంగ్వాది లేపము, బదరీపల్లవాది లేపము, సురామండాది పరిషేక ప్రదేహములు దాహమును శమింప చేయును.[1]

ముక్తాపిష్టి, రసాదిచూర్ణము. రాజావర్త భస్మము, కూష్మాండవ లేహ్యము- మొదలగు ఔషధములను పిత్తజ మదాత్యయ జనిత తృష్ణ దాహములను శమింప చేయుటకై ఆవశ్యకత ననుసరించి ప్రయోగించవచ్చును.[2].

మాత్రా కాలానుసారము ఈ క్రియలచే పిత్తజ మదాత్యయమునందుపచరింపవలెను.

## కఫజ మదా (పానా) త్యయ చికిత్స

కఫజ మదాత్యయము నందు వమనమును, రోగి బలముననుసరించి లంఘనమును చేయింపవలెను.[3]

వమనమునకై చించి, అమ్ల వేతసరసము ఉదకము కలిపిన మద్యమును పానము చేయింపవలెను.

వమనానంతరము తిక్తకటు ద్రవ్యములతో కూడిన యూషములను ఆహారముగా ఇవ్వవలెను. యవ, గోధుమలచే తయారు చేయబడిన రూక్షాహారము ఇవ్వవలెను. దాడిమ, పటోల, ధాత్రీ, కులత్థ, మూలకములు యూషములకై ప్రయో

---

1. చ. చి. 24/146-163
2. ర. తం. సా.
3. ఉల్లేఖనోపవాసాభ్యాం జయేత్కఫమదాత్యయమ్ (చ. చి. 24/164)
   ii) పానాత్యయే కఫోద్భూతే లంఘనం చ యథాబలమ్
   దీపనీయౌషధోపేతం పిబేన్మద్యం సమాహితః (చ. ద. 18/6)

గింపవలెను. జాంగల మాంసములు, ఛాగ మాంసము వీనిని మరిచము, త్రికటుక ముఖ, అజమోదము, ఆర్ద్రకము మాతులుంగ రసము మొదలగువానితో సంస్కరించియు భర్జితము చేసియు సేవింప చేయవలెను. రూక్ష ఉష్ణ కఫహర అన్న పానములను సేవింప చేయవలెను.

రోగికి తృష్ణ కలిగినపుడు ఈ క్రింది వానిలో తగిన ఏదేని పానీయమును యివ్వవలెను.

(అ) హ్రీబేర శృతశీతజలము (ఆ) బలాపృశ్నిపర్ణి శృత శీతజలము (ఇ) కంటకారీ శృత శీతజలము (ఈ) నాగరముతో పైవన్నియు కలిపి శృత శీతము చేసిన జలము.

నిరామావస్థలో భోజనేచ్ఛ కలిగినపుడు శర్కరాదులచే సంస్కరించిన రూక్షతర్పణము నివ్వవలెను.

మృద్వీకాది రాగము, కారవీరాగము, ఆమ్రామలకాది రాగములు సేవింప చేసిన ఆహారమునందు రుచిని అగ్నిదీప్తిని కలిగించును.[1]

విహారాదులు :

రూక్ష ఉష్ణస్నానములు, ఉత్సాదములు ప్రహర్షణములు, మందమైన వస్త్ర ధారణ, ఉష్ణమైన శరీరముగల ప్రియస్త్రీలచే పరిచర్యలు, వ్యాయామము, లంఘనము, జాగరణము, శిక్షిత స్త్రీలచే సుఖకరమైన సంవాహనములు- ఇవి కఫజ మదాత్యయమును శమింప చేయును.

కఫజ మదాత్యయమున అష్టాంగ లవణము సేవింప చేయవలెను.[2]

---

1. i) చ. చి. 24/165-176, 180-184
   ii) సు. ఉ. 47/28-29
2. చ. చి. 24/177-179, 185-188

సన్నిపాతజ మదా (పానా) త్యయ చికిత్స.

ఆయా దోషముల ఆధిక్యతను బట్టి వానికి వేరు వేరుగా చెప్పబడిన చికిత్స లను కలిపిచేయవలసి యుండును. చరకుడు 10 విధములగు సన్నిపాతము లుండు నని పేర్కొనెను. జ్వరమునకు చెప్పబడిన 13 సన్నిపాతముల వలెనేనని గ్రహింప వలెను.[1]

## పర మద చికిత్స

ఈ క్రింది పానకాదులను ప్రయోగింపవలెను.

1. కాశ్మర్యాది పానకము

2. ద్రాక్షాది పానకము

3. జాంగల మాంసరసము నందు సౌవర్చలవణము ఫలామ్ల రసము చేర్చి పానము చేయింపవలెను.

4. భారంగీ శృతజలముచే సేకము చేయించిన హితకరముగా నుండును.[2]

## పానా జీర్ణ చికిత్స

ఇక్ష్వాకు, ధామార్గవ, కుటజ, కాకోదుంబర దుగ్ధ పాకముచేసి అంజలి ప్రమాణము త్రాగించి వమనము చేయింపవలెను.

తదుపరి ఒక పగలు ఉండి రాత్రికి బలమును కలిగించు మద్యమును మాత్రానుసారము పానము చేయింపవలెను.

---

1. i) చ. చి. 24/189
 ii) సు. ఉ. 47/29
2. సు. ఉ. 47/34-36

త్వగాది చూర్ణమును ఫలామ్ల రసముతో పానము చేయించవలెను. సైంధవాది కల్కమును వేడినీటితో పానము చేయింపవలెను.[1]

హృద్యములైన ఖడములతోను యూష విశేషములతోను భోజనము చేయింపవలెను.

## పాన విభ్రమ చికిత్స

ఈ క్రింది పానకాదులను అవస్థానుసారము సేవింపచేసినచో పాన విభ్రమము శమించును.

1. ద్రాక్షాది పానకము
2. ఖర్జూరాది పానకము
3. ఆమ్రాతకాది పానకము
4. క్షీర ప్రవాళాది పానకము[2]

## ధ్వంసకము_విక్షయము

మద్యపానమును త్యజించిన తరువాత మరల వెంటనే మద్యమును అధికముగా పానముచేసినచో ధ్వంసకము, విక్షయము అను వ్యాధులు ఉత్పన్నమగును.

ఈ రెండు వ్యాధులను మదాత్యయముచే శరీరము క్షీణించిన వానికి కలిగినచో మిక్కిలి అసాధ్యముగా నుండును.[3]

---

1. సు. ఉ. 47/37-38
2. సు. ఉ. 47/39
3. విచ్ఛిన్నమద్యస్సాహసా యోఽతిమద్యం నిషేవతే ధ్వంసకో విక్షయశ్చైవ రోగస్తస్యోపజాయతే వ్యాధ్యుపక్షీణదేహస్య దుశ్చికిత్స్యతమౌ హి తౌ
(చ.చి. 4/199-200)

## ధ్వంసక లక్షణములు

శ్లేష్మ ప్రసేకము. కంఠము, నోరు ఎండిపోవుట, ఏవిధమైన శబ్దమును విని సహింపలేకుండుట తంద్ర, అతినిద్ర-ఈ లక్షణములు ధ్వంసక రోగము నందు కలుగును.

## విట్ క్షయ లక్షణములు

హృద్రోగము, కంఠరోగము, మూర్ఛ, ఛర్ది, అంగమర్దము, జ్వరము, తృష్ణ, కాస, శిరశ్శూల_ఈ లక్షణములు విట్ క్షయ రోగమునందు కలుగును.[1]

## ధ్వంసక—విట్ క్షయ చికిత్స

ఈ వ్యాధులు క్షీణులకు దుర్బలురకు కలుగును కాన వాతిక మదాత్యయము నకు చెప్పబడిన చికిత్సనే వీనియందు చేయవలెను.

వాతహరములగు వస్తులు, ఘృతములు దుగ్ధఘృతములు-వీనిని ప్రయో గించుటయు; వాతహరములగు ద్రవ్యములచే అభ్యంగములు, ఉద్వర్తనములు, ప్రయోగించుట, వాతహరములగు అన్నపానములు సేవించుట—ఈ క్రియలచే ధ్వంసక, విట్ క్షయములు శమించును.[2]

---

1. శ్లేష్మప్రసేకః కంఠాస్యశోషః శబ్దాఽసహిష్ణుతా
తంద్రా నిద్రాఽతియోగశ్చ జ్ఞేయం ధ్వంసలక్షణం (చ.చి. 24/201)

2. తయోఃకర్మ తదేవేష్టం వాతికే యన్మదాత్యయే
తౌ హి ప్రక్షీణదేహస్య జాయేతే దుర్బలస్య వై
వస్తయః సర్పిషః పానం ప్రయోగః క్షీరసర్పిషోః
అభ్యంగోద్వర్తనస్నానాన్యన్నపానం చ వాతనుత్
ధ్వంసకో విట్ క్షయశ్చైవ కర్మణానేన శామ్యతి (చ.చి. 24/203-205)

**అన్య ద్రవ్యజ మదము :**

పూగఫలసేవనచే కలుగు మదము వలన ఛర్ది, మూర్ఛ అతిసారము కలుగును. ఈ లక్షణములు శమింపచేయుటకై తృప్తి కలుగునంతవరకు శీతల జలము పానము చేయవలెను. వనకండముల ఆఘ్రాణము, లవణసేవన, శర్కరా కబలము, సున్నముసేవించుట, శంఖ చూర్ణమును వాసనచూచుట— ఈ క్రియలచే పూగీఫలజ మదము శమించును.

కోద్రవ సేవనచే కలుగు మదమున గుడముతో కూష్మాండరసము సేవింపవలెను.

ధత్తూరముచే కలుగు మదమున శర్కర కలిపిన దుగ్ధము పానము చేయవలెను.[1]



---

1. చ. చి. 18/18-20

# కుష్ఠ ప్రకరణము

## నిరుక్తి:-

సకాలమున చికిత్స చేయక ఉపేక్షించినచో శరీరమునకు కురూపత్వమును కలిగించునది కుష్ఠమని నిర్వచింపబడినది.[1]

(క్రియాదగణము యొక్క 'కుష' నిష్కర్షే (నిష్కర్షోబహిర్నిఃస్సరణం-బహిర్గతమగుట) ఈ ధాతువుచే కుష్ణాతి ఇతి కుష్ఠం- అను ఉత్పత్తిచే కుష్ఠశబ్దము ఏర్పడినది. అన్ని విధములగు త్వగ్రోగములకు ఇది సంకేతముగా నుండును.

కొందరు "కుత్సితం కరోతివపుః ఇతి కుష్ఠం" అను వచనానుసారము కుత్సితం అనగా కురూపము అగుటచే కురూపత్వము కలిగించు వ్యాధి అను నిర్వచనమిచ్చుచున్నారు.

## కుష్ఠ నిదానము

### ఆహార సంబంధకారణములు :-

ఒకదానికి మరియొకటి విరుద్ధములయిన క్షీరమత్స్యాదులతో కూడిన అన్న పానములను సేవించుట, ద్రవముతో కూడినవి స్నిగ్ధత్వమును, గురుత్వమును కలుగజేయునవియు అగు పదార్థములను సేవించుట, అజీర్ణ పదార్థములను భుజించుట, అధికముగా భుజించుట, క్రొత్తబియ్యపు అన్నమును, పెరుగు, మత్స్య

---

1. i) కుష్ఠముపశన్తి తత్ । కాలేనోపేక్షితం యస్మాత్ సర్వం
కుష్ణాతి తద్వపుః (అ.సం.ని.అ. 24)

ii) కుష్ణాతి కుత్సితం కరోతి (తోడర)

ములు మొదలగు పదార్థములను భుజించుట; లవణ, ఆమ్లరసములను అధికముగా భుజించుట, మినుములు, ముల్లంగి, పిష్టాన్నము, తిలలు (నువ్వులు), దుగ్ధము, గుడము ఈ వస్తువులను విశేషముగా సేవించుట. అన్నము జీర్ణముకాకమునుపే స్త్రీ సంభోగమును చేయుట, శీతోష్ణ ద్రవ్యములు,సంతర్పణ, అపతర్పణ ద్రవ్యములు అనియతముగా భుజించుట, ఇతర ద్రవ్యములను నియమములేక భుజించుట, చిలిచిమ అను మత్స్యములను పాలతో చేర్చి భుజించుట, హాయకము, యవకము, చీనకము, ఉద్దాలకము, కోరదూషము (కొర్రలు), అతసి, కుసుంభ, పరూషక, కోల-వీనిని అధికముగా భుజించుట.[1]

## విహారాది ఇతర కారణములు :-

వమనము, మలమూత్రాది వేగములు-వీనిని నిరోధించుట, అధికముగా భుజించిన పిదప దేహపరిశ్రమను, బాధాకరములయిన పనులనుచేయుట, ఎండవలన, శ్రమవలన, భయమువలన అధికముగా బడలికచెంది విశ్రమించకుండగనే శీఘ్రముగా మిక్కిలి శీతలమయిన జలమును పానముచేయుట, దివాస్వప్నము చేయుట, వమనము, విరేచనము, వస్తి, స్వేదనము, నస్యము అను ఈ పంచ కర్మలను శాస్త్రవిధిని అనుసరించకుండా విరుద్ధముగా చేయుట.[2]

---

1, విరోధీన్యన్నపానాని ద్రవస్నిగ్ధగురూణిచ భజతామాగతాం ఛర్దిం
వేగాంశ్చాన్యాన్ప్రతిఘ్నతామ్ అజీర్ణాధ్యశినాంచైవ పంచకర్మాపచారిణామ్
నవాన్నదధి మత్స్యాతిలవణామ్లనిషేవిణామ్ మాషమూలకపిష్టాన్న
తిలక్షీరగుడాశినామ్ (మా.ని. 49/1,3,4)

2 వ్యాయామయతిసన్తాపమతిభుక్త్వా నిషేవిణామ్ ఘర్మశ్రమభయార్తానాం
ద్రుతం శీతాంబుసేవినామ్ (మా.ని. 49/2)

**ఇతర కారణములు :-**

బ్రాహ్మణులను, గురువులను ధిక్కరించుట, పాపకర్మలు చేయుట.[1] సాధువులను నిందించుట, వధించుట, స్త్రీలను వధించుట, పూర్వజన్మమున చేయ బడిన పాప కర్మలు.

**అభ్యంతర కారణములు**

దోషదూష్యాదులు కుష్ఠమునకు అభ్యంతర కారణములు. ఆయా కారణము లచే ప్రకోపించిన వాతమును, పిత్తమును, శ్లేష్మమును ఈ త్రిదోషముచే వికృతి నొందించబడిన చర్మమును, మాంసమును, రక్తమును, లసీకను ఈ ఏడును కుష్ఠములు కలుగుటకు అభ్యంతర కారణములుగా వుండును.[2]

**కుష్ఠము యొక్క సంప్రాప్తి :-**

పై కారణములచే మూడు దోషములను ప్రకోపించి తిర్యగ్గామి సిరలను పొంది త్వక్, లసీక, రక్తము, మరియు మాంసము వీనివి దూషింపచేయును బాహ్యమార్గమును (త్వక్కును) పొంది అచ్చట విక్షేపమును పొంది ఎచ్చటెచ్చట చేరునో అచ్చటచ్చట మండలములను కలిగించును. ఇట్టి స్థితిలో చికిత్స చేయ నిచో ఇతర ధాతువులను గూడా దూషింపచేసి అభ్యంతర మార్గమును పొంది ధాతువులను దూషింపచేయును.

---

1. అజీర్ణాధ్యశినాం చైవ పంచకర్మాపచారిణామ్ (మా.ని. 49/3)
2. సప్త ద్రవ్యాణికుష్ఠానాం ప్రకృతిమాపన్నానభవన్తి తద్యథా-త్రయోదోషా వాతపిత్త శ్లేష్మాణః ప్రకోపాణ వికృతాః దూష్యాశ్చ శరీరధాత వస్త్వఙ్మాంసశోణితలసీకాశ్చ తుర్థాదోషోపఘాతవికృతాః ఇత్యేతత్సప్తానాంధాతుకమేవంగతమాజననం కుష్ఠానామతః ప్రభవాణ్యభి నిర్వర్త మానాని కేవలం శరీరముపతపన్తి (చ.ని. 5/3)

ప్రారంభమున చికిత్సింపనిచో ధాతువులను దూషింపచేసి శరీరమందంతటనూ వ్యాపించి స్వేదము, క్లేదము, కోథములతో కూడి దారుణమైన సూక్ష్మమైన క్రిములను ఉత్పన్నము చేయును. ఈ క్రిములు క్రమముగా రోమములను, చర్మమును, స్నాయువులను, ధమనులను, తరుణాస్థులను భక్షించును.

## పూర్వ రూపములు :-

స్వేదము జనింపకుండుట, లేక అధికముగా జనించుట, పరుషముగా ఉండుట లేదా అధికముగా నునుపును కలిగివుండుట, రంగు మారుట, కండూ నిస్తోదము, సుప్తత, పరిదాహము, పరిహర్షము, రోమహర్షము, ఖరత్వము, ఊష్మణము, గురుత్వము, శోథ, విసర్పము -ఇవి కలుగుట; శరీరమందలి ఛిద్రములు ఆయా మలములతో ఎల్లప్పుడును పూయబడినట్లు ఉండుట; పక్వము పొందినను, కాల్చబడినను, క్షతము కల్గించబడినను, కొట్టబడినను అధికమయిన వేదన కలుగుట; స్వల్పమైన వ్రణములు కూడ దుష్టిని పొందుట మరియు మానకుండుట ఇవి కుష్ఠములకు పూర్వరూపములుగా ఉండును.[2] వ్రణము మానునపుడు రూక్షత్వము పొందుట అల్పకారణముచే కోథము[3].

---

1. i) సు.ని. 5అ ii) అ.సం.ని.అ. 14

2. తేషామిమాని ఖలు పూర్వరూపాణి తద్యథా అస్వేదన మతిస్వేదనం పారుష్యమతిశ్లక్ష్ణతా వైవర్ణ్య కండూర్నిస్తోదః సుప్తతా పరిదాహః పరిహర్షో లోమహర్షో ఖరత్వమూష్మాయణం గౌరవం శ్వయథు ర్విసర్పాగమనమభిక్ష్ణం కాయచ్ఛిద్రేషూపదేహః పక్వదగ్ధదష్టక్షతోపస్ఖలి తేష్వతిమాత్రం వేదనాస్వల్పానామపిచ వ్రణానాం దుష్టిరసంరోహణం చేతి కుష్ఠపూర్వరూపాణి భవన్తి (చ.ని. 5/9)

సు.ని. 5 అ. ii) అ.సం. 14

## కుష్ఠముయొక్క భేదములు :-

కుష్ఠములు అన్నియు త్రిదోషజనితములే అయినప్పటికిని దోషముల యొక్క అంశాంశకల్పన,అనుబంధ అనుబంధ భావము, స్థాన విభాగము వేదన, వర్ణ. ఆకృతి, ప్రభావము, సాధ్యాఽసాధ్యతాదులచే చికిత్సలో విభేదము కలుగును.

కుష్ఠములు అపరిసంఖ్యేయములుగా నుండును. 7 విధములుగా మహాకుష్ఠములు, 11 విధములుగా క్షుద్రకుష్ఠములును వివరించబడినవి.

ఇట్లు మొత్తము కుష్ఠములు 18 విధములుగా పేర్కొనబడినప్పటికిని చరక సుశ్రుత వాగ్భటులలో కొంత మత భేదము గలదు. ఈ క్రింద వారి వర్గీకరణము తులనాత్మకముగా ఇవ్వబడినవి.

### కుష్ఠ వర్గీకరణము

### మహాకుష్ఠములు

| చరక | సుశ్రుత | వాగ్భట |
|---|---|---|
| 1. కపాల | కపాల | కపాల |
| 2. ఔదుమ్బర | ఉదుంబర | ఔదుమ్బర |
| 3. మణ్డల | అరుణ | మణ్డల |
| 4. ఋష్యజిహ్వ | ఋష్యజిహ్వ | ఋష్యజిహ్వ |
| 5. పుణ్డరీక | పుణ్డరీక | పుణ్డరీక |
| 6. సిధ్మ | దద్రు | దద్రు |
| 7. కాకణక | కాకణక | కాకణక |

1. చ.ని. 5 అ. ; చ.చి. 7 అ. సు.ని. 5 అ. అ.సం.ని. 14 అ.

## క్షుద్రకుష్ఠములు

| | | |
|---|---|---|
| 1. ఏకకుష్ఠము | ఏక | ఏక |
| 2. చర్మ | స్థూలారుష్క | చర్మ |
| 3. కిటిభ | కిటిభ | కిటిభ |
| 4. విపాదక | మహాకుష్ఠము | విపాదక |
| 5. అలసక | విసర్ప | అలసక |
| 6. దద్రు | పరిసర్ప | సిధ్మ |
| 7. చర్మదళ | చర్మదళ | చర్మదళ |
| 8. పామా | పామా | పామా |
| 9. విస్ఫోట | సిధ్మ | విస్ఫోట |
| 10. శతారు | రకసా | శతారు |
| 11. విచర్చిక | విచర్చిక | విచర్చిక |

## మహాకుష్ఠముల లక్షణములు

**కపాల కుష్ఠ లక్షణములు :**

రూక్షముగా, అరుణవర్ణముగా, పరుషముగా, విషమముగా వ్యాపించినవి, అంచులయందు ఖరత్వమును కలిగినవి, సూక్ష్మముగా వుండి పైన కల చర్మము ఉబ్బినట్లున్నవి, అధికముగా మొద్దుబారినవిగా, రోమహర్షము కలవిగా నుండి అధికమైన బాధలు కలవియు, కండూ, దాహము, పూయము, లసీక ఇవి స్వల్ప ముగా కలవి, శీఘ్రముగా వ్యాపించునవి, త్వరగా పగులునవి, క్రిములు కలవి, కుండ పెంకులవలె కృష్ణవర్ణము లేదా అరుణవర్ణము కలవిగా ఉండు కుష్ఠములు

కాపాల కుష్ఠములు అనబడును.[1] కృష్ణవర్ణముగా నుండి కపాల సదృశముగా నుండునవి కపాల కుష్ఠములనబడును.[2] ఇది వాత ప్రధానముగా నుండును.

**ఔదుంబర కుష్ఠము :**

తామ్రవర్ణము కలిగి, తామ్రవర్ణముతో ఖరత్వము కల రోమములతో కూడినవి, అధికముగను, మిక్కిలి అధికమైన రక్తము, పూయము, లసీక, కండూ, ఇవి కలవి; కండూ, క్లేదము, దాహము, క్రుళ్ళుట, పాకము ఇవి కలవి, శీఘ్రముగా జనించి, వ్యాపించి, పగులునవియును, తాపమును, క్రిములను కలిగియున్నవి, మేడిపండువంటి రంగు కలవిగా ఉండు కుష్ఠములు ఔదుంబర కుష్ఠములు అనబడును.[3] ఇది పిత్త ప్రధానముగా నుండును.

ఈ లక్షణములు త్రెపసీకి మూదకలుగు లక్షణములకు తుల్యముగా భావింపబడుచున్నవి.

**మండల కుష్ఠ లక్షణములు :**

దట్టముగా, బరువుగా, ఉత్సేధముగా, స్నిగ్ధముగా, స్థిరముగా శ్లక్ష్ణముగా, ఉబ్బుగా ఉండు అంచులతో, శ్వేతవర్ణము లేదా అరుణవర్ణము కలవిగ, అరుణవర్ణములో

---

1. రూక్షారుణపరుషాణి విషమవిసృతాని ఖరపర్యంతాని తనూద్వ్యద్వృత్తబహిస్తమాని సుప్తసుప్తాని హృషితలోమాచితాని నిస్తోదబహులాన్యల్ప కండూ దాహపూయలసీకాన్యాశుగతి సముత్థానాన్యాశుభేదీని జన్తుమన్తి కృష్ణారుణకపాలవర్ణాని చ కపాలకుష్ఠానీతి విద్యాత్ (చ. ని. 5/10)

2. సు. ని. 5 అ.

3. i) తామ్రాణి తామ్ర ఖరరోమరాజీభిరవనద్ధాని బహలాని బహుబల రక్తపూయలసీకాని కండూక్లేదోకోథదాహపాకవన్త్యాశుగతి సముత్థాన భేదీని వసంతాకృమీణి పక్వోదుమ్బరఫలవర్ణాన్యుదుమ్బరకుష్ఠానీతి విద్యాత్ (చ. ని. 5/11)

ii) సు. ని. 5 అ.

వుండు రోమములు కలవిగను, అధికమైన, శుక్లముగా, పిచ్ఛిలముగా వుండు స్రావము కలవి, క్లేదము, కండూ, క్రిములు ఇవి అధికముగా కలవి, మెల్లగా పుట్టి, వ్యాపించి, పగులునవి, గుండ్రముగా వ్యాపించుననిగా వుండు కుష్ఠములు మండల కుష్ఠములు అనబడును.[1] ఇది కఫ ప్రధానముగా నుండును. సుశ్రుతుడు మండల కుష్ఠమును వర్ణింపలేదు.

## ఋష్యజిహ్వాకుష్ఠము యొక్క లక్షణములు :

పరుషము, అరుణవర్ణము కలవి. బహిరన్తములందు శ్యామవర్ణము కలవి, నీలవర్ణము, పీతవర్ణము, తామ్రవర్ణము కలిగినవి, శీఘ్రముగా జనించి వ్యాపించేవి, కండూ, క్లేదము, క్రిములు మొదలగునవి స్వల్ప ప్రమాణములో కలవి, దాహము, భేదము, నిస్తోదము, పాకము ఇవి అధికముగా కలవి, శూకముతో పొడిచినట్లు వేదన కలవి, మధ్యప్రదేశమున ఉబ్బినవి, సూక్ష్మమైన అంచులు కలవి, కఠినములైన పిటికలచే ఆవరింపబడినవి, దీర్ఘ పరిమాణములు కలవి, ఋష్యము (లేడి) యొక్క జిహ్వ ఆకారము కలవిగా ఉండు కుష్ఠములు ఋష్య జిహ్వ కుష్ఠములు అనబడును.[2]

---

1. i) స్నిగ్ధాని గురూణ్యుత్సేధవన్తి శ్లక్ష్ణ స్థిర పీనపర్యన్తాని శుక్ల రక్తావభాసాని శుక్లరోమరాజీసంతతాని బహు బహల శుక్ల పిచ్ఛిల స్రావీణి బహుక్లేదకండూకృమీణి సక్తగతి సముత్థానభేదీని పరిమండలాని మండలకుష్ఠానీతి విద్యాత్ (చ. ని. 5/12)
   ii) అ. సం. ని. 14.

2. i) పరుషాణ్యరుణవర్ణాని బహిరన్తఃశ్యావాని నీల పీత తామ్రవభాసాన్యాశుగతి సముత్థానాన్యల్పకండూక్లేదకృమీణి దాహభేదనిస్తోదకబహులాని శూకోపహతో పమవేదనాన్యుత్సన్నమధ్యాని తనుపర్యంతాని కర్కశపిడకాచితాని దీర్ఘ పరిమణ్డలాని ఋష్యజిహ్వాకృతీని ఋష్యజిహ్వానీతి విద్యాత్ (చ. ని. 5/7 (4))
   ii) అ. సం. ని. 14 అ.

క్రిములధికముగా నుండునని వాగ్భటుని అభిప్రాయము. ఇది వాతపిత్త ప్రధానముగా నుండును.

**పుండరీక కుష్ఠ లక్షణములు :**

శుక్లవర్ణము, రక్తవర్ణము కలవి, రక్తవర్ణపు అంచులు కలవి, ఎర్రని రేఖలు కలవి, ఉబ్బినవి, రక్తము, పూయము, లసీక, మొదలగునవి అధికముగా కలవి, కండూ, క్రిములు, దాహము, పాకము కలవి, శీఘ్రముగా జనించి వ్యాపించి పగులునవి, పద్మముయొక్క రేకులతో సమానముగా వుండు కుష్ఠములు పుండరీక కుష్ఠములు అనబడును.[1] ఇది కఫ పిత్త ప్రధానముగా నుండును.

**సిధ్మకుష్ఠ లక్షణములు :**

పరుషత్వము, అరుణవర్ణము విడిపోవుచున్నట్లు ఉండు బాహ్యచర్మము కలిగి ఉండుట, ఆభ్యంతరమునందు దట్టముగా ఉండుట, శ్వేత లేక రక్తవర్ణములు కలిగి, అనేకముగా నుండి వేదన, కండూ, దాహము, పూయము, లసీకా, ఇవి స్వల్పముగా కలవి, సూక్ష్మముగా వ్యాపించేవి, అల్పసంఖ్యలో క్రిములు కలవి, సొర (ఆనప) పూవులతో సమానముగా వుండు కుష్ఠములు సిధ్మకుష్ఠములు అనబడును.[2] ఈ సిధ్మకుష్ఠము వాతకఫాధికముగా ఉండునని చరకమతము. సుశ్రు

---

1. శుక్లరక్తావభాసాని రక్తపర్యన్తాని రక్తరాజీసంతతాన్యుత్సేదవన్తి బహూని బహలరక్తపూయలసీకాని కండూకృమిదాహపాకవన్త్యాశుగతి సముత్థానభేదీని పుండరీకపలాశసంకాశాని పుండరీకాణీతి విద్యాత్ (చ.చి. 5/7(5)
ii) సు. ని. 5 అ.
iii) అ. సం. ని. 14

2. పరుషాణ్యరుణ విశీర్ణబహిస్తమాన్యస్నిగ్ధాని శుక్లరక్తావభాసాని బహూన్యల్పవేదనాన్యల్ప కండూదాహపూయ లసీకాని లఘు సముత్థానాన్యల్ప భేదకృమీణ్యలాబూపుష్ప సంకాశాని సిధ్మకుష్ఠానీతి విద్యాత్ (చ. ని. 5/7 (6)

తుడు దీనిని క్షుద్ర కుష్ఠములలో వర్ణించెను. కఫ ప్రధానమనియు పాకరహితముగా నుండునని సాధారణముగా ఊర్ధ్వకాయమున జనించునని చెప్పెను.[1] ఈ లక్షణములు పిటీరియాసిస్ వెర్సి కలర్ (Pityriosis Versi colour) కు దగ్గరగా నున్నది.

**కాకణ కుష్ఠ లక్షణము :**

మొదట గురువిందగింజ వంటి రంగును కలిగి తరువాత అన్ని కుష్ఠముల యొక్క లక్షములు కలిగివుండుట వలన అనేక వర్ణములు కలవిగా ఉండు కుష్ఠములు కాకణ కుష్ఠము అనబడును. ఇవి మహా పాపాత్ములకే జనించును. ఇది అసాధ్యముగా ఉండును. తక్కిన కుష్ఠములన్నియు సాధ్యములుగా ఉండును.[2] ఇది త్రిదోష జనితము.

**అరుణకుష్ఠ లక్షణములు :**

వాతముచే అరుణవర్ణముగా, పలుచగా ప్రసరించునదిగను ఉండి. తోద, భేద, స్వాపము (స్పర్శారాహిత్యము)తో కూడినది అరుణకుష్ఠము అనబడును. ఇది సుశ్రుతునిచే వర్ణింపబడినది.[3]

---

1. సు. ని. 5 అ.

2. i) కాకణ న్తికావర్ణాన్యాదౌ పశ్చాత్సర్వకుష్ఠలింగసమన్వితాని
పాపీయసాం సర్వకుష్ఠలింగసంభవేనానేకవర్ణాని కాకణ
కానీతి విద్యాత్ తాన్యసాధ్యాని సాధ్యాని పునరితరాణి (చ. ని. 5/7 (7)

ii) సు. ని. 5/8

iii) అ. సం. ని. 14 అ.

3. తత్ర వాతేనారుణాభాని తనూని విసర్పాణి తోద భేద స్వాప
యుక్తాన్యరుణాని (సు. ని. 5/8)

## క్షుద్ర కుష్టముల లక్షణములు

### ఏక కుష్ఠ లక్షణములు

స్వేదము పట్టకపోవుట, విశాలమైన స్థలమును ఆక్రమించుట, మత్స్యము యొక్క శకలము వలె వుండుట ఈ లక్షణములు కలిగినది ఏక కుష్ఠము అన బడును.[1] ఇది వాతకఫజనితముగా నుండును. కృష్ణారుణముగా నుండునని సుశ్రుతమతము. ఈ వర్ణనము మెలానొడెర్మా (Melanoderma) కు దగ్గరగా ఉండును.

### చర్మ కుష్ఠ లక్షణములు

ఏనుగు యొక్క (గజ) చర్మము వలె మిక్కిలి కర్కశమై ఉండునది చర్మ కుష్ఠ మని చెప్పబడును [2] ఇదియును వాతకఫజముగా నుండును. ఇది జిరొడర్మా పిగ్మెంటోజా లక్షణములకు దగ్గరగా నుండును.

### కిటిభ కుష్ఠ లక్షణము

శ్యామ వర్ణమై, వ్రణము మానిన తరువాత ఏర్పడిన మచ్చవలె, కఠినముగా వుండి, పరుషమై ఉండునది కిటిభ కుష్ఠమని తెలియవలెను.[3] సుశ్రుతుని లక్షణ ములు వేరుగా నున్నవి. అవి కృష్ణవర్ణము గలిగి స్రావముతో గూడి వృత్తము గను ఘనముగను ఉగ్రకండూతో కూడి స్నిగ్ధముగా నుండును. డెర్మాటైటిస్ బేధముగా కనిపించుచున్నవి. చరక వర్ణన సోరియాసిస్‌కు తుల్యముగా నుండును. ఇది వాత కఫజము.

---

1. (i) అస్వేదనం మహావస్తు యన్మత్స్యశకలోపమం (చ.చి. 7/21)
   (ii) సు. ని. 5/10 (iii) అ. సం .ని. 6/4
2. తదేకకుష్ఠం చర్మాఖ్యం బహలం హస్తి చర్మవత్ (చ.ని. 7/21)
3. (i) శ్యావం కిణఖరస్పర్శం పరుషం కిటిభం స్మృతం (చ.చి. 7/22)
   (ii) సు.ని. 5/14 (iii) అ. సం. ని. 14 అ.

### వైపాదిక కుష్ఠ లక్షణము

హస్తము లందు పాదములందు చర్మము పగిలి మిక్కిలి తీవ్రమయిన వేదన కలిగియున్నచో వైపాదిక కుష్ఠమని చెప్పబడును.[1]

విపాదిక వాతకఫజము. చరకవర్ణన Rhagades [రాగెడ్సు) కు దగ్గరగా ఉండును. సుశ్రుతుడు కండు దాహము వేదనతో కూడిన రేఖలు పాదమునందు కలుగునని వర్ణించెను. ఈ లక్షణములు Tilosis (టైలోసిస్) కు దగ్గరగా ఉండును.

### అలసక కుష్ఠ లక్షణము

కండూతోను, ఎఱ్ఱగా ఉండు బొబ్బలతోను కూడి కనిపించునది అలసక కుష్ఠమని తెలియవలెను.[2] ఇదియును వాతకఫ ప్రధానముగా నుండును.

### దద్రు మండల కుష్ఠ లక్షణము

దురద కలిగి ఎఱ్ఱగా వుండు సన్నని పిడకములతో కూడి పైకి ఉబికినట్లు కనిపించునవి దద్రు మండల కుష్ఠమని తెలియవలెను.[3] ఇది Ring worm లేక తామరకు దగ్గరగా నుండును. ఇది పిత్త కఫ ప్రధానము. అతసీ పుష్పము వలె గాని తామ్రవర్ణములో గాని చిన్న పిట్టకలతో కూడి ప్రసరించునదని సుశ్రుత మతము. సుశ్రుతుడు వీనిని మహా కుష్ఠములలో చేర్చెను.

---

1. వైపాదికం పాణిపాదస్ఫుటనం తీవ్రవేదనమ్ (చ.చి. 7/22)
   (i) సు.ని. 5/13 ii) అ సం. ని. అ. 14
2. (i) కండూమద్భిస్సరాగైశ్చ గండైరలసకం చితమ్ (చ.చి. 7/23)
   (ii) అ. సం. ని. 14 అ.
3. (i) కండూరోగపిటకం దద్రుమండల ముద్గతమ్ (చ. చి. 7/23)
   (ii) సు.ని. 5/8

## చర్మదల కుష్ఠ లక్షణము

రక్తవర్ణమైన ఎర్రని మచ్చలు కలిగి వుండుట. నొప్పి, కండూ, కలిగి వుండుట, చేతితో స్పృశించిన ఎడల పగిలి నీరు కారు చుండుట, హస్తముచే తాకినచో భరింపలేకుండుట, హస్తపాద తలము అందు కండూ, వ్యథ, ఓష, చోష ఈ లక్షణములతో కూడి వున్నది. చర్మదళ కుష్ఠము అనబడును.[1] ఇది పిత్త కఫ జనితముగా నుండును. ఇది డిస్‌హిడిరొసిస్ (Dishidirosis) కు దగ్గరగా ఉండును.

## పామా కుష్ఠ లక్షణము

సూక్ష్మమైన ఆకారము గలిగి, శ్వేత, అరుణ, శ్యావ వర్ణములను కలిగి, కండూ, ఇవి కలపిటకములు కలిగినది పామ కుష్ఠము అని తెలియవలెను.[2] స్రావము దాహము కూడా ఉండునని సుశ్రుతుని మతము.

ఇది ఎక్యూట్ ఎగ్జిమా (Acute eczema) కు దగ్గరగా ఉండును.

ఇది పిత్త కఫజనితముగా నుండును. ఇదియే స్పిక్ పాణి పాదము అందు కలిగినచో కచ్ఛ అనబడును.

---

1. (i) రక్తం సశూలం కండూమత్ సస్ఫోట యద్దలత్యపి
తచ్చర్మదలమాఖ్యాతం సంస్పర్శాఽసహముచ్యతే (చ.చి. 7/24)
(ii) సు.ని. 5/10

2. (i) పామాః శ్వేతారుణాః శ్యావాః కండూలాః పిటకా భృశం (చ.చి.7/25)
(ii) సు.ని. 5/14.15

## విస్ఫోటక కుష్ఠ లక్షణము

శ్వేత వర్ణము, అరుణవర్ణము కలిగి అతి సూక్ష్మముగా ఉండు చర్మమున బొబ్బలు వ్యాపించిన ఎడల విస్ఫోటకుష్ఠము అనబడును.[1] తీవ్రమైన బాధ మంట కండు ఉండునని వాగ్భటుని అభిప్రాయము. ఇది పిత్తకఫజము.

## శతారు కుష్ఠ లక్షణము

రక్తవర్ణముగాని, శ్యామవర్ణముగాని కలిగి, అనేక వ్రణములు కలిగి ఉండునది శతారువు అను కుష్ఠమని తెలియవలెను.[2] ఇది పిత్తకఫజముగా నుండును.

## విచర్చికా కుష్ఠ లక్షణము

కండూతో కూడి శ్యామవర్ణము కలిగి అనేక ద్వారముల నుండి పూయాదులను స్రవించుట, రూక్షత్వంతో కూడిన రేఖలు కలుగుట ఈ లక్షణములు కలిగినచో విచ్చరికా కుష్ఠమని చెప్పబడును.[3] ఇది ముఖ్యముగా హస్తములకు కలుగునని అతి కండూ పీడాయుక్త రూక్ష రేఖలు కలుగునని సుశ్రుతాభిప్రాయము. సుశ్రుతుని వర్ణన ఇక్థియోసిస్ (Ichtyosis)కు దగ్గరగాను చరకునివర్ణన వీపింగ్ ఎగ్జిమా (Weeping eizema)కు దగ్గఱగా ఉండును. చరకుడు దీనిని కఫ ప్రధానముగా పేర్కొనెను.

---

1. (i) స్ఫోటాః శ్వేతారుణాభాసో విస్ఫోటాః స్యుః తనుత్వచః (చ.చి. 7/25)
(ii) అ.సం.ని. 14 అ

2. రక్తం శ్యావం సదాహార్తిశతారుః స్యాద్బహువ్రణం (చ.చి. 7/26)
(i) అ. సం. ని. 14 అ.

3. (i) సకండూః పిటకా శ్యావా బహుస్రావా విచర్చికా (చ. చి. 7/26)
(ii) సు.ని 5/13 (iii) అ. సం. ని. అ, 14

సుశ్రుతునిచే అధికముగా వర్ణింప బడిన క్షుద్రకుష్టముల లక్షణములు.

## స్థూలారుష్క లక్షణములు

కుష్టమునందు సంధిస్థానములందు స్థూలముగా కఠినముగా ఉండు వ్రణము లేర్పడును. ఇవి అతి దారుణముగను కృచ్ఛసాధ్యముగను ఉండును. ఇవి ఎటోపిక్ డెర్మాటైటిస్ నందు కలుగు ఎగ్జిమాటస్ పాచెస్‌కు తుల్యముగా నుండును.[1] ఇది కఫజము.

## మహాకుష్ట లక్షణములు

చర్మము ముడుచుకొని పోవుట, పగులుట, స్పర్శ లేక పోవుట శరీరము కృశించుట లేక గ్లాని ఈ లక్షణములతో కూడి యుండును. ఈ లక్షణము పాలీ న్యూరైటిస్ టైప్ లెప్రసీ (Polynueritis type of leprosy)కి దగ్గరగా ఉండును.[2] ఇది కఫజనితము

## విసర్ప కుష్టము

చర్మము, రక్తము, మాంసమును దూషింపచేసి విసర్పమువలె శీఘ్రముగా ప్రసరించునదియు మూర్ఛ, విదాహము, అరతి, తోద, పాకములతో కూడినది విసర్ప కుష్టమనబడును. ఇది Erysepalas (ఎరీసెపలస్) కు దగ్గరగా ఉండును. ఇది పిత్తజము.

---

1. స్థూలాని సన్ధిష్వతిదారుణాని స్థూలారుషుష్యః కఠినాన్యరూంషి (సు.ని. 5/9)
2. త్వక్సంకోచభేద స్వాపనాఙ్గసాదా కుష్టే మహత్పూర్వయుతే భవన్తి (సు.ని. 5/9)
3. విసర్పవత్ సర్పతి సర్వతో యస్త్వగ్రక్తమాంసాన్యభిభూయశీఘ్రమ్ మూర్ఛావిదాహారతితోదపాకాన్ కృత్వావిసర్పః స భవేద్వికారః (సు.చి. 5/11)

## పరిసర్ప కుష్ఠము

స్రావయుక్తమైన పిటకలు శరీరమున మెల్లమెల్లగా ప్రసరించిన పరిసర్ప కుష్ఠమనబడును. ఇదివాతజము.[1]

## రకసా కుష్ఠము

స్రావరహితమైన కండూయుక్త పిటకలు జనించిన వానిని రకసా అనబడును. ఇది కఫజము.[2]

# దోషానుసార కుష్ఠ లక్షణములు

### వాతముచే జనించిన కుష్ఠ లక్షణములు

శరీరమునందు రూక్షత్వము, శుష్కించుట, తోద, వేదన, త్వక్ ముడుచుకొనుట, లాగినట్లుండుట, కఠినత్వము చేత తాకినఎడల కర్కశముగా ఉండుట, రోమహర్షము, శ్యామ, అరుణవర్ణములు కలిగియుండుట, ఇవి అన్నీ కుష్ఠములయందు కలుగు వాతలక్షణములు.[3]

వాతప్రాధాన్యతచే కపాలకుష్ఠము కలుగును. సుశ్రుతుని అరుణకుష్ఠమును వాత ప్రధానముగా నుండును. పరిసర్ప కుష్ఠమునువాతజము.

---

1. శనైః శరీరే పిడకాః స్రవన్త్యః సర్పన్తి యాస్తం పరిసర్పమాహుః
(సు.చి. 5/12)
2. కణ్డ్వాన్వితా యా పిడకా శరీరే సంస్రావహీనా రకసోఽచ్యతే సా
(సు.ని. 5/15)
3. రౌక్ష్యం శోషస్తోదః శూలం సంకోచనం తథాయామః
పారుష్యం ఖరభావో హర్షశ్శ్యావారుణత్వం చ (చ.చి. 7/34)

## పిత్తముచే కలుగు కుష్ఠ లక్షణములు

దాహము, అరుణవర్ణము, పూయాది ద్రవములను స్రవించుట, పుండు అగుట, దుర్గంధ యుక్తముగా ఉండుట, చెమ్మ కలిగియుండుట, అవయవములు శిథిలము అగుట ఇవన్నియు కుష్ఠములందు పిత్తముచే కలుగు లక్షణములు[1] పిత్త ప్రాధాన్యతచే ఔదుంబర కుష్ఠము కలుగును. సుశ్రుతుడు ఔదుంబరము, ఋష్యజిహ్వము, కాపాల, కాకణక, చర్మదళ, విసర్ప, విచర్చిక, కిటభ, పామా, కచ్ఛు, ఇవన్నియు పిత్త ప్రధానములని వర్ణించెను.

## కఫముచే కలుగు లక్షణములు :

శ్వేతవర్ణము, చల్లదనము, కండూ, స్థిరత్వము, గురుత్వము, స్నిగ్ధత్వము, క్రిములు శరీర అవయవములను భక్షించుట, ఇవన్నియు కుష్ఠమందలి కఫ లక్షణములు.[2]

కఫాధిక్యతచే మండల కుష్ఠము, విచర్చిక కలుగును. సుశ్రుత మతమున పుండరీక కుష్ఠము, దద్రుకుష్ఠము, స్థూలారుష్కము, సిధ్మము, రకస, మహాకుష్ఠ ఏకకుష్ఠము ఇవన్నియు కఫాధిక్యతచే కలుగును.[3]

వాతపిత్తాధిక్యతచే ఋష్యజిహ్వ కుష్ఠము కలుగును. కఫపిత్తాధిక్యతచే పుండరీక కుష్ఠము కలుగును. క్షుద్రకుష్ఠములలో పామ, శతారు, విస్ఫోటము, దద్రు, చర్మ దళము ఇవన్నియు కఫ పిత్తాధిక్యతచే కలుగును.

---

1. కుష్ఠేషు వాతలింగం దాహో రాగః పరిస్రవః పాకః
   విస్రోగన్ధః క్లేదః తథాంగపతనం చ పిత్తకృతమ్ (చ.చి. 7/35)
2. శ్వైత్యం శైత్యం కండూః స్థైర్యం చోత్సేధగౌరవస్నేహాః
   కుష్ఠేషు తు కఫలింగం జన్తుభిరభిభక్షణం క్లేదః (చ.చి. 7/36)
3. i) చ.చి. 7/27-30 ii) సు.ని. 5/6,7,16.

వాతకఫాధిక్యతచే సిధ్మకుష్టము కలుగును. క్షుద్రకుష్టములలో చర్మకుష్టము, ఏకకుష్టము, కిటిభము, విపాదిక, అలసకము ఇవి వాతకఫములచే కలుగును.

త్రిదోషములచే కాకణకుష్టము కలుగును.

**కుష్టమునందు బీజదోషము :**

కుష్టముచే దూషింపబడిన శోణితము శుక్రముగల మాతా పితరులకు జనించిన శిశువు గూడా కుష్టుతోనే జనించును.[1]

కుష్టము జన్మాంతరమునకు గూడా అనువర్తించి యుండును. కుష్టముతో మరణించినవాడు తిరిగి జన్మించునపుడును కుష్టముతోనే జన్మించును.[2]

## కుష్టము సంక్రామిక రోగము

సంభోగము, శరీరస్పర్శ, నిశ్వాసము, సహభోజనము, సహశయనము, కలసి కూర్చొనుట, వస్త్రములు, మాలలు, ఆలేపనములు వీనిని ఒకరుపయోగించిన వానిని మరొకరు ఉపయోగించుట-వీనిచే కుష్టము, జ్వరము శోష, నేత్రాభిష్యందము ఇతర ఔపసర్గికర రోగములు ఒకరి నుండి మరొకరికి సంక్రమించుచుండును.[3]

---

1. స్త్రీ పుంసయోః కుష్టదోషాద్ దుష్టశోణితశుక్రయోః
   యదపత్యం తయోర్జాతం జ్ఞేయం తదపి కుష్టితమ్ (సు.ని.1/28)
2. మ్రియతే యదకుష్టేన పునర్జాతేఽపిగచ్ఛతి
   నాతః కష్టతరో రోగో యధు కుష్టప్రకీర్తితమ్ (సు.ని. 1/31)
3. ప్రసంగాద్గాత్రసంస్పర్శాన్నిశ్వాసాత్ సహభోజనాత్
   సహశయ్యాసనాచ్చాపి వస్త్రమాల్యానులేపనాత్
   కుష్ఠం జ్వరశ్చ శోషశ్చ నేత్రాభిష్యంద ఏవ చ
   ఔపసర్గికరోగాశ్చ సంక్రామన్తి నరాన్నరమ్ (సు.ని. 1/33-34)

# రసాదిధాతుగత కుష్ఠ లక్షణములు

**రసధాతుగత కుష్ఠ లక్షణములు :**

కుష్ఠము రసధాతువును ఆశ్రయించినపుడు శరీరమున వర్ణము మారుట, రూక్షత్వము కలిగియుండుట, స్పర్శము నశించుట, రోమహర్షము కలుగుట, అధికముగా స్వేదము కలుగుట ఈ లక్షణములు కలుగును.[1]

**రక్తధాతుగత కుష్ఠ లక్షణములు :**

రక్తాధాతువును కుష్ఠము ఆశ్రయించినపుడు అధికముగా కండూ కలిగి, పూయము కారుచుండును.[2]

**మాంసధాతుగత కుష్ఠ లక్షణములు :**

మాంసమును ఆశ్రయించినపుడు కుష్ఠము అధికముగా ఉండుట, నోరు శోషించుట, ఖరత్వము కలిగి వుండుట, పిడకములు కలుగుట, తోద, పగులుట, చిరకాలము స్థిరముగ వుండుట ఈ లక్షణములు.[3]

**మేదోధాతుగత కుష్ఠ లక్షణములు :**

కుష్ఠము మేదస్సును ఆశ్రయించినపుడు హస్తపాదములు గతి తప్పి యుండుట, అంగములందు వేదన, శరీరమంతా పగులుట, వ్రణములు కలుగుట,

---

1. త్వక్స్థే వైవర్ణ్యమంగేషు కుష్ఠే రౌక్ష్యం చ జాయతే
   త్వక్స్వాపో రోమహర్షశ్చ స్వేదస్యాతి ప్రవర్తనమ్

2. కండూర్విపూయాంశ్చైవకుష్ఠే శోణిత సంశ్రితే

3. బాహుల్యం వక్త్రశోషశ్చ కార్కశ్యం పిడకోద్గమః
   తోదస్ఫోట స్థిరత్వం చ కుష్ఠే మాంసమాశ్రితే

రసరక్త మాంసగత కుష్ఠ లక్షణములు కలిగియుండుట మొదలగు లక్షణములు కలుగును.[1]

**అస్థిగత కుష్ఠ లక్షణములు :**

అస్థిధాతువు నాశ్రయించినపుడు కుష్ఠమునందు నాసాభంగము (ముక్కు పగులుట,) అక్షిరాగత్వము, వ్రణములందు క్రిములు జనించుట, స్వరోపఘాతము కలుగుట, మొదలగు లక్షణములు కలుగును.[2]

**మజ్జగత కుష్ఠ లక్షణములు :**

మజ్జా ధాతువును, కుష్ఠ ఆశ్రయించినపుడు నాసాభంగము, నేత్రరాగత్వము వ్రణములు క్రిములతో ఉండుట, కంఠస్వరము నశించుట, మొదలగు లక్షణాలు కలుగును.[3]

**శుక్రజ కుష్ఠ లక్షణములు :**

దంపతులకు ఇరువురికి కుష్ఠువ్యాధి ప్రబలమై వున్నచో దానివలన వారి శుక్ర శోణితములు దూషితములై ఉండును. అట్టి వారికి జనించిన శిశువు కూడ కుష్ఠువ్యాధికి లోనగును. దీనిని శుక్రగత కుష్ఠముగా చెప్పబడినది.[4]

---

1. కౌణ్యం గతిక్షయోఽంగానాం సంభేదః క్షతసర్పణమ్
   మేదస్స్థానగతే లింగం ప్రాగుక్తాని తథైవ చ
2. నాసాభంగోఽక్షిరాగశ్చ క్షతేషు క్రిమి సంభవః
   స్వరోపఘాతశ్చ భవేదస్థిమజ్జసమాశ్రితే
3. 2 వది
4. దంపత్యోః కుష్ఠబాహుల్యాద్దుష్ట శోణితశుక్రయోః
   యదపత్యం తయోర్జాతం జ్ఞేయం తదపి కుష్ఠితమ్

**కుష్ఠమునందు సాధ్యాఽసాధ్య లక్షణములు :**

కాకణక కుష్ఠము తప్ప మిగిలిన ఆరు మహాకుష్ఠములు కూడా చికిత్స చేయక పోవుట వలనగాని, అపథ్యము చేసినందువలన గాని దోషములచేత పూరించబడి అసాధ్య వ్యాధులుగా మారును. సాధ్యవ్యాధులైనప్పటికి వాటిని ఉపేక్షించిన త్వక్, మాంసము, రక్తము, లసీక మొదలగునవి క్లేదనమును, సంస్వేదనము చెందుట వలన క్రిములు అభివృద్ధిచెంది త్వక్ మొదలగు వానిని భక్షించును దోషములు వానిని మరికొంత దూషింపచేసి ఆయా దోషానుసార కుష్ఠ లక్షణము లను తీవ్రముగా కలిగించును.

ఈ బాధలను కలిగించు కృములు త్వక్, మాంస, శోణిత, లసీకాదులను, సిరలను, స్నాయువులను, మాంసములను, చిన్న అస్థులను భక్షించును. ఆ స- యమున స్రవించుట, శరీరము బద్దలగుచున్నట్లుండుట, అవయవములు భేదింప బడినట్లుండుట, పిపాసా, జ్వరము, అతిసారము, తాపము, దౌర్బల్యము, అరుచి, అజీర్ణము మొదలగు ఉపద్రవములు కలుగును. ఇట్టి లక్షణములు గలవాని అసాధ్యమైనవిగా తెలుసుకొనవలయును.[1]

---

1. తత్రయథసాధ్యం, తదసాధ్యతాం నాతివర్తతే సాధ్యం పునః కించిదధ్యా మతివర్తతే కదాచిదపచారాత్ సాధ్యానీ హి షట్ కాకణకవర్జ్యాన్యచికిత్స్య మానాన్యపచారతో వా దోషైరభిష్యన్దమానాన్య సాధ్యతాముపయాన్తి సాధ్యానామపి హ్యుపేక్ష్యమాణాన మేషాం త్వఙ్మాంసశోణితలసీకాకోథక్లేద సంస్వేదజాతి కృమయోఽభిమూర్ఛన్తి; తే భక్షయన్తస్త్వగాదీన్ దోషాః పునర్దూషయన్త ఇమానుపద్రవాన్ పృథక్పృథగుత్పాదయన్తి॥ కృమయ స్త్వగాదీంశ్చతురః సిరాః స్నాయున్మాంసాన్యస్థీన్యపి చ తరుణాని ఖాదన్తి అస్యామవస్థాయాముపద్రవాః కుష్ఠినం స్పృశన్తి తద్యథా ప్రస్ర వణమంగభేదః పతనాన్యంగావయవానాం తృష్ణా జ్వరాతీసారదాహ దౌర్బ ల్యారోచకావిపాకాశ్చ తద్విధమసాధ్యం విద్యాదితి (చ. ని. 5/17, 19)

లేతగా వున్న మొక్కను స్వల్పముగా ప్రయత్నించినచో ఛేదింపవచ్చును. ఆ మొక్కయే పెద్దదైనచో అధిక ప్రయత్నమున ఛేధింపవలసి ఉండును, ఆ విధముగానే వ్యాధి జనించిన వెంటనే సుఖసాధ్యముగా ఉండును. కాలము అతిక్రమించిన వృద్ధిచెంది కష్టసాధ్యముగా గాని అసాధ్యముగా కాని మారును.[1]

వాతాది మూడు దోషములకు ప్రత్యేకముగా చెప్పబడిన లక్షణములన్నింటిని కలిగిన కుష్ఠము అసాధ్యమైనది కావున బుద్ధిమంతుడైన వైద్యుడు దానికి చికిత్స చేయరాదు. అట్టి త్రిదోష లక్షణములు కలిగిన కుష్ఠవ్యాధియందు రోగి బలహీనుడై పిపాస, దాహము, కలిగి జఠరాగ్ని మందగించి క్రిములు కలిగి వున్నయెడల అది మిక్కిలి అసాధ్యమైనదిగా అగును. కావున ప్రత్యాఖ్యేయముగా నుండును. వాత కఫములు అధికముగా వుండు కుష్ఠములు ఒకేదోషము వలన వుండుటచే కృచ్ఛ్ర సాధ్యములు కావు; కఫపిత్తములు, వాతపిత్తములు ప్రబలముగా ఉండు కుష్ఠములు కష్టసాధ్యములు.[2]

త్వక్, రక్తము, మాంసములను ఆశ్రయించిన కుష్ఠమును, వాత, కఫదోషములు ప్రధానంగా ఉండు కుష్ఠమును సాధ్యములుగా ఉండును. మేదోగతమైన కుష్ఠము, దోషద్వయ సంసర్గమువలన ఏర్పడిన కుష్ఠము యాప్యములుగా ఉండును. మజ్జా ధాతువును అస్థిధాతువును ఆశ్రయించిన కుష్ఠము, అసాధ్యముగా ఉండును. ఇవేకాక వ్రణములందు క్రిములను కలిగి తృష్ణ, తాపము, అగ్నిమాంద్యము,

---

1. యథా స్వల్పేన ఛి యత్నేన ద్యతే తరుణ స్తరుః స వివాతిప్రవృద్ధస్తు ఛిద్యతేఽతి ప్రయత్నతః ఏవమేవవికారోఽపితరుణస్సాధ్యతే సుఖమ్ వివృద్ధస్సాధ్యతే కృచ్ఛ్రాదసాధ్యో వాఽపి జాయతే (చ. చి. 5/22, 23)
2. సర్వైర్లింగైర్వ్యక్తం మతిమాన్ వైద్యోవివర్జయేదబలం తృష్ణాదాహపరీతం శాన్తాగ్నిం జన్తుభిర్జగ్ధమ్ వాతకఫప్రబలం యత్ యదేకదోషోల్బణం న తత్ కృచ్ఛ్రం కఫపిత్తవాత ప్రబలాని తు కృచ్ఛ్రసాధ్యాని (చ. చి. 7/37-38)

ఈ లక్షణములతో కూడిన కుష్ఠము, సన్నిపాతము వలన జనించిన కుష్ఠమును, శరీరము పగిలి జలము కారుచుపుండు కుష్ఠమును, నేత్రములందు రక్తవర్ణము కలిగి హీనస్వరము కలిగిన కుష్ఠము, వమన విరేచనాది పంచకర్మలు చేసినను అస్వస్థముగా ఉండు కుష్ఠము మనుజుని చంపును కాబట్టి మిక్కిలి అసాధ్యము అని భావము.[1]

## కుష్ఠ చికిత్స

కుష్ఠరోగమునందు పూర్వరూపావస్థలోనే వమన విరేచనాది ఊర్ధ్వాధః శోధనములు చేయించవలెను. దానిచే దోషములు త్వక్‌ను ఆశ్రయించినపుడు శోధనములు ఆలేపనములు చేయింపవలెను.

దోషములు కుష్ఠరోగము నందు రక్తము నాశ్రయించినచో సంశోధనము, ఆలేపనము, కషాయపానము, శోణితావసేచనము. ఈ ప్రక్రియలచే ఉపచరింపవలెను.

దోషములు మాంసము నాశ్రయించినపుడు శోధన చికిత్సలు, ఆలేపనములు, కషాయపానములు, శోణితావసేచనము, అరిష్ట, మంధ, ప్రాశ ప్రయోగాదులచే ఉపచరింపవలెను.

దోషములు మేదస్సు నాశ్రయించినపుడు ఆత్మవంతుడైనచో ఈ క్రింది క్రియలచే యాపనము చేయవలెను. సంశోధనము, శోణితావసేచనము. తదుపరి

---

1. సాధ్యం త్వగ్రక్తమాంసస్థం వాతశ్లేష్మాధికం చ యత్ మేదసి ద్వంద్వజం యాప్యం వర్జ్యం మజ్జాస్థిసంశ్రితమ్ క్రిమ్యంతిర్దాహమన్దాగ్ని సంయుక్తం యత్త్రిదోషజమ్ ప్రభిన్నం ప్రస్రుతాంగం చ రక్తనేత్రం హతస్వరమ్ పంచకర్మగుణాతీతం కుష్ఠం హన్తీహ మానవమ్॥

భల్లాతకము (అర్శో చికిత్సోక్త) ప్రయోగించుట ఖదిర ప్రయోగము, అయ స్కృతి ప్రయోగము- వీనిచే ఉపచరింపవలెను.[1]

అస్థినాశ్రయించిన కుష్టము అసాధ్యము గావున వర్జనీయము.[1]

కుష్టమున ప్రారంభమునందు స్నేహపానము చేయింపవలెను. స్నేహ పానము శోధనాంగముగాను శమనార్థముగాను గూడా ప్రయోగింపవలసి యుండును. కుష్ఠమున రూక్షత్వము కలుగును గాన స్నేహపానము చాలా ముఖ్య మైనది. స్నేహపానానంతరము వమన విరేచన రక్త మోక్షణాది క్రియలచే ఉపచ రింపవలెను.[2]

## పంచకర్మలు ప్రయోగించు సమయము

కుష్ఠమునందు పక్షమునకు (15 రోజులకు) ఒకమారు వమనము చేయింప వలెను. మాసమునకొకసారి విరేచనము చేయింపవలెను. సంవత్సరమునకు రెండు మారులు రక్తమోక్షణము చేయింపవలెను. మూడు రోజులకొకమారు నస్యకర్మ చేయింపవలెను [3]

---

1. తత్ర పూర్వరూపేషూభయతః సంశోధనమాసేవేతః తత్రత్వక్ సంప్రాప్తే శోధనా లేపనాని శోణిత ప్రాప్తే సంశోధనాలేపన కషాయపాన శోణిత అవసేచనాని మాంసప్రాప్తే శోధనాలేపన కషాయపాన శోణితావసేచనా రిష్టమంథప్రాశాః చతుర్ధకర్మగుణ ప్రాప్తం యాప్యమాత్మ వతః సంవిధాన వతశ్చ (సు. చి. 9/6)
2. i) తత్ర ప్రథమేవ కుష్ఠినం స్నేహపాన విధానేనోపపాదయేత్ (సు. చి. 9/7)

   ii) పైదానిపై డల్హణ వ్యాఖ్య
3. పక్షాత్ పక్షాచ్ఛర్దనాన్యభ్యుపేయాన్ మాసాన్మాసాత్ స్రంసనం చాపిదేయాం స్రావ్యం రక్తం వత్సవేహిద్వరల్పం దస్యదద్యాచ్చ త్రిరాత్రాత్రిరాత్రాత్ (సు .చి. 9/44)

కుష్ఠురోగికి దోషములు అధికముగా నున్నపుడు బలమును రక్షించుచు బాగా అధికముగా సంశోధనము చేయింపవలెను. అనగా బలము క్షీణించకుండా ఉండునట్లు మాటిమాటికి సంశోధనము చేయించుచుండవలెను. అట్లుకాక దోష ములు అధికపరిమాణములో శోధనము చేయించినచో ప్రకోపించిన వాతము రోగిని వెంటనే చంపగలదు.[1]

కోష్ఠశోధనము, రక్తమోక్షణము చేయించిన తదుపరి తిరిగి స్నేహ పానము చేయింపవలెను. సంశోధనముచే దుర్బలుడుగా నుండి శుద్ధకోష్ఠము గల వానికి శీఘ్రముగా వాతము కోష్ఠమునందు ప్రవేశించును. స్నేహపానము చేయించి అట్టి వాయువుచే హాని కలుగకుండునట్లు చూడవలెను.[2]

**వమనము :**

శ్లేష్మ ప్రధాన కుష్ఠమునందు ప్రారంభమునందు వమనము చేయింపవలెను. అంతేకాక శరీర ఊర్ధ్వ ప్రదేశమునందు కలుగు కుష్ఠములందును, దోషములు హృదయ ప్రదేశమునందు ఉత్క్లేశము చెందియున్నపుడును వమనము చేయింప వలెను.

కల్ప స్థానమునందు వర్ణింపబడిన వమన విరేచన యోగములను కుష్ఠము నందు ప్రయోగింపవచ్చును.

---

1. బహుదోషః సంశోధ్యః కుష్ఠీ బహుశోఽనురక్షతా ప్రాణాన్ దోషే హ్యతి మాత్రహృతే వాయుర్హన్యా దబలమాశు (చ. చి. 7/41)

2. స్నేహస్య పానమిష్టం శుద్ధే కోష్ఠే ప్రవాహితే రక్తే వాయుర్హి శుద్ధకోష్ఠం కుష్ఠినమబలం విశతి శీఘ్రం (చ. చి. 1/42

వమనయోగములు :

కుటజఫలము, మదనఫలము. యష్టిమధు, పటోల నింబవీని శీతరసము లేక క్వాథమునందు నింబపత్ర స్వరసము కలిపి వమనార్థము కుష్ఠమునందు పానము చేయింపవలెను.

వీని శీతరసము, పక్వరసము, మధు, మధుకము వమనము చేయించుటకు హితకరములుగా నుండును.[1]

విరేచనయోగములు :

1. త్రివృత్, దన్తీమూలము, త్రిఫల ఇవి కుష్ఠమునందు విరేచనమునకై ప్రశస్తముగా నుండును.

2. విరేచన ద్రవ్యములను ఆలోడనము చేయుటకై a) సౌవీరకము b) తుషోదకము c) ఆసవము d) సీధు యివి ఉత్తమముగా నుండును.[2]

ఉత్తమ, మధ్యమ, అవర విరేచన కర్మననుసరించి పేయాది క్రమముల నాచరింప చేయవలెను.

---

1. i) వాతోత్తరేషు సర్పిః వమనం శ్లేష్మోత్తరేషు కుష్ఠేషు పిత్తోత్తరేషు మోక్షః రక్తస్య విరేచన చాగ్రే వమన విరేచనయోగాః కల్పోక్తాః కుష్ఠినాం ప్రయోక్తవ్యాః (చ.చి. 7/39-40)

   ii) దోషోత్క్లిష్టే హృదయే వామ్యః కుష్ఠేషు చోర్ధ్వభాగేషు
   కుటజఫల మదన మధుకైః సపటోలైర్నింబరసయుక్తైః
   శీతరసః పక్వరసో మధూని మధుకం చ వమనాని (చ.చి. 29/43)

2. కుష్ఠేషు త్రివృత్తాదన్తీ త్రిఫలా చ విరేచనే శస్తా సౌవీరకం తుషోదకమాలోడనమాసవాశ్చ శీధూని శంసన్త్యథోహరాణాం యథావిరేకం క్రమశ్చేష్టః (చ.చి. 1/44-45)

**ఆస్థాపన వస్తి :**

దారుహరిద్రా, బృహతీ, సేవ్య, పటోల, నింబ, మదనఫల, అరగ్వధ- వీని క్వాథమునందు ఇంద్రయవ, ముస్తకల్కము ఘృతము, తైలము కలిపి కుష్ఠమునందు నిరూహవస్తి యివ్వవలయును.

చరకసిద్ధి స్థానమునందు కుష్ఠమున నిరూహవస్తి నిషేధింపబడినది అయినను ఆవశ్యకతానుసారము బాగుగా ఆలోచించి అవసరమని తోచినపుడు పై చెప్పబడిన విధిననుసరించి నిరూహవస్తిని ప్రయోగింపవలెను.[1]

**అనువాసన వస్తి :**

వాత ప్రధాన కుష్ఠములందు విరేచనము నిరూహవస్తి ఇచ్చిన తరువాత అనువాసన వస్తి ఇవ్వవలసిన ఆవశ్యకత కలిగినపుడు రోగి యోగ్యుడుగా నున్నచో ఈ క్రింది అనువాసన వస్తిని ప్రయోగింపవలెను.

మదనఫలము, యష్టిమధు, నింబత్వక్, కుటజత్వక్, పటోల పత్ర-వీని క్వాథ, కల్కములతో విధి పూర్వకముగా స్నేహము సిద్ధముచేసి అనువాసన వస్తిని ప్రయోగింపవలెను.[2]

**శిరో విరేచనము :**

విశేషించి జత్రూర్థ్వ భాగమునందు ఉత్పన్నమైన కుష్ఠములందు శిరో విరేచనము అధిక హితకరముగా నుండును.

---

1. దార్వీ బృహతీ సేవ్యైః పటోలపిచుమర్దమదనకృతమాలైః
   సస్నేహై రాస్థాప్యః కుష్ఠీ సకలింగయవముస్తైః (చ.చి. 7/46)
2. వాతోల్బణం విరిక్తం నిరూహమనువాసనార్హమాలక్ష్య
   ఫలమధుకనింబ కుటజైః సపటోలైః సాధయేత్స్నేహమ్
   (చ. చి. 7/47)

సైంధవలవణము, దంతీమూలము, మరిచ, ఫణిజ్జకము, పిప్పలి, కరంజ ఫలము, విడంగము-వీని చూర్ణము నస్యము చేయించిన శిరస్సునందలి కృములు కుష్ఠము, కఫ ప్రకోపము శమించును.[1]

రక్తమోక్షణము :

స్థిర, కఠిన మండలములతో కూడి యున్న కుష్ఠములందు ప్రస్తర నాడీ స్వేదములచే స్వేదనము చేయించి కూర్చక శస్త్రముచే ఘర్షణము చేయుట ద్వారా రక్తమోక్షణము చేయింపవలెను. ఈ విధముగా రక్తమోక్షణము చేయుటచే పై చెప్పబడిన స్థిరత్వ కాఠిన్యతలు శమించును.

ఆనూప, ఔదక పశుపక్షుల మాంసములను మూటగాకట్టి పొట్టలీ స్వేదము చేయించవలెను. తదుపరి తీక్ష్ణ శస్త్రముచే లేఖనము చేయవలెను.

దోషములు అల్పమాత్రలో నున్నచో ప్రచ్ఛానము చేయించవలెను. దోషములు అధిక మాత్రలోయున్నచో శృంగముతోగాని(వాతప్రాధాన్యతయున్న) లేక కఫ ప్రాధాన్యతయున్నచో అలాబుతోను పిత్త ప్రాధాన్యతయున్నచో జలౌకతో రక్తమోక్షణము చేయింపవలెను.

దోషములు గాఢముగానున్నచో సిరావ్యధనముచే రక్తమోక్షణము చేయింపవలెను.[2]

---

1. సైంధవదన్తీమరిచం ఫణిజ్జకః పిప్పలీ కరంజఫలం
నస్యం స్యాత్సవిడంగం క్రిమికుష్ఠకఫప్రకోపఘ్నమ్ (చ.చి. 7/48)

2. i) స్థిరకఠినమండలానాం స్విన్నానాం ప్రస్తరప్రణాడీభిః కూర్చైర్విఘట్టితానాం రక్తోత్క్లేశోఽపనేతవ్యః ఆనూపవారిజానాం మాంసానాం పోట్టలైః సుఖోష్ణైశ్చ స్విన్నోన్నతస్సన్నం విలిఖేత్కుష్ఠం తీక్ష్ణేన శస్త్రేణ రుధిరాగమార్థం అథవా శృంగాలాబూని యోజయేత్ కుష్ఠే ప్రచ్ఛితమల్పం కుష్ఠం విరేచయేద్వా జలౌకోభిః (చ.చి. 7/50-52)

ii) ప్రచ్ఛనమల్పేకుష్ఠే మహతి చ శస్తం సిరావ్యధనం (చ.చి. 7/40)

## కుష్ఠము నందు పథ్యాఽపథ్యములు

**ఆహారములు :**

పురాణ యవ, గోధుమ, శాలి ధాన్యములు, ముద్గ, ఆఢకి, మసూర, జాంగల పశుపక్షుల మాంసములు, మధు, పురాణఘృత ఆషాఢమాసమున లభించు ఫలములు, కర్కోటకము, వేత్రాగ్రములు, పటోల, కంటకారి, కాకమాచి, లసున, పునర్నవ, పక్వతాళము, జాతీఫలము, నాగకేసరములు, కేసరము, తిలతైలము, సర్షపతైలము లఘు ఆహారములు, కస్తూరి, తిక్త పదార్థము.

**ఇతరములు :**

గోఖర, ఉష్ట్రి, శ్వాన; మహిషమూత్రములు.

## అ ప థ్య ము లు

**ఆహారములు :**

విరుద్ధాహారములు, పానీయములు, విషమాశనము, అమ్ల పదార్థములు, తిలలు మాషములు, ద్రవ, గురు, అన్నములు, నవాన్నములు, విదాహి, విష్టమ్భి పదార్థములు అనూపమాంసములు, దధి, దుగ్ధము, మద్యము, గుడము, లవణ, పదార్థములు, కఫకర పదార్థములు వింధ్య సహ్యోద్భవజలము.

**విహారములు :**

నిద్ర (దివాస్వప్నము) ఆలేపసేవన, స్వేదనము, వ్యవాయము, వేగధారణ, వ్యాయామము.[1]

---

1. i) భై.ర. 54/372-381

 ii) యో.ర. కుష్ఠాధికార

# కుష్ఠమునందు శామక యోగములు

స్నేహ యోగములు :

ఘృతములు రక్తము, పిత్తము అధికముగాఉన్న కుష్ఠములందు, పానము చేయింపవలెను.

ఘృతయోగములు :

1. భల్లాతక, అభయ, విడంగ సిద్ధఘృతము; శోధనమునకు ముందు పానమునకును ప్రయోగింపవచ్చును.1

2. తిక్తషట్పలఘృతము; కుష్ఠ, పామా, విసర్ప, పిడక, కండు, గండమాలలు శమించును. (చరక)

3. మహాతిక్తకఘృతము : కుష్ఠ, రక్తపిత్త, వాతరక్త, విస్ఫోట, పామ, కండు, పిడక మొదలగు వ్యాధులను శమింప చేయును.

4. మహాఖదిరఘృతము : సర్వకుష్ఠములందు శ్రేష్ఠమైనది. (చరక)

5. నీలఘృతము : దోషధాత్వాశ్రిత, అసాధ్యత్వగ్గతకుష్ఠశామకము, పానమున అభ్యంగమునందుగూడా ప్రయోగింపదగినది.

6. తిక్తకఘృతము, త్రిఫలాఘృతము, మహానీలఘృతము, గోమూత్రఘృతము, అరగ్వథాదిఘృతము, ముష్కకఘృతము : దీనిలో ఏ ఘృతమునైనను అవస్థానుసారము పానము చేయింపవచ్చును. (సుశ్రుత)

7. వజ్రకఘృతము: గళత్కుష్ఠమున విశేషించి ప్రయోగింపవలెను. (సుశ్రుత)

8. సోమరాజీఘృతము: విశేషించి శ్విత్రహారముగా నుండును.

9. పంచతిక్తఘృతగుగ్గులు: విశేషించి సన్ధ్యస్థ్యాది ధాతుగత కుష్ఠములందు ప్రశస్తముగా నుండును.

10. ఖదిరసారసిద్ధఘృతముగాని. నింబత్వక్ సిద్ధఘృతముగాని పటోలసిద్ధ ఘృతముగాని పానము చేయింపవలెను.

## తైలములు :

1. తువరక తైలముగాని, భల్లాతక తైలముగాని పానమునకును శోధన పూర్వకపానమునకు బాహ్యప్రయోగమునకు హితకరముగానుండును. (సుశ్రుత)

2. కుష్ఠాద్యతైలము (చరక) అన్ని కుష్ఠములందును ప్రయోగింప దగినది. ఈ ద్రవ్యములనే లేపమునకు, ఉద్వర్తనము, ప్రఘర్షణము, అవ చూర్ణమునకు ప్రయోగించుట ప్రశస్తముగా నుండును.

3. శ్వేతకరవీరాద్య తైలము - అభ్యంగముగా ప్రయోగించిన కుష్ఠము, కండు శమించును.

4. శ్వేతకరవీరపల్లవాద్య తైలము, తిక్తేక్ష్వాక్వాది తైల, కనకక్షీరి తైల, సర్షపతైల, కరంజతైల,కోషాతక్యాది తైల,ఇంగుదీతైల, ఖదిరసారతైల(చరక) రుద్రతైలము, తృణకతైలము, వజ్రకతైలము, మహావజ్రకతైలము, (సుశ్రుత) సోమరాజీతైలము, కన్దర్పసారతైలము, సిన్దూరాద్యతైల, పృథ్వీసారతైల, కుష్ఠ కాలానలతైలము, వైస్వతద్రుమబీజతైలము, కుష్ఠరాక్షసతైల, షడ్బిందుతైల, కృష్ణసర్షపతైలము (భై.ర. చ.ద.).- ఈ తైలములు ఏవైనను ఆయా లక్షణాను సారము అన్ని కుష్ఠలందును ప్రయోగింపవచ్చును.

5. బృహన్మరీచాది తైలము (భై. ర) సర్షపతైలము, వత్సనాభ, తాళక, మణిశిల ప్రధాన ద్రవ్యములు. కుష్ఠు, పామ- విచర్చిక, నీలిక, వ్యంగ్యము,సిధ్మ, కిటిభాది త్వగ్రోగశామకము, త్వక్‌నకు కోమలత్వమును కలిగించును.

## కల్కచూర్ణాదులు :

1. వాయు విడంగ, ఖదిర- కుష్ఠురోగికి పాన, ఆహారాదులు తయారు

చేయుటకు, స్నాన, ధూపన, ప్రదేహాదులందును క్రిములను నశింపచేయు వాయు విడంగము, ఖదిర విశేషముగా ప్రయోగింప వలయును.

2. దావుహరిద్రాకల్కమును గోమూత్రముతో పానము చేయింపవలెను. లేక రసాంజనమును గోమూత్రముతో ఇవ్వవలయును.

3. అభయా, త్రికటు, గుడము, తైలము కలిపి సేవింప చేయవలెను.

4. ముస్తాది చూర్ణము-కుష్ఠ, శ్విత్ర, పిడక, కండు, కోఠములు దీని సేవనచే శమించును. (చరక)

5. త్రిఫలాది చూర్ణము-3గ్రా. మధుఘృతములతో సేవించిన కుష్ఠునందు కలుగు శూన్యత శమించును. (చరక)

6. సాలసరాదిగణ చూర్ణము (సుశ్రుత)

7. న్యగ్రోధాదిగణచూర్ణము (సుశ్రుత)

8. అరగ్వధాదిచూర్ణము (సుశ్రుత)

9. తిలలు, వాకుచీచూర్ణము 3గ్రా కాని లేక కేవల వాకుచీ చూర్ణము 300 మి.గ్రా గాని సేవించిన అన్ని కుష్ఠములు శమించును. దీనితోపాటు ఘృత భోజనము చేయుచుండిన విశేషగుణకారిగా నుండును.

10. సప్తసమచూర్ణము 2-3గ్రా మధుతో సేవింపవలెను.

12. అభయ, నింబపత్రచూర్ణముగాని, లేక నింబపత్ర, ఆమలకీ చూర్ణము గాని 2గ్రా సేవించి-

12. శుభదినమున ఉధృతము చేసిన భంగ లేక గుంజాచూర్ణము 1గ్రా ఘృతము, మధుతో సేవింపచేయవలెను.

13. పంచనింబచూర్ణ 3గ్రా ఉష్ణజలము లేక ఖదిరక్వాథముతో సేవించిన సర్వకుష్ఠములు శమించును. రసాయనము.

శశాంకలేఖాది చూర్ణము (చ. ద. భై.ర)

**క్వాథములు :**

1. మంజిష్ఠాదిక్వాథము : లఘు, మధ్యమ, మహా అను పేర్లతో మూడు విధములైన యోగములు కలవు. రక్తశోధక, త్వచ్య గుణములు కలిగి రక్త ప్రసాదక కుష్ఠఘ్న కండూఘ్న గుణములతో కూడియుండును. ఆవశ్యకతాను సారము-ఈ మూడింటిలో తగిన క్వాథము ఇతర కుష్ఠహరఔషధములకు అను పానముగాగాని, సహపానముగాగాని ప్రయోగింపవచ్చును. మాత్ర 50 మి.లీ.

2. పటోలాదిక్వాథము : జీర్ణానంతరము జాంగల పశుపక్షుల మాంస రసముతో పురాణశాల్యాన్నము పథ్యముగా సేవించిన కుష్ఠములు శమించును. (చరక)

3. వృషకుటజాదిక్వాథము పానమునకు ఈ ద్రవ్యసిద్ధజలము స్నానము నకు ప్రయోగము.

4. అటరూషకక్వాథము లేక వాసాత్రిఫలాక్వాథపానము.

5. విభీతక్యాది క్వాథము - కఫపిత్తజకుష్ఠశామకముగానుండును.

6. నింబపటోల పత్రక్వాథముగాని ఖదిరసార క్వాథముగాని త్రిఫలా క్వాథముగాని, సప్తపర్ణక్వాథముగాని, పానము చేయించిన కుష్ఠములుశమించును. ఈ క్వాథద్రవ్యములన్నింటిని కలిపిన క్వాథము సిద్ధఘృతము లేక తైలములను గూడా ప్రయోగింపదగును.

7. బృహత్యాదిక్వాథము పానమునకు-యివే ద్రవ్యములతో సిద్ధముచేసిన జలము స్నానమునకు ప్రయోగింపవలెను.

**ఆసవారిష్టాదులు :**

పూతీకాద్యరిష్టము సర్వకుష్ఠములను శమింపచేయును (సుశ్రుత). మధ్వా సవము, లేక త్రిఫలాసవము సర్వకుష్ఠములందును హితకరముగా నుండును (చరక). కనక బిందవ్వరిష్టము అన్నికుష్ఠములను ప్రమేహాదివ్యాధులను శమింప

చేయును. దేహమునకు కనక వర్ణమును కలిగించును. శింశుపాదిసుర, సాలస రాదిసుర, న్యగ్రోధాదిసుర, పలాసాద్యాసవము, అరగ్వధాదిసుర, ఖదిరారిష్ట, శారి బాద్యారిష్ట, పంచతిక్తారిష్ట మొదలగునవి అవస్థానుసారము ప్రయోగింపవచ్చును.
(సుశ్రుత) (భై. ర)

కుష్ఠహర రసౌషధాదులు :-

1. లేలీతక (ఆంవలాసార గంధకము) ఆమలకీస్వరసము తేనెతో సేవింప చేసినచో పదునెనిమిది విధములగు కుష్ఠములు శమించును. మాత్ర 100మి.గ్రా. నుండి 800 మి. గ్రా.

2. స్వర్ణమాక్షిక భస్మమును 100 మి.గ్రా. నుండి 400 మి.గ్రా. గోమూత్ర ముతో సేవింపచేసినచో కుష్ఠములు శమించును.

3. శ్రేష్ఠమైన ఆంవలసారగంధకముతోగాని లేక స్వర్ణమాక్షికముతోగాని మాత్రను చేయబడిన సర్వవ్యాధి నివారకమగు పారద భస్మము సేవింపచేసిన కుష్ఠవ్యాధి శమించును.

4. పైన వివరింపబడిన విధముగా భస్మముచేయబడిన పారదమును వజ్రశిలా జిత్తుతోగానిలేక యోగరాజముతోగాని ప్రతిదినము సేవింపచేసిన కుష్ఠము శమిం చును.

5. పై యోగమునందు వజ్రభస్మము గూడా కలిపి సేవింపవలెను.

6. కుష్ఠకుఠారరస (ర.సా.సం.) రససింధూర, లోహ, తామ్ర, గుగ్గులు, శిలాజిత్-ముఖ్యద్రవ్యములు, గలితకుష్ఠమునందు విశేష హితకరము.

7. ఆర్కేశ్వరరసము (ర.సా.సం.) కజ్జలి, తామ్ర ముఖ్య ద్రవ్యములు రక్త మండల కుష్ఠహరము.

8. కుష్ఠకాలానల రస (ర.సా.సం.) కజ్జలి, తామ్ర, లోహ పిప్పలి.

9. బ్రహ్మరస (ర.సా.సం.) రస సింధూరము, గంధకము, చిత్రక, వాకుచీ సుప్తత, మండల కుష్ఠము శమించును.

10. గలత్కుష్టారి రసము (ర.సా సం) ఖజ్జలి, తామ్ర, లోహ, గుగ్గులు, శిలాజిత్, విషముష్టి, ముఖ్యద్రవ్యములు. గల త్కుష్ఠమును శమింపచేయును.

11. కుష్ఠహరితాలేశ్వర రసము, ఖజ్జలి, తాళకము, అభ్రకము, తామ్రము, కాకోదుంబర ముఖ్యద్రవ్యములు వాలుకాపాకము అన్ని కుష్ఠములను శమింప చేయును.

12. వజ్రవటి, ఖజ్జలి, చిత్రక, కాకోదుంబర మొదలగునవి ముఖ్యద్రవ్యములు

13. చన్ద్రానన రసము (ర.సా.సం.) ఖజ్జలి, అభ్రకము, కాకోదుంబరము మొదలగునవి.

14. సర్వేశ్వర రస (శా.సం.) ఖజ్జలి, తామ్ర, అభ్రక, లోహ, స్వర్ణ, రజత, హీరక, హరితాళ-కూపీపక్వ, వత్సనాభి మొదలగునవి కలవు. సుప్తత, మండల కుష్ఠము ఇతర చర్మరోగములు.

15. అమృతాంకుర లోహ రససింధూర, గంధకము, లోహము, తామ్రము, భల్లాతక, అభ్రక, శో॥గుగ్గులు ముఖ్యద్రవ్యములు కుష్ఠ, పాండు, వాతరక్తము.

16. తాళకేశ్వర రసము, ఉదయభాస్కరరసము, రసమాణిక్యరస, రాజ రాజేశ్వరరసము, పారభద్రరసము, కుష్ఠారి రసము, కుష్ఠనాశనరసము మొదలగు నవి ఆవశ్యకతానుసారము ప్రయోగింపవలెను.

**కుష్ఠమునందు బహిః పరిమార్జన చికిత్సలు :—**

రక్తమోక్షణాదులు, వమన విరేచనాదులతో కోష్ఠశోధనము జరిగిన తదుపరి కుష్ఠము ఉన్న స్థానములందు లేపనాదులు ప్రయోగించుటచే శీఘ్రముగా కుష్ఠములు శమించును.[1]

వజ్రక తైలముచే అభ్యంగనము చేయించి అరగ్వధాదిక్వాథద్రవ్యములచే ఉత్సాదనముచేసి ఖదిరక్వాథమును పరిషేక, అవగాహపానాదులకు ఉపయోగింపవలెను.

రోధ్రాది ద్రవ్యములతో సిద్ధముచేసిన జలముచే స్నానము చేయించిన కుష్ఠముచే కలిగిన దాహము శమించును.[2]

సిద్ధార్థకస్నాన ద్రవ్యసిద్ధ జలముచే స్నానము చేయింపవలెను. (ముస్త, మదన, త్రిఫల, కరంజ, అరగ్వధ, ఇంద్రయవ, దార్వీ, సప్తవర్ణ) యివే ద్రవ్యములచే సిద్ధముచేసిన క్వాథము పానమునకు; వమనమునకు, విరేచనమునకు ప్రయోగింపవలెను. ఇవే ద్రవ్యముల చూర్ణములతో లేపములు, ఉద్ధర్షణములు సిద్ధముచేసి ప్రయోగించిన త్వగ్దోషములు, కుష్ఠు, శోథ, పాండు శమించును.[3]

మాంస్యాదిలేపము, త్రపాద్యాదిలేపము, ఫల్గుజాదిలేపము, కుష్ఠాదిలేపము, ప్రపున్నాడబీజాదిలేపము వీనిలో దేనినైనను లేక శిరీషత్వక్ కల్కము; కార్పాస మూలము, రాజవృక్షపత్రము, లేక కాకమాచి వీనిలో వేని కల్కమునైనను లేపనము చేసిన కుష్ఠములు శమించును.

కరవీర మూలముగాని కుటజకరంజఫలముగాని దారుహరిద్రాత్వక్‌గాని జాతీపత్రములతో కలిపి కల్కముచేసి లేపనముచేసినను కుష్ఠములు శమించును.[4]

---

1. చ.చి. 7/53 2. సు.చి. 9/5, 50
3. చ.చి. 7/91-92 4. చ.చి. 7/84-96

లోధ్రకల్కముగాని, ధాతకీపుష్పకల్కముగాని, వత్సకబీజకల్కముగాని కరంజబీజమజ్జగాని, మాలతీమూలపత్రకల్కముగాని ఉద్వర్తనము చేయించిన కుష్ఠమునందు హితకరముగా నుండును.

ఏడగజ, విడంగ, హరిద్రాద్వయ, అరగ్వధమూల, పిప్పలి కుష్ఠ-వీనిచే సిద్ధము చేయబడిన జలము స్నానమునకు, క్వాథము పానమునకు, కల్కము లేపనమునకు ప్రయోగింపవలెను.

ఏడగజ, విడంగ, అరగ్వధమూలము-వీని నైనను పైవిధముగా ప్రయోగింపవచ్చును.

శ్వాన, గో, అశ్వ,వరాహ,ఓష్ట్రి దన్త్రిములను చాడలేపనముచేయవలెను.[1]

ముందు చెప్పబడిన తైలములు అన్నియు బాహ్యప్రయోగమునకే చెప్పబడినవి.

శస్త్రకర్మ చేయుటకు వీలుగాని కుష్ఠములందు అనగా ప్రచ్ఛాన లేఖనాదులకు వీలుకానపుడును, కుష్ఠముచే స్పర్శనేంద్రియమును స్పర్శజ్ఞానమును నశించినపుడును. రక్తమును దోషమును నిర్హరణము చేయించిన తదుపరి క్షారప్రయోగము చేయవలెను.

పాషాణమువలె కఠినముగను, శూన్యముగను, స్థిరముగను ఉండి పురాణముగా నున్న కుష్ఠమునందు విషనాశక అగదములను పానము చేయించి విషములను లేపము చేయవలెను. లేక అగద విషనాశక ఔషధముల లేపము చేయవలెను.[2]

---

1. చ.చి. 7/126, 129, 160
2. యేషు న శస్త్రం క్రమతే స్పర్శేంద్రియనాశనానియాని స్యుః తేషు నిపాత్యః క్షారో రక్తం దోషం చ విస్రావ్య పాషాణకఠినపరుషే సుప్తే కుష్ఠే స్థిరే పురాణే చ పీతాగదస్య కార్యో విషైః ప్రదేహోఽగదైశ్చాను
(చ.చి. 7/54-55)

## కుష్ఠమునందు విశేష చికిత్సలు

సామాన్యముగా అన్ని కుష్ఠములందును వాతకఫ శామకమగు కుష్ఠచికిత్సలు చేయవలెను. వమనము ద్వారా కఫమును, విరేచనము ద్వారా పిత్తమును విస్రావణముద్వారా రక్తమును నిర్హరణము చేయవలెను.[1]

వాతప్రధాన కుష్ఠములందు ప్రారంభమున ఘృతపానము చేయింప వలెను. కఫప్రధాన కుష్ఠములందు సర్వప్రథమమున వమనము చేయింపవలెను. పిత్తప్రధాన కుష్ఠములందు సర్వప్రథమమున రక్తమోక్షణము మరియు విరేచనము చేయింపవలెను.[2]

వాతప్రధాన కుష్ఠమున విరేచనము. నిరూహవస్తి ఫలమధుకాది తైలముతో లేక స్నేహముతో అనువాసన వస్తి చేయింపవలెను. త్రిఫలాది ఘృతము పానము చేయింపవలెను.[3]

## పిత్తజ కుష్ఠ చికిత్సలు

పిత్తజ కుష్ఠమునందు తిక్త ద్రవ్యములచే సిద్ధము చేయబడిన ఘృతములను రక్త మరియు పిత్తశామకములైన బాహ్య ఆభ్యంతరమైన శ్రేష్ఠమైన ప్రయోగములచే ఉపచరింపవలెను.[4]

---

1. మారుతకఫకుష్ఠఘ్నం కర్మోక్తం పిత్తకుష్ఠినా కార్యం కఫపిత్తరక్తహరణం తిక్తకషాయైః ప్రశమనం చ (చ.చి. 7/ 9)
2. వాతోత్తరేషుసర్పిః వమనం శ్లేష్మోత్తరేషు కుష్ఠేషు పిత్తోత్తరేషు మోక్షః రక్తస్య విరేచనం చాగ్రే వమనవిరేచనయోగాః కల్పోక్తాః కుష్ఠినాం ప్రయోక్తవ్యాః ప్రచ్ఛనమల్పే కుష్ఠే మహతి చ శస్త్రం సిరావ్యధనమ్ (చ.చి. 7/39)
3. చ.చి. 7/47, 100
4. సర్పీంషి తిక్తకాని చ యచ్చాన్యద్రక్తపిత్తనుత్కార్యం బాహ్యాభ్యంతర మగ్ర్యం తత్కార్యం పిత్తకుష్ఠేషు (చ.చి. 7/59)

రోధ్రాది గణక్వాథముతో స్నానము చేయించినను యష్టిమధు, లోధ్ర, పద్మకాష్ఠ, పటోల, పిచుమర్ద, చన్దన- ఈ ద్రవ్యములతో స్వరసము, క్వాథము సిద్ధముచేసి పానమునకును. సిద్ధజలమును స్నానమునకును పిత్తజ కుష్ఠమునందు ప్రయోగించిన హితకరముగా నుండును. త్రివృత్ చూర్ణము మధుతో సేవింప చేసినను దాహము శమించును.

ప్రియంగు, రేణుక, ఇంద్రయవ, అతివస, ఉశీర చందన కటుక రోహిణి వీనిని పిత్తజ కుష్ఠములందు ఆలేపనార్థము ప్రయోగింపవలెను.

దాహము అధికముగానున్నచో తిక్తక ఘృతముతో గాని సహస్రధౌత ఘృతముతోగాని అభ్యంగము చేయవలెను.

చందనము, యష్టిమధు, ప్రపౌండరీకము, ఉత్పలము వీనితో సిద్ధము చేసిన తైలముతో అభ్యంగము చేయించిన కుష్ఠమునందు కలిగిన దాహము శమించును.[1]

కుష్ఠము కలిగిన స్థానమునందు క్లేదముకలిగి అంగములు ఊడిపోవుచు దాహము, విస్ఫోటముతో కూడిన చర్మదల కుష్ఠమునందు శీతల ప్రదేహములు, పరిషేకములు, శిరావ్యధనము, విరేచనము, తిక్త ఘృతపానము- ఈ క్రియలచే ఉపచరింపవలెను. పూర్వోక్తమైన పిత్తశామక, కుష్ఠశామక ఘృతములను పానము చేయింపవచ్చును.[2]

త్రిఫలాది క్వాథమున ఘృతము కలిపి సేవించిన వాతపిత్త ప్రధాన కుష్ఠములు, విసర్పము, విస్ఫోటము దాహము జ్వరము శమించును.[3]

---

1. చ.చి. 7/133 2. 2
2. క్లేదీ ప్రపతతి చాంగేదాహేవిస్ఫోటకే స చర్మదళే
   శీతాః ప్రదేహా సేక వ్యధో విరేకో ఘృతం తిక్తమ్ (చ.చి. 7/134)
3. చ.ని. 7/137-139

పిత్త కఫజ కుష్టములందు జలవాప్యాది లేపము ప్రయోగింపవలెను. త్రిఫలాది క్వాథముగాని ఖదిరాది క్వాథముగాని పానము చేయింపవలెను.[1]

రక్త పిత్త ప్రధాన కుష్టములందు ఖదిర ఘృతముగాని నింబఘృతముగాని దార్వీ ఘృతముగాని పటోల ఘృతముగాని పానము చేయింపవలెను.[2]

పిత్త ప్రధానముగా ఉండు కుష్టములందు లోహభస్మము, లోహపర్పటి, గంధక రసాయనము, పంచనింబ చూర్ణము వీనిని ఆవశ్యకతానుసారము ప్రయోగింపవలెను.

## కఫప్రధాన కుష్ట చికిత్సలు

కఫప్రధాన కుష్టములందు వమనము చేయింపవలెను. కృతమాలకారిష్టమును పానము చేయింపవలెను.[3]

తిక్తేక్ష్వా క్వాదితైలము అభ్యంగము చేయించిన వాతకఫ జన్య కండు కుష్టములు శమించును.

చిత్రకాది లేపము, లాక్షాది లేపము యివి వాతకఫజ కుష్టములను శమింపచేయును.

వాతప్రధాన, వాతకఫ ప్రధాన కుష్టములందు అవస్థానుసారము ఈ క్రింది ఔషధములు ప్రయోగింపవలెను.—ఆరోగ్య వర్ధనివటి, రసమాణిక్యము, హరతాళ భస్మము, హరతాళ పుష్పము, మంజిష్టాది తాళ సింధూరము, పీతల భస్మము.

## మండల కుష్ట చికిత్స

మండలకుష్టమునందు చిత్రకాది లేపమును ప్రయోగించి ఆతపమునందు కూర్చొనిన మండలకుష్టము భేదనమంది విలయమునందును.

---

1. చ.చి. 7/130, 100-101
2. చ.చి. 7/135
3. చ.చి. 7/80, 108-110, 124-125

ఏడగజాది లేపము, పల్గ్వాది లేపము, కిణ్వాద లేపము కుస్తుంబురాది లేపము, పూతీకరంజాది లేపము ఇవి మండల కుష్ఠమును శమింపచేయును.

కనక క్షీరి తైలము అభ్యంగము చేసిన మండలకుష్ఠము భేదనమగును. కృమి, కండు శమించును.[1]

## సిధ్మకుష్ఠ చికిత్స

సిధ్మకుష్ఠమునందు కుష్ఠాది లేపము చేయుచు ఆతప సేవనచేయుచు ఏడు రోజులు ప్రయోగించిన సిధ్మకుష్ఠము శమించును. ఈ ప్రయోగకాలమున స్నానము వర్జింపవలెను.

ఏడగజ లేపము, సర్జరసలేపము, మూలక బీజలేపము సిధ్మమును శమింప చేయును.[2]

## కృమిహర చికిత్సలు

కుష్ఠమునందు మాంసము కుళ్ళి పతనమగుచున్న కృములున్న నింబ క్వాథ సిద్ధతైలముతో పురాణ ముద్గయూషము ఆహారముగా ఇవ్వవలెను. లేక అర్కాది క్వాథము పానము చేయింపవలెను.

కృములచే భక్షింపబడిన అంగములకు కరవీరము విడంగము నూరి లేపము చేయవలెను. గోమూత్రముతో పరిషేకము చేయింపవలెను. అన్ని ఆహారములందు విడంగము కలిపి యిచ్చుచుండవలెను. కరంజాది తైలము ప్రయోగించుచు ఇతర దూషిత వ్రణోక్త చికిత్సలచే ఉపచరింపవలెను.[3] నింబ గోమూత్ర విడంగ క్వాథపాన స్నానాదులకు ప్రయోగింపవలెను.

---

1. చ.చి. 7/85-90, 112-116, 122, 123, 126
2. చ.చి. 7/117, 127
3. i) చ.చి. 7/157 ii) సు.చి. 9/51-53

ఉపదంశ ఫిరంగ విషజ త్వగ్వికారములందు హరితాల భస్మము, మల్ల భస్మము, తాలసింధూరము, మల్లసింధూరము, మల్లాదివటి మొదలగునవి ప్రయోగింపవలెను.

## కొన్ని శామక యోగములు

గంధక రసాయనము, నారసింహచూర్ణము, మంజిష్టాది చూర్ణము, బృహత్ మంజిష్టాది క్వాథము (శా.సం) —ఇవి అన్ని కుష్టములందును ప్రయోగింపవచ్చును.

కండును శమింపచేయు ఔషధములు—తాప్యాది లోహము, గంధక రసాయనము, ఆరోగ్య వర్ధనీవటి, ఖదిరారిష్ట, మంజిష్టాది క్వాథము. బాహ్యప్రయోగము: చర్మరోగ నాశక తైలము.

## పామా, కచ్చునందు ప్రయోగింపదగు ఔషధములు

—భల్లాతకావ లేహ్యము, హరిద్రా ఖండము. బాహ్యప్రయోగము-కరవీరాది తైలము, మరిచాది తైలము.

## దద్రు కుష్టమున ఔషధములు

గంధక రసాయనము,నారసింహ చూర్ణము, రాజశేఖర రసము-(ర.సా.సం) దద్రు, కిటిభ, మండల, పారి భద్రరసము (ర.సా.సం) ఆరోగ్య వర్ధని, ఖదిరారిష్ట. బృ. మరిచాదితైల బాహ్యప్రయోగము.

**కిటిభ కుష్టము**

భల్లాతకావ లేహ్యము, విడంగతండుల రసాయనము, గంధకరసాయనము చోప చిన్యాది చూర్ణము పంచతిక్త గుగ్గులు ఘృతము, ఆరోగ్యవర్ధనివటి మరచాది తైల బాహ్యప్రయోగము.

**కపాల కుష్టము (Leprosy) కాకణక కుష్టము (Nodulor Leprosy)**

గంధక రసాయనము, తాలకేశ్వర రసము, బృ. వాతర క్తాంతక లోహము తాళక భస్మము, కుష్టహరరసము.

చర్మ కుష్ట-శ్వేత కరవీరాది తైలములేక బృ. మరీచాది తైల అభ్యంగము

## శ్విత్రము

దారుణము, అరుణము (వారుణము) మరియు శ్విత్రము యొక్క పర్యాయములు.

కిలాసము లేక శ్విత్రము గూడా త్వగ్దోషమే అగుటచే కుష్ఠము యొక్క భేదముగా నుండును.

కుష్ఠమునకు కిలాసమునకు భేదమేమనగా కిలాసము చర్మమునకు మాత్రమే పరిమితమై యుండును. కిలాసము నందు స్రావము ఉండదు. కిలాసమున క్లేదము గాని క్రిములుత్పన్నమగుటగాని జరుగదు. కిలాసము సాధారణముగా త్రిదోష జనితముగా నుండును. అప్పుడప్పుడు ఏకదోషజముగను ద్వి దోషజముగను ఉండును.

వాతముచే జనించిన కిలాసము మండలాకారముగను, అరుణవర్ణముగను, కర్కశముగను ఉండి ఘర్షణచే పొట్టువలె రాలును.

పిత్తముచే జనించిన కిలాసము ఎర్రగను కమలపత్రమువలె నుండి దాహయుక్తముగాను, రోమములను నశింపచేయునదిగను ఉండును.

కఫముచే కలిగిన కిలాసము శ్వేతవర్ణముగను, స్నిగ్ధముగను, స్థూలచర్మముతోను కూడియుండి కండూయుక్తముగా నుండును.[1]

---

1 (i) దారుణం చారుణం శ్విత్రం కిలాసం నామభిస్త్రిభిః
విజ్ఞేయం త్రివిధం తచ్చ త్రిదోషం ప్రాయశశ్చ తత్
దోషే రక్తాశ్రితే రక్తం తామ్రం మాంససమాశ్రితే
శ్వేతం మేదః శ్రితే శ్విత్రం గురు తచ్చోత్తరోత్తరమ్
(చ.చి. 7/173-174)

(ii) సు.ని. 5 అ.

కా. (3)_19

కిలాసము రక్తము నాశ్రయించినచో రక్తవర్ణముగను, మాంసమును ఆశ్రయించినచో తామ్రవర్ణముగను మేదస్సు నాశ్రయించినచో పూర్తి శ్వేతవర్ణముగను ఉండును.

రక్తాశ్రితమున కన్న మాంసాశ్రిత శ్విత్రము, మాంసాశ్రితమున కన్న మేదో ఆశ్రిత శ్విత్రము ఉత్తరోత్తర కృచ్ఛ్ర సాధ్యములుగా నుండును.

## శ్విత్రములందు సాధ్యాఽసాధ్యత

శ్విత్రమునందు రోమములు శ్వేత లేక రక్త వర్ణములో మారకుండా యుండుట, తనువుగను, పాండు వర్ణములోను, ఉత్పన్నమయి స్వల్పకాలము మాత్రమే గడచినదిగను, నూతనమైనది, మధ్యలో కొంచెము ఉబ్బినది, శ్విత్రపు మండలములు ఒకదానితో ఒకటి కలువకుండా యున్నవి, అగ్నిచే దగ్ధమగుటచే కలిగినవిగానివి, ఇట్టివి సాధ్యముగా నుండును.

దీనికి విపరీతముగా ఒకదానితోనొకటి కలసిన మండలములు కలది, ఓష్ఠములు హస్తపాదతలములు, గుహ్యస్థలములు వీనియందు ఉత్పన్నమైనది, అగ్ని దగ్ధ వ్రణము నందు ఉత్పన్నమైనది, దీర్ఘకాలము క్రితము ఉత్పన్నమైనది, రోమములు ఎరుపుగా గాని శ్వేతవర్ణమునకు గాని మారినది, ఇట్టివి అసాధ్యములుగా నుండును.

అగ్ని దగ్ధముచే కలిగిన వ్రణమునకు మిథ్యోపచారములు చేసినను శ్విత్రము కలుగును.

శ్విత్రమునకు కారణములు - అప్రియములగు మాటలు చెప్పుట, దేవతలను గురువులను నిందించుట, విరుద్ధాహారములు పూర్వకృతపాపము- ఇవి శ్విత్రమునకు కారణములుగా నుండును.[1]

---

1 (i) యత్పరస్పరతోభిన్నం బహు యద్రక్తలోమవత్
యచ్చ వర్షగణోత్పన్నం తత్ శ్విత్రం నైవ సిధ్యతి (Contd....

## శ్విత్ర చికిత్స

శ్వేత కుష్ఠము నందు ప్రారంభమున వమన విరేచనముల ద్వారా బాగుగా శోధనము చేయించవలెను.

విరేచనమునకై మలపూ రసము (కాకోదుంబర) గుడముతో ఇవ్వవలెను. విరేచనమునకు పూర్వము బాగుగా స్నేహనము చేయింపవలెను. విరేచనానంతరము మూడు దినములు ఎండలో ఉండవలెను. దప్పిక కలిగినచో పేయను పానము చేయింపవలెను.

శ్విత్రము ఉన్న ప్రదేశమున స్ఫోటములు కలిగినచో కంటకములచే భేదనము చేసి లసీకను స్రవింపచేయవలెను.

పదునైదు దినములు నిరంతరము ఉదయమున మలపు, అసన, ప్రియంగు శతపుష్పాక్వాథముగాని లేక పలాశక్షారము ఫాణితముతో గాని పానము చేయింపవలెను.

ఖదిర జలమును పానము చేయవలెను. అన్ని విధములగు కుష్ఠ యోగములందు ఖదిరము చేర్చిన అవి శ్విత్రకుష్ఠహరములుగా నుండును.

---

అరక్తలామా తను యత్ పాణ్డు నాతిచిరోత్థితం
మధ్యావకాశే చోచ్ఛనం శ్విత్రం తత్సాధ్యముచ్యతే

(చ.చి. 7/175)

(ii) వచాంస్యపథ్యాని కృతఘ్నభావో నిన్దా సురాణాం (గురూణాః) గురుధర్షణంచ, పాపక్రియా పూర్వకృతం చ కర్మ హేతుః కిలాసస్య విరోధి చాన్నమ్ (చ.చి. 7/177)

(iii) చ.చి. 7/176

# క్షుద్రరోగములు

క్షుద్రరోగములు అని ఈ ప్రకరణములో వివరింపబడబోవు వ్యాధులకు ఈ నామకరణము చేయుటకు ఈ క్రింది కారణములు కావచ్చును.

**1.** క్షుద్రము అనగా స్వల్పము సంక్షిప్తము అను అర్థము వచ్చును. ఈ ప్రకరణమున వ్యాధుల వర్ణన అతి సంక్షేపముగా చేయబడుటచేతను, దోష దూష్యాది విస్తృత వివరణమివ్వక లఘువుగా వర్ణింపబడుట వలనను వీనికి క్షుద్రరోగములను పేరు వచ్చినది.

2. స్వల్పమైన హేతువులు, లక్షణములు చికిత్సలు కలిగిన వ్యాధులగుటచే వీనికి క్షుద్రరోగములను పేరు వచ్చియుండవచ్చును.

అయినను అగ్నిరోహిణి, వల్మీకము వంటి కొన్ని వ్యాధులు పై సామాన్య నిర్వచనమునకు విరుద్ధముగా అనేక హేతువులు లక్షణములు కలిగి సన్నిపాత జనితములుగా ఉన్నప్పటికిని ఛత్రిణోగచ్ఛన్తి న్యాయమునను గురించి అట్టి వ్యాధులు చాలా అల్పముగానుండి అత్యధికమైన సంఖ్యలో పై నిర్వచనము ననుసరించియే యున్నవి కాన యీ వివరణ సమంజసముగా తోచుచున్నది.

3. పరిశిష్ట రోగములు. ఏ యితర ప్రకరణమునందును చేప్పుటకు వీలు కాని వ్యాధులను ఇందు చేర్చుటచే ఇవి ప్రధానమైన వ్యాధులు కాకపోవుటవలన ప్రత్యేకముగా ఒక్కొక్క వ్యాధికి ఒక ప్రకరణము ఏర్పరచవలసినంత ఆవశ్యకత లేని వ్యాధులు అగుటవలనను వీనికి క్షుద్రవ్యాధులని నిర్దేశింపబడి యుండవచ్చునని కొందరి ఉద్దేశ్యము.

4. ఏ విధమైన తార్కిక వివరణను అనుసరింపక ఈ వ్యాధులకు పారి భాషిక సంజ్ఞగా "క్షుద్రరోగములు" అను నామకరణము జరిగియుండునని కొందరి ఉద్దేశ్యము.

5. క్షుద్ర అనగా భయంకరమైనది అనియు నీచమైనదనియు అర్థములు వచ్చును. అగ్నిరోహిణి వంటి భయంకర వ్యాధులు ఫలితము వంటి వదలని వ్యాధులు ఇందు వర్ణింపబడుటచే వీనికీ పేరు వచ్చినదని కొందరి మతము.

6. "క్షుద్రాణాం బాలానాం రోగిః" అని బాలురకు వచ్చు వ్యాధులు కనుక ఇవి క్షుద్రవ్యాధులనబడుచున్నవను ఒక అభిప్రాయము కలదు. కాని ఇందులో బాలుర వ్యాధులు ఒకటి రెంటికి మించిలేనందున ఈ అభిప్రాయము సమంజసముగా తోచుటలేదు.

పారిభాషిక సంజ్ఞగా ఈ "క్షుద్రరోగములు" అనబడు నామకరణ మివ్వ బడినదను అభిప్రాయమే సమంజసముగా కనిపించుచున్నది.[1]

## క్షుద్రరోగముల యొక్క సంఖ్య

చరకసంహితలో క్షుద్రరోగములకై ప్రత్యేకాధ్యాయము వర్ణింపబడలేదు. అయినప్పటికిని ఇతర సంహితాకర్తలచే క్షుద్రరోగ ప్రకరణములందు వర్ణింప బడిన వ్యాధుల యొక్క వర్ణన అచ్చటచ్చట వికీర్ణముగా కనిపించును.

సుశ్రుతుడు క్షుద్రరోగములను నలుబదినాలుగు భేదములుగా వివరించుచు సమాసముగా (సంక్షిప్తముగా) నలుబదినాలుగనియు వీని సంఖ్య అనంతముగా నుండవచ్చునని సూచించెను.

---

1. మాధవనిదాన 55/1 పై మధుకోశ వ్యాఖ్య.

వాగ్భటుడు ముప్పదిఆరు క్షుద్రరోగములను వర్ణించెను. సుశ్రుతునిచే వర్ణింపబడిన కొన్ని క్షుద్రరోగములకు వాగ్భటుడు నామకరణము మార్పు చేసెను. ఉదా: ఇంద్ర విద్ధమునకు విద్ధా అనియు అంధాలజీకి బదులు అలజీ మొ॥నవి. సుశ్రుతునిచే క్షుద్రరోగములుగా పేర్కొనబడిన కొన్ని వ్యాధుల వాగ్భటుడు ఇతర ప్రకరణములలో చేర్చెను. ఉదా: దారుణక, అరూంషిక– ఇవి శిరో రోగములలో చేర్చుట; పరివర్తిక, అవపాటిక– ఇవి గుహ్య రోగములలో చేర్చుట మొ॥నవి. కొన్ని సుశ్రుతుని క్షుద్రరోగములను వదిలివేసి ఏడు క్షుద్రరోగములను కొత్తగా చేర్చెను. అవి 1. గర్దభ 2. గన్ధనామా 3. రాజికా 4. ప్రసుప్తి 5. ఇరివేల్లిక 6. ఉత్కోఠ 7. కోఠ

మాధవకరుడు 43 క్షుద్రరోగములను వర్ణించెను. ఇతడు మసూరిక, విస్ఫోటములకు ప్రత్యేకాధ్యాయములు ఏర్పరచి వర్ణించెను. కొన్ని వాగ్భటోక్త, సుశ్రుతోక్త క్షుద్రరోగములను వదలివేసి నూతనముగా నీలిక, వరాహదంష్ట్ర అను రెండు వ్యాధులను క్షుద్రరోగములలో చేర్చెను.

భోజుడు మొదలగువారు మూషికాకర్ణ, ముష్కకోష, ఫలాక్ష మొదలగు క్షుద్రరోగములను కూడా వివరించినట్లు టీకాకారుల వలన తెలియుచున్నది.

## అజగల్లికా

లక్షణములు :

స్నిగ్ధస్పర్శతో కూడి చర్మముతో సమాన వర్ణము కలిగిన, గ్రథితముగను, వేదనారహితముగను ముద్గసన్నిభముగను కఫవాత దోషములచే ముఖ్యముగా బాలురకు కలుగు పిడక అజగల్లికా అనబడును.[1]

---

1 i) స్నిగ్ధా సవర్ణా గ్రథితా నీరుజా ముద్గసన్నిభాః కఫవాతోత్థితా జ్ఞేయా బాలానా మజగల్లికాః (సు.ని. 13/4)

ii) అ.హృ.ఉ.అ. 31/1

**చికిత్స :**

1. అజగల్లికలో ఆమావస్థయందు జలౌకచే రక్తమోక్షణము చేయించవలయును.

2. లేపములు

అ) శుక్తభస్మము, శుభ్రభస్మము, యవక్షారము జలముతో కలిపి మాటి మాటికి లేపనము చేయవలయును.

ఆ) శ్యామా, లాంగలీ పాఠాకల్కము లేక

ఇ) వృషమూల, విశాలా లేపము గాని చేయవలయును.

3. కఠిన అజగల్లికయందు ప్రతిసారణీయ క్షారము ప్రయోగింపవలయును.

4. నవీన కంటకారీ కంటకములచే వేధన చేయవలయును.

5. పక్వ అజగల్లికయందు వ్రణములందు చెప్పబడిన చికిత్సలు చేయవలయును.[1]

## యవప్రఖ్యా

కఫవాతముల ప్రకోపముచే మాంసము నాశ్రయించి యవాకారములో కఠినమైన గ్రథితమైన పిడక కలిగిన అది యవప్రఖ్యా అనబడును.[2]

---

1 i) తత్రాజగల్లికామామాం జలౌకోభిరుపాచరేత్ శుక్తిశుఘ్నీ యవక్షార కల్కైశ్చ లేపయేద్భిషక్ (సు. చి. 20/3)

ii) సు. చి. 20/4 iii) చక్రదత్త 55/1,-2.

2 i) యవాకారా సుకఠినా గ్రథితా మాంససంశ్రితా
పిడకా కఫవాతాభ్యాం యవప్రఖ్యేతి సోచ్యతే (సు.చి. 13)

ii) అ.హృ.ఉ. 31

**చికిత్స :-**

1. ప్రారంభమున స్వేదనము చేయించవలయును.

2. లేపము—మణిశిల, తాళకము, కుష్ఠ, దేవదారు వీని కల్కము లేపనము చేయవలెను.

3. పాకానంతరము భేదనము చేసి వ్రణమువలె చికిత్సింపవలెను.[1]

## అన్థాలజీ

**లక్షణములు :-**

కఫము మరియు వాతము ప్రకోపించుటచే ఘనముగా, స్థూలముగా ఆపు ముగా పుఖ రహితముగా ఉన్నతముగా ఉబ్బెత్తుగా మండలా కారముగా అల్ప పీడాయుక్తముగా నుండు పిడక కలిగిన దానిని అన్థాలజీ అందురు.

వాగ్భటుడు దీనిని అలజీ అని పేర్కొనెను.[2]

చికిత్స-యవప్రఖ్యకు చెప్పబడినట్లుపచరింపవలెను.

## వివృతా

**లక్షణములు :-**

పిత్తముచే తెరుచుకొనిన ముఖము కలిగి అధిక దాహముతో పక్వ ఉదు

---

1. i) అన్థాలజీం యవప్రఖ్యాం పనసీం కచ్ఛపీం తథా పాషాణగర్దభం చైవ పూర్వం స్వేదేన యోజయేత్ మనశ్శిలా తాలకుష్ఠదారుకల్కైః ప్రలేపయేత్ పరిపాకగతాన్భిత్త్వా వ్రణవత్సముపాచరేత్ (సు.చి. 20/5-6)
   ii) అ.హృ.ఉ. 32/1
2. i) ఘనామవక్త్రాం పిడకామున్నతాం పరిమండలామ్ అంథాలజీమల్పపూయాం తాం విద్యాత్ కఫవాతజామ్ (సు.ని.అ. 13)
   ii) అవక్త్రాం చాలజీ వృత్తాస్తోకపూయాఘనోన్నతా (అ.హృ.ఉ.అ. 31)

బరము వంటి గుండ్రని జ్వరముతో కూడిన పిటక జనించిన విప్రుతా యన బడును.[1]

**చికిత్స :-**

1. పిత్తజ విసర్పమునందు చెప్పబడిన విధముగా ఉపచరింపవలెను.

2. మధురౌషధ సిద్ధఘృతముతో రోపణము చేయవలయును.[2]

## కచ్ఛపికా

**లక్షణములు :-**

కచ్ఛప పృష్ఠమువంటి ఉబ్బెత్తుగను, కఠినముగను ఉండు గ్రంధులవలె నుండు పిడకలు ఐదు లేక ఆరు కఫవాతములచే జనించిన కచ్ఛపిక అనబడును.[3]

---

1. i) వివృతాస్యాం మహాదాహాం పక్వోదుమ్బరసన్నిభామ్ వివృతామితి తాం విద్యాత్ పిత్తోత్థాం పరిమండలామ్ (సు.ని.అ. 13)
   ii) పిత్తేన పిటికా వృత్తాపక్వోదుంబర సన్నిభా మహాదాహజ్వరకరీ వివృతా వివృతాననా (అ.హృ.ఉ.అ. 31)

2. i) వివృతా మింద్రవృద్ధాం చ గర్ధభీం జాలగర్ధభమ్ ఇరివిల్లాం గన్ధనామ్నీం కక్షాం విస్ఫోటకాం స్తథా పిత్తజస్య విసర్పస్య క్రియయా సాధయేద్భిషక్ రోపయేత్సర్పిషా పక్వాసిద్ధేన మధురౌషధైః (సు.చి. 20/7-8)
   ii) అ.హృ.ఉ. 32/5

3. i) గ్రంథయః పంచ వా షడ్వా దారుణాః కచ్ఛపోన్నతాః కఫానిలాభ్యాము ద్భూతాం విద్యాత్తం కచ్ఛపమితి (సు.ని. 13)
   ii) గ్రంథయః పంచ వా షడ్వా కచ్ఛపీ కచ్ఛపోన్నతాః (అ.హృ.ఉ. 31)

చికిత్స :-

1. రక్తమోక్షణము
2. స్వేదనము
3. అపతర్పణము
4. లేపము-శిగ్రు దేవదారు కల్కముతో లేపనము చేయవలయును.[1]
5. యవప్రఖ్యయందు చెప్పబడిన చికిత్సలు చేయవలయును.

## వల్మీకము

హస్త, పాదతలములందు, సంధులందు, గ్రీవమునందు లేక జత్రూర్ధ్వ ప్రదేశమునందు కఫము పిత్తముల వలన (వాగ్భటానుసారము సన్నిపాతముచే) అనేక శిఖరములతో కూడి ఎత్తుగా వల్మీక ఆకారములో నుండి గ్రంధి మెల్ల మెల్లగా వృద్ధిచెందుచూ తోద, క్లేదము, దాహము, కండూలతో కూడి ముఖము (రంధము)తో కూడియున్నచో అట్టి గ్రంధి వల్మీకమని అనబడును.[2]

చికిత్స :-

1. శస్త్ర చికిత్స-వల్మీకమును శస్త్రముతో ఛేదించి క్షారముతోగాని అగ్నితో గాని దహింపవలెను.

---

1. i) రక్తావసేకైర్బహుభిః స్వేదనైరపతర్పణైః జయేద్విదాదారికాం లేపః శిగ్రుదేవద్రుమోద్భవైః పానసికాం కచ్ఛపికామనేన విధినా భిషక్ (చ.ద. 55/5.6)
   ii) సు.చి. 20/5-6
2. i) పాణి పాదతలే సంధౌ గ్రీవాయామూర్ధ్వజత్రుణి గ్రంధివంల్మీకవధ్యస్తు శనైః సముపచీయతే॥ తోద క్లేద పరీదాహకండూమద్భిర్వణైర్వృతః వ్యాధి ర్వల్మీక ఇత్యేష కఫపిత్తానిలోద్భవః (సు.ని. 13)
   ii) అ.సం.ఉ. 36

2. శోధన, రోపణలు-అర్బుద చికిత్సలందు చెప్పబడిన విధిననుసరించి వ్రణమును శోధించి రోపణ క్రియలు చేయవలయును.

3. అతివృద్ధిని పొందిన వల్మీకములను మర్మస్థానమునందు లేనిచో ఈ క్రింద విధముగా ఉపచరింపవలెను.

అ) సంశోధనము

ఆ) రక్తమోక్షణము

ఇ) కుళుత్థాది ఉపనాహము కట్టవలెను.

ఈ) పాకమును పొందినట్లు నిర్ణయించి ఛేదనముచేసి దాహకర్మచేయ వలయును.

ఉ) దూషిత మాంసమును శోధనచేసి ప్రతిసారణ క్షారము ప్రయోగించి వ్రణమును శోధనమైన తర్వాత రోపణక్రియలు చేయవలయును.

ఊ) రోపణము కొరకై నింబతైలము ప్రయోగింపవలయును.[1]

## వల్మీకమునందు అసాధ్య లక్షణములు

బాగుగా వృద్ధినొందినది, అనేక ఛిద్రములతో కూడినది, పాణి పాదములందు జనించినది, మర్మలందు జనించినది, శోధతో కూడినది అగు వల్మీకము అసాధ్యము కనుక వర్జింపవలెను.[2]

---

1. i) శస్త్రేణోత్కృత్య వల్మీకం క్షారాగ్నిభ్యాం ప్రసాధయేత్ విధానేనార్బుదోక్తేన శోధయిత్వా చ రోపయేత్ వల్మీకంతు భవేద్యస్య నాతివృద్ధమమర్మజమ్ తత్రసంశోధం కృత్వా శోణితం మోక్షయేద్భిషక్
(సు. చి. 20/48-49)

ii) సు.చి. 20/50-56 iii) చ.ద. 55/9-10

2. i) పాణిపాదోపరిష్టాత్తు ఛిద్రైర్బహుభిరావృతమ్ వల్మీకం యత్సశోఫం స్యాద్వర్జ్యం తత్తు విజానతా (సు.చి.20/56)

ii) ప్రవృద్ధం సుబహుచ్ఛిద్రం మర్మణిస్థితమ్ వల్మీకం హస్తపాదే చ వర్జయేత్ (అ.హృ.ఉ.32/8)

## ఇంద్ర విద్ధము

**లక్షణములు :-**

పద్మపుష్కర మధ్య సదృశమైన పిటక జనించి అట్టి అనేక పిటకలతో కూడి వాత పిత్త ప్రకోపముచే జనించిన అది ఇంద్ర విద్ధము అనబడును. (వాగ్భట-విద్ధ అని పేర్కొనెను.[1] కఫవాతజమనెను.)

చికిత్స - విపృతాకు చెప్పిన విధముగా ఉపచరింపవలయును.

## పనసికా

**లక్షణములు :-**

కర్ణమునకు పైనగాని, అన్ని వైపులాగాని, లేక పృష్ఠమునగాని కఫ వాతములచే తీవ్రవేదనాయుక్తమైన కమల కందమువంటి ఆకారముగల పిడక జనించిన అది పనసికా అనబడును.[2]

చికిత్స - కచ్ఛపికాకు చెప్పబడిన విధముగా ఉపచరింపవలెను.

## గర్దభికా

**లక్షణములు :-**

గుండ్రముగను, గోళాకారములోను, ఎత్తుగను కొంచెము రక్తవర్ణములో

---

1. i) పద్మపుష్కరవన్మధ్యే పిడకాభిఃసమాచితామ్ ఇంద్రవిద్ధాం తు తాం విద్యా ద్వాతపిత్తోత్థితాం భిషక్ (సు.ని. 13)
   ii) యా పద్మకర్ణికాకారా పిటికా పిటికాచితా సా విద్ధా కఫవాతాభ్యాం (అ.సం.ఉ. 36)
2. i) కర్ణోపరిసమంతా ద్వాపృష్ఠే నా పిడకోగ్రరుక్ శాలూకవత్ పనసికా తాం విద్యాచ్ఛ్లేష్మ వాతజం (సు.ని. 13)
   ii) అ.సం.ఉ. 36

ఉండి వేదనతో కూడిన పిటకలతో నిండిన మండలము వాతపిత్తములచే జనించి అది గర్దభికా అనబడును.[1] వాగ్భటుడు దీనిని గర్దభీ అని పేర్కొనెను.

చికిత్స :- వివృతాకు చెప్పిన విధముగా చికిత్సింప వలయును.

## పాషాణ గర్దభము

లక్షణములు :-

హనుసన్ధియందు కఫ వాతములచే అల్పవేదనతో కూడిన కఠినమైన శో( జనించిన అది పాషాణ గర్దభము అనబడును.[2]

చికిత్స :-

యవప్రఖ్యకు చెప్పబడిన విధముగా చికిత్సింపవలెను.

## జాల గర్దభము

లక్షణములు :-

విసర్పమువలె ప్రసరించునదియు, పాకరహితముగానుండి దాహముతో స

---

1. i) మండలం వృత్తముత్పన్నం సరక్తం పిడకాచితమ్ రుజాకరీం గరాభ్ని కా( తాం విద్యాద్వాతపిత్తజాం (మా.ని. 55/9

   ii) తాభ్యామేవ చ గర్దభీ మండలావిపులోత్సన్నా సరాగపిడకాచితా (అ.హృ.ఉ. 31

2. i) హనుసంధౌ సముద్భూతం గోధమల్పరుజం స్థిరమ్ పాషాణగర్దభం విద్యాద్బలాస పవనాత్మకమ్ (సు.ని. 13

   ii) అ.హృ.ఉ. 31

జ్వరముతోను కూడిన తను శోధ పిత్తముతో జనించిన అది జాలగర్దభము అనబడును.[1]

చికిత్స :-

1. లంఘనము
2. రక్త మోక్షణము
3. రూక్షణము
4. శోధనము
5. ధాత్రీ ప్రయోగము
6. శీతల ప్రదేహములు—వీనితో ఉపచరింపవలెను.[2]

సుశ్రుతుడు విసృతాకు చెప్పిన చికిత్సలనే చేయవలెనని పేర్కొనెను.[3]

## ఇరి వేల్లకము

లక్షణములు :-

శిరస్సునందు మూడు దోషములు ప్రకోపించుటచే వృత్తముగను, ఉగ్ర

---

1. i) విసర్పవత్ సర్పతి యోదాహ-జ్వరకరస్తనుః అపాకః శ్వయధుః పిత్తాత్ సజ్ఞేయో జాలగర్దభః (సు.ని. 13)
   ii) దోషైః పిత్తోల్బణౌర్మందౌర్విసర్పతి విసర్పవత్ శోధో ఽపాకస్తనుస్తామ్రో జ్వరకృజ్జాలగర్దభః (అ.సం.ఉ. 36)
2. విలంఘనం రక్తవిమోక్షణం చ విరూక్షణం కాయవిశోధనం చ ధాత్రీప్రయోగాన్ శిశిర ప్రదేహాన్ కుర్యాత్సదా జాలకగర్దభస్య (అ.హృ.ఉ. 32/6)
3. సు.చి. 20/7-8.

వేదనతోను, జ్వరముతోను కూడిన పిడక జనించిన అది ఇరివేల్లికము అన బడును.[1]

చికిత్స :-

విస్ఫోటా యందు వివరించిన విధముగా చికిత్సింపవలెను.

కక్షా

లక్షణములు :-

బాహు పార్శ్వమున కక్ష (చంక) యందు పిత్త ప్రకోపముచే వేదనతో కూడిన నల్లని పిటకలు జనించిన అది కక్షయనబడును. సూక్ష్మమైన లాజలవంటి పిటకలు కక్ష సమీపమున వాత పిత్తములచే జనించునని వాగ్భటుడును, యజ్ఞోప వీతమువలె వాతపిత్తములచే పిడకలు అనేకము జనించునని చరకుడును వర్ణిం చిరి.[2]

హెర్పస్ జోష్టర్ (Herpes Zoster) అను వ్యాధియందు ఈ విధమైన లక్షణములు కలుగును. ఇది ఒక వైరస్ వలన కలుగు వ్యాధి. నాడీ తంతువులను దూషింప చేయు పిటకలు వరుసగా జనించి వేదనను నాడీ వేదనను కలిగించును జ్వరము ప్రారంభములో ఉండును.

---

1. i) పిడకా మృత్తమాంగస్థా వృత్తాముగ్రరుజా జ్వరామ్ సర్వాత్మికాం సర్వలింగాం జానీయాదిరివేల్లికామ్ (సు.ని. 13)
   ii) త్రిలింగం పిటికావృత్తా జత్రూర్ధ్వమిరివేల్లికా (అ.సం.ఉ. 36)
2. i) బాహుపాశ్వసి కక్షాసు కృష్ణాస్ఫోటాం సవేదనామ్ పిత్తప్రకోపా సంభూతాం కక్షామితి వినిర్దిశేత్ (సు.ని. 13)
   ii) కక్షేతి కక్షాసన్నేషుప్రాయోదేశేషు సాఽనిలాత్ పిత్తాద్భవంతి పిటికా సూక్ష్మ లాజోపమా ఘనాః (అ.హృ.ఉ. 31)
   iii) యజ్ఞోపవీత ప్రతిమాః ప్రభూతాః పిత్తానిలాభ్యాం జనితాస్తు కక్షాః (చ.చి. 12)

చికిత్స :—

వివృతాకు చెప్పబడిన చికిత్సలు చేయవలెను.

## విస్ఫోటకము

వేరుగా వివరముగా వర్ణింపబడినది.

## అగ్నిరోహిణి

లక్షణములు :-

మూడు దోషముల యొక్క ప్రకోపముచే కక్షమునందు అగ్నితో కాలినపుడు కలుగు బొబ్బవంటి అంతర్దాహము జ్వరముతో కూడిన దారుణమైనబొబ్బ జనించిన అగ్నిరోహిణి అనబడును. ఈ వ్యాధి అసాధ్యముగా నుండును. ఐదు ఏడు, పది, లేక పదిహేను రోజులలో మనుజుని చంపును.[1]

ఈ వ్యాధి ప్లేగు వ్యాధి వంటిది కావచ్చును.

చికిత్స :-

అసాధ్యమగుటచేత దుస్తరమని చెప్పి వివృతాకు చెప్పబడిన చికిత్సలే చేయు చుండవలయును.[2]

---

1. i) కక్షాభాగేషు స్ఫోటో జాయంతే మాంసదారణాః అంతర్దాహ జ్వరకరా దీప్తపావకసన్నిభాః సప్తాహాద్వా దశాహాద్వా పక్షాద్వాఘ్నంతి మానవమ్ తామగ్నిరోహిణీం విద్యాదసాధ్యాం సన్నిపాతతః (సు.ని. 13)

   ii) మలైః పిత్తోల్బణైః స్ఫోటా జ్వరిణో మాంసాదారణాః కక్షాభాగేషు జాయంతే యోఽగ్నియాభాః సాఽగ్నిరోహిణీ॥ పంచాహాత్ సప్తరాత్రాద్వా పక్షాద్వా హంతి జీవితం (అ.సం.ఉ. 36)

2. పిత్తవిసర్పవత్తద్వత్ప్రత్యాఖ్యాయాగ్ని రోహిణీమ్ (అ.హృ.32/5)

## గన్ధనామా

లక్షణములు :-

పిత్త ప్రకోపముచే చర్మముపై కక్షయందు చెప్పబడిన విధముగా వేదనా యుక్తమైన బొబ్బవంటి పిటక ఒక్కటియే జనించిన అది గన్ధనామా అనబడును[1]

చికిత్స :-

వివృతాకు చెప్పబడిన చికిత్సలు చేయవలెను.

## చిప్పరోగము

లక్షణములు :-

పిత్తము వాతము ప్రకోపించి నఖము యొక్క మాంసమును ఆశ్రయించి దాహము పాకముతో కూడిన శోధను కలిగించును. ఈ వ్యాధిని చిప్పము, ఉపనఖము, లేక అక్షతము అందురు.[2]

ఇది విట్లో (Whitlow) అనబడును.

చికిత్స :-

1. ఉష్ణ జలముచే సేకము చేయించవలయును.

---

1. i) ఏకమేవం విధాం దృష్ట్వా పిటికాంస్ఫోటసంనిభామ్ త్వగ్గతాం పిత్తకోపేనగంధనామాం ప్రచక్షతే (సు.ని. 13)
   ii) తాదృశీ మహతీ త్వేకాగంధనామేతి కీర్తితా (అ.సం.ఉ. 36)
2. i) నఖమాంసమధిష్ఠాయ పిత్తం వాతశ్చవేదనామ్ కరోతి దాహపాకౌ చతఃవ్యాధిం చిప్పమాదిశేత్ తదేవాక్షతరోగాఖ్యం తథోపనఖలిత్యపె (సు.ని. 13)
   ii) కుర్యాత్ పిత్తానిలం పాకం నఖమాంసేసరుగ్జ్వరమ్ చిప్పమక్షతరోగం చ విద్యాదుపనఖం చ తమ్ (అ.సం.ఉ. 36)

2. దూషిత మాంసము ను ఛేదించి రక్తమోక్షణమును చేయించవలయును.
3. చక్రతైలము లేపనముచేసి సర్జ చూర్ణమును చల్లి బంధనము చేయవలయును.
4. ఈ క్రియలచే శమించనిచో సిద్ధ తైలముల తో రోపణము చేయవలెను.[1]
5. లేపములు—(అ) కృష్ణ లోహపాత్రలో హరిద్రా స్వరసముతో నూరిన అభయా కల్కము తయారుచేసి దానిని పునః పునః లేపనము చేయవలెను.

(ఆ) టంకణముతో ఆస్ఫోతా మూలమును నూరి లేపనము చేసినను చిప్ప రోగము శమించును.[2]

6. శోధనములు చేయించి ఉష్ణము శమించిన తదుపరి శస్త్రకర్మ చేయవలెనని వాగ్భటమతము.[3]

## కునఖము

**లక్షణములు :-**

అభిఘాతముచే నఖము దూషింపబడినచో రూక్షముగను, కర్కశముగను నలుపుగను అయినచో దానిని కునఖము అందురు.[4]

---

1. చిప్పముష్ణాంబు నాసిక్తముత్కృత్య స్రావయేద్భిషక్ చక్రతైలేనచాభ్యజ్య సర్జచూర్ణేన చూర్ణయేత్ బద్ధేనోపచరేచ్ఛైన మశక్యం వహ్నినాదహేత్ మధురౌషధసిద్ధేనతతస్తైలేన రోపయేత్ (సు.చి. 20/9-10)
2. చ.ద. 55/20
3. చిప్పంశుద్ధ్యా జితోష్మాణాం సాధయేచ్ఛస్త్రకర్మణా (అ.హ.ఉ. 32/12)
4. i) అభిఘాతాత్ ప్రదుష్టోయోనఖో రూక్షోఽసితాఽఖరః భవేత్తం కునఖం విద్యాత్ కులీనమితి సంజితమ్ (సు.ని. 13)
 ii) అ.సం.ఉ. 66

చికిత్స :-

చిప్పమునకు చెప్పబడిన చికిత్సలు చేయ వలయును. టంకణ లేపనము, శుష్క టంకణ చూర్ణము నఖాంతరమున పూరించుట విశేష గుణకారులుగా నుండును.[1]

## అ ను శా యి

లక్షణములు ;

కఫ ప్రకోపముచే గంభీరధాతువులందు స్వల్పమైన శోధముతో కూడి చర్మమునకు సమానమైన వర్ణములలో పై భాగమునను అభ్యంతరభాగమున పాకము చెందునదిగను ఉండు పిటక జనించిన అది అనుశాయి అనబడును.[2]

కఫజ విద్రధికి చెప్పబడిన విధముగా చికిత్సింపవలెను.[3]

## వి దా రి కా

లక్షణములు :

మూడు దోషములను ప్రకోపించుటచేత కక్షయందు వంక్షణసంధులందు విదారీ కందమువంటి వృత్తాకారముగను రక్తవర్ణముగను ఉండి త్రిదోషలక్షణము లతో కూడిన గ్రంధి జనించును. ఈ వ్యాధిని విదారికా అందురు.[4]

---

1. భై.ర.
2. గంభీరామల్పసంరంభాం సవర్ణాముపరిస్థితామ్ కఫాదంతః ప్రపాకాం తాం విద్యాదనుశయీం భిషక్ (సు.ని. 13/22)
3. ఉపచరేదనుశాయీ శ్లేష్మవిద్రధివ ద్భిషక్ (సు.చి. 20/11)
4. i) విదారీకందవద్వృత్తాం కక్షావంక్షణసంధిషు రక్తాం విదారికాం విద్యాత్ సర్వజాం సర్వలక్షణామ్ (సు.ని. 13)
   ii) అ.సం.ఉ. 36

కఫవాతములచే జనించి జ్వర సహితముగా నుండునని చరకుని మతము.[1]

చి కి త్స :

1. స్వేదనము, అభ్యంగము, విమ్లాపనము చేయవలెను.
2. లేపములు—నాగవృత్తిక, పునర్నవ, బిల్వమూల కల్కలేపము.
3. వ్రణరూపము చెందిన సంశోధనము, రోపణార్థము మధురక ద్రవ్య సిద్ధ తైల ప్రయోగము.
4. రక్తమోక్షణము—అపక్వ విదారికా యందు ప్రచ్ఛనము ద్వారాగాని జలౌక ద్వారాగాని రక్తమోక్షణము చేయించవలయును.
5. లేపనము - అజకర్ణ, పలాశమూల కల్కము లేపనము చేయవలెను.
6. పక్వము చెందిన విదారికను శస్త్రముతో విదారణముచేసి పటోల, నింబ తిలకల్కమునందు ఘృతముకలపి లేపనముచేసి బంధనము చేయ వలెను.
7. క్షీరవృక్షత్వక్, ఖదిర క్వాథము—వ్రణప్రక్షాలనకుపయోగించి శోధన చేయవలెను.
8. రోపణ క్రియలచే ఉపచరింపవలెను.[2] శ్లేష్మగ్రంధివలె చికిత్సింప

---

1. జ్వరాన్వితా వంక్షణ కక్షణాయామావర్తిస్నిరక్తిః కఠినాఽఽయతా చ విదారికా సా కఫమారుతాభ్యాం (చ.చి. 22)

2. విదారికాం సముద్వీక్ష్య స్విన్నాం విమ్లాప్యలేపయేత్ నగవృత్తికవర్షాభూ బిల్వమూలైః సువేషితైః వ్రణభావంగతాయాం వా కృత్వా సంశోధన క్రియామ్ రోపణార్థం హితం తైలంకషాయమధురైశ్శృతమ్ ప్రచ్ఛనైర్వా జలౌకాభిః స్రావ్యాఽపక్వా విదారికా అజకర్ణస్యపాలాశైర్మూల కల్కైః ప్రలేపయేత్ పక్వాం విదార్య శస్త్రేణ పటోల పిచుమందయోః కల్కేన తిలయుక్తేన సర్పిష్మత్రేణ లేపయేత్ బద్ధ్వా చ క్షీరవృక్షస్య కషాయైః ఖదిరస్య చ వ్రణం ప్రక్షాలయేచ్ఛుద్ధం తతస్తాం రోపయేద్బుధః (సు.చి. 20/12-16)

వలెనని వాగ్భటాభిప్రాయము[1] అపతర్పణ చికిత్సలు చేయవలెనని చక్రదత్తుని మతము.[2]

## శర్కరార్బుదము

ప్రకోపించిన కఫవాతములు మాంసము, సిరా, స్నాయువులు, మరియు మేదస్సును పొంది దానిని దూషింపచేసి గ్రంథిని కలిగించును. ఆ గ్రంథి పాకము చెందినపుడు పగిలి దానినుండి మధు, ఘృతము, వసలవంటి స్రావము కలుగును. అట్టి ధాతుక్షయముచే వృద్ధ (ప్రకోపము) పొందిన వాతము మాంసమును శోషింపచేసి గ్రథితముచేసి శర్కరను (శర్కరవంటి స్థితిని) ఉత్పన్నము చేయును. క్లిన్నమై దుర్గంధయుక్తమైన నానావర్ణములతో కూడిన రక్తము సిరల ద్వారా స్రవించును. ఈ వ్యాధిని శర్కరార్బుద మందురు.[3]

చికిత్స :

మేదోజ అర్బుదమున చెప్పబడిన చికిత్సలచే ఉపచరింపవలెను.[4]

---

1. అ.హృ.ఉ. 32/7
2. చ.ద. 55/6
3. i) ప్రాప్యమాంససిరాస్నాయుః శ్లేష్మా మేదస్తథాఽనిలః గ్రంథింకుర్వంతి భిన్నో ఽ క్నామధుసర్పిర్వసానిభమ్ స్రవత్యాస్రావమత్యర్థ తత్రవృద్ధి గతోఽనిలః మాంసం విశోష్య గ్రథితాం శర్కరాం జనయేత్ పునః దుర్గంధం క్లిన్నమత్యర్థం నానావర్ణం తతః సిరాః స్రవంతి సహసారక్తం తద్విద్యా చ్ఛర్కరార్బుదమ్ (సు.ని. 13)
   ii) అ సం.ఉ. 35
4. మేదోఽర్బుదవిధానేన సాధయేచ్ఛర్కరార్బుదమ్ (సు.చి. 20/17)

## పామా, విచర్చిక, రకస

ఈ వ్యాధులు కుష్ఠ ప్రకరణము నందు వివరింపబడినవి.

చికిత్సలు :

ఈ వ్యాధుల చికిత్స కుష్ఠోక్త విధిననుసరించి చేయవలయును.

ఈ క్రింది లేపములు ప్రయోగింపవలెను.

1. మధూచ్ఛిష్టము, శతాహ్వా, గౌరసర్షప లేపము.

2. వచా, దార్వీసర్షప లేపము.

3. కరంజ తైలము.

4. కటుద్రవ్య (పిప్పల్యాదిగణ ద్రవ్య) సిద్ధసార తైలము.

వీనిలో తగిన లేపనము ప్రయోగించిన హితకరముగా నుండును.[1]

## పాదదారీ

లక్షణములు :

అధికముగా తిరుగుచుండుటవలన ప్రకోపించిన వాతము అత్యంత రూక్షత్వమును పొందిన పాదతలమునందు వేదనతోకూడిన పగుళ్ళను కలిగించును. ఈ స్థితిని పాదదారీ అందురు. ఇది రేగడ్స్ (Rhagades)కు తుల్యముగా నుండును.[2]

---

1. i) కచ్ఛూం విచర్చికాం పామాం కుష్ఠవత్సముపాచరేత్ లేపశ్చ శస్యతే సిక్థ శతాహ్వాగౌరసర్షపైః (సు.చి. 20/17)
   ii) సు చి. 20/18
2. పరిక్రమణశీలస్య వాయురత్యర్థరూక్షయోః పాదయోః కురుతే దారీం సరుజాం తలసంశ్రితామ్ (సు.ని. 13)

చి కి త్స :

1. పాదమునందలి సిరను వేధనముచేసి అశుద్ధ రక్తమును స్రవింప చేయ వలెను.

2. స్నేహ స్వేదములు చేయవలెను.

3. లేపములను అభ్యంగమును చేయవలెను.[1]

అ) మధూచ్ఛిష్టమ్యు వస, మజ్జ, సర్జచూర్ణము, ఘృతము యవక్షారము, గైరికము కలిపి లేపనము చేయవలెను.

ఆ) సర్జరసము, సైంధవలవణము, మధు, ఘృతము కటుతైలముతో కలిపి మర్దించిన పాదదారి శమించును.

ఇ) ఉపోదికాది క్షారతైల లేపనము (చక్రదత్త).

ఈ) గుడ, లవణ, ఘృత, తింతిడీకమూల ద్విగుణ గోమూత్రంతో మర్దించి లేపనము చేసిన విపాదిక, పాదదారిశమించును. (భై.ర)

## క ద ర ము

లక్షణములు :

పాదతలమునందు రాళ్ళు, ముళ్ళు మొదలగు వానిచే అభిఘాతము కలిగి నపుడు మేదస్సు మరియు రక్తగత దోషములచే కీలమువంటి మధ్యలో ఉబ్బెత్తుగ

---

1. i) పాదదారీషు చ సిరాం వ్యధయేత్తలశోధనమ్ స్నేహస్వేదోపపన్నౌ తు పాదౌచాలేపయేన్ముహుః మధూచ్ఛిష్టవసామజ్జఘృతక్షారైర్విమిశ్రితైః (చ.ద. 55/11)

ii) సు.చి. 20/19-20)

గానీ లేక నిమ్నముగా గాని ఉండి కఠినముగను, స్రావవేదనలతో కూడినదిగను ఉన్న చిన్నదగుబదర సమానగ్రంధి ఉత్పన్నమగును. దీనిని కదరము అందురు[1]

ఈ వ్యాధి ఆనె (Corn) అనబడును.

చి కి త్స :

శస్త్రముచే ఛేదించి అన్నితప్త తైలముచే దగ్ధకర్మ చేయవలెను.[2]

## అ ల స క ము

దూషితమైనటువంటి కర్దమము (బురద) యొక్క స్పర్శవలన పాద అంగుళులకు మధ్యలో కండు, దాహము వేదనలతో కూడా క్లేదము (పాసినట్లు గుట) కలుగును. దీనిని అలసకము అందురు.[3]

ఈ స్థితి చిలిబ్లైన్ (Chiliblain) కు తుల్యముగా నుండును.

చికిత్స :

పాదమును కాంజికముతో బాగుగా ప్రక్షాళనముచేసి నింబ, తిల, కాసీస, తాళక, సైంధవ-వీనికల్కమునుగాని లేక లాక్షారసము హరీతకీ కల్కము కలిపిన

---

1. శర్కరోన్మథితే పాదేక్షతే వా కంటకాదిభిః మేదో రక్తానుగౌశ్చైప దోషైర్వాజాయతే నృణామ్ సకీలకఠినో గ్రంధిర్నిమ్నమధ్యోన్నతోఽపివా కీలమాత్రఃసరుక్ స్రావీజాయతే కదరస్తు సః (సు.ని. 13)
   ii) అ.సం.ఉ. 36
2. i) ఉద్ధృత్యదగ్ధ్వాస్నేహేనజయేత్కదర సంజ్ఞకమ్ (సు.చి. 20/23)
   ii) అ.హృ.ఉ. 32/11
3. i) క్లిన్నాంగుల్యంతరౌ పాదౌ కండూదాహరుగన్వితౌ దుష్టకర్దమ సంస్పర్శాదలసం తం వినిర్దిశేత్ (సు.ని. 13)
   ii) అ.సం.ఉ. 36

లేపనమును గాని ప్రయోగింపవలయును. రక్తమోక్షణము చేయించవలయును. కంటకారీ రససిద్ధ సర్షపతైల ప్రయోగము చేయవలెను. కాసీసము, గోరోచనము మణిశిల-వీని చూర్ణములతో అవచూర్ణనము చేయవలెను.[1]

పటోలాదిలేపము లేక కరంజ బీజాదిలేపనము చేయింపవలెను.[2]

## ఖాలిత్యము - ఇంద్రలుప్తము

**లక్షణములు :**

శిరస్సునందలి రోమకూపములందు దూషిత పిత్తము వాతముతో కలసి చేరి కేశములను రాలిపోవునట్లు చేయును. తదుపరి రక్త సహితమైన కఫము రోమకూపములను అవరోధింపచేయును. అందుచే కేశములు ఉత్పన్నము కాలేవు. అట్టి వ్యాధిని ఇంద్రలుప్తమనియు, ఖాలిత్యమనియు రుహ్యా అనియు అందురు.[3]

ఇంద్రలుప్తము అనగా బట్టతల లేక ఎలోపెషియా (Alopecia) అనబడును.

---

1. i) పాదౌ సిక్త్వాఽఽరనాళేన లేపనం హ్యాలసేహితమ్ కల్కీకృత్తై ర్నింబ తిలకాసీసా తైస్సైంధవైః లాక్షారసోఽభయావాపికార్యం స్యాద్రక్త మోక్షణమ్ (సు.చి. 20/21)
   ii) సు.చి. 20/22
2. చ.ద. 55/14-17
3. i) రోమకూపానుగం పిత్తం వాతేన సహమూర్ఛితమ్ ప్రచ్యావయతి రోమాణి తతః శ్లేష్మా సశోణితః రుణద్ధి రోమకూపాంస్తుతతోఽన్యేషామసంభవః తదింద్రలుప్తం ఖాలిత్యం రుహ్యేతి చ విభావ్యతే (సు.ని. 13)
   ii) అ.సం.ఉ. 27

చికిత్స :

స్నేహనము, స్వేదనము చేయించి సిరావ్యధనము ద్వారా రక్తమోక్షణము చేయింపవలెను. రక్తమోక్షణానంతరము క్రింద చెప్పబడు లేపములు అభ్యంగములు ప్రయోగింపవలెను. లేక గాఢముగా ప్రచ్ఛానము చేసి గుంజాకల్కాది లేపములు ప్రయోగింపవలెను.[1] లేక రసాయనములు ప్రయోగింపవలెను.

లేపములు - అ) మరిచ, మణిశిల, కాసీసము, తుత్థము నూరి లేపనము చేయవలెను.

ఆ) తగరము, దేవదారు కల్కము లేపము చేయవలెను.

ఇ) మాలత్యాది తైలము అభ్యంగము చేయించిన ఇంద్రలుప్తము, దారుణకము శమించును.[2]

ఈ) గాఢముగా ప్రచ్ఛానముచేసి గుంజాకల్కమును మాటి మాటికి లేపనము చేయుచుండవలెను. దీనిచే త్వరగా కేశములుత్పన్నమగును.

ఉ) ఏనుగు దంతమును భస్మముచేసి రసాంజనము కలిపి లేపము చేసిన అరచేతులందు గూడా వెంట్రుకలుత్పన్నమగు నంతటి విశేషముగా ఈ యోగము పనిచేయును.

ఋ) కర్కశ పత్రములతో ఘర్షణచేసి మరిచ చూర్ణమును రుద్దిన ఇంద్రలుప్తము శమించును.

---

1. ఇంద్రలుప్తే సిరాం మూర్ధ్ని స్నిగ్ధస్విన్నస్య మోక్షయేత్ కల్కైః స్నుహ్యా చైర్విహ్యేచ్ఛిలాకాసీ సతుత్థకైః కుటన్నటాదారుకల్కైర్లేపనం వా ప్రశస్యతే ప్రచ్ఛయిత్వాఽనగాఢం వా గుంజాకల్కైర్ముహుర్ముహుః లేపయేదు పశాన్త్యర్థం కుర్యాద్వాపి రసాయనమ్ (సు.చి. 20/24-25)

2. సు.చి. 20/26

ఋ) భల్లాతకాది లేపముగాని, మధుకాది లేపముగాని, స్నుహ్యాది తైలముగాని, ఆదిత్యపాక గుడూచీ తైలముగాని శిరస్సుపై అభ్యంగముచేసిన ఇంద్రలుప్తము, ఖాలిత్యము శమించును.

**ఖాలిత్య - చికిత్స**

అజాదుగ్ధము, రసాంజనము, పుటదగ్ధగజదంత భస్మముతో కలిపి లేపనము చేసిన 7 రోజులలో కేశములు పెరుగును.[1]

## దారుణకము

**లక్షణములు :**

కఫము, వాతము ప్రకోపించుటచే కేశభూమియందు కాఠిన్యత, కండు సుప్తత, రూక్షత కలిగి పగులుటచే కేశములు రాలిపోవు చుండును. ఈ స్థితిని దారుణకము అందురు. సూక్ష్మమైన చర్మస్ఫుటనము కలుగునని వాగ్భటమతము.[2]

**చికిత్స :**

దారుణక వ్యాధియందు స్నేహనము స్వేదనము చేయించి శిరస్సునందలి సిరలను వ్యధనముచేసి రక్తమోక్షణము చేయింప వలయును.

తదుపరి అవపీడక నస్యము, శిరోవస్తి, అభ్యంగము ఈ క్రియలచే ఉపచరింపవలెను.

---

1. చక్రదత్త 55/95-107
2. i) దారుణా కండురారూక్షా కేశభూమిః ప్రపాటయతే కఫవాతప్రకోపేణ విద్యాద్దారుణకం తు తత్ (సు.ని. 13)

   ii) అ.హృ.ఉ. 23/23

శిరస్సునందు ప్రక్షాళనము చేయుటకు కోద్రవతృణ క్షారజలము ఉపయోగింపవలెను.[1]

లేప అభ్యంగాదులు :-

1) కాంజికమున నాన్చిన మాషములను నూరి లేపనము చేసిన దారుణకము శమించును.

2) ప్రియాలబీజాది లేపము

3) నీలోత్పలాది లేపముచే దీర్ఘకాలానుబంధ దారుణకము గూడా శమించును.

4) త్రిఫలాది తైలాభ్యంగనచే రూక్షికా (తలలోనుండి పొట్టువలె వచ్చుట) శమించును.

5) చిత్రకాది తైలాభ్యంగముచే శిరస్సునందు కలుగు దద్రు శమించును.

6) గుంజాద్య తైలాభ్యంగముచే కపాలమునందు కలుగు కండు, కుష్ఠము ఇతర కపాల రోగములు శమించును.

7) భృంగరాజాది తైలాభ్యంగనము కేశములు దట్టముగా స్థిరముగా గుబురుగా పెరుగును. దారుణకము శమించును.[2]

## అరూంషిక

**లక్షణములు :**

కఫము, రక్తము ప్రకోపించి క్రిములు ఏర్పడుటచే అనేక ముఖములు

---

1. సిరాం దారుణకే విద్ధ్వా స్నిగ్ధస్విన్నస్య మూర్ధని అవపీడం శిరోవ సిమ భ్యంగం చ ప్రయోజయేత్ క్షాళనేకోద్రవతృణ క్షారతోయం ప్రశస్యతే (సు.చి. 20/30)

2. చక్రదత్త 55/84-94

కలిగిన క్లేదయుక్తమైన వ్రణములు అనేకములుగా కలుగును. స్రావము అధికముగా నుండు ఈ వ్రణములు క్రొరలు తెల్లావాలు వీని సమమైన ఆకారములో నుండును.[1]

చికిత్స :

అరూంషిక వ్యాధియందు సిరావ్యధనముచేగాని, జలౌకచేగాని రక్త మోక్షణము చేయించి నింబ క్వాధముతో పరిషేకము చేయించవలెను.

లేపములు - అభ్యంగములు -

1) గుర్రపు లద్దెరసమున సైంధవ లవణము కలిపి లేపనము చేయవలెను.

2) పురాణ పిణ్యాకమును కుక్కుట పురీషమున కలిపి లేపనము చేయవలెను.

3) కుష్ఠమును వేయించి తైలముతో నూరి లేపనము చేయవలెను.

4) హరితాళాది లేపము

5) హరిద్రాది తైలాభ్యంగముచే అరూంషిక శమించును.

6) ఇంద్రలుప్తమునకు చెప్పబడిన తైలములు అభ్యంగమునకు ప్రయోగించినను అరూంషిక శమించును. పై చికిత్సలతో శమించనచో వమనాది శోధన క్రియలు ఆచరింపవలెను.[2]

---

1. i) అరూంషి బహువక్త్రాణి బహుక్లేదని మూర్ధని కఫాసృక్క్రిమికోపేన
నృణాం విద్యాదరుంషికామ్ (సు.ని. 13)
ii) అ.హృ.ఉ. 23/22

2. i) అరూంషికాం హృతేరక్తేసేచయేన్నింబవారిణా
విహ్యాత్సైంధవయుక్తేన వాజివిష్ఠారసేన తు (సు.చి. 20/27)
ii) సు.చి. 20/28-29 iii) చ.ద. 55/81.83
iv) అశాంతా శిరసశ్శుద్ధ్యైయతేతవమనాదిభిః (అ.హృ.ఉ. 24/25)

## పలితము

**లక్షణములు :**

క్రోధము, శోకము, శ్రమ, వీని వలన కలిగిన శరీరోష్మము శిరస్సునందు చేరి వాతాదులతో కలసి వెంటనే కేశభూమిని దగ్ధముచేసి కేశములను పాకము చేయుటచే కేశములు తెల్లబడును దీనిని పలిత రోగము అందురు.[1]

**పలిత విశేష లక్షణములు.**

వాగ్భట మతానుసారము పలితము నాలుగు విధములు. అవి 1. వాతజ 2. పిత్తజ 3. శ్లేష్మజ 4. సన్నిపాతజ.

**వాతజ** పలితమునందు కేశములు స్ఫుటితముగను, శ్యావ వర్ణముగను, ఖరముగను, రూక్షముగను జలము వంటి కాంతిగల విగను ఉండును.

పిత్తజ పలితమునందు దాహముతో కూడి పీతవర్ణములో కేశములుండును.

శ్లేష్మజ పలితమునందు స్నిగ్ధము, స్థూలముగ, శుక్లముగా నుండి వృద్ధి చెందుచుండును.

సన్నిపాతజ పలితమునందు అన్ని లక్షణములతో కూడి యుండును.

శిరశ్శూల వలన కలిగిన పలితమునందు వివర్ణముగనుండి, స్పర్శాఽసహనత కలిగి యుండును.[2]

---

1. i) క్రోధశోకశ్రమకృతః శరీరోష్మా శిరోగతః పిత్తం చ కేశాన్పచతిపలితం తేన జాయతే.(సు.ని 13)
   ii) చ.చి.26 iii) అ.హృ.ఉ. 23/29
2. తద్వాతాత్స్ఫుటితం శ్యావం ఖరం రూక్షం జలప్రభమ్ పిత్తాత్సదాహం పీతాభం కఫాత్స్నిగ్ధం వివృద్ధిమత్ స్థూలం సశుక్లం సర్వైస్తువింద్యాద్వాతవ మిశ్రలక్షణ శిరోరుజోద్భవం చాన్యద్వివర్ణం స్పర్శనాసహమ్ (అ.హృ.ఉ. 23/30-31)

## నస్యములు

1) నీలిన్యాది-తైలము నస్యము చేయించి ఆవుపాలు పానము చేయుచుండిన పలితము శమించును.

2) సహచరాది తైల నస్యము[1]

3) చందనాది తైల నస్యము

4) భృంగరాజ ఘృతము

5) నింబ తైలము

6) భృంగరాజ తైలము.[2]

## లేప— అభ్యంగాదులు

1) దుర్ధికాకరవీర మూలకల్క లేపము పలితకేశములను తొలగించి లేపము చేయవలెను.

2) అయశ్చూర్ణాది లేపము

3) మాషాది లేపము.[3]

4) త్రిఫలాది లేపము

5) భృంగ పుష్పాదిలేపము

6) మహానీల తైలము

## మసూరిక

మసూరిక వివరములు జ్వర చికిత్సయందు చూడనగును.

దీనియందు కుష్ఠోక్త లేపనాదులు, పిత్త శ్లేష్మ విసర్పోక్త క్రియలు చేయవలయును.[4]

---

1. అ.హృ.ఉ. 24/35-37
2. అ.హృ.ఉ. 24/38, 42-43
3. చ.ద. 55/109-136.
4. మసూరికాయాం కుష్ఠఘ్నలేపనాది క్రియాహితా
   పిత్తశ్లేష్మవిసర్పోక్తా క్రియా వా సంప్రశస్యతే (సు.చి. 20/31)

## ముఖ దూషిక

కఫము, వాతము, రక్తము—ఇవి ప్రకోపించుటచే ముఖమునందు శాల్మలీ కంటకాకారములో నుండుపిటకములు యువావస్థలో ఉత్పన్నమగును. ఇవి ఘనముగ నుండి వేదనతో కూడి లోపల మేదస్సును కలిగియుండును. వీనిని ముఖ దూషికము లనియు, యవాన పిడకలనియు అందురు.[1]

ఇవి యవ్వనావస్థ ప్రారంభములో కలుగు మొటిమలు లేక Acne Vulgaris అనబడును.

**చికిత్స :-**

1) యవాన పిటికల యందు వమనము చేయించుట హితకరముగానుండును
2) లేపనాదులతో శమించని యడల నస్యము, లలాటమునందు సిరా వ్యధనము మొదలగు క్రియలచే ఉపచరింపవలెను.[2]
3) లేపములు.

---

1. i) శాల్మలీకంటకప్రఖ్యాః కఫమారుతశోణితైః జాయంతే పిడకా యూనాం వక్త్రేతా ముఖదూషికాః (సు.ని. 13)

   ii) సరుజో ఘనాః మేదోగర్భాముఖేయూనాం తాభ్యాం చ ముఖదూషికాః (అ.హృ.ఉ. 31)

2. i) యౌవనేపిటకాస్వేషశేవిషాచ్ఛర్దనంహితమ్ లేపనం చ వచారోధ్రసైంధవైస్సర్షపాన్వితైః కుస్తుంబురువచాలోధ్రకుష్ఠైర్వాలేపనం హితమ్ (సు చి. 20/37)

   ii) అశాంతౌ వమనం నస్యం లలాటే చ సిరావ్యధః (అ.హృ.ఉ.32/4)

1) వచ, లోధ్ర, సైంధవ లవణము, సర్షపములు నూరి లేపనము చేయవలెను.[1]

2) ధాన్యకము, వచ, లోధ్ర, కుష్టము నూరి లేపనము చేయించినను యౌవాన పిటకలు శమించును.[1]

3) వట పల్లవములు, నారికేళోత్థ శుక్తములు (కొబ్బరి చిప్పలు) నూరి లేపనము చేసినను మొటిమలు శమించును.[2]

4) శాల్మలీ కంటకములను పాలతో నూరి లేపనము చేసినను మొటిమలు శమించును.[3]

5) గోరోచనము మరిచ చూర్ణము కలిపి నూరి లేపనము చేసిన ముఖ దూషికము శమించును.[4]

6) కింశుకాది తైల (యాదవ్ జీ) అభ్యంగముచే ముఖదూషిక, ముఖముపై మచ్చలు శమించును.[5]

## పద్మినీ కంటకము

**లక్షణములు :-**

కఫవాత ప్రకోపముచే పద్మిని [కమల] కంటక తుల్యమైన కంటకములతో కూడిన కండూ యుక్తమైన గుండ్రని పాండు వర్ణమండలములు శరీరముపై కలిగిన అస్థితిని పద్మినీ కంటకము అందురు.[6]

---

1. సు.చి. 20/37
2. అ.హృ.ఉ. 32/3
3. ర.త.సా. I
4. చ.ద. 55/43
5. ర.త.సా.
6. కంటకైరాచితం వృత్తం కండూమత్ పాండు మండలమ్ పద్మినీ కంటక ప్రఖ్యైస్తదాఖ్యం కఫవాతజమ్ (సు.ని. 13)

చికిత్స :-

నింబపత్ర క్వాథము తాగించి వమనము చేయింపవలెను. నింబపత్ర సిద్ధ ఘృతమునందు తేనె కలిపి పానము చేయించవలెను.

నింబ అరగ్వధ కల్కముతో ఉత్సాదనము చేయించవలెను.[1]

కమల నాళ భస్మకృత క్షారము లేపనము చేసినను పద్మినీ కంటకము శమించును.[2]

## జతుమణి

**లక్షణములు :-**

కఫ రక్త ప్రధానముగా మూడు దోషములు ప్రకోపించి పుట్టుకతోడనే వేదనారహితముగను శ్లక్ష్ణముగను, ఉబ్బెత్తుగను కొంచెము రక్తవర్ణముగను ఉండు మండలము ఏర్పడిన అది జతుమణి అనబడును.

జతుమణి అనునది పుట్టుకతోనే ఏర్పడు పుట్టుమచ్చ [3]

చికిత్స :-

ఛేదించి తీసివేసి క్షారముతోగాని అగ్నితోగాని మెల్లమెల్లగా కాల్చవలెను.[4]

---

1. పద్మినీకంటకేరోగే ఛర్దయేన్నింబవారిణా తేనైవ సిద్ధంసక్షౌద్రం
సర్పిఃపానం ప్రదాపయేత్ నింబారగ్వధయోః క్వాథోహితఉత్సాదనే భవేత్
(సు.చి. 20/38-39)

2. చ.ద. 35/22

3. నీరుజాం సమముత్పన్నాం మండల కఫరక్తజమ్ సహజం రక్తమీషచ్చ
శ్లక్ష్ణం జతుర్మణి విదుః (సు.ని. 13)

4. జతూమణిం సముత్కృత్య మశకం తిలకాలకమ్
క్షారేణ ప్రదహేద్యుక్త్యా వహ్నినా వా శనైశ్శనైః (సు.చి. 20/32)

## మషకము

**లక్షణములు :-**

వాత ప్రకోపముచే శరీరముపై వేదనా రహితమై, కఠినమైన మాషసమాన మైన నల్లని ఉబ్బెత్తుగ ఉత్పన్నమైనది మషకము అనబడును.[1]

ఇది ఎలివేటడ్ మోల్ Eleveted mole అనబడును.

చికిత్స జతుమణి వలెనే చేయవలెను. ఏరండ పత్రనాళ క్షారముతోగాని సర్పనిర్మోక భస్మముతోగాని ఘర్షణ చేయవలెను.

## తిలకాలకము

వాత, పిత్త, రక్తములచే నల్లని తిల సదృశ వేదనా రహితముగనుండు ఉబ్బెత్తుగలేని మచ్చ జనించిన అది తిలకాలక మనబడును.[2]

**చికిత్స :-**

జతుమణి వలె చేయవలెను.

## న్యచ్ఛము

పిత్త, రక్తములచే పెద్దదిగా గాని చిన్నదిగా గాని తెల్లగాగాని, నల్లగా

---

1. i) అవేదనం స్థిరం చైవ యత్ర గాత్రేషు దృశ్యతే మాషవత్ కృష్ణమాత్స న్నమనిలాన్మషకం వదేత్ (సు.ని. 13)
   ii) అ.హృ.31
2. i) కృష్ణానితిలమాత్రాణినీరుజాని సమాని చ వాతపిత్తాసృగుచ్ఛోషాతాన్ విద్యాత్తిలకాలకాన్ (సు ని. 13)
   ii) అ.హృ.ఉ. 31

గాని వేదనా రహితమైన మచ్చ ఏర్పడినచో దానిని న్యచ్ఛము అందురు.[1]

ఇది సహజముగనే యుండుననియు లాంఛనమను పేరుతో వాగ్భటుడు వర్ణించెను.

చికిత్స :-

1) లలాటము మొదలగు ప్రదేశములందుండు సిరలను విధ్యను సారము వ్యధనము చేసి రక్తమోక్షణము చేయింపవలెను.

2) వ్యాధిత ప్రదేశమున ఘృష్టనముచేసి క్షీరవృక్ష దుగ్ధసహిత త్వక్ కల్కం లేపనము చేయవలెను.

3) ఇతరలేపములు 1) బలాది లేపము

2) పయస్యాది లేపము

3) కపిత్థాది లేపము

4) మధు ఘృతయుక్త సూకర దంష్ట్రి లేపము ఈ లేపములలో వేనివి ప్రయోగించినను న్యచ్ఛము, వ్యంగము, నీలికా శమించును.[2]

---

1. i) మండలం మహదల్పం వా శ్యామం వా యది వా సితమ్ సహజం నీరుజం గాత్రే న్యచ్ఛమిత్యభిధీయతే (సు.ని. 13)

ii) యస్య పిత్తం ప్రకుపితం శోణితం ప్రాప్య శుష్యతి తిలకాః పిప్లవో వ్యంగా నీలికా చాస్యజాయతే (చ.సూ. 18)

iii) అ.హృ.ఉ.31

2. న్యచ్ఛే వ్యంగే సిరామోక్షో నీలికాయాం చ శస్యతేయథాన్యాయం యథాభ్యాసం అలాట్వాదిసిరావ్యధః ఘృష్ట్వాదిహ్యాత్త్వచం పిష్ట్వా క్షీరిణాం క్షీరసంయుతామ్ (సు.చి. 20/38-39)

## వ్యంగము–నీలికా

లక్షణములు :-

క్రోధము, శ్రమలచే ప్రకోపించిన వాతము పిత్తముతో కలసి ముఖ మండలముపై వేదనా రహితమైన పలుచని శ్యావ (శ్వేతముతో కూడిన)వర్ణములో నుండు మండలము నుత్పన్నము చేయును. దీనిని వ్యంగము లేకమంగు అందురు.

ఈ మండలము పూర్తి నలుపుగా యున్నచో నీలికా అనబడును.[1]

ఈ స్థితులు మెలానోడెర్మా (Malono dermia) లేక Melarma or Chloaima లకు సామ్యముగా నుండును.

చికిత్స :-

న్యచ్ఛమునకు చెప్పబడిన చికిత్సలు చేయవలెను.

### వ్యంగహర లేపములు – నీలికహర లేపములు

1) అర్జున మంజిష్ఠ కల్కము తేనెతో లేపము చేయవలెను.

2) శ్వేతాశ్వఖురములపసి నవనీతంతో లేపము

3) రక్త చందనాది లేపము

4) జీరకద్వయాది లేపము

5) క్షీరపిష్ట ఘృతభృష్ట మసూర కల్కలేపము

---

1. i) క్రోధాయామ ప్రకుపితో వాయుః పిత్తేన సంయుతః సహసాముఖమాగత్య మండలం విసృజత్యతః నీరుజం తనుకం శ్యావం ముఖేవ్యంగం తమాదిశేత్ కృష్ణామేవం గుణంగాత్రే ముఖే వా నీలికాం విదుః(సు.ని. 13)

ii) అం.హృ.ఉ. 31

6) తీక్ష్ణ శాల్మలీ కంటకములు గోక్షీరంతో నూరి లేపనము చేసినను
7) కొలమజ్జాది లేపము
8) ముసలీజటా భాగపయ యుతో లేపము
9) జంబ్వాది లేపము
10) ఉత్పలాది ఉద్వర్తనము
11) యవాది లేపము
12) కుంకుమాది తైలము— నస్య అభ్యంగములచే వ్యంగము, నీలిక, పలితాదులు శమించును.
13) మంజిష్ఠాది తైలము— అభ్యంగముచే వ్యంగము నీలిక శమించి ముఖమునకు కాంతి కలుగును. (అ.హృ.ఉ. 31)
14) హరిద్రాది తైలము— అభ్యంగము జతుమణి మొదలగు వ్యాధులు శమించి ముఖమునకు కాంతి కలుగును.
15) కనకతైలము (చ.ద)

నస్యము :-

మార్కవస్వరసము క్షీరము నీరు కలిపి నస్యము చేయించిన వ్యంగాది వ్యాధులు శమించును. (అ. హృ.)

## పరివర్తిక

లక్షణములు:

శిశ్నమును మర్దన చేయుట, పీడించుట, అభిఘాతము కలుగుట— వీనివలన వ్యానవాతము లింగము యొక్క చర్మమును ఆశ్రయించి శిశ్నమణి యొక్క పై భాగమున ఉండు చర్మము వెనుకకు తిరుగబడును. మణికి క్రింద నుండు చర్మము యొక్క కోశము గ్రంధిరూపమై తీవ్రమైన బాధతోగూడి వ్రేలాడుచుండును.

ఈ కోశమునందు దాహము, వేదన కలిగి ఒక్కొక్కపుడు పాకమును గూడా పొందును.

దీనిని పరివర్తిక అందురు. ఇది వాతజముగా నున్నచో వేదన అధికముగా నుండును. కఫానుబంధముగానున్నచో కఠినముగను, కండూయుక్తముగను ఉండును.[1]

చికిత్స: ఈస్థితి Para Phimosis(పేరాఫైమోసిస్)కు దగ్గరగానుండును.

ఘృతముతో అభ్యంగము చేసి, ఉపనాహస్వేదము బాగుగా చేయించి మరలా ఘృతము నభ్యంగము చేయుచు శిశ్నముండమును వత్తుచు చర్మమును మెల్లమెల్లగా ముందుకులాగవలెను. శిశ్నమణిని చర్మమునందు ప్రవేశించునట్లు చేసిన తదుపరి చర్మముపై సాల్వణాది వాతఘ్న ఉపనాహములతో మూడు దినములు లేక ఐదు దినములు స్వేదనము చేయించవలయును. వాతనాశక వస్తులతోను స్నిగ్ధ భోజనములతోను ఉపచరింపవలెను.

---

1. మర్దనాత్ పీడనాచ్చాపి తథైవాప్యభిఘాతతః మేఢ్రచర్మ యదా
వాయుర్భజతేసర్వతశ్చరః తదా వాతోపసృష్టం చర్మప్రతినివర్తతే
మణేరధస్తాత్కోశశ్చ గ్రంథిరూపేణ లంబతే సవేదనః సదాహశ్చ
పాకం చ వ్రజతి క్వచిత్ పరివర్తికేతి తాం విద్యాత్ సరుజాం
వాతసంభవామ్ సకండూ కఠినాంచాపి సైవ శ్లేష్మసముత్థితా (సు.ని. 13)

2. పరివృత్తిం ఘృతాభ్యక్తాం సుస్విన్నా ముపనాహయేత్ త్రిరాత్రం
పంచరాత్రం వా వాతిఘ్నైః శాల్వణాదిభిః తతోఽభ్యజ్య శనైశ్చర్మచానయే
త్పీడయేన్మణిమ్ ప్రవిష్టే చ మణౌ చర్మ స్వేదయేదుపనాహనైః
వస్త్యాన్వాతహరాన్స్నేహాన్స్నిగ్ధాన్నాని భోజయేత్ (సు.చి. 20/40-42)

## అవపాటిక

యోని ముఖము చిన్నదిగానుండు స్త్రీ లేక కన్యగానుండు స్త్రీతో కామో ద్రేకముచే బలాత్కారముగా సంభోగము చేయుటచేగాని లేక హస్తముచే మర్దన చేయుటవలనగాని, లేక అభిఘాతము వలన గాని శుక్రవేగమునాపుటచేగాని మేఢ్రముపై చర్మము వెలికిలబడి పగిలి చీలిన యెడల లేక దర్భలతో గీచుకొనిన విధముగా చీలి పుండైన యెడల దానిని అవపాటిక అందురు.[1]

ఈ వ్యాధియందు పరుషముగ, రూక్షముగను ఉండి శూలతోద కలిగి యున్నచో వాతజమని అనబడును.

అధికమైన దాహము కలిగియున్న పిత్తజమనబడును.

దాహము తృష్ణతో కూడియున్న రక్తజమని గ్రహింపవలయును.

కఠినముగను, స్నిగ్ధముగను ఉండి, కండు, స్వల్పవేదన కలిగియున్నచో శ్లేష్మజమని గ్రహింపవలెను.[2]

చికిత్స :

పరివర్తికకు చెప్పబడిన చికిత్సలనే దోషానుసారము అవపాటిక యందును ప్రయోగింపవలయును.[3]

---

1. i) అల్పీయః ఖాం యదా హర్షాద్బాలం గచ్ఛేత్ స్త్రియంనరః
హస్తాభిఘాతాదథవా చర్మణ్యుద్వర్తితే బలాత్ మర్దనాత్ పీడనాద్వాఽపి
శుక్రవేగవిధారణాత్ యస్యావపాట్యతే చర్మ తాం విద్యాదవపాటికామ్
(సు.ని. 13)

ii) భోజవచనము

2. 1 (ii)

3. అవపాటికాం జయేదేవం యథాదోషం చికిత్సకః (సు.చి. 20/39)

## నిరుద్ధ ప్రకశము

**లక్షణములు :**

వాతము మర్దనాదుల వలన గాని లేక అవపాటికాది వ్యాధులందు సరిగా రోపణము జరుగకపోవుట వలన గాని మేఢ్రమునందు చేరి ప్రకోపించి మణిపైన ఉండు చర్మమును మేఢ్ర ద్వారమును సంకోచింపచేయును. చర్మముచే మూత్ర ద్వారము మూయబడుటచే మూత్రము చిన్న ధారగ వెడలుచుండును. కాని వేదన కలుగదు. పూర్తిగా మూసికొనియున్నపుడు వేదన కూడా కలుగవచ్చునని మాధవకరుని అభిప్రాయము.[1]

నిరుద్ధ ప్రకశము ఫైమోసిస్ (PHIMOSIS)కు తుల్యముగా నుండును. ఈ వ్యాధి సహజమనియు జన్మోత్తర కాలజమని రెండు విధములుగానుండును. పైన చెప్పబడిన వివరణ జన్మోత్తర కాలజమునకు తుల్యముగానున్నది.

**చికిత్స :**

నిరుద్ధ ప్రకశమునందు రెండువైపులా రంధ్రముగల లోహ, కాష్ఠ, లాక్షాదులతో చేయబడిన నాళమును తీసికొని ఘృతమును నాళముపైన లేపనముచేసి శిశ్న మార్గమున ప్రవేశపెట్టవలెను. శిశ్నముందముపైనను గొట్టము ద్వారాను సూకర వస, మజ్జ లేక వాతనాశక ద్రవ్యయుక్త చక్రతైలముతో పరిషేకము చేయువలెను.

---

1. i) వాతోపసృష్టమేవం తు చర్మ సంశ్రయతే మణిమ్ మణిశ్చర్మోపనద్ధస్తు మూత్రస్రోతో రుణాద్ధి చ నిరుద్ధప్రకశే తస్మిన్మందధారమవేదనమ్ మూత్రం ప్రవర్తతే జంతోః మణిర్వి వియతే న చ నిరుద్ధప్రకశం విద్యాద్రుహాధాంచావపాటికామ్ (సు.ని. 13)

ii) నిరుద్ధ ప్రకశం విద్యాత్సరుజం వాతసంభవమ్ (మా.ని. 47)

iii) భోజవచనము

ఈ విధముగా మూడు మూడు రోజులకొకసారి పెద్ద పెద్ద నాళములను ప్రవేశ పెట్టుచు శిశ్నచర్మ మార్గమును విస్తృతమగునట్లు చేయవలెను. స్నిగ్ధాహారమును భుజింపచేయుచుండవలయును. ఈ విధముగా మేఢ్ర ద్వారమును వృద్ధిచేయవలెను.

ఈ విధమగు చికిత్సచే నిరుద్ధ ప్రకశము శమింపనిచో మేఢ్రమునందుండు సేవని యను నాడీ యందు అభిఘాతము కలుగకుండు విధముగా శస్త్రముచే ఛేదించి తదుపరి సద్యఃక్షతమునకు చెప్పిన విధము చికిత్స చేసి రోపణము కలిగింపవలెను.[1]

## సన్నిరుద్ధ గుదము

లక్షణములు :-

పురీషము యొక్కయు, వాతము యొక్కయు, వేగమును అప్పగించుట వలన అపాన వాతము ప్రకోపించి గుదము నాశ్రయించి మహాస్రోతస్సునకు అధోద్వార రూపమైన గుదద్వారమును సంకోచింపచేయును. మార్గము సంకుచితమై చిన్నదిగానగుట వలన పురీషము అతి కష్టముమీద బయలు వెడలుచుండును. ఈ వ్యాధిని సన్నిరుద్ధ గుదమందురు.[2]

---

1. i) నిరుద్ధప్రకాశే నాడీం లోహీముభయతోముఖీమ్ దారవీం వా జతుకృతాం ఘృతాభ్యక్తాం ప్రవేశయేత్ పరిషేకే వసామజ్జః శిశుమారవరాహయోః చక్రతైలం తథుయోజ్యం వాతఘ్నద్రవ్యసంయుతమ్ త్ర్యహాత్ త్ర్యహాత్ స్థూలతరాం సమ్యగ్నాడీం ప్రవేశయేత్ స్రోతో వివర్ధయేదేవం స్నిగ్ధమన్నంచ భోజయేత్ భిత్వ్వాహ సేవనీమ్ముక్త్వా సద్యః క్షతవదాచరేత్ (సు. చి. 20/43-45)

   ii) (అ. హృ ఉ. 3·/17-19)

2. i) వేగసంధారణాద్వాయుర్విహతో గుదమాశ్రితః నిరుణద్ధి సూక్ష్మద్వారం కరోతి చ మార్గస్యసౌక్ష్మ్యాత్ కృచ్ఛ్రేణ పురీషం తస్యగచ్ఛతి సన్నిరుద్ధ గుదం త్వేషువ్యాధి విద్యాత్ సుదుస్తరమ్ (సు.ని. 13)

   ii) అ. హృ. ఉ. 31

ఇది Stricture of the rectum అనబడు స్థితి. ఇది ప్రవాహిక, అతిసారము, అర్శస్సు, క్షయ, ఫిరంగాది వ్యాధులందు కలుగు గుదవ్రణము మొదలగు కారణములచే కలుగు స్థితి.

చికిత్స :

నిరుద్ధ ప్రకశమునకు చెప్పబడిన విధానములోనే సన్నిరుద్ధ గుదమును ఉపచరింపవలెను.[1]

## అహి పూతన

**లక్షణములు :**

శిశువులయొక్క గుద స్థానము సరిగా కడుగకపోవుటవలన మూత్ర పురీషములతో కూడియున్నను, లేక స్వేదము వలనను, స్నానము సరిగా చేయించక పోవుట వలనగాని రక్తము మరియు కఫము ప్రకోపించి గుదస్థానమునందు కండును కలిగించును. మాటి మాటికి గోకుటవలన స్ఫోటములేర్పడి చితికి పూయాదులను స్రవించును. వ్రణములన్నియు కలిసి ఒకటిగా ఏర్పడును. దీనిని అహిపూతన మందురు.[2] దీనిని Napkin Rash అందురు.

చికిత్స :

శిశువులందు అహిపూతన వ్యాధి కలిగినపుడు పరిశుభ్రముగా నుంచుట, ధాత్రి లేక మాతృ స్తన్యమును శోధనచేయుట అవసరము.

---

1. సన్నిరుద్ధగుదో యోజ్యా నిరుద్ధప్రకశ క్రియా (సు.చి. 20/47)
2. శకృన్మూత్రసమాయుక్తేఽధౌతేఽపానే శిశోర్భవేత్ స్విన్నస్యాస్నాప్యమానస్య కండూ రక్తకఫోద్భవా కండూయనా త్తతః క్షిప్రం స్ఫోటాః స్రావశ్చ జాయతే ఏకీభూతం వ్రణౌ ఘోరం తం విద్యాదహిపూతనమ్ (సు.ని 13)

పటోలాది ఘృతము పానము చేయింపవలెను. త్రిఫల, కోల, ఖదిర క్వాథము ప్రయోగించి వ్రణరోపణము చేయవలెను.

కాసీసాది లేపనము ప్రయోగింపవలెను.

ఆవశ్యకత కలిగినపుడు కపాలము (కుండపెంకు)ను తుత్థమును చూర్ణించి అవచూర్ణము చేయవలెను.[1]

రసాంజన పానము, లేపము హితకరముగానుండును. (చక్రదత్త)

## వృషణ కచ్ఛు

స్నాన, ఉత్సాదన, ఉద్వర్తనాదులు సరిగా చేసుకొనక పోవుటవలన వృషణ ప్రదేశమందు మురికిచేరి తడిసి చెమ్మకలిగి పాసినట్లగును. దానిచే కండు కలుగును. గోకుటవలన స్ఫోటములుజనించి స్రావము కలుగును. ఈ వ్యాధి కఫ రక్తప్రకోపములచే కలుగును. దీనిని వృషణకచ్ఛు[2] లేక Ecjema of the Scrotum అందురు.

చికిత్స :

వృషణకచ్ఛు కుష్ఠోక్త చికిత్సా విధి ననుసరించియు అహిపూతనోక్త విధానమును అనుసరించియు చేయవలెను. పామా చికిత్సలను ప్రయోగింపవలెను.[3]

---

1. i) ధాత్ర్యాస్తన్యం శోధయిత్వా బాలేసాధ్యాహిపూతనా పటోలపత్రత్రిఫలా రసాంజన విపాచితమ్ పీతం ఘృతం నాశయతి కృచ్ఛ్రామప్యహిపూతనాం (సు. చి. 20/57)

   ii) సు. చి. 20/58-59

2. స్నానోత్సాదనహీనస్య వృషణసంస్థితః యదాప్రక్లిద్యతే స్వేదాత్ కండూ సంజనయేత్తదా తత్ర కండూయనాత్ క్షిప్రం స్ఫోటాఃస్రావశ్చ జాయతే ప్రాహుర్వృషణకచ్ఛూం తాం శ్లేష్మ రక్త ప్రకోపజామ్ (సు.ని. 13)

3. చికిత్సేన్ముష్కకచ్ఛూం చాప్యహిపూతనసామవత్ (సు.చి. 20/60)

## గుద భ్రంశము

లక్షణములు :

రూక్షుడుగను, దుర్బలుడుగనునుండు మనుజుడు మలమును (పురీషమును) విసర్జించునపుడు బలాత్కారముగా మాటి మాటికి ముక్కుటచేతను, అతిసారము చేతను గుదవళులు దుర్బలములై మల త్యాగానంతరము లోపలకు ముడుచుకొనక పోవుటచే చేతితోనెట్టి లోపలకు ప్రవేశింపచేయవలసి వచ్చును. ఈ వ్యాధిని గుద భ్రంశమందురు.[1]

ఇది Prolapse of the rectum అనబడును.

చికిత్స :

గుదమునందు స్వేదనముచేసి స్నేహనముచేసి లోపల ప్రవేశింప చేయవలెను. తదుపరి మధ్యలో వాత నిర్గమనమునకై ఛిద్రముగల చర్మముతో గోఫణ బంధనముచేసి మాటి మాటికి స్వేదనము చేయుచుండవలెను.[2]

బృహత్పంచ మూలములు, ఆంత్రవర్జిత మూషికము క్షీరము వాతఘ్న ద్రవ్యములతో సిద్ధముచేసిన తైలము పాన అభ్యంగములందు ప్రయోగించిన గుద భ్రంశము కష్టసాధ్యమైన స్థితిలోగూడా శమించును.[3]

---

1. ప్రవాహణాతిసారాభ్యాం నిర్గచ్ఛతి గుదం బహిః రూక్ష దుర్బలదేహస్య గుదభ్రంశం తమాదిశేత్ (సు. ని. 13)
2. గుదభ్రంశే గుదం స్విన్నం స్నేహాభ్యక్తం ప్రవేశయేత్ కార్యద్గోఫణా బన్ధం మధ్యచ్ఛిద్రేణ చర్మణా వినిర్గమార్థం వాయోశ్చ స్వేదయేచ్చ ముహుర్ముహుః (సు.చి. 20/61)
3. సు. చి. 20/62-63

గోవసగాని, మూషిక వసగాని గుదమునకు లేపనము చేయవలెను. మూషిక మాంసమును కాంజికముతో పాకముచేసి ఘృతభర్జితముచేసి స్వేదనము చేయింపవలెను.

పద్మపత్ర కల్కము శర్కరతో సేవింపవలెను.

వృక్షామ్లావి కల్కముతో తక్రమును సేవింపవలెను.

చాంగేరీ ఘృతమును సేవించిన గుదభ్రంశము శమించును. (చక్రదత్త)

## ప్రసుప్తి

వాతముచే ప్రేరితమైన కఫము చర్మమునందుచేరి శుష్కించి పాండువర్ణమును పొంది కొద్దిగా కండుతోగూడి క్లేదరహితముగానుండి క్రమముగా స్పర్శ జ్ఞానమును నశింపచేసిన యది ప్రసుప్తి అనబడును.[1]

చికిత్స -

వాతకుష్టమునందు చెప్పబడిన చికిత్సలను దాహ చికిత్స (అగ్నికర్మ)యు చేయవలెను.[2]

## రాజికా

ఎండవలన కలిగిన స్వేదయుక్త శరీరమందు వేదనతోగూడి దట్టముగా నల్లావాలవంటి ఆకారము ప్రమాణముగలిగిన పిటకలు జనించును. వీనిని రాజకాయందురు. వ్యవహారమున ఇవి చెమటకాయలు అనబడును.[3]

---

1. వాయునోదీరితః శ్లేష్మా త్వచం ప్రాప్య విశుష్యతి తతస్త్వగ్జాయతే పాండుః క్రమేణ చ విచేతనా అల్పకండూ రవిక్లేదా సా ప్రసుప్తిః ప్రసుప్తితః (అ.హృ.ఉ. 31)
2. ప్రసుప్తౌ వాతకుష్ఠోక్తం కుర్యాద్దాహం చ వహ్నినా (అ.హృ.ఉ 32/33)
3. ఘర్మస్వేదపరీతేఽంగే పిటికాం సరుజా ఘనాః రాజికావర్ణా సంస్థాన ప్రమాణా రాజికాహ్వయాః (అ.హృ.ఉ. 31)

చికిత్స :

విప్లుతాకు చెప్పబడిన చికిత్సలు చేయవలెను.

## వరాహ దంష్ట్రికము

లక్షణములు :

దాహముతోకూడి రక్తమును స్రవించుచు చర్మమునందు తీవ్రవేదన, కండు, జ్వరముతోగూడిన పాకమును కలిగించిన అది వరాహ దంష్ట్రమన బడును.[1]

చికిత్స :

విసర్పమున చెప్పబడిన చికిత్సలు వరాహ దంష్ట్రికమునందు చేయవలెను.

నాడీచ బీజకల్కము ఘృతముతోకలిపి ప్రాతఃకాలమున సేవించ వలెను. దీనిచే తీవ్రశూలకర దంష్ట్రముగూడ శమించును.[2]

హరిద్ర, భృంగరాజ మూలము శీతలజలముతో నూరి లేపనముచేసిన వరాహ దంష్ట్రము శమించును.[3]

క్షుద్ర రోగములందు పథ్యాఽపథ్యములు.

క్షుద్రరోగములందు పథ్యాపథ్యములు ఆయా వ్యాధుల దోష దూష్యాను సారము ఆచరింపవలెను.

---

1. అ. హృ. ఉ. 32/5
2. సదాహో రక్తపర్యన్తస్త్వక్పాకీ తీవ్రవేదనః
   కండుమాన్ జ్వరకారీ చ సస్యాత్సూకరదంష్ట్రకః (మా.ని. 55/55)
3. i) విసర్పోక్త ప్రతీకారః కార్యః శూకరదంష్ట్రికే (భై.ర. 60/88)
   ii) భై. ర. 60/86-88.

# శీతపిత్త ఉదర్ద-కోఠాదులు

శీతపిత్తాది రోగముల సంప్రాప్తి- చల్లనైన గాలి యొక్క స్పర్శమువలన కఫము వాతము ప్రకోపించి తన స్వకారణములచే ప్రకోపించిన పిత్తముతో కలిసి బాహ్యముగా చర్మమునందును అభ్యంతరముగా రక్తమాంసాది ధాతువులయందును వ్యాపించి శీతపిత్త ఉదర్దాది వ్యాధులను కలిగించును.[1]

శీతపిత్తవ్యాధి త్రిదోషజమని తెలియుచున్నది. దోషోల్బణత భేదములతో ఉదర్ద కోఠములు గూడా శీతపిత్త భేదములుగా భావింపబడుచున్నవి.

ఈ వ్యాధులు నేడు అధికముగా వ్యాపించియున్న అర్టికేరియా (Urticaria)కు తుల్యముగా నుండును. ఈ వ్యాధికి అసాత్మ్యత ప్రధాన కారణము. అభిఘాతము. కీటక దంశము స్థానిక కారణములు. అసాత్మ్యకరములైన ఆహారములు, విహారములు, ఔషధములు; రక్తము నెక్కించుట, ఆంత్రకృములు- ఇవి సార్వదైహికమైన Urticariaకు కారణములుగా ఉండును. కాని దాదాపు సగము రోగులలో కారణము కనుగొనుట కష్టముగా నుండును.

## పూర్వ రూపములు

అధిక పిపాస, అరుచి, హృల్లాసము (నోట నీరు ఊరుట), శరీరము కృశించుట, అవయవములు బరువుగా నగుట, కన్ను ఎఱ్ఱబడుట— ఇవి పూర్వ రూపములుగా కలుగును.[2]

---

1. శీతమారుత సంస్పర్శాత్ప్రదుష్టౌ కఫమారుతౌ
   పిత్తేన సహ సంభూయ బహిరన్త ర్విసర్పతః (మా.ని. 50/1)

2. పిపాసారుచి హృల్లాస దేహసాదఙ్గగౌరవం
   రక్తలోచనతా తేషాం పూర్వరూపస్య లక్షణమ్ (మా.ని. 50/2)

## సామాన్య లక్షణములు

కందిరీగలు కుట్టిన విధముగా చర్మముపై వాపు కలిగి అధికమైన దురద, తోద (సూదులతో గుచ్చినట్లు బాధ)లతోను, వాంతి, జ్వరము, విదాహముతో కూడి యుండుట ఉదర్ద శీతపిత్తములకు సామాన్య లక్షణము.[1]

త్రిదోషములలో వాతము ప్రధానముగా నున్నచో శీతపిత్తమనియు, కఫము ప్రధానముగా నున్నచో ఉదర్దమనియు తెలిసికొనవలయును.[2]

ఉదర్దము యొక్క విశేష లక్షణములు- ఉదర్దము శిశిర ఋతువునందు కఫ ప్రకోపముచే కలుగును. మధ్యభాగమున పల్లముగను అంచులు ఎత్తుగను (ఉత్సఙ్గముగా) ఉండు మండలములు రక్తవర్ణముగను కండూయుక్తముగను ఉండుట ఉదర్ద వ్యాధి విశేష లక్షణము.[3]

కోఠము, ఉత్కోఠము- వమనమునకై ఔషధమిచ్చినపుడు సరిగా వమనము జరుగక అసమ్యగ్యోగ- మిథ్యాయోగములచే ఉదీర్ణములైన పిత్తము, శ్లేష్మము, ఆరనాళము, శుక్తము, సర్షపములు, లవణము అధికముగా సేవించుట, వర్షాకాలము అన్నము నిరోధింపబడుట వలనను, ఈ కారణములచేతను చర్మముపై కండూయుక్తములైన రక్తవర్ణముతో గూడిన అనేక మండలములు ఉత్పన్నమగును. దీనిని కోఠము అందురు. ఇవి మాటిమాటికి కలుగుచున్నచో శమింపక

---

1. వరటీదష్టసంస్థానః శోథస్సంజాయతే బహిః । సకణ్డూస్తోదబహుళశ్ఛర్ది జ్వరవిదాహవాన్॥ ఉదర్దమితి తం విద్యాచ్ఛీతపిత్తమథాపరే
(మా.ని. 50/3)

2. వాతాధికం శీతపిత్తముదర్దస్తు కఫాధికః (మా.ని. 50/4)

3. సోత్సంగైశ్చ సరాగైశ్చ కణ్డూమద్భిశ్చ మణ్డలైః
శైశిరః కఫజో వ్యాధిరుదర్ద ఇతి కీర్తితః (మా.ని. 50/5)

అనుబంధించియున్నచో ఉత్కోఠము అనబడును.[1] జనించిన వెంటనే శమించిన కోఠము అనబడును.

ఆధునిక మతానుసారము శీతపిత్తము (Urticaria) అనేక విధములుగా నుండును. ఉదా- తీవ్ర,జీర్ణ అని అవస్థాభేదములతోను; శారీరక కారణజన్యము, శ్రమ జన్యము, పీడన జన్యము అని కారణాను సారముగను విభజింపబడినవి.

## చికిత్సాక్రమము

శీతపిత్తాది వ్యాధులందు స్నేహన స్వేదనములు చేసి సంశోధనము చేసిన తదుపరి కుష్ఠహరములైన చికిత్సలన్నియు ప్రయోగింపవలయును.[2]

పటోల, అరిష్టక (నింబ), వాసాక్వాథముతోగాని వీనితో మదనఫల చూర్ణము కలిపి గాని త్రాగించి వమనము చేయింపవలయును.

త్రిఫలాక్వాథమున పిప్పలీ చూర్ణము, గుగ్గులు కలిపి సేవింపచేసి విరేచనము చేయింప వలయును.

సర్షపతైలముతో అభ్యంగనము చేయించి ఉష్ణ జలముతో స్నానము చేయింపవలయును.[3]

---

1. అసమ్యగ్వమనోదీర్ణపిత్తశ్లేష్మాన్ననిగ్రహైః
   మణ్డలాని సకండూని రాగవన్తి బహూని చ
   ఉత్కోఠస్సానుబన్ధశ్చ కోఠ ఇత్యభిధీయతే (మా. ని. 50/6-7)
2. స్నిగ్ధస్విన్నస్య సంశుద్ధిమాదౌ కోఠే సమాచరేత్ ఉత్కోఠే శుద్ధదేహస్య
   కుష్ఠఘ్నీం కారయేత్క్రియామ్ (భా.ప్ర. 50/14)
3. శీతపిత్తేతు వమనం పటోలారిష్టవాసకైః
   త్రిఫలాపురకృష్ణాభిర్విరేకశ్చప్రశస్యతే। అభ్యంగః కటుతైలేన
   సేకశ్చోష్ణేన వారిణా (భా.ప. 50/7-8)

కోఠరోగమునందు అమ్లపిత్తహర క్రియలను గూడా ప్రయోగింపవల యును.[1]

కోఠమునందు మహాతిక్తక ఘృతపానముచే స్నేహనము చేయించి రక్త మోక్షణము చేయింప వలయును.

## ఔ ష ధ ము లు

**1.** చరకసంహితలో ఈ క్రింది ఔషధములు ఉదర్ద ప్రశమక కషాయ వర్గమున చెప్పబడినవి— తిందుక, ప్రియాల (చారపప్పు), బదరి, ఖదిర, కదర, సప్తపర్ణ, అశ్వకర్ణ (శాల), అర్జున, అసన, అరిమేద- ఈ పది ద్రవ్యములు ఉదర్ద చికిత్స శీతపిత్త చికిత్సలలో ఉపయోగింపదగినవి.[2]

**2.** త్రికటు చూర్ణము పంచదార కలిపి 1 గ్రాము మోతాదులో సేవింప చేయవలయును.

**3.** ఆమలకీ చూర్ణము గుడముతో కలిపి 3 గ్రాములు ఇవ్వవలయును.

**4.** ఆర్ద్రిక స్వరసముతో పురాణగుడము కలిపి ఇచ్చిన శీతపిత్తాది వ్యాధులు శమించును.

5. గుడముతో దీప్యకము (వాము) కలిపి సేవింపచేయుచు పథ్యపాలన చేయుచున్న ఏడు దినములలో సర్వ దేహగతమైన ఉదర్దము గూడా శమించును.

**6.** నింబ పత్రములు, ఆమలకీ చూర్ణము ఘృతముతో కలిపి సేవింపచేసిన శీతపిత్త, ఉదర్ద, కోఠ, కఫ ప్రకోపము, విస్ఫోటములను శమింపచేయును.

(భావప్రకాశ)

---

1. కుష్ఠోక్తం చ క్రమం కుర్యాదమ్లపిత్తఘ్నమేవ చ। ఉదర్దోక్తాం క్రియాంచాపి కోఠరోగే సమాసతః సర్పిః పీత్వామహాతిక్తం కార్యం శోణితమోక్షణమ్ (చక్రదత్తం 1/8)

2. చ.సూ. 4/16)

7. అగ్నిమంథమూల చూర్ణము 3-4 గ్రాములు 10 గ్రాముల ఘృతముతో కలిపి ఏడుదినములు సేవింపచేసిన శీతపిత్త, ఉదర్ద, కోఠ రోగములు శమించును.

8. యష్టీమధూక పుష్పాది క్వాథము గాని

9. అమృతారజన్యాది క్వాథము గాని శీతపిత్తమును శమింప చేయును.

10. హరిద్రాఖండము (భై.ర) 5 నుండి 10 గ్రాములు ఉష్ణ జలముతో సేవించిన కండు, దద్రు, విస్ఫోటము, శీతపిత్తము, ఉదర్దము, కోఠము ఏడు దినములలో శమించును.

11. హరిద్రాఖండము (బృహత్)గాని

12. ఆర్ద్రకఖండము గాని శీతపిత్తాది వ్యాధులను శమింప చేయుటయే కాక బల, వీర్య వర్ధకములుగా పనిచేయును. (భై.ర)

13. జసద భస్మము 100 మి.గ్రా. క్షీరముతో గాని త్రికటు చూర్ణముతో గాని రోజుకు రెండుమారులు ఇచ్చిన నూతన, పురాణ శీతపిత్తము శమించును.

14. సూతశేఖర రసము (యో.ర), గంధక రసాయనము, ఆరోగ్యవర్ధనీవటి, మల్ల సింధూరము మొదలగు ఔషధములు అవస్థానుసారము తగిన అనుపానములతో శీతపిత్తాది వ్యాధులందు మంచి ఫలితముల నిచ్చును.

15. శీత పిత్త భంజనీరసము, విశ్వేశ్వరరసము, శ్లేష్మ పిత్తాంతకరసము- ఈ రసౌషధములు శీతపిత్తాదివ్యాధులకై భైషజ్య రత్నావళియందు వివరింపబడినవి.

పైన వివరించబడిన ఔషధములు రోగియొక్క స్థితి వ్యాధ్యవస్థాదులను గమనించి తగిన విధముగా అనుపానముతో వాడవలసి యుండును.

## 16. బాహ్యప్రయోగములు :

1. సర్షపములు, హరిద్రా, కుష్ఠ, ప్రపున్నాట బీజములు, తిలలు వీని కల్కమును సర్షపతైలముతో కలిపి ఉద్వర్తనము ప్రయోగించవలయును.

2. దూర్వా,హరిద్రా- వీని కల్కలేపనము కృమి,దద్రు శీతపిత్తము,కచ్చులను శమింపచేయును.

3. యవక్షారము, సైంధవలవణము (చక్రదత్త) సర్షపతైలముతో కలిపి అభ్యంగనముచేసిన శీతపిత్తము శమించును. (భై.ర.)

4. సుశ్రుతోక్త ఏలాదిగణద్రవ్య చూర్ణము, కటుతైలముతో కలిపి ఉద్వర్తనము చేయించిన శీతపిత్తము శమించును. (చక్రదత్త)

**పథ్యములు :**

పురాణశాలిధాన్యము అన్నమునకును, ముద్గ కుళుత్థము యూషాదులకు ఉపయోగింపవలెను. కటు, తిక్త, కషాయరసములుగల ఆహారద్రవ్యములు, శుష్కమూలక యూషము, కర్కోటకము(దోస), కాకర, శిగ్రు, ఉపోదిక, శాలించశాకము, దాడిమ, వేత్రాగ్రములు, జాంగల, పశుపక్షులయొక్క మాంస రసములు, మధుసర్షపతైలము, దోషానుసారము శీతల లేక ఉష్ణ ఆహారములు, శ్లేష్మపిత్తశామకములుగా నుండు ఆహారవిహారములు శీతపిత్తాది వ్యాధులందు పథ్యములుగా నుండును.

**అపథ్యములు :**

క్షీరము, క్షీరవికారములయిన మీగడ, దధి మొదలగునవి, ఇక్షువికారము లయిన చక్కెర మొదలగునవి, మత్స్యములు, ఔదక అనూపమాంసములు, నూతన మద్యములు, స్నిగ్ధ, అమ్ల, మధురపదార్థసేవన, గురు పదార్థ ములు; విరుద్ధాహారములు, అసాత్మ్యాహార విహారములు వమనవేగమును నిరోధించుట దివాస్వప్నము, శీతల జలస్నానము, స్త్రీ సంగమము, ఆతప సేవనము, పూర్వ దక్షిణ వాయుసేవన ఇవి శీతపిత్తాది వ్యాధులందు వర్జనీయములు. (భై.ర;చ.చి.)



# విసర్పము

విసర్ప నిరుక్తి: శరీరముయొక్క వివిధమార్గములతో సర్పణము అనగా ప్రసరించు వ్యాధి అగుటవలన విసర్పము అనియు విశేషించి అన్ని వైపులకు ప్రసరించునదగుటవలన పరిసర్పమనియు నామకరణము ఈ వ్యాధికి ఏర్పడినది.[1]

## విసర్పనిదానము :

### దోషదూష్యములు :

విసర్ప ఉత్పత్తికి వాతము, పిత్తము, కఫము. ఈ మూడు దోషములును రక్తము, లసీక, త్వక్కు మాంసము. ఈ నాలుగు దూష్యములును కలిసి మొత్తం సప్తధాతువులు ఆధార రూపకారణములు లేక అభ్యంతర కారణములుగా నుండును.[2]

### బాహ్యకారణములు :

ఆహారసంబంధకారణములు లవణ, అమ్ల కటుపదార్థముల అతిసేవన, ఉష్ణ పదార్థములు, అసాత్మ్యపదార్థములు, విరుద్ధాహారములు, క్లిన్నమైన (పాసిన) ఆహారములు, అతిభోజనము, అధ్యశనము—వీటి అతిసేవన.

---

1. వివిధం సర్పతి యతో విసర్పస్తేన సస్మృతః
   పరిసర్పోఽథవా నామ్నా సర్వతః పరిసర్పణాత్ (చ.చి. 21/11)
2. రక్తం లసీకా త్వఙ్మాంసం దూష్యం దోషాస్త్రయో మలాః
   విసర్పాణాం సముత్పత్తౌ విజ్ఞేయాః సప్తధాతవః (చ.చి. 21/15)

అమ్లదధి, అమ్లదధిమస్తు, సుక్తము, సురా, మద్యము, సౌవీరకము, దూషితమైన మద్యములు, రాగము, షాడవములు శాణ్డాకపూర్వకమయిన అసుతము, (ఒకమద్య విశేషము)- మొదలగు పానములు అతిగా సేవించుట.

విదాహమును కలిగించు శాకములు, హరితవర్గ శాకములు, కూర్చిక, కిలాటము, మందకము(పూర్తిగా తోడని పెరుగు), తిలములు, మాషములు, కులత్థములు, తైలము పుష్టికరమయిన భక్ష్యములు, గ్రామ్య, ఆనూప జలచర ప్రాణుల యొక్క మాంసములు, లసునములు—వీనిని అధికముగా సేవించుట.

## విహారములు మొదలగునవి

దివాస్వప్నము, అవయవములు బంధింపబడుట, పైనుంచి క్రిందపడుట, స్వేదము యొక్క అతియోగము, ఆతప, అగ్ని సేవన, హీన, అతిశారీరకర్మలు, విషవాయుసంపర్కము, అగ్నిచే దగ్ధమగుట అజీర్ణము ఇవన్నియు విసర్పములకు సామాన్య కారణములు.[1]

---

1. లవణామ్లకటూష్ణానాం రసానామతిసేవనాత్ దధ్యమ్లమస్తుశుక్తానాం
సురాసౌవీరకస్య చ వ్యాపన్నబహుమద్యోష్ణరాగషాడబసేవనాత్ శాకానాం
హరితానాం సేవనాచ్చ విదాహినామ్ కూర్చికానాం చ కిలాటానాం సేవనాన్మ
న్దకస్య చ దధ్నః శాండాకీపూర్వాణాం అసుతానాం చ సేవనాత్
తిలమాషకులత్థానాం తైలానాం పైష్టికస్య చ గ్రామ్యానూపౌదకానాం
చ మాంసానాం లశునస్య చ ప్రక్లిన్నానామసాత్మ్యానాం విరుద్ధానాం చ
సేవనాత్ అత్యాదానాత్ దివాస్వప్నాదజీర్ణాధ్యశనాత్ క్షతాత్
క్షతబన్ధప్రపతనాత్ ఘర్మకర్మాతి సేవనాత్ (పథబద్ధపతనాత్ దంష్ట్రా
దన్తనఖక్షతాత్) విషవాతాగ్ని దోషాచ్చ విసర్పాణాం సముద్భవః
(చ.చి. 21/16-21)

## విసర్పసంప్రాప్తి :

పైన పేర్కొనబడిన కారణములచే ప్రకోపించిన వాతాదిదోషములు రక్తము లసీక, త్వక్కు, మాంసము, ఈ దూష్యములను దూషింపచేసి సర్వాంగ ములందును వ్యాపించునట్టియు(శరీరములో ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు ప్రసరించునట్టియు) విస్తృతమైనదిగానుండి అంతగా ఉన్నతము కానటువంటి శోథను కలిగించును.

ఈ శోథ వివిధ ప్రకారములుగా అన్ని వైపులకు ప్రసరించుచుండుట విసర్పమనియు పరిసర్పమనియు అనుచుందురు.

ఈ వ్యాధి ముఖ్యముగా అహిత ఆహారవిహారములచే కలుగును [1]

## విసర్ప భేదములు :

అధిష్టానానుసార విసర్పభేదములు :

1. బహిరాశ్రితము
2. అభ్యన్తరాశ్రితము
3. ఉభయాశ్రితము [2]

---

1. i) ఏతైర్నిదానైః వ్యామిశ్రైః కుపితా మారుతాదయః
దూష్యాన్ సందూష్య రక్తాదీన్ విసర్పన్త్యహితాశినామ్ (చ.చి. 21/2

ii) త్వఙ్మాంసశోణితగతాః కుపితాస్తు దోషాః సర్వాంగసారిణమసంస్థితమా
త్మలింగమ్ కుర్వంతి విస్తృతమనున్నతమాశుశోథం తం సర్వతో
విసరణాచ్చ విసర్పమాహుః (సు.ని. 1

2. బహిఃశ్రితః శ్రితశ్చాన్తస్తథా చోభయసంశ్రితః
విసర్పో బలమేతేషాం జ్ఞేయం గురు యథోత్తరమ్ (చ.చి. 21/2

**దోషానుసార విసర్ప భేదములు :**

చరకమతానుసారము విసర్పము ఏడు విధములుగానుండును. 1. వాతజ విసర్పము 2. పిత్తజ విసర్పము 3. శ్లేష్మజ విసర్పము 4. వాతపిత్తజ-అగ్ని విసర్పము 5. పిత్తకఫజ-కర్దమ విసర్పము 6. కఫవాతజ గ్రంథి విసర్పము 7. సన్నిపాతజ విసర్పము।

సుశ్రుతమతానుసారము విసర్పములు ఐదువిధములుగా నుండును అవి.

1. వాతజ విసర్పము
2. పిత్తజ విసర్పము
3. కఫజ విసర్పము
4. సన్నిపాతజ విసర్పము
5. క్షతజ విసర్పము

## అధిష్ఠానానుసార విసర్ప సంప్రాప్తి లక్షణములు

సంప్రాప్తి :-

తమ తమ ప్రకోపక కారణముల చేతను, విశేషించి విదాహి పదార్థముల సేవన చేతను ప్రకోపించిన వాతాది దోషములు శరీరమునందలి ఆభ్యంతర అవయవములలో ప్రసరించినపుడు ఆభ్యంతరాశ్రిత విసర్పము జనించును.

---

3. స చ సప్తవిధో దోషైః విజ్ఞేయస్సప్తధాతుకః పృథక్ త్రయః త్రిభిశ్చైకో విసర్పో ద్వాంద్వజాః త్రయః వాతికః పైత్తికశ్చైవకఫజశ్చాన్నిపాతికః చత్వారఏతే విసర్పాః వక్ష్యన్తే ద్వంద్వజా స్త్రియః ఆగ్నేయో వాతపిత్తాభ్యాం గ్రంథ్యాఖ్యః కఫవాతజః యస్తు కర్దమకో ఘోరః స పిత్తకఫసంభవః (చ.చి. 21/12-14)

దోషములు పై విధముగ శరీరమందలి బాహ్య భాగమును ఆశ్రయించినపుడు బహిరాశ్రిత విసర్పము జనించును.

దోషములు పై విధముగా ప్రకోపించి అభ్యంతరావయవములను బాహ్య భాగములను రెండింటిని ఆశ్రయించినపుడు ఉభయాశ్రిత విసర్పము కలుగును.[1]

లక్షణములు :-

అభ్యంతర విసర్ప లక్షణములు—హృదయాది మర్మ స్థానములందు ఆఘాతము కలుగుట, ఇంద్రియముల యొక్క మోహము (ఇంద్రియ విషయ గ్రహణమున అయథా ప్రవృత్తి), స్రోతోవరోధము, అతి తృష్ణ, మలమూత్రాది వేగముల విషయ ప్రవృత్తి, అగ్ని మరియు బలము క్షీణించుట—ఈ లక్షణములు అభ్యంతర విసర్పములందు కలుగును.

బహిరాశ్రిత విసర్ప లక్షణములు—పై లక్షణములు కలుగకుండా ఆయా దోషాను సారము క్రింద చెప్పబోవు వాతాది విసర్ప లక్షణములతో కూడి యుండును.

ఉభయాశ్రిత విసర్పలక్షణములు—రెండు లక్షణములు కలిసియుండుట.[2] కలుగును.

---

1. స్యాద్విసర్పోఽభిఘాతాన్తైర్దోషైర్దూష్యైశ్చ శోఫవత్ త్ర్యధిష్ఠానం తు తం
ప్రాహుర్బాహ్యాన్తరుభయాశ్రయాత్ యథోత్తరం చ దుఃసాధ్యాస్తత్ర
దోషా యథాయథమ్ ప్రకోపణైః స్వైః కుపితాం విశేషేణ విదాహిభిః
దేహే శీఘ్రం విసర్పన్తి తేఽన్తరన్తః శ్రితా బహిః బహిఃస్థా
స్త్వితయోద్వయస్థాః (అ.సం.ని. 13)

2. i) మర్మోపఘాతాత్ సమ్మోహాత్ అయనానాం విఘట్టనాత్ తృష్ణాతియోగాద్వే
గానాం విషమాణాం ప్రవర్తనాత్ విద్యాద్విసర్పమన్తర్జమాశు చాగ్ని
బలక్షయాత్ అతో విపర్యయాద్బాహ్యం అన్యైర్విద్యాత్ స్వలక్షణైః
(చ.చి. 21/26-27)

ii) అ.సం.ని. 13

సాధ్యాసాధ్యత :-

ఉభయాశ్రిత విసర్పమునకు కారణములు బలముగా నుండి ఉపద్రవములతో కూడియుండి మర్మ స్థానముల నాశ్రయించి యున్నచో అట్టి విసర్పము మనుజుని చంపును.

## వాతిక విసర్పము

నిదానము :-

రూక్షకరములైన పదార్థములు, ఉష్ణవీర్యము కల పదార్థములు వీటిని సేవించుట వలన, వాతము సంచరించు మార్గము ఇతర దోషములచే పూరింపబడి అడ్డగింపబడుట వలన వాతము మిగుల దూషితమై ప్రకోపించి రక్తాదిదూష్యముల చెరచి శరీరమున స్వేచ్ఛగ వ్యాపించి విసర్పమును కల్గించును.[1]

లక్షణములు :-

వాతముచే కలిగిన విసర్పమునందు భ్రమ మదము, దవథువు—కసన్నలు మొదలగు వానియందు మంట పిపాస, నిస్తోద, శూల, అంగమర్దము, ఉద్వేష్టనము కంపము, జ్వరము, తమకశ్వాస, అస్థిసంధులందు ముక్కలి బాధ, సంధి విశ్లేషణము లేపనము, అరుచి, అవిపాకము (ఆహారము జీర్ణము కాకుండుట), కన్నులు కలకబారినట్లుండి కన్నీరుకారుట, (అస్రాగమనం,) అవయవములపై చీమలు పాకుచున్నట్లుండుట, ఈ లక్షణములు కలుగును.

విసర్పము ఏ ప్రదేశమున వ్యాపించునో ఆ ప్రదేశమునందు శ్యామ వర్ణముగా, అరుణ వర్ణముగా మారి వాపు కలుగును. ఆ వాపు వ్యాపించిన ప్రదేశము

---

1. రూక్షోష్ణైః కేవలైర్వాయుః పూరణైర్వా సమావృతః
   ప్రదుష్టో దూషయన్ దూష్యాన్ విసర్పతి యథాబలమ్ (చ. చి. 21/29)

లందు శూలములతో పొడిచినట్లుగా బాధ కలుగును. ఈ ప్రదేశములందు రోమములు నిక్కపొడుచుకున్నట్లు ఉండును. ఆ లక్షణము విసర్పము వ్యాపించిన అన్ని ప్రదేశములలో కలుగును. వాత జ్వరలక్షణములు కూడా అనుబంధించును.

ఈ విసర్ప వ్యాధికి శీఘ్రముగా తగిన చికిత్స చేయని యెడల శీఘ్రముగా భేదింపబడునవి, సూక్ష్మాకారమైనవి, అరుణ వర్ణము, శ్యావవర్ణము కలిగినవి. విశదముగా, స్వచ్ఛముగా వుండు అరుణ వర్ణ ద్రవము స్వల్పముగా స్రవించునవి అగు స్ఫోటములుచే ఆవరింపబడును. ఈ విధమైన లక్షణములతో కూడిన రోగికి అపానవాతము, మూత్రపురీషములు విబద్ధమగును. దీనికి నిదానముగా చెప్పబడిన రూక్షోష్ణాది ద్రవ్యములు మున్నగు వానిని సేవించినచో ఇంకను వృద్ధి పొందును. దీనికి విరుద్ధ గుణములైన స్నిగ్ధశీతాది ద్రవ్యములు సేవించినచో కొంత శమించును.[1]

దూష్యములధికముగా దుష్టి చెందిన విషయములైన గాదములతో కూడి చికిత్సక సాధ్యమై వర్జనీయమగును.[2]

---

1. i) తస్య రూపాణి భ్రమ దవథు పిపాసా నిస్తోద శూలాఽంగమర్దోద్వేష్టన
కమ్ప జ్వర తమక కాసాఽస్థిసన్ధిభేద విశ్లేషణ వేపనాఽరోచకాఽవిపాకాః
చక్షుషోరాకులత్వా అస్రాగమనం, పిపీలికాసంచారఇవచాఽంగేషు
యస్మింశ్చాఽవకాశే విసర్పో విసర్పతి సోఽవకాశః శ్యావాఽరుణాభాసః
శ్వయథుమాన్, నిస్తోదభేదశూలాయామసంకోచహర్షస్ఫురణైరతిమాత్రం
ప్రపీడ్యతే అనుపక్రాన్తశ్చోపచీయతే శీఘ్రభేదైః స్ఫోటకైః
తనుభిరరుణాభైః శ్యావైర్వా, తనువిశదారుణాఽల్పాస్రావైః
విబద్ధవాతమూత్రపురీషశ్చభవతి, నిదానోక్తాని చాస్యనోపశేరతే విపరీతాని
చోపశేరేతే ఇతి వాతవిసర్పః (చ.చి. 21/30)

ii) తత్ర వాతాత్ స వీసర్పో వాతజ్వరసమవ్యథః
శోధ స్ఫూరణ నిస్తోద భేదాయాసార్తి హర్షవాన్ (మా.ని. 52/5.6)

2. వాతాత్మకేఽసిత మృదు పరుషోఽసిత

## పిత్తజ విసర్పము

నిదానము :-

ఉష్ణవీర్యముకలిగిన, ఉష్ణగుణములు కలిగిన అన్నపానాది ఉపచారముల చేతను, విదాహకరమైన ఆమ్ల రసములతో కూడిన ఆహారాదులను సేవించుట చేతను, పిత్తము ప్రకోపించి రక్తాది దూష్యములను చెరచి శరీరమునందు కల ధమనులను పూరించి అనేక విధములుగా వ్యాపించి విసర్పమును కలిగించును.[1]

లక్షణములు :-

పిత్తము వలన జనించిన విసర్పము అతి శీఘ్రముగా వ్యాపించుచు— జ్వరము, భ్రమ, అంతర్దాహము, తృష్ణ, మూర్ఛ, మోహము, అంగభేదము, ఛర్ది, అధికస్వేదము, శిరశ్శూల, అనిద్ర, అరతి, చల్లని వాటియందు, చన్నీటి యందు అతి ఇచ్ఛ అరోచకము మొదలగు లక్షణములు కలుగును. ఇవియే కాక నేత్రములందు, మూత్ర పురీషములందు హరిత వర్ణముగాని, హరిద్ర వర్ణముగాని కలిగి వుండును.

శరీరమునందు విసర్పము వ్యాపించిన ప్రదేశములలో తామ్ర వర్ణము, హరిత వర్ణము, హరిద్రవర్ణము, నీలవర్ణము, కృష్ణవర్ణము, రక్తవర్ణము వీనిలోని ఏదేని ఒక వర్ణము కలిగి వృద్ధినొందుచుండును. అధిక ప్రమాణముకలిగి, మంట, విపరీతమైన బాధతో కూడిన స్ఫోటములచే వ్యాపింపబడి, ఆ స్ఫోటములనుండి సమవర్ణముతో కూడిన ద్రవము స్రవించుచుండును.

అట్టి స్ఫోటములు చిరకాలమునకు పాకమగును. పిత్తజ విసర్పమునకు చెప్పబడిన నిదానములైన ఉష్ణ ఉపచారాదులచే ఇది మరింత వృద్ధినొందును.

---

1. పిత్తముష్ణోపచారేణ విదాహ్యమ్లాశనైశ్చితం
దూష్యాన్ సన్దూష్య ధమనీః (మార్గాంశ్చ)
పూరయన్ వై విసర్పతే (చ.చి. 21/31)

వీనికి విరుద్ధములైన శీతాది ఉపచారములచే కొంచెము శమించును. ఈ లక్షణములు పిత్తజ విసర్పమునందు కలుగును.[1]

దోషములు అధికముగా వృద్ధిచెందునపుడు మాంసము, సిరలు నశించి కృష్ణాంజనము వంటి కర్దమముతో కూడి చికిత్సకు అసాధ్యమగును.

## శ్లైష్మిక విసర్పము

**నిదానము :-**

స్వాదు, అమ్ల, లవణ రసములతో కూడినవియు, గురుగుణములతో కూడినవియు అగు ఆహారాదులు భుజించుటవలనను, పగలు నిద్రించుట చేతను, అధికముగా వృద్ధిపొందిన కఫము ప్రకోపించి రక్తాది దూష్యములను చెరచి కఫజ విసర్పమును కలిగించును. ఈ విసర్పము శరీరమందు మెల్ల మెల్లగా కొంత కాలమునకు వ్యాపించును.[2]

**లక్షణములు :-**

శ్లేష్మము వలన కలిగిన విసర్పమునందు—శీత జ్వరము, శీతకము, (చల్లగానుండుట) మధురాస్యతా, ఆస్యోపలేపము, గురుత్వము, ఛర్ది, హృల్లా

---

1. i) తస్యరూపాణి—జ్వరస్తృష్ణా మూర్ఛా మోహశ్ఛర్దిరరోచకోఽంగభేదః స్వేదోఽతిమాత్రం అన్తర్దాహః శిరోరుక్ చక్షుషోరాకులత్వమస్వప్నప్రలాపః అరతిః భ్రమః శీతవాతవారితర్షోఽతిమాత్రం హరితహారిద్రనేత్రమూత్రవర్చస్త్వం హరితహారిద్రరూపదర్శనం చ యస్మింశ్చావకాశే విసర్పోఽనుసర్పతి సోఽవకాశస్తామ్రహరితహారిద్రనీలకృష్ణరక్తానాం వర్ణానామన్యతమం పుష్యతి సోత్సేధైశ్చ అతిమాత్రం దాహసంభేదనపరీతైః స్ఫోటైరుపచీయతే తుల్యవర్ణస్రావైః చిరపాకైశ్చ నిదానోక్తాని చాస్యనోపశేరతే విపరీతానిచోపశేరతే ఇతిపిత్తవిసర్పః (చ.చి. 21/32)
   ii) పిత్తాద్ద్రుతగతిః పిత్తజ్వరోలింగోఽతిలోహితః
2. స్వాద్వమ్లలవణస్నిగ్ధగుర్వన్నస్వప్నసంచితః కఫః సందూషయన్ దూష్యాన్ కృచ్ఛ్రమంగే విసర్పతి (చ.చి. 21/33)

...ము, ప్రసేకము, ఆలసత్వము, నిద్ర, తంద్ర, అరోచకము, అగ్నినాశనము, ...పత్వము ఈ లక్షణములు కలుగును.

శ్లేష్మజ విసర్పము వ్యాపించిన ప్రదేశములందు వాపుకలిగి, పాండువర్ణము ...ని రక్తవర్ణముగాని కలిగివుండును. తైలము పూసినట్లుండి, స్పర్శ నశించి ...వుగా నుండును. స్వల్పమైన బాధతో కూడి, వాపు కలిగిన ప్రదేశమునందు ...తవర్ణము లేదా పాండువర్ణము కలిగిన స్ఫోటములు వ్యాపించును. ఆ స్ఫోటము ...పైగల చర్మము జిగటతో కూడి ఘనముగా ఉండును. ఈ విధమైన కఫజ... ...ర్పము చిట్లినపుడు శ్వేతవర్ణముగా, పిచ్ఛిలముగ, తంతువులతో కూడి, అను ...ధముగనుండి స్నిగ్ధముగానుండు ద్రవమును స్రవించును. శరీరమునందు ఊర్ధ్వ ...గమున గురుత్వము కలిగి, స్థిరముగావుండు, జాలమువలె వ్యాపించియుండు ...ణములు వ్యాపించును. ఈ విసర్పము దీర్ఘకాలము అనుబంధించి యుండును.

కఫజ విసర్ప వ్యాధిచే పీడింపబడు రోగికి నఖములు, నయనములు, ...క్, వదనము, మల మూత్రములు శ్వేతవర్ణములో వుండును. దీనికి నిదాన ...ంగా చెప్పబడిన మధురాది ఆహారములచే ఇది పరింత వృద్ధిచెందును. వీనికి ...రుద్ధములైన ఆహారములచే కొంచెము శాంతించును.[1]

---

1. i) తస్యరూపాణి-శీతకః శీతకజ్వరో గౌరవం నిద్రాతన్ద్రా ఽరోచకో మధురాస్యత్వమాస్యోపలేపో నిష్ఠీవికా ఛర్దిరాలస్యం స్తైమిత్యమగ్నినాశో దౌర్బల్యంచ యస్మింశ్చావకాశే విసర్పో ఽనువర్పతి సో ఽవకాశః శ్వయధుమాన్ పాండుర్నాతిరక్తః స్నేహసుప్తి స్తంభగౌరవైరన్వితో ఽల్పవేదనః కృచ్ఛ్రపాకైశ్చిరకారిభిః బహులత్వగుపలేపైః స్ఫోటైః శ్వేతపాండుభిరనుబధ్యతే ప్రభిన్నస్తుశ్వేతం పిచ్ఛిలం తంతుదుర్ఘన మనుబధ్యతే, ప్రభిన్నస్తు శ్వేతం పిచ్ఛిలం తంతుమద్ఘమనుబద్ధం స్నిగ్ధమాస్రావం స్రవత్యూర్ధ్వం చ గురుభిః స్థిరైః జాలవతైః స్నిగ్ధైర్బహులత్వగుపలేపైః ప్రణైరనుబధ్యతేఽనుషంగీ చ భవతి శ్వేతనఖనయనవదనత్వంగ్మూత్రవర్చస్త్వం నిదానోక్తాని చాస్యనోపశేరతే విపరీతాని చోపశేరత ఇతి శ్లేష్మవిసర్పః (చ.చి. 21/34)

ii) కఫాత్కండూయుతస్స్నిగ్ధః కఫజ్వర సమానరుక్

## వాతపిత్తజ (అగ్ని) విసర్పము

నిదానము :

వాత పిత్తదోషములు రెండును వాని వానికి వేరు వేరుగ చెప్పబడిన కారణముల సంసర్గముచే రెండును ఏకకాలమున అధికముగా ప్రకుపితమై ఒక దానివలన ఇంకొకటి బలమునుపొంది శరీరమును దహించుచు అనేక విధములుగావ్యాపించి విసర్పమును కలిగించును. అట్టి విసర్పమునకు అగ్ని విసర్పము అని పేరు.[1]

లక్షణములు :

అగ్ని విసర్పముచే పీడింపబడు రోగి ఈ క్రింది లక్షణములు కలిగి వుండును. తీవ్రజ్వరము, శరీరమందంతట అగ్నికణములు చల్లినట్లు తలంచును, ఛర్ది, మూర్ఛ, అతిసారము, దాహము, మోహము, తమకము, అరుచి, గ్రన్థి భేదము, అస్థి సన్ధిభేదము, అగ్నిమాంద్యము, తృష్ణ మొదలగునవి.

అగ్ని విసర్పము వ్యాపించిన ప్రదేశములందు చల్లార్చబడిన అగ్ని (బొగ్గు)వలె శ్యామవర్ణములోగాని రక్తవర్ణములోగాని వుండును. మరియు ఆ ప్రదేశములందు అగ్నిచే దగ్ధమయినట్లు కనిపించు స్ఫోటములు ఉద్భవించును. ఈ విసర్పము వాతజ సంబంధమువలన అతి శీఘ్రముగా వ్యాపించి మర్మస్థలములందు చేరును. దీనివలన వాతము మిక్కిలి బలిష్టమై అంగముల నన్నింటిని భేదించుచు, శరీరమందలి ప్రజ్ఞను హరించి చిత్తభ్రమను కలిగించును. నిద్రానాశనము, శ్వాస, హిక్క వీనిని కలిగించును. అగ్ని విసర్పముచే పీడింపబడుచున్న రోగి తీవ్రమైన అశాంతికి లోనగును. ఏ ఒక్క విషయమునందైన

---

1. వాతపిత్తం ప్రకుపితమతి మాత్రం స్వహేతుభిః
   పరస్పరం లబ్ధబలం దహద్గాత్రం ప్రసర్పతి (చ.చి. 21/35)

   కా. (3). 23

ఇచ్ఛలేక యుండును. ఈ విధమైన అశాంతితోకూడిన మనస్సుచేత దేహముచేత అనేక విధములుగా క్లేశములనొంది మనో దేహములయొక్క భ్రమచే జనించిన మోహముతో కూడుకొనినవాడై తిరిగి మేల్కొనుటకు వీలుకాని గాఢనిద్రను పొందును. ఇట్టి లక్షణములచే కూడిన దానిని అగ్ని విసర్పమని చెప్పబడును. ఈ విసర్పముచే పీడింపబడు రోగికి చికిత్స చేయరాదు.[1] అనగా అసాధ్యము అని భావము.

## కఫ పిత్తజ (కర్దమ) విసర్పము

నిదానము :

కఫ పిత్తదోషములు రెండు బలమైన వాని కారణములచే అధికముగా ప్రకోపమునుపొంది శరీరమునందు ఏదేని ఒక ప్రదేశమునందు విసర్పమును కలిగించును. అట్టి విసర్పము శరీరమును దూషింపచేయును. ఇది కఫ పిత్తదోషముల సంసర్గముచే కలిగిన కర్దమను విసర్పము.[2]

---

1. i) తదుపతాపాదాతురః సర్వశరీరమంగారైరివ ఆకీర్యమాణం మన్యతే, చర్ద్యతీసారమూర్ఛాదాహమోహజ్వరతమకారోచకాస్థిసన్ధిభేదతృష్ణాఽవిపాకాంగభేదాదిభిశ్చాభిభూయతే, యం యంచావకాశం విసర్పోఽనుసర్పతిసోఽవకాశః శాన్తాంగారప్రకాశోఽతిరిక్తో వా భవతి, అగ్నిదగ్ధప్రకారైశ్చ స్ఫోటైరుపచీయతే స శీఘ్రగత్వాదాశ్వేవమర్మానుసారీ భవతి. మర్మణిచోపతప్తేఽవనోఽతిబలోభిన్యత్త్యంగాన్యతిమాత్రం ప్రమోహయతి సంజ్ఞాం హిక్కాశ్వాసౌజనయతి, నాశయతి నిద్రాం, షవష్టనిద్రః ప్రమూఢసంజ్ఞో వ్యధితచేతాః న క్వచనసుఖముపలభతే అరతి పరీతః స్థానాదాసనాత్ శయ్యాం క్రాన్తుమిచ్ఛతి క్లిష్టభూయిష్ఠశ్చాశునిద్రాం భజతి దుర్బలోదుఃఖప్రబోధశ్చ భవతి తమేవంవిధమగ్ని విసర్పపరీతమచికిత్స్యం విద్యాత్ (చ.చి. 21/36)

2. కఫపిత్తం ప్రకుపితం బలవత్ స్వేనహేతునా
విసర్పత్యేకదేశే తు ప్రక్లేదయతి దేహినామ్ (చ.చి. 21/37)

లక్షణములు :

కఫ పిత్తములు రెండింటి ప్రకోపమువలన కలిగిన కర్దమను విసర్పమున శీత జ్వరము, శిరోగురుత్వము, శరీర స్తంభము, ప్రలాపము, నిద్ర, శరీర కృశత్వము, ఆయాపవేశానం, మూర్ఛ, మోహము, దాహము, ఇంద్రియము లకు జడత్వము, దుర్బలత్వము, అన్నద్వేషము, అస్థిభేదము, పిపాస, అగ్ని నాశము, నాసాది స్రోతోఛిద్రములందు ప్రలేపము, అంగ విక్షేపము, అంగ మర్దము, ఏకదేశ గ్రాహిత్వము, అపక్వమలము తరచుగా వెడలుట, అలసత్వము, ఈ లక్షణములతో కూడిన కఫ పిత్తములకు స్థానమైన ఆమాశయమునందు ఒక ప్రదేశమునందు వ్యాపించి, శరీరమంతటా మెల్లగా వ్యాపించును.

కర్దమ విసర్పము ఏ ప్రదేశములందు వ్యాపించునో ఆ ప్రదేశములందు రక్త వర్ణముగాని, పీత వర్ణముగాని, పాండువర్ణముకాని కలిగిన పిటకములచే వ్యాప్తమై స్నిగ్ధత్వమును, కృష్ణవర్ణము, నీలివర్ణము మొదలగు చిత్రవర్ణములు కలిగి మలినమై వుండును. ఈ పిడకములు వాపుతోకూడి భారముగా ఉండును. లోభాగమున పరిపాకము కలిగినదిగా, ఉష్ణాధిక్యతతో కూడినదిగా ఉండును. హస్తముచే పీడింపబడిన ఎడల నానాట క్రుళ్ళియుండుటవలన లోపల దుర్గంధ మైన అడుసువలె యుండు మాంసము బయటపడును. దానిని తొలగించిన లోపల నుండు సిరలు, స్నాయువులు కనపడుచుండును. ఈ లక్షణములు కలిగిన దానిని కర్దమ విసర్పమని వచించెదరు. ఈ వ్యాధి అసాధ్యము కావున ఈ వ్యాధిచే పీడింపబడు రోగికి చికిత్స చేయరాదు.[1]

---

1. i) తద్వికారాః-శీతజ్వరః శిరోగురుత్వం దాహః స్తైమిత్యం అంగావసదనం నిద్రా తన్ద్రా మోహోఽన్నద్వేషః ప్రలాపోఽగ్నినాశః దౌర్బల్యమస్థిభేదో మూర్ఛా పిపాసా స్రోతసాం ప్రలేపో జాడ్యమింద్రియాణాం ప్రాయోప దేశనయంగవిక్షేపోఽంగమర్దోఽరతిరౌత్సుక్యం చోపజాయతే ప్రాయశ్చా (Contd....

## కఫ వాతజ (గ్రంధి) విసర్పము

**నిదానము :**

స్థిర, గురు, కఠినగుణములు కలిగినవియు మధురరసము, శీతవీర్యముతో కూడినవియు స్నిగ్ధములైనవియు అగు ఆహారాదులు సేవించినను, స్రోతో మార్గములందు ద్రవమును కలిగించెడి పదార్థములు సేవించినను, శరీర పరిశ్రమ చేయకపోయినను, వమన విరేచనాది పంచకర్మలను వాని వాని నియతకాలమున చేయకున్నను, శ్లేష్మము, వాతము ఏక కాలమున ప్రకోపించును. ఆ రెండును ఒక దానిచే మరియొకటి దూషితమై మిక్కిలి వృద్ధినొంది అధిక బలముకలిగి రక్తాదిదూష్యములను దూషింపచేసి గ్రంధి విసర్పమును కలిగించును.[1]

**లక్షణములు :-**

గ్రంధి విసర్ప వ్యాధిచే పీడింపబడు రోగి ఈ క్రింది లక్షణములు కలిగి వుండును. ఈ వ్యాధి యందు వాతము ప్రకోపించియున్న కఫముచే అడ్డగింప

---

మాశయే విసర్పత్యలసకఏకదేశగ్రాహీ చ యస్మిణ్చావకాశే విసరోవ్పిస ర్పతి సోఽవకాశోరక్తపీతపాండుపిడకావకీర్ణవమేచకాభః కాలో మలినః స్నిగ్ధోబహూష్మా గురుః స్తిమితవేదనః శ్వయధుమాగంభీరపాకో నిరాస్రావః శీఘ్రక్లేదః స్విన్నక్లిన్నపూతిమాంసత్వక్ క్రమేణాల్పరుక్, పరామృష్టోఽవదీర్యతే, కర్దమఇవావపీడితోఽన్తరంప్రయచ్చత్యుపక్లిన్న పూతిమాంసత్యాగి, సిరాస్నాయుసందర్శీ, కుణపగన్ధీ చ భవతి సంజ్ఞా స్మృతిహన్తా చ తం కర్దమవిసర్పపరీతమచికిత్స్యం విద్యాత్

(చ. చి. 21/38)

1. స్థిరగురుకఠినమధురశీతస్నిగ్ధాఽన్నపానాఽభిష్యన్దిసేవినాం అవ్యాయామాది సేవినామ్, అప్రతికర్మశీలానాం, శ్లేష్మవాయుశ్చప్రకోపమాపద్యంతే తావుభౌదుష్టప్రవృద్ధావతి బలౌప్రదూష్య దూష్యాన్ విసర్పాయ కల్పేతే

(చ. చి. 21/39)

బడి, తన మార్గమునకు అడ్డుపడిన ఆ కఫమును అనేక విధములుగ ఛేదించును. పిదప చర్మ సిరాస్నాయువులను ఆశ్రయించియుండు రక్తమును దుష్టములుగ చేసి మిక్కిలి దీర్ఘములు సూక్ష్మరూపములు కలిగిన గ్రంధులను మాలికవలె వరుసగా కలిగించును. అటువంటి గ్రంధిమాల రక్తవర్ణమై, మిగుల తీవ్రమైన వేదనయు జ్వరమును కల్గి యుండును. ఈ వ్యాధియందు శ్వాస, కాసములు, అతిసారము, నోరెండుట, వెక్కిళ్ళు, ఛర్ది, భ్రమ, ఇంద్రియ సంమోహము, శరీర వర్ణము మారుట, మూర్ఛ, అంగభంగము, అగ్నిమాంద్యము, ఈ లక్షణములు కలిగియుండును.[1]

## సన్నిపాత విసర్పము

లక్షణములు :-

వాతాది విసర్పములకు వేరు వేరుగా చెప్పబడిన కారణములన్నింటిచేత వానికి చెప్పిన లక్షణములు అన్నింటితో కూడి విసర్పములకు చెప్పబడిన రక్తాది ధాతువుల నాలిగిటినేకాక మిగిలిన మేదో మజ్జాదులతో కూడిన సర్వధాతువులను అనుసరించి వ్యాపించిన విసర్పము సన్నిపాతజ విసర్పము. ఈ విసర్పము మిగి

---

1. i) తత్ర వాయుః శ్లేష్మణా విబద్ధమార్గః తమేవ శ్లేష్మాణం అనేకధా భిన్దన్ క్రమేణ గ్రన్థిమాలాం కృచ్ఛ్రపాకసాధ్యాం కఫాశయే సంజనయతి, ఉత్పన్నరక్తస్య వా ప్రమోష్మా రక్తం సిరాస్నాయుమాంసత్వగాశ్రితం గ్రన్థీనాం మాలాం కురుతే తీవ్రరుజానాం స్థూలానాం అణూనాం వా దీర్ఘవృత్తరక్తానామ్ (చ.చి. 21/39)

ii) తదుపతాపాత్ జ్వరాఽతిసారకాసహిక్కాశ్వాసశోషప్రమోహవైవర్ణ్యాఽరోచకాఽవిపాకాప్రసేకచ్ఛర్ది మూర్ఛాఽంగభంగనిద్రారతిసదనాద్యాః ప్రాదుర్భవన్త్యుపద్రవాః స ఏతైరుపద్రుతః సర్వ కర్మణాం విషయమతిపతితో వివర్జనీయో భవతి ఇతి గ్రంధివిసర్పః (చ.చి.21/40)

లిన విసర్పములన్నింటికన్న అతి శీఘ్రముగా వ్యాపించు స్వభావము కలిగి మిక్కిలి అసాధ్యముగా నుండును. కావున చికిత్స చేయరాదు.[1]

## క్షతజ విసర్పము

లక్షణములు :-

శస్త్రాది ప్రహారములు మొదలగు బాహ్యకారణముల వలన వాతము ప్రకోపించి రక్తమును పిత్తమును ప్రేరేపించి ఉలవలవంటి స్ఫోటములచే వ్యాప్తమైన విసర్పమును కలిగించును. మరియు ఈ విసర్పము శోథ, జ్వరము, నొప్పి, దాహము ఈ లక్షణములతో కూడి శ్యావ, అరుణ వర్ణములు కలిగియుండును. ఇది క్షతజ విసర్పమని చెప్పబడును. మరియు జ్వరము, అతిసారము, ఛర్ది, త్వగ్మాంసములు పగులుట, బడలిక, అరుచి, అజీర్ణము, అపస్మయు, క్షతజ విసర్పముచే జనించు ఉపద్రవములు.[2]

## విసర్ప సాధ్యాఽసాధ్యత

లక్షణములు :-

పైన చెప్పబడిన విసర్పములలో వాత-పిత్త కఫములచే వేరు వేరుగా జనించిన మూడును వానివాని చికిత్సలచే సాధింప దగియుండును. ద్వంద్వజ

---

1. సర్వాయతనసముత్థం సర్వలింగవ్యాపినం సర్వధాత్వనుసారిణం
   ఆశుకారిణం మహాత్యయికమితి సన్నిపాతవిసర్పం, అచికిత్స్యం విద్యాత్
   (చ.చి. 21/42)

2. బాహ్యహేతోః క్షతాత్క్రుద్ధస్స రక్తం పిత్తమీరయన్॥ విసర్పం
   మారుతః కుర్యాత్కుళత్థసదృశైశ్చితమ్ స్ఫోటైశ్శోథజ్వరరుజాదాహాఢ్యం
   శ్యావశోణితమ్॥ జ్వరాతిసారౌవమథు స్త్వగ్మాంసదళనంక్లమః
   అరోచకావిపాకౌ చ విసర్పాణా ముపద్రవాః

విసర్పములతో వాత పిత్త సంసర్గము వలన కలిగిన అగ్ని విసర్పమును, కఫ పిత్తదోషముల సంసర్గము వలన కలిగిన కర్దమ విసర్పమును, ప్రధానమైన హృదయాది మర్మములందు వ్యాపించక, సిరలు యొక్క, స్నాయువులయొక్క, మాంసము యొక్క కుళ్ళిన ద్రవము స్రవించక వున్నచో అట్టి దోషములు రెండింటికి సాధారణమైన చికిత్స అతి మెలకువతో అనతి కాలము విడువక చికిత్స చేసినఎడల శాంతినొందును. అటువంటి చికిత్స సరిగా చేయకపోయినచో ఈ విసర్పవ్యాధులు కూడా అసాధ్యములై సర్పమువలె రోగిని శీఘ్రముగా చంపును.

వాత కఫముల సంసర్గముచే కలిగిన గ్రంధి విసర్పము జ్వరము మొదలగు ఉపద్రవములు కలుగకముందే చికిత్స చేయవలెను. ఇట్లుగాక ఉపద్రవములతో కూడియున్న ఎడల వ్యాధి అసాధ్యమగును. కావున చికిత్స చేయరాదు. సన్నిపాతమున కలిగిన విసర్పము రసాదిధాతువుల నన్నిటిని ఆశ్రయించి జనించుట వలన, శీఘ్రముగా వ్యాపించుట వలన, వాతాది దోషములకు పరస్పర విరుద్ధము లగు చికిత్సలు చేయవలసి యుండుటవలన మిక్కిలి అసాధ్యముగా నుండును.[1]

1. i) తత్ర వాత పిత్త శ్లేష్మనిమిత్తా విసర్పాస్త్రయః సాధ్యాభవన్తి అగ్నికర్దమాఖ్యౌ పునరనుపసృష్టేషుమర్మసు, అనుగతే వా సిరాస్నాయుమాంసక్లేద సాధారణక్రియాభిరుభావేవ అభ్యస్య ప్రశాన్తిమాపద్యేయాతామ్ అనాదరోపక్రాన్తః పునః తయోరన్యతరో హన్యాద్దేహమాశ్వేనఆశీవిషవత్ తథా గ్రన్థి విసర్ప మజాతోపద్రవం అరభేత చికిత్సతుమ్ ఉపద్రవోపద్రుతం త్వేనం పరిహరేత్ సన్నిపాతజస్తు సర్వధాత్వనుసారిత్వాత్ ఆశుకారిత్వాత్ విరుద్ధోపక్రమత్వాచ్చ, అసాధ్యం విద్యాత్

(చ.చి. 21/43)

ii) సిధ్యన్తి వాతకఫపిత్తకృతా విసర్పా స్సర్వాత్మకః క్షతకృతశ్చన సిద్ధిమేంతి పిత్తాత్మకోఽంజనవపుశ్చ భవేదసాధ్యః కృచ్ఛ్రాశ్చ మర్మసు భవన్తి హి సర్వఏవ

# విసర్ప చికిత్స

## సామాన్య చికిత్స

విసర్ప వ్యాధియందు దోషప్రాధాన్యతను దృష్టిలో నుంచుకొని విరేచనము వమనము, రక్తమోక్షణము, ప్రలేపములు, పరిషేకములు మొదలగు వానితో ఉపచరింపవలెను.

విసర్పమునందు ప్రయోగించు ఆహారములు ఔషధములు విదాహకరము కానివిగా యుండవలయును.[1]

కుష్టము, విస్ఫోటము, మసూరికలయందు చెప్పబడిన చికిత్సలను విసర్పమునందు ప్రయోగింపవలెను.

విసర్పమున పాకము చెందినచో శోధనము చేసి వ్రణ చికిత్సయందు చెప్పబడిన విధి ననుసరించి ఉపచరింపవలెను.[2]

చరక సంహితలో పిత్తజ కుష్టమున వర్ణింపబడిన మహాతిక్తక ఘృతము గుల్మ చికిత్సయందు వర్ణింపబడిన త్రాయమాణ ఘృతము విసర్పశమనమునకై ప్రయోగింప వలెను.[3]

## విసర్పమునందు ఆహారాది విధి

లంఘనము చేయించుట విసర్పమునందు హితకరముగా నుండును.

లంఘనానంతరము రూక్షకరముగనుండి తీపికొరకు క్షౌద్రము శర్కరలు

---

1. విరేకవమనాలేపసేచనాసృగ్విమోక్షణైః ఉపాచరేద్విసర్పానవిదాహిభిః (చ.ద. 53/1)
2. కుష్ఠామయస్ఫోట మసూరికోక్త చికిత్సయాప్యాశు హరేద్విసర్పాన్ సర్పాన్విపక్వాన్ పరిశోధ్య ధీమాన్ వ్రణక్రమేణోపచరేద్యథోక్తం (భా.ప్ర)
3. చ.చి. 21/62-63

చేర్చబడినదిగాని లేక దాడి మామలకములు పులుపు కొరకు చేర్చబడినదిగాని అగు స్నేహరహితమైన రూక్షమును కలిగించు మంథము ఇవ్వవలయును. పరూషకము, మృద్వీకము, ఖర్జూరము మొదలగునవి చేర్చి నీటితో ఈ మంథ మును పక్వము చేయవలెను.

తర్పణముకొరకు యవ, శాలిధాన్యములతో స్నేహముచేర్చి అవలేహము వలె చేయబడినది ఇప్పించవలయును.

అది జీర్ణమైన తదుపరి పురాణ శాల్యన్నమును యూషములతో భుజింప చేయవలెను.

ముద్గములు, మసూరములు, పటోలము, జాంగల మాంసరసములు, పురాణ శ్వేతరాజనములు, రక్త రాజనములు, శాలిధాన్యము, షష్టిక ధాన్యము, యవలు, గోధుమలు-వీనిలో రోగ సాత్మ్యమునకు అనుకూలమగు ఆహారములను ఇవ్వవలెను.

కంగుధాన్యము, చణకములు, కందులు, కారివేల్లకము, వేత్రాగ్రము, తిక్తశాకములు, నవనీతము, ఘృతము, ద్రాక్ష-ఇవి విసర్పమున హితకరముగా నుండును.

## విసర్పమునందు అపథ్యములు

విదాహకరమైన అన్నపానములు, విరుద్ధాహారములు, పత్రశాకములు, దధి, కూర్చిక, సౌవీరాది మద్యములు, కిలాటము, గురుపదార్థములు, పేయ, లశునము, కుళుత్థము, మాష, తిలలు, లవణ, అమ్ల, కటు విదాహకర పదార్థ ములు, స్వేదనము, జాంగల మాంసములు తప్ప ఇతర మాంసములు.

ఆతపము, వ్యాయామము, అగ్ని, వాయుసేవన వ్యాయామము, దివా స్వప్నము, వ్యవాయము, ఎండలో తూర్పుగాలిలో తిరుగుట, వమనమును నిగ్ర

హించుట, క్రోధము, శోకము, ఈర్ష్య-వీటన్నింటిని విసర్పరోగి వర్జించ వలయును.[1]

## విసర్పమునందు సామదోష చికిత్స కఫస్థానగత సామదోష చికిత్స

కఫస్థానమైన శరీరముయొక్క ఊర్ధ్వ భాగమున వ్యాపించియున్న ఆమ దోషముతో కూడుకొనివున్న విసర్పమునందు మొదట లంఘనమును, వమనమును చేయించి తిక్తరసముతో కూడిన ద్రవ్యములను సేవించుట, రూక్షగుణము, శీతవీర్యము కలిగిన ఔషధములను లేపనముచేయుట ప్రశస్తముగా వుండును.[2]

## పిత్త స్థానగత సామదోష చికిత్స

పిత్త స్థానమైన శరీరముయొక్క మధ్య ప్రదేశమునందు చేరి ఆమదోషముతోకూడి వున్నను అట్టి విసర్పమునందు రక్తమోక్షణమును, విరేచనమును విశేష చికిత్సగా చేయవలెను.[3]

## వాతస్థాన గత సామదోష చికిత్స

వాతస్థానమైన శరీరమునందుగల అధో భాగమునందు పక్వాశయమునకు క్రిందిభాగమున జనించిన విసర్పమునందు మొదట విరూక్షణరూపమైన చికిత్సను చేయవలయును.[4]

---

1. i) చ.చి. 21/108-114
   ii) భై.ర. 57/27-34
2. లంఘనోల్లేఖనే శస్తే తిక్తకానాం చ సేవనం
   కఫస్థానగతే సామే రూక్షశీతైః ప్రలేపయేత్ (చ.చి. 21/45)
3. పిత్తస్థానగతేఽప్యేతత్ సామే కుర్యాచ్చికిత్సితం
   శోణితస్యాఽవసేకం చ విరేకం చ విశేషతః (చ.చి. 21/46)
4. మారుతాశయసంభూతే ఽప్యాదితస్స్యాద్విరూక్షణం (చ. చి. 21/47)

## విసర్పమునందు అవస్థానుసారము స్నేహ ప్రయోగము

రక్త పిత్తములవలన కలిగిన విసర్పమునందు స్నేహముచే చేయు చికిత్స హితకరము కాదు.

వాతము అధికముగా ఉండు విసర్పమునందు, స్వల్పదోషముతోనంటి వుండు పిత్త విసర్పమునను తిక్తక ఘృతమును ఉపయోగించవలెను.

ప్రబలమైన పిత్తమువలన జనించిన విసర్పమునందు విరేచనమును కలిగించు ఔషధమును ఇవ్వవలెను. అట్లుకాక అనేక దోషయుక్తమైన పిత్తజ విసర్పమునందు విరేచనముకాని ఘృతమును ఉపయోగించినచో దోషము లోలోపలే స్తంభించి త్వక్ను మాంసమును రక్తమునుకూడా పచనము చేయును. అందువలన బహుదోష యుక్తమైన పిత్తజ విసర్పమునందు మొదట విరేచనమును ఉపయోగించుట చాలా ప్రశస్తము.[1]

## విసర్ప వ్యాధియందు వమన ఔషధములు

విసర్పమున కఫ పిత్తములవలన వేరు వేరుగానైనను రెంటింటి సంసర్గమువలన గాని జనించినపుడు వమనకర్మ చేయించుట హితకరముగా వుండును.

వమనకర్మకై ఈ క్రింది యోగములలో వేనినైనను లేదా చరకసంహిత కల్పస్థానమునందు చెప్పబడిన కఫ పిత్తశోధక వమనయోగములనైనను ప్రయోగింపవచ్చును.

---

1. రక్తపిత్తాఽన్వయేఽప్యాదౌ స్నేహనం న హితం మతమ్
వాతోల్బణే తిక్తఘృతం పైత్తికే చ ప్రశస్యతే
లఘుదోషే మహాదోషే పైత్తికే స్యాద్విరేచనమ్
న ఘృతం బహుదోషాయ దేయం యన్న విరేచయేత్
తేన దోషాఽప్యవష్టబ్ధః త్వఙ్మాంస రుధిరం పచేత్
తస్మాద్విరేకమేవాదౌ శస్తం విద్యాద్విచక్షణః
రుధిరస్యాఽవసేకం చ తద్ధ్యస్యాశ్రయసంజ్ఞితమ్ (చ. చి. 21/47.50)

౧. మ్రంగకాయ, అతిమధురము, వేపపట్ట, కొడిసెపాలయొక్క బీజములు వీనిని ఒకటిగాచేర్చి వమనము చేయించుటకు ఉపయోగించవలెను.

౨. పటోల, వేప చిగుళ్ళు, పిప్పలి, మ్రంగకాయ, కొడిశెపాల విత్తులు, వీనిని అన్నింటిని ఒకటిగాచేర్చి కఫ పిత్త విసర్పములందు వమనము చేయుట కొరకు ఉపయోగించవచ్చును.[1]

## విసర్పమునందు విరేచన యోగములు

విసర్పమునందు దోషములు కోష్ఠమును ఆశ్రయించి వున్నపుడు ఈ క్రింది విరేచన యోగములద్వారా శోధనము చేయింపవలెను.

1. త్రివృత్చూర్ణం, ఘృతములోగాని, దుగ్ధములోగాని, వేడి నీటిలోగాని, ద్రాక్ష పండ్లయొక్క రసములోగాని కలిపి విసర్పము శమించుటకై విరేచమునకు ప్రయోగింపవలెను.

2. కానుగను (త్రాయమాణమును) గోదుగ్ధములో కలిపి పక్వముచేసి విరేచనమునకై ప్రయోగింపవలెను.

3. త్రివృత్ చూర్ణమును త్రిఫలా కషాయములో కలిపి అందు ఘృతమును చేర్చి విరేచనముకొరకు ప్రయోగించిన ఎడల విసర్పమును, జ్వరమును శమించును.

4. ఆమలక రసమునకు ఘృతమునుచేర్చి విసర్పరోగికి త్రాగించవలెను.

---

1. మదనం మధుకం నింబం వత్సకస్యఫలాని చ వమనం
సంప్రవాతవ్యం విసర్పే కఫపిత్తజే పటోలపిచుమర్దాభ్యాం
పిప్పల్యా మదనేన చ విసర్పే వమనం శస్తం తథా చేంద్రయవైః
సహాయాంశ్చ యోగాన్ ప్రవక్ష్యామి కల్పేషు కఫపిత్తదాం
విసర్పిణాం ప్రయోజ్యాస్తే దోషనిర్హరణాః శివాః (చ.చి. 2/52-54)

5. విసర్పరోగి క్రూరకోష్ఠుడై వున్నచో పైన చెప్పబడిన నాలుగవ యోగమున త్రివృత్ చూర్ణముకలిపి పానము చేయింపవలెను.[1]

## విసర్పమునందు రక్తమోక్షణము

విసర్పమునకు రక్తము ముఖ్యమైన ఆశ్రయము రక్తము పిత్తము వీని యొక్క సంసర్గము లేకుండా ఏ విసర్పములు కలుగవు. అన్ని విసర్పములందు వీని సంసర్గము ఉండును. ఈ రెండింటిని శోధింప చేయు రక్తమోక్షణము అన్ని విసర్పములందును ముఖ్యమైనది. అందువలన ప్రారంభములోనే రక్తమోక్షణము చేయించుట ప్రశస్తముగా వుండును. అందులో శాఖలయందు రక్తము దుష్టమైనపుడు విశేషించి తొలుతనే రక్తమోక్షణము చేయింపవలెను.

వాతదూషిత రక్తమున శృంగముతోను, పిత్త దూషిత రక్తమున జలౌకల చేతను, కఫదూషిత రక్తమున ఆలాబుతోను రక్తమును వెడలింపవలయును.

రక్తమోక్షణము చేయునపుడు విసర్పము వ్యాపించిన ప్రదేశమునకు సమీపముగా వున్న సిరను శీఘ్రముగా వ్యధనము చేసి రక్తమును వెడలించవలెను. రక్తము దూషితమైన ఎడల వెంటనే చర్మమును మాంసమును స్నాయువులను

---

1. త్రివృచ్చూర్ణం సమాలోడ్య సర్పిషా పయసాపి వా
ఘర్మాఽంబునా వా సంయోజ్య మృద్వీకానాం రసేన వా
విరేకాఽర్థం ప్రయోక్తవ్యం సిద్ధం వీసర్ప నాశనం
త్రాయమాణాశృతం వాపిపయోదద్యాద్విరేచనమ్
త్రిఫలారససంయుక్తం సర్పిస్త్రివృతయా సహ
ప్రయోక్తవ్యం విరేకార్థం విసర్పజ్వరనాశనం రసమామలకానాం వా
ఘృతమిశ్రం ప్రదాపయేత్ స ఏవ గురుకోష్ఠాయ త్రివృచ్చూర్ణయుతో
హితః దోషే కోష్ఠగతే భూయః ఏతత్కుర్యాచ్చికిత్సితం
(చ. చి. 21/65-69)

వరుసగా దూషింపబడును. రక్తమోక్షణమువలన అటువంటి దుష్టి నిరోధించబడును.[1]

విసర్పమునందు శామక యోగములు-ఈ క్రింది ద్రవ్యములతో విద్యను సారము కషాయములను సిద్ధముచేసి పానము చేయించిన విసర్పములు శమించును

1. ముస్త, నింబ, పటోల క్వాథము
2. శారిబ, ఆమలక, ఉశీర ముస్తా క్వాథము
3. చందనము, ఉత్పలము వీని క్వాథము
4. కిరాతతిక్తాది క్వాథము
5. కిరాతాది లోధ్ర, చందన, మరాలభి, నానర పద్మకంజల, ఉత్పల విభీతకి, మధుక, నాగకేసర) మొదలగువాని క్వాథము.
6. ప్రపౌండరీకాది క్వాథము
7. ద్రాక్షాదిశీత క్వాథము
8. పటోలాది శీత క్వాథము
9. పటోలాది క్వాథమునందు త్రిఫల, మసూర, ఘృతము కలిపి పానము చేయించవలెను.
19 పటోలాది క్వాథమునందు పటోల, ముద్గ, ఆవాతీ, ఘృతము కలిపి పానము చేయించవలెను.
11. అమృతాది క్వాథము
12. భూనింబాది క్వాథము
13. నవకషాయగుగ్గులు
14. అమృతాది క్వాథముతో గుగ్గులు ప్రయోగము.

---

1. పిత్తాఽన్వితం జలౌకోభిః కఫాన్విత మలాబుభిః
యథాసన్నం వికారస్య వ్యధమేదాశు వా సిరాం
త్వఙ్మాంసస్నాయు సంక్లేదః రక్తక్లేదాద్ధిజాయతే (చ.చి. 21/70-71)

## ఇతర యోగములు

1. వృషాద్య ఘృతము-కుష్ఠ విసర్ప శామకము
2. కాలగ్ని రుద్రరసము-కజ్జలి, అభ్రక, కాంతలోహ, స్వర్ణ మాక్షికము ముఖ్య ద్రవ్యములు. 100 మిల్లీ గ్రాములు తేనె పిప్పలీ చూర్ణముతో ఇవ్వవలెను.[1]

### విసర్పములందు బహిఃపరిమార్జన చికిత్సలు

ముందు చెప్పబడిన విరేచన రక్తమోక్షణములచే దోషము బైటకు వెడలి శరీరము యొక్క అంతర్భాగము శుద్ధమైన తరువాత దోషము త్వక్‌ను మాంసమును ఆశ్రయించి ఉండినచో బాహ్యక్రియలచే దోషములను శమింపచేయవలయును. దోషములు బలిష్ఠముగా కాక స్వల్పముగా ఉన్నపుడు (శోధనము చేయకయే మొదట కూడా ఈ బాహ్య చికిత్సలు చేయవచ్చును. ఈ ప్రలేపాదులు రక్తమునకు పిత్తమునకు త్వక్‌నకు ప్రసాదమును చేకూర్చును.[2]

### ప్రలేపాది విధి :

ప్రలేపములకై కల్క ద్రవ్యములను నూరిన వెంటనే ప్రయోగింపవలెను గాని కొంతకాలము అలాగే ఉంచిన దానిని ప్రలేపమునకు ఉపయోగించరాదు. మొదట వేసిన పట్టీని విడదీసి మరల పట్టీవేయరాదు. ఆ పట్టీ మిక్కిలి ఉష్ణమై వుండును. కావున ఆ స్థలమునందు క్రుళ్లి వ్రణము అభ్యంతరమునకు వ్యాపించి తోద మున్నగు వేదనలు అధికముగా కలుగును. వ్రణముపైన గుడ్డను ఉంచి దానిపైన పట్టువేసిన ఎడల ఆవిరి వలన చెమట పట్టి ఆ ప్రదేశమున బొబ్బలులేచి కండూ కలుగును. కావున వ్రణములపై వస్త్రము మొదలగువానిని ఉంచి దానిపై పట్టువేయరాదు.

---

1. చ. చి. 21/54-61
2. అన్తశ్శరీరే సంశుద్ధే దోషే త్వఙ్మాంస సంశ్రితే ఆదితో వాఽల్పదోషాణాం ప్రవక్ష్యతే (చ.చి. 21/72)

మొదట వేసిన పట్టును విడదీయకుండా దానిమీదనే మరల పట్టువేసినచో ముందు చెప్పబడిన విధముగా ఆవిరి వలన స్వేదము జనించి బొబ్బలు లేచి బాధించును.

కల్కమునందు స్నేహ ద్రవ్యములను అధికముగా కలిపినను, మిక్కిలి ద్రవరూపముగా చేసినను ఆ కల్క ఔషధము చర్మముపై చక్కగా అంటదు. దాని వలన దోషము శమించదు. పట్టు దట్టముగా కాక పలుచగా వేసినచో ఎండి ఊడి పోవును. అందుచేత ఔషధము యొక్క సారము వ్యాధి ఏర్పడిన స్థలమునందు వ్యాపింపక వ్యాధిని శమింపచేయుటకు తగదు. స్నేహమును అల్పమాత్రలో చేర్చి పట్టువేసిన ఎడల ద్రవమంతయు శీఘ్రముగా ఎండిపోయి వ్యాధిని శమింప చేయలేదు.[1] కనుక విధ్యను సారము ప్రయోగింపవలెను.

## సామాన్య ప్రలేపములు

1. దశాంగ లేపము (చ. ద) శిరీష, యష్టి, తగరము, చందనము. ఏలా, జటామాంసి, హరిద్రాద్వయ, కుష్ఠ, నేత్రబల, వీనిని నూరి ఘృతముతో కలిపి లేపనము చేసిన అన్ని విధములగు విసర్పములు, జ్వరము, శోధ, శమించును.

---

1. న చ పర్యుషితం లేపం కదాచిదవచారయేత్ న చ తేనైన లేపేన పునర్జాతు ప్రలేపయేత్ క్లేదవిసర్పశూలాని సోష్ణభావాత్ ప్రవర్తయేత్ లేపోహ్యుపరిపట్టస్య కృతః స్వేదయతి వ్రణం స్వేదజాః పిటకాస్తస్యకండూశ్చై వోపజాయతే ఉపర్యుపరి లేపస్యలేపోయద్యవచార్యతే తానేవ దోషాన్జనయేత్ పట్టస్యోపరియాః కృతః అతిస్నిగ్ధోఽతిద్రవశ్చ లేపో యద్యవచార్యతే త్వచినశ్లిష్యతే సమ్యక్ న దోషం శమయత్యపి తన్వాలిప్తం న కుర్వీత సంశుష్కోహ్యపుటాయతే నచౌషధిరసోవ్యాధిం ప్రాప్నోత్యపి చ శుష్యతి తన్వాలిప్తేన యే దోషాః తానేవ జనయేద్భృశం సంశుష్కః పీడయేద్వ్యాధిం నిస్స్నేహో హ్యవచారితః (చ.చి. 21/102-108)

2. కరంజ తైలము యొక్క (యో. ర) అభ్యంగము విసర్ప, విస్ఫోటము లను శమింపచేయును.

వాతజ పిత్తజ విసర్పములందు ఘృతము అధికముగా చేర్చి కఫజ విసర్పములందు ఘృతమును అల్పముగా చేర్చి ప్రదేహాదులు చేయవలయును.

ఈ క్రింది ప్రదేహాదులకు చెప్పబడిన ద్రవ్యములనే ద్రవములుగా చేసి సేచనాదులకు, చూర్ణములుగా చేసి అవచూర్ణములుగా, కల్కములుగా చేసి ఘృతములు సిద్ధము చేయుటకు ఉపయోగించి ఆయా విసర్పములందు అవస్థాను సారము ప్రయోగింప వచ్చును.

## వాత పిత్తోల్బణ విసర్పహర ప్రలేపాదులు

1. ఉదుంబరత్వక్, యష్టి, పద్మకింజల్కము, ఉత్పలము, నాగకేసర, ప్రియంగు కల్కమున ఘృతము చేర్చి ప్రదేహము చేసిన వాతజ, పిత్తజ విసర్పములు శమించును.

ఈ క్రింది ప్రదేహాదులన్నియు యిట్లే వాతజ, పిత్తజ, విసర్పహరములుగా ఉండును.

2. శాద్వలాది ప్రదేహము, యావకాది ప్రదేహము, మధుకాది ప్రదేహము యవమధుకాది ప్రదేహము, హరేణుకములు, మసూరములు, ముద్గలు

శ్వేశాలి వీనిని వేర్వేరుగాగాని కలిపిగాని ఘృతముతో ప్రదేహము చేయ వచ్చును.

పద్మినీ కర్దమ ప్రదేహము, ముక్తాపిష్టి, శంఖ, ప్రవాళ, శుక్తి, గైరిక, ప్రపౌండరీకాది ప్రదేహము. వీనిని వేరు వేరుగా ఘృతముతో ప్రదేహము చేయ వచ్చును.

న్యగ్రోధాది ప్రలేపము, శతధౌత ఘృతముతో కలిపి, కావయాది ప్రలేపము, శారివాది ప్రలేపము, నలదాది ప్రలేపము, బలాది ప్రలేపము, మృణాళాది ప్రలేపము, న్యగ్రోధ పత్త్రాది ప్రలేపము చేయవచ్చును.

## విసర్పమునందు విశేష చికిత్సలు

విసర్ప వ్యాధులందు ఆయా దోషహరగణ ద్రవ్యములచేతను క్వాథముల చేత సిద్ధము చేయబడిన ఘృతములు సేకములు, లేపాదులు ప్రయోగింపవలెను.

ముందు చెప్పబడిన చికిత్సా విధానములో శీతప్రాయములుగాఉండు చికిత్స లను పిత్తమువలన కలిగిన విసర్పమునందు చేయవచ్చును. కఫమున కలిగిన విసర్పమునందు రూక్షప్రాయములైన చికిత్సలను వాతమువలన కలిగిన విసర్పమందు అధికముగా స్నిగ్ధములైన చికిత్సలను చేయవలయును. అగ్ని విసర్పమందు వాత, పిత్తశామక చికిత్సలను, కర్ధమ విసర్పమందు కఫ పిత్తహర చికిత్సలను మొదటగా ఉపయోగించవలెను.[1]

## వాతజ విసర్పహర చికిత్సలు

ముందు చెప్పబడిన వాతహర లేపాదులు ఇతర క్రియలచే ఉపచరించ వలెను.

**1.** ముస్త, శతాహ్వా, దేవదారు, కుష్ఠ, వారాహికంద, ధాన్యక, శిగ్రు, భద్రదార్వాది గణములోను పిప్పల్యాది గణములోను చెప్పబడిన గణద్రవ్యము లను కషాయ సేకమునందును, కల్క-లేపమునందును, ఘృతములందును వాతజ మగు విసర్పమునందు ఉపయోగింపవలెను.

---

1. కుర్యాచ్చికిత్సితాదస్మాత్ శీతప్రాయాణి పైత్తికే రూక్షప్రాయాణి కఫజే
స్నైహికాన్యనిలాత్మకే వాతపిత్తప్రశమనమగ్ని వీసర్పిణే హితం
కఫపిత్తప్రశమనం ప్రాయః కర్ధమసంజ్ఞితే (చ. చి. 21/117-118)

2. కంటక పంచమూలములు, హ్రస్వ పంచమూలములు, మహా పంచ మూలములు, వల్లీ పంచమూలములు, వీనిని వాతజ విసర్పమందు పూయుటకు, కషాయ సేవనమునకు, ఘృతపాకమునకు ఉపయోగింపవలెను.

3. రాస్నా నీలోత్పలాది లేపము !

## పిత్తజ విసర్ప విశేష చికిత్సలు

1. కసేరుకములు, శృంగాటకము, తామరతూండ్లు, భద్ర ముస్తలు నాచు, కలువ గడ్డలు, నీటి అడుగునఉండు మెత్తని బురద, అను వాని కల్కమును, పిత్త విసర్పకల ప్రదేశమందు వస్త్రమునువేసి దానిమీద పూయవలెను. ఆ వస్త్రముపై నేతిని కలిపి చల్లగా ఉండునట్లు ఉపయోగించవలెను. పిత్త విసర్పమందు శరీర త్వక్ అధికముగా తపించి ఎక్కువ అఘాతము కలిగినచో వ్రణమగును. కావున సుఖముగా పూతను తొలగించుటకు ఈ విధముగా వస్త్రమునువేసి పూయవలెనని తెలియవలెను.

2. హ్రీబేరాది లేపము.

3. ప్రపౌండరీకాది లేపము.

4. సేకములు

1. న్యగ్రోధాదిగణ శీతక్వాధ పరిషేకము లేక ఘృతము లేక ఆ గణమును కల్కముగాచేసి పాలతోగాని, సగ భాగము తేనె కలిసిన నీటితోగాని చెఱకు రసముతోగాని పంచదారను కూడా కలిపి సేకమును చేయవలెను.

---

1. ముస్తాశతాహ్వా సురదారు కుష్ఠమ్ వారాహి కుస్తుంబురు
కృష్ణగంధాః వాతాత్మకేచోష్ణగణాః ప్రయోజ్యాః
సేకేషు వేపేషు తథా ఘృతేషు యత్ పంచమూలం ఖలు
కంటకాఖ్యమల్పం మహచ్చాప్యథ వల్లిజం చ తచ్చోపయోజ్యం
భిషజా ప్రదేహే సేకే ఘృతేవాపి తథైవ తైలే (సు.చి. 17/3-4)

5. గౌర్యాది ఘృత పరిషేకము పిత్తజ విసర్ప విస్ఫోటాది శామకము[1]గా నుండును.

## కఫజ విసర్ప విశేష చికిత్సలు

1. త్రిఫలములు, పద్మకము, వట్టివేళ్ళు, మంజిష్ఠ, గన్నేరు, కిక్కిస గడ్డివేళ్ళు, మామెన కొమ్మలు, వీనిని అన్నింటిని కలిపి నూరి కఫజ విసర్పము నందు పట్టు వేయవలెను.

2. ఖదిరాది లేపము
3. అరగ్వధాది లేపము
4. ఇంద్రాణ్యాది లేపము
5. శైవాలాది లేపము
6. త్రిఫలాది లేపము
7. ప్రపౌండరీకాది లేపము
8. అజగంధాది లేపము
9. కాలానుసార్యాది.[2]

---

1. కసేరు శృంగాటక పద్మగుంద్రా
స్సశైవలాః సోత్పలకర్దమాశ్చ
వస్త్రాన్తరాః పిత్తకృతే విసర్పే
లేపాః విధేయాః సఘృతా స్సుశీతాః
న్యగ్రోధవర్గైః పరిషేచనం చ
ఘృతశ్చ కుర్యాత్స్వరసేన తస్య
శీతైః పయోభిశ్చ మధూదకైశ్చ
సశర్కరైరిక్షురసైశ్చ సేకాన్ (సు.చి. 17/5-8)

2. త్రిఫలాం పద్మకోశీరం సమంగాం కరవీరకమ్
నలమూలాన్యనంతాం చ ప్రదేహముపకల్పయేత్ (చ.చి. 21/88)

## అగ్ని విసర్పములకు విశేష చికిత్స

వాతమును, రక్తమును, పిత్తమును అధికముగా కల విసర్పమునందు శత ధౌతఘృతమును మాత్రము పట్టువేయదగును. మరియు పేరిన నేతి మీది మండ ముచేనైనను, పాలచేనైనను, అతి మధురమును చేర్చి కాచబడిన కషాయము నైనను, పంచవల్కము కషాయముతోగాని సేచనము చేయవలెను.

దూర్వాఘృతము ప్రయోగించి రోపణము చేయువలయును. దార్వ్యాది క్వాథముతో ప్రక్షాళనము అవే ద్రవ్యములతో సిద్ధముచేసిన ఘృతము అభ్యంగము నకు చూర్ణము అవచూర్ణమునకు ప్రయోగించిన విసర్పజనిత వ్రణములు జనించును.[1]

## గ్రంధి విసర్ప విశేష చికిత్స

రక్తము, పిత్తము, అధికముగా వృద్ధిపొందిన గ్రంధి విసర్పమునందు మొదట, రూక్షణక్రియలు, లంఘనములు, పరిషేకములు, పంచ వల్కముల ప్రలేపములు, సిరామోక్షణములు, జలగలచే రక్తమోక్షణము, వమన విరేచ నాదులు, కషాయ తిక్తరస ద్రవ్యముల కషాయములు మొదలగు ఈ చికిత్సలను దేశకాలాదులను, రోగి పరిస్థితిని బాగుగా గమనించి అందుకు తగినట్లుగా చేయ వలెను.

గ్రంధి విసర్ప రోగికి మొదట శరీరమందలి ఊర్ధ్వభాగమునందు ఉండు దోషమును వమనము చేతను, అధోగత దోషమును విరేచనముతోను వెడలించి పిదప రక్తమోక్షణము చేయించి ఆ తరువాత వాత కఫములను హరింపచేయు చికిత్సను చేయుట హితతరముగా నుండును.

---

1. ఘృతేన శతధౌతేన ప్రదిహ్యాత్ కేవలేన చ
ఘృతమండేన శీతేన పయసా మధుకాంబునా
పంచవల్క కషాయేణ సేచయేత్ శీతలేన వా
వాతాసృక్పిత్తబహుళం విసర్పం బహుశో భిషక్ (చ.చి. 21/94-95)

ధూమపానములు శిరోవిరేచనములు అవస్థానుసారము ప్రయోగించవలెను.[1]

## స్వేదములు

గ్రంధి విసర్పమునందు వేదన కలిగిఉన్నచో ఉష్ణవీర్యములైన, వాతకఫ హర ద్రవ్యములచే సిద్ధము చేయబడిన ఉత్కారికలతోనైనను, స్నిగ్ధములైన వేసవారములచేనైనను ఉపనాహము చేయవలయును.[2]

## సేచనములు

ఉష్ణముగావుండు దశమూల సిద్ధ ఘృతముచేత కాని, కుష్ఠతైలము చేతకాని క్షారఉదకము చేతకాని, గోమూత్రము చేతకాని, లేక పత్ర నిర్యూహము చేతకాని సుఖోష్ణంగా సేచనము చేయింపవలెను.

## ప్రదేహములు

సుఖోష్ణంగా అశ్వగంధా కల్కముగాని, శుష్కమూల కల్కము, నక్త మాలత్వక్ కల్కముచేగాని విభీతకీ త్వక్ కల్కముతోగాని ప్రదేహము చేయ వలెను.

## ప్రలేపములు

బలాది ప్రలేపము, దంత్యాది ప్రలేపము మూలకాది లేపము చేయింప వలెను.

---

1. రక్తపిత్తోత్తరం దృష్ట్వా గ్రంధి వీసర్పమాదితః
   రూక్షైర్లంఘనైః స్వేకైః ప్రవేహైః పాంచవల్కలైః
   సిరామోక్షైః జలౌకోభిః వమనైస్సవిరేచనైః
   ఘృతైః కషాయతిక్తైశ్చ కాలజ్ఞస్సముపాచరేత్ (చ.చి. 21/119-120)
2. ఉత్కారికాభిరుష్ణాభిరుపనాహః ప్రశస్యతే
   స్నిగ్ధాభిర్వేసవారైర్వా గ్రంధివీసర్పశూలినామ్ (చ.చి. 21/122)

## ఆభ్యంతర యోగములు

త్రిఫలాదిచూర్ణము తేనెతో సేవింప చేయవలెను. ముస్తాదిసక్తు (కుష్ఠోక్త) భల్లాతకసక్తు (రసాయనోక్త) ప్రయోగింపవలెను. స్వర్ణమాక్షిక భస్మము 300 మి.గ్రా.ల తేనెతో సేవింపచేయవలెను. దేవదారు క్వాథము, రసాయని విధ్యనుసారము శిలాజిత్తును సేవింపవలెను.

ఇతర క్రియలు :

ధూమపానములు, నస్యములు ప్రయోగింపవలెను.

భేదనోపాయములు - గుల్మ చికిత్సోక్త భేదనోపాయములు ప్రయోగించ వలెను.

విమ్లాపనము-లోహము, లవణము, పాషాణము, స్వర్ణము, తామ్రము మొదలగు వానిని కాల్చి గ్రంధి ప్రదేశమున వస్త్రమును ఆచ్ఛాదనము చేసి దానిచే గట్టిగా పీడించి విమ్లాపనము చేయవలెను.

ఈ క్రియలచే మిక్కిలి కఠినమై బలిష్ఠమైన విసర్పగ్రంధి రాతివలె కఠినమై శమింపకుండిన ఎడల క్షారము చేతనైనను నిప్పును కాల్చబడిన యినుప కడ్డీచే నైనను, బంగరు కడ్డీలచేనైనను విసర్పగ్రంధిని కాల్చి భేదింపవలెను. లేక గ్రంధులు పచింప చేయునట్టి ఔషధముల కల్కముచే పచింపచేసి పక్వమైన తరు వాత శస్త్రముతో భేదించి గ్రంధిని వెలికి తీయవలెను [1]

---

1. అభిః క్రియాభిస్సిద్ధాభిః వివిధాభిర్బలీ స్థిరః
గ్రంధిః పాషాణ కఠినః యదా నైవోపశామ్యతి
అథాస్యదాహః క్షారేణ శస్త్రైః హేమ్నాఽథవా హితః
పాకిభిః పాచయిత్వా వా పాటయిత్వా సముద్ధరేత్

(చ.చి. 21/133-134)

గ్రంథి విసర్పమునందు రక్తము అధికంగా దూషితమైన ఎడల అటువంటి దుష్టరక్తము రక్తమోక్షణము విధి ప్రకారము బయటికి తీసి, తరువాత వాతశ్లేష్మమును హరింపచేయు చికిత్సలను మరల చేయవలయును. గ్రంధిని బేధించిన తరువాత శిరోవిరేచన కరమయిన ధూమము, నస్యము, స్వేదనము, మర్దనము మొదలగు విధులను మరల చేయవలయును. అటువంటి చికిత్సలవలన కూడ దోషము పూర్తిగా హరింపబడని ఎడల మరల దోషమును పచింపచేయు బాహ్యఉపచారములను ఔషధ ప్రయోగాలను చేయవలయును.

ఈ విధముగా దాహ కర్మచేత, పాచన క్రియవలన, విసర్ప గ్రంధియందలి దోషము పక్వమైన పిదప అటువంటి దోషమును వెడలింపచేయునవి వ్రణములను తగ్గించునవి అగు బాహ్య క్రియలచేతను, అభ్యంతర ఔషధుల చేతను, వ్రణములకు చికిత్సచేయు విధములో చికిత్స చేసి ఉపచరింపవలయును.[1]

కంపిల్లకాది తైలముచే వ్రణరోపణము కలిగించవలెను. వ్రణరోపణమునకై ఇతర వ్రణోక్త చికిత్సలను ఆవశ్యకతాను సారము ప్రయోగింపవలెను.



1. మోక్షయేద్బహుశశ్చాస్య రక్తముత్క్లేశమాగతం
పునరశ్చాపహృతే రక్తే వాతశ్లేష్మజదౌషధమ్
ధూమో విరేకశ్శిరసః స్వేదనం పరిమర్దనమ్
అప్రశామ్యతి దోషే చ పాచనం వా ప్రశస్యతే
ప్రక్లిన్నం దాహ పాకాభ్యాం భిషక్ శోధన రోపణైః
బాహ్యైశ్చాభ్యన్తరైశ్చైవ వ్రణవత్సముపాచరేత్
(చ.చి. 21/135-137)

# విస్ఫోటము

రక్తము పిత్తము వీని ప్రకోపముచే అగ్నిచే దగ్ధమైన విధముగా జ్వరముతో గూడిన బొబ్బలు శరీరమున ఏదో ఒక ప్రదేశమునగాని లేక సర్వాంగము లందుగాని ఉత్పన్నమగుట విస్ఫోటమనబడునని సుశ్రుతుడు నిర్వచించెను.[1]

విస్ఫోటమును కొందరు మసూరిక (స్మాల్‌పాక్స్) గా భావించు చున్నారు కాని అదిసరికాదు. మసూచికమునందును విస్ఫోటము జ్వరము ఉండును. కాని మసూచికము లేకుండగ గూడా విస్ఫోటములు కలుగును. మసూచికము సర్వాంగము లందును ఉండవలెను. విస్ఫోటము ఏదోఒక అంగమునందైనను కలుగవచ్చును. విస్ఫోటమునకు పూర్వరూపములు వర్ణింపబడలేదు. మసూచికమునందు పూర్వ రూపములు గమనింపబడును.

సుశ్రుతుడు విస్ఫోటమును క్షుద్రరోగములందు వర్ణించెను.

ఆధునిక వైద్య మతానుసారము విభిన్న కారణములచే జనించు బుల్లస్ ఎరిప్షన్స్ (Bullous Eruptionrs) విస్ఫోటమునకు తుల్యముగా నుండును.

వీనిలో ముఖ్యమైనవి ఈ క్రింది విధముగా నుండును.

1. పెంఫిగస్ వల్గారస్ (Pemphigas Vulgaris)
2. బుల్లస్ పెంఫిగాయిడ్ (Bullous Pemphigoid)
3. టాక్సిక్ ఎపిడెర్మల్ నెక్రోలైసిస్ (Toxic Epidermal Necrolysis)
4. డెర్మాటైటిస్ హెర్పెటి ఫార్మిస్(Permetitis Herpeti formis)

---

1. అగ్నిదగ్ధనిభా స్ఫోటాః సజ్వరా రక్తపిత్తజాః
క్వచిత్సర్వత్ర తాదేహే విస్ఫోటా ఇతి తేస్మృతాః సు.ని. 13/10

## విస్ఫోట భేదములు

మాధవకరుడు ఎనిమిది విధములగు విస్ఫోటములను వర్ణించెను. అవి 1. వాతజ 2. పిత్తజ 3. కఫజ 4. వాతపిత్తజ 5. వాతకఫజ 6. కఫపిత్తజ 7. సన్నిపాతజ 8. రక్తజములు.

### నిదానము :

కటు, అమ్లరసము కల పదార్థములను భుజించుట, తీక్ష్ణములు, ఉష్ణములు, విదాహకరములును, రూక్ష, క్షారగుణములు ప్రధానముగాగల ద్రవ్యములను భుజించుట, అజీర్ణకరములైన పదార్థములు భుజించుట, భుజించిన ఆహారము జీర్ణము కాకమునుపే మరల భుజించుట చేతను, (అధ్యశన) ఆతప, సేవనల చేతను ఆయా ఋతువులందుండ వలసిన శీతోష్ణములు హెచ్చుగా గాని తక్కువగ కాని వ్యతిరేకముగగాని ఉండుట చేతను, ఎండలో సంచరించుట, ఆయా ఋతు చర్యలను విపరీతముగ ఆచరించుటచేతను, వాతాది దోషములు ప్రకోపించి రక్త మాంసాస్థులను దూషింపచేసి త్వక్‌ను ఆశ్రయించి జ్వరముతో కూడిన ఘోరమైన స్ఫోటకమును కలుగచేయును. భోజుని అభిప్రాయమును అనుసరించి రక్తము, పిత్తము రెండును వాతముతో చేరి విస్ఫోటమును కలిగించును.[1]

### సామాన్య లక్షణములు :

రక్తపిత్తముల ప్రకోపము వలన అగ్నిచే కాల్చబడినపుడు ఏర్పడు చిన్న చిన్న బొబ్బలవలె జ్వరముతో కూడియుండి శరీరమంతయుగాని ఏదో ఒక ప్రదేశమునందు గాని బయలుదేరు స్ఫోటములను "విస్ఫోటము" అని పేరు. ఇందు దాహము తృష్ణ కూడా ఉండును.

---

1. కట్వమ్లతీక్ష్ణోష్ణ విదాహి రూక్ష క్షారై రజీర్ణాధ్యశనాతపైశ్చ
తథర్తుదోషేణ విపర్యయేణ కుప్యన్తి దోషాః పవనాదయస్తు
త్వచమాశ్రిత్య తే రక్తమాంసాస్థీని ప్రదూష్య ఏవ
ఘోరాన్కుర్వన్తి విస్ఫోటాన్సర్వాఞ్జ్వరపురస్సరాన్ (మా.ని. 53/1-2)

ఈ విషయమున భోజుడు "వాయువుచే అనుగమింపబడిన రక్తపిత్తములు ఎపుడు చర్మమునందు అగ్ని దగ్ధ వ్రణములవంటి స్ఫోటములను కలుగ చేయునో దానికి విస్ఫోటమని పేరు అని చెప్పెను.[1]

చరకుడు సర్వశరీరము నందును కాలిన బొబ్బలవలె నుండి దాహము, జ్వరము, తృష్ణతో కూడిన పిటకలు కలిగినది విస్ఫోటమని పేర్కొనెను.[2]

అన్ని విస్ఫోటములకును రక్తపిత్తములే కారణము.

**వాతజ విస్ఫోటక లక్షణములు :**

శిరమునందు శూలముచే పొడిచినట్లు బాధ, శూల, జ్వరము, తృట్, పర్వభేదము, స్ఫోటములు, కృష్ణవర్ణముతో కూడి యుండుట, ఇవి వాత విస్ఫోటక లక్షణములు.[3]

**పిత్తజ విస్ఫోట లక్షణములు :**

పిత్తజ విస్ఫోటమునందు జ్వరము, దాహము, నొప్పి, స్రావము, తృష్ణ,

---

1. మాని 53/3
2. i) అగ్నిదగ్ధా ఇవ స్ఫోటాః సజ్వరా రక్తపిత్తజాః క్వచిత్సర్వత్ర వా దేహే విస్ఫోటా ఇతి తే స్మృతాః రక్తపిత్తజాః ఏతేన సర్వేషు విస్ఫోటకేషు రక్తపిత్తయోః ప్రధానకారణత్వం యథా శూలేషు వాతస్యతథా వాతానుగతిరపి బోద్ధవ్యాతథా చ భోజయదారక్తం చ పిత్తం చ వాతేనానుగతం త్వచి అగ్నిదగ్ధనిభాన్ స్ఫోటాన్ కురుతః సర్వదేహగా —
(మా.ని. 53/3)
ii) విస్ఫోటకాః నర్వశరీరగాస్తు స్ఫోటాః సదాని జ్వరతర్షయుక్తా
(చ.చి. 12/90)
3. శిరోరుక్శూలభూయిష్ఠం జ్వరస్తృట్ పర్వభేదనమ్
సకృష్ణావర్ణతా చేతి వాతవిస్ఫోటలక్షణమ్ (మా.ని. 53/4)

స్ఫోటములు పీతవర్ణములోను లోహిత వర్ణములోను ఉండుట.[1] ఈ లక్షణములు కలిగి యుండును.

కఫజ విస్ఫోట లక్షణములు :

కఫజ విస్ఫోటమునందు ఛర్ది- అరుచి, అవయవములందు జాడ్యత, కండూ, స్ఫోటములు కఠినముగా పాండు వర్ణముతో ఉండుట, అధిక బాధ లేక పోవుట, చిరకాలమునకు పక్వమగుట ఈ లక్షణములు కలుగును.[2]

వాత పిత్తజ విస్ఫోట లక్షణములు :.

వాత పిత్తజ విస్ఫోటమునందు స్ఫోటములు తీవ్రమైన వ్యధను కలుగచేయు చుండును.[3]

వాత కఫజ విస్ఫోట లక్షణములు :-

కండూ, జడత్వము, మంట, ఛర్ది, ఈ లక్షణములు వాత కఫజ విస్ఫోటము నందు కలుగును.[4]

కఫ పిత్తజ విస్ఫోట లక్షణములు :-

ఛర్ది, అరుచి, అవయవములందు మంట, దురద, జ్వరము—ఈ లక్షణములు కలిగిన ఎడల కఫపిత్తజ విస్ఫోటమని తెలియవలెను.[5]

---

1. జ్వరదాహరుజాస్రావ పాకతృష్ణాభిరన్వితమ్
   పీతలోహితవర్ణం చ పైత్తవిస్ఫోట లక్షణమ్ (మా.ని. 53/5)
2. ఛర్ద్యరోచకజాడ్యాని కండూకాఠిన్యపాండుతాః
   అవేదనశ్చిరాత్పాకీ స విస్ఫోటః కఫాత్మకః (మా.ని. 53/6)
3. వాతపిత్తకృతో యస్తు కురుతే తీవ్రవేదనమ్ (మా.ని. 53/7)
4. కండూస్తైమిత్య గురుభిర్జానీయాత్కఫవాతికమ్ (మా.ని. 53/7)
5. కండూర్దాహో జ్వరశ్ఛర్దిరేతైస్తుకఫపైత్తికః (మా.ని. 53/8)

సన్నిపాతజ విస్ఫోట లక్షణములు :-

మధ్యమునందు వల్లముగాను చుట్టూ ఉన్నతముగాను ఉండి, కఠినమైన, స్వల్పమైన పాకము పొందినదై, మంట, ఎరుపు, తృష్ణ, ఇంద్రియజ్ఞానము లేక పోవుట, ఛర్ది, మూర్ఛ, నొప్పి, జ్వరము, ప్రలాపము, వేపథు, మూర్ఛ, ఈ లక్షణములతో కూడి ఉండునది సన్నిపాతజ విస్ఫోటమని చెప్పబడును. ఈ విస్ఫోటము అసాధ్యమై ఉండును.[1]

రక్తజ విస్ఫోట లక్షణములు :-

పిత్తము ప్రకోపించుటకు కల కారణముల వలననే రక్తజ విస్ఫోటము కలుగును. ఈ రక్తజ విస్ఫోటము గురువింద గింజవంటి రంగు, ఆకారము కలిగి, రక్తమును స్రవించుచు అధికముగా మంటలు కలిగియుండును. ఇది అనేకవిధము లైన సిద్ధౌషధ ములచేత చికిత్స చేసినను నివర్తించుటకు సాధ్యము కాదు.[2]

---

1. మధ్యనిమ్నోన్నతాం తశ్చ కఠినః స్వల్పపాకవాన్ దాహరాగతృష్ణా మోహ ఛర్దిమూర్ఛారుజాజ్వరః ప్రలాపోవేపథుః మూర్ఛాసోఽసాధ్యశ్చ త్రిదోషజః (మా.ని. 53/8-9)

2. i) రక్తారక్తసముత్థానా గుంజావిద్రుమసన్నిభాః పీడితవ్యాస్తు రక్తేన పైత్తికేన చ హేతునా నతే సిద్ధింసమాయాన్తి సిద్ధైర్యోగశతైరపి (మా.ని. 53/10)

ii) వేదితవ్యాశ్చ రక్తేన పైత్తికేన చ హేతునా గుంజాఫలసమీరక్తా రక్త స్రావాదిదాహినః న తే సిద్ధిః సమాయాంతి సిద్ధైర్యోగశతైరపి (భా.ప్ర. విస్ఫోటాధికారము 12)

విస్ఫోటక ఉపద్రవములు :-

తృష్ణ, శ్వాస, మాంస సంకోచము, దాహము, హిక్కా, మదము, జ్వరము, విసర్పము, మర్మములందుబాధ ఈ ఉపద్రవములు కలుగును.[1]

మరికొందరు హిక్కా, శ్వాస, అరుచి, తృష్ణ, అంగమర్దము, హృదయమునందు వ్యథ, విసర్పము, జ్వరము, హృల్లాసము ఈ ఉపద్రవములు కలుగునని పేర్కొనిరి.[2]

విస్ఫోటక సాధ్యాసాధ్యతలు :-

పైన చెప్పబడిన విస్ఫోటములలో ఒక దోషమువలన జనించినది సాధ్యమనియు, దోషద్వయముచే జనించినది కష్టసాధ్యమనియు, సన్నిపాతముచే జనించిన విస్ఫోటములును, అనేక ఉపద్రవములతో కూడిన విస్ఫోటమును, మిక్కిలి దుఃఖకరములై ఉండును కావున అసాధ్యములని చెప్పబడినవి. మరియు ఈ వ్యాధియందు విసర్పమునకు చెప్పిన జ్వరాతిసారము మొదలగు ఉపద్రవములు జనించును.[3]

విస్ఫోటక బాహ్యాంతర భేదములు :-

ముందు వివరింపబడిన ఎనిమిది విధములైన విస్ఫోటములు బాహ్యశరీరమునందు కలుగును.

---

1. తృట్ శ్వాస మాంససంకోచ దాహాహిక్కా మదజ్వరాః
విసర్పమర్మసంరోధాస్తేషాముక్తాఉపద్రవాః (వ.వి.అ. 15)

2. హిక్కాశ్వాసోఽరుచిస్తృష్ణాసాంగమర్దాహృదివ్యథా
విసర్ప జ్వరహృల్లాసా విస్ఫోటానాముపద్రవాః (భా.ప్ర.వి.అ. 16)

3. ఏకదోషోత్థితస్సాధ్యః కృచ్ఛ్రసాధ్యో ద్విదోషజః
సర్వరూపాన్వితో ఘోరోహ్యసాధ్యో భూర్యుపద్రవః (మా.ని. 53/11)

ఇవియే శరీరము లోపల గూడా ఏర్పడి తీవ్రమైన బాధ దారుణమైన జ్వరముతో కూడి యుండును. అపుడు ఆభ్యంతర విస్ఫోటమనబడును.

అంతర్గత విస్ఫోటములు బహిర్గతములైనచో వ్యాధి శమించి స్వాస్థ్యము కలుగును. అట్లు బహిర్గతముకాని యడల వాతజ విస్ఫోట చికిత్సలు చేయవలసి యుండును.[1]

## విస్ఫోటక చికిత్స

విస్ఫోటక వ్యాధియందు ప్రారంభమున వమనము చేయించి తదుపరి లంఘనము చేయించవలయును.

ఆ తర్వాత పథ్యకరములైన ఆహారములచే ఉపచరింపవలెను.

దోషాదుల బలమును గమనించి యుక్తియుక్తముగా విరేచనము చేయింపవలెను. విసర్పోక్త కుష్ఠోక్త చికిత్సలును విశేషించి పిత్తవిసర్పోక్త చికిత్సలు చేయవలెను.

---

1. ఏతేచాష్టవిధా బాహ్యా అంతరోఽపి భవేదయం
తస్మిన్నంతర్వ్యథాతీవ్రా జ్వరయుక్తాభిజాయతే
యస్మిన్ బహిర్గతే స్వాస్థ్యం నవా తస్యబహిర్గతః
తత్ర వాతికి విస్ఫోట క్రియాకార్యా విజానతా
(భావప్రకాశ వి.అ. 13-14)

2. i) వీసర్ప శాన్త్యైవిహితాక్రియా యా తాం తేషుకుష్ఠేచ హితాం విదద్ధ్యాత్
(చ.చి. 12/93)

ii) పిత్తజస్య విసర్పస్య క్రియయాసాధయేద్భిషక్
రోపయేత్ సర్పిషాం పక్వాన్ సిద్ధేన మధురౌషధైః (సు.చి. 20/8)

iii) విస్ఫోటే లంఘనం కార్యం వమనం పథ్యభోజనమ్
యథా దోషబలం వీక్ష్య యుక్త్యా ముక్తం విరేచనమ్ (భా.ప్ర.వి.అ. 18)

విస్ఫోటకమునందు పథ్యములు :—

ఆహారము-పురాణషష్టిక శాలిధాన్యము, యవలు, పెసలు, మసూరములు, కందిపప్పు, మకుష్టకములు, కతల్లకములు వేత్రాగ్రములు, కర్కోటకము, పటోలము, గోఘృతము, జాంగల పశుపక్షుల మాంసములు—ఇవన్నియు హితకరముగా నుండును.

ఇతరములు-లేపనములు, చందన కర్పూరాది విలేపనములు.

## అపథ్యములు

ఆహారము గురుపదార్థములు, పత్రశాకములు, విరుద్ధాహారములు, తిల, మాష, కుళుత్థములు, లవణ, ఆమ్ల, కటు, విదాహి, రూక్ష ఉష్ణ పదార్థములు గ్రామ్యఉదక అనూప జంతువుల మాంసములు-ఇవి అపథ్యములు గనుక వర్జింపవలెను.

విహారాదులు-స్వేదనము, వ్యవాయము, వ్యాయామము, వమివేగమును నిగ్రహించుట, తీవ్రమైన గాలి, దివాస్వప్నము, ఆలేపము, క్రోధము—వీనిని విస్ఫోటరోగి వర్జింపవలెను.[1]

రక్తదోషహర క్రియలు, పిత్త శామక క్రియలు ఆవశ్యకతాను సారము విస్ఫోటమున ప్రయోగింపదగును.[2]

---

1. i) భా.ప్ర.వి.అ. 19
   ii) భై.ర. 58/22-26
2. రక్తదోషహరం యద్యదీ యద్యత్ పిత్త ప్రణాశనమ్
   సర్వమత్ర ప్రయోక్తవ్యం వివిచ్య భిషజా సదా (భై.ర. 58/21)

విస్ఫోటమునందు అభ్యంతర ఔషధములు :-

1. గుడూచి, నింబత్వక్ క్వాథము
2. ఖదిర, ఇంద్రయవ క్వాథము,
3. కిరాత తిక్తాది క్వాథము (భా.ప్ర.) లేక ద్వాదశాంగ క్వాథము.అన్ని విస్ఫోటములను శమింపచేయును.
4. ఛిన్నా పటోలాది క్వాథము (భా.ప్ర.)
5. పటోలామృతాది క్వాథము
6. పటోల త్రిఫలాది క్వాథము (భై.ర.)
7. వ్రణారిగుగ్గులు (భై.ర.) పిప్పలి, త్రిఫల, రససింధూర, గుగ్గులు 1 గ్రా సేవించిన సర్వ విసర్ప వ్రణములు శమించును.
8. రస సింధూరము త్రిసుగంధకముల చూర్ణముతో కలిపి 200 మి.గ్రా. పై చెప్పబడిన క్వాథములతో దేనితోనైనను సేవింపవలెను.
9. పంచతిక్తక ఘృతము పానము చేయించుట 3 గ్రా. అన్ని విస్ఫోటకములందును ప్రశస్తముగా నుండును. (భై.ర.)

వాతజ విస్ఫోటమునందు ద్విపంచ మూల్యాది క్వాథము పానము చేయింపవలెను.

పిత్తజ విస్ఫోటమునందు ద్రాక్షాది క్వాథము సితా యుక్తముగా పానము చేయింపవలెను.

శ్లేష్మజ విస్ఫోటమునందు భూనింబాది క్వాథమును మధుతో కలిపి పానము చేయింపవలెను.

రోపణ చికిత్సలు :-

మధురౌషధ సిద్ధఘృతములు ప్రయోగించి విస్ఫోట వ్రణములను రోపణము చేయవలెను.[1]

విస్ఫోటమునందు లేపనాదులు :-

1. కుటజ బీజములు తండులోదకముతో కలిపి నూరి లేపనము చేయవలెను.

2. చందనాది లేపము పూసిన విస్ఫోట జనిత దాహము శమించును.

3. ఉత్పలాది లేపము విస్ఫోట దాహశామకంగా ఉండును.

4. పుత్రజీవి మజ్జ కల్క లేపము నల్లని విస్ఫోటములందు కలుగు వేదన శమించును. ఈ లేపము వక్షగ్రందిగల గ్రంధి,తామ్ర విస్ఫోటకమును గూడా శమింప చేయును(భా.ప్ర)

5. శుక్తాది లేపము

6. శిరీషాది యోగము కబలగ్రహము విస్ఫోటమును శమింపచేయును. (చ.ద)



2. రోపయేద్ సర్పిషా పక్వాన్ సిద్ధేన మధురౌషధైః (సు.చి. 20/8)

# గ్రంధి ప్రకరణము

## గ్రంధి సంప్రాప్తి-లక్షణములు

తమ స్వకారణములచే ప్రకోపించిన కఫ ప్రధానమైన వాతాది దోషములు మాంసము, రక్తము మరియు కఫ యుక్తమైన మేదస్సు-వీనిని దూషింపచేసి వర్తులమును ఉన్నతమును, కఠినమును ఐన గ్రంధివంటి శోఫను కలిగించును. ఇది గ్రంధి అనబడును.[1]

## గ్రంధి బేధములు

సుశ్రుతుడు ఐదు విధములగు గ్రంధులను వర్ణింపగా వాగ్భటుడు నాలిగింటిని అధికముగాచేర్చి తొమ్మిది విధములైన గ్రంధులను వర్ణించెను.

1. వాతజ గ్రంధి

2. పిత్తజ గ్రంధి

---

1. i) వాతాదయో మాంసమసృక్ చ దుష్టాః సందూష్య మేదశ్చకఫానువిద్ధమ్
వృత్తోన్నతం విగ్రధితం తు శోధం కుర్వంత్యతో గ్రంధిరితి ప్రదిష్టః
(సు: ని, 31)

ii) కఫప్రధానాఃకుర్వంతి మేదో-మాంసాస్త్రగమలాః వృత్తోన్నతం శ్వయధుం సగంధి గ్రంధనాత్ స్మృతః దోషానుగంమాంస-మేదోస్థి-సిరా-వ్రణభవా నవతే
(అ. సం. ఉ. 34)

iii) అంగైకదేశేష్వనిలాదిభిః స్యాత్ స్వరూపధారీ స్ఫురణః సిరాభిః
గ్రంధిర్మహాన్ మాంసభవస్త్వతి్రిమేదోభవః స్నిగ్ధతమశ్చలశ్చ
(చి. చి. అ. 12)

3. కఫజ గ్రంధి

4. మేదోజ గ్రంధి

5. సిరాజగ్రంధి—సుశ్రుత మతమున ఇవి ఐదు. వాగ్భటుడు అధికముగా చేర్చినవి—

6. రక్తజ గ్రంధి

7. మాంసజ గ్రంధి

8. అస్థిజ గ్రంధి

9. వ్రణజ గ్రంధి.

**1. వాతజ గ్రంధి లక్షణములు :**

వాతజ గ్రంధియందు ఈడ్వబడినట్లుండుట, ఛేదింపబడినట్లుండుట, భేదింపబడినట్లుండుట, సూదులతో పొడిచినట్లుండుట, కలియబెట్టినట్లుండుట, పగలదీసినట్లుండుట—మొదలగు లక్షణములతో కూడిన నల్లని గ్రంధి ఏర్పడును. ఈ గ్రంధి మూత్రముతోనిండిన తిత్తివలె మృదువుగా ఉబికినట్లుండి, ఒకచోటి నుండి మరొక చోటికి తిరుగు స్వభావము, అకస్మాత్తుగా వృద్ధక్షయములను పొందు స్వభావము కలిగియుండును. భిన్నమయినపుడు (పగిలినపుడు) నిర్మలమైన రక్తమును స్రవించును-ఇవి వాతజ గ్రంధి[1] లక్షణములు.

---

1. i) ఆయమ్యతే వ్యధ్యత ఏతి తోదం ప్రత్యస్యతే కృత్యత ఏతి భేదమ్ కృష్ణోఽమృదుర్బస్తి-రివతతశ్చ భిన్నః స్రవేచ్చానిలజోఽస్రమచ్ఛమ్ (సు.ని. 11)

ii) తత్రవాతాదాయామతోదభేదాన్వితోఽసితః స్థానాత్ స్థానాంతరగతిరకస్మాద్ధాని వృద్ధిమాన్ (అ.సం. ఉ. 34)

2. పిత్తజ గ్రంధి లక్షణములు

పిత్తజ గ్రంధి పీతవర్ణములోగాని, రక్తవర్ణములోగాని యుండి అత్యంత దాహము, పొగ వెడలునట్లు మంట, ఉష్ణస్పర్శ కలిగి, పీక్చుచున్నట్లు బాధ, శీఘ్రపాకము-ఈ లక్షణములతోకూడి పగిలినపుడు మిక్కిలి ఉష్ణమైన రక్తమును స్రవించును.[1]

3. కఫజ గ్రంధి లక్షణములు

కఫజ గ్రంధి శీతస్పర్శ, త్వక్‌తో సమానమైనవర్ణము, లేక కొద్ది వివర్ణము, స్వల్పమైన బాధ, అధిక కండు-ఈ లక్షణములతోకూడి పెద్దదగును. కఠినమైన రాతిని బోలినదిగను యుండును. ఇది చిరకాలమునకు వృద్ధినొంది పగిలినపుడు శ్వేతవర్ణముతోకూడిన గాఢ పూయస్రావము కలుగును.[2]

4. మేదోజ గ్రంధి లక్షణములు

మేదోజ గ్రన్థి శరీరము వృద్ధిచెందినపుడు వృద్ధి చెందుచు క్షీణించినపుడు క్షయమును పొందుచు స్నిగ్ధముగను, అల్పవేదన, అధికకణ్డు-ఈ లక్షణములతో

---

1. i) దన్దహ్యతే ధూప్యతి చాతిమాత్రం పాపచ్యతే ప్రజ్వలతీవ చాపి రక్తః సపీతో ఽప్యథవాఽపి పిత్తాద్భిన్నః స్రవేదుష్ణమతీవచాస్రమ్
(సు. ని. అ. 11)

ii) పిత్తాత్ సదాహః పీతాభో రక్తో వా పచ్యతే ద్రుతమ్ భిన్నో ఽస్రముష్ణం స్రవంతి (అ. స. ఉ. 34)

2. i) శీతోఽవివర్ణోఽల్పరుజోఽతికణ్డూః పాషాణవత్ సంహననోపపన్నః చిరాభివృద్ధిశ్చ కఫప్రకోపాద్భిన్నః స్రవేచ్ఛుక్లఘనం చ పూయమ్
(సు. ని. అ. 11)

ii) శ్లేష్మణా నీరుజోఘనః శీతః సవర్ణః కండూమాన్ పక్వః పూయం స్రవేధనమ్ (అ.సం.ఉ.అ. 34)

కూడియుండి పగిలినపుడు పిణ్యాకము, ఘృతములవంటి స్రావము కలిగి యుండును.[1]

5. సిరాజగ్రన్థి లక్షణములు

దుర్బలుడైన మనుజుడు బలవంతునితో యుద్ధముచేయుట, మొదలగు శ్రమకరమైన పనులు చేసిగాని అధ్వగమనము చేసిగాని వెంటనే జలమునందు అవగాహనము చేసినచో వాతము ప్రకోపించి రక్తసహితముగా సిరా జాలమును పీడించి, సంకోచింపచేసి, వక్రముగాచేసి శోషింపచేసి, వేదనారహితముగ స్ఫురించుచున్నదిగను, వర్తులము ఉన్నతముగనున్న గ్రన్థిని కలిగించును. ఇది సిరాజ గ్రంధి అనబడును. ఇది పైత్తిక గ్రంథితో సమానమైన లక్షణములతో కూడియుండును. ఇది నొప్పితోకూడి చంచలముగానున్న కృచ్ఛ్ర సాధ్యముగా నుండును.[1]

ఇది పీడారహితముగా నిశ్చలముగానుండి మర్మస్థానము నాశ్రయించియున్న అసాధ్యముగా నుండును.[2]

---

1. i) శరీరవృద్ధిక్షయవృద్ధి-హానిః స్నిగ్ధో మహానల్పరుజోఽతికండూః మేదః కృతోగచ్ఛతి చాత్ర భిన్నే పిణ్యాక-సర్పిః ప్రతిమంతు మేదః

(సు. ని. అ. 11)

ii) ప్రవృద్ధం మేదురైర్మేదో నీతం మాంసోఽధవాం త్వచి వాయునా కురుతే గ్రంధిభృశం స్నిగ్ధం మృదుం చలమ్ శ్లేష్మతుల్యాకృతి దేహక్షయవృద్ధి క్షయోదయమ్ స విభిన్నో ధనంమేదస్తా మ్రాసితసితంస్రవేత్

(అ. సం. ఉ. అ. 34)

2. i) వ్యాయామజాతైరబలస్య తైస్తై రాక్షిప్య వాయుర్హి సిరాప్రతానమ్ సంపీడయ సంకోచ్య విశోష్యచాపి గ్రంథిం కరోత్యున్నతమాశువృత్తమ్ గ్రంథిః సిరాజః స తు కృచ్ఛ్రసాధ్యో భవేదిస్యాత్ సరుజశ్చలశ్చ

(Contd...

6. రక్తజ గ్రన్థి లక్షణములు

వాతాది దోషములచే దూషింపబడినపుడు క్రిములు ఉత్పన్నమగును. ఈ క్రిములు సిరలయందు మాంసమునందు స్థాన సంశ్రయమునుపొంది సుప్తతతో కూడిన పైత్తిక గ్రంధి లక్షణ యుక్తమైయున్న రక్తజగ్రంధి ఉత్పన్నమగును.[1]

7. మాంసజ గ్రన్థి లక్షణములు

మాంస భక్షక ప్రాణుల మాంసముతోకూడిన మాంసవర్ధక ఆహారముల సేవనచే మాంసము దూషింపబడినపుడు స్నిగ్ధముగను, పెద్దదిగను, కఠినము గను, సిరలతో వ్యాప్తమైనదిగను ఉండి కఫజ గ్రంధి లక్షణములతో కూడిన మాంసజగ్రంధి ఉత్పన్నమగును.[2]

8. అస్థి గ్రన్థి లక్షణములు

అస్థిభంగము లేక అభిఘాతములచే అస్థి ఉన్నతముగా గాని లేక అవనత ముగా గాని అయినపుడు ఉత్పన్నమగు గ్రంధి అస్థిగ్రన్థి అనబడును.[3]

---

అరుక్ స ఏవాప్యచలో మహాంశ్చ మర్మోత్థితశ్చాపి వివర్జనీయః
(సు. ని. అ. 11)

ii) పదాతేస్త్త సహసాఽమ్భోవదాహనాత్ వ్యాయామాద్వాప్రతాన్తస్య సిరా జాలం స శోణితమ్ వాయుః సంపీడ్య సంకోచ్య వక్రీకృత్య విశోష్య చ నిస్ఫురం నీరుజం గ్రంధిం కురుతే స సిరాహ్వయః (అ.సం.ఉ.అ. 34)

1. దోషైర్దుష్టేఽసృజి గ్రంధిర్భవేన్మూర్చ్ఛత్సు జంతుషు సిరామాంసం చ సంశ్రిత్య స స్వాపః పైత్తలక్షణః (అ.సం.ఉ.అ. 34)

2. మాంసలైర్దూషితం మాంసమాహారై గ్రంధి మావహేతు స్నిగ్ధం మహాంతం కఠినం సిరానద్ధం కఫాకృతిమ్ (అ.సం.ఉ. 34)

3. అస్థిభంగాభిఘాతాభ్యామున్నతావనతంతుయత్ సోఽస్థిగ్రంధిః
(అ. సం. ఉ. అ. 34)

## 9. వ్రణ గ్రంథి లక్షణములు

వ్రణము మానక యుండునపుడుగాని మానిన తోడనేగాని సర్వరసములను సేవించినను వ్రణము ఆర్ద్రముగానుండి బంధము చేయకున్నను, లేక శరీరముపై రాతిచే గాయము తగిలినను వాతము ప్రకోపించి, బయటకు స్రవింపనందున దూషింపబడిన రక్తమును శుష్కింపచేసి వ్రణమును గ్రంధి సదృశముగా మార్చును. దీనిని వ్రణగ్రంధి అందురు. ఇది కండూదాహములతో కూడి యుండును.[1]

### గ్రంధి రోగమునందు సాధ్యాఽసాధ్యత లక్షణములు—

వాతజ, పిత్తజ, కఫజ, రక్తజ, మరియు మేదోజ గ్రంధులు సాధ్యముగా నుండును. స్థూలముగను, కఠినముగను అచలముగనుఉండి కపోల, గళ, కంఠ, మన్యా, సంధిస్థానము, కుక్షి ఉదరము-మర్మస్థానము. ఈ ప్రదేశములందు జనించిన గ్రంధులు అసాధ్యముగా ఉండును. బాలురకు, వృద్ధులకు, దుర్బలులకు జనించిన గ్రంధి అసాధ్యముగా నుండును.[2]

---

1. అరూఢే రూఢమాత్రే వా వ్రణే సర్వరసాశినః సార్ద్రే వా బంధరహితే గాత్రేఽశ్మభిహతేఽథవా వాతోఽస్రమస్సృతం దుష్టం సంశోష్య గ్రంధితం వ్రణమ్ కుర్యాత్ సదాహః కండూమాన్ వ్రణగ్రంధిమయంస్మృతః
(అ. సం. ఉ. 34)

2. i) సాధ్యా దోషాస్రమేదోజా న తు స్థూల-ఖరాశ్చలాః మర్మ కంఠోదరస్థాశ్చ
(అ. సం. ఉ. 34)

ii) వివర్జయేత్ కుక్ష్యుదరాశ్రితం చ తథా గలే మర్మణి
సంశ్రితం చ యః ఖరశ్చాపి భవేద్విసర్జ్యో యశ్చాపి బాల-స్థవిరాబలానామ్
(చ. చి. 12)

# గ్రంధి రోగ చికిత్స

## సామాన్య చికిత్స

### ఆమావస్థ చికిత్స

గ్రంధి రోగమున గ్రంధి అపక్వముగా ఆమావస్థలో నున్నపుడు వ్రణ శోధయందు చెప్పబడిన విధముగా అపతర్పణము, ఆలేపము, అభ్యంగము, స్వేదము విమ్లాపనము, ఉపనాహము, పాచనము, విస్రావణము స్నేహపానము, వమనము, మరియు విరేచనము మొదలగు పదకొండు ఉపక్రమములచే ఉపచరింపవలెను.

ఈ శోధనాది ఉపక్రమములను ప్రయోగించునపుడు రోగి యొక్క బలమును ఎల్లప్పుడు రక్షించుచూ యుండవలెను. బలక్షయము కాకుండు విధముగా శోధనాదులు అపతర్పణాదులు చేయవలయును.

స్నేహపానము - తైలమునుగాని, ఘృతమునుగాని, లేక యమకస్నేహము త్రివృత్ స్నేహముగాని లేక ప్రసారిణీ దశమూల సిద్ధచతుః స్నేహముగాని పానము చేయింపవలెను.[1]

బృహత్యాది ఘృతపానము చేయింపవలెను.[2]

అపక్వావస్థ చికిత్స - గ్రంధి పక్వము చెందనచో స్వేదనము చేయించి

---

1. i) గ్రంధిష్వథామేషు భిషగ్విదధ్యాచ్ఛోఫక్రియాయాం విహితం విధిజ్ఞః
రక్షేద్బలం చాపి నరస్య విధిజ్ఞః తద్రక్షితం వ్యాధిబలం నిహన్తి
(సు.చి. 18/3)

ii) సు.చి. 18/4

2. అ. హృ. ఉ. 39/1

పాషాణము, కాష్టము, అంగుష్టము, దండము వీనిలో దేనినైనను ఉపయోగించి పీడించుట ద్వారా విలయక్రమగునట్లు చేయవలయును.[1]

## పక్వావస్థ చికిత్స

గ్రంధి పక్వమైనచో ఛేదనాది శస్త్రక్రియల ద్వారా సమూలముగా ఛేదించి పూయాదులను శోధించి దహనము చేయవలెను. తదుపరి వ్రణమువలె చికిత్సింపవలెను.

వ్రణమును ప్రక్షాళనాదులచే శోధించి శుద్ధినందిన తదుపరి రోపణక్రియల ద్వారా మాన్పవలెను.

గ్రంధిని ఛేదించునపుడు కొంతభాగము మిగిలిపోయినచో అది పాకము చెంది శీర్ణమగుచు విసర్పమును ఉపద్రవముగా కలిగించును. దీనిని క్షతజ విసర్పమందురు. అట్టి స్థితిలో విసర్ప చికిత్సలు, గ్రంధిచికిత్సలు వ్రణచికిత్సలు ఆవశ్యకతాను సారము ప్రయోగింపవలెను.[2]

## వాతజగ్రంధి చికిత్స

1. లేపనములు - అ) హింస్రాది లేపనమును ప్రయోగింపవలెను.
   ఆ) ఇతర లేపనములను ప్రయోగింపవచ్చును.

1. వివిధ స్నేహములను, ఉపనాహములను ప్రయోగింపవలెను.

3. వాతజ గ్రంధి పక్వమైనచో విదారణముచేసి పూయాదులను శోధించి బిల్వ అర్క- అరగ్వధ.వీని క్వాధముతో వ్రణమును ప్రక్షాళన చేసి తిల ఏరండ

---

1. i) సంశోధితే స్వేదితమశ్మకాష్టైః సాంగుష్ఠదండైః విలయేదపక్వం
   విపాట్య చోద్ధృత్యభిషక్ సకోశంశ స్త్రేణదగ్ధ్వా వ్రణవచ్చికిత్సేత్
   (చ.చి. 12/82)
   ii) పక్వముత్పాట్య సంశోధ్య రోపయేద్ వ్రణభేషజైః (భై.ర. 44/34)
2. చ. చి. 21/84-85

పత్రములు సైంధవ లవణ కల్కమును శోధనకై ప్రయోగింపవలెను. రాస్నాది తైలమునుగాని విడంగాది తైలమును గాని వ్రణరోపణమునకై ఉపయోగింపవలెను.[1]

## పిత్తజ గ్రంధి చికిత్స

1. పిత్తజ గ్రంధియందు జలౌకను ప్రయోగించి రక్తమోక్షణము చేయించవలెను.

2. ప్రక్షాళనము - రక్తమోక్షణానంతరము దుగ్ధము జలము కలిపి ప్రక్షాళన చేయింపవలెను.

3. పానము - అ) కాకోల్యాది గణశీతల క్వాథమునందు శర్కర కలిపి పానము చేయింపవలెను.
   ఆ) హరీతకీ చూర్ణమును ద్రాక్షరసమునందుగాని ఇక్షురసమునందుగాని కలిపి పానము చేయింపవలెను.

4. ప్రదేహములు అ) మధూకా,జంబు అర్జున వేతసత్వక్ కల్కముగాని
   ఆ) తృణ శూన్యకంద శర్కరా కల్కముతో
   ఇ) లేక ముచికుంద లేపముగాని చేయవలయును.

5. పిత్తజ గ్రంధి పక్వమైనచో విదారణముచేసి పూయమును శోధించి వనస్పతి క్వాథంచే ప్రక్షాళనచేసి యష్టిమధు తిలకల్కమును వ్రణశోధనకై ప్రయోగింపవలయును.

కాకోల్యాది గణసిద్ధ ఘృతము ఉపయోగింపవలెను.[2]

## కఫజగ్రంధి చికిత్స

కఫజ గ్రంధియందు స్నేహనము, స్వేదనము, వమనము, విరేచనము, రక్తమోక్షణము మొదలగు క్రియలద్వారా దోషములను శమింపచేయవలెను.

---

1. సు. చి. 18/5-7
2. సు. చి. 18/8-11

దోష శమనా నంతరము స్వేదనము చేయించి అంగుష్ఠము, లోహము, పాషాణము, లేక వేణు దండము ఉపయోగించి విమ్లాపనము చేయవలయును అనగా గ్రంధిని విలయన మొనర్ప వలెను.

వికంకతాది లేపనమును గాని స్వర్జికాది లేపనమునుగాని ప్రయోగింపవలెను.

మర్మస్థానము నాశ్రయించిన గ్రంధియందు పై చికిత్సలచే శమించనిచో అపక్వ స్థితిలోనే విదారణము చేసి శోధించి దాహకర్మ చేయవలయును. రక్తము ఆగిన తదుపరి దాహకర్మచేసి సద్యః క్షతవిధి ననుసరించి చికిత్సింప వలెను. ప్రతిసారణీయ క్షారము ప్రయోగింపవలెను.[1]

## మాంసగ్రంధి చికిత్స

పెద్దదిగాను, కఠినముగను ఉండు మాంసజ గ్రంధియందు కఫజ గ్రంధికి చెప్పబడిన చికిత్సలే చేయవలెను.

గ్రంధి పక్వమైనచో శీఘ్రముగా పాటనము చేసి కఫజ వ్రణమును శమింప చేయు క్వాథములతో ప్రక్షాళనము చేయవలయును.

వ్రణసంశోధన ద్రవ్యములలో యవక్షారము, మధుగుడము అధిక మాత్రలో కలిపి వ్రణశోధనార్థము ప్రయోగింపవలెను.

వ్రణము శుద్ధినందిన తదుపరి విడంగాది తైలము ప్రయోగించి రోపణము కలిగింపవలెను [2]

## మేదోజ గ్రంధి చికిత్స

మేదోజ గ్రంధియందు తిలకల్కము లేపనముచేసి రెండు పొరల వస్త్రమును కప్పి అగ్ని దప్త శలాకచే జాగ్రత్తగా దగ్ధము కాకుండునట్లు రుద్దవలెను. లేక మాలిపసుపు కల్కము లేపనము చేసి వేడి చేసిన లాక్షతో స్వేదనము చేయవలెను.

---

1. i) సు. చి. 18/12-14
   ii) భై. ర. 44/42-43
2. సు. చి. 18/15-16

శస్త్రచికిత్స - పై క్రియలచే శమించనచో శస్త్రముచే విదారణచేసి మేదస్సును తీసివేసి దహనకర్మను చేయవలయును.

గ్రంధి పాకము చెందనచో విదారణముచేసి దోషమును తీసివేసి గోమూత్రముతో ప్రక్షాళనము చేసి తిలాది చూర్ణమును మధు, ఘృతము, యవక్షారము కలిపి శోధనార్థము వ్రణముపై ప్రయోగింపవలయును.

రోపణము కొరకు కరంజాది తైలము వాడవలయును.[1]

## సిరాజగ్రంధి చికిత్స

నూతనముగా నున్నపుడు సహచర తైలపానము, వాతహర ద్రవ్యములతో ఉపనాహ స్వేదము, వస్తి కర్మ చేయించవలయును. సిరావ్యధనము చేయించవలయును.[2]

## రక్తజగ్రంధి చికిత్స

పిత్తజ గ్రంధి వలెనే జలౌకావచరణము, శీతల ఉపచారాదులచే చికిత్సింపవలెను[3]

## వ్రణజ గ్రంధి

మాంస గ్రంధిని వ్రణజ గ్రంధిని ఛేదించి చికిత్సింపవలెను.[4]

## అస్థిజ గ్రంధికి

ఆయా సందర్భాను సారము గ్రంధిచికిత్సలచేత ఉపచరింపవలెను.

---

1. సు. చి. 18/17-19
2. అ. హృ. ఉ. 30/7
3. పిత్తాస్రజే పునః జలౌకసో హిమం (అ.హృ.ఉ. 30 అ.)
4. మాంసవ్రణోద్భవౌ గ్రథీపాటయేదేవ మేవచ (అ.హృ.ఉ. 30 అ.)

# గణ్డమాల

అపచియే గలగణ్డమనియు, అపచివలె మాలా రూపమున అనేకము జనించుట గండమాల అనబడుననియు గ్రహణి. అతిసారముల వలెనే రెండింటికి సామ్యత ఉండునని గయదాసు వివరించెను.[1]

వాగ్భటుడు గూడా అపచియే గండమాల అని అభిప్రాయపడెను.[2]

చరకుడు గలగణ్డములు అనేకము జనించుట గండమాలగా వివరించెను.

## గణ్డమాలా లక్షణము

కర్కన్ధు (రేగుపండు), కోల (కమ్మరేగు), ఆమలకీ వీనికి సమానమైన ప్రమాణముగల గ్రంథులు మేదః కఫములచేత కక్షి, అంస, మన్య, గల, వంక్షణము- ఈ స్థలములందు చిరపాకము గల గండములనేకములు క్రమముగా మాల వలె జనించిన ఈ వ్యాధిని గణ్డమాల అందురు.[4]

---

1. స్థానకృత ఏవ భేదోఽపచీ -గండమాలాయోః గ్రహణ్యతి సారయోరివ।
   గలే ఏవ మాలాస్థానా గండమాలా చ (గయదాసః)
2. గండమాలాఽపచీ దేయం దూర్వేవక్షయవృద్ధి భాక్ (అ. సం. ఉ. 34)
3. గలస్య పార్శ్వే గలగండ ఏకః స్యాద్గండమాలా బహుభిస్తు
   గండైః సాధ్యాః స్మృతాః పీనసపార్శ్వశూలకాసజ్వరచ్ఛర్ధియుతా
   స్త్వసాధ్యాః (చ. చి. 12/79)
4. i. కర్కన్ధుకోలామలక ప్రమాణైః కక్షాంసమన్యా గలవంక్షణేషు
   మేదః కఫాభ్యాం చిరమన్దపాకైః స్యాద్గండమాలా బహుభిశ్చగణ్డైః
   (మా.ని. 38/8)

   ii) తాంతు మాలా కృతిసమాం—కంఠ-హృద్ధనుసంధిషు
   గండమాలాం విజనీయాదపచీతుల్యలక్షణామ్ (భోజః)

గణ్డమాలకు సంబంధించిన ఇతర వివరములు. "అపచి" వివరణలో చూడనగును.

చరకుని మతానుసారము గణ్డమాల సాధ్యముగానుండును. కాని పీనస, పార్శ్వశూల, కాస, జ్వర, ఛర్ది-ఈ ఉపద్రవములతో కూడియున్నచో అసాధ్యము అగును.

గండమాల క్షయజనితమై స్క్రోఫ్యులోడెర్మా (Scrofuloderma)కు తుల్యముగానుండును. కంఠము చుట్టూ లసీకాగ్రంధులు శోధితముగా వేదనా రహితముగా నీలవర్ణాభముగా నుండుట క్షయకారకమైన జీవాణువులతో కూడి యుండుట దీని ప్రధాన లక్షణములు.

## గండమాల చికిత్స

గలగండమునకు చెప్పబడిన విధిననుసరించియే గండమాలను ఉపచరింప వలయును.

**అభ్యంతరౌషధములు :**

1. కాంచనార క్వాథమున శొంఠి చూర్ణము కలిపి పానము చేయవలెను

2. వరుణ క్వాథమున తేనెను కలిపి పానము చేసిన చిరకాలానుబంధ గండమాల గూడా శమించును.

3. కాంచనారత్వక్ చూర్ణము 1 గ్రా శొంఠి చూర్ణము 1 గ్రా కలిపి తండులోదకముతో సేవించిన గండమాల శమించును.

4. ఇంద్రవారుణీమూల చూర్ణముగాని అపరాజితామూల చూర్ణముగాని గోమూత్రముతో సేవించిన అపచి గండమూల శమించును.

5. అలంభుషా (ముండీ) పత్రస్వరసము 15 మి. లీ. ప్రతిదినము. పానముచేసిన గండమాల అపచి శమించును.[1]

బాహ్య ప్రయోగములు మొదలగునవి :

1. అరగ్వధమూల చూర్ణము తండులోదకంతో నస్యము చేయించిన గండ మాల శమించును.

2. కటుతుంబీ స్వరసముతో నస్యము చేయించినను

3. కటుతుంబీ స్వరసము పిప్పలీ చూర్ణము కలిపి నశ్యము చేయించినను

4. నింబతైల నస్యము లేక నిర్గుండీ తైల నస్యము

5. గజపిప్పలీ చూర్ణము మధుతో కలిపి నస్యము చేయించినను గండమాల శమించును.

6. భారంగీ మూలమును తండులోదకముతో లేపనముచేసిన గలగండ గండమాలలు శమించును.

7. సింధూరాది తైల అభ్యంగము

8. ఛుచుందురీ తైలలేపనము

9. శాఖోటక చించీ తైలము నస్యము[1]

గండమాలలను శమింపచేయును.

---

1. భై. ర. 44

1. భై. ర. 44

## గలగండాది వ్యాధులందు పథ్యాపథ్యములు

**పథ్యములు :**

పురాణ రక్తశాలిధాన్యము, యవ, ముద్గ, పటోల, రక్తశిగ్రుఫలము, కారవేల్లకము, శాలించిశాకము, వేత్రాగ్రము.

రూక్ష, కటు, అగ్నిదీపక గుణములు గల అన్ని ఆహారపదార్థములు. పురాణఘృతము.

ప్రలేపము, ఉపవాసము.

**అపథ్యములు :**

దుగ్ధ వికృతులు, ఇక్షు వికృతులు, అనూపదేశ పశు పక్షుల మాంస రసములు.

**మాషాది** పిష్ట పదార్థములు, అమ్ల, మధుర, గురుక్లేద కారక పదార్థములు సేవించుట ఇవి అపథ్యములుగా నుండును.

ఈ పథ్యాపథ్యములు గలగండ, గండమాల, అపచి, గ్రంధి, అర్బుద వ్యాధులందు ఆచరింపదగినవి.[1]

## గలగణ్డము

**సామాన్య లక్షణము**

గళము (యొక్క పార్శ్వము) నందు అండము వలె పెద్దదిగానైనను,

---

1. భై. ర. 44/
   కా. (3) 26

చిన్నదిగానైనను వాపు నిలచి వ్రేలాడుచున్న యెడల దానిని గలగండమని అందురు.[1]

## గలగండ సంప్రాప్తి

ప్రకోపించిన వాతము మరియు కఫము మేదస్సును దూషింపచేసి మన్యా (మెడ నరముల) స్థానము నాశ్రయించి మెల్లమెల్లగా పైన చెప్పబడిన లక్షణములతో కూడిన శోథను వృద్ధి పొందించును.[2]

## గలగండ భేదములు

గలగండములు మూడు విధములుగా నుండును. అవి.

1. వాతజ గల గండము
2. కఫజ గల గండము
3. మేదోజ గల గండము

### 1. వాతజ గలగండ లక్షణములు

సూదులతో పొడుచుచున్నట్లు వేదనతో కూడి, నల్లని సిరలతో వ్యాప్తమై శ్యావ వర్ణములో గాని అరుణ వర్ణములోగాని యుండు గలగండము జనించును.

---

1. విబద్ధశ్శ్వయథుర్యస్య ముష్కవల్లంబతే గలే మహాన్వా యది వా హ్రస్వో గలగండం తమాదిశేత్ (సు.ని. 11/31)

2 i) వాతః కఫశ్చాపి గలే ప్రదుష్టో మన్యే చ సంశ్రిత్య తథైవ మేదః
కుర్వన్తి గణ్డం క్రమశస్స్వలింగైః స్సమన్వితం తం గల గండమాహుః
(సు.ని. 11/23)

ii) భోజేఽప్యుక్తం- మహాంతం శోథమల్పం వా హను-మన్యా-గలాశ్రయమ్
లంబనం ముష్కవద్ దృష్ట్వా వినిర్దిశేత్ (గయదాసః)

iii) పవన శ్లేష్మ మేదోభిర్గలగండో భవేద్వహిః వర్ధమానః స
కాలేనముష్కవల్లంబతే గలే (అ. హృ. ఉ. 21/53)

ఇది కొంతకాలము గడచిన పిదప మేదయుక్తమై వృద్ధిచెంది గళమునందు స్తబ్ధత్వ మును కలిగించును. అల్పవేదన, కాఠిన్యత, ఆలస్యముగా వృద్ధి చెందుట, ప్రాయికముగా పాకము చెందకుండుట, ఒక్కొక్కప్పుడు కారణము లేకయే పగులుట ఈ లక్షణములు కలిగి ఆస్యవైరస్యము తాలుగల శోష వీనితో కూడి యుండునది వాతజ గలగండమని తెలుసుకొనవలయును.[1]

### కఫజ గలగణ్డము

స్థిరముగా, చర్మముతో సమానమైన వర్ణము గలిగి, బరువుగను, తీవ్ర కండూయుక్తముగను, శీతముగను, ఆలస్యముగా పక్వమగునదిగను, ఆలస్య ముగా వృద్ధి చెందునదిగను, అల్పమైన వేదన కలదిగను ఉండు గొప్పదైన గళ గండము కఫము వలన కలుగును. ఇందు ఒక్కొక్కప్పుడు స్వల్ప వేదన కలిగి యుండును. మధురాస్యత తాలు గల లేపములతో కూడియుండును. ఈ లక్షణ ములు కలది కఫజ గలగణ్డము.[2]

---

1. i) తోదాన్వితః కృష్ణసిరావనద్ధః శ్యావోఽరుణో వా పవనాత్మకస్తు
పారుష్యయుక్తశ్చిర వృద్ధ్యపాకో యదృచ్ఛయా పాకమియాత్కదాచిత్
వైరస్యమాస్యస్య చ తస్య జన్తోర్భవేత్తథా తాలుగల ప్రశోషః
(సు.ని. 11/24-25)

ii) కృష్ణోఽరుణో వా తోదాఢ్యః సవాతాత్ కృష్ణరాజిమాన్ వృద్ధస్తాలుగలే
శోషం కుర్యాచ్చ విరసాస్యతామ్ (అ. హృ. ఉ. 21)

2 i) స్థిరః సవర్ణో గురురుగ్ర కండూ శీతో మహాంశ్చాపి కఫాత్మకస్తు
చిరాభివృద్ధిం భజతే చిరాద్వా ప్రపచ్యతే మన్దరుజః కదాచిత్॥
మాధుర్యమాస్యస్య చ తస్య జన్తోర్భవేత్తథా తాలుగల ప్రలేపః
(సు.ని. 11/26-27)

ii) స్థిరః సవర్ణః కండూమాన్ శీతస్పర్శో గురుః కఫాత్ బుద్ధస్తాలు గలే
లేపం కుర్యాచ్చమధురాస్యతామ్ (అ. హృ. ఉ. 21/85)

## మేదోజ గలగణ్డ లక్షణములు

మేదోజ గల గణ్డము స్నిగ్ధమైన స్పర్శను కలిగి, కోమలముగను, పాణ్డు వర్ణముగను, మిక్కిలి దురద స్వల్పమైన బాధ కలిగి యుండును.

దీని మూలము మిగుల స్వల్పముగా నుండి సొరకాయవలె వేలాడు చుండును. దేహము వృద్ధి చెందినపుడు వృద్ధి చెందుచు దేహము కృశించినపుడు కృశించుచుండును. నోరు స్నిగ్ధముగనుండి మాటలాడునపుడు కంఠమున ప్రతి ధ్వని కలిగియుండును.[1]

## గలగణ్డము నందు అసాధ్య లక్షణములు

మిక్కిలి కష్టముచే శ్వాస విడుచుట, శరీరమంతయు మృదువుగానుండుట, అరుచి, శరీరకృశత్వము, కంఠస్వరము మారియుండుట, వ్యాధి ఉత్పన్నమై సంవత్సరము దాటి యుండుట. ఈ లక్షణములు గల గలగణ్డము అసాధ్యముగా నుండును. కనుక వర్జింపవలయును.[2]

---

1. i) స్నిగ్ధో గురుః పాండురనిష్టగంధః మేదోభవః కండుమతో౽ల్పరుక్చ
ప్రలంబతే౽లాబువదల్పమూలో దేహాను రూపక్షయవృద్ధియుక్తః
స్నిగ్ధాస్యతా తస్య భవేచ్చ జన్తోర్గలే౽నుశబ్దం కురుతే చ నిత్యమ్॥
(సు.ని. 11/28-29)

ii) మేదసః శ్లేష్మ వద్హాని-వృద్ధయోః సో౽నువిధీయతే దేహం
వృద్ధశ్చ కురుతే గలే శబ్దం స్వరాల్పతామ్ (అ. హృ. ఉ.21)

2. కృచ్ఛాచ్ఛ్వసన్తం మృదుసర్వగాత్రం సంవత్సరాతీత మరోచకార్తమ్
క్షీణం చ వైద్యో గల గండయుక్తం భిన్నస్వరంచాపి వివర్జయేత్
(సు. ని. 11/30)

పీనస. పార్శ్వశూల, కాస, జ్వర, వమన ఈ ఉపద్రవములతో కూడిన గలగణ్ణము, గణ్ణమాల అసాధ్యములని చరకుడు చెప్పెను.[1]

## గలగండ చికిత్స

అభ్యంతర ఔషధములు :

1. శ్వేతాపరాజితా మూలకల్కమును ఘృతముతో ప్రాతఃకాలమున సేవించుచు పథ్యాహారములు భుజింపుచున్న గలగణ్డము శమించును.

2. తిక్తాలాబూఫలపు బుర్రయందు నీరుపోసి ఏడు రోజులుంచి పానము చేయుచు పథ్యాహారములు సేవించుచున్న గలగండము శమించును.

3. జలకుంభము, పిప్పలీ, సైంధవలవణము చూర్ణించి ఉదయము సేవించుచున్న గలగండము శమించును.[2]

4. అమృతాది తైలము-దుగ్ధము ఉష్ణోదకముతో పానము చేయవలెను.

5. కాంచనార గుటిక 1 గ్రా. గలగండము, గండమాల నాడీ వ్రణములను శమింపచేయును.

6. కాంచనార గుగ్గులు 1 గ్రా. ముండీక్వాథముతోగాని ఖదిరక్వాథముతో గాని సేవింపచేసిన అపచి, అర్బుద, గలగండ, గండమాలలు శమించును.[3]

బాహ్య ప్రయోగములు :

1. సర్షప తైలముతో జల కుంభీ భస్మము లేపనము చేసిన గలగండము శమించును.

---

1. గలస్య పార్శ్వే గలగండః ఏకః స్యాద్గండమాలా
బహుభిస్తు గండైః సాధ్యాః స్మృతాః పీనస పార్శ్వశూల
కాస జ్వరచ్ఛర్దియుతా స్త్వసాధ్యాః (చ. చి. 12/79)

2. భా. ప్రకాశ 44. 3. భై. ర. 44.

2. సర్షపాది లేపనముచేసిన గలగండ, గండమాల గ్రంథులు శమించును.

3. గలగండమున ప్రచ్ఛానముచేసి మామిడితోటలలోనుండు గండగోపాలికా అను కీటకమును నూరి లేపనము చేసిన నిశ్చయముగా శమించును.

4. హస్తికర్ణము పలాశమూలము తండులోదకముతో లేపనము సిరావ్యధనము, కాయ విరేచనము, శిరో విరేచనము, వమనము, ధూమపానము, పురాణ ఘృతపానము చేయింపవలెను.

యవలు, ముద్గలు, కటు, రూక్ష ఆహారములు పటోలము గలగండమున హితకరముగా నుండును.[1]

## గలగండమునందు సిరావ్యధనము

జిహ్వకు క్రింద భాగమున 12 సిరలు ఉండును. వానిలో లావుగను నల్లగను ఉండు రెండు సిరలు ఉండును. వానిని బడిశయంత్రముతో పట్టుకొని కుశపత్ర శస్త్రముతో వ్యధనము చేయవలయును. అశుద్ధ రక్తముస్రవించి నిస్సారణమైన తరువాత ఆర్ద్రికము గుడమునూరి లేపనము చేయవలెను. ఆకలి కలిగినపుడు అభిష్యందము చేయకుండునట్టి ఆహారమును కులుత్థయూషముతో ఇవ్వవలెను. దీనిచే గలగండము శమించును.

రెండు కర్ణములకు బాహ్యసన్ధికి మధ్యలో మూడుసిరలు వెంబడెంబడే ఉండును. వీనిని బడిశ యంత్రముతో పట్టుకొని కుశపత్ర శస్త్రముతో వ్యధనము చేసి రక్తమోక్షణము చేయించినను గలగండము శమించును.[2]

---

1. i) తేషాం సిరాకాయశిరోవిరేకా ధూమః పురాణస్యఘృతస్య పానతు (చ. చి 12/30)

ii) యవ ముద్గ పటోలాని కటురూక్షాన్నభోజనం
వమనం రక్తమోక్షశ్చ గలగండే ప్రయోజయేత్ (భా. ప్ర. 44-37)

2. సు. చి. 14/17-18.

కొన్ని సామాన్య గళగండ హర యోగములు :

1. జీర్ణ కర్కారు రసమున బిడాల సైంధవలవణములు చేర్చి నస్యము చేయించిన నూతన గలగండము శమించును.

2. సూర్యావర్తము లశునము ఉపనాహముగా ప్రయోగించిన గలగండము పగిలి పూయాదులు స్రవించి శమించును.

8. కట్ఫలచూర్ణమును గళమున ఘర్షణచేసిన గలగండము శమించును.

4. మహిష మూత్రమున మాంసము భావనచేసి అంతర్ధూమముగా భస్మము చేసిన మండూరభస్మము 200—400 మి. గ్రా తేనెతో సేవించిన గలగండము శమించును.[1]

## వాతజ గలగండ చికిత్స

నాడీస్వేదము- వాతఘ్న ఔషధపత్రములు, కాంజికము, అష్టవిధ మూత్రములు, దుగ్ధము, తైలము, మాంసరసము మొ॥వానిని పాకము చేయుచు నాడీ స్వేదము చేయింపవలెను.

రక్తమోక్షణము- స్వేదనానంతరము రక్తమోక్షణము చేయింపవలయును.

వ్రణమును శోధింపవలయును. ఉపనాహములు ప్రయోగింపవలెను. శతాహ్వాదిలేపము మాటిమాటికి లేపనము చేయుచుండవలయును.[2]

---

1. భై. ర. 44.
2. i) సంస్వేద్య గండం పవనోత్థమాదౌ నాడ్యానిలఘ్నౌషధపత్రభంగైః
   అమ్లైస్సమూత్రైర్విపచేత్పయోభిరుష్ణైస్సతైలైః పిశితైశ్చ విద్వాన్
   విస్రావయేత్స్విన్నమతంద్రితశ్చ శుద్ధం వ్రణం చాప్యుపనాహయేత్తు
   (సు. చి. 18/43-44)

   ii) సు. చి. 13/45-47.

తిలబీజాది లేపము ఉపనాహము శిగ్రుతిల్వకాది లేపము.[1]

నిచుళాది లేపము.[2]

అమృతవల్ల్యాది తైలపానము ప్రతిదినము చేయవలయును.

## కఫజ గలగండ చికిత్స

కఫజ గలగండమునందు స్వేదనము, ఉపనాహ స్వేదనము, స్వేదనానంతరము రక్తమోక్షణము చేయింపవలయును.

అజగంధాదికల్క ఉష్ణలేపనము ప్రయోగింపవలయును. పిప్పల్యాది గణ సిద్ధ తైలపానము చేయింపవలెను.

జలకుంభీ క్షారమును గోమూత్రముతో కలిపి పానీయ క్షారముగా పాకము చేసి త్రాగవలెను. తదుపరి కోద్రవ భోజనము చేయవలయును.

పంచలవణములతో వత్సకాది గణసిద్ధ తైలమును పానము చేయింపవలెను.

కఫనాశకమైన వమనములు, శిరో విరేచనము, వైరేచనిక ధూమపానములు ప్రయోగించవలెను.[3]

---

1. అ. హృ. ఉ. 22/65-68.
2. భై. ర. 44/4.
3. i) స్వేదోపనాహైః కఫసంభవస్తు సంస్వేద్య విస్రావణమేవ కుర్యాత్
(సు. చి. 18/48)
ii) ప్రచ్ఛర్దనం మూర్ధవిరేచనం చ ధూమశ్చ వైరేచనికో హితస్తు
(సు. చి. 18/50)
iii) సు. చి. 18/48-50

దేవదారు విశాలా మూలకల్కము లేపనము చేయవలెను.[1] కఫజ గలగండ రోగమునందు త్రికటు చూర్ణముతో మధు, గోమూత్రము కలిపి యవాన్నముతో ఇవ్వవలెను.

ఆర్ద్రికము పటోలము, నింబ వీనితోకూడిన ముద్గయూషమునిచ్చుట హిత కరముగా నుండును.[2]

## మేదోజ గలగండ చికిత్స

1. మేదోజ గలగండమునందు స్నేహనము చేయించి ముందు చెప్పబడిన విధముగా సిరా వ్యధనము చేయింపవలయును.

2. శ్యామాది లేపనము చేయించవలెను.

3. సాలసరాదిగణ సారముతో గోమూత్రము కలిపి ఉదయము పానము చేయింపవలెను.

4. యవ భోజనము నిత్యము సేవించవలయును.

5. గ్రంధిని శస్త్రముచే విదారణముచేసి మేదస్సును బహిర్గతముచేసి వ్రణ మును సీవనము చేయవలయును. లేక మజ్జ, ఘృతము, మేదస్సు, మధు-వీనిని వేడిచేసి వీనిచే దహనకర్మ చేయవలెను.

దాహ కర్మానంతరము మధు ఘృతములను ప్రయోగించవలెను.

6. లేపనము-కాసీస, తుత్థ, గోరోచన చూర్ణము పూయవలెను.

తైలముపూసి సాలసరాది గణము, గోమయభస్మము లేపము చేయవలెను. త్రిఫలాక్వాథ ప్రక్షాళనముచేసి గాఢబంధనము చేయవలెను.[3]

---

1. భై. ర,
2. సు. చి. 18/51.
3. i) మేదస్సముత్థేతు యథోపదిష్టాం విధ్యేచ్ఛిరాం స్నిగ్ధతనోర్నరస్య
శ్యామా సుధా లోహపురీషదన్తీ (చ.చి. 18/52)
ii) సు. చి. 18/53-55

# అర్బుద ప్రకరణము

అర్బుదముయొక్క సంప్రాప్తి సామాన్య లక్షణములు :-

వాతాది దోషములు ప్రకోపమునొంది శరీర మందెచ్చటనైనను ఒకచోట మాంసమును దూషింపచేసి వర్తులముగను, కఠినముగను, స్థిరముగను, గొప్పదిగను, గాఢమైన మూలమును కలిగినదిగను, స్వల్పవేదన కలదిగను, చిరకాలము నకు మెల్ల మెల్లగా వృద్ధిచెందుచు పాకము నొందకుండునదియును అగు మాంస సంఘాతమును కలిగించును. ఇది అర్బుదమనబడును. ఇది అతి గాఢముగా జనించును.[1]

అర్బుదము యొక్క భేదములు:

అర్బుదము ఆరు విధములుగా నుండును. అవి :-

1. వాతజ అర్బుదము
2. పిత్తజ అర్బుదము
3. కఫజ అర్బుదము
4. రక్తజ అర్బుదము
5. మాంసజ అర్బుదము.
6. మేదోజ అర్బుదము

---

1. i) గాత్రప్రదేశే క్వచిదేవ దోషాః సంమూర్ఛితా మాంసమభిప్రదూష్య
వృత్తం స్థిరం మన్దరుజం మహాంత మనల్పమూలం చిరవృద్ధ్యపాకమ్
కుర్వంతి మాంసోపచయం తు శోఫం తమర్బుదం శాస్త్రవిదో వదంతి
వాతేన పిత్తేన కఫేన చాపి రక్తేన మాంసేన చ మేదసా చ తజ్జాయతే
తస్య చ లక్షణాని గ్రంధేః సమానాని సదా భవంతి (సు.ని. 11)

ii) మహత్తు గ్రథితోఽర్బుదమ్ తల్లక్షణం చ మేదోస్రైః షోఢాదోషాదిభిస్తు
తత్ ప్రాయో మేదః కఫాధిక్యాత్ స్థిరత్వాచ్చ న పచ్యతే
(అ. సం. ఉ. అ. 34)

ఈ ఆరింటిలోను రక్తజార్బుదము, మాంస జార్బుదము తప్ప మిగిలిన అర్బుదముల యొక్క లక్షణములు ఆయా గ్రంథుల యొక్క లక్షణములతో సమానముగా నుండును.

అర్బుదములందు మేదస్సు కఫము అధికముగా నుండును. అందుచే స్థిరముగానుండి ప్రాయికముగా పాకమును పొందవు.

## రక్తార్బుద లక్షణములు

తమ తమ స్వకారణములచే ప్రకోపించిన వాతాది దోషములు సిరలలో నుండు రక్తమును పీడించి, సంకుచితముచేసి, ఏకత్రితము చేసి పాకమును చేయుచు మాంసపిండమువంటి ఉన్నతముగా నుండు అర్బుదమును కలుగచేయును. ఇది కొంచెము స్రవించు మాంసపు మొలకలతో కూడి శీఘ్రముగా వృద్ధి చెందుచు నిరంతరము దుష్ట రక్తమును స్రవించుచుండును. రక్తముయొక్క అతి స్రావము చేత రోగి రక్తక్షయ జన్యమైన ఉపద్రవములతో పీడింపబడుచు పాండు వర్ణమును పొందును. ఈ రక్తార్బుదము మిక్కిలి అసాధ్యముగా నుండును.[1]

## మాంసార్బుద లక్షణములు

ముష్టి (పిడికిలి) లేక కాష్ఠాదుల ప్రహారములచే పీడింపబడుటవలన

---

1. i) దోషః ప్రదుష్టో రుధిరం సిరాస్తు సంపీడ్య సంకోచ్య గతస్తు పాకమ్।
సాస్రావ మున్నహ్యతి మాంసపిండం మాంసాంకురై రాచితమాశువృద్ధిమ్
స్రవత్యజస్రం ప్రదుష్టమసాధ్యమేతద్రుధిరాత్మకం స్యాత్ రక్తక్షయోప
ద్రవపీడితత్వాత్ పాండుర్భవేదర్బుదపీడితస్తు (సు.ని.11)

ii) సిరాస్థం శోణితం దోషః సంకోచ్యాంతః ప్రపీడ్య చ పాచయేచ్చ తదానద్ధం
సాస్రావం మాంసపిండితమ్ మాంసాంకురైశ్చితం యాతి వృద్ధిం చాశు
స్రవేత్తతః అజస్రం దుష్టరుధిరం భూరి తచ్ఛోణితార్బుదమ్
(అ. సం. ఉ. అ. 34)

మాంసము దూషింపబడి చర్మమునకు సమానమైన వర్ణము, స్నిగ్ధస్పర్శలతో కూడిన వేదనారహితమైన, పాకరహితమైన, కఠినమైన, నిశ్చలమైన రాయివంటి శోధకలుగును. మాంసమును అధికముగా సేవించు వారలకు, మాంసము దూషిత మైన వారికి మాంసార్బుదము విశేషముగా జనించును. ఇది మాంసార్బుదము మాంసార్బుదము అసాధ్యముగా నుండును.[1]

## అధ్యర్బుద ద్విర్బుద లక్షణములు

పూర్వోక్త లక్షణములతో కూడిన అర్బుదమునందు మరొక అర్బుదము ఉత్పన్నమైనచో దానిని అధ్యర్బుదము అందురు.

రెండు అర్బుదములు ఒకే స్థానమునందు ఏకకాలమున జనించినను లేక ఒకదాని తర్వాత ఒకటి క్రమముగా జనించినను దానిని ద్విద్యర్బుదమందురు.

ఈ రెండు విధములైన అర్బుదములు అసాధ్యములుగ నుండును.[2]

అర్బుదములందు దోష ప్రాధాన్యత—ధాతుప్రాధాన్యత.

సామాన్యముగా, అర్బుదము లన్నింటి యందును రక్తము, మాంసములు దుష్టములుగా నుండును.

---

1. ముష్టిప్రహారాదిభిరర్దితేఽంగే మాంసం ప్రదుష్టం ప్రకరోతి శోఫమ్।
అవేదనం స్నిగ్ధమనన్యవర్ణమపాకమశ్మోపమమప్రచాల్యమ్॥ ప్రదుష్టమాంసస్య నరస్య బాఢమేతద్భవేన్మాంసపరాయణస్య (సు.ని.అ. 11)

2. యజ్జాయతేఽన్యత్ ఖలు పూర్వజాతే జ్ఞేయం తదధ్యర్బుదమర్బుదజ్ఞైః
యద్ద్వంద్వజాతం యుగపత్ క్రమాద్వా ద్విరర్బుదం తచ్చ భవేదసాధ్యమ్ (సు. ని. అ. 11)

రక్తార్బుదమున పిత్తము రక్తంబును, మాంసార్బుదమున మాంసము వాత ములను దోషదూష్యంబులుగా నుండును.[1]

అర్బుదములు పక్వము కాకుండుటకు కారణములు.

అర్బుదములన్నింటి యందును కఫ మేదస్సు అధికముగా నుండుటచేతను, దోషములు స్థిరముగా నుండుట చేతను, గ్రన్దివలె (కఠినముగా) నుండుట చేతను స్వాభావికముగా పాకమును పొందకుండా యుండును.[2]

## అర్బుదములందు సాధ్యాఽసాధ్యతలు

వాతజ, పిత్తజ, కఫజ, మేదోజ — ఈ నాలుగు అర్బుదములు సాధ్యము లుగా నుండును. రక్తార్బుదము. మాంస జార్బుదము - ఇవి రెండును అసాధ్యము లుగా నుండును.

సాధ్యములుగ చెప్పబడిన నాలుగు అర్బుదములందు కూడా వ్యాధి స్వభావ ముచే పాకమును పొందకున్నను చర్మము పగిలి స్వల్ప స్రావముతో కూడి యున్నను, మర్మ స్థలములందు జనించినను నాసాది స్రోతో మార్గములందు జనించినను, స్థిరముగా కదలకుండా యున్న అర్బుదములును అసాధ్యములుగా నుండును.

---

1. యద్యపి రక్తమాంసార్బుదయో రక్తమాంసయోర్హేతుత్వే
   నోక్తస్తథాపిరక్తజేపిత్తం మాంసజే వాయురారంభికః
   (మధుకోశ—మా.ని. 38 పై)

2. నపాకమాయాన్తి కఫాధికత్వాన్మేదోబహుత్వాచ్చ విశేషతస్తు
   దోషస్థిరత్వాద్గ్రథితాచ్చ తేషాం సర్వార్బుదాన్యేవ నిసర్గతస్తు
   (సు.ని. 11/22)

## అర్బుద రోగ చికిత్స

గ్రంధి, అర్బుదములకు ఉత్పత్తి స్థానము, నిదానము, లక్షణములు, దోష, దూష్యములలో సామ్యత ఉన్నందున గ్రంధికి చెప్పబడిన చికిత్సలు అర్బుదమునందు కూడా అవస్థాను సారము ప్రయోగింపవచ్చును.[1] గ్రంధియందు చెప్పబడిన చికిత్సలు దోషానుసారముగా చేయవలయును.

## వాతజ అర్బుద చికిత్స

ఉపనాహము—[illegible] తైలము ఉష్ణముగా నుండగా ఉపనాహము చేయవలయును.

మాంసము వేశవారము ప్రధానముగా చేర్చబడిన ఇతర ఉపనాహములను ప్రయోగింపవలయును.

నాడీ స్వేదము చేయింపవలయును.

శృంగము ప్రయోగించి మాటిమాటికి రక్తమోక్షణము చేయింపవలయును.

వాతఘ్న దేవదార్వ్యాది గణము మొదలైన ద్రవ్యముల క్వాథము, దుగ్ధము, కాంజికములలో సిద్ధము చేసిన శతపాక త్రివృత్ స్నేహమును పానము చేయింప వలయును[2]

---

1. i) గ్రన్థ్యర్బుదానాం చ యతోఽవిశేషః ప్రదేశ హేత్వాకృతి దోష దూష్యైః
 తతశ్చికిత్సేద్భిషగర్బుదాని విధానవిద్ గ్రంధిచికిత్సితేన (చ.చ 41/49)
 ii) అర్బుదే గ్రంధివత్కుర్యాద్యథాస్వం సుతరాం హితమ్
 (అ. హృ. ఉ. 30/8)

2. i) వాతార్బుదంక్షీరఘృతాంబుసిద్ధైరుష్ణస్తథా తైలైరుపనాహయేత్తు
 కుర్యాచ్చ ముఖ్యాన్యుపనాహనాని సిద్ధైశ్చ మాంసైరథ వేసవారైః
 స్వేదం విదధ్యాత్కుశలస్తు నాడ్యాశృంగేణ రక్తం బహుశో హరేచ్చ
 వాతఘ్న నిర్యూహపయోఽమ్లభాగైః సిద్ధం శతాఖ్యం త్రివృతం పిబేద్వా
 (చి. సు. ఉ. 18/30)

## పిత్తజ అర్బుద చికిత్స

పిత్తజ అర్బుదమునందు మృదువైన స్వేదములు, ఉపనాహములు, విరేచన కర్మలు హితకరముగా నుండును.

ఘర్షణము : ఉదుంబర, శాక గోజిహ్వాది పత్రములతో ఘర్షణము (లేఖనము) చేయవలెను.

లేపనము - సర్జరసాది చూర్ణము మధుతో కలిపి లేపనము చేయవలెను.

రక్తమోక్షణము చేయించి అరగ్వధాది లేపము ప్రయోగింపవలయును.

శ్యామాది ఘృతము పానము చేయించిన పిత్తజ అర్బుదము శమించును.[1]

## కఫజ అర్బుద చికిత్స

కఫజ అర్బుదమునందు వమనముచే శోధన చేయించి అలాబుచే రక్తమోక్షణము చేయింప వలయును.

లేపములు - అ) ఊర్ధ్వాధో మార్గహర ద్రవ్య కల్క లేపము
ఆ) కపోత విష్ఠాది లేపము[2]

---

1. i) స్వేదోపనాహామృదవస్తు పథ్యాః పిత్తార్బుదే కాయవిరేచనం చ
విఘృష్య చోదుంబరశాకగోజీ పత్రైర్భృశం క్షౌద్రయుతైః ప్రలింమేత్
(సు.చి. 18/32)

ii) సు.ఉ. 18/33-34

2. i) శుద్ధస్యజన్తోః కఫజేఽర్బుదే తు రక్తేఽవసిక్తే తు తతోఽర్బుదం తత్
ద్రవ్యాణి యాన్యూర్ధ్వమధశ్చ దోషాన్ హరన్తి తైః కల్కకృతైః ప్రదిహ్యాత్
(సు.చి. 18/35)

ii) సు.చి. 18/36

ఇ) శంఖ చూర్ణాది లేపము

ఈ) ఉపోదికా స్వరసము అభ్యంగము చేసి ఉపోదికా పత్రములు బంధించిన పిటక అర్బుదము శమించును.

ఉ) క్షారయుక్త గోమూత్ర లేపము

ఉపనాహములు మొ॥నవి

ఉపోదికా ఉపనాహము

స్నుహ్యాది స్వేదము[1]

శస్త్రక్రియ - నిష్పావము, పిణ్యాకము కలిపి అర్బుదముపై లేపనము చేసినచో మాక్షికములు వాలుటచే క్రిములుత్పన్నమగును. ఆ క్రిములు అర్బుదమును భక్షించుటచే అర్బుదము కొద్దిభాగము మాత్రము అవశిష్టముగా ఉన్నపుడు లేఖనము చేసి అగ్నికర్మ చేయవలయును.[2]

## అల్ప మూలముగా ఉండు అర్బుద చికిత్స

అల్ప మూలముగా ఉండు అర్బుదమును, త్రపునము, తామ్రము సీసము మొదలగు లోహముల యొక్క పట్టీలచే అన్ని వైపులాకట్టి రోగి ప్రాణమును రక్షింపుచు క్షార, అగ్ని, శస్త్రాది కర్మలచేత మాట మాటకి జాగ్రత్తగా చికిత్సింపవలెను.

---

1. చక్రదత్త 41
2. నిష్పావ పిణ్యాక కులత్థకల్కైర్మాంస ప్రగాఢైర్దధిమస్తుయుక్తైః లేపం విదధ్యాత్క్రిమయో యథాఽత్ర మూర్ఛన్తి మూర్ఛన్త్యథ మాక్షికాశ్చ అల్పావశిష్టే క్రిమిభిః కృతే చ రిఖేత్తతోఽగ్నిం విదధీత పశ్చాత్ (సు.చి. 18/37-38)

ఆస్ఫోతాది క్వాథముతో వ్రణమును శోధన చేయవలయును.

వ్రణము శుద్ధమైనతర్వాత భార్గ్యాది తైలము ప్రయోగించి రోపణ మొనర్పవలెను.

**స్వయముగా పక్వమైన అర్బుద చికిత్స-**

స్వయముగా పక్వమైన అర్బుదమును వ్రణమునకువలె పాటన, శోధన, రోపణాది క్రియలతో ఉపచరింపవలెను.[1]

## మేదోజ అర్బుద చికిత్స

మేదోజ అర్బుదమునందు స్వేదనము చేసి శోధించి రక్త స్రావము శమింపగనే సీవనము చేయవలెను.

హరిద్రాది తైలము వ్రణశోధనార్థము లేపనము చేయవలెను.

కరంజ తైలము ప్రయోగింపవలయును.[2]

అర్బుదములను సమూలముగా ఛేదింపక శేషమునుంచినచో అది నిప్పు

---

1. i) యదల్పమూలం త్రపుతామ్రసీసపట్టైస్సమావేష్ట్య తదాయసైర్వా
క్షారాగ్నిశస్త్రాణ్యసకృద్విదధ్యాత్ప్రాణానహింసన్భిషగప్రమత్తః
(సు చి. 18/38-39)

ii) సు.చి. 18/39-40

2. i) మేదోఽర్బుదం స్విన్నమథో విదార్య విశోధ్య సీవ్యేద్గత రక్తమాశు
(సు.చి. 18/41)

ii) సు.చి. 18/41-42

కణమువలె తిరిగి శీఘ్రముగా పెద్దదగు చుండును. అందుచే నిశ్శేషముగా ఛేదింప వలెను.[1]

అర్బుదములందు రౌద్రరసము (భై. ర) 100 మి. గ్రా. కాంచనార గుగ్గులు మొదలగునవి ప్రయోగింపదగును. గలగండ గండమాలలకై చెప్ప బడిన ఔషధములు అర్బుదములందును ప్రయోగింప వచ్చును.

## అ ప చి

హన్వస్థి సంధి, కక్షాసంధి, అక్షకాస్థియొక్క సంధి, బాహు సంధి, మన్యా సంధి, వంక్షణసన్ధి, గళ ప్రదేశము వీనియందు ప్రకోపించిన కఫ ప్రధాన వాతాది దోషములు మరియు వృద్ధి చెందిన మేదస్సు ఆశ్రయించి స్థిరముగను, కఠినము గను, వృత్తముగను లేక పొడవుగను ఉండి స్నిగ్ధముగను, అల్పవేదనతోను కూడిన గాఢమైన మూలము కలిగిన గ్రంథిని ఉత్పన్నము చేయును.

ఈ గ్రంథి, ఆమలకీవలె, వృంతాకమువలె లేక మత్స్యాండ జాలమువలె ఉండి చర్మముతో సమానమైన వర్ణముకలిగిన ఇతర గ్రంథులతో కలసివృద్ధి చెందుచుండును. గ్రంథుల యొక్క అధిక సంచయము ఇందు కలుగు చున్నందున ఈ వ్యాధి "అపచి" అనబడుచున్నది.

ఈ గ్రన్థులయందు కణ్డు, అల్పవేదన ఉండును. ఈ గ్రంథులు పక్వమై పగిలి పూయము స్రవించి శమించి పోవును. కాని మరలా క్రొత్తవి ఉత్పన్నమగు చుండును. ముందు ఉత్పన్నమైనవి శమించి ఈ విధముగా క్రొత్తవి ఉత్పన్నమగు చుండును. ఈ విధముగా ఈ వ్యాధి సంవత్సరముల తరబడి అనువర్తించి యుండును.

---

1. సశేషదోషాణి హి యోఽర్బుదాని కరోతి తాన్యాశు పునర్భవన్తి
(సు.చి. 18/42)
తస్మాదశేషాణి సముద్ధరేత్తు హన్యుస్సశేషాణియథాహి వహ్నిః

జలము లభించినప్పుడు వృద్ధి చెందుచు లభింపనపుడు శోషించి పోవు దూర్వాది తృణములవలె ఈ వ్యాధి వృద్ధి క్షయములను పొందు చుండును. ఇది కష్టసాధ్యమైన వ్యాధి!

"అపరోచీయమాన తయా అపచీ" అను ఉత్పత్తిచేత ఒకటి తర్వాత ఒకటి ఉత్పన్నమై వృద్ధి చెందు చుండుటవలన "అపచి" అను పేరు కలిగినది.

దోషాధిక్యానుసార లక్షణములు -

వాత ప్రధానముగా నున్నపుడు - రూక్షముగను వాత వేదనలతో కూడియు ఉండును.

---

1. హన్వస్థి కక్షాక్షకబాహుసంధిః మన్యాగలేషూపచితం తు మేదః గ్రంధిః స్థిరం వృత్తమధాయతం వా స్నిగ్ధం కఫశ్చాల్పరుజం కరోతి తం గ్రన్థిభిస్త్వా మలకాస్థిమాత్రైర్మత్స్యాండజాలప్రతిమైస్తథాఽన్యైః అనన్యవర్ణై రుప చీయమానం చయప్రకర్షాదపచీం వదంతి కండూయుతాస్తేఽల్పరుజః ప్రభిన్నాః। స్రవంతి నశ్యంతి భవన్తిచాన్యే। మేదః కఫాభ్యాం ఖలు రోగ ఏష సుదుస్తరో వర్షగణాను బంధీ (సు.ని. 11/10-12)

ii) తదాహిభోజః- వాతపిత్తకఫావృద్ధా మేదశ్చాపిసమాచితమ్ జంగధయోః కండూః ప్రాప్యమత్స్యాండసదృశాన్ బహూన్ కుర్వన్తి గ్రథితాంస్తేభ్యః పునః ప్రకుపితోఽనిలః తాన్ దోషానూర్ధ్వగోవక్షః కక్షామన్యాగలాశ్రితః నానాప్రకారన్ కుటితేగ్రంధీన్ సాత్వపచీస్మృతా వ్యామిశ్రదోషజాతా సా కృచ్ఛ్రసాధ్యా ప్రకీర్తితా

iii) మేదఃస్థాః కంఠమన్యాక్షా కక్షా వంక్షణగా మలాః। సవర్ణాన్ కఠినాన్ స్నిగ్ధాన్ వాత కామలకాకృతీన్॥ అవగాఢాన్ బహూన్ గండాశ్చపాకాంశ్చ కుర్వతే పచ్యంతేఽల్పరుజస్తేఽప్యేస్రవన్త్యయేఽపికండూరాః॥ నశ్యన్త్యన్యే భవన్త్యన్యే దీర్ఘకాలానుబంధినః గండమాలాఽపచీ చేయం దూర్వేవక్షయ వృద్ధిభాక్॥ తాం త్యజేత్ సజ్వరచ్ఛర్ది పార్శ్వరుక్కాస-పీనసామ్

(అ.సం.ఉ.అ. 34)

పిత్త ప్రధానముగా నున్నపుడు - త్వరగా వృద్ధి చెందుట, పాకమునందుట దాహముతో కూడియుండుట జరుగును.

కఫము ప్రధానముగా నున్నపుడు కఠినముగ, స్నిగ్ధముగ, స్థిరముగానుండి అల్పవేదన, గూఢ పాకముతో కూడి యుండును.

మేదస్సు అధికముగా నున్నపుడు శ్లేష్మాదిక సమలక్షణములతో కూడి యుండి విశేషించి మృదువుగా నుండును.

ఈ విధముగా భోజుడు దోషానుసార లక్షణములు వివరించెను.

అపచివంటి లక్షణములతో మాలాకృతిలో అనేకము కలిగిన స్థితి గండ మాల అని భోజుని అభిప్రాయము.[1] చక్రపాణియు ఇదే అభిప్రాయము వ్యక్త పరిచెను.

వాగ్భటుడు అపచి గండ మాలలను ఒకటిగనే భావించెను.

## సాధ్యాఽసాధ్యతలు

ఇది కష్ట సాధ్యమైన వ్యాధి. జ్వరము, ఛర్ది, పార్శ్వ శూల, కాస, పీనసములతో కూడియున్నచో వర్జనీయము.[2]

---

1. తాసాం వాతోఽత్తరా రూక్షావాతవేదనయాఽన్వితా క్షిప్రపాక-సముద్ధానా దాహయుక్తా తు పైత్తికీ గూఢపాకా చ కఠినాకఫాత్‌స్నిగ్ధాఽల్పరుక్ స్థిరా। మేదోధికా శ్లైష్మికీ చ విశేషాదతిమార్దవా॥ అపచీ కంఠ మన్యాసు కక్షా వంక్షణ సన్ధిషు తాం తుమాలాకృతి సమాం కంఠ-హృద్దను సంధిషు॥ గండమాలాం విజనీయాదపచీతుల్యలక్షణామ్

2. అ సం. ఉ. అ. 34

## అపచీ చికిత్స

**ఘృతపానము :-**

జీమూతకాది ఘృతము-ఇది మంచి ప్రభావశాలి ఊర్ధ్వాధో మార్గముల ద్వారా దోషశమనము చేయును.

**వమనము :-**

నిర్గుండీ, జాతి, జీమూత, మాక్షిక సైంధవ యోగమును ప్రయోగించి గాఢ వమనము చేయింపవలయును. లేకకైటర్యాది తైలపానము చేయించి వమనము చేయింపవలయును.

విరేచనమును, శిరోవిరేచనమును చేయింప వలయును.

శాఖోట స్వరస సిద్ధ తైలముతో నస్యము చేయింపవలయును. సుమూత సార, శిగ్రు, అపామార్గ బీజములతో అవపీడనము చేయింపవలయును.

మర్మ ప్రదేశము కాని చోట కలిగిన అపచి, గ్రంథులందు క్షార, అగ్ని, శస్త్ర క్రియలచే ఉపచరింప వలయును. లేక శస్త్రముచే గ్రంధిని లేఖనము చేసి ప్రతిసారణ క్షారము ప్రయోగింపవలెను.

**అగ్నికర్మ :**

కాలి మడమనుండి పన్నెండు అంగుళముల దూరమున ఇంద్రవస్తి మర్మ ప్రదేశమును విడిచి చర్మమును విదారణము చేసి మత్స్యాండము వలెనుండు మాంస జాలమును తీసివేసి తప్తశలాకతో అచట అగ్నికర్మను చేయవలయును.

గుల్ఫసంధి కర్ణము లేక గుల్ఫ సంధినుండి కర్ణమువరకు ఉండుదూరములో ఎనిమిదవ భాగమునందు ఇంద్రవస్తి మర్మస్థానమును వదలి నాసిక వంటి గంటును పెట్టి జాలమును తీసివేసి దాహ కర్మ చేయవలెనని కొందరి మతము.

లేక మణి బంధము మీదగా ఒక్కొక్క అంగుళము దూరములో మూడు రేఖలవంటి చురకలు వేసిన అపచీ వ్యాధి శమించును.[1]

ప్రచలాక కాకాదితైలమును వ్రణము రోపణ మగుచున్నపుడు లేపనము చేయవలయును.

శ్లీపదమునందు చెప్పబడిన తైలములు ప్రయోగింప వలయును.

పైరేచనిక ధూమపానము ఆచరింపవలెను.

ప్రతిదినము యవలు ముద్గలు ఆహారముగా ఉపయోగింపవలయును. వన కార్పాసము తండులములతో అపూపములుగా చేసి సేవించవలయును[2].

అపచీహార లేపన యోగములు :-

శోభాంజనాది లేపము

సర్షపాది లేపము

అశ్వత్థాది లేపము

గుంజాది తైలము (చక్రదత్త)

ఇతర ఔషధయోగములు :-

నస్యమునకు—వ్యోషాది తైలము,

చందనాది తైలము పానము (చక్రదత్త)[3]

---

1. సు.చి. 18/20-27.
2. సు.చి. 18/28
3. చక్రదత్త 41

# స్నాయుక రోగము

ప్రకోపించిన దోషములు హస్తపాదములకు వ్యాపించి విసర్పము వంటి శోథను కలుగచేయును. ఆ శోథను భేధించుకొని క్షతముగా ఏర్పడి అచటి ఊష్మను మాంసమును శోషింప చేసి దారము వంటి స్నాయు సూత్రమును బయటకు వచ్చునటుల చేయును. ఈ వ్రణమునందు తక్రముతో కలిపిన యవ సక్తును కట్టిన పై సూత్రము మెల్లమెల్లగా వ్రణమునుండి బయటకు వచ్చును.

ఈ వ్రణమును గుర్తింపక సూత్రమును కోసి శోధించ వలెనని ప్రయత్నించిన వ్రణము ప్రకోపించును. ఆ వ్రణము శమించి మరియొక చోట బయలు వెడలుచుండును. దీనిని స్నాయుక రోగము లేక నారుకురుపు అందురు.

కాలి యందుగాని చేతి యందుగాని ప్రమాదవశమున స్నాయువు తెగినచో ఆ కాలినిగాని చేతినిగాని సంకోచింప చేసి ఖంజత్వమును కలిగించును.[1]

స్నాయుక రోగము డ్రాక్యున్కులస్ మెడినెన్సిస్ (Dracunculus medinensis) అను కృమి పరాన్నజీవి వలన కలుగు వ్యాధి. భారత దేశమునందు ఆఫ్రికాలోను ఈ వ్యాధి వ్యాపించి యున్నది.

---

1. శాఖాసు కుపితో దోషః శోథం కృత్వా విసర్పవత్ భిత్త్వైవ తం క్షతే తత్ర సోష్మ్రమాంసం విశోష్య చ॥ కుర్యాత్తంతు నిభం సూత్రం తత్కృంతైన్నిష్క్రమం తైః శనైః శనైః క్షతాద్యాతి ఛేదాత్తత్కోపమావహేత్॥ తత్పాతాచ్ఛోథశాంతి స్స్యాత్పునః స్థానాంతరే భవేత్ వరిస్నాయుకమితి విఖ్యాతః క్రియోక్తాత్ర విసర్పవత్॥ బాహ్వోర్వాధి ప్రమాదేవ త్రుట్యతే జంఘయోరపిసంకోచం ఖంజతాం చాపిఛిన్నోస్నాయుః కరోత్యసౌ (భా. ప్ర. 57/1-4)

మనదేశంలో ముఖ్యంగా దిగుడు బావులలో నీరు తెచ్చుకొనే ప్రాంతాలలో ఇది అధికము. ముఖ్యంగా పాదాలకు నీటిలో మునిగి ఉన్నపుడు ఈ క్రిములు సంక్రమించటం జరుగుతుంది.

ఆ ప్రదేశంలో ఒక స్ఫోటము (Blaster) ఏర్పడటంతో వ్యాధిప్రారంభ మవుతుంది. శీతపిత్తము, హృల్లాసము, వమి, అతిసారము, శ్వాస, భ్రమ, సమ్మోహము వంటి లక్షణాలు స్ఫోటముతో పాటు కలుగుతాయి. ఈ కృమిని ధ్వంసము చేసినను కోసినను స్థానికముగ తీవ్ర లక్షణాలు ఏర్పడతాయి. తీవ్రవేదన శోథ, ప్రదాహము, ఇతర క్రిమి సంక్రమణ లక్షణాలు చర్మంపై కలుగుతాయి.

సంధిశోథ అవయవముల సంకోచము, స్తబ్ధత, కొందరిలో తీవ్రజ్వరము, భ్రమ, శ్వాస, మోహము ఈ లక్షణాలు కలుగుతాయి.

వ్యాధి నిర్ణయము-వ్యాధిత ప్రాంతాలలో ఆయా విశిష్ట లక్షణములవల్ల సులభముగానే వ్యాధి నిర్ణయము చేయవచ్చును. ఈ సినోఫిలియా, ఎక్స్ రే, ఏంటీజన్ టెస్టుల వల్ల వ్యాధి నిర్ణయము చేయవచ్చును.

ఉపద్రవాలు, సంధివాతము, అంగవైకల్యము ముఖ్యముగా జానుగుల్ఫ సంధి వక్రత స్తబ్ధతల వల్ల కలుగవచ్చును.

## స్నాయుక రోగ చికిత్స

వ్రణము ఏర్పడి పగలగనే తాడువంటి తెల్లని స్నాయుక క్రిమి కనుపించును. దానిని ఒక అగ్గిపుల్లకు చుట్టి చన్నీళ్ళుపోయుచు ఉన్నచో కృమి మెల్ల మెల్లగా బయటకు వచ్చుచుండును. అట్లు కృమిని మెల్లమెల్లగా బయటకు వచ్చునటుల చేసినచో వ్యాధి శమించును.

ఈ వ్యాధి విసర్పమువలె చికిత్సించవలెనని చెప్పబడినది. దోషానుసారము స్నేహ స్వేదములను లేపాది కర్మలను చేయవలయును.[1]

---

1. స్నేహస్వేద ప్రలేపాంశ్చ కర్మ కుర్యాద్యథోచితం
   గోఘృతం శీతతోయేన పీతం స్నాయుకరోగనుత్ (భై. ర. 57/5)

ఔషధములు :-

బాహ్య :-

1. బబ్బూల బీజ పిష్టలేపము.
2. భేకమును కాంజికముతో పక్వముచేసి స్వేదనమును చేయించవలె యును.
3. శిగ్రుమూలము దళములు సైంధవలవణము కాంజికముతో నూరిపోసిన స్నాయుక వ్రణము శమించును.
4. వాకుడు మూలమును నీటితో నూరి లేపనము చేసినను తంతువు బయటికి వచ్చి వ్రణము శమించును.

ఆభ్యంతర ఔషధములు :-

1. హింగు శీత జలముతో పానము చేయుట.
2. గోఘృతము మూడురోజులు పానము చేయించినను స్నాయుకము శమించును.
3. నిర్గుండీ స్వరసము మూడు రోజులు తాగిన తీవ్రమైన స్నాయుకము గూడా శమించును.
4. సుషవ్యా (సల్లజీలకర్ర) మూలము శీతజలముతో నూరి త్రాగినను శమించును.
5. అశ్వగంధ ఘృతము సేవించినను శమించును.
6. అతి విష, ముస్త భార్గీ, శొంఠి, పిప్పలి విభీతకి వీని చూర్ణము వేడి నీటితో సేవించిన స్నాయుకము శమించును.[1]
7. మల్లభస్మ 30 మి. గ్రా. ద్రాక్షపండులో పెట్టి మింగించవలెను-దీని సేవవచే వ్రణము, జ్వరము క్రమముగా శమించును.
8. శంఖభస్మము-క్రమము నిర్గమమైన తర్వాత 1-గ్రా ఉదయం సాయంత్రము నాలుగురోజులు యిచ్చినచో క్రిమిశేషము శమించును.[2]

---

1. భా. ప్ర. అ. 57
2. ర. తం. సార.

# ఉపదంశాది వ్యాధులు

**ఉపోద్ఘాతము :-**

ఉపదంశము ఒక స్వతంత్ర వ్యాధిగా సుశ్రుత సంహిత నిదానస్థానము 12వ అధ్యాయమున వర్ణింపబడినది. ప్రస్తుతము లైంగిక సంపర్క జన్య సాంక్రామిక వ్యాధులు (Sexually transmitted diseases)గా పరిగణింపబడుచున్న సాఫ్టుసోర్ Soft sore (Chancroid) సిఫిలిస్ (Syphilis) మొదలయిన వ్యాధులు ఉపదంశ వ్యాధియందు అంతర్భూతమగును.

చరక సంహిత చికిత్సాస్థానం 30వ అధ్యాయములో ధ్వజభంగ వర్ణనకు సుశ్రుతునిచే వర్ణింపబడిన ఉపదంశానికి కారణాలలో లక్షణాలలో చాలావరకు సామ్యత ఉన్నందున గంగాధరసేన్ తన జల్పకల్పతరు వ్యాఖ్యలో ఇదే ఉపదంశమని వివరించినందున చరకుడు ఉపదంశమని వర్ణించినందున ధ్వజభంగమే ఉపదంశముగా పరిగణింపవచ్చును.

భావమిశ్రుడు "ఫిరంగము" అనే వ్యాధిని ప్రాధాన్యంగా తన భావప్రకాశలో వర్ణించాడు. భావమిశ్రుడు ఉపదంశాన్ని గూడా విడిగా వర్ణించుట జరిగినది. అందుచేత భావమిశ్రుడు ఉపదంశము, ఫిరంగము వేరు వేరు వ్యాధులుగా భావించినట్లు ద్యోతకమవుతున్నది. భావమిశ్రుని ఫిరంగివ్యాధి వర్ణన సిఫిలిస్‌కు చాలా సన్నిహితంగా ఉండటం వలన ఫిరంగము సిఫిలిస్‌గా ఉపదంశము షాంక్రాయిడ్ లేక సాఫ్టుసోర్‌గా సన్నిహితంగా ఉండే వ్యాధులని భావింపబడుతున్నది.

చరక సుశ్రుతుల కాలములో బహుశా సిఫిలిస్ వ్యాధి ఉండి ఉండకపోవటమువలన వారు ధ్వజభంగము లేక ఉపదంశములోనే అన్ని రకములగు లైంగిక సంపర్క జన్య సాంక్రామిక వ్యాధులను అంతర్భూతముచేసి ఉంచవచ్చునని భావించవలసివస్తుంది.

ఇతర కారణములు : ఇతర వ్యాధులవలన కృశించటము, శుక్రమును నిగ్రహించుట, వేగములను అడ్డగించుట[1].

## సంప్రాప్తి :

పైన చెప్పబడిన కారణాలవలన వాతాది దోషములు ప్రకోపించి మేఢ్రమునాశ్రయించి క్షతముతోగాని క్షతములేక గాని శోథ (వాపును) కలిగించును.

---

2. i) తత్రాతి మైధునాదతిబ్రహ్మచర్యాద్వా తథాఽతిబ్రహ్మచారిణీం
చిరోత్సృష్టాం రజస్వలాం దీర్ఘరోమాం కర్కశరోమాం సంకీర్ణరోమాం
నిగూఢరోమామల్పద్వారాం మహాద్వారామప్రియామకామామచౌక్ష్య సలిల
ప్రక్షాళిత అప్రక్షాలితయోనిం యోనిరోగోపసృష్టాం స్వభావతో వా దుష్టయో
నిం వియోనిం వా నారీమత్యర్థముపసేవమానస్య తథా కరజ దశన విషశూ
కని పాతనాద్బంధనాద్ధస్తాభిఘాతాచ్చతుష్పదీగమనాదచౌక్ష్యసలిలప్రక్షాళనా
దవ పీడనాచ్ఛుక్రమూత్రవేగవిధారణాత్సంక్షాలనాంతేవాఽప్రక్షాలనాదిభిర్మేఢ్ర
మాగమ్య ప్రకుపితా దోషాః క్షతేఽక్షతే వా శ్వయథుముపజనయంతి
తముపదంశమిత్యాచక్షతే (సు.ని. 12/19)

ii) అత్యమ్ల లవణక్షార విరుద్ధాఽసాత్మ్యభోజనాత్ అత్యంబుపానాద్విషమాత్
పిష్టాన్నగుడభోజనాత్ దధిక్షీరానూపమాంససేవనాత్ వ్యాధికర్శనాత్
కన్యాంచైవ గమనాత్ అయోనిగమనాదపి దీర్ఘరోమాం చిరోత్సృష్టాం
తథైవ చ రజస్వలాం దుర్గంధాం దుష్టయోనిం చ తథైవ చ పరిస్రుతామ్
ఈదృశీం ప్రమదాం మోహాత్ యోగచ్ఛేత్ కామహర్షితః చతుష్పదా
ఽభిగమానాత్ శేఫసశ్చాఽభిఘాతతః ధావనాద్వా మేఢ్రస్య శస్త్రదన్తనఖ
క్షతాత్ కాష్ఠప్రహారవిక్షేపాత్ శూకానాం చాఽతిసేవనాత్ రేతసశ్చ
ప్రతిఘాతాత్ ప్రవర్తతే (చ.చి. 30 అ.)

iii) హస్తాభిఘాతాన్నఖదన్తపాతా దధావనాదత్యుపసేవనాద్వా
యోనిదోషాచ్చ భవన్తి శిశ్నే పంచోపదంశా వివిధోపచారైః

దీనినే ఉపదంశమందురు. స్త్రీలకు కూడా తత్తుల్యమైన కారణములచే యోనియందు వాపును కలిగించును.[1]

లక్షణములు :

కొందరికి మేఢ్రసంధియందు వ్రణమేర్పడును. కొందరికి మేఢ్రమంతటను వ్రణములు కలుగవచ్చును. ఈ వ్రణములు కలుత్థాకారముతో కొందరికిని, ముద్గములవలె కొందరికి కలుగును.

వేదన, దాహము, తృష్ణ, మోహము ఈ లక్షణములతో గూడియుండును. కొందరిలో ... శీఘ్రముగాను కొందరిలోను మెల్లగాను వ్యాపించును.[2]

ఉపదంశము ఐదు విధములుగా నుండును. అవి.

1. వాతజ ఉపదంశము, 2. పిత్తజ ఉపదంశము,

3. శ్లేష్మజ ఉపదంశము 4. రక్తజ ఉపదంశము

5. సన్నిపాతజ ఉపదంశము.[3]

---

1. i) నాధిళీ...మేఢ్రమాగమ్య ప్రకుపితా దోషాః క్షతేఽక్షతేవాశ్చయధుముప జనయంతి తముపదంశమిత్యాచక్షతే (సు.ని. 12/10)

ii) స్త్రీణాం చ పుంసాం జాయన్తే ఉపదంశాః సుదారుణాః (తంత్రాంతర వ్యాఖ్య)

2. మేఢ్ర సంధౌ వ్రణాః కేచిత్ కేచిత్ సర్వాశ్రయాః స్మృతాఃకులుత్థా కృతయః కేచిత్ కేచిన్ముద్గలోపమాః రుజాదాహపరీతశ్చ తృష్ణా మోహస మన్వితః శీఘ్రంకేచిద్విసర్పన్తి శనైః కేచిత్తధా పరేస్త్రీణాం పుంసాం చ జాయన్తే ఉపదంశాః సుదారుణః (సు.ని. 12)

3. సపంచ విధస్త్రిభిర్దోషైః పృథక్ సమస్తైరసృజా చ (సు.ని. 12/11

శేష లక్షణములు :

వాతజ ఉపదంశము : మేఢ్రమున పారుష్యము, శోథ (వాపు), అధిక వేదన, కృష్ణవర్ణము లేక అరుణవర్ణము, మేఢ్రస్తబ్ధత, చర్మము పగులుట, అదుట ఈ లక్షణములును ఇతర వాతవేదనములును గలుగును.[1]

పిత్తజ ఉపదంశము : జ్వరము తీవ్ర స్ఫోటనము (బొబ్బలెక్కుట), పండిన మేడిపండు వంటివాపు, తీవ్రదాహము, క్షిప్రపాకము, తడి,పుంట, పచ్చటి బొబ్బలు ఈ లక్షణములు పిత్తజ ఉపదంశమున గలుగును.[2]

శ్లేష్మజ ఉపదంశము : శిశ్నముపై మాంస వృద్ధి, వెంటనే వ్రణము ఏర్పడుట, పులోకోదకము వంటి శ్యావ, అరుణ స్రావము, లింగము ముడుచుకొనిపోవుట, గట్టిపడుట, చల్లగా, స్నిగ్ధముగానుండుట అధికవాపు, దురద, ఈ లక్షణములు శ్లేష్మజ ఉపదంశమున కలుగును.[3]

---

1. i) తత్ర వాతికే పారుష్యం త్వక్పరిపృటనం స్తబ్ధమేఢ్రతా పరుషశోఫతా వివిధాశ్చ వాతవేదనాః (సు.ని. 12/12)
   ii) శ్వయథుర్వేదనా మేఢ్రే రాగశ్చైవోపలక్ష్యతే (చ.చి. 30 అ.)
   iii) మా.ని.47/1
2. i) పైత్తికే జ్వరః శ్వయథుః పక్వోదుమ్బర సంకాశస్తీవ్రదాహః క్షిప్రపాకః పిత్తవేదనాశ్చ (సు.ని. 12/12)
   ii) పీతైర్బహుక్లేదయుతైస్సదాహైః పిత్తేన (మా.ని. 47/2)
   iii) స్ఫోటాశ్చ తీవ్రాః జాయన్తే లింగపాకో భవత్యపి (చ.చి. 30 అ.)
3. i) శ్లైష్మికే శ్వయథుః కండూమాన్ కఠినః స్నిగ్ధః శ్లేష్మవేదనాశ్చ (సు.ని. 12/12)
   ii) మాంసవృద్ధిర్భవేచ్చాస్య వ్రణాః క్షిప్రం భవన్త్యపి పులాకోదకసంకాశః స్రావః శ్యావారుణప్రభః వలయీకురుతేచాపి కఠినశ్చ పరిగ్రహః (చ.చి. 30 అ.)
   iii) సకణ్డురై శ్శోథయుతైర్మహద్భిః శుక్లైర్ఘనైస్స్రావయుతైః కఫేన (మా.ని. 47/3)

రక్తజ ఉపదంశము :

శిశ్న వ్రణములలోనుండి రక్త, కృష్ణ, నీల, లోహిత స్రావములు నల్లని బొబ్బలు, అధిక రక్త స్రావము, జ్వరము, తృష్ణ, ఛర్ది, దాహము ఈ లక్షణములు రక్తజ ఉపదంశమునందు కల్గును.[1]

సన్నిపాతజ ఉపదంశము :

ఒకొక్కొక్క పర్యాయము శిశ్నము నుండి పిచ్ఛిల పాండు వర్ణస్రావము కలుగును. ఒకొక్కొక్కప్పుడు అల్ప స్రావముతో గూడిన లింగశోథ శైత్యత ఉండును. ఒకొక్కొక్కప్పుడు ఆలస్యముగను, ఒక్కప్పుడు త్వరితముగను పక్వమునకు వచ్చును. పాకానంతరము క్రిములుత్పన్న మగును. క్లేదయుక్తముగా పూతి గంధముతో గూడియుండును. పుంస్త్వ, మేఢ్రము, వృషణములు నిర్వీర్యము లగును. నిప్పువే కాల్చినట్లు తీవ్ర వేదనతో గూడిన మంట మేఢ్రము వస్తి, వృషణములు సివని, వంక్షణములందు కలుగును [2]

---

1. i) రక్తజే కృష్ణాస్ఫోట ప్రాదుర్భావోఽత్యర్థమసృక్ప్రవృత్తిః పిత్తలింగాన్యత్యర్థం జ్వరదాహౌ శోషశ్చ యాప్యశ్చైవ కదాచిత్ (సు.ని. 12/12)
   ii) జ్వరస్తృష్ణా భ్రమో మూర్ఛాఛర్దిశ్చాప్యుపజాయతే రక్తం కృష్ణం స్రవేచ్చాపి నీలమావిలలోహితం (చ.చి. 30 అ.)
   iii) రక్తాత్మకం పిత్తసమానలింగమ్ (మా.ని. 47/3)
2. i) సర్వజే సర్వలింగదర్శనమవదరణం చ శేఫసః కృమిప్రాదుర్భావో మరణంచేతి (సు.ని. 12/12)
   ii) అగ్నినేవ చ దగ్ధస్య తీవ్రో దాహస్సవేదనః వస్తౌవృషణయోర్వాపి సీవన్యాం వంక్షణేషు చ కదాచిత్ పిచ్ఛిలో వాపిపాండుస్రావశ్చ జాయతే శ్వయథుర్జాయతే మందమస్తిమితోఽల్పపరిస్రవః చిరాచ్చ పాకం వ్రజతి

(Contd...

సాధ్యా సాధ్యత :

రక్తజము, యాప్యము సన్నిపాతజము మరణకారకము. మేఢ్రమునందలి మాంసము విశీర్ణమై ఖండ ఖండములుగానున్నను క్రిములచే భక్షించబడి వృషణములు మాత్రము మిగిలి యున్నను వర్జనీయము.

చికిత్స వెంటనే చేయించు కొనక సంభోగాసక్తుడై ఉన్నచో వాపు, క్రిములు, మంట కలిగి పక్వము చెంది విశీర్ణమై మరణము గలుగును.

ఉపదంశము ఆధునిక వైద్య శాస్త్రమందలి షాంగ్ క్రాయిడ్ (Chancroid) వ్యాధికి తుల్యముగా నున్నందున దాని లక్షణములు సంక్షిప్తముగా ఇవ్వబడినవి.

## షాంగ్ క్రాయిడ్ (Chancroid)

ఉష్ణ వాతావరణంలో కలుగు సంభోగంద్వారా సంక్రమించే వ్యాధులలో ఇది ఒకటి. బాసిలస్ డూక్రి అనబడు సూక్ష్మక్రిమిచే యిది కలుగును.

వ్యాధి కలిగిన వారితో సంభోగము క్షతము ఇత్యాదులు సహాయక కారణాలుగా ఉంటాయి. వ్యాధి సంచయ కాలము మూడు నుండి ఐదు రోజుల వరకు ఉండును.

సామాన్య లక్షణములు :

1. 3-5 రోజుల తరువాత ఎర్రని నొప్పితో కూడిన బొబ్బ (papule) జననేంద్రియములపై ఏర్పడుతుంది.

---

శీఘ్రంచాఽథ ప్రముచ్యతే జాయంతే క్రిమయశ్చాపి క్లిద్యతే పూతిగన్ధి చ
విశీర్యతే మణిశ్చాస్య మేఢ్రం ముష్కావథాపి చ (చ.చి. 30 అ.)

iii) నానావిధస్రావరుకోపపన్న మసాధ్యమాహు స్త్రిమలోపదంశమ్
(మా.ని. 47/4)

2. ఇది పగిలాక పుండు పడుతుంది. దాని అంచులు చక్కగా కోసినట్లుంటాయి. మృదువుగా ఉంటుంది. గాఢమైన పీత రక్తస్రావ మొస్తుంది. అది ఎక్కడ తగిలితే అక్కడ వ్రణమేర్పడుతుంది.

3. ఈ వ్రణములు జననేంద్రియాలపై మాత్రమే ఏర్పడుతాయి. పురుషులకు శిశ్నమణి పై గల త్వచా బాహ్య భాగంలో, సీవనీ పైన వ్రణము, స్త్రీలకు భగశిశ్నము (clitoris) లఘు భగోష్ట (Labiaminora)లపై ఏర్పడుతుంది.

4. ఈ స్రావము తగలటంవల్ల సమీపాంగ భాగలల్లో కూడా వ్రణములేర్పడవచ్చు. అనేకచిన్న వ్రణాలు కలసి పెద్ద వ్రణంగా మారవచ్చు.

5. వంక్షణ గ్రంధిశోధ - వ్రణమున్న వైపు వంక్షణ గ్రంధులు వాస్తాయి. వీనిలో స్పర్శ సహ్యత(Tenderness) పాకము (Suppuretion) ఉంటాయి.

6. వ్రణ సమీపభాగం ఎఱ్రబడుతుంది.

7. తగిన చికిత్సతో 10-20 రోజులలో పూర్తి శమనం కలుగుతుంది.

## ఉపదంశ చికిత్స

**సామాన్య చికిత్స :**

సాధ్యస్థితిలో ఉన్న ఉపదంశములందు రోగికి బాగుగా స్నేహ స్వేదములు చేయించి శిశ్నమునకు మధ్యగానుండు సిరను వ్యధించి రక్తమోక్షణము చేయింపవలెను. లేక జలౌకా ప్రయోగముచే రక్తమోక్షణము చేయింపవలెను.[1]

1. ఉపదంశేషు సాధ్యేషు స్నిగ్ధస్విన్నస్య దేహినః సిరాం విధ్యేన్మేఢ్రమధ్యే పాతయేద్వా జలౌకసః (సు.చి. 19/25)

రక్తమోక్షణముచే దోషము నిర్హరణమై వేదన శోథ వెంటనే శమించును. కాని ఉపదంశమున పాకము జరుగకుండగ తగిన జాగ్రత్తలు తీసికొన వలయును.[1]

ఉపదంశమున పాకము జరిగినచో సిరలు, స్నాయువులు, చర్మము, మాంసము ఇవి విదగ్ధమై శిశ్నము క్షీణించి పోవును. అట్టి స్థితిలో శీఘ్రముగా శస్త్రచికిత్స చేయవలసి యుండును.[2]

శోధన చికిత్స :

అత్యర్థముగా దుష్టి చెందియున్న దోషములందు వమన విరేచ నాదుల ద్వారా శోధనములు చేయించి దోషనిర్హరణము చేయవలెను. ఈ విధముగా శోధ నములు చేయుటచే శోధ వేదనాదులు శమించును.[3]

స్నేహపానము చేయించి స్నేహయుక్త విరేచనములచే ఉపచరింపవలెను.

రోగి దుర్బలుడుగా నుండినను, విరేచనమున కనర్హుడుగా నుండినను అధిక దోషములు కలిగియున్నపుడు నిరూహ వస్తిద్వారా దోష నిర్హరణ చేయింప వలెను.

---

1. సద్యోనిర్హృతదోషస్య రుక్శోథావుపశామ్యతః పాకో రక్ష్యః ప్రయత్నేన శిశ్నక్షయ కరో హి సః (చ.ద. 47/2)

2. నాయాతి చ యథా పాకం ప్రయతేత తథా భిషక్
విదగ్ధేస్తు సిరాస్నాయుత్వఙ్మాంసైః క్షీయతే ధ్వజః శస్త్రేణోపచరేచ్చాపి పాకమాగతమాశుపై (సు.చి. 19/37-38)

3. హరేదుభయతశ్చాపి దోషానత్యర్థముచ్ఛ్రితాన్
సద్యోఽపహృతదోషస్య రుక్శోథావుపశామ్యతః (సు.చి. 19/26)

ధ్వజభంగమునందు ఆస్థాపన వస్తి కర్మను గూడా చరకుడు నిర్దేశించెను.[1]

**ఇతర బాహ్య చికిత్సలు :**

సంశోధనము ఆలేపనము, సేకము, ప్రదేహము, ధూపములు, ప్రక్షాళనములు రోపణక్రియలు మొదలగు వ్రణోక్త చికిత్సలచే ఉపచరింపవలెను.[2]

**పాకావస్థ చికిత్స :**

పాకమును పొందినపుడు శస్త్రముచే పూయాదులను స్రవింపచేసి మధు మిశ్రిత తిలకల్కమును లేపనము చేయవలెను.

కరవీర పత్రములు, జాతీ, అరగ్వధ, వైజయింతి, అర్క-వీని పత్రముల క్వాథముతో వ్రణప్రక్షాళన చేయింపవలెను. జమ్బ్వాది తైలము మొదలగువానిని ప్రయోగించి రోపణము చేయింప వలెను.

---

1. i) యదా వా దుర్బలో జన్తుర్న వా ప్రాప్తం విరేచనమ్
నిరూహేణ హరేత్తస్య దోషానత్యర్థముచ్ఛ్రితాన్ (సు.చి. 19/27)

ii) చ. చి. 30/200-201

2. i) ఏవం సంశోధనాలేపసేక శోణితమోక్షణైః ప్రతికుర్యాత్క్రియాయోగైః
ప్రాక్స్థానోక్తైర్హితైరపి (సు.చి. 19/36)

ii) ధ్వజభంగకృతం క్లైబ్యం జ్ఞాత్వా తస్యాఽఽచరేత్ క్రియాం ప్రదేహాన్
పరిషేకాంశ్చ కుర్యాద్వా రక్తమోక్షణం స్నేహపానం చ కుర్వీత సస్నే
హం చ విరేచనమ్ అనువాసం తతః కుర్యాత్ అథవాఽఽస్థాపనం పునః
వ్రణవచ్చ క్రియాస్సర్వాః తతః కుర్యాద్విచక్షణః

(చ.చి. 30/199-201)

**ఉపదంశమునందు పథ్యాఽపథ్యములు :**

**పథ్యములు :**

యవ, శాలి, ముద్గ, శోభాంజనము, పటోలము, కారవేల్లకము, శాలించ శాకము, నవీన మూలకము, ఘృతము, తిలతైలము, మధు, కూపజలము, తిక్త కషాయరస పదార్థములు, జాంగల పశు పక్షులయొక్క మాంసములు యివి పథ్యములుగా నుండును.

**అపథ్యములు :**

పగటినిద్ర, మూత్ర వేగమును నిగ్రహించుట, వ్యవాయము, అధిక శ్రమ వీటిని ఉపదంశమున వర్జింపవలెను.

గురువుగ నుండు ఆహార పదార్థములు, గుడము, అమ్ల పదార్థములు, తక్రము వీనిని ఉపదంశ రోగి వర్జింపవలెను.[1]

**ఉపదంశమున ఆభ్యంతరౌషధములు :**

పటోలాది క్వాథము (చ. ద) పటోల పత్రము, నింబత్వక్, త్రిఫల, గుడూచి, వీని క్వాథముగాని లేక ఖదిరాది క్వాథము (చ. ద) ఖదిరత్వక్, విజయసార క్వాథమునుగాని గుగ్గులు లేక త్రిఫలాది చూర్ణము కలిపి సేవింప చేసిన అన్ని విధములగు ఉపదంశములు శమించును.

**స్వర్ణక్షీరీ - మూలత్వక్ 1 గ్రా. పాలతో సేవింపచేసిన ఉపదంశము శమించును.**

బృహద్ మంజిష్ఠాది క్వాథము 30 మి. లీ సేవించు చుండిన ఉపదంశము నందు హితకరముగా నుండును.

---

1. i) భై. ర. 52/89-91
   ii) భా. ప్ర. ఉపదంశాధికార

చోపచిన్యాధి చూర్ణము (యో. ర) 3 గ్రా తేనె, నెయ్యితో సేవించిన ఉప దంశము ఫిరంగము శమించును.

ఘృతములు :

కుష్ఠమునందు, నాడీ వ్రణచికిత్సయందు, వ్రణ చికిత్సయందును వివరింప బడిన ఘృతములను అవస్థాను సారము, సేక, అభ్యంగపాన భోజనాదులందు ఉపయోగింపవలెను.[1]

భూనింబాది ఘృతము (చ. ద) అన్ని ఉపదంశములను శమింపచేయును.

కరంజాది ఘృతము (చ. ద) పాన అభ్యంగములచే దాహము, పాకము, పూయస్రావము, రాగము వీనితో కూడిన ఉపదంశము శమించును.

ఆగార ధూమాది ఘృతము (చ.ద) బాహ్య ప్రయోగముచే కండు, శోథ, వేదన శమించి వ్రణము శోధింపబడి రోపణము చెందును.

అనంతాదిఘృతము (భై.ర) పంచారవింద ఘృతము (భై.ర) వీనిని పానము చేయింపవచ్చును.

ఇతర ఔషధములు :

శారిబాది లేహ్యము (భై.ర) 5-10 గ్రా పాలతో

మధుస్నుహీ రసాయనము (భై.ర) 5 గ్రా పాలతో

వీనిని సేవింపచేసిన, రక్త దోషజనిత సమస్త వ్యాధులు ఫిరంగము, ఉపదంశము ఇవియును శమించును.

---

1. ఘృతాని యాని వక్ష్యామ కుష్ఠే నాడీవ్రణేవ్రణే
ఉపదంశే ప్రయోజ్యాని సేకాభ్యంజన భోజనైః (భా.ప్ర, 889)

రసగుగ్గులు (భై.ర) విధ్యను సారము సేవించిన ఉపదంశములు వ్రణ ములు శమించును.

వరాదిగుగ్గులు (భా. ప్ర) 1 గ్రా. ఉపదంశ, రక్తదోష, వ్రణశామకము.

భైరవరసము (భై.ర) గాని లేక రసశేఖర రసము గాని విధ్యనుసారము సేవించిన ఉపదంశములు శమించును.

ఉపదంశ ఫిరంగాదులలో ప్రయోగింపబడు సామాన్యౌషధముల వర్ణన ఫిరంగ వివరణానంతరము ఇవ్వబడినది.

బాహ్య ప్రయోగములు :

ప్రక్షాళనకై ప్రయోగింపదగు యోగములు.

కరవీరాది పత్రికాక్వాథము గాని, జంబ్వాదికాక్వాథము గాని (సు.చి. 19/అ) నింబార్జునాదికాక్వాథము (యో.ర) ఉపదంశవ్రణములందు ప్రక్షాళనార్థము ప్రయోగింప వలెను.

లేపములు :

విషతిందుకాది లేపము (భై.ర) లేపమును అనగా అనగా మూడు మారులు లేపనము చేయవలెను. అన్ని విధములగు ఉపదంశజ వ్రణములను శమింప చేయును.

సౌరాష్ట్ర్యాది లేపము, స్వర్జకాది లేపము, గుండ్రాది లేపము లేక మార్కవాది లేపము—వీని ప్రయోగము ఉపదంశము వలన జనించిన వ్రణములను శమింపచేయును. (సుశ్రుత చికిత్స 19 ?)

వట ప్రరోహాది లేపము, రసాంజనాది లేపము, భారంగ్యాది లేపము. వీనిని ఆవశ్యకతానుసారము ప్రయోగింపదగును (భా. ప్ర) త్రిఫలాభస్మాది లేపము, పూగఫలాది లేపము ఉపదంశ వ్రణ శామకముగా నుండును. (భై.ర)

తైలములు- రోపణార్థము :

జమ్బ్వాది తైలము (సు.చి)అగార ధూమాది తైలము (భా.ప్ర) గోజిహ్వాది తైలము (భా.ప్ర) కోషాతకీ తైలము (భా.ప్ర)ఇవి ఉపదంశ వ్రణములను, దుష్ట వ్రణములను లేప అభ్యంగాదుల వలన శమింపచేయును.

**ఉపదంశము లందు విశేష చికిత్సలు :**

వాతజ ఉపదంశము :

వాతజ ఉపదంశమున ప్రపౌండరీకాది ప్రలేపమును సుఖోష్ణముగా ప్రయోగింప వలెను. లేక నిచుళాది లేపమునైనను, సుఖోష్ణముగా పూయవలెను. ప్రపౌండరీకాదిద్రవ్యముల క్వాథముతో సుఖోష్ణముగా పరిషేకము చేయింప వలెను.[1]

పిత్తజ ఉపదంశము :

ఘృతము, క్షీరము, శర్కరిక ఇక్షు మధూధికాదులతో గాని లేక వటాది సుశీతక్వాథముతోగాని సేవనము చేయింపవలెను. గైరికాది లేపనము గాని పద్మోత్పలాది లేపనముతో గాని ఉపచరింపవలెను.[2]

కఫజ ఉపదంశము :

సురసాది గణ క్వాథముతోగాని అరగ్వధాది గణ క్వాథముతోగాని పరిషేకము చేయింపవలెను. సాలాశ్వకర్ణాది లేపమును గాని రజన్యాది లేపనమును గానే ప్రయోగింప వలెను.[3]

---

1. సు. చి. 19/28-29
2. సు. చి. 19/30-32
3. సు. చి. 19/33-35

త్రిదోషజ ఉపదంశము :

అసాధ్యముగా చెప్పబడినప్పటికిని దుష్ట వ్రణ చికిత్సా విధానమున చెప్ప బడినట్లు పచరించుచు మేఢ్రము నందు ఎంత భాగము దూషింపబడి కుళ్ళినదో ఆ భాగమును ఖండించి జాంబ్వోష్ఠ శలాకతో వెంటనే దాహకర్మ చేయవలెను.

బాగుగా దహింపబడుటను గమనించి మధుసర్పి కలిపి లేపనము చేయ వలెను.

మిగిలిన భాగమున దోషములు నశించి శుద్ధ మగుటను గమనించి కల్కము తోను తైలముతోను రోపణక్రియలు చేసినచో మిగిలిన అంగము రక్షింపబడి బాధ శమింపవచ్చును.[1]

రక్తజ, సన్నిపాతజ ఉపదంశములందు అసాధ్యములుగా పరిగణింపబడి నప్పటికి దోషముల బలాబలములను గమనించి ఉపదంశోక్త చికిత్సలను ప్రయో గింప వలెను. ప్రత్యాఖ్యేయములుగ చెప్పి చికిత్సింప వలెను.[2]

---

1. ఉపదంశే విశేషేణ శృణు భూయస్త్రిదోషజే
   దుష్టవ్రణ విధిం కుర్యాత్కుథితం మేహనం త్యజేత్
   జంబ్వోష్ఠేనాగ్ని వర్ణేన పశ్చాచ్ఛేషం దహేద్భిషక్
   సమ్యగ్దగ్ధంచ విజ్ఞాయ మధుసర్పిః ప్రయోజయేత్
   శుద్ధే చ రోపణం దద్యాత్కల్కం తైలం హితం చ యత్

   (సు. చి. 19/50-57)

2. ఉపదంశద్వయే ప్యేతాం ప్రత్యాఖ్యాయాచరేత్క్రియామ్
   తయారేవ చయా యోగ్యా వీక్ష్య దోషబలాబలం (సు. చి. 19/46)

# ఫిరంగము

ఫిరంగ వ్యాధి భావమిశ్రుని చేత ప్రథమంగ తన భావప్రకాశంలో వర్ణించబడినది. ఫిరంగము అను మాట ఫ్రెంచి దేశమునకు భావమిశ్రుని ప్రయోగింపబడినది. ఫిరంగ (French) దేశంలో ఎక్కువగా ఉండే వ్యా కావడం వలన, ఫిరంగ దేశముల అంగ సంపర్కము వలన దీనికి ఫిరంగ వ్యా అని పేరు.[1] ఈ వ్యాధి వర్ణన సిఫిలిస్‌తో చాలావరకు పోలియున్నది. ఆధునిక కూడా Syphilis ను ఫ్రెంచి పాక్స్ (French Pox) అను పేరుతో వ్యవహ స్తారు. దీనికి గంధరోగము అను పర్యాయము కూడా కలదు.[2]

నిదానము : ఈ వ్యాధి కలవారి ద్వారా ఇతరులకు అంగసంపర్కమువలన సంభోగం వలన సంక్రమిస్తుంది. ఇది ఆగంతుకము. దోషముల లక్షణము తదనంతరము కలుగుతాయి. భావమిశ్రుడు దీనికి సంప్రాప్తి, పూర్వరూపములు, సామాన్య లక్షణములు వర్ణించక భేదములు, భేదానుసార లక్షణములు మాత్రమే వర్ణించెను.

భేదములు : ఫిరంగ వ్యాధి మూడు విధములుండును. అవి.

1. బాహ్యము.
2. అభ్యంతరము
3. బాహ్యాభ్యంతరము[3]

---

1. ఫిరంగ సంజ్ఞే దేశే బాహుల్యేనైవ యద్భవేత్
తస్మాత్ఫిరంగ ఇత్యుక్తో వ్యాధిర్వ్యాధి విశారదైః — భా. ప్ర.
2. గంధరోగ ఫిరంగోఽయం జాయతే దేహినాంధ్రువమ్
ఫిరంగిణ్యాంగ సంసర్గాత్ఫిరంగిణాః ప్రసంగతః
వ్యాధిరాగంతజో హ్యేష దోషాణా మత్రసంక్రమణ
3. ఫిరంగస్త్రివిధో జ్ఞేయో బాహ్యాభ్యంతర [illegible]
బహిరంత [illegible]

భేదానుసార లక్షణములు : బాహ్య ఫిరంగము—విస్ఫోటము నందు వలె బొబ్బలు కలుగును. నొప్పి తక్కువగా యుండును. పగిలినపుడు మామూలు వ్రణము వలె చికిత్సించిన సులభముగా శమించును.

అభ్యంతర ఫిరంగము : సంధిగతమై ఆమవాతము వలె వేదనతో గూడిన వాపు గలుగును ఇది కష్ట సాధ్యము.

బాహ్యాభ్యంతరజము : పైన చెప్పబడిన రెండు విధములైన ఫిరంగ లక్షణములతో కూడియుండును.[1]

## ఫిరంగ ఉపద్రవములు

కార్శ్యము, బలక్షయము, నాసాభంగము, అగ్ని మాంద్యము, అస్థిశోష, అస్థి వక్రత్వము—ఇవి ఫిరంగ ఉపద్రవములుగా నుండును.[2]

## ఫిరంగ సాధ్యాఽసాధ్యత

బాహ్య ఫిరంగ రోగము నూతనముగా నుండి ఉపద్రవములు లేకుండా యున్నచో సాధ్యముగా నుండును.

ఆభ్యంతర ఫిరంగ రోగము కృచ్ఛ్ర సాధ్యమును పొందినను, క్షీణించిన వానికి ఉపద్రవములతో కూడి శరీరమంతయు వ్యాపించినను అసాధ్యముగా నుండును.[3]

---

1. తత్ర బాహ్యః ఫిరంగ స్స్యాద్విస్ఫోట సదృశోఽల్పరుక్
స్ఫుటితో వ్రణవ ద్వైద్యైః సౌఖసాధ్యో ఇతిసన్మతః

2. కార్శ్యం బలక్షయోనాసాభంగో వహ్నేశ్చ మందతా అస్థి శోషోఽస్థివ
క్రత్వం ఫిరంగోపద్రవా అమీ (భా. ప్ర. ఉప)

3. బహిర్భవో భవేత్సాధ్యో నవీనో నిరుపద్రవః
అభ్యంతరస్తు కష్టేన సాధ్యస్స్యాదయమామయః
బహిరంతర్భవోఽజీర్ణో క్షీణస్యోపద్ర వైర్యుతః
వ్యాప్తో వ్యాధిరసాధ్యోఽయ మిత్యాహుమునయః పురా (భా. ప్ర. ఉప)

ఫిరంగ వ్యాధి ఆధునిక వైద్య మందలి సిఫిలిస్‌ను తుల్యముగా నుండును.

## సిఫిలిస్

ట్రెపోనిమా పాలిడమ్ అనబడు లేతరంగులో ఉండు కీటాణువు ఈ వ్యాధికి కారణము. ఈ కీటాణువు పొడవుగా దారము రంగులు చుట్టుకొన్నట్లు 2 నుండి 12 రంగులతో కూడి మొదలు చివర మాత్రము సూటిగా ఉంటుంది.

### వ్యాప్తి లేక సంక్రమణము

ప్రత్యక్షముగా—వ్యాధి కలవారినుండి మరొకరికి సంభోగము వలనగాని తల్లిదండ్రుల నుండి సంతానానికి గాని సాధారణంగా సంక్రమిస్తుంది. ప్రాథమిక ద్వితీయావస్థ వ్రణములతో ఆరోగ్యవంతుని గీరుకుపోయిన చర్మమునకు సంపర్కము జరిగినపుడు సంక్రమించే అవకాశంఉంది. పుట్టుకతో వ్యాధి కలిగిన శిశువులతో సంబంధము వీని వలన వ్యాధి ప్రత్యక్షముగా సంక్రమించును పరోక్షముగా వ్యాధి కలవారు వాడిన కప్పులు, ప్లేట్లు, స్పూన్లు, టవల్సు, రుమాలు మొ॥ వాటి ద్వారా కొద్దికాలం వ్యాపించే అవకాశం వుంది. తరువాత కీటాణువులు నశిస్తాయి.

వ్యాధి కలవారికి వాడిన సూదులు మొదలైనవాటితో టీకాలు వేయటం ద్వారా పరోక్షంగా వ్యాధి సంక్రమింపవచ్చు.

మొదటి రెండు దశలలోనే సంక్రామిక స్వభావమధికముగాను ఉంటుంది. 5 సం॥ దాటాకా సంక్రామికత చాల స్వల్పము.

వ్యాధ్యాంతర్గత కాలము : 10 నుంచి 90 రోజులు.

సామాజిక కారణములు :

వ్యభిచారము, మద్యపానము, బహు భార్యాత్వము, కుటుంబ నియంత్రణా పద్ధతులు, స్వంత వైద్యము, వలసలు, సిగ్గు, సరియైన చికిత్సాలోపము. ఇవి వ్యాధి వ్యాప్తికి సహకరిస్తాయి.

సిఫిలిస్ భేదములు : రెండు విధములు

1) పుట్టుకతో వచ్చినది 2) తరాత్వ సంక్రమించినది తర్వాత సంక్రమణకాలము సాధారణముగా 21 రోజులు కాని 10-90 రోజులుకూ దాఉంచ వచ్చును. దీనిని మూడు అవస్థలుగా విభజింపవచ్చు.

ప్రాథమికా వస్థ :

భావమిశ్రుడు చెప్పిన బాహ్య బేధముగా తలంపవచ్చు. దీనిలో స్థానిక లక్షణములు మాత్రమే ఉంటాయి. సాధారణంగా 3 వారాల తర్వాత శిశ్నంపై బొబ్బ ఏర్పడుతుంది. ఇది ప్రారంభంలో చక్కగా ఎత్తుగా బాధారహితంగా వుండి క్రమంగా పెద్దదై పగిలి పుండు పడి అది గట్టిగాను (Indurated), గుండ్రంగాను ఉండి స్వల్పస్రావముతో కూడి ఉంటుంది.

ఇది సాధారణంగా ఒకే పుండు ఉంటుంది. సంభోగంద్వారా సాధారణంగా సంక్రమించటం వలన వ్రణం మగవారిలో శిశ్నాగ్ర చర్మం లోపల (Prepuce) శిశ్నమణి పైన (Glans) ఆడవారిలో బృహుదృగోష్టములపై (Labio mgora vulva), గర్భాశయ కంఠభాగమున (Cervix) కలుగుతాయి.

ఒక్కొక్కసారి ఇతర స్థలాలలో గూడ వ్రణమేర్పడవచ్చు. ఉదా : పెదవి, వేలు.

ఒకటి రెండు వారాల తరువాత సమీపస్థ లసీకా గ్రంథులు గజ్జలలో ఇవి వాచి గట్టిగా తగులుతాయి.

అవి ఏమి పెద్ద మచ్చ మిగలకుండా గాని కొద్ది మచ్చతోకాని మాని పోతాయి.

ప్రథమావస్థలో లసీక పరీక్షద్వారా వాసర్‌మెన్ రియాక్షన్ పాజిటివ్ వస్తుంది.

ద్వితీయావస్థ :

వ్రణము కన్పించిన 3-6 వారముల తర్వాత (4-12 వారాల ప్రారంభం నుంచి) సార్వదేహిక లక్షణాలేర్పడతాయి.

1) దద్దురులు అనేక రకాలుగా ఉండేవి, ఏమాత్రం దురద లేనివి, ఇరు పార్శ్వములలో కన్పిస్తాయి. ఇవి 6 వారల్లో శమిస్తాయి కాని ఎర్రటి మచ్చలు ఉంటాయి.

2) నోటిపూత, మింగేటప్పుడు నొప్పి, గొంతు బొంగురు పోవుట.

3) శ్లేష్మకకలలపై వ్రణములు, నత్తగుల్లనడిచిన చిహ్నములాంటి వ్రణములు పెదవుల Tonsils గొంతులో ఏర్పడతాయి. ఇదే విధంగా పెదవుల సందులలో కూడా ఏర్పడతాయి.

4) లసీకా గ్రంథులు గట్టిగా వాపు కల్గిఉంటాయి. ఈ వాపు నెలల తరబడి వుంటుంది.

5) పులిపిరులు వంటివి (Condycomate) శ్లేష్మక కలపై ఏర్పడతాయి. వాటిలో జీవాణువులుంటాయి.

6) మందజ్వరము కాళ్ళు, చేతులు పీకడం.

7) బరువుతగ్గుట, అగ్నిమాంద్యము పాలు మాలిక.

8) రాత్రిపూట వేదనతో కూడిన సంధి శోధ, యకృత్, ప్లీహము, థైరాడ్‌ల వాపు, వెంట్రుకలు రాలిపోవుట గోళ్ళకుదుళ్ళవాపు.

ఇవన్నీ మరలమరల వస్తూ ఉండటం జరుగుతుంది.

జీర్ణావస్థ :

ద్వితీయ దశానంతరం చికిత్స చేయించుకొనని పెద్దవారిలో పరిణామాలిలా వుంటాయి,

1) 3వ వంతు వారికి లక్షణాలు వుండవు కాని వాసర్‌మాన్ రియాక్షన్ పాజిటివ్ వుంటుంది.

2) మరొక 3వ వంతువారిలో ఈ రియాక్షన్ చివరన నెగిటివ్ అవుతుంది.

3) ఆరవవంతు వారిలో (Te·itiary) లక్షణాలు కలిగి వెంటనే శమిస్తాయి.

4) ఆరవవంతువాడి శరీరమందలి అన్ని స్థానాలు దీని ప్రభావానికి లోనవుతాయి.

మొదటి 2 గ్రూపులను లీన ఫిరంగ మనవచ్చును. ఎవరికి ఇది లీనముగా పరిణమిస్తుందో ఎవరికి తీవ్ర ఉపద్రవాలను కలిగిస్తుందో చెప్పలేము. **Blood reaction negative** గా మారే వారిలో ఉపద్రవాలు స్వల్పం.

వ్యాధి తీవ్రత, సంక్రమణ కాలము, మొదలైనవి పెక్కు యితర విషయాలపై ఆధారపడి ఉంటాయి. ఉదాహరణకు ముఖ్యముగా అలవాట్లు, వయస్సు; ఁదత (సత్త్వము), వృత్తి, ఉత్పన్న వ్యాధులు (క్షయ, వృక్కశోధ), ప్రాథమికా వస్థలో తగిన చికిత్స చేయిస్తే ఈ వ్యాధి అంతగా బాధింపదు.

నాడీమండలం వ్యాధులు అధికంగా బాధించే అవకాశముంది.

**తృతీయావస్థ :**

**తృతీయావస్థ లక్షణాలు కొన్ని నెలల తరువాత గాని సంవత్సరాల తరువాత గాని ఏర్పడుతాయి. ముఖ్యపరిణామాలు ఈ క్రింది విధంగా ఉంటాయి.**

చర్మంపై రకరకాలుగా దద్దురులు, పుండ్లు పడతాయి. తెల్లనిస్రావం కలుగుతుంది. పుండ్లు బాగాలోతుగా వుంటాయి. నీరు, గొంతులో శ్లేష్మికకలతో, చర్మము, యకృత్, ప్లీహము, కోష్ఠాంగాలు, హృదయం, పుప్పుసాలు మొ॥ మర్మస్థానాలు, ఎముకలు వీటిల్లో గ్రంధులు ఏర్పడతాయి (granule),

నాళావంశపు గ్రంధులవల్ల నాసాంభంగం, తాలుదారణం కలుగుతాయి. మస్తిష్కం సుషుమ్నాలలో గ్రంధులవలన పక్షవాతం, పంగుత్వం, కలుగుతాయి. నాడుల గమ్మాలవల్ల వినికిడి చూపు నశిస్తాయి. రక్తవాహినీ కుడ్యములు మందంకావటం వలన రక్తపోటు కలుగుతుంది.

హృదయాన్ని ఆశ్రయించినపుడు బృహద్ధమని వీనిలోలను రాజమ్స ఏర్పడవచ్చు. మెదడులో రక్తనాళాలువాచి అవరోధం ఏర్పడవచ్చు. నాడీ మండలాన్ని ఆశ్రయిస్తే 10-20 స॥ తరువాత (Takesdorsalis) (ఫిరంగీ ఖుంజత) G.P.I. (సర్వాంగఘాతయుక్త ఉన్మాద) లేక రెండుగాని రావచ్చు. సరిగా చికిత్స జరగని జీర్ణవ్యాధులలో (cachestia) దౌర్భల్యం ఓజోహాని కలిగి మరణం సంభవించవచ్చును.

రోగనిర్ణయం :

హంటేరియన్ కాంకర్ నుండి హెర్పెస్ జెనిటాలిస్‌నుంచి వేరుచేయవలసి వుంటుంది. ఇందులో గుల్లలు గుంపుగా ఉంటాయి. గజ్జితో పోలికవున్నప్పటికి గజ్జి కురుపులు శరీరంలో ఇతర భాగాలల్లో గూడా ఉంటాయి. ఉపదంశజ వ్రణం అలా ఉండదు. Soft sore లో నెప్పి ఎక్కువ. వ్రణంలోతుగా వుంటుంది. అంచులు మెత్తగా తక్కువ లోతులో ఉంటాయి. కీటాణువును మైక్రోస్కోపును ఉపయోగించి గుర్తించి తద్వార రోగాన్ని నిర్ధారించవచ్చును. వాసర్‌మాన్ కాన్ పరీక్షలు కూడా సహకరిస్తాయి.

ఇవి chan లా కన్పించిన పదిరోజుల తరువాత నుండి ద్వితీయావస్థ వరకు కన్పిస్తూనే ఉంటాయి. కాని అంతిమావస్థలో ఈ పరీక్షలు రోగ నిర్ధారణ కుపకరించకపోవచ్చు. C.S.F (మస్తిష్క ద్రవము) పరీక్షద్వారా మాత్రమే నాడీమండలాశ్రిత ఫిరంగము గుర్తింపగలరు. ఫిరంగజనిత ఉపదంశజనిత వ్రణ భేదకలింగములు క్రింద ఇవ్వబడినవి.

| ఫిరంగజ (Syphilis) | ఉపదంశజ (Chancroid) |
| --- | --- |
| 1. మైథునానంతరం వ్రణం 3వ వారంలో ఏర్పడుతుంది. | 3, 4వ రోజుల్లో ఏర్పడుతుంది. |
| 2. ఒక్కటే వ్రణమేర్పడుతుంది. | అనేక వ్రణాలు ఉంటాయి. |
| 3. వ్రణములు కఠినముగా ఉండును. | మృదువుగా ఉండును. |
| 4. లసీకా, స్రావం, దాహం ఉంటాయి. | దాహముంటుంది రక్తపూయస్రావము ఉండును. |
| 5. ఉబ్బెత్తుగా గాని ఖచ్చితంగ గాని ఉండవు. | వ్రణం ఉబెత్తుగా స్పష్టంగా ఉంటుంది. |
| 6. బాధ ఉండదు | వేదనాధిక్యత ఉండును. |

## ఫిరంగ చికిత్స

రస కర్పూరము (భా. ప్ర.):

ఊర్ధ్వపాతన విధితో తయారుచేసిన రస కర్పూరము 30 మి.గ్రా. గోధుమ పిండితో పొదిగి లవంగచూర్ణముతో పొర్లించి దంతములకు తగలకుండా మింగాలి. తదుపరి తాంబూలము సేవించవలెను. దీనిని సేవించునపుడు లవణ అమ్ల పదార్థములు పత్రశాకములు, శ్రమ, ఆతపసేవన మార్గగమనము సంభోగము మొదలగు వీనిని వర్జింపవలెను.

రసకర్పూరాదివటి, తుత్థాదివటి, మొదలగు రస కర్పూరయుక్త యోగము లను గూడా ఆవశ్యకతానుసారము ప్రయోగింపవలెను.

ప్రాథమికావస్థలో ఈ రస కర్పూర యోగాలు మంచి గుణమిచ్చును.

వీనిని ఇచ్చునపుడు పైె చెప్పబడిన పథ్యాన్ని విధిగా పాటించాలి.

ఈ ఔషధములిచ్చునపుడు ముఖ్యంగా పారద భస్మం ఇచ్చునపుడు వమన విరేచనములైనప్పటికిని ఫరవాలేదు. దంతపూయము ఉన్నవారికి ఈ ఔషధము లివ్వరాదు. ఘృతము బాగా సేవించాలి. చపాతీరొట్టె, పెసరపప్పు వాడాలి. ఉప్పు కారము పులుపు వర్జించాలి.

**వ్యాధి హరణ రసము (ర.సా.సం.) :**

60 మి.గ్రా. 120 మి.గ్రా. తేనెతో నూతన జీర్ణ ఫిరంగములు, ఫిరంగ జనిత రక్త వికారములు, సంధివాతము, నష్టము నాసావ్రణము, నాడీ వ్రణము మొ॥నవి శమించును.

అమీర రసము (స. భే. మ) 60 మి.గ్రా.—120 మి.గ్రా.

ఉపదంశ జనిత రక్తమాంసాశ్రిత ఉపద్రవములు శీఘ్రముగా శమించును.

అష్టమూర్తి రసాయనము— 120 మి.గ్రా.

శ్రేష్టమైన జీర్ణ ఉపదంశ కాముకము, సిఫిలిస్ వలన కలుగు నాడీ సంస్థాన వికృతులు, మనో వికారములు, సంధి వికృతులందు మంచి గుణకారి.

త్రిపుర భైరవి రసము (ర.తం) 60—120 మి.గ్రా. నేతితో :

అన్ని అవస్థలలో ఉపయోగ్యము.

**కేసరాదివటి (ర. తం) ;**

జీర్ణ ఉపదంశజ వాత వ్యాధులు త్వగ్వికారములందుపయోగ్యము.

మల్లసింధూరము (ర.తం) : 30-60 మి.గ్రా. లేక మల్ల భస్మం 30-60 మి.గ్రా. మల్లాదివటి, లేక ఉపదంశ సూర్య—ఇవి ముఖ్యముగా జీర్ణావస్థలో బాగుగా పని చేయును.

**తాళక భస్మము (ర.తం.సార) :**

ప్రథమావస్థ తరువాత ధాతువులలో లీనమై త్వఙ్మాంసములను బాధించుచున్న పుడు ఫిరంగమునందు తాళకభస్మము శ్రేష్టమైనది.

రస కర్పూర మిశ్రితయోగములు నూతన ఉపదంశమునందున్న ప్రథమావస్థయందు, మంచి గుణకారులుగా నుండును.

ప్రథమావస్థ, ద్వితీయావస్థలలో త్రిపుర భైరవి రసము శ్రేష్ఠమైనది.

తృతీయావస్థలో మల్ల కల్పములు, అష్టమూర్తి రసాయన, మల్లసింధూరము మొదలగునవి ప్రయోగింపవలెను.

## శూక దోషము

'శూకము' అనగా లింగముయొక్క పరిణామమును వృద్ధిచేయు ఔషధము లని అర్థము.

అతి ప్రాచీన కాలమునుండియు శిశ్నమును వృద్ధి చెందింపవలెనను తలంపుతో కొన్ని ఔషధములను పైన మర్దించుట అను విధానము ఆచరణలో నున్నది.

వాత్స్యాయన కామసూత్రాది గ్రంథములందును వైద్య గ్రంథములందును లింగ వృద్ధి కరములగు యోగముల వర్ణన కన్పించును.

కొన్ని యోగములందు తీక్ష్ణమైన ద్రవ్యములు జలమునందు ఉత్పన్నమగు శూకము అనబడు విషపూరిత ప్రాణులు వీని సంయోగముండుటచేత ఈ యోగములకు శూకములను పేరు కలుగుట, వీటి అనుచితోపయోగము అనేక స్థానికమైన వ్రణ ప్రదాహాదులను లింగముపై కలిగించుటకు కారణమగుటచే ఈ వ్యాధులకు శూక దోషములను పేరు కలిగెను.

వాత్స్యాయనోక్త యోగము ఉదాహరణముగా క్రింద ఇవ్వబడినది—భల్లాతకము, జలశూకము, కమల పత్రములు, సైంధవ లవణము—వీనిని అంతర్ధూమభస్మముచేసి పక్వ బృహతీ ఫలరసముతో నూరి మహిషవిట్‌తో శుభ్రము చేసిన శిశ్నముపై లేపనము చేసిన శిశ్నము స్థూలముగను, పొడవుగను దృఢముగను అగును.[1]

---

1. మాధవనిదాన 43/1 పై మధుకోశ వ్యాఖ్య

శూక దోష భేదములు :

అనుచిత లింగవర్ధక యోగముల ప్రయోగముచే కలుగు వ్యాధులు పదు నెనిమిది విధములుగా పేర్కొనబడినవి.

అవి : 1. సర్షపిక, 2. అష్టీలిక 3. గ్రథితము 4. కుమ్భీకము 5. అలజీ 6. మృదితము 7. సమ్మూఢ పిడక 8. అవమన్థము 9. పుష్కరికము 10. స్పర్శాహాని 11. ఉత్తమా 12. శతపోనకము 13. త్వక్పాకము 14. శోణితార్బుదము 15. మాంసార్బుదము 16. మాంసపాకము 17. విద్రధి 18. తిలకాలకము.[1]

వాగ్భటుడు ఈ వ్యాధులను గుహ్య రోగములందు చేర్చెను. చరకుడు ప్రత్యేకముగా వర్ణింపక వీనిలో కొన్నింటిని అర్శ, ఉపదంశాది ప్రకరణములందు సూచించెను.

సర్షపికా లక్షణము :

మేఢ్రవృద్ధి చేయుటకు శూక సంబంధమైన ఔషధమును శాస్త్రవిరుద్ధముగా లేపనము చేయుటవలన కఫవాతములు ప్రకోపమునుపొంది శ్వేతవర్ణము కలిగిన సర్షపమువలె సన్నవిగాఉండు పిడకములను కలిగించును. అటువంటి దానిని సర్షపిక అను శూకదోషముగా తెలియవలెను.[2]

అష్టీలికా :-

అప్రశస్తములైన విషములైన శూకములతో కూడిన ఔషధములను

---

1. సు. ని. 14/3

2. గౌరసర్షపసంస్థానా శూకదుర్భగ్న హేతుకా
పిడకా శ్లేష్మవాతాభ్యాం జ్ఞేయా సర్షపికా తు సా (సు. ని. 14/4)

మేఢ్రమునకు పూయుటవలన వాతము ప్రకోపించి మిక్కిలి కఠినములైన కురుపులు కల్గించును. అట్టి దానిని అష్ఠీలికయను శూకదోషముగ చెప్పుదురు.

గ్రథిత లక్షణములు :

శూకములచే ఎల్లప్పుడు నిండివున్న ఎడల గ్రథితము అను శూకదోషమని తెలియవలెను. ఇది కఫ ప్రకోపముచే కలుగును.[1]

కుంభికా లక్షణము :

రక్త పిత్తములయొక్క ప్రకోపముచేత నేరేడు గింజలవలె వుండు కురుపులు కలిగినచో కుంభి అను శూకదోషమని తెలియవలెను. ఇది అధికమైన వ్యధను కలిగించును.[2]

అలజీ లక్షణము :

ప్రమేహ పిడకా నిదానమున చెప్పబడిన అలజీ లక్షణములతోగూడి వుండునది, అలజి అను శూక దోషమని తెలియవలెను. అనగా కొంచెము రక్త వర్ణముకలిగి శ్వేతవర్ణములోవుండు పొక్కులు కలిగినది అలజి అని అర్థము.[3]

మృదితము మరియు సంమూఢ పిడకా లక్షణము :

శూకలేపమును చేసిన పిదప శిశ్నమును అధికముగా మర్దన చేయుటవలన వాపు కలిగినచో అది మృదితమని తెలియవలెను. ఇది వాత ప్రకోపముచే కలుగును. మరియు శూకలేపనము చేసిన తరువాత రెండు చేతులతో శిశ్నమును

---

1. కఠినా విషమైర్భగ్నైర్వాయునాఽష్ఠీలికా భవేత్
   శూకైర్యత్పూరితం శశ్వద్గ్రథితం నామ తత్కఫాత్ (సు. ని. 14/5)
2. కుంభికా రక్తపిత్తోత్థా జాంబ్వాస్థినిభాఽశుభా (సు.ని. 14/6)
3. తుల్యజా న్త్వలజీం విద్యాద్యథాప్రోక్తాం విచక్షణః (సు.ని. 14/7)

అధికముగా నలిపిన ఎడల ముఖములేని కురుపు కలుగును. దీనిని సంమూఢ పిడక అను శూకదోషమని ఎరుగునది.[1]

## అధిమంధ లక్షణము:

శూకలేపము వలన కఫ రక్తాదులు ప్రకుపితములై మిక్కిలి పొడవుగనై మధ్యమున చీలిఉండు పిడకములను అనేకముగా శిశ్నమున కలిగించును. ఇది అధిమంధము అను శూకదోషమని తెలియవలెను. ఈ వ్యాధియందు మిక్కిలి తీవ్రవేదన, గగుర్పాటు కలుగును.[2]

## పుష్కరికా లక్షణము :

శూకలేపనమువలన రక్తము, పిత్తములు ప్రకోపమునుపొంది సన్నని పిడకలచే వ్యాప్తమైన పిడకము శిశ్నమున కలుగును. ఇది తామరమిద్దెవలె ఉండుట వలన పుష్కరిక అను శూకదోషముగా చెప్పబడినది.[3]

## స్పర్శహాని లక్షణము :

శూకలేపనమువలన రక్తము దుష్టమై స్పర్శజ్ఞానమునకు హాని కలుగ చేయును. దీనిని స్పర్శహాని అను శూకదోషముగా చెప్పబడినది.[4]

---

1. గ్రథితం పీడితం యస్య సంరుద్ధం శూకకోపతః
   పాణిభ్యాం భృశసంమూఢే సంమూఢ పిడకా భవేత్ (సు. ని. 14/8)
2. పిడకా బహవో యస్య దీర్ఘా నర్తే మధ్యతస్తు యాః
   సోఽధిమన్థః కఫాసృగ్భ్యాం వేదనా రోమహర్షకృత్ (సు.ని. 14/9)
3. పిడకా పిడకావ్యాప్తా రక్తపిత్తసంభవా
   పద్మకర్ణికసంస్థానా జ్ఞేయా పుష్కరికా తు సా (మా.ని. 48/7)
4. స్పర్శహానిం తు జనయేచ్ఛోణితం శూకదూషితమ్ (మా.ని. 48/8)

**ఉత్తమా లక్షణము :**

అనేకసార్లు శూకలేపనము చేయుటవలన రక్తపిత్తములు ప్రకుపితములై, ముద్గములవలె, మాషలవలె ఉండి రక్తవర్ణమైన పిడకమును కలిగించును. ఈ వ్యాధి ఉత్తమ అను శూకదోషము.[1]

**శతపోనక లక్షణము :**

శూకలేపనము అధికముగా చేయుటచే వాతరక్తములు ప్రకుపితమయిన శిశ్నమునందు సూక్ష్మచ్ఛిద్రములు కలిగించును. దీనివలన మేఢ్రము చిన్నాభిన్నముగా ఉండును. ఈ వ్యాధియందు జల్లెడవలె అనేక ఛిద్రములు కలిగియుండుటచే శతపోనకము అనబడును.[2]

**త్వక్పాక లక్షణము :**

వాతపిత్తములు శూకలేపమువలన ప్రకోపించి శిశ్నముపైగల త్వక్‌ను పుండువలె చేయును. దానివలన జ్వరము, మంటకలుగును. దీనిని త్వక్పాకమను శూకదోషమని వచించెదరు.[3] సుశ్రుతుడు దీనిని పిత్తరక్తజమని వర్ణించెను.

**మాంసార్బుద లక్షణము:**

శూకలేపము చేసిన తరువాత మాంసము అభిఘాతముచే దూషితమై శిశ్నము

---

1. ముద్గమాషోపమా రక్తారక్తపిత్తోద్భవా తు యా
   వ్యాధిరేషోత్తమా నామ శుకాజీర్ణనిమిత్తః (మా.ని. 48/8)
2. ఛిద్రైరణుముఖైర్లింగం చితం యస్య సమన్తతః
   వాతశోణితజో వ్యాధిస్సజ్ఞేయశ్శతపోనకః (మా.ని. 48/9)
3. వాతపిత్తకృతో జ్ఞేయస్త్వక్పాకో జ్వరదాహకృత్ (మా.ని. 48/10)

నందు అర్బుదములను కలిగించిన ఎడల మాంసార్బుదమను శూకదోషమని తెలియవలెను.[1]

**మాంసపాక లక్షణము :**

శూకలేపముచేత శిశ్నప్రదేశమందలి మాంసము క్రుళ్ళి నానాటికి మాడి పోవును. వాతపిత్త కఫాదిదోషములచేత జనించువేదన, దాహము మొదలగు నవి కలిగినయెడల అది మాంసపాకమని చెప్పబడును. ఈ వ్యాధి దోషము లన్నింటివలన కలుగును.[2] అనగా సన్నిపాతజనితము.

**శోణితార్బుద లక్షణము :**

రక్తవర్ణములు, కృష్ణవర్ణములు కొద్ది కొద్దిగా కలిగిన పిడకములు శిశ్నమున కలిగి వ్రణము ఏర్పడినచోట మిక్కిలి తీవ్రమయిన వేదన కలిగినచో అది రక్తార్బుదమని చెప్పబడును.[3]

**విద్రధి లక్షణము :**

శూకలేపముచేత సన్నిపాతముచే జనించు విద్రధియొక్క లక్షణములు కలిగి శిశ్నమున కురుపు వచ్చినచో విద్రధి అను శూకదోషమని తెలియవలెను. ఇచట అనేక విధములయిన వర్ణములను, వేదనలను, స్రావమును కలిగి ఉన్న దమై విషమముగా పాకము పొందినది సన్నిపాతజ విద్రధి అని అర్థము.[4]

---

1. మాంసదోషేణ జానీయాదర్బుదం మాంససంభవమ్ (మా.ని. 48/11)
2. శీర్యన్తే యస్యమాంసాని యస్య సర్వాశ్చ వేదనా
   విద్యాత్తం మాంసపాకం తు సర్వదోషకృతం భిషక్ (మా.ని. 48/12)
3. కృష్ణైస్ఫోటైస్సరక్తాభిః పిడకాభిశ్చ పీడితమ్
   యస్య వాస్తు రుజశ్చోగ్రా జ్ఞేయం తచ్ఛోణితార్బుదమ్ (మా.ని. 48/1[illegible])
4. విద్రధిం సన్నిపాతేన యథోక్తమితి నిర్దిశేత్ (మా.ని. 48/13)

**పథ్యములు :**

శాలిధాన్యము, యవలు, ముద్గయూషము, కారవేల్లకము, పటోలము, శిగ్రు కర్కోటకము (దోస), ధత్తూరశాకము, లేతముల్లంగి, పేసుచిగుళ్ళు, దాడిమ, సైంధవ లవణము, తిక్త కషాయ ద్రవ్యములు, జాంగల, పశుపక్షుల మాంసములు, బావినీరు, చందనము, కస్తూరి, కర్పూరము, త్రిఫల- ఇవన్నియు మూత్ర దోషములందు పథ్యకరములుగా నుండును.

**అపథ్యములు :**

మూత్రవేగమును నిగ్రహించుట, [illegible], వ్యాయామము, మైథునము-ఇవి మూత్రదోషములను వృద్ధిచేయును.

గుడము, [illegible], [illegible]ములయిన ఉష్ణపదార్థములు, గురుపదార్థములు, త్రకము-ఇవి మూత్రదోషములందు అపథ్యములు

## ఔ ష ధ ము లు

**దార్వీతైలము :**

ఉపదంశ, మూత్రదోషములందు పానమునకు అభ్యంగనమునకు ఉపయోగించుటవలన ఈ వ్యాధులు తగ్గును.

**రసాంజన లేపము :**

పూయము, శోథ, కండూ, దుర్గంధముతో గూడిన ఉపస్థ శిశ్నవ్యాధులను శమింపచేయును.

## శూకదోష విశేష చికిత్సలు

**సర్షపికా చికిత్స :-**

శస్త్రముచే లేఖనముచేసి కషాయరసముగల చూర్ణములతో అవచూర్ణనము చేయవలెను. తదుపరి కషాయరస ద్రవ్యసిద్ధతైలము ప్రయోగించి రోపణము కలిగించవలెను[1].

**అష్టీలికా చికిత్స :-**

జలౌకలచే గ్రంధిభాగమునందు రక్తమోక్షణము చేయింపవలయును.

దీనివలన శమింపనిచో శ్లేష్మగ్రంధివలె శోధన ఛేదనాది చికిత్సలు చేయవలయును.[2]

**గ్రధిత చికిత్స :-**

నాడీస్వేదముచే మాటిమాటికి స్వేదనము చేయింపవలయును. సుఖోష్ణమై స్నిగ్ధముగనుండు ఉపనాహములతో కట్టుకట్టవలయును.[3]

---

1. i) సంలిఖ్య సర్షపీం సమ్యక్కషాయైరవచూర్ణయేత్
కషాయేష్వేవ తైలం చ కుర్వీత వ్రణరోపణమ్
(సు. చి. 21/3)

ii) అ. హృ. 34/8

2. i) అష్టీలికాంజలౌకోభిర్గ్రాహయేత్కుశలో భిషక్ తథా చా... పశామ్య...స్తీం కఫగ్రంధీ వదుద్ధరేత్ (సు చి. 21/4)

ii) అ. హృ. ఉ. 34/14

3. స్వేదమేద్గ్రధితం శశ్వన్నాడీస్వేదేన బుద్ధిమా...
సుఖోష్ణైరుపనాహైశ్చ సుస్నిగ్ధైరుపనాహయేత్ (సు.చి. 21/5)

**కుంభికా చికిత్స :-**

ఆమావస్థలోనున్న రక్తమోక్షణము చేయింపవలెను. పక్వావస్థలో ఉన్నచో భేదనముచేసి దోషమును పీడించి తీసివేయవలెను. శోధన క్వాథములతో ప్రక్షాళన చేయవలెను.

తిన్దుకాది తైలము లేక త్రిఫలాదితైలముతో రోపణము చేయించవలెను.[1]

**అలజీ చికిత్స :-**

అష్ఠీలికాయందు చెప్పబడిన చికిత్సలు చేయవలెను. రక్తమోక్షణానంతరము కషాయములచే సేచన చేయవలెను [2]

**మృదిత చికిత్స :-**

బలాతైలముచే సుఖోష్ణపరిషేకము చేయవలెను. మధురగణ ద్రవ్యములతో ఘృతముచేర్చి సుఖోష్ణోపనాహము చేయవలెను.[3]

---

1. i) కుంభికాయాం హరేద్రక్తం పక్వాయాం శోధితే వ్రణే (అ. హృ. ఉ. 34/10)

   ii) కుంభీకాం పాకమాపన్నాం భిన్ద్యాచ్ఛుద్ధాం తు రోపయేత్
   తైలేన త్రిఫలా లోధ్రతిన్దుకామ్రాత కేనతు (సు.చి. 21/6)

2. i) గ్రహయిత్వా జలౌకోభిరలజీం సేచయేత్తతః కషాయైస్తైష సిద్ధం చ
   తైలం రోపణమిష్యతే (సు. చి. 21/7)

   ii) అ. హృ. ఉ. 34

3. i) బలాతైలేన కోష్ణేన మృదితం పరిషేచయేత్
   మధురైస్సర్పిషా స్నిగ్ధై స్సుఖోష్ణైరుపనాహయేత్ (సు. చి. 21/8)

   ii) అ.హృ.ఉ. 34/12

సమూఢపిటకా చికిత్స :-

శీఘ్రముగా జలౌకలచే రక్తమోక్షణము చేయవలెను.

పాకము నందినచో శస్త్రముచే భేదించి శోధనచేసి మధుసర్పిర్లేపనము చేయవలెను.

పిత్తవిసర్పోక్తక్రియలు ఆచరింపవలెను.[1]

అవమన్థ చికిత్స :-

సర్షపికయందు చెప్పబడిన చికిత్సలను రక్తమోక్షణమును చేయవలయును.

పాకమును పొందినచో శస్త్రముచే భేదనముచేసి శోధనచేసి [illegible] తైలము ప్రయోగించి రోపణ మొనర్పవలెను.[2]

పుష్కరికా చికిత్స :-

శీతలక్రియలచే ఉపచరింపవలెను.

జలౌకలచే రక్తమోక్షణము చేయింపవలెను. [illegible] అవసేచనము చేయవలెను. పిత్తవిసర్పమున చెప్పబడిన [illegible] ఉపచరింపవలెను.[3]

---

1. i) సమూఢపిటకాం శీఘ్రం జలౌకోభి[illegible]
భిత్త్వా [illegible] లేపయే[illegible] ([illegible])
ii) క్రమః పిత్తవిసర్పోక్త పుష్కరికా[illegible] ([illegible])
2. i) క్రియేయమసంపాకేఽపి రక్తం [illegible] ([illegible] చి. 31/[illegible])
ii) అవమన్థే [illegible]
[illegible] ([illegible])
3. i) [illegible]
[illegible] ([illegible])
ii) [illegible] 3[illegible]

శోణితార్బుద చికిత్స :-

రక్తవిద్రధివలె చికిత్సింపవలెను. దోష అవస్థానుసారము కషాయములు, కల్కములు, ఘృతము, తైలము చూర్ణము, రసక్రియాదులతో శోధన రోపణాదులు, ఆయా దోషహర ఘృతపానములు చేయింపవలెను[1]

మాంసార్బుద, మాంసపాకాదుల చికిత్స :-

మాంసార్బుదము, మాంసపాకము, విద్రధి, తిలకాలకము ఈ నాలుగును ప్రత్యాఖ్యేయములని రోగికి, లేక రోగిబంధువులకు, చెప్పి తత్తదనుసార చికిత్సలు శోణితార్బుదమునందు చెప్పిన విధిననుసరించియు, సామాన్య శూకదోష చికిత్సా విధిననుసరించియు, ఈ క్రింది చికిత్సలతోను చికిత్సింపవలెను[2].

మాంసార్బుదమునందు సద్యోవ్రణోక్త చికిత్సలుచేయుచు త్రిఫలా క్వాథముతో గుగ్గులును సేవింపచేయవలెను.

మాంసపాకమునందు వటాది గణద్రవ్య క్వాథచూర్ణ కల్కములతో సేక, ఉద్ధలన లేపాదులచే ఉపచరింపవలెను.

విద్రధియందు రక్తవిద్రధియందు చెప్పబడిన చికిత్సలు చేయవలెను. వరుణాది గణక్వాథమును పానమునకు వ్రణప్రక్షాళనమునకు ఉపయోగించుట హితకరముగా నుండును.

---

1. రక్తవిద్రధివచ్చాపి క్రియాశోణితజేఽర్బుదే కషాయకల్కసర్పీంషి తైలం చూర్ణం రసక్రియా శోధనం రోపణంచైవ వీక్ష్యవీక్ష్యావచారయేత్ యథాస్వం సర్పిషః పానం పథ్యంచాపి విరేచనమ్

(సు.చి. 21/15-16)

2. అర్బుదమ్మాంసపాకంచ విద్రధిం తిలకాలకమ్ ప్రత్యాఖ్యేయ ప్రకుర్వీత భిషక్సమ్యక్కృతిక్రియామ్ (సు.చి. 21/17)

తిలకాలకమునందు లేఖనముచేసి సద్యోవ్రణోక్త క్రియలచే ఉపచరింప వలెను.1



---

1 మాంసార్బుదే ప్రకుర్వీత క్రియాం సద్యోవ్రణోదితామ్ త్రిఫలాం గుగ్గులుం చాపి విశేషణావచారయేత్ మాంసపాకే వటాద్యస్య గణస్య విధివత్కృతైః కషాయచూర్ణకల్కైశ్చ సేకోద్ధూలనలేపనమ్ విద్రధౌ విధివత్ కార్యం రక్తవిద్రధి భేషజమ్ వరుణాదికషాయస్య పానప్రక్షాళనే హితే తిలకాలం సముల్లిఖ్య క్షురేణం లఘుపాణినా భిషజాఽయాత్ర కర్తవ్యః సద్యోవ్రణవిధిర్మతః (భై.ర. 53/14-17)

# మానస రోగ ప్రకరణము

మనస్సును గురించి మానస రోగములను గురించి భారత దేశమునందు అతి ప్రాచీన కాలము నుండియే జ్ఞానము యున్నట్లు వేదములు, పురాణముల వలన తెలియుచున్నది.

మనస్సు, దాని కర్తవ్యములు గుణములను గురించి దార్శనికులు, ఆధ్యాత్మిక వాదులు, యోగులు కూలంకషముగా చర్చించిరి.

శంకరాచార్యులు తమ భాష్యమునందు "హృద్ విద్యా" అను పదమును వాడిరి. శంకరాచార్యులవారి కాలమునందు మానసరోగ నిపుణులు ప్రత్యేకముగా నుండిరనియు "మానస రోగ విజ్ఞానమునకు" "హృద్ విద్య" సంకేతమనియు కొందరి అభిప్రాయము.

భూత విద్య అను ఆయుర్వేద అంగము ఉన్మాద అపస్మారములందలి ఆగంతుక కారణజన్యము అగు భూతోన్మాదాదులకు సన్నిహిత సంబంధము కలిగి యున్నది.

## మనస్సు యొక్క నిరుక్తి

"మనః (మన్యతే బుద్ధ్యతేఽనేనేతి")

అను శబ్దకల్పద్రుమ ఉత్పత్తి ననుసరించి మననము చేయుటకు జ్ఞానము నకు కారణమైనది మనస్సు.

మనస్సు లేనిదే జ్ఞానము కలుగదు. అందుచేత జ్ఞానము కలుగకుండుటయు కలుగుటయు మనస్సునకు లక్షణముగా చెప్పబడినది. మనస్సు యొక్క

సంబంధము లేక ఆత్మ, ఇంద్రియములు, ఇంద్రియార్థములకు సంబంధము కలిగి యున్నను జ్ఞానము కలుగనేరదు. మనస్సుతో గూడా సంబంధము ఏర్పడినపుడు మాత్రమే జ్ఞానము కలుగును.[1]

మనస్సు అతీంద్రియముగా నుండును.

మనస్సునకు సత్త్వము అను పేరు గలదు[2]

### మనస్సునకు పర్యాయములు

సత్త్వము, చిత్తము, చేతము, చేతనము, హృదయము హృత్, మానసము

### మనస్సుయొక్క ప్రాధాన్యత

ఆయుర్వేదమునందు ఇతర దార్శనిక గ్రంథములందు మనస్సునకు అధిక ప్రాధాన్యత ఇవ్వబడినది. వైశేషికులు, న్యాయులు మనస్సును కారణ ద్రవ్యములలో పేర్కొనిరి.[3] సాంఖ్యమతానుసారము సృష్ట్యుత్పత్తిక్రమమును వివరించిన సుశ్రుతుడు వైకారిక తైజస అహంకారములతో మనస్సుయొక్క ఉత్పత్తిని వివరించెను.[4] చరక సంహితలో ఆయువుయొక్క లక్షణమునందు

---

1. లక్షణం మనసో జ్ఞానస్యాభావో భావ ఏవ చ సతిహ్యాత్మేన్ద్రియార్థానాం సంనికర్షేణ వర్తతే వైవృత్త్యాన్మనసోజ్ఞానం సాంనిధ్యాత్తచ్చవర్తతే అణుత్వమథచైకత్వం ద్వౌ గుణౌ మనసః స్మృతౌ (చ.శా. 1/18-19)
2. అతీంద్రియం పునర్మనః సత్త్వసంజ్ఞకం చేత ఇత్యాహురేకే (చ.సూ.8/4)
3. ఖాదీన్యాత్మా మనః కాలో దిశశ్చ ద్రవ్యసంగ్రహః (చ.సూ. 1/48)
4. తత్ర వైకారికాదహంకారాత్తైజససహాయాత్తల్లక్షణాన్యేవైకాదశేన్ద్రియాణ్యుత్పద్యన్తే తద్యథా శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణ వాగ్ఘస్తోపస్థ పాయు పాదమనాం సీతి తత్ర పూర్వాణి పంచబుద్ధీన్ద్రియాణి ఇతరాణి పంచ కర్మేన్ద్రియాణి ఉభయాత్మకం మనః (సు.శా. 1/5-6)

మనస్సుయొక్క సంయోగమును పేర్కొనెను.[1]

శారీరక దోషములతోపాటు మానస దోషములు.[2] మానసిక రోగములు[3], మానసిక రోగముల కారణములు[4] నిరోధోపాయములు[5] చరక సంహితయందును ఇతర సంహితలందును ఆయా సందర్భములలో వివరింపబడినవి.

## మనస్సుయొక్క స్థానము

ఆయుర్వేదమునందు ప్రాచీన భారతీయ శాస్త్రములందును మనస్సుయొక్క స్థానమును గురించి రెండు అభిప్రాయములు ఉన్నట్లు కనిపించును.

అవి 1. హృదయము

2. శిరస్తాల్వంతరము అనగా మస్తిష్కము.

హృదయము :

"హరతి దదాతి ఏతీతి హృదయమ్" అను నిరుక్తిచేత గ్రహించుట. యిచ్చుట అను కర్మలు చేయునది హృదయము అను అర్థము వచ్చును. హృదయము లేక Heart నకు రసరక్తాదులను గ్రహించి శుద్ధముచేసి తిరిగి పంపుట అను కర్మను సూచించు ఈ పదము తగియున్నదిగా కనిపించును.

---

1. శరీరేంద్రియసత్త్వాత్మసంయోగో ధారి జీవితమ్ నిత్యగశ్చానుబన్ధశ్చ పర్యాయైరాయురుచ్యతే (చ.సూ. 1/42)
2. మానసః పునరుద్దిష్టో రజశ్చ తమ ఏవ చ (చ.సూ. 1/57)
3. ఈర్ష్యాశోకభయక్రోధమానద్వేషాదయశ్చయే మనోవికారా స్తేఽప్యుక్తాః సర్వే ప్రజ్ఞాపరాధజాః (చ.సూ. 7/51) ii) సు.సూ. 1/33
4. మానసః పునరిష్టస్యాలాభాల్లాభాచ్చా నిష్టాస్యోపజాయతే (చ. సూ. 11/45)
5. i) చ.సూ. 7/53-60; ii) చ.సూ. 11/46-47

నాడీతంతువుల ద్వారా జ్ఞానమును గ్రహించుట ఆజ్ఞలను పంపుట అను కృత్యములు మస్తిష్కమునకు గూడా తగియుండుటచే 'శిరోహృదయము', 'శిరోహృదయము' అని రెండును హృదయముతో గ్రహింపదగిన అవయవము లుగా భావించుచున్నారు.

ఆయుర్వేద సంహితల యందెక్కడను శిరోహృదయము అను పదము గాని, హృదయ స్థానమును శిరస్సుగా సూచించు రచనా వర్ణన కాని కనిపించదు. కేవలము ఆధునిక శారీర క్రియా విజ్ఞానమునాధారముచేసికొని హృదయమున కాపాదింపబడిన మానసిక కర్మలు మస్తిష్కము నిర్వహించునదిగా నున్న ఆధు నిక విజ్ఞానము ఆధారముగా శిరోహృదయము అను పదము ప్రయోగింపబడినట్లు కనుపించును.

హృదయము ఒక కోష్ఠాంగము రెండు స్తనములకు మధ్యన ఆమాశయము నకు సమీప వర్తిగా నుండి ఆమాశయము దీని ద్వార రూపముగా నుండును. దీనిక్రింద వామభాగమున ప్లీహము, దక్షిణభాగమున యకృత్ క్లోమములు కలవు.[1]

ఇది మాంస పేశీలతో కూడి యుండి ఎర్రగా అధోముఖముకుళ కమలా కారములో నుండును. మధ్యలో అవకాశము కలిగియుండి[2] నాలుగు అక్షము

---

1. చ.శా. 7/

ii) కోష్ఠ వక్షస్థః స్తనయోశ్చ మధ్యే ఆమాశయద్వారం (అ.సం.శా 7)

iii) తస్యాధో వామతః ప్లీహా పుప్పుసశ్చ దక్షిణతో యకృత్క్లోమం చ (సు.శా. 4/23)

2. i) మాంసపేశీ చ యోరక్తపద్మాకారమధోముఖమ్ (సర్వాంగసుందర అ.శా. 12/15)

ii) పుండరీకేణ సదృశం హృదయం స్యాదధోముఖమ్ (సు.శా. 4/32)

iii) హృదయం పద్మసన్నిభమ్ అధోముఖం తచ్ఛిషిరయత్రజీవోవ్యవస్థితః (అగ్నిపురాణ 370/16)

ఫలతోను[1] సంవృతాఽసంవృత ద్వారములతో[2] కూడి యుండి తోలు తిత్తివలె యుండును.[3]

హృదయము మృదువుగా నుండున దగుటచే మాతృజము. గర్భమునందు నాల్గవ మాసమున హృదయమేర్పడి ప్రవ్యక్తతనొంది ఆత్మ ఇందుస్థాన మేర్పరుచుకొని చేతనా ధాతువు అభివ్యక్తమగును. అపుడు గర్భిణి శరీరములో రెండు హృదయములుండును గాన దౌహృద అనబడును. ఈ కాలమున గర్భము నందు గల జీవునియొక్క ప్రారబ్ధ కర్మానుగుణమైన శబ్దస్పర్శ రూపరసగంధాది స్వరూపములైన యింద్రియార్థములకు చెందిన కోరికలు దైవవశమున గర్భిణికి కలుగును.[4]

హృదయము ఆత్మకు స్థానమగుటచే చేతనా స్థానము, సత్వరజస్తమస్సుల కధిష్టానము, సత్వమునకు మనస్సునకు, బుద్ధికి, ఇంద్రియములకు, ఓజస్సునకు (ముఖ్యముగా పర ఓజస్సునకు), రసమునకు వాతాదులకు[5] వ్యానవాతమునకు,[6] సాధకపిత్తమునకు[7] అవలంబక శ్లేష్మమునకు[8] హృదయము స్థానము హృద

---

1. చతురశ్రావర్తమ్ (పొలకావ్యత స్త్రిము)
2. సంవృతాఽసంవృత ద్వారమ్ (వృద్ధవాగ్భట)
3. సాయిణ (అధర్వ 6/18-3)
4. సు.శా. 3/31
5. i) రసవాతాదిమార్గాణాం సత్వబుద్ధీంద్రియాత్మనామ్ ప్రధానస్యౌజసశ్చైవ హృదయం స్థానముచ్యతే (చ.చి. 24/35)
   ii) సు.శా. 4/34 iii) సు.శా. 6/25
6. అ.సం.సూ. 20/4
7. అ. సం. సూ. 20/5
8. అ. సం. సూ. 20/6

యము ప్రధానమైన మర్మలలో ఒకటి.[1] జాగ్రతావస్థలో వికసించి స్వప్నావస్థలో నిమీలనమై యుండును.[2] ప్రాణాయతనము,[3] సిరామర్మ,[4] సద్యః ప్రాణ హరమర్మ,[5] ప్రాణవహ స్రోతస్సులకు మూలము [6] హృదయము ధమనుల ద్వారా వ్యానవాతముచే ప్రేరితమై ఆహారరసముచే శరీరమంతటిని ఎల్లప్పుడు తర్పణ, వర్ధన, ధారణ యాపనలను చేయుచుండును.[7]

మనోవహ ధమనులు హృదయము నాశ్రయించి యుండును.[8] ఇంద్రియ ముల జ్ఞానమునకు సర్వబుద్ధులకు కారణమైన చిత్తము హృదయము నాశ్రయించి యుండును.[9]

ఇంద్రియములు, జ్ఞానము, విజ్ఞానము, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము ప్రాణవాత ధారణము, అపానవాత ప్రవృత్తి ఉన్మేష నిమేషములు, బుద్ధి, మనస్సు సంకల్పము, విచారణము, స్మృతి, విజ్ఞానము, అధ్యవసాయము (నిశ్చయాత్మక బుద్ధి), విషయోపలబ్ధి (ఇంద్రియములద్వారా విషయ జ్ఞానమును పొందుట) ఈ గుణములన్నియు ఆత్మ లేక కర్మపురుషునకు సంబంధించినవి. అట్టి ఆత్మ హృదయమును ఆశ్రయించియుండును.[10]

ఆత్మ మనస్సుతోను, మనస్సు ఇంద్రియములతోను ఇంద్రియములు ఇంద్రి యార్థములతోను సంయోగము చెందినపుడే జ్ఞానము కలుగును.[11] అనగా

---

1. చ. సూ. 29/3 2. సు. శా. 4/23
3. చ. సూ. 29/3 4. సు. శా. 6/10
5. సు. శా. 6/25 6. చ. వి. 5/24
7. i) సు. సూ. 14 ii) చ. చి. 15
8. చ. ని. 9/4 (పై చక్రపాణి)
9. మనసః ప్రభవంచాపి సర్వేన్ద్రియసుఖాబలమ్ కారణం సర్వబుద్ధీనాం చిత్తం హృదయం సంశ్రితమ్ (భేళసంహిత ఉన్మాద చికిత్స)
10. సు. శా. 1/22 11. చ. సూ. 11/20

మనస్సుతో కూడిన ఇంద్రియముల చేతనే ఇంద్రియార్థములు గ్రహింపబడును. తరువాత మనస్సుచేత గుణదోషములు సంకల్పింపబడును. అట్టి విషయమునందు ఏర్పడిన నిశ్చయాత్మక బుద్ధిననుసరించి చెప్పుటకుగాని చేయుటకుగాని బుద్ధి పూర్వకముగా ప్రవర్తించును.[1]

మనస్సు అచేతనమయినప్పటికిని క్రియలను చేయగలదు. మనస్సునకు చేతనమును కలిగించునది ఆత్మ. అందుచేత మనస్సుతోగూడిన ఆత్మయొక్క క్రియలు (ఔపచారికముగా) ఆత్మయొక్క క్రియలుగా పేర్కొనబడుచున్నవి. అనగా జడమైన (అచేతనమైన) మనస్సునకు కార్యములు చేయు శక్తి ఆత్మ వలననే కలుగును. సచేతనమగుటచే ఆత్మకర్తగా పేర్కొనబడును. అచేతనమగుటచే మనస్సు పనులు చేయుచున్నప్పటికిని కర్తగా పేర్కొనబడదు.[2]

కాని స్థూలదృష్టితో పై చెప్పబడిన ఆత్మయొక్క గుణాలు, కర్మలు మనస్సు చేయునవియే అగుటవలన మనస్సుయొక్క గుణకర్మలుగానే భావింపబడును.

ఆత్మకు మనస్సు బుద్ధి అహంకారము అనునవి అంతఃకరణములు. ఇంద్రియములు పది అనగా పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు బాహ్య కరణములు. యోగవాశిష్టమున ఈ నాలుగు లేక (చిత్తముతో కలసి) మూడు (మనస్సు, బుద్ధి అహంకారములను) అంతఃకరణములు మనస్సుయొక్క విభిన్న రూపములేనని చెప్పబడినది.[3]

---

1. ఇంద్రియేణేంద్రియార్థో హి సమనస్కేన గృహ్యతే కల్ప్యతే మనసా తూర్ధ్వం గుణతో దోషతోఽథవా జాయతే విషయే తత్ర యా బుద్ధిర్నిశ్చయాత్మికా వ్యవస్యతి తథా వక్తుం కర్తుం వా బుద్ధిపూర్వకమ్(చ.శా.1/22-23)
2. అచేతనం క్రియావచ్చ మనశ్చేతయితా పరః యుక్తస్య మనసా తస్య నిర్దిశ్యన్తే విభోః క్రియాః చేతనావాన్ యతశ్చాత్మా తతః కర్తా నిరుచ్యతే అచేతనత్వాచ్చ మనః క్రియావదపి నోచ్యతే (చ.శా. 1/75 76)
3. అంతః కరణం త్రివిధం దశధా బాహ్యం త్రయస్య విషయాఖ్యమ్ సాంప్రతకాలం బాహ్యం త్రికాల మాభ్యన్తరం కరణమ్ (సాంఖ్య. కా. 33)

## 2. మస్తిష్కము (శిరస్సు)

శిరస్సు సర్వేంద్రియములకు, ఇంద్రియవహ స్రోతస్సులకు, ప్రాణవహ స్రోతస్సులకు కిరణములకు సూర్యుడు ఆశ్రయుడుగా నున్నట్లు ఆశ్రయముగా నుండును.[1] శిరస్సుగూడా మర్మత్రయములలో ఒకటి. శరీరమంతటికి మూలములు శిరస్సు నందుండును. మూలమును బాగుగా రక్షించినచో వృక్షము పుష్టిగా నుండునట్లు శిరస్సును రక్షించిన శరీరమంతయు రక్షింపబడును.

శిరస్సు ఉత్తమాంగము అని అనబడును.[2] ప్రాణవాతమునకును[3], తర్పక శ్లేష్మమునకును స్థానము.[4] సుశ్రుతుడు శిరోధమనులయొక్క పాత్ర పక్షాఘాత సంప్రాప్తిలోను[5] మదాత్యయమునను[6] వివరించెను. చరకుడు అపతంత్రక

---

1. i) చ.సూ. 29/3 ii) చ.సి. 9/4
2. i) ప్రాణాః ప్రాణభృతాం యత్ర శ్రితాః సర్వేంద్రియాణి చ యదుత్త
   మాంగమంగానాం శిరస్తదభిధీయతే (చ సూ. 17/12)
   ii) అ.హృ.సూ. 24/58
   iii) ఊర్ధ్వమూలమధః శాఖామృషయః పురుషం విదుః
   మూలప్రహారిణస్తస్మాద్ రోగాన్ శీఘ్రతరం జయేత్
   (అ.హృ.ఉ. 24/58)
   iv) అనామయే యథా మూలే వృక్షః సమ్యక్ ప్రవర్ధతే
   అనామయే శిరస్యేవం దేహః సమ్యక్ ప్రవర్ధతే
   (చ. సూ. 2/3 చక్రపాణి)
3. i) చ.చి. 28 ii) సు.ని. 1/13
4. అ. సం. 20/4
5. సు. ని. 1/60-63
6. చ. చి. 23

వ్యాధిలోను, శిరస్సు పాత్రను వివరించెను.[1] భేలుడు ఉన్మాదసంప్రాప్తిలో మనస్సు యొక్క స్థానము శిరస్సుగా వర్ణించెను.[2]

శిరస్సునందు అభిఘాతము కలిగినచో మోహం, చేష్టానాశ, గద్గదత, స్వర హాని కలుగునని చరకుడును[3] శిరస్సునందలి సీమంత సంధులందు విద్ధముజరిగిన ఉన్మాదము, భయము, చిత్తనాశము, మరణము కలుగునని సుశ్రుతుడు వర్ణించెను.[4]

భేలుని మతానుసారము మనస్సుయొక్క స్థానము శిరస్సని చెప్పబడింది. సర్వయింద్రియములకు ప్రధానమైన మనస్సు శిరస్సునకు తాలువునకు మధ్యన ఉండును, అని వివరించిన తదుపరి మరలా ఇంద్రియముల జ్ఞానమునకు సర్వ బుద్ధులకు కారణమైన చిత్తము హృదయమునాశ్రయించి యుండునని చెప్పబడి నది. బుద్ధి అత్మ మనస్సు ఈ మూడింటికి గూడా హృదయమే స్థానమనియు మనస్సు సూక్ష్మముగానుండి శీఘ్రగామి అగుటవలన అతి శీఘ్రముగా ఆవశ్యక తానుసారము ఇంద్రియములతో సంయోగముచెంది విషయములను గ్రహించు ననియు చెప్పుటచే మనస్సునకు ప్రధాన స్థానము హృదయము, కార్యస్థానము శిరస్సుగా భావించియుండునని తలంచబడుచున్నది.[5]

---

1. చ. సి. 9/16-21
2. శిరస్తాల్వంతరగతమ్ సర్వేంద్రియపరం మనః (భేళ)
3. చ. సి. 9/10
4. సు. శా. 6/28
5. శిరస్తాల్వంతరగతం సర్వేంద్రియ పరం మనః
   తత్రస్థం తద్విషయానింద్రియాణాం రసాదికాన్ సమీపస్థాన్ విజానాతి
   త్రీన్ భావాంశ్చానియచ్ఛతి మనసః సమ్భవం చాపి సర్వేంద్రియమయం
   బలమ్ కారణం సర్వబుద్ధీనాం చిత్తం హృదయసంశ్రితమ్ (భేళసంహిత)

శిరస్సు హృదయముకలసి పని చేసిననే మానసిక కర్మలు, నాడీ సంస్థాన సంబంధిత వాతకర్మలు జరుగునని ఆయుర్వేదమునందును గుర్తింపబడినట్లు కనిపించును. ప్రాణవాతము శిరస్సు స్థానముగాకలిగి మనస్సు, బుద్ధి, యింద్రియ ధారణ కర్మను చేయును. ఉదాన వాతము, ఉరస్సు స్థానముగాకలిగి ధీధృతి స్మృతి మనోవిబోధనాది మానసిక క్రియలు నిర్వర్తించును. హృదయముద్వారా రస రక్తప్రసారము లేనిదే మనస్సు మస్తిష్కము వాని కార్యములను నిర్వర్తించలేవు బహుశా ఆ దృష్టితో హృదయమునకు మానసికకర్మలను ఆపాదించిరని తోచును.

మానసిక వికారములచే హృదయవ్యాధులు అధికముగా కలుగుట ఇటీవల అధికముగా వెలుగులోనికి వచ్చిన సత్యము. అందుచే ఇప్పటివరకు ఆధునిక విజ్ఞానమునకు అందని మానసిక కర్మలకు మూలధారమైన హృదయగత తత్వమేదైనను యున్నదా అనునది కాలమే నిర్ణయించవలయును.

## మనస్సు యొక్క గుణములు

మనస్సునకు అణుత్వము, ఏకత్వము అను రెండుగుణములు ప్రతిపాదింపబడినవి.[1]

ప్రతి మనుజుని శరీరమునందు మనస్సు అణుమాత్రమునుండి ఒకటిగనే యుండును. మనస్సు ఒక్కటిగనే యుండుటచేత ఒక సమయములో ఒక ఇంద్రియముతో మాత్రమే కలిసి ఆ యింద్రియార్థము యొక్క జ్ఞానమును కలిగించగలుగును. మనస్సు శీఘ్రముగా సంచరించుటవలన ఒకే సమయమున అనేక ఇంద్రియములతో కలసి జ్ఞానము కలిగించుచున్నట్లు అనుమానము వచ్చును. దీర్ఘశష్కులీ భక్షణమున ఒకేసారి గంధాది అనేక విషయముల జ్ఞానము కలుగుట వలన అట్టి భ్రాంతి కలుగును. ఒక సూదిని కమలపత్రములలోనికి గుచ్చినప్పుడు

---

1. అణుత్వమథ చైకత్వం ద్వౌ గుణౌ మనసః స్మృతౌ (చ.శా. 1/[illegible]0)

ఒకదాని తరువాత ఒక పత్రమును సూది భేదించినను ఒకేసారి జరిగినట్లు అని పించినటులగనే అణు గుణముగలది ఆశుకారి అగుటవలన వెంట వెంటనే ఒక ఇంద్రియమునుండి మరొక ఇంద్రియమునకు మారుచు, వాని వాని జ్ఞానములను కలిగించుచుండును.[1]

ఒక మనిషిలో మనస్సు ఒకటిగనే ఉన్నప్పటికి అది అనేక విధములుగా కనిపించును. అనగా వేరు వేరు విషయములను గ్రహించుచుండును. శీలప్రవర్త నాదులలోగూడా కొన్ని మార్పులు కనిపించును. ఒకే వ్యక్తి ఒకసారి క్రోధము గను మరొకసారి శాంతముగను గనిపించును. ఈ ప్రశ్నకు చరకమున ఒక కాలమున మనస్సు ఒకే గుణముతోనే ఉండును. అనగా సాత్విక, రాజస లేక తామస గుణబాహుల్యతననుసరించి పురుషుడు ఆయా గుణ యుక్త పురుషుడుగా పేర్కొనబడును [2] మనస్సు అణుత్వ ఏకత్వ గుణములతోపాటు చంచలత్వ లేక చలత్వగుణము కలిగియుండుటచే మాటి మాటికి మారుచుండును. మనస్సు

---

1. i) న్యా.ద. 3/2-60 ii) వై.ద. 3/2-3

iii) న చ దీర్ఘశష్కులీభక్షణాదౌ జ్ఞానేంద్రియజ్ఞానాత్ జ్ఞానయౌగపద్యమితి వాచ్యమ్ తత్రాఽపిక్రమోఽస్తి న చ విచ్ఛేదానోఽపి మనసః ఆశు సంచరాత్ ఉత్పలపత్రశతవ్యతిభేదవత్ న గృహ్యతే తత్రయౌగపద్య ప్రత్యయస్తుభ్రాన్త ఏవ (విశ్వనాధకారికా 385)

2. i) స్వార్థేంద్రియార్థ సంకల్ప వ్యభిచరణాచ్చానేకమేకస్మిన్ పురుషే సత్త్వం రజస్తమస్సత్త్వగుణయోగాచ్చ నచానేకత్వం నహ్యేకం హ్యేకకాలమనే కేషు ప్రవర్తతే తస్మాన్నైకకాలా సర్వేంద్రియప్రవృత్తిః (చ.సూ.8/5)

ii) యద్గుణం చాభీక్ష్ణం పురుషమనువర్తతే సత్త్వం తత్సత్త్వమేవోపదిశన్తి ఋషయో బాహుల్యానుశయాత్ (చ.సూ. 8/6)

iii) నానావిధాని ఖలు సత్త్వాని తాని సర్వాణ్యేకపురుషే భవన్తి న చ భవన్త్యేక కాలం ఏకం తు ప్రాయోవృత్త్యాఽఽహ (చ.శా. 3/19)

అందుచేతనే అన్ని జ్ఞానేంద్రియ విషయముల జ్ఞానమును పొందగలుగును.[1] మనస్సునకు చంద్రుడు దేవత. అందుచేతనే మనస్సు చంద్రుని చూచినపుడు ఆహ్లాదమును పొందును.[2]

మనస్సు త్రిగుణాత్మకమైనది. అనగా సాత్విక, రాజస, తామస గుణములు మనస్సుపై ఆధిపత్యము చేయుచుండును. అందుచేత మనస్సు త్రివిధములుగా చెప్పబడుచుండును. వీనిలో శుద్ధము లేక సాత్విక సత్వము కల్యాణాంశ కలిగినదగుటచే దోషరహితముగా నుండును. రాజస మనస్సునందు రోషాంశ(క్రోధము) ప్రధానముగా నుండుటచే దోషయుక్తముగా నుండును. తామస సత్త్వమునందు మోహాంశ ప్రధానముగా నుండుటవలన అదిగూడా దోషయుక్తముగా నుండును.[3]

ఈ మూడు విధములగు సత్త్వములు ప్రత్యేకముగా తరతమాది భేదముల వలనను, శరీర విశేషముల వలనను, యోని విశేషములవలనను, మనశ్శరీరములు పరస్పరము అనుసరించుట వలనను అపరిసంఖ్యేయ భేదములను కలిగియుండును.[4] సత్త్వము శరీరము ననుసరించును శరీరముకూడా సత్త్వము ననుసరించును. వానిలో కొన్ని సత్వభేదములు ఉదాహరణ రూపముగా వర్ణింపబడినవి. అవి ప్రథమ పత్రి విషయమునందు చూడవగును.

---

1. ఏవం త్రిగుణత్వాచ్చిత్త స్త్వచలం చగుణవృత్తమితి ప్రతిక్షణ పరిణామోఽనుమీయతే (యోగసూత్ర పా 3/15)
2. మనసశ్చంద్రమాః (సు. శా. 1/7)
3. త్రివిధం ఖలు సత్త్వం శుద్ధం రాజసం తామసమితి తత్ర శుద్ధమదోష మాఖ్యాతం కల్యాణాంశత్వాత్ రాజసం సదోషమాఖ్యాతం రోషాంశత్వాత్ తథాతామసమపి సదోషమాఖ్యాతం మోహాంశత్వాత్ (చ.శా. 4-36)
4. తేషాం చ త్రయాణామపి సత్త్వానామేకైకస్య భేదాగ్రమపరిసంఖ్యేయం తరతమయోగా చ్ఛరీరయోని విశేషేభ్యశ్చాన్యోన్యానువిధానత్వాచ్చ శరీర మపిసత్త్వమను విధీయతే సత్త్వం చ శరీరం (చ.శా. 4/36)

ఈ త్రిగుణములను గురించి ఆయుర్వేదమునందేకాక ఇతర భారతీయ దర్శన, ఆధ్యాత్మిక గ్రంథములందుగూడ అతి విస్తృతమైన వర్ణనలు కలవు. రజోగుణమును తమోగుణమును జయించి సత్వగుణమును అభివృద్ధి చేయుటయే భారతీయ తత్వశాస్త్రముల పరమావధి. మానవుడు స్వార్థమును సంకుచితత్వమును విడనాడి లోక కల్యాణమునకు పాటుపడుటను, విషయ లోభములను వదలి నిరాడంబరమైన శుచికరమైన సాత్విక జీవనమును గడపవలెనని అది ఇహపర సాధకమని భారతీయశాస్త్రములు భగవద్గీతవంటి గ్రంథములు మాటిమాటికి ప్రబోధించుచున్నవి. అట్టి ఆచార విచార వ్యవహారాదులు మానసిక స్వాస్థ్యసంరక్షణకు మనఃప్రసాదమునకును ఎంతో సహకరించును.

బహుశా ఈ భావములు భారతీయులలో జీర్ణించుకొని యుండుట చేతనే మన దేశమున మానసిక వ్యాధిగ్రస్తుల నిష్పత్తి కొన్ని పాశ్చాత్య దేశములకన్న ఎంతో తక్కువగా ఉన్నట్లు అంచనా వేయబడినది.

భగవద్గీతలో భూలోకమున గాని స్వర్గలోకమునగాని దేవతల యందుగాని ఎచ్చటను ఈ మూడు గుణములతోకూడి యుండని వస్తువు ఏదియును ఉండదని త్రిగుణములనుగూర్చి అతి వ్యాపకమైన స్వభావమును వివరించబడెను.[1]

ఈ సత్వ రజస్తమో గుణములు ప్రకృతినుండి పుట్టి అవ్యయమైన ఆత్మను దేహమునందు బంధించుచున్నవి. భారతీయాధ్యాత్మ శాస్త్రసారమువంటి భగవద్గీత యందు త్రిగుణములను గురించి విస్తృత వర్ణనకలదు. ఆయా గుణములుగల మనుజుల లక్షణములు, వారి ఆలోచనలు, జ్ఞానము, బుద్ధి, ధైర్యము, కర్మలు,

---

1. న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
   సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః (భ.గీ. 18/40)

ii) సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః
   నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ (భ.గీ. 14/5)

ఇష్టములు (సుఖములు) ఆహారములు మొదలైనవి తెలుసుకొనుట మానస రోగ విజ్ఞానము నందెంతో సహకరించును. ఆయుర్వేదోక్త త్రిగుణ వివేచనానంతరము పై వాని సంక్షిప్త వివరణ మివ్వబడును.

## త్రిగుణములతో కూడిన పురుషుల లక్షణములు

సంక్షిప్తముగా సత్త్వ సామాన్య లక్షణములు సత్త్వకాయ భేదముల పేర్లు ఈ క్రింద ఇవ్వబడినవి.

సాత్త్విక పురుష లక్షణములు- అక్రూరత సంవిభాగము చేసి అనుభవించు స్వభావము, క్షమ, సత్యము, వాక్కు- శరీర మనస్సులతో ధర్మకార్యములు చేయుట, ఆస్తిక్యము, ఆత్మజ్ఞానము, బుద్ధి (ప్రతిభ) మేధ (గ్రంధస్థ, భాషణస్థ విషయములను అర్థము చేసికొను బుద్ధి), స్మృతి, ధైర్యము, నిస్పృహత— ఈ లక్షణములు కలిగియుండును.

ఏడు విధములుగా సాత్త్విక కాయములు వర్ణింపబడినవి అవి 1. బ్రహ్మ, 2. ఋషి, 3. ఇంద్ర, 4. వరుణ, 5. యమ, 6. కుబేర, 7. గన్ధర్వ.[2]

మనుజుల యందు సత్వ భేదములు ఏర్పడుటకు కారణములు అనేకముగా యుండును. ఉదా: మాతాపితరుల యొక్క మన స్తత్వము, గర్భావస్థలో ఉండగా తల్లి యొక్క మనస్సును ప్రభావితము చేయు విషయములు; పూర్వజన్మ కృతమైన కర్మలు; జన్మాంతరము పెరిగిన వాతావరణము అభ్యాసాదులు.[3]

---

1. సాత్త్వికాస్తు- అనృశంస్య సంవిభాగరుచితా తితిక్షా సత్య ధర్మమాస్తిక్యం జ్ఞానం బుద్ధిర్మేధా స్మృతి ర్ధృతి రనభిషంగశ్చ (సు.శా. 1/18)
2. శుద్ధస్య సత్త్వస్య సప్తవిధో బ్రహ్మర్షి శక్ర వరుణ యమ కుబేర గంధర్వ సత్వానుకారేణ (చ.శా. 4/40)
3. సత్త్వవైశేష్యకరాణి పునస్తేషాం తేషాం ప్రాణినాం మాతాపితృసత్త్వాన్యన్తర్వత్న్యాః శ్రుతయశ్చాభీక్ష్ణం స్వోచితం చ కర్మ సత్త్వవిశేషాభ్యాసశ్చేతి (చ.శా. 8/16)

రాజస పురుషుల లక్షణములు— అతిదుఃఖించుట, అటనశీలత (నిర్వ్యాపారముగా తిరుగుట) అధైర్యము, అహంకారము, అసత్య భాషణము, నిర్దయతో కూడి యుండుట, దంభము, మానము, హర్షము, కామము క్రోధము— ఈ లక్షణములు కలిగి యుండును.[1]

రాజసకాయములు ఆరు విధములుగా వర్ణింపబడినవి. అవి 1. అసుర, 2. రాక్షస, 3 పిశాచ, 4. సర్ప, 5. ప్రేతసత్వము, 6. శాకునసత్వము.[2]

తామస పురుష లక్షణములు— విషాదము (శోకము), నాస్తికత్వము, అధర్మశీలత, బుద్ధిహీనత, అజ్ఞానము, దుష్టబుద్ధి, అకర్మశీలత్వము, నిద్రాళుత్వము— ఈ లక్షణములు కలిగి యుండును.[3]

తామసకాయములు మూడు విధములుగా నుండును. అవి- 1. పశుసత్త్వము, 2. మాత్స్యసత్వము, 3. వానస్పత్య సత్త్వము.[4]

చరకుడు తగిన ఉపచారము చేయుటకై ఈ సత్వముల గుణములు వర్ణింపబడెనని పేర్కొనెను.[5] అనగా ఈ సత్త్వములు ప్రాకృతికముగనే ఉండునవి ఐనప్పటికిని- వాత ప్రకృతి, పిత్త ప్రకృతి, కఫ ప్రకృతులవ

---

1. రాజసాస్తు దుఃఖబహులతా ఽటనశీలతాఽధృతిరహంకార ఆనృతికత్వమకారుణ్యం దమ్భో మానో హర్షః కామః క్రోధశ్చ (సు.శా. 1/18)
2. రాజసస్య షడ్విధో దైత్యరాక్షస పిశాచ సర్ప ప్రేత శకుని సత్త్వానుకారేణ (చ.శా. 4/40)
3. తామసాస్తు విషాదిత్వం నాస్తిక్యమధర్మశీలతా బుద్ధేర్నిరోధోఽజ్ఞానం దుర్మేధస్త్వమకర్మశీలతా। నిద్రాళుత్వం చేతి (సు.శా. 1/18)
4. తామసస్య త్రివిధః పశు మత్స్య వనస్పతి సత్త్వానుకారేణ కథం చ యథా సత్త్వముపచారః స్యాదితి (చ.శా. 4/40)
5. యథా సత్త్వముపచారః స్యాదితి (చ.శా. 4/40)

కొన్ని కొన్ని మానసిక వ్యాధులకు ఒనగా అయా మనోదోష ప్రధానములైన మానసిక వ్యాధులకు అతి శీఘ్రముగా దారితీయునని సూచించెను. అందుచేత ఆయా వ్యాధులను నిరోధించుటకు వ్యాధులు కలిగియున్నవారికి ఉపచరించుటకు వారి మానసిక ప్రకృతి తెలిసియుండుట అవసరము.

దశవిధ పరీక్షలలో గూడా సత్వము పేర్కొనబడింది— శారీరక వ్యాధులందు గూడా మనస్సును పరీక్షించవలసిన ఆవశ్యకత ఆయుర్వేదమునందు బాగుగా గుర్తింపబడినది. మనస్సుకు సంబంధించిన రెండు అంశములు దశవిధ పరీక్షలలో స్థానమును పొందినవి. అవి 1. సత్త్వ సారము, 2 సత్త్వ పరీక్ష.

1. సత్త్వసార లక్షణములు— సార పరీక్షలలో సత్త్వసారము 8వది. మిగిలిన ఏడును ధాతుసారములు. రసమునుంచి శుక్రమువరకు ఉన్న సారములు ఒకదానికన్నా ఒకటి ఉత్కృష్టమైనవి. వాటన్నింటికన్న ఉత్కృష్టమైనదే సత్త్వసారము. సత్త్వసార పురుషుడు స్మరణశక్తి కలిగియుండును. భక్తి, కృతజ్ఞత, ప్రాజ్ఞత (బుద్ధిమన్తుడుగనుండుట), శుచిత్వము, అధిక ఉత్సాహము, దక్షత్వము (చాతుర్యము), ధీరత్వము, సమరములందు పరాక్రమముతో యుద్ధము చేయుట అనగా ఎట్టి క్లిష్టపరిస్థితులనైనను ఎదుర్కొను మనస్తత్వము కలిగియుండుట, విషాదములేశమాత్రము లేకుండుట— ఈ లక్షణములు కలిగియుండును. అతని గతి నడక సువ్యవస్థితముగా నుండును. స్థిరముగా నుండును. అతని బుద్ధి, చేష్టలు గూడా సువ్యవస్థితముగను. స్థిరముగను ఉండును. కళ్యాణకరమైన విషయములందు అభినివేశము కలిగియుండును— ఈ విధమైన లక్షణములు, గుణములు కలిగినవాడు సత్త్వసార పురుషుడనబడును. ఈ గుణములు సాత్త్వికపురుష గుణ లక్షణములకు తుల్యముగా నుండుట గమనింపదగిన విషయము.[1]

---

1. స్మృతిమన్తో భక్తిమన్తః కృతజ్ఞాః ప్రాజ్ఞాః శుచయో మహోత్సాహా
దక్షా ధీరాః సమరవిక్రాన్తయోధిన స్త్యక్తవిషాదాః సువ్యవస్థితగతి
గంభీర బుద్ధిచేష్టాః కల్యాణాభినివేశనశ్చ సత్త్వసారాః
తేషాంస్వలక్షణై రేవ గుణా వ్యాఖ్యాతా (చ. వి. 8/110)

## సత్త్వపరీక్ష

సత్త్వమనగా మనస్సు. మనస్సు శరీరమునకు ఆత్మసంయోగముచే ప్రేరణ కలిగించుచుండును. బల భేదము ననుసరించి సత్త్వము మూడు విధములుగా నుండును. అవి—

1. ప్రవర సత్త్వము
2. మధ్యమ సత్త్వము
3. అవర సత్త్వము.[1]

**1. ప్రవర సత్త్వ లక్షణములు:-**

సత్త్వసారమునందు చెప్పబడిన లక్షణములు కలవారు ప్రవరసత్త్వము కలవారుగా ఉందురు. వీరు అల్పశరీరమును కలిగి ఉన్నప్పటికిని సత్త్వగుణము అధికముగా ఉండుటచేత నిజాగంతు కారణములచే కలిగిన పెద్ద వ్యాధులను గూడా తట్టుకొనుచు వ్యాకులతను పొందకుండా యుందురు.

2. మధ్యమసత్త్వ లక్షణములు— ఇతరులతో పోల్చుకొనిగాని చూచిగాని లేక ఇతరుల ఓదార్పువలనగాని బాధలను సహించెదరు.

3. అవరసత్త్వముగలవారల లక్షణములు — అవరసత్త్వము గలవారు స్వయముగా గాని, ఇతరులను చూచి గాని, ఇతరులచే ఓదార్పబడిన గాని కష్టములను సహింపలేరు. విపత్తులు కలిగినపుడు రోదించుచు బాధపడుదురు. పెద్ద శరీరము కలవారైనప్పటికిని చిన్న బాధను గూడా సహింపలేరు. భయము, శోకము, లోభము, మోహము, మానము (గర్వము) ఈ గుణములతో కూడి యుందురు.

---

1. సత్త్వతశ్చేతి-సత్త్వముచ్యతే మనః తచ్ఛరీరస్యత న్త్రకమాత్మసంయోగాత్ తత్త్రివిధం బలభేదేన ప్రవరం మధ్యమవరం చేతి అతశ్చప్రవర మధ్యావరసత్త్వాశ్చ భవన్తి పురుషాః (చ.వి. 8/119)

రౌద్ర, భైరవ, అప్రియ భీభత్స, వికృతకరములైన విషయములను, కథలను వినుటవలనను, జంతువుల లేక మనుష్యుల మాంసమును గాని రక్తమును గాని చూచుటవలనను గాని దుఃఖము, వివర్ణత్వము, మూర్ఛ, ఉన్మాదము, భ్రమ, ప్రపతనము మొదలగువానిలో ఏ వ్యాధియైనను లేక మరణమునైనను పొందుదురు.[1]

భగవద్గీత ఆధారముగా త్రిగుణముల వివరణ.

## సత్త్వ గుణము

సత్త్వగుణము నిర్మలమైనదిగను, ప్రకాశమును కలుగ చేయునదిగను, ఉపద్రవము లేనిదిగను ఉండును. అయినను సుఖమునందు జ్ఞానమునందు గల ఆసక్తి చేత జీవుని (ఆత్మను) బంధించు చుండును.[2] సత్త్వగుణము ఆత్మను సుఖమునందు చేర్చును.[3]

---

1. తత్ర ప్రవరసత్త్వాః సత్త్వసారాః తే సారేషూపదిష్టాః స్వల్పశరీరా హ్యపి తే నిజాగన్తునిమిత్తాసు మహతీష్వపి పీడాస్వవ్యగ్రా దృశ్యన్తే సత్త్వగుణవైశేష్యాత్ మధ్యసత్త్వాస్త్వవరానాత్మన్యుపనిధాయ సంస్తంభయన్త్యాత్మనాఽఽత్మానం పరైర్వాపి సంస్తభ్యన్తే హీనసత్త్వాస్తు నాత్మనా, న చ పరైః సత్వబలం ప్రతిశక్యన్తే ఉపస్తంభయితుం మహాశరీరా హ్యపి తే స్వల్పానామపి వేదనానామసహా దృశ్యన్తే సంనిహితభయశోకలోభమోహమానా రౌద్రభైరవద్విష్టభీభత్సవికృతసంకథాస్వపి చ పశుపురుషమాంసశోణితాని చావేక్ష్య విషాదవైవర్ణ్యమూర్ఛోన్మాదభ్రమ ప్రపతనానామన్యతమమాప్నువన్త్యథవా మరణమితి(చ.వి.8/119)
2. తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశకమనామయమ్ సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ (భ.గీ. 14/6)
3. సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత (భ.గీ. 14/9)

సత్త్వగుణము అధికముగా గల మనుజుని సర్వద్వారముల (ముఖ శ్రోత్ర నేత్రాది ద్వారముల)నుండి ప్రకాశ రూపమగు జ్ఞానము, సాత్త్వికత వెల్లివిరియు చుండును.[1] సత్త్వగుణోపేతులు జ్ఞానవంతులు మరణానంతరముగూడా ఉత్తమ లోకములను పొందుదురు.[2]

సాత్త్విక కర్మలు చేయువానికి సత్త్వ గుణసంబంధమైన నిర్మల సుఖము ఫలముగా గలుగును.[3] జ్ఞానము, ఊర్ధ్వగతులు కలుగును.[4]

సాత్త్వికాహారములు-ఆయువును, సత్త్వబలమును, మనో బలమును, ఆరోగ్యమును, సుఖమును ప్రీతిని విశేషముగా వృద్ధినొందించు నవియు, రస యుక్తమై, స్నిగ్ధ స్థిరగుణములు కలిగి మనస్సునకు ఇంపును కలిగించు నవియు అగు ఆహారములు సాత్త్విక గుణము కలవారికి ప్రియమైనవిగా నుండును.[5]

సాత్త్విక యజ్ఞము. (ఏ మంచి పనికైనను యజ్ఞము అను పదము వర్తిం

---

1. సర్వద్వారేషు దేహేఽస్మిన్ప్రకాశ ఉపజాయతే జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత (భ.గీ. 14/11)

2. యదా సత్త్వేతు ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్ తదోత్తమ విదాం లోకానమలాన్ ప్రతిపద్యతే (భ.గీ. 14/14)

3. కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలంఫలమ్ రజసస్తు ఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్ (భ.గీ. 14/16)

4. సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసోలోభ ఏవ చ ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థామధ్యేతిష్ఠన్తి రాజసాః జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛన్తి తామసాః (భ.గీ. 14/17-18)

5. రస్యాః అస్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః (భ.గీ. 17/8)

చును.) చేయుదగిన శాస్త్ర సమ్మతమైన యజ్ఞము లేక సత్కార్యము ఫలాపేక్ష లేకుండగా నిర్వర్తించుట సాత్త్వికి యజ్ఞమనబడును.[1]

సాత్త్వికి తపము :

సాత్త్వికి తపము మూడు విధములు - అవి శారీరక తపము, వాచికతపము మరియు మానసిక తపము, ఆయుర్వేద గ్రంథములందు శారీర, వాచిక, మానసిక హీనమిథ్యాతి యోగములు ప్రజ్ఞాపరాధము అనబడును. ఈ ప్రజ్ఞాపరాధమే అన్ని వ్యాధులకు ముఖ్యముగా మానసరోగములకు కారణముగా నుండును.[2] ప్రజ్ఞాప రాధమును వర్జించుట ఆరోగ్యమునకు కారణమని చెప్పబడినది. ఈ త్రివిధ తపములను ఆయుర్వేద దృష్టితో కాయిక, వాచిక, మానసిక సమ్యగ్యోగములుగా భావింపవచ్చును. ప్రజ్ఞాపరాధ వివరణము ముందు కలదు.

చరక సంహితాది గ్రంథములలో ఇహపర హితమును గోరు మనుజుడు మనో వాక్కాయ కర్మలకు సంబంధించిన నిందిత కర్మలు వదల వలయుననియు అట్లు చేసినచో ధర్మార్థ కామములను సుఖమును పొంది ముఖ్య ఫలితములను పొందగలడని చెప్పబడును.[3] ఈ త్రివిధ తపములకు ఆయా కర్మలకు సంబంధించిన వర్జనీయ అశస్త్ర కర్మలకు సంబంధము కలదు.

---

1. అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టోయఇజ్యతే
యష్టవ్యమేవేతి మనస్సమాధాయనసాత్త్వికః (భ.గీ. 17/14)

2. చ. సూ. 11/39

3. i) ఇమాంస్తుధారయేద్వేగాన్ హితైషీ ప్రేత్యచేహచ
సాహసానా మశస్తానాం మనోవాక్కాయకర్మణామ్॥ (చ.సూ. 1/26)

ii) పుణ్యశబ్దోవిపాపత్వా న్మనో వాక్కాయకర్మణామ్ ధర్మార్థకామాన్
పురుషః సుఖీ భుక్తే చినోతి చ (చ.సూ. 7/30)

శారీరక తపము :

దేవతలను, ద్విజులను (బ్రహ్మనిష్ఠులను) గురువులను, జ్ఞానులను పూజించుట, బాహ్యాభ్యంతర శుచిత్వము కలిగియుండుట, ఆర్జవము (ఋజువర్తనము) కలిగియుండుట, బ్రహ్మచర్యము, అహింస వీనిని పాలించుట - ఇవి శారీరక తపములు.[1]

ఇతరులకు బాధను కలిగించు శారీరక కర్మలు, పరస్త్రీ సంభోగము, చౌర్యము, హింసించుట-ఈ శారీరక వేగములను వర్జింప వలయునని చరకునిచే చెప్పబడెను.[2]

వాచిక తపము :

ఇతరులకు బాధను కలిగింపని (అనుద్వేగముగా నుండు) మాటలను, సత్యమైనవి, ప్రియమైనవి హితమైనవిగా నుండు విషయములను చెప్పవలయును. స్వాధ్యాయము, తన వృత్తికి లేక శాస్త్రమునకు సంబంధించినవిగాని వేదాది గ్రంథములను గాని అధ్యయనము చేయుట-ఇవి వాచిక తపమనబడును.[3]

చరకుడు-అతికఠోరముగా నుండు వచనములు, ఇతరులపై కొండెములు చెప్పుట, అసత్యములు, అసందర్భమైన విషయములు, విముఖత్వమును కలిగించు విషయములు-వీనిని చెప్పుటను వర్జింపవలయును.[4]

---

1. దేవద్విజగురుప్రాజ్ఞపూజనంశౌచమార్జవమ్
   బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే (భ.గీ. 17/14)
2. దేహప్రవృత్తిర్యాకాచిద్వర్తతే పరపీడయా స్త్రీభోగస్తేయహింసాద్యా
   తస్యా వేగ్వాధారయేత్ (చ.సూ. 7)
3. అనుద్వేగకరం వాక్యం సత్యంప్రియహితం చ యత్
   స్వాధ్యాయాభ్యసనం చైవ వాంజ్మయం తప ఉచ్యతే (భ.గీ. 17/15)
4. పరుషస్యాతి మాత్రస్య సూచకస్యానృతస్య చ వాక్యస్యాకాలయుక్తస్య
   ధారయేద్వేగముత్థితమ్ (చ.సూ. 7/28)

**మానసిక తపము :**

మనస్సును ప్రసాదముగా నుంచుకొనుట (అనగా నిర్మలముగా రజోతమో గుణములచే ఆవృతము కానీయకుండా చూచుకొనుట) సౌమ్యమైన మనస్సును కలిగియుండుట (సౌమ్య స్వభావము) మౌనముగా నుండుట, ఆత్మనిగ్రహము (మనస్సును అహితమైన అర్థములవైపు పోనీయక నిగ్రహించుట) శుద్ధమైన శ్రేష్ఠమైన భావములు కలిగియుండుట-ఇవి మానసిక తపమనబడును.[1]

లోభము, శోకము, భయము, క్రోధము, అహంకారము, నిర్లజ్జత, అధిక రాగము, ఈర్ష్య, అభిధ్యా (ఇతరుల ధనము తీసికొను ఇచ్ఛ) - ఇవి వర్జింప తగిన మానస వేగములు.[2]

ఫలాపేక్ష లేకుండగను, అధిక శ్రద్ధతో ఆచరించబడిన పైమూడు తపములు సాత్త్విక తపములు.[3]

సాత్త్విక దానము-దేశకాల పాత్రములను గుర్తెరిగి ఈయవలసిన దానమును ఉపకారము కోరకుండగనే యిచ్చుట సాత్త్విక దానము.[4]

సాత్త్విక జ్ఞానము-వేరువేరుగా నున్న ప్రాణులన్నింటియందును నిత్యమగు ఆత్మ ఒకటియేనను జ్ఞానము సాత్త్విక జ్ఞానము.[5]

---

1. మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః
   భావసంశుద్ధిరిత్యేత త్తపో మానస ముచ్యతే (భ.గీ 17/16)
2. లోభశోకభయక్రోధమానవేగాన్ విధారయేత్ నైర్లజ్జ్యేర్ష్యాతి రాగాణా మభి ధ్యాయాశ్చ బుద్ధిమాన్ (చ.సూ. 7/27)
3. శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్త్రివిధం నరైః
   అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే (భ.గీ. 17/17)
4. దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే
   దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ (భ.గీ. 17/20)
5. i) సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే
   అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ (భ.గీ. 18/20)
   ii) ఆత్మవత్సతతం పశ్యేదపి కీటకం

సాత్త్వికకర్మ- శాస్త్రవిహితకర్మను సంగముగాని, రాగద్వేషములుగాని ఫలాపేక్షగాని లేకుండాచేయుట సాత్త్వికకర్మ అనబడును[1].

సాత్త్వికకర్త- ధైర్యము, ఉత్సాహము కలిగి, సంగము అహంకారము వదలి జయాపజయములను సమానముగా భావించు మనుజుడు సాత్త్వికకర్త అనబడును.[2]

సాత్త్విక బుద్ధి- ప్రవృత్తిని (కర్మమార్గమును) నివృత్తిని (అధర్మము నుండి నివృత్తిని) కార్యాఽకార్యములను, భయాఽభయములను, బంధమును, మోక్షమును-వీటిని గురించి తెలిసికొనుచున్న బుద్ధి సాత్త్వికబుద్ధి అనబడును[3] అనగా సాత్త్వికబుద్ధి మనస్సును సాత్త్వికమార్గమున నడిపించును.

సాత్త్విక ధైర్యము- మనస్సును, ప్రాణములను, ఇంద్రియములయొక్క క్రియలను యోగసాధనచేత (ఏకాగ్రచిత్తముచేత) చలింపని ధైర్యముతో నిగ్రహించియుండుట సాత్త్విక ధైర్యమనబడును.[4]

సాత్త్విక సుఖము- అభ్యాసముచేత ఆనందమును, దుఃఖశాంతిని పొందగలుగునది సుఖము అనబడును. ఆత్మకు బుద్ధికి ప్రసాదత్వమును కలిగించు

---

1. నియతం సంగరహితమరాగద్వేషతః కృతమ్
   అఫలప్రేప్సునా కర్మయత్తత్సాత్త్వికముచ్యతే (భ.గీ. 18/23)
2. ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః
   సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే (భ.గీ. 18/26)
3. ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే
   బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ (భ.గీ. 18/30)
4. ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః
   యోగేనావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ (భ.గీ. 18/33)

నదియు ప్రారంభమున విషమువలె నుండి అమృతమువలె అనంతరము పరిణమించు సుఖము సాత్త్విక సుఖమనబడును.[1]

**రజో గుణము:**

రజోగుణము రాగాత్మకముగా (దృశ్యవిషయములందు ప్రీతిని కలిగించునదిగా) నుండి తృష్ణను (లభింపని వస్తువులయందు అభిలాషను) సంగమును (తన వస్తువులను వదలలేకపోవుట) కలిగించి దేహమునందుండు ఆత్మను కర్మయందలి ఆసక్తిచేత పూర్తిగా బంధించుచున్నది.[2] ఈ విధముగా ఆత్మను రజోగుణము కర్మలయందు చేర్చును.[3]

రజోగుణము వృద్ధి చెందినపుడు కార్యములందు ప్రవృత్తి, నిషిద్ధకర్మాదులను ఆరంభించుట, ఆశ, ఇంద్రియ నిగ్రహము లేకపోవుటచే మనశ్శాంతి లేకుండుట- ఈ లక్షణములు కలుగును.[4] రజోగుణ సంబంధమైన కర్మలచే ఫలితముగా దుఃఖము కలుగును.[5] రజోగుణముచే లాభము కలుగును. మరణానంతరము మనుష్యలోకమున జన్మింతురు.[6]

---

1. సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్ (భ. గీ. 18/36-37)
2. రజోరాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్ తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మసంగేన దేహినమ్ (భ.గీ. 14/7)
3. భ. గీ. 14/9
4. లోభః ప్రవృత్తిరారమ్భః కర్మణామశమః స్పృహా రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ (భ. గీ. 14/12)
5. భ. గీ. 14/16
6. భ. గీ. 4/17-18

రాజస ఆహారము-అధికమైన కటు, అమ్ల, లవణ ఉష్ణ, తీక్ష్ణ, రూక్ష, విదాహికరముగా నుండు ఆహారములు రాజసాహారములుగానుండును. ఇవి దుఃఖమును, శోకమును, ఆమయములను (వ్యాధులను) కలిగించునవిగా నుండును.[1]

సాత్త్విక యజ్ఞములు, కర్మలు — ఫలాపేక్షతోను, దంభముకొరకును, అధిక ప్రయాసతోనైనను చేయబడు యజ్ఞములు, ఇతర కర్మలు రాజసములు.[2] ఇతరులచే తాను సత్కారము పొందవలెనను ఉద్దేశ్యముతో, దంభము కొరకు ఆచరింపబడు తపస్సువంటి కాయిక, వాచిక, మానసిక కర్మలు రాజస తపమనబడును. ఇవి అస్థిరమై అనిశ్చిత ఫలముకలవై యుండును.[3] అనగా ఇతరుల అభిమానమును పొందవలెనను ఉద్దేశ్యముతో అన్ని సత్కర్మలు వారు చూచుచుండగా చేయుచు తమపని వదలివేయుచుందురు.

రాజసదానము- ప్రత్యుపకారమును, తిరిగి ఫలితమునాశించియు లేక అతి కష్టముమీద ఇవ్వబడుదానము రాజసదానము.[4]

---

1. కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారా రాజసస్యేష్టా దుఃఖ శోకామయప్రదాః (భ.గీ. 17/9)

2. i) అభిసంధాయ తు ఫలం దంభార్థమపిచైవ యత్ ఇజ్యతే భరత శ్రేష్ఠ తం
యజ్ఞం విద్ధిరాజసమ్ (భ.గీ. 17/12)

ii) యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్ (భ.గీ. 18/24)

2. సత్కారమానపూజార్థం తపోదంభేన చైవ యత్
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ (భ.గీ. 17/18)

3. యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ (భ.గీ. 17/21)

మనుజులను, ప్రాణులను, అనేకత్వముగా భావించుట (తనవారు పైవారు అను) భేదభావమునకు ఈ గుణము దారితీయును.[1]

అనురాగము, కర్మలందు ఇచ్ఛ, లోభత్వము, హింసాత్మకత, అశుచిత్వము, జయాపజయములందు హర్షశోకములు-ఇవి రాజసకర్తయొక్క లక్షణములు.[2]

రాజసబుద్ధి- ధర్మాధర్మములను కార్యాకార్యములను ఉన్నదున్నట్లుకాక వేరుగా (విరుద్ధముగా) తెలుసుకొను బుద్ధి రాజసబుద్ధి.[3]

విషయేంద్రియ సంబంధముచే మొదట అమృతమువలె నుండి పరిణామమున విషతుల్యముగా నుండు సుఖము రాజస సుఖమనబడును.[4]

ధర్మ, అర్థకామములను ఫలాపేక్షకలిగి మిగుల ఆసక్తితో అనుష్ఠించుచుండుట రాజసధృతి అనబడును.[5]

---

1. పృథక్త్వేన తు యజ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్
   వేత్తి సర్వేషు భూతేషు తజ్ఞానం విద్ధి రాజసమ్ (భ.గీ. 18/21)
2. రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
   హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః (భ.గీ. 18/27)
3. యయా ధర్మమధర్మం చ కార్యం చ కార్యమేవ చ
   అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ (భ.గీ. 18/31)
4. విషయేంద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్
   పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ (భ.గీ. 18/38)
5. యయాతు ధర్మకామార్థాన్ ధృత్యాధారయతేఽర్జున
   ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ రాజసీ (భ.గీ. 18/34)

తామసగుణము :-

తమోగుణము అజ్ఞానమువలన కలుగును. మోహనము (అవివేకము)ను ప్రమాదము (పరాకు)ను, కలిగించును. ఆలస్యము, నిద్రలచే ఆత్మను బంధించును. తమోగుణము జ్ఞానమును ఆవరించి ప్రమాదము (పరాకు)నందు చేర్చును. తమోగుణము వృద్ధినందినపుడు అప్రకాశము (అవివేకమును)ను, అప్రవృత్తి మరియు పై ఇతర గుణములను వృద్ధిచేయును.[1]

తామస ఆహారము. ఒక యామము క్రితము పక్వము చేసినది, రసము లేక సారము నశించినది, పూతిగంధము కలది, పర్యుషితమైనది, వేరొకరు తినగా మిగిలినవి, అమేధ్యము (మేధస్సునకు హాని కలిగించునది) అగుఆహారము తామసాహారము [2] తామసగుణము కలవారికి ఇది ప్రీతికరముగా నుండును.

తామసయజ్ఞము- విధివిహితము కానిది, అన్నదానము, మన్త్రము, దక్షిణ, శ్రద్ధ- ఇవేవియు లేనిది తామసయజ్ఞము [3]

మూర్ఖపుపట్టుదలతో ఆత్మను బాధించుకొనుచుగాని, ఇతరుల నాశనము కొరకుగాని చేయబడు తపస్సు తామస తపస్సనబడును.[4]

---

1. i) తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్య నిద్రాభిస్తన్నిబధ్నాతి భారత (భ.గీ. 14/8)
ii) భ. గీ. 14/9
iii) అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునందన (భ.గీ. 14/13)
2. యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్ (భ.గీ. 17/10)
3. విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే (భ.గీ. 17/13)
4. మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ (భ.గీ. 17/19

దానమునకు తగని దేశకాలములందు అపాత్రులైనవారికి ఇవ్వబడినదానం అవమానించియు, సత్కార శూన్యముగను ఇవ్వబడినది తామసదానమనబడును.[1]

కారణముగాని, తత్త్వముగాని తెలియని అల్పమైనకార్యము దేనియందైనను అదే సమస్తమగునటుల నిమగ్నమైయుండు జ్ఞానము తామసము.[2]

అనుబంధమును, నాశనమును, తనకుగాని, ఇతరులకుగాని కలుగుహింసను, తన సామర్థ్యమును ఆలోచింపక మోహము (అజ్ఞానము)తో ప్రారంభింపబడు కర్మ తామసకర్మ అనబడును.[3]

చిత్త ఏకాగ్రత లేకుండుట, ప్రాకృత (పామర) స్వభావము కలిగియుండుట, స్తబ్ధత, శఠత్వము (మోసము) ఇతరులను మోసగించి వారి జీవితముపాడు చేయుట, అలసత్వము, విషాదత్వము, దీర్ఘసూత్రత- ఈ లక్షణములు గలవాడు తామసకర్త అనబడును.[4]

తమస్సుచే ఆవృతమగుటచే అధర్మమును ధర్మమనియు అట్లే ఇతర పదార్థములను విరుద్ధముగా తలంచుచున్న బుద్ధి తామసబుద్ధి అనబడును.[5]

---

1. అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే అసత్కృతమవజ్ఞాతం
తత్తామసముదాహృతం (భ.గీ. 17/22)
2. యత్తు కృత్స్నవదేకస్మిన్కార్యే సక్తమహైతుకమ్ అతత్త్వార్థవదల్పం చ
తత్తామసముదాహృతమ్ (భ.గీ. 18/22)
3. అనుబంధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషమ్
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే (భ.గీ. 18/25)
4. అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే (భ.గీ. 18/28)
5. అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సాపార్థ తామసీ (భ.గీ. 18/32)

దుర్బుద్ధిచే నిద్రను, భయమును, శోకమును, విషాదమును, మదమును విడువకుండా యుండు బుద్ధి తామసధృతి తామస ధైర్యమనబడును.[1]

ప్రారంభమునందు తదుపరిగూడా ఆత్మను మోహింపచేయునది, నిద్ర, ఆలస్యము, ప్రమాదము వీనివలన జనించినది అగు సుఖము తామస 'సుఖ' మన బడును.[2]

సత్త్వగుణము అధికముగా నున్నపుడు అది రజోతమో గుణములను అణగదొక్కి ప్రవర్తించును. అదేవిధముగా రజోగుణము సత్త్వతమోగుణము లను, తమోగుణము, సత్త్వరజో గుణములను అణగ దొక్కి ప్రవర్తించు చుండును.

## మనస్సుయొక్క కర్మలు

మనస్సు అచేతనమైనందున ఆత్మచేత చైతన్యమును పొంది ఆత్మ యొక్క క్రియలను నిర్వహించునని మనస్సుయొక్క స్థానమును గురించిన వివ రణలో తెలుపబడింది.[3] అందువలన ఆత్మకు ఆపాదింపబడిన కర్మలు అన్నియు మనస్సుయొక్క జ్ఞానప్రక్రియకూడా అచట వివరించబడింది.

పైన చెప్పబడినవికాక మనస్సు యొక్క కర్మలు ఈ క్రింది విధముగా పేర్కొనబడినవి.

---

1. యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ
   న విముంచాతి దుర్మేధా ధృతిస్సా పార్థతామసీ (భ.గీ. 18/35)

2. యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః
   నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ (భ.గీ. 18/39)

3. చ. శా. 1

చింత్యము, విచార్యము, ఊహ్యము, ధ్యేయము, సంకల్పము, మనస్సు ఇంద్రియ, ఇంద్రియార్థముల సంయోగములతో తెలిసికొను ఇతర విషయములు- ఇవి మనస్సుయొక్క విషయములుగా నుండును. ఇంద్రియాభిగ్రహము, (ఇంద్రియములను వానివాని విషయములందు ప్రవర్తింపచేయుట) తనను తాను అహిత విషయాదులనుండి నిగ్రహించుట, ఊహ,విచారము ఇవన్నియు మనస్సుయొక్క కర్మలుగా చరకునిచే పేర్కొనబడినవి.[1]

మనస్సు అతీంద్రియమని చెప్పబడినది. ఉభయేంద్రియ మనియు చెప్పబడినది. జ్ఞానేంద్రియ కర్మేంద్రియ విషయములన్నియు మనస్సుయొక్క సంబంధము లేకుండనిదే ప్రవర్తింప జాలవు. పంచ జ్ఞానేంద్రియముల విషయములు మనస్సుద్వారానే బుద్ధికి ఆత్మకుచేరును. బుద్ధిద్వారా ప్రేరేపింపబడిన మనస్సే కర్మేంద్రియములను ప్రవృత్తము చేయును.

ఈ ఉభయేంద్రియములకు అతీతమైన చింత్యాది కర్మలుగూడా మనస్సు నిర్వర్తించు చుండును.

చింత్యము- చింత అనునది స్త్రీలింగము. మనస్సు ఎల్లపుడు అనేక విషయములను గురించి చింతించుచుండును. అందుకే 'చిత్' అనికూడా మనస్సుకు పర్యాయము గలదు. సతతమననము చేయునదగుట చేతనే మనస్సు అనబడుచున్నది.[2] పూర్వము అనుభవించిన జ్ఞానమువలన కలిగిన సంస్కారముయొక్క

---

1. చింత్యం విచార్యమూహ్యం చ ధ్యేయం సంకల్ప్యమేవ చ
యత్కించిన్మనసోజ్ఞేయం - - తత్సర్వం హ్యర్థసంజ్ఞకమ్
ఇంద్రియాభిగ్రహః కర్మమనసః స్వస్య నిగ్రహః ఊహో విచారశ్చ తతః
పరం బుద్ధిః ప్రవర్తతే (చ.శా. 1)

2. i) చింత్యతే జ్ఞాయతే అనేన చిత్
ii) చింత్యం యత్ మనఃనానావిషయగతం చింతయతి (ఉపస్కారటీక)
iii) మన్యతే జ్ఞాయతేఽనేనేతి మనః

ఉద్బోధనము లేక పూర్వదృష్ట పదార్థస్మరణము మనస్సుద్వారా జరుగును[1] స్మృతివలననే యీచిన్తనము జరుగుచుండును. స్మృతిని గురించిన వివరణ తదుపరి ఇవ్వబడును.

విచారము :-

విచారమనగా తత్త్వనిర్ణయము. ఏదైనా వస్తువుయొక్క గుణదోషములను గురించిన జ్ఞానమును పొందుటకై చేయు వివేచనము విచారమనబడును.[2]

ఊహ్యము :-

శాస్త్రానుకూల తర్కముద్వారా విషయముయొక్క సంశయ, పూర్వపక్షాదులను నివారించి ఉత్తరపక్ష స్థాపనాది నిర్ణయమునకై చేయు పరీక్షాప్రక్రియ ఊహయనబడును.[3]

ధ్యేయము :-

ధ్యానము అనిగూడా ఇదనబడును. 'ధ్యానము' అనునది ప్రయత్నమును సూచించు పదము. ధ్యేయము అనునది గమ్యమును సూచించువదము.

ఏకాగ్రచిత్తముతో ఒక గమ్యముకొరకు చేయుప్రయత్నము ధ్యానము అనబడును.[4]

---

1. ప్రాగనుభూత జ్ఞానజన్యే సంస్కారోద్బోధే పూర్వదృష్టపదార్థస్మరణే
2. వి+చిర+ధన్+పుం తత్వనిర్ణయే తదనుగుణే వాక్యస్తోమే చ
3. i) ఊహా-స్త్రీ-ఊహ్ధన్టాప్-వితర్కే
   ii) ఊహ్యం తర్క్య (ఉపస్కారటీకా)
   iii) శాస్త్రేణాస్థాపనమ్
4. i) ధ్యాన-నంధ్యా+లుట్ చింతనే చిందస్యైక-తానప్రవాహే
   ii) ద్వైచిన్తాయాం స్మృలోధాతుశ్చిన్తాతత్వేన నిశ్చలా ఏతత్ ధ్యానమిహప్రోక్తమ్
   iii) ధ్యేయం-యత్ ఏకాగ్రేణమనసా భావ్యతే

సంకల్పము :

కర్తవ్యా కర్తవ్యతలను నిర్ణయించి అభీష్టసిద్ధికై సరిగా కల్పించబడిన నిర్ణయము సంకల్పము అనబడును.[1] వీనిలో ఊహ విచారము, సంకల్పము, చిన్తనము మొదలగునవి ఇంద్రియ నిరపేక్షిక మనో వ్యాపారములు.

ఇంద్రియాభిగ్రహము : ఇంద్రియములను వాని వాని విషయము లందు ప్రవర్తింప చేయుట, లేక నిగ్రహింప చేయుట.[2]

మనో నిగ్రహము : మనస్సు తనను తాను అహిత విషయముల నుండి నిగ్రహించుకొనుట.[3]

ఇతర మనోజ్ఞేయ విషయములు :

సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, మొదలగు ఇతర కర్మలు[4]

ఐత రేయ ఉపనిషత్తునందును. బృహదారణ్యకోపనిషత్తు నందును మనో వ్యాపారములను గురించిన వర్ణన కలదు. పతంజలి యోగ సూత్రము నందును మనస్సుయొక్క వర్ణన కలదు. వాటిని గురించి తెలిసికొనుట మనో వ్యాపారము లను అర్థము చేసికొనుటకు అధికముగా సహకరించును.

---

1. (i) సంకల్ప— పుంసమ్— కృవ్-ధన్ సంకల్పేనవినారాజన్ యత్కించిత్ కురుతే నరః

(ii) సంకల్ప్యం-మనసాయత్ సమ్యక్ కల్ప్యతే కర్తవ్యాత్వేన అవధార్యతే (ఉపస్కార టీకా)

2. (i) ఇంద్రియాణాం అభిగ్రహః యథాస్వం విషయేషు ప్రేరణం సదా అస్య మనసః నిగ్రహః అహితాత్ నియమనమ్ (ఉపస్కార టీకా)

3. (i) ఏవం అన్యత్ యత్కించిత్ మనసోజ్ఞేయం మనసాగ్రాహ్యం సుఖదుఃఖేచ్ఛా ద్వేషాదికం తత్ సర్వఅర్థ సంజ్ఞకమ్ (ఉపస్కార టీకా)

ఉపనిషదోక్త మనో వ్యాపారములు.

1. సంజ్ఞానము - (జ్ఞానముతో కూడి యుండుట)
2. ఆజ్ఞానము - (జ్ఞానమును పొందుట)
3. విజ్ఞానము - విశేష జ్ఞానము
4. ప్రజ్ఞానము - సైద్ధాంతీకరణము.
5. మేధా- గ్రహణ శక్తి
6. దృష్టి
7. ధృతి- నిర్ణయము.
8. మతి- అభిప్రాయము
9. మనీషా- ఊహ
10. జూతి (భావించుట)
11. స్మృతి
12. సంకల్పము
13. ఋతు- పనులు చేయుటను గూర్చిన విచారము
14. అసు- జీవితేచ్ఛ
15. కామము
16. వశము- మనస్సును వశము నందుంచుకొనుట[1]

**పతంజలి యోగ సూత్రము ననుసరించి మనో వ్యాపారాదులు.**

చిత్తము యొక్క భూములు లేక అవస్థలు ఈ క్రింది విధములుగా నుండును.

---

1. సంజ్ఞానమాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధాదృష్టి ధృతిర్మతిర్మనీషాజాతిః స్మృతిః సంకల్పః కృతురసుః కామోవశ ఇతి సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవంతి (ఏ. ఉ.3/20)

ఇవి ఐదు.

1. క్షిప్తము - అరతి లేక అశాంతి జ్వరాది వ్యాధులలో కలుగును.

2. మూఢము - మూఢమైన మానసిక స్థితి, మద, మూర్ఛ, సంన్యాసాది వ్యాధులలో కలుగును.

3. విక్షిప్తము - వికృతమైన మనోస్థితి. ఉన్మాద,అపస్మారాదులలో కలుగు స్థితి.

ఈ మూడు స్థితులు మానసిక రోగములతో సంబంధము కలిగియుండును. క్రింది రెండు స్థితులు యోగములచే అభ్యాసముచే సాధించ దగిన ఉచ్ఛ మానసిక స్థితులు.

4. ఏకాగ్రత-విద్యార్థులు, శాస్త్రజ్ఞులు సాధించిన ప్రయోజన కారిగా ఉండు స్థితి.

5. నిరోధము - ఇంద్రియార్థముల నుండి మనస్సును నిరోధించుట.[1]

ఈ స్థితిని చరకుడు గూడా "యోగము"అని పేర్కొనెను. మనస్సును ఇంద్రియములవైపు పోనివ్వక ఆత్మయందే నిలుపుటచే ఆత్మ శరీరమునకు వశమగును. సుఖ దుఃఖాదులు రెండును నివృత్తి చెందును. ఈ స్థితిని యోగమందురు.[2]

---

1. క్షిప్తం మూఢం విక్షిప్తమేకాగ్రం నిరుద్ధమితి చిత్తస్య భూమయః (వ్యాసభాష్య-యోగశాస్త్ర 1/1)

2. ఆత్మేంద్రియమనోర్థానాం సన్నికర్షాత్ప్రవర్తతే సుఖదుఃఖమనారంభా దాత్మస్థే మనసిస్థిరే ॥ నివర్తతే తదుభయం వశిత్వంచోపజాయతే । స శరీరస్య యోగజ్ఞాస్తం యోగమృషయోవిదుః (చ. శా. 1/139)

ఆత్మ విజ్ఞానమును పొందుట, సాత్త్విక గుణము వృద్ధిచేయుట మొదలగు నవి సమాధికి యోగమునకు సహకరించును.

## చిత్తవృత్తులు :

చిత్తవృత్తులు రెండు రకములుగా నుండును.

1. పరి దృష్టి లేక ప్రత్యక్ష ధర్మములు

2. అపరి దృష్టి లేక పరోక్ష ధర్మములు[1]

## 1. పరిదృష్టి లేక ప్రత్యక్ష ధర్మములు:

చిత్తవృత్తులకు సంస్కారము కారణముగా నుండుననియు, తిరిగి సంస్కారమునకు చిత్తవృత్తులు కారణముగా నుండుననియు, ఈ విధముగా ఈ రెండును అన్యోన్యాశ్రితములై బీజ-వృక్ష ధర్మము వలె నుండుననియు చెప్పబడినది.

ఉదా- సద్వృత్తానుష్ఠానము సాత్త్విక గుణవృద్ధికి కారణమగును. సాత్త్విక గుణ వృద్ధి సాత్త్విక కార్యములకు సద్వృత్తానుష్ఠానమునకు కారణమగును.

పరిదృష్ట చిత్తవృత్తులు ఐదు. అవి ఈ క్రింది విధముగా నుండును.

1. ప్రమాణము-ప్రమాణముల ద్వారా మనస్సు జ్ఞానమును పొందును. యోగ దర్శనమునందు ప్రత్యక్ష, అనుమాన, ఆగమమను మూడు ప్రమాణములు అంగీకరింపబడినవి. చరకమున యుక్తి ప్రమాణము గూడా పేర్కొన బడినది. ప్రమాణములచే యధార్థజ్ఞానము కలుగును.

2. విపర్యయము-మిథ్యాజ్ఞానము, భ్రమలు (Delusions)

---

1. చిత్తస్యద్వౌధర్మౌ పరిదృష్టా శ్చాపరి దృష్టాశ్చ తత్ర ప్రత్యయా త్మకాః పరిదృష్టాః (యో.సూ. 3/15)

3. వికల్పము-ప్రత్యక్ష జ్ఞానముగాని మిథ్యాజ్ఞానముగాని కాక కల్పనాజ్ఞానములో చిత్తము ఉండును. ఊహా చిత్రములు. హల్యుసినేషన్స్ (Hellucinati ons) ఈ కోవలోనికి వచ్చును—కొన్ని మానసిక వ్యాధులలో ఇది ప్రధాన లక్షణముగా నుండును.

4. నిద్ర-ఇంద్రియ వ్యాపారములు నిరోధింపబడు అవస్థ నిద్ర.

5. స్మృతి-అనుభవించిన విషయములచే కలిగిన జ్ఞానము.[1]

నిద్ర, స్మృతి గూడా మానసిక వ్యాధులలో వికృతి చెందుచుండును.

## II. అపరిదృష్ట లేక పరోక్ష చిత్త ధర్మములు

ఈ క్రింది విధముగా నుండును.

ఇవి ఏడు విధములు-వీటి అస్తిత్వము ఆగమ అనుమానములచేత మాత్రమే గ్రాహ్యము కాని ప్రత్యక్షముచే గ్రాహ్యములు కావు.[2]

1. నిరోధము-ఇది ఒక విశేష మానసిక అవస్థ. నూతనవృత్తులుగాని, సంస్కా-

---

1. వృత్తయః పంచతయ్యః క్లిష్టాక్లిష్టాః॥ ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతయః ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని విపర్యయో మిథ్యాజ్ఞానమతద్రుపప్రతిష్ఠమ్ శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః॥ అభావప్రత్యయావలంబనావృత్తిర్నిద్రా॥ అనుభూతవిషయాసంప్రమోషః స్మృతిః (యో.సూ.1/5-11)

2. వస్తుమాత్రాత్మక అపరిదృష్టాః తే చ భవంత్యనుమానేన ప్రాప్తివస్తుమాత్రసద్భావాః నిరోధధర్మసంస్కారాపరిణామో ఒర్థజీవనమ్ చేష్టా శక్తిశ్చ చిత్తస్య ధర్మా దర్శనవర్జితాః॥ (యోగసూత్ర-వ్యాసభాష్య -3/15)
చిత్తస్యేతి-పరిదృష్టాః ప్రత్యక్షాః అపరిదృష్టాః పరోక్షాః తత్ర ప్రత్యయాత్మకాః ప్రమాణాదయః సప్తాపరిదృష్టాత్కారికయా

రములుగాని ఉత్పన్నము కాక నిరోధింపబడి యుండును. సామాన్య మానవులు ఈస్థితికి చేరలేరు.

2. ధర్మము-ధర్మా ధర్మముల,పుణ్యపాపముల ప్రభావము మనస్సుపైపడును. సుఖదుఃఖములచే తెలిసికొన వచ్చును.

3. సంస్కారము-సంస్కారముచే మనుష్యని మనస్సు ప్రభావితమగును. సంస్కారముచే స్మృతి కలుగును. స్మరణ శక్తిచే సంస్కారమును తెలిసికొన వచ్చును.

4. పరిణామము-చిత్తము త్రిగుణాత్మకమగుటచే, అతి చంచలముగానుండును. క్షణక్షణమునకు సత్త్వ, రజ, తమో గుణములు మనస్సుపై ఆధిపత్యము వహించుచు, చిత్త వృత్తులను ప్రభావితము చేయుచుండును. చిత్త వృత్తులను బట్టి ఆసమయమున ఆధిక్యతలో నున్న గుణమును అంచనా వేయవచ్చును.

5. జీవనము-జీవనము లేక ప్రాణధారణముగూడా చిత్తము యొక్క పరోక్ష ధర్మములలో ఒకటి శ్వాస ప్రశ్వాసములచే ప్రాణధారణతను అనుమానము ద్వారా నిర్ణయింపవచ్చును. మనస్సు ఉత్తేజితమైనపుడు శ్వాసోచ్ఛ్వాసలు వృద్ధి చెందును. విషాదముగా నున్నపుడు మందగించును.

6. చేష్టా-శారీరక చేష్టలవలె మానసిక చేష్టలు సులభముగా దృష్టిగోచరము కావు. అనుమానముచే మాత్రమే గ్రహింప వలసియుండును. మనస్సు ఏ ఇంద్రియము ద్వారా విషయగ్రహణ చేయుచున్నది మొదలగువానిచే అనుమానముచే మానసిక చేష్టలు గ్రహించవలయును.

7. శక్తి-మానసిక శక్తిని ధ్యానము, ఏకాగ్రత, స్మృతి మొదలగు మనో వ్యాపారములచే అంచనా వేయబడును. శారీరక శక్తివలెనే మానసికశక్తి గూడా వేర్వేరుగా నుండును, దేహబలము మానసికశక్తి ఒకటిగానుండవు.

దుర్బలునికి గూడా గొప్ప మనో బలము ఉండవచ్చును. సత్త్వపరీక్షను గురించి వివరణ చూడనగును.[1]

పైన వివరించిన మనో వ్యాపారములన్నింటిని మూడు విధములుగా విభజింపవచ్చును.

1. జ్ఞానప్రధాన వ్యాపారములు-జ్ఞానేంద్రియ సంబంధిత వ్యాపారములు.
2. భావప్రధాన వ్యాపారములు-సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, మొదలగునవి, మనో వ్యాపారములు.
3. చేష్టాప్రధాన వ్యాపారములు-ఆకుంచన ప్రసారణాది వ్యాపారములు, కర్మేంద్రియ వ్యాపారములు.

ఈ మూడు విభేధములలో సుషుప్త, సుప్త, నిరూఢాది వ్యాపారములు, మనో వికారజన్య వ్యాపారములు అంతర్భూతము చేయుట కష్టము.

---

1. సంగ్రహాతి నిరోధేతి నిరోధో వృత్తీనామసంప్రజ్ఞాతావస్థా
చిత్తస్యాగమతః సంస్కారశేషభావోఽనుమానతశ్చ సమధిగమ్యతే
ధర్మగ్రహణేనపుణ్యాపుణ్యే ఉపలక్షయతి క్వచిత్కర్మేతి పాఠః
తథాపి తజ్జాతే పుణ్యాపుణ్యే ఏవం గ్రాహ్యేతే తేచాగమతః
సుఖదుఃఖోపభోగదర్శనాద్వానుమానతోగమ్యతే సంస్కారస్తు
స్మృతేననుమీయతే ఏవంత్రిగుణత్వాచ్చిత్తస్య చలం చ గుణవృత్తమితి
ప్రతిక్షణం పరిణామోఽనుమీయతే ఏవం జీవనం ప్రాణధారణం
ప్రయత్నభేదోఽసంవిదితశ్చిత్తస్య ధర్మః శ్వాసప్రశ్వాసాభ్యామను
మీయతే ఏవంచేతసశ్చేష్టక్రియా యథా యథా తైస్తైరింద్రియైః శరీర
ప్రదేశైర్వా సంప్రయుజ్యతే సాపితస్యంయోగాదేవానుమీయతే ఏవం
శక్తిరప్యుద్భూతానాం కార్యాణాం సూక్ష్మవస్థా చేతసో ధర్మః స్థూల
కార్యాను భవానుమీయతే ఇతి—
వాచస్పతి మిశ్ర-తత్త్వవైశారదీ-వ్యాసభాష్య 3/15

మనస్సుతోపాటు బుద్ధి అహంకారము ఇవి మూడును త్రిగుణాత్మకముగా నుండును. అయినప్పటికిని వీని మూడింటికి విశేషకర్మలు సాంఖ్యమునందు వర్ణింపబడినవి.

బుద్ధి అవ్యవసాయ స్వరూపముగను త్రిగుణాత్మకముగను ఉండును. మనస్సు, ఇంద్రియములనుండి గ్రహించిన జ్ఞానమును అహంకారమునకు, అహంకారము బుద్ధికి సమర్పించును. బుద్ధి సంపూర్ణ అర్థములను గ్రహించి ఆత్మకు సమర్పించును. బుద్ధి అన్ని సంస్కారములకు అధిష్టానముగా నుండును. ఇది సాత్త్వికమైనప్పటికిని ఆయా వ్యక్తుల పూర్వజన్మ సంస్కారముల ననుసరించి రాజసికముగాగాని తామసికముగాగాని కూడా ఉండును. ధర్మ, జ్ఞాన వైరాగ్య, ఐశ్వర్యాదులు సాత్త్విక బుద్ధియందు అధర్మ అజ్ఞాన అవైరాగ్య అనైశ్వర్యాదులు తామస బుద్ధియందును ఉండును.

ఇంద్రియములు, మనస్సు, అహంకారము ఇవేవియు సంస్కారమునకు అధిష్టానములు కావు. కేవలము బుద్ధి మాత్రమే సంస్కారమునకు అధిష్టానముగా నుండును.[1]

---

1. i) సాంతః కరణాబుద్ధిః సర్వవిషయమవగాహతే యస్మాత్।
తస్మాత్త్రివిధం కరణం ద్వారి ద్వారాణి శేషాణి॥ (సాంఖ్యకా. 23)

ii) అధ్యవసాయో బుద్ధిర్ధర్మోజ్ఞానంవిరాగఐశ్వర్యమ్।
సాత్వికమేతద్రూపం తామసమస్మాద్విపరీతమ్॥ (సా.కా. 23)

iii) తథా బాహ్యేంద్రియాణ్యాలోచ్య మనసే సమర్పయంతి, మనశ్చ సంకల్ప్యాహంకారాయ, అహంకారశ్చా భిమత్యబుద్ధౌ సర్వాధ్యక్షభూతాయాం తదిదముక్తమ్ (సా.మ.సాం.త. కౌముది)

iv) బుద్ధేరేవాఖిలసంస్కారా ధారతా, న తు చక్షురాదేరహంకారమనసోర్వా పూర్వదృష్టశ్రుతాద్యంధాన్నామన్ధబధిరాదిభిః స్మరణానుపపత్తేః తత్త్వజ్ఞానేనాఽహంకారనాశేఽపి స్మరణదర్శనాచ్చ। అతోఽశేష సంస్కారాధారతయాఽపిబుద్ధేరేవ సర్వేభ్యః ప్రధానత్వమితిసిద్ధః (సా.భా. 2/43)

## స్మృతి

న్యాయవైశేషిక మనుసారము బుద్ధి లేక జ్ఞానము రెండు విధములుగా నుండును. అవి.

1. స్మృతి.

2. అనుభవము.

అనుభవము అనునది నిజమునకు స్మృతికి ప్రథమసోపానము వంటిది. అనుభవము యదార్థానుభవము అయదార్థానుభవము అని రెండు విధములుగా నుండును. యదార్థానుభవము ప్రమా అనబడును. ఇది ప్రత్యక్షాది భేదములచే నాలుగు విధములుగా నుండును.

అయథార్థానుభవము సంశయము, విపర్యయము, తర్కము అను భేదములచే మూడు విధములుగా నుండును. వీని వివరములు ఇందు అప్రస్తుతములు.[1]

మానవ రోగములందు స్మృతి ప్రధానమైనదగుట వలనను అపస్మారాది వ్యాధులలో భ్రంశము నొందుట ప్రధాన లక్షణమగుట వలనను స్మృతిని గురించి తెలిసికొనవలసియుండును.

---

1. సంస్కారమాత్రజన్యం జ్ఞానం స్మృతిః తద్భిన్నం జ్ఞానమనుభవః సద్వివిధోయదార్థోఽయథార్థశ్చ తద్వతితత్ప్రకారకోఽనుభవో యథార్థః యథా రజతఇదం రజతమితి జ్ఞానమ్ సైవప్రమేత్యుచ్యతే। తదభావవతి తత్ప్రకారకోఽనుభవోఽయదార్థః యదార్థానుభవశ్చతుర్విధః ప్రత్యక్షానుమిత్యుపమితిశబ్దభేదాత్ తత్కారణమపి చతుర్విధమ్ ప్రత్యక్షానుమానోపమానశబ్ద భేదాత్ అయదార్థానుభవస్త్రివిధః సంశయవిపర్యయతర్క భేదాత్ (తర్క సంగ్రహ)

అనుభూత విషయముల యొక్క అనుభవజన్య సంస్కారములయొక్క నామము స్మృతి అనబడును. అనగా సంస్కారజన్య జ్ఞానము స్మృతి అనబడును.

ఆత్మ మనస్సు వీని సంయోగ విశేషములచే కలిగిన సంస్కార జన్య జ్ఞానము స్మృతి అని కణాదుని అభిప్రాయము [1] స్మృతికి మూడు విధములకు మౌలికాంశముల సమ్మేళనము అవసరము. అవి సంస్కార గ్రహణము (Learn-ing) అవధారణము, వాని స్థిరత్వము లేక యధావత్ రక్ష (Retention) ఉద్బోధనము (Recollection)

వీనిలో సంస్కారగ్రహణమునకు పిత్తము, (సాధక) ధారణ స్థిరత్వము నకు శ్లేష్మము ఉద్బోధనమునకు (స్మరణమునకు) వాతము సహకరించునని భావింప వచ్చును [2]

స్మృతి గూడా యదార్థస్మృతి అయధార్థస్మృతి అని రెండు విధములుగా నుండును. స్వప్నమునందు అయధార్థస్మృతి జాగ్రతావస్థలో యధార్థస్మృతి కలు గును.

---

1. (i) అనుభూతవిషయాఽ సమ్ప్రమోషః స్మృతిః యోగ సూత్ర 1/11
ఆత్మమనసోః సంయోగవిశేషాత్ సంస్కారాచ్చ స్మృతిః (వై శె.సూ. 9/216)

2. (ii) ప్రభా ప్రసాదో మేధా చ పిత్తకర్మావికారజమ్ స్నేహో బంధః
స్థిరత్వం చ గౌరవం వృషతా బలమ్ క్షమా ధృతిరలోభశ్చ
కఫకర్మ వికారజమ్ (చ.సూ. 18/52-53)

(ii) ప్రాణో...... మనోధమనీధారణ ।

(iii) ఉదాన.......ధీ ధృతి స్మృతి మనోవిబోధనాది క్రమః
(అ. సం. సూ. 20/4)

(iv) బుద్ధిమేధాభిమానం........త్వాదికం (అ. సం. సూ 20/5)

స్మరణ వ్యాపారమునకు ఆత్మ మనస్సుల సంయోగము, సంస్కారము
స్యంతర కారణములు. వీనితో పాటు బాహ్య కారణములు ఒకేసారిగా కలసి
ండక పోవుటచే స్మృతి అన్ని సంస్కారముల వలనను ఒకేసారి కలుగక
మముగా కలుగుచుండును. స్మరణశక్తి వ్యక్తిగత బేధములను కూడా కలిగి
ండును.

ృతికి కారణములు :

స్మృతికి చరకుడు ఎనిమిది కారణములను పేర్కొనెను. అవి.

1. నిమిత్త గ్రహణము - కారణమును చూచి కార్యమును స్మరించుట.
: మృత్తికను చూచి ఘటమును స్మరించుట

2. రూప గ్రహణము - రూపమనగా ఆకారమును చూచినపుడు సమాన
ము గల ఇతర వస్తువులు స్మరణకు వచ్చుట శ్వేత హరిణమును చూచి
ం గోవు స్మరణకు వచ్చుట.

3. సాదృశ్యము - సామ్యత తండ్రివంటి ముఖము గలిగిన వ్యక్తిని
నపుడు తండ్రి స్మరణకు వచ్చుట.

4. సవిపర్యయము - అధిక అసాదృశ్యమును చూచినపుడును స్మరణకు
ం. ఉదా కురూపి ఐన వ్యక్తిని చూచినపుడు మంచి రూపవంతుడగు వ్యక్తి
కు వచ్చుట.

5. సత్వాను బన్ధము - స్మరించవలసిన విషయమును ఏకాగ్రతా పూర్వక
ధ్యానించుట వలన అది స్మరణలో నుండును.

6. అభ్యాసము - మాటి మాటికి అధ్యయనము చేయబడిన విషయము
బలము వలన స్మరణలో ఉండిపోవును. మాటిమాటికి అభ్యాసముచేయని
మనకు బలమైన సంస్కారము ఏర్పడదు. ఐనప్పటికిని కొందరికి ఒకే

మాట చూచిన లేక వినిన విషయము ఎప్పటికిని స్మరణమునందుండును. అట్టి స్మరణ శక్తి శ్రేష్ఠమైనదిగా నుండును.

7. జ్ఞాన యోగము- తత్త్వజ్ఞానము ద్వారా అన్నిసంస్కారముల యొక్క స్మృతి ఏర్పడును.

8. పునః శృత- విస్మృతమైన విషయమును మరలా కొంత భాగము వినినను వెంటనే అంతయు స్మరణకు వచ్చును.[1]

న్యాయ సూత్రకారులు స్మృతికి కారణములను ఇంకను వివరముగా వర్ణించిరి. అవి ఈ క్రింది విధముగా నుండును.

1. ప్రణిధానము — ఏకాగ్రతా పూర్వముగా ధ్యానించిన విషయము త్వరగా స్మరణకువచ్చును. ఏకాగ్రత ఎంత అధికముగానున్న అంత త్వరగా స్మరణము చేయుట జరుగును.

2. నిబంధము — గ్రంథమునందు గ్రంధిత విషయములు ఒకటి చదివి నపుడు దానికి సంబంధించిన ఇతర విషయములు స్మరణకు వచ్చును.

నిబంధము అను పదమునకు మరొక అర్థముకలదు. ఇంకొక విషయము నకు సంధించియుంచుట. అనగా తనకు బాగుగా స్మరణకుయున్న విషయముతో సంధించి యుంచినపుడు నూతన విషయము గూడా సులభముగా స్మరణలో యుండును. ఉదా. జన్మదినపు తేదీతో టెలిఫోన్‌నెంబరు కలిపి స్మరణలో నుంచు కొనుట.

---

1.(i) వక్ష్యన్తే కారణాన్యష్టౌ స్మృతిర్యైరుపజాయతే నిమిత్త రూపగ్రహణా త్సాదృశాత్సవిపర్యయాత్॥ సత్త్వానుబన్ధాదభ్యాసాత్ జ్ఞానయోగా త్పునఃశ్రుతాత్ దృష్టశ్రుతానుభూతానాం స్మరణాత్స్మృతిరుచ్యతే
(చ. శా. 1/148-149)

(ii) దీనిపై చక్రపాణి వ్యాఖ్య

3. అభ్యాసము — మాటిమాటికి అనుభవించిన విషయము బలమైన సంస్కారమును కలిగించి సులభముగా స్మరణలోనుంచుటకు వీలగును. సతతము అధ్యయనము చేసిన విషయము బాగుగా స్మరణలో నుండును.

4. లింగము — లింగమనగా పరోక్ష వస్తువుతో సాహచర్య నియమము కలిగియున్న వస్తువుయొక్క జ్ఞానము. ఉదా: ధూమమును చూసి అగ్నిని స్మరించుట.

5. లక్షణము — సంకేతములనుగాని, చిహ్నములనుగాని చూచినపుడు ఆ సంకేతము ధరించు ఇతరవిషయములు స్మరణకు వచ్చుట ఉదా. స్వస్తిక చిహ్నమును చూచినపుడు ఆర్యసంస్కృతి స్మరణకు వచ్చుట.

6. సాదృశ్యము— ఒక వస్తువును చూచినపుడు తత్సాదృశ్యముగల ఇతర వస్తువులు జ్ఞప్తికివచ్చుట.

7. పరిగ్రహము — వస్తువును చూచినపుడు దాని అధిపతి స్మరణకు వచ్చుట.

8-9. ఆశ్రయము — ఆశ్రితము. ఆశ్రయమును చూచినపుడు ఆశ్రితం యొక్క స్మరణము. ఆశ్రితమును చూచినపుడు ఆశ్రయముయొక్క స్మరణము కలుగుట. (పుష్పములు చూచినపుడు పుష్పమాల, మాలను చూచినపుడు పుష్పముల స్మరణము.)

10. సమ్బన్ధము — ఘనిష్ట సంబంధమున్న వస్తువులలో ఒక దానిని చూచిన రెండవది స్మరణమునకు వచ్చుట. ఉదా. దేవాలయము-నారికేళము.

11. ఆనన్తర్యము — స్థానము లేక కాలానుసారము సామీప్యము కలిగిన వస్తువులలో ఒక వస్తువును చూచినపుడు రెండవది స్మరణకు వచ్చుట. మేఘావృతమైన ఆకాశమును చూచినపుడు వర్షము స్మరణకువచ్చుట.

12. వియోగము — ఏ వస్తువుతోనైనను వియోగము జరిగినపుడు ఆ వస్తువే అధికముగా స్మరణకువచ్చును. ఉదా. మేఘసందేశమున యక్షునికి ప్రేయసియే స్మరణకు వచ్చుట.

13. ఏకకార్య — ఒక పనిచేయు వ్యక్తిని చూచినపుడు అదేపని చేయు మరొకవ్యక్తి స్మరణకువచ్చుట.

14. విరోధము — పరస్పర విరుద్ధములగు వస్తువులలో ఒకదానిని చూచినపుడు వేరొకటి స్మరణకు వచ్చును.

15. అతిశయము — అతిశయముగా లభించు వస్తువు ఆ సందర్భము చూచినపుడు జ్ఞప్తికివచ్చును. వనమును చూచినపుడు అచట అధికముగా లభించు ఫలములు స్మరణకు వచ్చును.

16. ప్రాప్తి — దేనివలననైతే కోరినది లభించునో అది బాగుగా స్మరణలో యుండును. బాగుగా ఆకలికొనినపుడు భోజనము పెట్టినవారి స్మరణము అధికముగా నుండును.

17. వ్యవధానము — పైభాగము చూచినపుడు లోపలి వస్తువుయొక్క స్మరణము కలుగును. ఉదా- భోజనపాత్ర చూచినపుడు లోపలున్న భోజనము స్మరణకు వచ్చును.

18. సుఖ-దుఃఖ — సుఖ-దుఃఖ కారణములు బాగుగా స్మరణలో నుండును.

19. ఇచ్ఛా-ద్వేషము — ఇచ్ఛాకారణములు ద్వేషకారణములు- బాగుగా స్మరణలో నుండును.

20. భయము — భయముకలిగినపుడు పూర్వపు భయకారణములు స్మరణమునకు వచ్చును.

21. అర్థిత్వము — ఆవశ్యకత ఏర్పడిన వస్తువు బాగుగా స్మరణలో నుండును. ధనహీనునికి డబ్బు బాగుగా స్మరణలో నుండును.

22. క్రియ — ఏదైనా క్రియను చూచినపుడు దాని కారణములు స్మరణ కలుగును. కదులుచున్న వృక్ష పత్రములు చూచినపుడు వాయువుయొక్క స్మరణ కలుగును.

23. రాగము — అధికముగా ప్రీతి, రాగము కలిగిన వస్తువులయొక్క స్మరణము బాగుగానుండును. పతికి పత్ని, బాలునికి తల్లి మొ॥నవి.

25. ధర్మము — ధార్మిక జీవనము స్మరణశక్తిని పెంచును.

25. అధర్మము — అధర్మమువలన దుఃఖము కలుగును. అందుచే దాని కారణముల స్మరణము కలుగును.[1]

ఈ 25 కారణములను పేర్కొనుచు వాత్స్యాయనుడు ఇవన్నియు ఒకేసారి కలుగవని వివరించెను. ఇవి కేవలము ఉదాహరణ రూపములేనని గూడా పేర్కొని స్మృతికి కారణములు ఇంకను అధికముగా నుండునని సూచించెను.

చరకునిచే పేర్కొనబడిన 8 కారణములలో దాదాపుగా పైకారణము లన్నియు అంతర్భూతమగునని తోచుచున్నది.

---

1. స్మృతిహేతునామయౌగపద్యాద్ యుగపదస్మరణమిత్యుక్తమ్ అథ కేభ్యః స్మృతిరుత్పద్యత ఇతి స్మృతిః ఖలు ప్రాణిధాననిబంధాభ్యాసలింగం లక్షణసాదృశ్యపరిగ్రహాశ్రయాశ్రితసంబంధానంతర్యవియోగైకకార్య విరోధాతిశయప్రాప్తివ్యవధానసుఖదుఃఖేచ్ఛాద్వేషభయార్థిత్వక్రియారాగ ధర్మాధర్మ నిమిత్తేభ్యః (న్యాయసూత్ర 3-2-41)

## మానస రోగములకు కారణములు

శారీరక రోగములకు వర్తించు సాధారణ కారణములు మానసరోగములకు గూడా వర్తించును.

ప్రత్యేకించి మానసరోగ కారణములు కొన్నికలవు.

1. మానసికదోషములయిన రజోదోషము, తమోదోషము.[1]

2. a) ఇష్టమయిన వస్తువులు లభించకుండుట

b) లభించిన వస్తువులపై ఇష్టము లేకుండుట-అను ఈ రెండుకారణములు ముఖ్యముగా మానసికరోగ కారణములుగా చెప్పబడినవి.[2]

3. ప్రజ్ఞాపరాధము. శరీరక వ్యాధులకును, ఆగంతుక వ్యాధులకు, వ్యాధుల యొక్క ఆవి ఉత్పత్తికిని ప్రజ్ఞాపరాధము కారణముగా చెప్పబడినది.[3]

ప్రజ్ఞాపరాధము విశేషించి మానస రోగములకు కారణముగా చెప్పబడినది.[4]

ధీభ్రంశము, ధృతిభ్రంశము, స్మృతిభ్రంశము వీనివలన చేయబడినకాయిక, వాచిక మానసిక, అశుభ కర్మలు ప్రజ్ఞాపరాధములు అనబడును. ప్రజ్ఞాపరాధము శారీరక మానసిక దోషములన్నింటిని ప్రకోపింపచేయును.[5]

---

1. i) మానసికః పునురుద్దిష్టో రజస్చ తమఏవచ (చ.సూ 1)
   ii) రజస్తమశ్చమనసోః (చ.వి. 6/5)
2. మానసః పునరిష్టస్యాలాభాల్లాభాచ్చానిష్టస్యోపజాయతే (చ.సూ.11/15)
3. i) చ. సూ. 11/43 ii) చ.వి. 3/20 iii) చ.శా. 1/102
4. i) చ. శా. 7/52
   ii) చ.ని. 7/21
5. చ.శా. 1/102

అసాత్మ్యేంద్రియార్థ సంయోగము, ప్రజ్ఞాపరాధము పరిణామము అన్ని వ్యాధులకు, నిజ, ఆగంతుక, మానసిక వ్యాధులకు కారణముగానుండును.

వాయ్వాదుల విగుణముచే కలుగు జనపదోద్ధ్వంసాది వ్యాధులకు గూడా అధర్మమే కారణము. అధర్మమునకు పూర్వజన్మకృతమయిన అసత్కర్మ కారణము. అట్టి అసత్కర్మమునకు ప్రజ్ఞాపరాధమే కారణము.

ఈర్ష్య, శోకము, భయము, క్రోధము, మానము, ద్వేషము మొదలగు మానసిక వికారములన్నింటికిని ప్రజ్ఞాపరాధమే కారణముగా చెప్పబడినది.[1]

ప్రజ్ఞాపరాధము అనగా తెలిసి తప్పుచేయుట అని అర్థము వచ్చును

ధీభ్రంశము, ధృతిభ్రంశము, స్మృతిభ్రంశము అనునవి ప్రజ్ఞాపరాధమునకు కారణములు. ఏనివలన కలుగు కాయిక, వాచిక, మానసిక హీనమిథ్యాతియోగములే ప్రజ్ఞాపరాధములు.[2]

ధీ, ధృతి, స్మృతి ఇవి ప్రజ్ఞయొక్క భేదములు.

---

1. i) చ.వి. 6/6

ii) సర్వేషామప్యగ్నివేశ వాయ్వాదీనాం యద్వైగుణ్యముత్పద్యతే తస్య మూలమధర్మః తన్మూలం వా ఽసత్కర్మపూర్వకృతం తయోర్యోనిః ప్రజ్ఞాపరాధ ఏవ (చ.వి. 3/20)

iii) ఈర్ష్యా శోక భయ క్రోధ మాన ద్వేషాదయశ్చ యే మనోవికారాస్తేఽప్యుక్తాః సర్వే ప్రజ్ఞాపరాధజాః (చ.సూ. 7/52)

2. i) ధీ ధృతి స్మృతి విభ్రష్టః కర్మయత్కురుతేఽశుభమ్ ప్రజ్ఞాపరాధం తం విద్యాత్సర్వదోషప్రకోపణామ్ (చ.శా. 1/102)

ii) ధీధృతి స్మృతివిభ్రంశః సంప్రాప్తిః కాలకర్మణామ్ అసాత్మ్యార్థాగమశ్చేతి జ్ఞాతవ్యా దుఃఖహేతవః (చ.శా. 1/98)

## బుద్ధి భ్రంశము

బుద్ధి వలన సమ లేక యదార్ధ జ్ఞానము కలుగును. నిత్యములను అనిత్యములుగను, హితములను అహితములుగను గ్రహించుట వ్యత్యస్థజ్ఞానముతో కర్మ, కాల, అర్ధములందు బుద్ధియొక్క విషయాభినివేశము కలుగుచున్నవో ఇవిబుద్ధి భ్రంశమనబడును.[1]

బుద్ధిచేత విషమము ఆలోచించుట, విషమముగా ప్రవర్తించుట ప్రజ్ఞాపరాధమనబడును. ఇది మనస్సునకు ఆధీనముగా నుండును.[2]

## ధృతి భ్రంశము

ధృతి అనగా మనస్సును నియమానము చేయునది అని అర్ధము. విషయ వాసనలయందు అనగా అహితమయిన విషయములందు ప్రవృత్తమైయుండు మనస్సును ఆ అహితమయిన అర్ధాదులనుండి మరల్చు శక్తిని కోల్పోవుటను ధృతి భ్రంశము అందురు.[3]

అసాత్మేంద్రియార్ధములకు గూడా ధృతి భ్రంశమే కారణమని దీని వలన తెలియుచున్నది.

---

4. విషమాభినివేశో యో నిత్యానిత్యే హితాహితే జ్ఞేయః పబుద్ధి విభ్రంశః సమం బుద్ధిర్హి పశ్యతి (చ.శా. 1/99)

1. బుద్ధ్యా విషమవిజ్ఞానం విషమం చ ప్రవర్తనమ్ ప్రజ్ఞాపరాధం జానీయాన్మనసో గోచరం హి తత్ (చ.శా. 1/109)

2. విషయప్రవణం చిత్తం ధృతిభ్రంశాన్నశక్యతే నియన్తు మహితా దర్ధాద్ధృతిర్హి నియమాత్మికా (చ.శా. 1/100)

## స్మృతి భ్రంశము

స్మరింపతగినదంతయు స్మృతి అనబడును. సంమతమైన అర్థములను స్మరించుట ప్రశస్తమైన స్మృతి ధర్మముగా నుండును. యదార్థస్మృతియందు స్మరింపదగినవన్నియు ఆశ్రితములై యుండును.

రజోగుణము మోహము (తమోగుణము) వీనిచే చిత్తము (మనస్సు) ఆవరింపబడిన మనుజునకు తత్త్వజ్ఞానము అనగా యదార్థజ్ఞాన విషయకమయిన స్మృతి నశించును. అట్టి స్థితిని స్మృతిభ్రంశమందురు [1] ఉదా:- నిప్పులో చేయిపుంచిన కాలును, అను స్మృతి నశించుటచే అతడు నిప్పులో చేయిపెట్టును.[3]

## ప్రజ్ఞాపరాధము

ఈ విధమైన ధీ ధృతి స్మృతి భ్రంశములవలన చేయబడు క్రింది కర్మలు ప్రజ్ఞాపరాధము లనబడును.

కర్మలు మూడు విధములుగానుండును. అవి వాచిక, మానసిక, శారీరక కర్మలు. ఈ మూడు కర్మలయొక్క అతియోగ, అయోగ మిథ్యాయోగములు ప్రజ్ఞాపరాధములుగా నుండును.

అతియోగములు వాక్కు, మనస్సు, శరీరము వీనిచే అధికముగా వాని వాని కర్మలను చేయుట అతియోగము. ఉదా :- అధికముగా మాట్లాడుట, అధికముగా చింతించుట, విచారించుట, అధికముగా ఆకుంచన ప్రసారణాదులు చేయుట మొదలగునవి అతియోగములు.

---

1. i) తత్త్వజ్ఞానే స్మృతిర్యస్య రజోమోహావృతాత్మనః భ్రశ్యతే
స స్మృతిభ్రంశః స్మర్తవ్యం హి స్మృతౌ స్థితమ్ (చ.శా. 1/101)
ii) స్మర్తవ్యంహిస్మృతౌస్థితమితి స్మర్తవ్యత్వేన సంమతస్యార్థస్య
స్మరణం ప్రశస్తం స్మృతిధర్మః (చక్రపాణి)

అయోగములు- వాక్కు, మనస్సు, శరీరముతో ఏవిధమయిన కర్మలు చేయకుండగను, నిర్వ్యాపారముగను ఉండుట అయోగము అనబడును.1

## మిథ్యా యోగములు

శారీరక మిథ్యాయోగములు-

మలమూత్రాదివేగములు ప్రవర్తమానములుగా నున్నపుడు వానిని నిరోధించుట. లేని మలమూత్రాది వేగములను ప్రేరేపించుట.

విషమములగానున్న ప్రదేశములందు నడచుట, తడబడుట, పడుట, శరీరమును హెచ్చు తగ్గులుగా నుంచుట, శరీరమును అధికముగా గీకుట, దూషిత పదార్థములచే స్పర్శ కలుగుట, శరీరముపై దెబ్బలు తగులుట, శరీరము మర్దింపబడుట, శ్వాసను అడ్డగించుట, శరీరమునకు క్లేశమును కలిగించు వ్రత ఉపవాస, మద్యపాన, జలక్రీడాదులు, సాహసమయిన కర్మలుచేయుట, అధికముగా సంభోగము, సకాలమున తగిన కర్మలుగాని చికిత్సలుగాని చేయకుండుట, ఇతర అనుచిత కర్మలు చేయుట, తెలిసియుండియు అహితములయినకృత్యములను చేయుట, ఉన్మాదకారణములుగా చెప్పబడిన శరీరక కర్మలు, ఆ సమయమునందు సంచరించగూడని ప్రదేశములలో సంచరించుట, సంక్లిష్టములయిన కర్మలుచేయుట, వినయములోపించిన సదాచారము లోపించిన కర్మలు చేయుట, సద్వృత్తమునకు వ్యతిరేకముగానుండు కర్మలు చేయుట, ఇతరులకు కష్టమును కలిగించు పనులుచేయుట.

## వాచిక మిథ్యా యోగములు :-

ఇతరులపై కొండెములు చెప్పుట, అనృత, అకాల, భాషణము,కలహము, అప్రియమైన, అసంబద్ధమైన, అననుకూలమైన మాటలు,పరుషముగా మాట్లాడుట, రజోతమోయుక్తమైన ఇతర వాచిక కర్మలు.

---

1. కర్మవాఙ్మనశ్శరీరప్రవృత్తిః తత్ర వాఙ్మనశ్శరీరాది ప్రవృత్తిరతి యోగః సర్వశోఽప్రవృత్తిరయోగః (చ.సూ. 11/39)

## మానసిక మిథ్యా యోగములు:-

భయము, దుఃఖము, కోపము, లోభము, మోహము, అభిమానము, ఈర్ష్య, మిథ్యా దర్శనము, మదము, భ్రమ.

ఇతర ప్రజ్ఞాపరాధములు - వినయము సదాచారము లోపించుటచే చేయు కర్మలు, పూజ్య పురుషులను దేవతలను అవమానించుట, ఉన్మాదోక్త కారణములు సేవించుట, కాయిక, వాచిక, శారీరకములైన హీన అతి యోగములే కాక యితరములైన అన్ని అహితకర్మలు, రజోతమో గుణములచే మనస్సు ఆవరించుటచే చేయబడు ఇతర కర్మలు.

---

1. i) వేగధారణోదీరణ విషమస్ఖలనగమనపతనాంగప్రణిదానాంగప్రధూషణ ప్రహారమర్దన ప్రాదోపరోధసంక్లేశనాదిః శారీరోమిథ్యాయోగః సూచకానృతౌ కాలకలహ ప్రియబద్ధానుపచారపరుషవచనాది రాంగ్మిధ్యాయోగః భయశోకక్రోధలోభమోహమానేర్ష్యామిధ్యాదర్శనాది ర్మానసోమిధ్యా యోగః (చ. సూ. 11/39)

   ii) ఉదీరణం గతి మతాముదీర్ణానాం చ నిగ్రహః సేవనం సాహసానాం చ నారీణాం చాతిసేవనమ్ కర్మకాలాతిపాతశ్చ మిధ్యారంభశ్చకర్మణామ్ వినయాచారలోపశ్చ పూజ్యానాం చాభిధర్షణమ్ జ్ఞాతానాం స్వయమర్థానామహితానాం నిషేవణమ్ పరమౌన్మాదికానాం చ ప్రత్యయానాం నిషేవణమ్ అకాలాదేశసంచారా మైత్రీ సంక్లిష్టకర్మభిః ఇంద్రియోపక్రమోక్తస్య సద్వృత్తస్య చ వర్జనమ్ ఈర్ష్యా మాన భయ క్రోధ లోభమోహమదభ్రమాః తజ్జంవాకర్మ యత్క్లిష్టం యద్వా తద్దేహకర్మ చ యచ్చాన్యాదీ దృశం కర్మ రజోమోహసముత్థితమ్ ప్రజ్ఞాపరాధం తం విశిష్టాబ్రువతేవ్యాధికారణం (చ.శా. 1/103-8)

# మానసిక రోగములు

ఆయుర్వేద సంహితలయందు మానసిక వ్యాధుల యొక్క ప్రత్యేకత అనేక సందర్భములలో ఆచార్యుల దృష్టిని ఆకర్షించుచునే యున్నట్లు కనిపించును.

వ్యాధుల వర్గీకరణములో శారీరక వ్యాధులతోపాటు మానసిక వ్యాధులు, కారణములు, చికిత్సలు వర్ణింపబడినవి.

అయినను శారీరక వ్యాధులకు ఇచ్చినంత అధిక వివరణ మానసిక వ్యాధులకు ఇచ్చినట్లు స్థూల దృష్టితో చూచినపుడు కనిపింపక పోయినను సూక్ష్మముగా పరిశీలించినచో రెండింటికి సమాన దృష్టితో కూడిన వివరములు లభించును.

కాయచికిత్సోక్త వ్యాధులలోను, సామాన్యముగా అన్ని వ్యాధులలోను మానసిక కారణములు, మానసిక లక్షణములు, మానసిక చికిత్సలు ఆయా సందర్భానుసారము వివరింపబడియే యున్నట్లు కనిపించును.

ఉదా- జ్వరమున మానసిక జ్వరములు, అతిసారమున శోక, భయాతిసారములు; రక్తపిత్తమున మనోప్రశామక చికిత్సలు, శోకమును నిదానమున పేర్కొనుట; హృద్రోగములు, వాతవ్యాధులు మొదలగు ఉదాహరణము లనేకము పేర్కొనవచ్చును.

శారీరక మానసిక దోషముల సంబంధము- కామ, శోక, భయముల వలన వాతము, క్రోధము, శోకము వలన పిత్తము ప్రకోపించునని చెప్పబడినది.[2] అచిన్తనము, హర్షము కఫప్రకోపమునకు కారణమగును.[2]

---

1. చ. సూ. 11

2. i) కామశోకభయాద్వాయుః క్రోధాత్పిత్తం (చ. చి. 3)
   ii) అ. సం. ని. 1
   iii) సు. సూ. 21.

రజోగుణముచే వాతము పిత్తము తమోగుణముచే కఫము ప్రకోపించును.[1]

ఉన్మాద అపస్మారాది వ్యాధులందు గూడా దోషానుసారమే శోధనాది చికిత్సలు చెప్పబడినవి.

మానసిక రోగములు - లేక మనోవికారములు

ఈర్ష్య, శోకము, భయము, క్రోధము, మానము, ద్వేషము, హర్షము, విషాదము, అభ్యసూయము, మాత్సర్యము, కామము, లోభము, ఇచ్ఛ, ద్వేషము- ఇవి అన్నియు మనోవికారములుగా పేర్కొనబడినవి.[2]

ఉన్మాద అపస్మార, అతత్త్వాభినివేశాదులను ప్రధాన మానసరోగముల క్రింద భావింపవచ్చును.

వ్యాధుల యొక్క ఆది ఉత్పత్తి మానస రోగములతోనే ప్రారంభమైనట్లు చరక సంహిత జనపదోద్ధ్వంసనీయ విమానమున వర్ణింపబడినది.

ఆదియుగము లేక కృతయుగము యొక్క అంతమున అధికాహారముచే శరీర గౌరవము, శరీర గౌరవముచే శ్రమ, శ్రమచే ఆలస్యము, ఆలస్యముచే ధనసంచయము, సంచయముచే పరిగ్రహము అనగా ధనము, సామగ్రి మొదలగు నవి ఏర్పరచుకొనుట పరిగ్రహముచే లోభము కలిగినవి.[3]

---

1. సు. శా. 1/27
2. i) ఈర్ష్యా శోక భయక్రోధమానద్వేషాదయశ్చ యే। మనోవికారాస్తేఽప్యుక్తాః సర్వే ప్రజ్ఞాపరాధజాః (చ. సూ. 7/52)
   ii) మానసాస్తు క్రోధశోకభయహర్షవిషాదేర్ష్యాఽభ్యసూయాదైన్యమాత్సర్య కామలోభప్రభృతయ ఇచ్ఛాద్వేషభేదైర్భవంతి। (సు. సూ. 1/33)
3. భ్రశ్యతి తు కృతయుగే కేషాంచిదాత్యాదానాత్సాంపన్నికానాంశరీర గౌరవమాసీత్ శరీరగౌరవాత్ శ్రమః శ్రమాదాలస్యం ఆలస్యాత్ సంచయః సంచయాత్ పరిగ్రహః పరిగ్రహాల్లోభః ప్రాదుర్భూతః (చ. వి. 3/24)

త్రేతాయుగమున క్రమముగా లోభముచే ద్రోహము, ద్రోహముచే అనృత వచనము, అనృత వచనముచే కామ, క్రోధ, అహంకార, ద్వేష, పారుష్య అభిఘాత, భయ, తాప, శోక, చిన్త, ఉద్వేగాదులు క్రమముగా జ్వరాది వ్యాధులు ఉత్పన్నమయినవి. అనగా శారీరక వ్యాధులకన్న పూర్వమే మనోవికారములు కలిగినవని తెలియుచున్నది.[1]

## సామాన్య మనోవికారముల వివరణ

పైన పేర్కొనబడిన ఈర్ష్యాదులను మానసిక రోగములుగా పరిగణించుట కన్న మానసిక లక్షణములుగా పరిగణించుట సమంజసముగా నుండును. ఈ లక్షణములు ప్రతి మనుజుని యందు సహజముగనే ఆయా సందర్భముల ననుసరించి కలుగుచుండును. అపుడు వానిని వ్యాధులుగా పేర్కొనవలయునా లేక సహజ స్వభావముగా పేర్కొనవలయునా అనునది సందర్భానుసారము నిర్ణయింపవలసి యుండును.

సత్త్వ భేదములుగా సాత్త్విక, రాజస తామస భేదములు[2] బ్రహ్మసత్త్వ, ఋషి సత్త్వాదులు గూడా ఇట్టివియే. ఈ ఈర్ష్యా శోకాదులు కొన్ని మానసిక శారీరక వ్యాధులు శీఘ్రముగా కలుగుటకు సహకరించునని చెప్పవచ్చును.

1980వ సంవత్సరమున ప్రచురితమైన అమెరికన్ సైకియాట్రిక్ అసోసియేషన్ వారి మానస రోగముల విభజనను పరిశీలించినచో ఈర్ష్య శోకాది మనో

---

1. i) తతస్త్రేతాయాం లోభాదభిద్రోహః అభిద్రోహాదనృతవచనం అనృతవచనాత్కామక్రోధమానద్వేషపారుష్యాభిఘాతభయతాపశోకచిన్తోద్వేగాదయః ప్రవృత్తాః (చ.వి. 3/24)

ii) ప్రాగాప్యతేరభిజ్వరాదిభిరభిక్రాన్తాని (చ. వి. 3/24)

2. చ.శా. 4/40

వికారములు పరసనాలిటీ డిసార్డర్ (Personality Disordor) గ్రూపు క్రింద చేర్చబడినవిగా కనిపించును. ఇవి ఒక విధమైన మానసిక ప్రకృతుల వంటివి.[1]

ఆరోగ్యవంతులలో కన్న కొన్ని బాహ్యస్థితులలో వీరు అధికముగా స్పందించుట వలన కామ క్రోధాది లక్షణములను తీవ్రరూపములో ప్రవర్తింతురు. వీరు సాధారణముగా అనారోగ్యులుగా పరిగణింపబడక ఆయా స్వభావములు కల వారిగా పరిగణింపబడుదురు.

మామూలు ఆరోగ్యవంతులైన వ్యక్తులకు బుద్ధి, స్మృతి, ధృతి ప్రాకృత స్థితిలో ఉండుటచే వారు ఒక పరిధి వరకు గల భయ, శోకాదులను సహింప గలుగుదురు. అది సాధారణ ప్రాకృత స్థితికన్న మించియున్నపుడు తట్టుకొనలేక మనో వికారములను పొందుదురు.

కొందరు అతి స్వల్పకారణములకే తీవ్రముగా ప్రతి స్పందించి ఈ మనో వికారములను సాధారణమున కన్న అధికముగా చూపుదురు. అది వారి వారి మానసిక ప్రకృతి ఆచార వ్యవహారము, తల్లి దండ్రులు, ఆహారములు, పూర్వ కృత కర్మ మొదలగు వానిపై ఆధారపడి యుండును.[2]

ఈ వికారములను ప్రారంభములోనే నిరోధించుట, నివారించుట చాలా అవసరము.

---

1. Diagnostic and stafistical manual of mental disorder (DSM. III) Published by American Psychiatric association 1980.

2. సత్త్వవైశేష్యకరాణి పునస్తేషాం తేషాం ప్రాణినాం మాతాపితృ సత్త్వాన్యన్తర్వత్న్యాః శ్రుతయశ్చాభీక్ష్ణం స్వోచితం చ కర్మసత్త్వ విశేషాభ్యాసశ్చేతి
(చ.శా. 8/16)

## మోహము

మోహము అనగా అజ్ఞానము. ఇది తమోగుణ ప్రధానముగా నుండును. మద, మూర్ఛా, సంన్యాసములు మూడును మోహరూపములో నుండుననియు, ఒక దానికన్న మరియొక దానిలో క్రమముగా మోహము బలవత్తరముగా నుండుననియు చక్రపాణి వివరించెను.[1]

మోహము, మూర్ఛకు పర్యాయపదముగా అమరకోశమందు చెప్పబడినది.[2]

తమోగుణము, అజ్ఞానమును, మోహమును ప్రమాదము, నిద్ర, భ్రమలను కలిగించి యుక్తాయుక్త జ్ఞానమును చెరచును. ఇచ్ఛా ద్వేషములవు, కామము అనగా తను కోరిన కోరికకు భంగము వాటిల్లినపుడు క్రోధము కలుగును. క్రోధావేశముచే మనుజునికి యుక్తాయుక్త జ్ఞానము నశించి మోహము లేక అజ్ఞానము కలుగును.[3]

ఆ స్థితిలో నివారింపబడక యున్నచో సంమోహము, స్మృతి విభ్రమము, (స్మృతి భ్రంశము) బుద్ధినాశము క్రమము గా కలిగి మరణము గూడా సంభవించును.[4]

---

1. యథోత్తరం లింగాధిక్యం మదమూర్ఛాయ సంన్యాసేషు మోహరూపం జ్ఞేయం, యదోఽపిస్తోకో మోహోఽస్థిత త్వం యేషువ్యక్త ఏవమోహ
   చక్రపాణి (చ.సూ. 24/25-29)
2. అమరకోశ 2/8/109
3. i) తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
   ప్రమాదాలస్య నిద్రాభిస్తన్నిబధ్నాతి భారత (భ.గీ. 14/8)
4. క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః
   స్మృతి భ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి (భ.గీ. 2/63)

మోహము తమోగుణ ప్రధానముగా చెప్పబడి నప్పటికిని క్రోధము రజో గుణమునకు సంబంధించినది. అందు చేతనే మద మూర్చాది సంప్రాప్తిలో రజో తమోగుణ ఆవృతత్వము వర్ణింపబడినది.[1]

ఈ మోహమును ఎంత ప్రారంభదశలో గమనించిన అంత సులభముగా చికిత్సించ వీలగును.

మోహ కారణములను తొలగించుట, మనో ప్రసాదకరమైన చికిత్సలు చేయుట అవసరము. రజో తమో ప్రేరకమైన ఆహార విహారములు వర్జింప చేయ వలయును.

శ్రీకృష్ణ భగవానుని గీతోపదేశము అర్జునునికి మోహమును పోగొట్టి స్మృతిని జ్ఞానమును కలిగించినది. అట్టి సత్త్వగుణమును పెంపొందించు గ్రంథ పారాయణములు హితకరముగా నుండును.[2]

ఆవశ్యకతననుసరించి మద మూర్చాది ప్రకరణమున చెప్పబడిన చికిత్సలచే ఉపచరింపవలయును.

## క్రోధము

క్రోధము అనగా కోపించుట. ఇది రజోగుణముచే కలుగు లక్షణము. క్రోధము వాత ప్రకోపకముగను, పిత్త ప్రకోపకముగను చెప్పబడినది. కామము అనగా తనకు కావలసినది లభించనపుడు క్రోధము కలుగును. క్రోధము తదు పరి అవస్థ సంమోహమని తలర్పరిణామములనియు పైన చెప్పబడినది.[3]

---

1. చ. సూ. 24/26
2. నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత।
   స్థితో ఽస్మిగతసందేహః కరిష్యే వచనం తవ (భ.గీ. 18/73)
3. భ. గీ. 18/27

క్రోధముచే ముఖము, కన్నులు ఎర్రబడుట, శ్వాస, హృదయగతి పెరుగుట, పెదవులు కంపించుట మాటలు తడబడుట ఈ స్థితి కలుగును.

క్రోధము రక్తపోటు, హృద్రోగము మొదలగు వ్యాధులకు దారి తీయును.

సమాజ వ్యతిరేక ప్రవర్తనకు ఈస్థితి దారితీయును. ఇట్టివారు మద్యపానము, మత్తుమందులకు అలవాటు పడుట, దొంగతనము, ఖూనీలు, చేయుట మొదలగు వారుగా మారు అవకాశము కలదు ఏంటీ సోషల్ పరసనాలిటీ బిహేవియర్ (Anti Scocial Personality Behaviour) అని ఆధునికులచే ఇది పేర్కొనబడినది.

కామము, క్రోధము, లోభము ఇవి మూడును నరక ద్వారములుగా చెప్పబడినవి.

చికిత్స-పిత్త, వాత శామక, రజో గుణశామక చికిత్సలచే ఉపచరింపవలెను. ఉన్మాదమున చెప్పబడిన పరస్పర ప్రతిద్వంద్వ చికిత్సలు అనగా భయము కామములను తీర్చుట, దాన, హర్షణ, సాన్త్వనాదులచేత చికిత్సింపవలయును. కారణానుసార లక్షణానుసార ఇతర చికిత్సలు, మనః ప్రసాదక నిద్రాజనక చికిత్సలు ఆవశ్యకతననుసరించి ప్రయోగింపవలయును.

## హర్షము

హర్షము అనగా సంతోషించుట తనకు ప్రీతికరమైన వస్తువులు పొందుటచే కలుగు ఆనందము ఇతరుల ద్రవ్యము తనకు లభించునపుడు కలుగు ఆనందము హర్షముగా పరిగణింప బడును.[1]

---

1. i) ఇష్టాదిగమనజన్యఆనందే

ii) పరద్రవ్యేషు అతిశయతాభిలాషే (వాచస్పత్య)

సాత్త్విక విషయములచే సుఖము లేక హర్షమును పొందుట శుభ ప్రద మైనది. ఆత్మబుద్ధి ప్రసాదకమైనది. పరిణామముగా దుఃఖమును కలిగించునది రాజస సుఖము. నిద్రను, ఆలస్యమును ప్రమాదమును కలిగించునది తామస సుఖము. కార్యము సిద్ధించిన సంతోషము, సిద్ధించనపుడు విచారమును పొందుట రాజస గుణలక్షణము, హర్షము వలన కఫము. ఒక్కొక్కప్పుడు వాతము ప్రకోపించును.[1]

హర్షము వలన కలిగిన ఉద్వేగము హృద్రోగాది వ్యాధులకు ఒక్కొక్కప్పుడు మరణమునకు దారితీయును.

లక్షణములను కారణములను గమనించి హేతు ప్రత్యానీక చికిత్సలు లాక్షణిక చికిత్సలు చేయవలయును.

ఉన్మాదాదులందు చెప్పబడిన శోక క్రోధాది ప్రతిద్వంద్వ చికిత్సలు ఇతర అవస్థానుసార చికిత్సలు చేయవలయును.

## విషాదము

విషాదమనగా శోకము, దుఃఖము. శోకమును పొందుట రాజస లక్షణము.[2] శోకముచే ప్రధానముగా వాతము ప్రకోపించును. తదుపరి పిత్తము గూడా ప్రకోపించును. అకారణ విషాదము తామస కర్త లక్షణము.

శోకముచే కలిగిన ఉద్వేగము గూడా దుష్పరిణామములకు దారితీయును. ఉన్మాదము, అతిసారము వంటి వ్యాధులు శోకజములుగా పేర్కొనబడినవి.

---

1. i) భ. గీ. 18/38-39, 27
   ii) హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యః సచ మే ప్రియః (భ.గీ. 12/15)
2. 1 (ii) వలె.

దీర్ఘకాల శోకము అనేక శారీరక వ్యాధులను, ధాతుక్షయమును కలిగించును. అగ్నిని వికృతి చేయును.

హర్షణము, సాంత్వనము, మొదలగు క్రియలు, లక్షణ కారణానుసార చికిత్సలు, శోకోన్మాదోక్త చికిత్సలు చేయవలెను సత్యము, ఆత్మజ్ఞానము ఇవి విషాదమును పోగొట్టును.

## లోభము

లుబ్ధత్వము, లోభము, పర్యాయములు. ఇతరుల ద్రవ్యముపై ఎక్కువ ఆశ కలిగి యుండుట, తన ద్రవ్యమును సంచయము చేయుట లోభమనబడును. లోభత్వము రజోగుణము మొదలగు విషయములందు ఆశ అధికముగానుండును.[1]

లోభత్వము కూడా కామము క్రోధములవంటి దుష్ఫలితములు కలిగించును.

కారణ, లక్షణానుసార చికిత్సలు చేయవలయును.

## ప్రీతి

ప్రీఞ్ తర్పణే+భావే అను ఉత్పత్తిననుసరించి ప్రీతి అను పదము ఏర్పడును. తృప్తి, ప్రీణనము ఇష్టము అను అర్థములు వచ్చును.

పర్యాయములు-ప్రమద, హర్షః, ప్రమోదము, ఆమోదము, సమ్మోదము, ఆనందము, సుఖము, ప్రీతి మొదలగునవి.[2]

వ్యక్తి యొక్క ప్రీతి, ద్వేషములు అతని యొక్క శీలము, సంస్కారము, మానసిక స్థితిని ఆరోగ్యస్థితిని తెలియ చేయును.

సాత్విక, రాజస, తామస ప్రీతికరములైన ఆహారాది ఇదివరలో వర్ణింపబడినవి. అవియు ఇతరమైన అహితాహారాదులను ప్రీతి పైనప్పటికిని

1. i) భ. గీ. 14/12
2. శబ్దకల్పద్రుమ III-389.

క్రమక్రమముగా వదలి హితమైన సాత్త్వికమైన ఆహారాదులను అభ్యాసము చేయ వలెను అహితకరమైన ఇంద్రియార్థములను గూడా వదల వలయును.

## శ్రద్ధ

శ్రద్ధ అనగా ఆసక్తి లేక భక్తి. సంస్కారముతోకూడిన అంతః కరణము ననుసరించి శ్రద్ధ కలుగుచున్నది. శ్రద్ధ అనగా గుణము, శీలము అని చెప్ప వచ్చును. ఇవి సాత్త్విక, తామస, రాజసములను మూడు విధములుగానుండును. ఏ సత్త్వముగలవారికి తదనుగుణ విషయములందే శ్రద్ధ యుండును.[1]

ప్రీతిని గురించి చెప్పిన విషయములే శ్రద్ధకు గూడా వర్తించును.

మానసిక వ్యాధులలో ముఖ్యముగా ఉన్మాదములో భక్తి, ప్రీతి ఇవి విభ్రంశము నందును.[2] భక్తి విభ్రంశము జరిగినది లేనిది పరీక్షించి తెలిసికొనవలసి యుండును.

భక్తి విభ్రంశమును తెలిసికొనుటకై ప్రత్యక్ష అనుమాన ఆప్తోపదేశముల ద్వారా రోగి బంధువులు ఇచ్చిన సమాచారము ననుసరించి వ్యాధిరాకముందు స్థితికి, వ్యాధి వచ్చిన తరువాత స్థితికి ఈ క్రింది విషయములో అధికమైన మార్పు జరిగినది లేనిది గ్రహించవలయును.

అనగా ఆహారపుటలవాట్లలో, స్త్రీల యందుండు విధానములో, నిద్ర, వస్త్ర ధారణ, మొదలైన వానిలో శ్రద్ధ, అశ్రద్ధలు (ఇచ్ఛా.ద్వేషములు)

---

1. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధాభవతి భారత
 శ్రద్ధామయోఽయం పురోషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః (భ.గీ.17/3)

2. i) భక్తిరిచ్ఛా (చ.వి. 7/5 పై చక్రపాణి)

 ii) భక్తి విభ్రంశాత్ యత్ర ఇచ్ఛా పుర్వేఆసీత్ తత్ర అనిచ్ఛా భవతి (చ.వి. 7/5 పై చక్రపాణి)

ఉన్మాదమునందు భక్తి విభ్రంశముచే ఇవన్నియు మార్పు చెందును.

అట్లు విభ్రంశము చెందినపుడు వ్యాధిని నిర్ణయించి తగిన ఉపచారములు చేయవలయును.

## ద్వేషము

ద్విష+ఘఞ్‌—అను ఉత్పత్తిచే ద్వేషము అను పదము ఏర్పడినది. అనిచ్ఛ అని దీని అర్థము.

పర్యాయములు—శత్రుత, వైరము, విరోధము, విద్వేషము, ద్వేషణము[1].

ఆయా ఇంద్రియములకు అనుకూలముగా నుండు విషయములు ప్రీతి (అని)యు వ్యతిరేకముగా నుండు వానిపై ద్వేషమును ఉండును.[2]

భక్తి విభ్రంశ పరీక్షలో ప్రీతి ద్వేషముల రెంటి ద్వారా పరీక్షించవలసి యుండును. కనుక అచ్చట వివరింపబడిన విషయములు ద్వేషమునకును వర్తించును.

## భయము

భీ+ఏరచ్‌—నుండి భయము ఉత్పన్నమైనది. రౌద్రత్వము నుండి జనించిన చిత్త వైక్లబము భయము. దీనిని పిరికితనము అందురు.

తన కిష్టమయిన విషయమునకు వ్యతిరేకత కలిగినపుడు దానినుండి నివారణమునకై ప్రయత్నించు చిత్తవృత్తి భయము అనబడును.

పర్యాయములు—త్రాసము, భీతి, భయము, ఆతఙ్కము, ఆశఙ్కము.[3]

---

1. శబ్దరత్నావళి
2. ఇంద్రాయస్యేన్ద్రియస్యార్థేరాగద్వేషౌ వ్యవస్థితౌ
   తయోర్నవశమాగచ్ఛేత్తౌ హ్యస్యపరిపన్థినౌ (భ.గీ. 3/34)
3. శబ్దకల్పద్రుమము.

భయము తామసగుణమునకు సంబంధించినది. నీచమైనది. వాతమును ప్రధానముగా ప్రకోపింపచేయును.

ఉన్మాదాది మానసరోగములకు కారణమైనది.

అవయములు కంపించుట, నోరెండుట, స్వేదము, భ్రమ, మోహము ఈ లక్షణములు భయము వలన కలుగును.

భయముచే అనేక శారీరక మానసిక వ్యాధులు కలుగుటకు అవకాశము కలదు. అందుచే ఆశ్వాసనాదులచే ఊరడించి కారణమునకు లక్షణములకు తగిన చికిత్సలు చేయవలయును. ఉన్మాదోక్త చికిత్సలు అవస్థానుసారము ప్రయోగింపవచ్చును. ధైర్యమును కలిగించవలయును.

## ధైర్యము

ధీరత, ధీరునియొక్క భావములు కర్మలు కలిగియుండుట ధైర్యము అనబడును.

ఉన్నతమైన స్థిరమైన చిత్తము కలిగియుండుట ధైర్యము.

విఘ్నములు కలిగినను తను ప్రారంభించిన పనిలో లగ్నమైయుండుట ధైర్యమనబడును.[1]

భగవద్గీతయందు ధృతి ధైర్యమునకు పర్యాయముగా వాడబడినది. ఆయా గుణములననుసరించి ధైర్యము యొక్క లక్షణములు త్రిగుణముల ప్రకరణమున చెప్పబడినవి. వానిలో సాత్త్విక ధైర్యము కలిగి ఉండుట శ్రేష్టమైనది.

అనవసరమైన ధైర్యము ప్రదర్శించుట అతిసాహసమనబడును. అది ప్రజ్ఞాపరాధము. రాజస, తామస ధైర్యములను వదలి సాత్త్విక ధైర్యమును అలవరచుకొనవలయును.

---

1. శబ్దకల్ప ద్రుమము

2. Anti Social Personality Behaviour API Text Book.

సాహసము ఒక్కొక్క సమయమున ఆత్మహత్యకు, ఇతరులకు హాని కలిగించుటకు దారితీయును. కారణ, లక్షణములననుసరించి ఉన్మాదోక్త చికిత్సలు ప్రయోగింపవలయును.

## లజ్జ పరీక్ష

లజ్జ అనగా సిగ్గు. ఇవి ఒక అంతః కరణవృత్తి విశేషము. తప్పుచేయకున్నను చేసినట్లు ఇతరులనుండి భయపడుట లజ్జయందు జరుగును.

పర్యాయములు—మన్దాక్షము, మన్దాస్యము, హ్రీ!, వ్రీడము, వ్రీడనము, త్రిపా, అపత్రపా.[1]

తప్పుచేసినను సిగ్గుపడకుండుట అను లక్షణము బుద్ధిభ్రంశాదులు జరిగినపుడు కలుగును. లజ్జ అనునది శీలాచారములలో ఒక భాగము. అందుచే శ్రద్ధ-భక్తిని గురించి చెప్పిన విధముగనే లజ్జను గూడా పరీక్షింపవలయును.

లజ్జా వైపరీత్యమున కారణ లక్షణానుసారము ఉన్మాదోక్త చికిత్సలు చేయవలయును.

## భ్రాన్తి పరీక్ష

భ్రాన్తి, భ్రమ, భ్రమణము-ఒకే అర్థమును సూచించును.[2]

భ్రమ అను మనోవికారము రజోగుణము, పిత్తము వాతములచే కలుగును. దీనిని గూర్చి మూర్ఛాదిరోగ ప్రకరణాంతమున విపులముగా వర్ణింపబడినది.

---

1. i) లజనమితినుజ వ్రీడనే
   ii) అన్తః కరణవృత్తి విశేషః అమరః
   iii) అకర్మణ్యేకర్మణి పరజ్ఞాన్ భయమ్ (శబ్దరత్నావళి)
2. i) భ్రమే+క్తన్-భ్రమః (అమరము)
   ii) భ్రమణమ్-మేదినీ.

## మానస రోగమున రోగి పరీక్ష

**మానస** రోగములందు రోగి పరీక్ష ఎంతయో అవసరము. మిగిలిన శారీరక వ్యాధులకై చేయు పరీక్షలతో పాటు కొన్ని విశేష పరీక్షలు చేయవలెను.

1. మనస్సు యొక్క పరీక్ష :-

మనస్సు యొక్క కర్మలను పరీక్షించుట ద్వారా మనస్సును పరీక్షించవలయును.

ముఖ్యముగా పరీక్షింపదగిన మానసిక కర్మలు నాలుగు.[1] అవి.

1. ఇంద్రియాభి గ్రహము.
2. స్వ నిగ్రహము
3. ఊహ
4. విచారము.

1. ఇంద్రియాభిగ్రహము—ఇంద్రియముల ద్వారా విషయమును గ్రహించు సామర్థ్యము ఇంద్రియాభిగ్రహ మనబడును. మనస్సు యొక్క సామర్థ్యమును పరీక్షించుటకై ఇంద్రియములందు ఇంద్రియాధిష్టానములందు లోపము లేదను విషయమును ముందు నిర్ధారించవలయును. తర్వాత జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వ్యాపారములను పరీక్షించవలెను. శబ్దము, స్పర్శాది పంచజ్ఞానేంద్రియ కర్మలు, కర్మేంద్రియ కర్మలు పరీక్షించి, ప్రాకృత వైకృతస్థితిని నిర్ణయించవలయును. ఇంద్రియ సాపేక్షయదార్ధ జ్ఞానము ఏమైనా ఉన్నదేమో నిర్ధారించవలెను. ఇంద్రియార్ధము లేకయే ఊహాజనిత విషయజ్ఞానమును ఇంద్రియ సాపేక్షయధార్ధ జ్ఞానమందురు.

---

1. చ.శా. 1/21

కా. (3) 34

(Hallucinations.) రోగి సహకరించు స్థితిలోనే ఈ పరీక్ష చేయుట కవకాశముండును.

2. మనో నిగ్రహము—ఏదైనా ఒక విషయమునందుగాని, ఒక వస్తువునందు గాని ఏకాగ్రతను నిలుపగల సామర్థ్యమును పరీక్షించుట ద్వారా మనో నిగ్రహమును అంచనా వేయవలయును.

ఒక వస్తువుపై దృష్టి నిలిపి యుంచుట, వంటి పరీక్షలతో నిర్ణయింప వచ్చును. అహితమైన అర్థములనుండి నిగ్రహించుట గూడా మనో నిగ్రహమనబడును.

3. ఊహ—నిర్వికల్పకమైన ఆలోచనాజ్ఞానము ఊహ అనబడును.[1]

కొన్ని ప్రశ్నలు వేసియు, సంఘటనలను ఏర్పరచియు ఊహాశక్తిని పరీక్షించవలెను.

4. విచారము—హితాఽహిత యుక్తా యుక్త విచక్షణాజ్ఞానము విచారమన బడును.[2]

రోగి జీవితమునకు వృత్తికి సంబంధించిన విషయములపై చర్చించుట ద్వారా అతని ఊహాశక్తిని పరీక్షింప వలయును.

## 2. బుద్ధియొక్క పరీక్ష :—

బుద్ధిని గురించి బుద్ధి భ్రంశ వివరణలో చర్చించబడినది. బుద్ధి భ్రంశము జరిగినదా లేక బుద్ధి ప్రాకృతస్థితిలో ఉన్నదా అని తెలిసికొనుటకై బుద్ధిని

---

1. ఊహా ఆలోచనుజ్ఞానం నిర్వికల్పమ్ (చ.శా. 1/21 పైచక్రపాణివ్యాఖ్య)
2. విచారో హేయోపాదేయ తయా వికల్పనమ్

(చ.శా. 1/21 పై చక్ర. వ్యాఖ్య)

పరీక్షింపవలయును. నిశ్చయము చేయుట బుద్ధి యొక్క కర్మ. రోగి నిశ్చయము చేయగలుగు చున్నాడా లేదా అనునది పరీక్షింపవలెను.[3]

భూకంపము వచ్చిన ఏమి చేయుదువు. నీవు కూర్చొనిన బస్సుపై రాళ్ళు పడిన ఏమి చేయుదువు? ఇటువంటి ప్రశ్నలతో అతని బుద్ధిని పరీక్షింపవలెను. బుద్ధి భ్రాంతితో కూడియున్నదా లేదా అనునది వీని ద్వారా తెలుసుకొనవచ్చును.

## 3. స్మృతి యొక్క పరీక్ష

రోగికి సంబంధించిన వివరములు జన్మతిధి, వయస్సు, బంధువుల పేర్లు అతనినే అడుగుట మొదలైన వానివల్ల స్మరణశక్తి అంచనా వేయవలెను.

సంజ్ఞాజ్ఞానము—అనగా పేరు చెప్పుటకు తెలిసి యుండుట. ఈ జ్ఞానము నశించినపుడు తన పేరుగూడా తెలియదు. దేశము, కాలము, ఆత్మ వీనికి సంబంధించిన విషయములు తెలిసికొనుట ద్వారా అతని స్మరణశక్తిని పరీక్షింపవలెను.

## 4. శీల, ఆచారాది పరీక్ష

శీల విభ్రంశము, చేష్టా విభ్రంశము, ఆచార విభ్రంశము అనునవి ఉన్మాదమున లక్షణములుగా పేర్కొనబడినవి. ఉన్మాదముననే కాక మదము ఇతర మానసిక వికారములందును రోగియొక్క శీలము, చేష్ట, ఆచారము, శౌచము మొదలగు వానియొక్క స్థితిని పరీక్షించి నిర్ణయింప వలసియుండును.

---

3. i) బుద్ధిః తత్కాలవిషయా (సు.శా. 1/18,డ)
ii) అన్యేనియమాత్మికాబుద్ధిమాహుః (సు.శా. 2/3 పై డల్హణ)
iii) యా బుద్ధిర్నిశ్చయాత్మికా (చ.శా. 1/23)
iv) విషమాభినివేశో యోనిత్యాఽనిత్యేహితాఽహితే। జ్ఞేయః సబుద్ధివిభ్రంశః సమంబుద్ధిర్హి పశ్యతి విషమాభినివేశః అయధాభూత్వేనఅధ్యవసానం నిత్యమనిత్యమితి ప్రియమప్రియమతి (చ.శా. 1/99, చక్ర)

## 1. శీలము

శీలము అనగా మనుజుని యొక్క సహజమైన ప్రవృత్తి, ఈ శీలము అతని తల్లిదండ్రులు, పెరిగిన సమాజము, ఇతర పరిస్థితులు పూర్వజన్మ కృత కర్మలు వీటన్నింటి సాముదాయిక ఫలితముగా రూపుదిద్దుకొని యుండును. అతని శాస్త్రజ్ఞానము అనుభవము మొదలగునవి కూడా శీలముపై తమ ప్రభావము చూపును. శాస్త్రార్థాను సారమైన అవిపరీత స్వభావము శీలము అని చక్రపాణి వివరించెను.[1]

సాత్త్వికాది గుణముల వివరణలో చెప్పబడిన స్వభావములు ఆయా గుణములచే కలుగు పరిణామములకు కారణమగును.

ముఖ్యముగా మానసరోగులలో పరీక్షింపవలసిన ప్రధాన అంశము ఆ రోగికి వ్యాధికలుగుటకు ముందు ఉన్న శీలములో గణనీయమైన మార్పు వచ్చినదా అనునది నిర్ధారించవలెను.

శీలభ్రంశము వలన శీలము మారును. ఉదా- సాధారణముగా మధురపదార్థ సేవన చేయు వ్యక్తి మధుర పదార్థములు ద్వేషించుట, సామాన్యముగా కోపము రాని వ్యక్తికి కోపము వచ్చుట. ఎర్రని వస్త్రములందు ఇష్టము చూపు వ్యక్తి తెల్లని వస్త్రములపై ప్రీతిని కలిగియుండుట, మిత్రులను హితులను ద్వేషించుట.

---

1. i) శీలం సహజవృత్తమ్ (చ.ఇ. 1/3 పై చక్ర)
   ii) శీలం సహజవస్తుషురాగమ్ (చ.వి. 4/8 పై చక్ర)
   iii) శీలం శాస్త్రార్థానుసారిణో అవిపరీతస్వభావః (సు.శా. 2/3 పై డల్హ)
   iv) శీలమనుశీలనేన। అనుశీలనేనఇతి అనుశీలనం సంతతశీలనం తేన సతతం అయమర్థం సేనతేతత్ శీలమిత్యనుమీయతే (చ.వి. 4/8, పై చక్ర)
   v) శీలవిభ్రంశాత్ అక్రోధనః క్రోధనో భవతి (చ.ని. 7/5 పై చక్ర)

నిద్ర, ఆహారపు అలవాట్లు, దంతధావన అలవాట్లు, స్నానము, అభ్యంగము, తల దువ్వుకొనుట, క్రాపు, గడ్డము, గోళ్ళు, టీ, కాఫీల వంటి అలవాట్లు విరామ సమయమును గడుపు విధానము చదివే గ్రంథములు, మొదలగు వాటిన న్నింటిని జాగ్రత్తగా పరీక్షించి, అతని బంధువులు కుటుంబసభ్యుల ద్వారా వివరములు సేకరించి శీల భ్రంశము జరిగినది, లేనిది, జరిగినచో శీలభ్రంశము యొక్క తీవ్రత యెట్లున్నది అనునవి నిర్ధారణ చేయవలెను.

ముఖ్యముగా శీల పరీక్షలో ఈ క్రింది విషయములను గమనించవలయును a) అలవాట్లు, b) స్వభావము, c) శారీరక ధర్మములు, ఆకలి, నిద్రవంటివి. d) శౌచము, e) విరామసమయపు అలవాట్లు.

## 2. చేష్టా పరీక్ష

చేష్టలు అనగా కర్మేంద్రియములకు సంబంధించిన విషయములు— మాట్లాడుట, చేతులు తిప్పుట, నిలుచొనుట, నడచుట మొదలగు వానిలో ప్రతి వ్యక్తియందు ఒక ప్రత్యేకత యుండును. ఆ ప్రత్యేకతతో కూడిన భంగిమలలో మార్పు వచ్చుట అనుచితమైన చేష్టలు చేయుట చేష్టా విభ్రంశమనబడును.[1] శారీరక చేష్టలలో అంతకుముందు స్థితితో పోల్చినపుడు హీన, మిథ్యాలేక అతి ప్రవృత్తి ఏమైనా జరుగుచున్నదా గమనించి పరీక్షించవలయును. మాట్లాడు వేగము, విధానము, మాటలపొందిక, శరీర భంగిమలు, వేళ్ళు, ముఖము, పెదవులు వీని చేష్టలు జాగ్రత్తగా గమనించవలయును.

చేష్టా పరీక్షలో గమనించవలసిన ముఖ్యాంశములు. a) వాక్కు b) ముఖ భంగిమలు c) శారీరక చేష్టలు.

---

1. చేష్టావిభ్రంశాత్ అనుచిత చేష్టాభవతి (చ.వి. 7/5)

## 3) శౌచము-యొక్క పరీక్ష

శౌచము అనగా శుచిత్వము లేక పరిశుభ్రత. ఇది బాహ్యశుచిత్వము అభ్యంతర శుచిత్వము అని రెండు విధములుగా నుండును. అభ్యంతర శుచిత్వము ఇంద్రియములు, మనస్సు అంతః కరణములకు సంబంధించి సాత్విక గుణ ముతో కూడి యుండునది.

బాహ్య శుచిత్వము-దంతధావన, స్నాన, అనులేపన, వస్త్రధారణ మొద లగు శరీర బాహ్యశుద్ధికి సంబంధించినది. రోగి యొక్క పూర్వస్థితికి రోగ గ్రస్థానంతరస్థితికి అతని శౌచపు అలవాట్లలో మార్పు వచ్చినది లేనిది గమనించ వలయును.

మలమార్గ శోధన, దంతధావన, ముఖశోధన, నేత్ర ముఖ ప్రక్షాళనాదులు, స్నాన అభ్యంగ అనులేపనాదులు, కేశాలంకరణ, నఖశ్మశ్రువులు మొదలైనవి. అతని వస్త్రాలంకరణ పరిసరములు తన వస్తువులు ఉంచుకొను తీరు ఇవన్నియు పరీక్షించి అతని శీలమును, మానసిక స్థితిని, నిర్ణయింప వలయును.

అశుచికరమైన పనులు చేయుట ఆచారవిభ్రంశమునకు నిదర్శనము. అందుచే ఆచార విభ్రంశ నిర్ణయమున శౌచముయొక్క పరీక్ష ఒక భాగముగా నుండును.

## (4) ఆచారము

ఆచారములు, వ్యవహారము లందు కొంతవ్యక్తగత భేదములున్నప్పటికిని దేశ, కాల, మానములు, కులము, కుటుంబముల సాంఘిక ఆర్థిక స్థితిగతుల ననుసరించి మార్పులు చెందుచుండును.[2]

1. ఆచారవిభ్రంశాత్ అశౌచాద్యాచరతి (చ.ని. 7/5 పై చక్ర)
2. (i) ఆచారః శాస్త్రాది శిక్షా కృతో వ్యవహారః (చ.ని. 7/5 పై చక్ర) (చ. ఇ. 1/3 పై.చక్ర)
(ii) ఆచారః దేశకాలానుగతో లౌకిక విధానమ్ (సు.సూ. 2/3 పైడ)
(iii) ఆచారః శ్రుతి స్మృతి విహితానుష్ఠానమిత్యేకే (సు. సూ. 2/3 పైడ)

శాస్త్రాదుల అధ్యయనముచే జనించిన వ్యవహారమనియు, దేశకాలానుగత లౌకిక విధానమనియు, "ఆచారము" అను పదమునకు వివరణము ఇవ్వబడినది. శ్రుతులందును స్మృతులందును నిర్దేశించబడిన అనుష్ఠానము ఆచారమని కొందరి భావన.

పైన చెప్పబడినట్లు ఆయా వ్యక్తులకు సంబంధించిన సమాజములో తగినదిగా భావించబడిన వ్యవహారములు ఆచారము అనబడును.

ఉదా : అతని సమాజములో మంగళవారము కేశ ఖండన చేయించుట నిషిద్ధముగా నున్నపుడు ఆ పని చేయించుకొనుట ఆచార విభ్రంశముగా భావించవలయును. అట్లే స్నానాపూజాదులు, భోజనము చేయని సమాజములో చేయకనే అట్లు చేయుట అనాచారముగా భావింపబడును.

ఆచారములలో కొన్ని కొందరికి మంచివిగను కొందరికి మంచివి కానివిగను తోచవచ్చును. మానసరోగి పరీక్షలో అతనికి ఆచార వ్యవహారములలో పూర్వస్థితి నుండి మార్పు కలిగినదా లేదా పరీక్షించుట ముఖ్యమైన విషయము.

అందుకొరకై అతని వేషధారణ, మత సాంఘికాచారములు, ఇతరులతో ప్రవర్తించు విధానము, శారీరక చేష్టలు, సాంఘిక స్థితిగతులు వీనిని పరీక్షింపవలయును.

పరీక్షింపదగిన ముఖ్యాంశములు ఇవి.

(A) వ్యక్తిగత అంశములు:- శారీరక పరిశుభ్రత వస్త్రధారణ, అలంకరణ, శారీరక చేష్టలు వాక్కు:

(B) సాంఘిక అంశములు:- ఇతరులతో ప్రవర్తన :

# మానస రోగ సామాన్య చికిత్స

మానస రోగి హితాఽహితములను బాగుగా విచారించి ధర్మ, అర్థ, కామములకు అహితములైన వానిని సేవింపకుండా యుండుటకును, హితములైన వానిని సేవించుటకును సతత ప్రయత్నము చేయుచుండవలయును.

ధర్మార్థ కామములు లేకుండా మానసిక సంబంధమైన సుఖముగాని దుఃఖము గాని కలుగుటకు అవకాశములేదు కనుక వీనిలో హితములను సేవించుట వలన అహితములను వదలుట వలన మానసిక వ్యాధుల నివారణ, నిరోధము జరుగును.

ధర్మార్థ కామములు, యోగము, ఆయుర్వేదము, మానసిక విషయములు— వీనిని గురించి బాగుగా తెలిసినవారి సేవ చేసి పరిజ్ఞానమును పొందవలయును.

తన ఆత్మ యొక్క హిత అహిత జ్ఞానము, మొదలగునవి ఆత్మజ్ఞానమన బడును. అట్లే దేశ జ్ఞానము, కాలజ్ఞానము, కులజ్ఞానము, బలజ్ఞానము, తనయొక్క శక్తికి సంబంధించిన జ్ఞానము, వీటన్నింటిని పొంది తదనుసారము హితసేవనము అహిత వర్జనము చేయుచుండవలయును.[1]

---

1. తత్ర బుద్ధిమతా మానసవ్యాధిపరీతేనాపి సతా బుద్ధ్యా హితాహితమవేక్ష్య వేక్ష్య ధర్మార్థకామానామహితానామనుపసేవనే హితానాంచోపసేవనే ప్రయతితవ్యం నహ్యన్తరేణలోకే త్రయమేతన్మానసం కించిన్నిష్పద్యతే సుఖం వా దుఃఖం వా తస్మాదేతచ్చానుష్ఠేయం తద్విద్యవృద్ధానాం చోపసేవనే ప్రయతితవ్య
ఆత్మ దేశకాల బలశక్తి జ్ఞానే యథావచ్చేతి మానసంప్రతి భైషజ్యం త్రివర్గ స్యాన్వవేక్షణమ్। తద్విద్యసేవా విజ్ఞానమాత్మాదీనాం చ సర్వశః
(చ.సూ. 11/46-47)

అహితములైన జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ విషయముల నుండి తన మనస్సు నిగ్రహించుకొనుచు ఉండవలయును. ఇదియే సత్త్వావజయ చికిత్స అనబడును. మనస్సును ప్రజ్ఞాపరాధముల నుండి అసాంత్మేంద్రయార్థముల నుండి నిగ్రహించుకొనుచు, సమ్యగ్యోగములను సేవించుచుండవలయును.[1]

రజోతమో గుణముల నుండి మనస్సును మరల్చి సాత్త్విక ఆహారాదులు సేవించుచు సాత్త్విక గుణము వృద్ధి పొందించు ప్రయత్నములు చేయ వలయును.[2]

ఉపధా (కోరికలు) దుఃఖములకు కారణములు. పట్టుపురుగు తనను తను బంధించుకొనునట్లు మనుజుడు తన కొరికలచే తను బంధింపబడును. అట్టి కోరిక లను విడిచి పెట్టిన దుఃఖము శమించును. తనకు ఉన్న దానితో తృప్తిచెంద వలయును. మానసిక, వాచిక, శారీరక అధారణీయ వేగములను వర్జిచవ వల యును. సాత్త్విక మైన మానసిక, వాచిక శరీరక తపముల నాచరింప వలయును. పాపరహితమైన బుద్ధిని కలిగి జ్ఞానము లేపము యోగము లందు తత్పరతను కలిగియుండవలయును.[3]

---

1. (i) సత్త్వావజయః పునరహితేభ్యోఽర్థేభ్యోమనో వినిగ్రహః (చ.సూ.11/54)
   (ii) జితేంద్రియం నానుపత న్తిరోగా స్తత్కాలయుక్తం యదినాస్తి దైవమ్ (చ.శా. 2/43)

   ఆత్మేంద్రియ మనోర్థానాం సన్నికర్షాత్రవర్తతే సుఖదుఃఖమనారంభా దాత్మస్థే మనసిస్థిరే నివర్తతే తదుభయం వశిత్వం చోపజాయతే సశరీరస్య యోగజ్ఞాస్తం యోగమృషయో విదుః (చ.శా. 1/138-139)

3. (i) ఉపధాహి పరో హేతుర్దుఃఖదుఃఖాశ్రయప్రదః త్యాగః సర్వోపధానాం చ సర్వ దుఃఖవ్యపోహకః కోషకారోయథా హ్యంశూనుపాదత్తేవధప్రదాన్ ఉపాదత్తే తథా ఽర్థేభ్యోనివర్తతే అనారంభారసంయోగాత్తం దుఃఖం నోపతిష్ఠతే (చ.శా.1/95-97)

(Contd...

ఇంద్రియోపశమములను, సద్వృత్తమును అనుష్ఠించవలయును ఆప్తోప దేశములను పాటింపవలయును.[1]

మంచి బుద్ధి, జ్ఞానము (అధ్యాత్మ జ్ఞానము), విజ్ఞానము, ధైర్యము, సమాధి (విషయముల నుండి ఆత్మ మనో నిగ్రహము—ఇవన్నియు మానస వ్యాధుల నిరోధమునకు నివారణకు సహకరించును.[2]

హితాహారవిహార సేవనము, సమీక్ష్యకారిత్వము, విషయములందు అనసక్తి లేకుండుట, అన్ని ప్రాణులపై సమదృష్టి సత్యపరత్వము, క్షమత్వము కలిగి ఆత్మజ్ఞానము కలిగిన వారిని సేవించు మనుజుడు ఏ రోగమును పొందకుండా ఆరోగ్యముగా నుండును.[3]

మేధ్య రసాయనములను, ఆచార రసాయనములను సేవించుట మంచిది.

---

(ii) చ.సూ. 7/26-30 (iii) భ. గీ. 17/14-17)

(iv) మతిర్వచః కర్మసుఖానుబంధి సత్త్వం విధేయం విశదా చ బుద్ధిః జ్ఞానం తపస్తత్పరతా చ యోగే యస్యాస్తి తం నానుపతన్తి రోగాః

(చ.శా. 2/47)

1. త్యాగః ప్రజ్ఞాపరాధానామింద్రియోపశమః స్మృతిః దేశకాలాత్మన ప్రతిపత్తిశ్చ కారణమ్ విజ్ఞానం సద్వృత్తస్యాను వర్తనమ్। ఆగన్తూనామను త్పత్తౌ వేషమార్గోనిదర్శితః ప్రాజ్ఞః ప్రాగేవ తత్కుర్యాద్ధితం విద్యాద్యదా త్మనః ఆప్తోపదేశ ప్రజ్ఞానం ప్రతిపత్తిశ్చయకారణం వికారాణామనుత్పత్తాన్నానాం చ శాంతయే (చ.సూ.7/51-5 )

2. మానసో జ్ఞానవిజ్ఞాన ధైర్యస్మృతి సమాధిభిః (చ. సూ. 1/52)

3. నరోహితాహారవిహారసేవీ సమీక్ష్యకారీ విషయేష్వసక్తః దాతా సమః సత్యపరః క్షమావానాప్తోపసేవీ చ భవత్యరోగః (చ.శా. 2/46)

## ఓ జో క్ష య ము

మనస్సునకు స్థానమైన హృదయమే ఓజస్సునకును, ముఖ్యముగా పర ఓజస్సునకు స్థానమగుట వలన ఓజోక్షయము యొక్క ప్రభావము మనస్సుపై పడును.[1]

రసమునుండి శుక్రమువరకు గల అన్ని ధాతువుల సారము ఓజస్సన బడును.[2] భ్రమరములు అనేక ఫల పుష్పముల నుండి మధువును సంగ్రహించిన విధముగా శరీరము నుండి ఇది గ్రహింపబడును. ఇది సర్పిర్వర్ణము, మధుర రసము లాజగన్ధము కలిగియుండి పీత వర్ణముతో కూడిన రక్తవర్ణములోనుండును. ఓజస్సు సోమాత్మకముగానుండి స్నిగ్ధ, స్థిర, సర, శీత, వివిక్త, మృదు, మృత్స్న గుణములు కలిగియుండి శ్వేత వర్ణములో నుండును. ఓజస్సు శరీర మంతటను వ్యాపించి యుండి ప్రాణాయతనముగా నుండును. ఓజస్సు లభించనిచో శరీరము విశీర్ణమగును.[3]

---

1. హృదయం మనసః స్థానమోజసశ్చిత్తిసస్య చ

2. రసాదీనాం శుక్రాంతానాం ధాతూనాంయత్ పరం తేజస్తత్ ఖల్వోజస్తదేవ బలమిత్యుచ్యతే స్వశాస్త్రసిద్ధాంతాత్ (సు.సూ. 15/24)

3. i) హృది తిష్ఠతి యచ్ఛుద్ధం రక్తమీషత్సపీతకమ్ ఓజః శరీరే సంఖ్యాతం తన్నాశాన్నావినశ్యతి ప్రథమే జాయతే హ్యోజః శరీరేఽస్మిన్ శరీరిణామ్ సర్పిర్వర్ణం మధురసం లాజగన్ధి ప్రజాయతే భ్రమరైః ఫలపుష్పేభ్యో యథాసంభ్రియతే మధు ఏవమోజః స్వకర్మభ్యోగుణైః సంభ్రియతే నృణామ్॥ (చ.సూ. 77/74-76)

   ii) స్నిగ్ధం శుక్లం శీతం స్థిరం సరమ్ వివిక్తం మృదు మృత్స్నం చ ప్రాణాయతనముత్తమమ్ దేహః సావయవస్తేన వ్యాప్తో భవతి దేహినః తదభావాచ్ఛ శీర్యంతే శరీరాణి శరీరిణామ్ (సు.సూ. 15/26-27)

ఓజస్సు ప్రాకృత కర్మలు- ఓజస్సు ప్రాకృత స్థితిలోనున్నపుడు శరీరము నకు స్థిరత్వమును, పుష్టిని కలిగించును. అన్ని చేష్టలు (కార్యములకు) చేయు టకు తగిన సామర్థ్యము, స్వర వర్ణప్రసాదనము, అంతః కరణములకు (బుద్ధి, అహంకారము, మనస్సులకు) బాహ్యకరణములైన జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ ములకు కార్య సామర్థ్యము-ఇవన్నియు ఓజస్సు వలననే లభించును.[1]

ఓజస్సునకు బలమను పర్యాయము కూడా కలదు. ఓజస్సు పర ఓజస్సని అపర ఓజస్సని రెండు విధములు. అపర ఓజస్సు అర్ధాంజలి పరిమాణములో నుండి శరీరమంతటా వ్యాప్తి చెందియుండును.

అపర ఓజస్సు హృదయము నాశ్రయించి యుండి అష్ట బిందు పరిమాణ ములో నుండును. ఓజస్సుపైననే ప్రాణ మాధారపడి ఉండును.

అపర ఓజస్సు క్షీణించినపుడు ఓజో క్షయ లక్షణములు కలుగును. అపర ఓజస్సునుండి ప్రారంభమై పరఓజోక్షీణము వరకు వ్యాపించినపుడు మరణమునకు దారి తీయును.[2]

---

1. తత్రబలేన స్థిరోపచితమాంసతా సర్వచేష్టాస్వప్రతిఘాతః స్వరవర్ణ ప్రసాదోబాహ్యాభ్యంతరాణాం చ కరణానామాత్మకార్యప్రతిపత్తిర్భవతి (సు.సూ. 15/25)

2. i) సు.సూ. 15/24

ii) అర్ధాంజలి తావదేవశ్లైష్మికస్యౌజస (చ.శా. 7/15)

iii) చ.సూ. 30/9-11

iv) తత్పరస్యౌజస స్థానం తత్ర చైతన్య సంగ్రహః (చ.సూ. 30/7)

v) చక్రపాణి. చ.సూ. 30/7

## ఓజోక్షయ కారణములు

ఓజస్సు యొక్క ప్రాకృతస్థితి శరీరమందలి ఇతర ధాతువులపైనను ముఖ్యముగా రస, రక్తము శుక్రములపైన ఆధారపడి యుండును. ప్రాకృత స్థితిలో కఫము ఓజస్సుగా పరిగణింపబడినది కనుక కఫమునకు ఓజస్సునకు అధిక సామ్యతకలదు.[1]

విశిష్ట కారణములు :-

అభిఘాతము, ధాతుక్షయము, శ్రమ ఆకలి-ఈ శారీరక కారణములు.

క్రోధము, శోకము, ధ్యానము (చింత) ఈ మానసిక కారణములు, ఓజస్సును క్షీణింపచేయును-ఇవి విశిష్ట ఓజోక్షయ కారణములు.[2]

### సామాన్య కారణములు :-

ధాతుక్షయ కారణములు ఓజోక్షయ కారణములుగా పేర్కొనబడినవి. సామాన్యధాతుక్షయ కారణములు ఈ క్రింది విధముగా నుండును.

ఆహారము-రూక్ష, అల్ప లేక ప్రమిత ఆహార సేవన రూక్ష పానీయముల సేవన, అనశనము.

విహారాదులు-అధిక వ్యాయామము, వాతాతప సేవన, జాగరణము. కఫము, రక్తము, శుక్రము, మలములు వీనియొక్క అతి నిర్గమనము, వృద్ధావస్థ లేక ఆదానకాలము, భూతోపఘాతము.

---

1. నచైవౌజసః కాయే (చ.సూ. 17/117)
2. అభిఘాతాద్ క్షయాత్ కోపాచ్ఛోకాద్ధ్యానాచ్ఛ్రమాత్ క్షుధః
ఓజః సంక్షీయతే హ్యేభ్యోధాతుగ్రహణనిఃసృతం (సు.సూ. 15/28)
తేజః సమీరితం తస్మాద్విస్రంసయతి దేహినః (సు.సూ. 15/28)

**మానసిక కారణములు :-**

అధిక చిన్త, భయము, శోకము.

**సంప్రాప్తి :-**

పై కారణములచే వాతముచే ప్రేరితమైన ఓజస్సు క్షీణించియుండుటచే హృదయము, ధమనుల నుంచి విస్రృతమగుచు తన ప్రాకృతిక కర్మలను కలిగింప లేక పోవును.

**ఓజోక్షయ లక్షణములు :-**

ఓజోక్షయ లక్షణములు సామాన్యముగా నుండునవి చరకుడు వివరించెను. సుశ్రుతుడు మూడు విధములుగా విభజించి భేదములు వివరించెను.

ఓజోక్షయములు ఈ క్రింది భేదములు కలిగియుండును.

1. ఓజో విస్రంసనము
2. ఓజో వ్యాపత్తు
3. ఓజోక్షయము.

**సామాన్య లక్షణములు :-**

భయభీతత్వము దౌర్బల్యము, మిక్కిలి పరధ్యానముగా నుండుట, ఇంద్రియ వ్యథ, ఇంద్రియ పాటవము తగ్గుట, మనో బలము తగ్గి మనస్సు దూషింపబడుట, శరీరమునకు కాంతి తగ్గి రూక్షత్వము, క్షామత్వము కలుగుట —ఈ లక్షణములు ఓజోక్షయము వలన కలుగును.[2]

---

1. i) తస్య విస్రంసో వ్యాపత్ క్షయ (సు.సూ. 15/29)
   ii) సు.సూ. 15/30-31
   iii) మూర్ఛా మాంసక్షయో మోహః ప్రలాపో మరణమితి చ క్షయే (సు.సూ. 15/32)
2. తత్ర విస్రంసే వ్యాపన్నే చ క్రియావిశేషైరవిరుద్ధైర్బలమాప్యాయయేత్ ఇతరంతు మూఢసంజ్ఞం వర్జయేత్ (సు.సూ. 15/33)

భేదానుసార లక్షణములు :-

## 1. ఓజో (బల) విస్రంసనము

శరీరమందలి ధాతువులకు అవయవములకు ఓజస్సు స్రోతస్సుల నుండి పక్కలకు స్రవించుట వలన సరిగా లభించకపోవుటచే కలుగుస్థితి ఓజోస్రంసన మనబడును. సంధి విశ్లేషణము, గాత్రసాదము (శరీరము కృశించుట) దోష విస్రంసనము లేక వాతాది దోషములు స్థానభ్రష్టములగుట, శ్రమ (దౌర్బల్యము) క్రియాసన్నిరోధము-శారీరక, వాచిక, మానసి కాది సర్వక్రియలు, సరిగా ప్రవర్తింపకుండుట-ఈ లక్షణములు కలుగును.[1]

## 2. ఓజో వ్యాపత్తు

దోషములచే ఓజస్సు దుష్టి చెందుటచే కలుగుస్థితి ఓజోవ్యాపత్తు అనబడును. శరీరమంతయు బరువుగా నుండుట, అంగములన్నియు స్తంభించుట, వాతజశోధ, శరీర వర్ణము మారుట, అధికగ్లాని, తంద్ర, నిద్ర—ఈ లక్షణములు ఓజో వ్యాపత్తువలన కలుగును.

## 3. ఓజో క్షయము

మూర్ఛ, మాంసక్షయము, మోహము, ప్రలాపము, అజ్ఞానము-ఇవి పై లక్షణములన్నింటితోపాటు కలిగిన క్రమముగా మరణమునకు దారితీయును.[2]

---

1. వ్యాయామోఽనశనం చింతా రూక్షాల్పప్రమితాశనమ్
వాతాతపౌ భయం శోకో రూక్షపానం ప్రజాగరః కఫశోణితశుక్రాణాం
మలానాం చాతివర్తనమ్ కాలో భూతోపఘాతశ్చ జ్ఞాతవ్యాః క్షయహేతవః
(చ.సూ. 17/76-77)

2. బిభేతి దుర్బలోఽభీక్ష్ణం ధ్యాయతి వ్యథితేన్ద్రియః
దుశ్ఛాయో దుర్మనా రూక్షః క్షామశ్చైవౌజసః క్షయే॥ (చ.సూ. 17/79)

### ఓజో క్షయాదులకు చికిత్స

ఓజో విస్రంసనమునందును, ఓజోవ్యాపత్తు నందును బలము, దోషము, అగ్ని వీనికి విరుద్ధము కాకుండగ నుండునవియు ఓజస్సును బలమును వృద్ధి పొందింపచేయు చికిత్సలు చేయవలయును.

లక్షణాను సార కారణాను సార యితర చికిత్సలు చేయవలయును.

ఓజోక్షయమున సంజ్ఞలు నశించిన స్థితి అసాధ్యము కావున వర్జింప వలయును.[2]

## మానసిక వ్యాధుల అల్లోపేథీ వైద్యశాస్త్రము ననుసరించిన వర్గీకరణము

మానసిక వ్యాధులు అల్లోపెథీవైద్య మతానుసారము (అమెరికన్ సైకియాట్రిక్ అసోసియేషన్‌వారి విభాగము ఆధారముగా) క్రింద విభజింపబడినవి.

### మానసిక వ్యాధుల వర్గీకరణము

I మస్తిష్క-వికృతి జనిత వికారములు (Organic Brain Syndromes)

అ) కారణానుసారము

1. ఆభ్యంతర కారణజనిత వికారములు
   1) అజ్ఞాత కారణములు
   2) ధమనీగత కారణములు (ధమనీ అవరోధము మొ॥నవి)
   3) మస్తిష్క-పటలశోథ, అర్బుదము మొదలగునవి
2. బాహ్య కారణజనిత వికారములు
   1) సంక్రమణజనిత (Infectious)
   2) ఆగంతుజ
   3) వ్యాధిజ
   4) ఆహారజ
   5) మానసికజ

``) అవస్థానుసార

1. తీవ్ర (Acute)
   ప్రలాపము (Delirium)
2. జీర్ణ (Chronic)
   పిచ్చి (Dementia)

II ఉన్మాదాది వికారములు (Psychotic disorders)

1. స్కిజోఫ్రినియా (Schizophrenia)
   బుద్ధి చేష్టా వాక్ వికృతి
2. మానిక్ డిప్రెసివ్ సైకోసెస్ (Manic depressive psychosis)
3. పారనాయిడ్ స్టేట్స్ (Paranoid States)
   భూతోన్మాదము వంటి అవస్థ
4. దుఃఖజోన్మాదము (Reactive psychoses)

III న్యురోటిక్ డిజార్డర్స్ (Neurotic disorders)

1. ఉద్వేగము (Anxiety)
2. అపతంత్రకము (Hysteria)
3. భయజన్య (Phobic state)
4. గదోద్వేగము (Hypochondriasis)

IV మాదకద్రవ్య వ్యసనము

మద్యము యితర మాదకద్రవ్యములు

V సైకోసొమాటిక్ (Psychosomatic)

మనోవికారజ శారీరక వ్యాధులు

VI పరసనాలిటీ డిజార్డర్స్ (Personality disorders)

సత్త్వవికృతులు

## ఉన్మాదము

ఉన్మాదము అను వ్యాధి వర్ణనమును గమనించిన అన్నివిధములగు మానసిక వ్యాధులకు ఇది సామాన్య సంకేతముగా తోచును. ముఖ్యముగా సైకొటిక్ డిజార్డర్సు (Psychotic disorders) అన్నియు యిందు అంతర్భూతమందును.

**నిరుక్తి :-**

అధికముగ వృద్ధి చెందిన దోషములు ఊర్ధ్వ భాగమునకు వ్యాపించి మనోవహములగు ధమనుల నాశ్రయించి మనస్సును భ్రమింప చేయుటచే ఉన్మాదమని చెప్పబడుచున్నది.[1]

"ఉన్మద్యతేఽనేనేతి ఉన్మాదః" అను ఉత్పత్తి చేత మనస్సును చలింప చేయు వ్యాధి ఉన్మాదము అని అర్థము.

చరకునిచే వర్ణించబడిన ఉన్మాద స్వరూపము అతి వ్యాపకమైనది. మనస్సు, బుద్ధి, సంజ్ఞా, జ్ఞానము, స్మృతి, భక్తి, శీలము, చేష్టలు, ఆచారము- వీని విభ్రంశము లేక విషమత్వము ఉన్మాదమును సూచించును అని చెప్పబడినది.[2]

**నిదానము :-**

విప్రకృష్ట నిదానము-ప్రాచీనకాలమున దక్షప్రజాపతి యజ్ఞ విధ్వంస సమయమున కలిగిన త్రాసము. భయము, శోకములవలన ఉన్మాద వ్యాధి యొక్క ఉత్పత్తి జరిగినది.[3]

---

1. మదయంత్యుద్గతా దోషా యస్మాదున్మార్గమాశ్రితాః
మానసోఽయమతో వ్యాధిరున్మాద ఇతి కీర్తితః (సు. ఉ. 62/3)
2. ఉన్మాదం పునర్మనోబుద్ధి సంజ్ఞా జ్ఞానస్మృతిభక్తి శీల చేష్టా చార
విభ్రమం విద్యాత్ (చ. ని. 7/5)
3. తస్మిన్ హి దక్షాధ్వరధ్వంసే దేహినాం నానాదిక్షు విద్రవతామతి
తరణ ప్లవన ధావన లఙ్ఘనాద్యైర్దేహవిక్షోభణైః పురాగుల్మోత్పత్తిరభూత్ హవిష్ప్రాశాన్మేహకుష్ఠానాం భయోత్రాసశోకైరున్మాదానాం
(చ. ని. 8/11)

నిజ (లేక దోషజ) మరియు ఆగంతుజ ఉన్మాదములకు కారణములు వేర్వేరుగా నుండును.

## దోషజ ఉన్మాదములకు సామాన్య కారణములు :

ఆహార సంబంధ కారణములు :-

మలినమైన, వికృతమైన, దూషితమైన, అనుచితమయిన ఆహారములను విషమముగా సేవించుట; విరుద్ధమైన, అశుద్ధమయిన ఆహారములను సేవించుట.

మానసిక కారణములు :

భయపడుట, సత్వము (మనస్సు) వికలము నొందుట, ఉపహత మనస్సు లేక చంచల స్వభావము కలిగి యుండుట, కామము, కోపము, లోభము, సంతోషము, భయము, దుఃఖము, మోహము, ఆయాసము, చింత, ఉద్రేకము - మొదలగు వానిచే మాటిమాటికి మనస్సు చెడుట, అభిఘాతము నొందుటవలన మనస్సు చెడి బుద్ధి విచలితమగుట.

విహారాది కారణములు :-

తంత్ర ప్రయోగములను, శరీర వర్తనమును, గమనాది శరీర చేష్టలను విషమముగా ఆచరించుట.

ఇతర కారణములు :-

వృద్ధిపొందిన దోషములు కలిగియుండుట, శరీరము అధికముగా క్షీణించి

యుండుట, అభిఘాతము, బలమయిన వ్యాధిచే వ్యాకులత చెంది యుండుట - ఇవి దోషజ ఉన్మాదమునకు కారణములు[1].

ఆగంతుక ఉన్మాద కారణములు వేరుగా ఉండును, కనుక అవి తదుపరి వివరింపబడును.

## నిజ ఉన్మాదముల సంప్రాప్తి

ముందు చెప్పబడిన కారణములచే మనస్సు వికృతిచెంది బుద్ధి విచలితమై యుండుటవలన దుష్టములయిన వాతాది దోషములు ఉదీర్ణములై, రజస్తమోగుణములచేత ఆవృతమై సత్త్వగుణముగల మనుజుని బుద్ధికి నివాసమైన హృదయమును దూషింపచేసి మనోవహములగు స్రోతస్సులను ఆవరించి మనస్సునకు మోహమును అతి శీఘ్రముగా కలిగించును. ఇదియే ఉన్మాదమనబడును.[2]

---

1 (i) తత్రా దోషనిమిత్తాశ్చత్వారః పురుషాణామేవం విధానాం క్షిప్రమభినిర్వర్తన్తే తద్యథా-భీరూణాముపక్లిష్ట సత్త్వానాముత్సన్న దోషాణాం చ సమలవికృతోపహితాన్యనుచితాన్యాహారజాతాని వైషమ్యాపయుక్తేనోపయోగవిధినోపయుఞ్జానానాం తన్త్రప్రయోగం వా విషమమాచరతామాన్యాం వా చేష్టాం విషమాం సమాచరతామత్యుపక్షీణదేహానాం చ వ్యాధివేగసముద్భ్రమితానాముపహతమనసాం వా కామక్రోధలోభహర్షభయమోహాయాసశోకచిన్తోద్వేగాదిభిః పునరభిఘాతాభ్యాహతానాం వా మన్స్యుపహతే బుద్ధౌ చ ప్రచలితాయామభ్యుదీర్ణా దోషాః ప్రకుపితా హృదయముపసృత్య మనోవహాని స్రోతుంస్యావృత్య జనయన్త్యున్మాదమ్ (చ. ని. 7/4)

(ii) చ. చి. 9/4

2. i) చ.ని. 7/4

ii) తైరల్పసత్వస్య మలాః ప్రదుష్టాః బుద్ధేర్నివాసం హృదయం ప్రదూష్యః స్రోతాంస్యధిష్ఠాయ మనోవహాని ప్రమోహయన్త్యాశు నరస్య చేతః (చ.చి. 9/5)

## ఉన్మాద భేదములు

చరకుని అనుసరించి ఉన్మాదములు ఐదు విధములుగా నుండును. అవి

1. వాతజోన్మాదము
2. పిత్తజోన్మాదము
3. కఫజోన్మాదము
4. సన్నిపాతజోన్మాదము
5. ఆగంతుకోన్మాదము.[1]

మొదటి నాలుగు దోషజోన్మాదములనబడును. నిదాన, సంప్రాప్తిపూర్వ రూపములు, చికిత్సలు దోషజ ఆగంతుక ఉన్మాదములకు వేర్వేరుగా ఉండును.

సుశ్రుతుడు, వాగ్భటుడు ఉన్మాదమును 6 విధములుగా పేర్కొనిరి. అవి ఈ క్రింది విధముగా ఉండును.

1. వాతజ, 2. పిత్తజ, 3. కఫజ, 4. సన్నిపాతజ, 5. మనోగత దుఃఖ జనిత (సుశ్రుత) ఉన్మాదము-అధిజము (వాగ్భట), 6. విషజ ఉన్మాదము.[2]

చరకునిచే వర్ణింపబడిన భూతోన్మాదములను సుశ్రుత వాగ్భటులు అమానుషోపసర్గము, భూతప్రతిషేధము[4]లందు చేర్చిరి.

---

1. i) ఇహ ఖలు పఞ్చోన్మాదా భవన్తి, తద్యథా- వాత పిత్త కఫసన్నిపాతాగన్తు నిమిత్తాః (చ.ని. 7/3)
   ii) చ. చి. 9/8
2. i) ఏకైకశః సమస్తైశ్చ దోషైరత్యర్థమూర్ఛితైః మానసేన చ దుఃఖేన స పంచవిధ ఉచ్యతే విషాద్భవతి షష్ఠశ్చ యథాస్వం తత్ర భేషజమ్ (సు.ఉ. 62/4-5)
   ii) ఉన్మాదాష్షట్ పృథగ్దోషని చ యాధివిషోద్భవాః (అ.హృ.ఉ. 6/1)
3. అమానుషోపసర్గప్రతిషేధమధ్యాయము (సు.ఉ. 60)
4. భూతప్రతిషేధాధ్యాయము (అ.హృ.ఉ. 5)

ప్రారంభమున దోషోన్మాదములు వివరించి తదుపరి ఆగంతుకోన్మాదములు వివరింపబడును.

## పూర్వరూపములు

శిరస్సునందు శూన్యముగానుండుట, నేత్రములు కలకబారియుండుట, చెవులయందు ధ్వని కలుగుట, ఉచ్ఛ్వాసమధికమగుట, నోటి నుండి నీరుకారుట, ఆహారము నందిష్టము లేకపోవుట, అరుచి, ఆహారము సరిగా జీర్ణముకాకుండుట హృదయము బిగబట్టుట, అకారణముగా చింత, శ్రమ, మోహము, ఉద్వేగము ఇవి అకస్మాత్తుగా కలుగుచుండుట, ఎల్లప్పుడు రోమములు గగుర్పొడుచుట, మాటిమాటికి జ్వరము, ఉన్మత్త చిత్తము కలుగుట, ఉదర్దములు, అర్దితవాతము కలిగిన వానివలె వికారములుచేయుట, భ్రమించుచున్న, చలించుచున్న, అస్థిరమైన అప్రశస్తములయిన రూపములను మాటిమాటికి స్వప్నములందు గాంచుట, నూనెగానుగము ఎక్కినట్లును, వాతకుండలికచే పీడింపబడుచున్నట్లును, మురికి నీటియందు మునిగినట్లును, నేత్రములు వంకర తిరిగినట్లును స్వప్నములందు గాంచుట - ఇవి దోషజోన్మాదములందు కలుగు పూర్వరూపములు[1]

---

1. తస్యేమాని పూర్వరూపాణి తద్యథా-శిరసః శూన్యభావః చక్షుషోరాకులతా స్వనః కర్ణయోరుచ్ఛ్వాసస్యాధిక్యమాస్యసంస్రవణమనన్నాభిలాషోఽరోచకావిపాకౌ హృదయగ్రహో ధ్యానాయాససంమోహోద్వేగాశ్చాస్థానే సతతం లోమహర్షో జ్వరశ్చాభీక్ష్ణ మున్మత్తచిత్తత్వ ముదర్దిత్వమర్దితాకృతికరణం చ వ్యాధేః స్వప్నే చ దర్శనమభీక్ష్ణం భ్రాన్తచలితానవస్థితానాం చ రూపాణామప్రశస్తానాం తిలపీడకచక్రాధిరోహణం వాతకుణ్డలికాభిశ్చోన్మథనం నిమజ్జనం కలుషాణామమ్భసామావర్తేషు చక్షుషోశ్చాపసర్పణమితి దోషనిమిత్తానామున్మాదానాం పూర్వరూపాణి భవన్తి (చ.ని. 7/6)

శరీరమందలి అంగ ప్రత్యంగములన్నియు దుర్బలమగుట, అయినప్పటికి ఏ కార్యము చేయుటయందయినను అత్యధిక ఉత్సాహము కలిగియుండుట; స్వప్నమునందు కలుషిత భోజనము చేసినట్లుగాంచుట, వాయువుయొక్క ప్రకోపముచే బాధింపబడుట, చక్రముపై కూర్చొనిన విధముగా భ్రమ కలుగుట- ఇవి సుశ్రుతునిచే అధికముగా వివరింపబడిన ఉన్మాద పూర్వరూపములు[1]

## సామాన్య లక్షణములు

బుద్ధిభ్రమచెందుట, మనస్సు చంచలముగా నుండుటచే చింతించవలసిన వానిని చింతింపక ఇతర విషయములను గూర్చి చింతించుట, దృష్టి నిలకడ లేకుండాయుండుట, నేత్రములు సరిగా రూపములను గుర్తించలేక యుండుట, ధైర్యముతప్పి భయపడుట, అసంబద్ధముగా అనవసర విషయములు మాటలాడుట హృదయమునకు విచారణశక్తిలేక శూన్యమైయుండుట కలుగును-

స్మరణశక్తి, బుద్ధి, సంజ్ఞ-ఇవి నశించుటచే మూఢమయిన మనస్సుకలిగి యుండుటచే సుఖము, దుఃఖము, సదాచారము, ధర్మము, అధర్మము-వీనియొక్క వివేకజ్ఞానము నశించును. అశాంతితో ఇటునటు తిరుగుచుండును. ఇవి ఉన్మాద సామాన్య లక్షణములు.[2]

---

1. మోహోద్వేగౌ స్వనః శ్రోత్రే గాత్రాణామపకర్షణమ్
అత్యుత్సాహోఽరుచిశ్చాన్నే స్వప్నే కలుషభోజనమ్
వాయునోన్మథనం చాపి భ్రమశ్చక్రగతస్య వా
యస్య స్యాదచిరేణైవ ఉన్మాదం సోఽధిగచ్ఛతి (సు.ఉ. 62/6—7)

2. ధీవిభ్రమః సత్త్వపరిప్లవశ్చ పర్యాకులాదృష్టిరధీరతా చ అబద్ధవాక్త్వం
హృదయం చ శూన్యం సామాన్యమున్మాదగదస్య లిఙ్గమ్
సమూఢచేతా న సుఖం నాచారధర్మౌ కుత ఏవ శాన్తిం విన్దత్యపా
స్తస్మృతిబుద్ధిసంజ్ఞో భ్రమత్యయం చేత ఇతస్తతశ్చ (చ.చి. 9/6-7)

## వాతజ ఉన్మాదము

### నిదానము – సంప్రాప్తి:-

రూక్షకరములయిన, అల్పములయిన, శీతగుణముగల ఆహారములను అధికముగా సేవించుట, వమన విరేచనములు చేయించుకొనుట, రసాది ధాతువులు క్షీణించుట, ఉపవాసములు చేయుట—ఈ కారణములచే వృద్ధినొందిన వాతము చింతాదులచే దుష్టమయిన హృదయము దూషింపచేసి బుద్ధిని, స్మృతిని శీఘ్రముగా నశింపచేయుచు వాతజ ఉన్మాదమును కలిగించును.[1]

### లక్షణములు :

ఎల్లప్పుడు తిరుగుచుండుట, నేత్రములు, కనుబొమలు వీనిని త్రిప్పుచుండుట, పెదవులు, భుజములు, హనుపులు, హస్తములు, పాదములు ఇతర అంగములు వీనిని ఆకస్మాత్తుగా కదలించుట, లేక ఎగురవేయుట, సతతము అసంబద్ధముగాను, అసందర్భముగాను మాట్లాడుచుండుట, నోటి నుండి నురుగు వచ్చుట, చిరునవ్వు, నృత్యము, గానము వాయిద్యము వీనిని అనవసరముగా చేయుట,వీణ, పిల్లనగ్రోవి,శంఖము,శమ్య (వాద్యవిశేషము), తాళమువీని శబ్దముల వంటి ధ్వనులను బిగ్గరగ చేయుట, సవారీ చేయగూడని జంతువులపై ఎక్కి స్వారీ చేయుట, అలంకారమునకు ఉపయోగింపని ద్రవ్యములతో అలంకరించుకొనుట, పొందుటకు వీలుకాని వస్తువులను కోరుట, తనకున్న పదార్థము లందు అయిష్టతను కలిగియుండుట, మాత్సర్యము, కృశత్వము పరుషత్వము - ఇవి అధికముగా కలుగుట, నేత్రములు కలత బారి ఉబ్బి ఎర్రగానుండుట, వాతశామక

---

1. రూక్షాల్పశీతాన్న విరేకధాతు క్షయోపవాసై రనిలోఽతివృద్ధః
ఉన్మాదజు(తు)ష్టం హృదయం ప్రదూష్య బుద్ధిం స్మృతిం చాప్యుపహత్య శీఘ్రమ్ (చ.చి. 9/9)

ఉపచారములచే శమించుట, వాత వర్ధకములచే వృద్ధినొందుట- ఇవి వాతోన్మాద లక్షణములు.[1]

ఆహారము జీర్ణమైనపుడు వ్యాధి అధికముగా నుండుట,[2] శరీరము రూక్షముగా నుండుట, మాట పరుషముగా నుండుట, ధమనీ జాలము శరీరముపై వ్యాపించియుండుట, శైత్యత, కృశత్వము, తనుత్వముగా నుండు శరీరము కలిగి యుండుట : ఇవి సుశ్రుతుడు అధికముగా వివరించిన వాత జోన్మాద లక్షణములు.[3]

## పిత్తజ ఉన్మాదము

నిదానము - సంప్రాప్తి ;

అజీర్ణము, కటు, అమ్ల, విదాహి, ఉష్ణ భోజనములను సేవించుట, వీని వలన పిత్తము సంచితమై ఉదీర్ణమై వేగముతో కూడి జితేంద్రియుడు కాని

---

1. తద్యథా-పరిసర్పణమక్షిభ్రువామోష్ఠాంసహనుహస్త
పాదవిక్షేపణమకస్మాత్ అనియుతానాం చ సతతం గిరాముత్సర్గః
ఫేనాగమనమాస్యాత్ స్మితహసితనృత్యగీతవాదిత్రాదిప్రయోగా
శ్చాస్థానే వీణావంశశఙ్ఖశమ్యాతాలశబ్దానుకరణమసామ్నా యాన
మయానైః అలఙ్కారణమనలఙ్కారికైర్ద్రవ్యైః లోభోఽభ్యవహార్యే
ష్వలబ్ధేషు లబ్ధేషుచావమానస్త్రీవం మాత్సర్యం కార్శ్య పారుష్యం
ఉత్పిణ్డితా అరుణాక్షతా వాతోపశయవిపర్యాసాదనుపశయతా చేతి
వాతోన్మాద లిఙ్గాని భవన్తి - (చ. ని. 7/7)
2. చ. చి. 9/10
3. రూక్షచ్ఛవిః పరుషవాగ్ధమనీతతోవాశీతాతురః కృశతనుః
స్ఫురితాంగసంధిః ఆస్ఫోటయన్పఠతి గాయతి నృత్యశీలో
విక్రోశతి భ్రమతి చాప్యనిల ప్రకోపాత్ (సు. ఉ. 62/8)

మనుజుని హృదయమునందు తీవ్రవేగముతో వ్యాపించి పూర్వోక్త విధముగా శీఘ్రముగా పిత్తజ ఉన్మాదమును కలిగించును.[1]

లక్షణములు :

అసహనము, కోపము, ఆర్భాటము - ఇవి అనవసరముగా కలుగుట, శస్త్రములు, కర్రలు, రాళ్ళు, పిడికిళ్ళు - వీనిచే తనను తను కొట్టుకొనుట లేక ఇతరులను కొట్టుట, ఇతరులను తరుముట, చల్లనినీడ, చల్లనినీరు, అన్నము- వీనియందు ఇచ్ఛ కలిగి యుండుట, అధికమైన సంతాపము, నేత్రములు తామ్ర వర్ణములోగాని, హరిత (ఆకుపచ్చ) లేక హారిద్ర వర్ణములలోగాని, క్రోధయుక్తముగా గాని యుండుట, పిత్త శామక ద్రవ్యములతో ఉపశయము పిత్త వర్ధక ద్రవ్యములతో అనుపశయము కలిగి యుండుట, దిగంబరముగా నుండుట ఈ లక్షణములు పిత్తజ ఉన్మాదము నందు కలుగును.[2] (చరక)

దప్పిక, స్వేదము, దాహము, అరతి-ఇవి అధికముగా నుండును. నిద్ర సరిగా పట్టకుండుట; శీతల ప్రదేశములందు తిరుగుటకై ఇచ్ఛగించుట, చల్లని నీటిలో గూడా అగ్ని కలదను శంకను పొందుట— ఈ లక్షణములు పిత్తోన్మాదము

1. అజీర్ణ కట్వమ్ల విదాహ్యశీతైః భోజ్యైః చితం పిత్తముదీర్ణవేగం
ఉన్మాదముగ్రమనాత్మకస్య హృది శ్రితం పూర్వవదాశుకుర్యాత్
(చ.చి. 9/11)

2. (i) అమర్ష క్రోధసంరమ్భాచ్చాస్థానే శస్త్ర లోష్ట కాష్ఠ ముష్టిభిరభి
హననం స్వేషాం పరేషాం వా అభిద్రవణం శీతచ్ఛాయోదకాన్నాభిలాషా
సంతాపోఽతివేలం తామ్ర హరిత హారిద్ర సంరబ్ధాక్షతా పిత్తో
పశయ విపర్యాసాదనుపశయతా చేతి పిత్తోన్మాదలిఙ్గాని భవన్తి
(చ. ని. 7/7)

(ii) చ.చి. 9/12

నందు కలుగును. అగ్నిజ్వాలలు, నక్షత్రములు, దీపములు- ఇవి లేకున్నను ఉన్నట్లు కనిపించుట. ఈ లక్షణములు వాగ్భటునిచే అధికముగా చెప్పబడినవి.[1]

## కఫజోన్మాదము

నిదానము-సంప్రాప్తి :

దేహ పరిశ్రమ చేయకుండా మనుజుడు అధిక పరిమాణములో భుజించి నచో పిత్తముతో కూడి ప్రకోపించిన కఫము హృదయమను మర్మమును చేరి బుద్ధిని, స్మృతిని నశింపచేసి మనస్సును మోహింపచేయుచు కఫజోన్మాదమును కలిగించును.[2]

లక్షణములు :

ఒక ప్రదేశమునందే కూర్చొనియుండుట, మౌనముగా నుండుట, కొంచెముగా తిరుగుట నోటినుండి జొల్లు, నాసికనుండి కఫము స్రవించుచుండుట, ఆహారమునందిష్టము లేకుండుట, ఏకాంతముగా నుండుటయందు ఇష్టము కలిగి యుండుట, శరీరము భయంకరముగా నుండుట, శుభ్రతయందు ద్వేషము, అధికముగా నిద్రించుట, ముఖము ఉబ్బుట, నేత్రములు తెల్లగను, స్థిరముగను, మలినముగను యుండుట, శ్లేష్మమును శమింపచేయు క్రియలచే ఉపశయము,

---

1. (i) తృట్ స్వేదదాహబహులో బహుభుగ్వినిద్రశ్ఛాయాహిమానిలజలాంత
విహారసేవీ తీక్ష్ణో హిమాంబుని చయేఽపెసవహ్నిశంకీ పిత్తాద్దివా
నభసి పశ్యతి తారకాశ్చ (సు. ఉ. 62/9)
(ii) అ. హృ. ఉ. 6/10-11.

2. సంపూరణై ర్మన్దవిచేష్టితస్య సోష్మా కఫో మర్మణి సంప్రవృద్ధః బుద్ధిం
స్మృతిం చాప్యుపహత్య చిత్తం ప్రమోహయన్సంజనయేద్వికారమ్
(చ. చి. 9/13)

శ్లేష్మ వర్ధక క్రియలచే అనుపశయము కలిగియుండుట, స్త్రీయందు అభిలాష, వాన్తి, భోజనానంతరము లక్షణములు వృద్ధిచెందుట, నఖములు, త్వక్కు, మూత్రము-ఇవి తెల్లగానుండుట ఇవి శ్లేష్మోన్మాద లక్షణములు. (చరక).[1]

కాన, ఉష్ణపదార్థములచేత ఉపశమనము, రాత్రియందు వృద్ధి-ఈ లక్షణములు సుశ్రుతునిచే అధికముగా వివరింపబడినవి.[2]

## త్రిదోషజ ఉన్మాదము

వాత, పిత్త, కఫజన్య ఉన్మాదములకు వేర్వేరుగా చెప్పిన కారణముల కలయిక వలన సన్నిపాతజ ఉన్మాదము కలుగును. ఇందు వేర్వేరు దోషజ ఉన్మాదములకు చెప్పబడిన లక్షణములు కలసియుండును. కాని త్రిదోషములకు విరుద్ధములైన చికిత్సలు పరస్పర విరుద్ధములుగా నుండుటచే సన్నిపాతజ ఉన్మాదము అసాధ్యముగా నుండును కాన వర్జనీయము.[3]

---

1. i) స్థానమేకదేశే తూష్ణీంభావో, అల్పశ్చఙ్క్రమణం లాలాశిఙ్ఘాణకస్రవణం అనన్నాభిలాషో, రహస్కామతా, బీభత్సత్వం, శౌచద్వేషః స్వప్ననిత్యతా శ్వయథురాననే, శుక్లస్తిమితమలోపదిగ్ధాక్షతా, శ్లేష్మోపశయవిపర్యాసాదనుపశయతా చేతి శ్లేష్మోన్మాదలిఙ్గాని భవన్తి (చ. చి. 7/8)

   ii) చ. చి. 9/14

2. i) చర్ద్యగ్నిసాద సదనారుచి కాస యుక్తో యోషిద్వివిక్తరతిరల్పమతి ప్రచారః నిద్రాపరోఽల్పకథనోఽల్పభుగుష్ణసేవీ రాత్రౌ భృశం భవతి చాపి కఫప్రకోపాత్ (సు.ఉ. 62/10)

   ii) అ.హృ.ఉ. 6/12-13

3. i) యస్సన్నిపాతప్రభవోఽతిఘోరః సర్వైస్సమస్తైస్స చ హేతుభిస్స్యాత్ సర్వాణి రూపాణి బిభర్తి తాదృక్ విరుద్ధభైషజ్య విధిర్వివర్జ్యః (చ. చి. 9/15)

   ii) చ. ని. 7/7 iii) సు. ఉ. 62/11 iv) అ.హృ.ఉ. 6/14

## మనోదుఃఖజోన్మాదము

నిదానము-సంప్రాప్తి :

దొంగలు, రాజభటులు, శత్రువులు మొదలగు వారివలన తీవ్రమైన భయమును చెందుట, ధనముగాని, తనకు ప్రియమైన వస్తువులుగాని, బంధువులు గాని నాశనము చెందుటవలన తీవ్రమైన శోకము కలుగుట, తనకు మిక్కిలి ప్రియురాలైన స్త్రీతో రమింప నిచ్ఛగొని విఫలమగుట వలన మిక్కిల ఖేదమును పొందుట—ఈ కారణములచే మనస్సుపై ఆఘాతముకలిగి తీవ్రమైన ఉన్మాదము కలుగును.

లక్షణములు :

అనేక విధములుగా మాట్లాడుట, మనస్సునందుగల రహస్యమైనవిషయము లను బైటకుచెప్పుట, పోగొట్టుకొనిన ద్రవ్యములనుగూర్చి పలుమార్లు స్తుతించుచు చింతించుచు నిద్రించకయే తిరుగుచుండును. విరుద్ధ జ్ఞానము కలుగుట, గానము చేయుట, నవ్వుట, దైన్యముతో పలుమారు మూర్ఛనుపొందుచు హా హా యని ఏడ్చుచుండుట, మూఢ చిత్తుటగుట, పాండుత్వమును పొందుట ఈ లక్షణములు కలుగును. తీవ్రావస్థలో ఒకప్పుడు అకస్మాత్తుగా మరణమునుగూడా పొందును. ఇది మనోదుఃఖజోన్మాద లక్షణములు.[1]

## విషజోన్మాదము

విషపూరిత పదార్థముల సేవన లేక బాహ్య ప్రయోగములచే కలుగు

---

1. i) చౌరైర్నరేంద్ర పురుషైరరిభి స్తథాఽన్యైర్విత్రాసితస్యధనబాంధవసంక్ష యధ్వా, గాఢం క్షతే మనసి చ ప్రియయారిరంసోర్జాయేత చోత్కటతరో మనసోవికారః చిత్రంజ జల్పతి మనోనుగతం విసంజ్ఞోగాయత్యథో హసతి రోదితి చాపి మూఢః (సు.ఉ. 62/12)

ii) అ.హృ.ఉ. 6/15-16

ఉన్మాదములందు నేత్రములు ఎఱ్ఱగా నుండుట, దేహబలము, ఇంద్రియ బలము, శరీరకాంతి-ఇవి నశించును. భ్రమ, దైన్యత్వము, ముఖమున శ్యావ వర్ణము కలుగుట శరీరమున ప్రజ్ఞ నశించుట-ఉపేక్షించిన మరణము కలుగుట జరుగును.[1]

అసాధ్య లక్షణములు :

తల వంచియైనను, ఊర్ధ్వముఖముగానైనను ఉండుట. మాంసము బలము నశించియుండుట, నిదుర రాకుండుట-ఈ లక్షణములుగల ఉన్మాదరోగి మరణము నొందును.[2]

సన్నిపాత జోన్మాదము అసాధ్యము, మనోదుఃఖజోన్మాదము గూడా ఒకప్పుడు మరణమును కలిగించును. విషజోన్మాదముగూడా ఉపేక్షించినచో మరణమును కలిగించును. ఏమైనను కారణముల తీవ్రత ననుసరించి సాధ్యాఽసాధ్యతలు ఉండును.

## దోషజ ఉన్మాద చికిత్స

సాధ్యస్థితిలో ఉన్నటువంటి వాతజ, పిత్తజ, శ్లేష్మజ ఉన్మాదములలో ఈ క్రింది చికిత్సలు అవస్థ, దోషము, దూష్యము మొదలగు వానిని విచారించి చేయవలయును.

స్నేహనము, స్వేదనము, వమనము, విరేచనము, ఆస్థాపనము, అనువాసనము, ఉపశమనము, నస్యకర్మ, ధూమము. ధూపనము, అంజనము, అవపీడక నస్యము, ప్రధమన నస్యము, అభ్యంగము, ప్రదేహము, పరిషేచనము,

---

1. i) రక్తేక్షణో హతబలేంద్రియభాః సుదీనః శ్యావాననో విషకృతేఽథభవేత్పరాసుః (సు. ఉ. 62/13

ii) అ.హృ.ఉ. 6/17 iii) మా.ని. 20/15

2. అవాఙ్మ్ఖ.........వినస్యతి (సు.సూ. 34)

అనులేపనము, వధ, బన్ధనము (కట్టివేయుట), అవరోధనము (గదిలో మూసి ఉంచుట), విత్రాసనము (భయపెట్టుట), విస్మాపనము (ఆశ్చర్యపరచుట), విస్మరణము (మరపించుట), అపతర్పణము, సిరావ్యధనము, విధిపూర్వకముగా దోషానుసార ఆహారముల నిచ్చుట, నిదానమునకు విరుద్ధమైన ఔషధములను ప్రయోగించుట.[1]

చికిత్సా క్రమము :

ప్రారంభమున స్నేహనముచేయించి బాగుగా స్వేదనముచేయించి తీక్ష్ణమైన వమన విరేచనాదులచే శోధనము చేయించవలయును. తదుపరి శిరో విరేచనము చేయించవలయును.[2]

వాతజ ఉన్మాదమున ప్రారంభమున అనావృత వాతమున స్నేహపానము చేయించవలయును. వాతముయొక్క మార్గము ఆవరింపబడియున్నచో స్నేహ యుక్తమైన, మృదువైన ఔషధములతో శోధనము చేయించవలయును.

కఫజన్య ఉన్మాదమున ముందు స్నేహ స్వేదములను చేయించి తదుపరి వమనము చేయించవలయును.

---

1. సాధ్యానాం తు త్రయాణాం సాధనాని భవన్తి తద్యథా.... స్నేహస్వేద వమనవిరేచనాస్థాపనానువాసనోపశయనస్యకర్మ ధూపధూమపానాఞ్జనావపీడ ప్రధమనాభ్యఙ్గప్రదేహపరిషేకానులేపన వధబన్ధనావరోధనవిత్రాసన విస్మాపన విస్మారణాపతర్పణసిరావ్యధనాని భోజనవిధానం చ యథాస్వం యుక్త్యాయచ్చాన్యదపి కించిన్నిదానవిపరీతమౌషధం కార్యం తత్స్యాదితి (చ. ని. 7/8)

2. స్నిగ్ధం స్విన్నం తు మనుజమున్మాదార్తం విశోధయేత్
తీక్ష్ణైరుభయతోభాగైః శిరసశ్చ విరేచనైః (సు.ఉ. 62/15)

పిత్తజన్య ఉన్మాదమునందు స్నేహ స్వేదముల తదుపరి విరేచనము చేయించవలయును.

పై విధముగా శోధన చేయించిన తరువాత శుద్ధమైన కోష్ఠము కలవానికి పేయ మొదలగు సంసర్జన క్రమ విధానముతో ఉపచరింపవలెను,[1]

సంసర్జన క్రమము పూర్తయిన తరువాత నిరూహవస్తిని, స్నేహవస్తిని, శిరోవిరేచనమును దోషముల యొక్క బలా బలముల ననుసరించి చేయించ వలయును. దోషములు అధిక బలముగా నున్నచో నిరూహవస్తి మొదలగు వానివి మాటి మాటికి దోషశమనము కలుగునంతవరకు రోగి బలమును రోగబలమును గమనించుచు చేయించవలయును.[2]

సంశోధన ఫలము-హృదయము, చక్షురాది ఇంద్రియములు, శిరస్సు, కోష్ఠము-ఇవన్నియు పైన వివరించిన విధముగా వమన, విరేచన, శిరోవిరేచన, నిరూహ, అనువాసన వస్తుల (పంచ కర్మల) చేయుటచే శుద్ధమై మనస్సునకు ప్రసాదత్వము (నిర్మలత్వము) కలుగును. స్మృతి, జ్ఞానము సామ్యస్థితికి వచ్చును.[3]

---

3. ఉన్మాదే వాతజే పూర్వం స్నేహపానం విశేషవిత్ కుర్యాదావృతమార్గేతు సస్నేహం మృదు శోధనమ్ కఫపిత్తోద్భవేఽప్యాదౌ వమనం సవిరేచనం స్నిగ్ధస్విన్నస్య కర్తవ్యం శుద్ధే సంసర్జనక్రమః (చ. చి. 9/39-40)

1. నిరూహం స్నేహవస్తిం చ శిరసచ్ఛ విరేచనం తతః కుర్యాద్యథాదోషం తేషాం భూయస్త్వమాచరేత్ (చ.చి. 9/41)

2. హృదిన్ద్రియశిరఃకోష్ఠే సంశుద్ధేవమనాదిభిః మనఃప్రసాదమాప్నోతి స్మృతిం సంజ్ఞాం చ విన్దతి (చ.చి. 9/42)

అంజనాది ప్రయోగములు :

ముందు చెప్పబడిన పంచకర్మలచే శోధనము చేయించినను ఉన్మాదము శమించక ఆచార భ్రంశము అనువర్తించియున్న ఎడల తీక్ష్ణమైన నస్యములు, అంజనములు ప్రయోగించ వలయును.

తాడనము (కొట్టుట), మనస్సునకును, బుద్ధికిని, శరీరమునకును ఉద్వేగ మును కలిగించు క్రియలు చేయవలయును.[1]

## మనస్సును ప్రాకృత స్థితికి తెచ్చుక్రియలు

బెదిరించుట, ఉలిక్కిపడునట్లు చేయుట, కోరినది ఇచ్చుట, హర్షణము (సంతోషపడునట్లు చేయుట), సాన్త్వనము (మంచి మాటలతో అనునయించుట) భయపెట్టుట, విస్మయము (ఆశ్చర్యపరచుట), విస్మృతి (మరపించుట)[2] చేయ వలయును.

బాగుగా స్నేహితుడై ఆప్తుడైన వ్యక్తి ధర్మార్థములతో గూడిన ప్రియ వాక్యములచే రోగిని ఊరడించవలెను.

రోగికి అత్యంత ప్రీతి పాత్రమైన వస్తువులను గాని జనులను గూర్చి గాని పోయినవని చెప్పవలయును.

అతనికి అత్యంత యిష్టమైన, దుర్లభమైన అద్భుతమైన వస్తువులను చూపిం చుట ద్వారా, ఇచ్చుట ద్వారా ఆశ్చర్య పరచవలయును.

---

1. శుద్ధస్యాచారవిభ్రంశే తీక్ష్ణం నావనమఞ్జనం తాడనం చ మనోబుద్ధిదేహ సంవేజనం హితమ్ (చ.చి. 9/43)
2. తర్జనం త్రాసనం దానం హర్షణం సాన్త్వనం భయం విస్మయో విస్మృతేర్హేతోః నయన్తి ప్రకృతిం మనః (చ.చి. 9/45)

కోరలను తీసిన పచ్చిక చేసిన పాములనుగాని, సింహములనుగాని, ఏనుగులనుగాని చూపించి ఐనను, భయంకర రాక్షసాకారములను చూపి ఐనను; కత్తి మున్నగు ఆయుధములను చూపి ఐనను, దొంగలను, శత్రువులను, రాజభటులను చూపి వధింప వచ్చిరని చెప్పియు, నిర్జన ప్రదేశములకు కొనిపోయి ప్రాణ భయము కలిగించియు, భయపెట్టుట ద్వారా యుక్తితో మనస్సును ప్రాకృత స్థితికి తీసికొని రావలయును. నీటిలో పడవేయుచున్నట్లు అగ్నిలో వేయుచున్నట్లు చూపి భయపెట్ట వలయును.

క్రూర కర్మలు - శరీరమునకు సర్షప తైలమును పూసి కాళ్ళు చేతులు కట్టి ఎండలో పడవేయుట, దురదగొండి శరీరమునకు పూయుట, వేడి చేయబడిన లోహముచేగాని, తైలముతోగాని స్పృశించుట.[1]

జనములేని యింటిలో స్తంభమునకు కట్టి కొరడాలతో కొట్టుట-ఈ క్రూర కర్మల వలన మనస్సు చెదిరిపోయి తిరిగి ప్రాకృత స్థితిని పొందును.

ఈ క్రియలన్నియు ఆధునిక వైద్యమునందలి విద్యుత్ ఆకుంచన చికిత్స (Electro Convulsive Therapy or Shock treatment) కు తుల్యమైనవి.

---

1. i) ఆశ్వాసయేత్సుహృద్వాతం వాక్యైః ధర్మార్థసంహితైః
బ్రూయాదిష్టవినాశం వాదర్శయేదద్భుతాని వా బద్ధం సర్షపతైలాక్తం న్యసేదోత్తానమాతపే కపికచ్ఛ్వాథవాతప్తైఃలోహతైలజలైః
స్పృశేత్ (చ.చి. 9/93-94)

ii) సర్పేణోద్ధృతదంష్ట్రేణ దన్తైః సింహైర్గజైశ్చ తం త్రాసయేచ్ఛస్త్రహస్తైర్వాతస్కరైః శత్రుభిస్తథా అథవా రాజపురుషా బహిర్నీత్వా సుసంయతం త్రాసయేయుర్వధేనైనం తర్జయన్తో నృపాజ్ఞయా దేహదుఃఖభయేభ్యో హి పరం ప్రాణభయం స్మృతం తేన యాతి శమం తస్య సర్వతో విప్లుతం మనః (చ.చి. 9/96-98)

iii) సు. ఉ. 62/18-21

## గృహ బంధనము

ఈ క్రియలన్నింటిని ప్రయోగించినను ముందు చెప్పబోవు క్రియలచేతను (ప్రదేహ ధూమాదులచేతను) శమించక రోగి ఇతరులకు కష్టమును కల్గించు పనులనుగాని, తనకు హానికరములైన పనులనుగాని చేయుచున్నపుడు ఆ రోగిని దృఢముగా నుండి సుఖకరముగా నుండు పట్టీలతో కాళ్ళు చేతులు కట్టివేసి లోహపు కమ్మలు గాని, కర్రలుగాని ఇతరహానికరమైన వస్తువులుగాని లేనటువంటి చీకటిగా నుండు గృహమునందు బంధించి యుంచవలెను.[1] ఇట్లు రోగి పరిస్థితి కొంతవరకు మారు వరకు ఉంచవలసి యుండును.[2]

## ప్రదేహాదులు

మనస్సు బుద్ధి స్మృతి సంజ్ఞా ప్రబోధనము కొరకు ప్రదేహములు, ఉద్వర్తనములు, అభ్యంగములు, ధూమములు, ధూపములు ఘృత పానములు ప్రయోగింపవలయును.[3]

ఉన్మాదరోగికి పూర్తిగా సంజ్ఞాస్మృతులు నశించినపుడు సంజ్ఞాప్రబోధకములైన చికిత్సలు చేయవలయును.

---

1. కశాభిస్తాడయిత్వా వా సుబద్ధం విజనే గృహే
రుంధ్యాచ్చేతో హి విభ్రాన్తం వ్రజత్యస్య తథా శమమ్ (చ.చి. 9/95)

2. యస్యక్రోఽవినయే వస్త్రైః సంయమ్య సుదృఢైః సుఖైః
అపేతలోహకాష్ఠాద్యే సంరోధ్యశ్చతమోగృహే (చ.చి. 9/44)

3. ప్రదేహోత్సాదనాఽభ్యఙ్గధూమాః పానం చ సర్పిషః
ప్రయోక్తవ్యం మనోబుద్ధిస్మృతి సంజ్ఞాప్రబోధనమ్ (చ.చి. 9/46)

## సంజ్ఞా ప్రబోధక చికిత్సలు

తీక్ష్ణమైన అంజనములు, అవపీడక నస్యములు, ధూమములు, ప్రధమన నస్యములు, సూదులచే గుచ్చుట, కాల్చుట (దాహకర్మ). గోళ్ళలో సూదులు గుచ్చుట కేశములను రోమములను లాగుట, దంతములతో కొరకుట, కపికచ్ఛూ పత్రములు లేక ఫలరోమములు రుద్దుట, ఈ క్రియలు శీఘ్రముగా సంజ్ఞా ప్రబోధమును (తెలివిని) కలిగించును.[1]

## సిరా వ్యధనము

ఉరస్సు, అపాంగము, శంఖప్రదేశము, లలాటము, కేశాన్తసంధి - ఈ ప్రదేశములందు విధిననుసరించి సిరావ్యధనము చేయుట ఉన్మాదము అవస్మారము లందు హితకరము.[2]

## అన్యచికిత్సలు

హేతువులు దూష్యములు సమానముగా ఉండుట చేత అపస్మారమునందు చెప్పబడు చికిత్సలు ఉన్మాదమునందు ఆవశ్యకతను అనుసరించి ప్రయోగింపవలయును.[3]

---

1. అంజానాన్యవపీడాశ్చ ధూమః ప్రధమనాని చ సూచీభిస్తోదనం శస్త్రైర్దాహః పీడా నఖాన్తరే లుఞ్చనం కేశలోమ్నాం చ దన్తైర్దశనమేవ చ ఆత్మగుప్తావఘర్షాశ్చ హితాస్తస్యావబోధనే (చ.సూ. 24/46-47)

2. i) శంఖకేశాన్తసంధౌ వా మోక్షయేచ్ఛోణితం సిరాం ఉన్మాదే విషమే చైవ జ్వరేఽపస్మార ఏవ చ (చ. చి. 9/91)

   ii) ఉరోఽపాఙ్గ లలాటేషు సిరాశ్చాస్య విమోక్షయేత్ (సు.ఉ. 62/34)

3. i) యచ్చోపదేక్ష్యతే కిఞ్చిదపస్మారచికిత్సితే ఉన్మాదే తచ్చ కర్తవ్యం సామాన్యాద్దోషదూష్యయోః (చ.చి. 9/109)

   ii) సు. ఉ. 62/35

ఉన్మాదరోగికి చిత్త ప్రసాదమును కలిగించు క్రియలు మృదువైన శోధనములు, అంజనము మొదలగు క్రియలు ప్రయోగింప వలయును.[1]

ఉన్మాదము పూర్తిగా శమించిన తదుపరి మరల శోధన కర్మలు చేసి స్నేహవస్తిని ప్రయోగించిన మరల ఉన్మాదము కలుగకుండా యుండును.

ఉన్మాద నిరోధోపాయములు—మద్యము మాంసములను వదలి హితకరము లైన ఆహారములను సేవించుచు ఇంద్రియములను వశములోనుంచుకొని పరిశుద్ధమైన ఆచార వ్యవహారములను కలిగి మనస్సును సత్వ ప్రధానముగా ఉంచుకొను వానికి నిజాగన్తు ఉన్మాదములు ఎప్పుడును కలుగనేరవు.[2]

## ఉన్మాదముక్త లక్షణములు

ఇంద్రియార్థములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు; బుద్ధి,ఆత్మ, మనస్సు ఇవి వికృతి చెందక నిర్మలములుగానుండుట, అనగా వానివాని కర్మలను చేయుచుండుట, ధాతువులు, త్రిదోషములు, ప్రాకృత స్థితితో ఉండుట—ఇవి ఉన్మాదము నుండి విముక్తి చెందిన వానియందు కలుగు లక్షణములు.[3]

### ఉన్మాదమునందు ఆహారము

1. ఘృతము మాంసముతో కూడిన ఆహారమును తృప్తికలుగునంతవరకు

---

1. ఉన్మాదేషు చ సర్వేషు కుర్యాచ్చిత్త ప్రసాదనమ్
మృదు శోధనం మదేఽస్మేష క్రియాం స్మృతీం ప్రయోజయేత్
(సు.ఉ. 62/37)

2. నివృత్తామిషమద్యో యో హితాశీ ప్రయతః శుచిః
నిజాగన్తుభిరున్మాదైః సత్త్వవాన్ న సయుజ్యతే (చ.చి. 9/110)

3. ప్రసాదశ్చేన్ద్రియార్థానాం బుద్ధ్యాత్మమనసాం తథా
ధాతూనాం ప్రకృతిస్థత్వం విగతోన్మాద లక్షణమ్ (చ.చి. 9/111)

భుజింపచేసి గాలి చొరని గదిలో సుఖముగా ఉన్మాదరోగిని నివసింపచేసినచో ఉన్మాదము శమించును.[1]

2. మూడురోజులకొక మారు యవాగు, యవమంథమునుగాని లాజసక్తు తర్పణమునుగా ఇవ్వవలయును. లేక కేవలము జలముతో ఈ సక్తును ఇవ్వ వలయును.

3. బహుశ్రుతమైన కుల్మాషమును ఇవ్వవలయును.

4. రోగి మనస్సునకు ఇంపును కలిగించునవి, దీపనీయములుగా ఉండు నవి, పథ్యకరములుగా ఉండునవియు అగు ఇతర ఆహారములను ఇవ్వ వలయును.[2]

## విశేష ఉన్మాద చికిత్సలు

వాతిక—కఫజ ఉన్మాదములు :

శోధన చికిత్సలు ఇదివరకే వివరింపబడినవి. విశేషించి ప్రసేకము, పీనసముతో కూడియున్నపుడును, వాత శ్లేష్మములచే కలిగిన ఉన్మాదములందును గన్ధ ద్రవ్యములచేతనైనను, శ్వేతా, జ్యోతిష్మతీ మొదలగు వైరేచనిక ధూమ ద్రవ్యములచే నైనను హింగునుచేర్చి విధిననుసరించి ధూమవర్తిని సిద్ధముచేసి ధూమపానము చేయవలయును.

---

1. ఘృతమాంసనిత్యప్తం వా నివాతే స్థాపయేత్సుఖం
త్యక్త్వా మతిస్మృతిభ్రంశ సంజ్ఞాం లబ్ధ్వా ప్రముచ్యతే (చ.చి. 9/92)

2. త్ర్యహాత్ త్ర్యహాద్యవాగూశ్చ దద్యాత్సక్తూన్ జలేన వా
కేవలానంబుయుక్తాన్ వా కుల్మాషాన్ వాబహుశ్రుతః
హృద్యం యద్దీపనీయం చ తత్పథ్యం తస్యయోజయేత్ (సు.ఉ. 62/22)

ఈ క్రింది ద్రవ్యములను యథా సంభవముగా గ్రహించి సేకమునకు, అంజనమునకు ప్రధమన నస్యమునకును, ధూపమునకును, ఉపయోగింపవలయును.

శల్లక (ముళ్ళపంది), ఉలూక (గుడ్లగూబ) మార్జాలము, జంబూకము, వృకము (తోడేలు), బస్త, వీని యొక్క మూత్రము, పిత్తము, పురీషము, రోమములు, నఖములు, చర్మములు—వీనిని పైన పేర్కొనిన విధముగా అంజనాదులకు ప్రయోగింపవలయును.[1]

పైత్తిక ఉన్మాద చికిత్స :

మహాతిక్తక ఘృతమునుగాని, జీవనీయ ఘృతము(వాతరక్త చికిత్సోక్త)ను గాని, గుల్మ చికిత్సోక్త మిశ్రక స్నేహమును గాని పానాదులకు ప్రయోగించ వలయును. పైత్తికోన్మాదరోగికి శీతలములు, మధురములు, మృదువుగను, లఘువుగను ఉండునవియు అగు ఆహారములను, పానములను సేవింప చేయ వలయును.[2]

మనోగత దుఃఖజనిత ఉన్మాద చికిత్స :

ధర్మార్థ సహితములైన సాంత్వన వాక్యముల చేత రోగిని ఊరడించి ఇష్టద్రవ్యాదుల వినాశము వలన కలిగిన శోక శల్యమును పరిహరింపవలయును.

---

1. ప్రసేకే పీనసే గన్ధైః ధూమవర్తిం కృతాం పిబేత్ వైరేచనికధూమోక్తైః శ్వేతాద్యైర్వాసహింగుభిః శల్లకోలూకమార్జారజమ్బూకవృకబస్తజైః మూత్రపిత్తశకృల్లోమనఖైః చర్మభిరేవ చ, సేకాఞ్జనం ప్రధమనం నస్యం ధూపం చ కారయేత్ వాతశ్లేష్మాత్మకే ప్రాయః (చ.చి. 9/86-88)

2. పైత్తికేషు ప్రశస్యతే తిక్తకం జీవనీయం చ సర్పిః స్నేహాశ్చ మిశ్రకః శీతానిచాన్నపానాని మధురాణి మృదూని చ (లఘూని చ) (చ.చి. 9/88-90)

నశించిన వస్తువులకు తుల్యమైన వేరొక వస్తువునిచ్చి ఓదార్చి సముదా యింప వలయును.[1]

ఇతర మానసిక వికారములచే కలిగిన ఉన్మాదములందు ఈ క్రింధి విధముగా పరస్పర ద్వంద్వ కారణములను ఉత్పన్నము చేయుట ద్వారా ఉన్మాదమును శమింప చేయవలయును.

కామముచేత కలిగిన ఉన్మాదమునకు శోకము భయములచేత; శోకము చేత కలిగిన ఉన్మాదమునకు కామము హర్షములచేత, ఈ విధముగా కామ, శోక, భయ, హర్ష ఈర్ష్య లోభములచే కలిగిన ఉన్మాదములందు వాని వానికి పరస్పర విరుద్ధ క్రియల ద్వారా స్వాస్థ్యమును కలిగింపవలయును.[2]

విషజోన్మాద చికిత్స :

మొదట మృదువుగా ఊర్ధ్వాధ శోధనములను చేయించి సుశ్రుత కల్ప స్థానమున వివరింపబడిన విషహరాగదములను చికిత్సలను అవస్థానుసారము చేయింప వలయును.[3]

---

1. i) చ.చి. 9/93

ii) ఇష్టద్రవ్యవినాశాత్తు మనో యస్యోపహన్యతే,
తస్య తత్సదృశప్రాప్తిసాన్త్వాశ్వాసైః శమంనయేత్ (చ.చి. 9/99)

iii) శోకశల్యాం వ్యపనయేదున్మాదే పంచమే భిషక్
ఉన్మాదేషు చ సర్వేషు కుర్యాచ్చిత్త ప్రసాదనమ్ (సు.ఉ. 62/38)

2. కామశోకభయక్రోధహర్షేర్ష్యాలోభసంభవాః
పరస్పర ప్రతిద్వన్ద్వైరేభిరేవశమం నయేత్ (చ.చి. 9/100)

3. విషజే మృదుపూర్వం చ విషఘ్నం కారయేత్ క్రియామ్
(సు.ఉ. 62/38)

## ఉన్మాదహరమగు యోగములు

ఘృతములు :

ఉన్మాదమునందు విశేషించి పురాణగోఘృత పానము శ్రేష్ఠమయినది. ఇది పరిశుద్ధమైనదగుట వలన త్రిదోషములను శమింపచేయును. విశేషించి దేవాది గ్రహములను గూడా నశింపచేయును.[1]

పది సంవత్సరముల కాలముగడచిన పురాణ ఘృతము కటు, తిక్తరసములు కలిగి ఉగ్ర గంధముతో గూడి యుండును ఇది మిక్కిలి గుణ వత్తరముగా నుండి చక్కగా పనిచేయును. ఇది లాక్షారసము వంటి రంగును కలిగియుండి, శీతవీర్యముతో కూడి యుండి అన్ని గ్రహములను పారదోలు ప్రభావము కలిగి యుండును. ఇది పురాణఘృతము అనబడును.[2]

నూరు సంవత్సరముల కాలము గడచిన ఘృతము ప్రపురాణ ఘృతమన బడును. ఇది మేధ్యముగను, విరేచన ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగను ఉండును. ఈ ఘృతమునకు సాధ్యము కానిదేదియును లేదు. దీనిని చూచినను, తాకినను, ఆఘ్రాణించినను సర్వగ్రహములను పారద్రోలును. అందుచే ఇది విశేషించి అపస్మారము గ్రహోన్మాదములందు చాలా ప్రశస్తముగా నుండును.[3]

---

1. విశేషతః పురాణం చ ఘృతం తం పాయయేద్భిషక్
   త్రిదోషఘ్నం పవిత్రత్వాత్ విశేషాద్గ్రహనాశనమ్ (చ.చి. 9/59)
2. గుణకర్మాధికం పానాత్ ఆస్వాదాత్ కటుతిక్తకం
   ఉగ్రగన్ధం పురాణం స్యాత్ దశవర్షస్థితం ఘృతమ్ (చ.చి. 9/60)
   లాక్షారసనిభం శీతం తద్ధి సర్వగ్రహాఽపహం
3. మేధ్యం విరేచనేష్వగ్ర్యం ప్రపురాణమతః పరమ్
   నాఽసాధ్యం నామ తస్యాస్తి యత్స్యాద్వర్షశత స్థితం
   దృష్టం స్పృష్టమథాఘ్రాతం తద్ధి
   సర్వగ్రహాపహమ్ అపస్మారగ్రహోన్మాదవతాం శస్తం విశేషతః
   (చ.చి. 9/61-63)

**ఘృతయోగములు :**

1. హింగ్వాదిఘృతము
2. కళ్యాణక ఘృతము : ఉన్మాదము, భూతోన్మాదము, వాతరక్తము, విషము మొదలగు అనేక వ్యాధులను నశింపచేయును. సర్వగ్రహములను నశింపచేయును. ఆయు బలవర్ధకము అలక్ష్మీనాశకము.
3. మహాకళ్యాణఘృతము : బృంహణీయము, విశేషించి సన్నిపాతజ ఉన్మాదమునందు ప్రశస్తమైనది.
4. మహాపైశాచిక ఘృతము : ఉన్మాద, గ్రహ, అపస్మార శామకము, బుద్ధి స్మృతికరము.
5. లసునాద్యఘృతము
6. బ్రాహ్మీఘృతము (చరక. చి 9/అ)
7. ఫలఘృతము (సు. ఉత్త. 62)
8. హింగ్వాదిఘృతము (చ.చి. 9/57-58) ను తాగించి గాని లేక పురాణ ఘృతమును ఉత్తమ మాత్రలో పానము చేయించిగాని రోగిని ఒక గోతి యందైనను, చీకటి ఇంటి యందైనను ఉంచినచో ఉన్మాదము నివర్తించును.

**ఉన్మాదహర ఇతర ఔషధయోగములు :-**

1. సిద్ధార్థకగణము : (చ. చి.) సిద్ధార్థకము (తెల్ల ఆవాలు) వచ, హింగు, కరంజము, దేవదారు, మంజిష్ట, (త్రిఫల, శ్వేతా, తెల్లదింటెన) జ్యోతిష్మతి, త్రికటుకములు, ప్రియంగు, శిరీషము, రజనీద్వయము- ఈ ద్రవ్యములు సమాంశములుగా గ్రహించి బస్త మూత్రముతో నూరి యుంచిన ఇది విషహారమగు అగదముగా నుండును.

ఈ ఔషధమును పానమునకు, అంజనమునకును, నస్యమునకును, లేపనమునకును, స్నానోదకమును సంస్కరించుటకు, ఉద్వర్తనమునకు ఉపయోగించవచ్చును.

ఈ విధమైన అభ్యంతర బాహ్యప్రయోగములచే ఈ ఔషధము విషము, ఉన్మాదము, అభిచార ప్రయోగములను, అలక్ష్మిని, జ్వరమును భూతావేశమును శమింపచేయును. దీనివలన వశీకరణ శక్తికలుగును. ఈ ద్రవ్యములతో సిద్ధము చేసిన ఘృతము గూడా పై గుణములను కలిగియుండును.

2. బ్రాహ్మీస్వరసము 50 మి.లీ. గాని, కూష్మాండ బీజచూర్ణము 4 గ్రా. గాని, వచా చూర్ణము 4గ్రా. గాని, లేక శంఖ పుష్పస్వరసము 50 మి.లీ. గాని వీనితో దేనితోనైనను కుష్టచూర్ణము 2 గ్రా తేనె 8 గ్రా కలిపిసేవించినచో ఉన్మాదము శమించును. (భై. ర)

3. కూష్మాండ బీజకల్కము తేనెతో సేవించినను, తాళశాఖ-రసమును తేనెతో సేవించినను ఉన్మాదముశమించును.

4. అపక్వచటక మాంసము దుగ్ధముతో నూరి శర్కర కలిపి సేవించిన ఉన్మాదము శమించును.

5. కోకిల యొక్క మాంసమును పక్వముచేసి భక్షించి నివాతస్థానమున శయనించినచో స్మృతి భ్రంశాది మనోవికారములు తొలగి సంజ్ఞాప్రబోధము కలుగును. (భై.ర)

6. సారస్వత చూర్ణము 1 గ్రా ఘృతము తేనెలతో కలిపి ఇచ్చిన బుద్ధి, మేధా, స్మృతి వృద్ధిచెంది ఉన్మాదాది మనోవికారములు తొలగును.

అంజనయోగములు - నస్యయోగములు :

1. శిరీషము, మధుకము, హింగు, లసునము, గ్రంధి తగరము, వచ, కుష్టము - వీనిని బస్తమూత్రముతో నూరి అంజనమునకు నస్యమునకు ఉపయోగింపవలయును.

2. వ్యోషాదియోగము (చ. చి.) వర్తులగా తయారుచేసి నస్య అంజనము లకు ఉపయోగించిన ఉన్మాదము, గ్రహరోగములు, అపస్మారము శమించును.

3. అపామార్గాది అంజనము గూడా పై ఫలితములనే ఇచ్చును.

4. మరిచమును ఒక మాసము గో పిత్తమున ఎండించి అంజనమున కుప యోగించిన దోషజ భూతజ ఉన్మాదములందు కలుగు స్మృతినాశము, వికృత దృష్టి శమించును. (చ. చి. 9/64-69)

5. శిరోవిరేచన ద్రవ్యముల చూర్ణములందు సర్షప తైలమును చేర్చి అవ పీడకనస్యము చేయించుట హితకరముగా నుండును. కేవల సర్షపతైల నస్యము, అభ్యంగనము ఉన్మాదమును శమింపచేయును. (సు. ఉ. 62/16-17)

6. బ్రాహ్మ్యదివర్తిని (సు. ఉ 62) నస్యమునకు, అంజనమునకు, ధూమ పానమునకు ప్రయోగింపవచ్చును.

7. కృష్ణాది అంజనము (భై.ర.) దార్వ్యాది గుడికాంజనము (చ. ద) మొదలగునవి ఆవశ్యకతానుసారము ఉపయోగింపవచ్చును.

ధూపములు :

వాతిశ్లేష్మజ ఉన్మాదమునందు దుర్గంధపూరితమైన కుక్క మాంసము, గో మాంసము మత్స్యములతో ధూపము వేయవలయును. (అ.హృ.ఉ. 6/44)

## రసౌషధములు భస్మములు మొదలగునవి

అభ్రకభస్మము :

అభ్రకభస్మము రసాది ధాతువులకు ఓజస్సునకు పోషణ కలిగించుటచేత మస్తిష్కమునకు మనస్సు యొక్క తరల అంశములకు బలమును సామర్ధ్యమును పెంచుటచే చింతాగ్రస్తత, క్రోధస్వభావత వీనిని శమింపచేయుటలోను ఉన్మాద అపస్మారములను శమింపచేయుటలోను సహకరించును. 100 మి.గ్రా. మోతా దులో బ్రాహ్మీస్వరసము తేనెలో ఇచ్చుట హితకరముగా నుండును.

రౌప్య భస్మము :

రౌప్యభస్మము నాడీక్షోభను ఆక్షేపకములను శమింపచేయు గుణము కలిగి యుండుటచే ఉన్మాదము, అపస్మారము, భూతోన్మాదములందు ఆ వేగము యొక్క తీవ్రావస్థయందు 100 మి.గ్రా. ఏలా, సితాఘృతములతో కలిపి యివ్వ వలయును.

సువర్ణ భస్మము :

రసాయనము, మేధ్యము, వాతనాడీపోషకము అగుటవలన ప్రధానముగా పైత్తిక, శ్లేష్మక ఉన్మాదములందు 25 మి.గ్రా మోతాదులో ధన్వయాసక్వాథము తోగాని అర్కముతోగాని లేక బ్రాహ్మీస్వరసము, శంఖపుష్పీస్వరసము, వచ, కుష్ఠ చూర్ణము సితాలతో కలిపిగాని యివ్వవలయును.

ప్రవాళపిష్టి :

పిత్తజ ఉన్మాదము, విషజోన్మాదము భూతోన్మాదములందు ఆమలకీ చూర్ణము ఘృతములతో 100 మి.గ్రా నుండి 200 మి.గ్రా వరకు ఇవ్వవల యును. అవస్థానుసారము దోషజ ఉన్మాదములందు ఆరోగ్య వర్ధనీవటి, చంద్ర ప్రభావటి లేక శిలాజిత్‌తోపాటు యిచ్చుట గుణకరముగా నుండును.

స్వర్ణమాక్షిక భస్మము :

200 మి.గ్రా. నుండి 400 మి.గ్రా వరకు జటామాంసి, శారిబా రక్త చందన క్వాథముతో ఇచ్చిన పిత్తజ ఉన్మాద ప్రారంభావస్థలో బాగుగా పని చేయును.

ముక్తాపిష్టి గూడా 100 మి.గ్రా మోతాదులో పై ఔషధములతో కలిపిగాని లేక కూష్మాండావలేహ్యముతోగాని, బ్రాహ్మ్యవలేహ్యముతోగాని ఘృతముతో గాని పిత్తజ, మద్యజ, విషజ మనోవికారములందు, ఉన్మాదమునందు ఇచ్చుట హితకరముగా నుండును.

పిత్తజ ఉన్మాదములందు ఆవశ్యకతను వ్యాధ్యవస్థను అనుసరించి కామదుధారసము, సూతశేఖర రసము, సారస్వతారిష్ట- ఈ ఔషధములు వాడ వలయును. (రసతంత్రసార)

**ఉన్మాదభంజనోరసము (భై.ర) :**

వంగ రజత అభ్రక, ప్రవాళ భస్మములు, త్రికటు, త్రివృత్ మొదలగు ద్రవ్యములతో నిర్మితము. 200 మి.గ్రా నుండి 400 మి.గ్రా మోతాదులో ఇచ్చిన భూతోన్మాద, వాతోన్మాద, అపస్మారము మొదలగు వ్యాధులను శమింపచేయును.

**ఉన్మాద గజాంకుశ (భై.ర) :**

శోధిత రస, గంధక, వత్సనాభ, అభ్రక భస్మ, దత్తూరము మొదలగు ద్రవ్యములు ప్రధానములు. సర్వ ఉన్మాదహరము మోతాదు 100-200 మి.గ్రా.

**చతుర్భుజరసము - (భై. ర.) :**

స్వర్ణ భస్మము, రససింధూరము, మణిశిల, తాళకము, కస్తూరి మున్నగు ద్రవ్యములు కలవు. 150 మి. గ్రా. నుండి 300 మి. గ్రా. మోతాదులలో తగిన అనుపానముతో ఇచ్చిన సర్వఉన్మాదములను శమింప చేయును.

**ఉన్మాదగజ కేసరీ రసము (భై. ర.) :**

కజ్జలి, మణిశిల ధత్తూర బీజములు ముఖ్య ద్రవ్యములు, 100 మి. గ్రా. గోఘృతముతో సేవించిన ఉన్మాద, అపస్మార, భూతోన్మాదములను శమింప చేయును.

పథ్యపాలనతో భూతాంకుశ రసము (భై. ర.) సేవించిన సర్వ ఉన్మాదములు శమించును.

వాతప్రధాన ఉన్మాదములలో వాత కులాంతక రసము, భూత భైరవ రసము కస్తూరి భైరవ రసము, అశ్వగంధారిష్ట, పంచగవ్య ఘృతము రౌప్య భస్మము-ఇవి ఆవశ్యకతానుసారము తగిన మోతాదులో అనుపానముతో వాడవలయును.

వాతపిత్త ప్రధాన లక్షణములుగల ఉన్మాదమునందు యోగేంద్ర రసము మంచి ఫలితములను ఇచ్చును.

కఫ ప్రధాన లక్షణములుగల ఉన్మాదములందు మల్ల సింధూరము, సమీర పన్నగ రసము, మల్ల సింధూరవటి, ఇవి శ్రేష్ఠములు.

మనోదుఃఖ జన్య ఉన్మాదమునందు విజయ పుష్పోద్భవ లేహ్యముతో అభ్రక భస్మము, రౌప్య భస్మము వాడవలెను. స్మృతి సాగర రసము గూడా అవస్థాను సారము ఇవ్వవచ్చును.

శుక్రక్షయము, ఫిరంగము, రజోదోషము, నిద్రానాశము మొదలగునవి అనుబంధములుగా గాని కారణములుగా గాని యున్నపుడు ఆయా వ్యాధులు శమింప చేయు ఔషధములను గూడా ప్రయోగింపవలయును.

## ఆగంతుక ఉన్మాదములు

(భూతవిద్య — అమానుష ప్రతిషేధము)

నిర్వచనము :

దోషజ ఉన్మాదములకన్న భిన్నమైన హేతువులు, పూర్వ రూపములు, లక్షణములు, వేదనలు, ఉపశయములు కలవి ఆగంతుక ఉన్మాదములుగా పేర్కొన బడును.[1]

కారణములు :

కొందరు ఆచార్యులు పూర్వకృతమైన అప్రశస్త (పాప) కర్మ ఫలితముగా ఆగంతుక ఉన్మాదము కలుగునని భావించుచున్నారు. కాని ఆగంతుక ఉన్మాదమునకు ప్రజ్ఞాపరాధమే కారణమని ఆత్రేయుడు వచించెను.

---

1. యస్తు దోషనిమిత్తేభ్య ఉన్మాదేభ్యః సముత్థాన పూర్వ రూపలిఙ్గవేదనోపశయవిశేషసమన్వితో భవత్యున్మాద స్తమా గన్తుమాచక్షతే (చ.ని. 7/10)

ప్రజ్ఞాపరాధము వలననే మనుజులు, దేవతలు, ఋషులు, పితృదేవతలు. గంధర్వులు, యక్షులు, రాక్షసులు, పిశాచములు, గురువులు, వృద్ధులు, సిద్ధులు, ఆచార్యులు-వీరిని, ఇతరులైన పూజనీయులగు వారిని అవమానపరచి అనుచితమైన మరియు అహితమైన పనులను చేయుటవల్లను, ఇతరమైన ఇట్టి అప్రశస్తము లగు పనులను చేయుటవలన దేవతలు ఋషులు మొదలగువారు ఆవేశించి ఉన్మత్తతను కలిగించెదరు.[1]

అశుచిగా నుండుట, అనగా భోజనానంతరము మలమూత్ర త్యాగానంతరము పరిశుభ్రము చేసికొనక పోవుట, స్నాన, దంతధావనాదులు వదలివేయుట, సాధారణముగా అమలులోనున్న శాస్త్ర, కాల, దేశ, కుల, సాంఘికపరమైన మర్యాదలను పాటింప కుండా యుండుట, అనుచిత విధానముతో నియమములను, వ్రతములను పూజాది విధులను నిర్వర్తించుట, ఈ స్థితులు ఆయా గ్రహములు ఆవేశించుటకు సహకరించును.

గ్రహములు మూడు విధములగు ప్రయోజనములను ఆశించి మనుజులను ఆవేశించును. వాని ప్రయోజనములు నెరవేరనపుడు మనుజుని చంపును. ఆ ప్రయోజనములు ఇవి. 1) హింసించుట 2) క్రీడించుట 3) పూజించుట. రోగి యొక్క ఆచార వ్యవహారములను బట్టియు విశేష లక్షణములను బట్టియు ఈ ప్రయోజనములను తెలిసికొనవచ్చును. అవి ఈ క్రింది విధముగా ఉండును,

---

1. కేచిత్పునః పూర్వకృతం కర్మాప్రశస్తమిచ్ఛన్తి తస్య నిమిత్తం ప్రజ్ఞాపరాధ ఏవేతి భగవాన్పునర్వసురాత్రేయ ఉవాచ ప్రజ్ఞాపరాధాద్ధ్యయం దేవర్షి పితృగన్ధర్వ యక్షరాక్షస పిశాచగురువృద్ధసిద్ధాచార్యాపూజ్యానవమత్యాహితాన్యాచరతి అన్యద్వా కించిత్కర్మాప్రశస్తమారభతే తమాత్మనా హతముపఘ్నన్తో దేవా కుర్వన్త్యున్మత్తమ్ (చ.ని. 7/10)

2. i) ఆగన్తు హేతుః నియమవ్రతాదిమిథ్యాకృతం కర్మ చ పూర్వదేహే (చ.చి. 9/16)

ii) అశుచిం భిన్నమర్యాదం క్షతం వా యది వాఽక్షతమ్ (సు.ఉ. 60/5)

హింస - అగ్నియందు ప్రవేశించుట, నీటియందు మునుగుట, ఎత్తునుండి దుముకుట, శస్త్రములు, కొరడాలు, కర్రలు, రాళ్ళు, పిడికిళ్ళు వీనిచేతనను తాను హింసించు కొనుట, ప్రాణము తీసుకొనుటకై ఇతర ప్రయత్నములు చేయుట. ఈ లక్షణములు హింసను ఆశించి గ్రహములు ఆవేశించినపుడు కలుగును. ఇది అసాధ్యముగా నుండును.

మిగిలిన రెండు ప్రయోజనముల నాశించిన ఉన్మాదములందును ఇష్టే తత్తదనుసార లక్షణములుకలుగును. మరియు ఇవి రెండును సాధ్యములుగానుండును.[1]

## ఆవేశకాలములు-స్థలములు

దేవాదిగ్రహములు ఈ క్రింద పేర్కొనబడు సమయములందు, స్థలము లందు ఆవేశించుదురు.

పాపకర్మలు చేయునపుడును, పూర్వకృత పాప కర్మయొక్క పరిణామ కాలమునందును, శూన్య గృహమునందు ఒక్కడే ఉన్నపుడును, నాలుగు త్రోవలు కలియుస్థలమున ఉండునపుడును, సంధ్యా సమయమునందును; గోధూళి సమయమునందును, సంయమముతో ఉండనపుడును, అమావాస్య పూర్ణిమ మొద లగు పర్వ సంధులందును, పర్వసంధులందు మైథునము చేసినపుడును, రజస్వలా స్త్రీతో సంగమించినపుడు, అధ్యయనము, బలిదానము, మంగళకృత్యములు,

---

1. త్రివిధం తు ఖలూన్మాదకరాణాం భూతానామున్మాదనే ప్రయోజనం భవతి తద్యథా - హింసా రతిః అభ్యర్చనం చేతి తేషాం తత్ప్రయోజనమున్మత్తాచారవిశేషలక్షణైర్విద్యాత్ తత్ర హింసార్థమున్మాద్యమనోఽగ్నిం ప్రవిశత్యప్సు వా నిమజ్జతి స్థలాచ్ఛ్వభ్రే వా నిపతతి శస్త్రకశాకాష్ఠలోష్టముష్టిభిర్హన్త్యాత్మానమన్యచ్చ ప్రాణవధార్థమారభతే కించిత్ తమసాధ్యం విద్యాత్ సాధ్యౌ పునర్ద్వావితరౌ (చ.న. 17/15)

ii) హింస్యుర్హింసావిహారార్థం సత్కారార్థమథాపి వా (సు.ఉ. 60/5)

హోమములు-ఇవి ప్రశస్తముగా చేసినపుడును, నియమములు, వ్రతములు. బ్రహ్మచర్యాది నియమములు పాటించవలసినపుడు భంగము చేసినపుడును, యుద్ధములు సంభవించినపుడును (అల్లకల్లోలములచే మనోవైకల్యత, శస్త్రాస్త్ర ప్రయోగ జనితమైన అణుధూళివంటి విషవ్యాప్తి కావచ్చును) దేశము, కులము, గ్రామము మొదలగునవి నశించుచున్నపుడును, చంద్రగ్రహణము, సూర్యగ్రహణము లేక గ్రహకూటములు సంభవించినపుడు, స్త్రీలు ప్రసవించు కాలమునందును, అనేక విధములగు ప్రాణులను, అశుభమైన అపవిత్రమైన వస్తువులను స్పృశించినపుడును, వమనము, విరేచనము, రక్తస్రావము-ఇవి జరిగినపుడును, అపవిత్రుడుగానుండి ఆ సమయమున అనియమితుడై చైత్యము, దేవాలయము-వీని సమీపమునకు వెళ్ళినపుడును, మాంసము, మధు. తిలలు, గుడము, మదిరము ఉచ్ఛిష్ట పదార్థములు-వీనిని సేవించినపుడును, నగ్నముగా నున్నపుడును, రాత్రి సమయమునందు నగరములందు, నిగమములందు, చతుష్పథములందు, ఉపవనములందు, స్మశానమునందు, వధ్య స్థలములందు ఏకాంతముగా సంచరించునపుడును, ద్విజులు, గురువులు, దేవతలు, సాధువులు మొదలగు పూజ్యులను తిరస్కరించినపుడును, అధర్మముగా ప్రవర్తించునపుడును, ధార్మిక కార్యములను అనుచితముగా చేసినపుడును, ఇట్టి అప్రశస్తములగు ఇతర కార్యములను చేసినపుడును గ్రహములు ఆవేశించును.[1]

---

1. ఉన్మాదయిష్యతామపి ఖలు దేవర్షి పితృగన్ధర్వయక్షరాక్షసపిశాచానాం గురువృద్ధసిద్ధానాం వా ఏష్వన్తరేష్వభిగమనీయాః పురుషా భవన్తి తద్యథా-పాపస్యకర్మణః సమారమ్భే, పూర్వకృతస్య వా కర్మణః పరిణామకాలే ఏకస్యవాశూన్యగృహవాసే, చతుష్పథాధిష్ఠానేవా, సన్ధ్యావేలాయాం అప్రయతభావే, పర్వసన్ధిషువా, మిథునీభావే, రజస్వలాభిగమనేవా, విగుణేవాఽధ్యయనబలిమఙ్గలహోమప్రయోగే, నియమవ్రతబ్రహ్మచర్యభఙ్గేవా, మహాహవేవా, దేశకులపురవినాశేవా, మహాగ్రహోపగమనే వా స్త్రియా వా

(Contd....

## గ్రహములు శరీరమున ఆవహించు విధము

దేవాదిగ్రహములు తమ తమ గుణములచేత ప్రభావముచేత మనుజుల శరీరమును దూషింపచేయకయే అద్దమునందు ప్రతిబింబము, సూర్యకాంతమణియందు సూర్యకిరణములు ప్రవేశించు విధముగా అతి శీఘ్రముగా శటాలున ప్రవేశించి ఆవహించును.[1]

## ఉన్మాదమును కలిగించు విధము

దేవతలు చూచుట వలనను, గురువులు, వృద్ధులు, సిద్ధులు, మహర్షులు. వీరు శపించుట వలనను, పితరులు దర్శనమిచ్చుట లేక భయపెట్టుట వలనను, గంధర్వులు స్పృశించుట వలనను, యక్షులు ఆవేశించుట వలనను, రాక్షసులు ఆమగంధమును ఆఘ్రాణింపచేయుట వలనను, పిశాచములు మీదికెక్కి సవారీ చేయుట వలనను ఉన్మాదమును కలిగించును.[2]

---

ప్రజననకాలే వివిధభూతాశుభాశుచిస్పర్శనే వా వమన విరేచనరుధిరస్రావాశుచే, అప్రయతస్య వా చైత్యదేవాయతనాభిగమనే వా మాంసమధుతిలగుడమద్యోచ్ఛిష్టే వా దిగ్వాససివా నిశినగరనిరమచతుష్పథోపవనశ్మశానాఘాతనాభిగమనేవా ద్విజగురుసురపూజ్యాభిదర్షణే వా ధర్మాఖ్యానవ్యతిక్రమే వా అన్యస్యకర్మణోఽప్రశస్తస్యారమ్భేవేత్యాఘాతాకాలవ్యాఖ్యాతా భవన్తి
(చ. ని. 7/14)

1. i) అదూషయన్తః పురుషస్య దేహం దేవాదయః స్వైస్తుగుణప్రభావైః విశన్త్యదృశ్యాః తరసా యద్దైవచ్ఛాయాతపౌదర్పణసూర్యకాన్తౌ
   ii) సు. ఉ. 60/19.20 (చ. చి. 9/18)
2. తత్రాయమున్మాదకరాణాం భూతానామున్మాదయిష్యతా మారమ్భవిశేషః తద్యథా—అవలోకయన్తో దేవాజనయన్త్యున్మాదం, గురువృద్ధ సిద్ధర్షయోఽభిశపన్తః పితరోధర్షయన్తః స్పృశన్తోగన్ధర్వాః, సమావిశన్తియక్షాః రాక్షసాస్త్వామగన్ధమాఘ్రాపయన్తః పిశాచాః పునరధిరుహ్య వాహయన్తః
(చ. ని. 7/12)

## గ్రహముల యొక్క సంఖ్య

గ్రహములు అసంఖ్యాతముగా నున్నప్పటికిని వివిధ లక్షణములతో గూడిన అధిపతులు ఎనిమిది సంఖ్యలో నుందురు. అవి 1. దేవతలు, 2. రాక్షసులు, 3. గంధర్వులు, 4. యక్షులు, 5. పితరులు, 6. నాగములు, 7. రాక్షసులు, 8. పిశాచములు-ఇవి సుశ్రుతమతానుసారము అష్టదేవ గణములు.[1]

చరకుడు సంఖ్యను పేర్కొనక గురు, వృద్ధ, ఋషి, సిద్ధ, ఆచార్య పూజనీయులను అవమానించుట ఉన్మాదకారణముగా చెప్పెను. నాగములను చరకుడు వదలివేసెను. ఋషిగ్రహ ఉన్మాదమునుగూడా వివరించెను.

## భూతోన్మాద పూర్వ రూపములు

దేవతలను, గోవులను, బ్రాహ్మణులను, తపస్వులను హింసించుటయందు కోరిక కలుగుట, క్రోధము అధికముగానుండుట, ఇతరులకు అపకారము చేయుటయందు ఇచ్ఛ, అరతి, దేనియందును ఇష్టములేక పోవుట, ఓజస్సు, శరీర వర్ణము, ఛాయ, బలము, శరీరము-ఇవి క్షీణించుట, స్వప్నమునందు దేవాదులచే భయపెట్టబడుట, ప్రేరణ చేయబడుట-ఇవి ఆగంతుక ఉన్మాదమునకు పూర్వ రూపములుగా కలుగును[2].

---

1. i) అసంఖ్యేయా గ్రహగణా గ్రహాధిపతయస్తుయే వ్యజ్యంతే వివిధాకారాభిద్యంతే తే తథాఽష్టధా దేవాస్తథాశత్రుగణాశ్చ తేషాం గంధర్వ యక్షః పితరో భుజంగాః రక్షాంసి యా చాపి పిశాచజాతిరేషోఽష్టకో దేవగణో గ్రహాఖ్యః (సు.ఉ. 60/6-67)
   ii) ఇత్యపరిసంఖ్యేయానాం గ్రహాణామావిష్కృతతమాః హ్యష్టావేతే వ్యాఖ్యాతాః (చ.చి. 9/21)
2. తత్రదేవాదిప్రకోపనిమిత్తేనాగన్తుకోన్మాదేన పురస్కృతస్యేమానిపూర్వ రూపాణి భవన్తి తద్యథా—దేవగోబ్రాహ్మణతపస్వినాం హింసారుచిత్వం (Contd...

## ఆగంతూన్మాద సామాన్య విశేష లక్షణములు

బల, వీర్యము పౌరుషము, పరాక్రమము, గ్రహణశక్తి, ధారణశక్తి స్మరణశక్తి, జ్ఞానము, వచనము, విజ్ఞానము, చేష్టలు-ఇవి మనుష్యశక్తిని మించి యుండుట, ఉన్మాదకాలము నియతముగా లేకుండుట, రహస్యమైన విషయములు భవిష్యత్తులో జరుగబోవు విషయములు తెలిసియుండుట, అవ్యవస్థిత చిత్తము, శరీరము, అసహనత, అమానుషక్రియలు చేయుట-ఇవి సామాన్య ఆగంతుకోన్మాద లక్షణములు.[1]

## గ్రహావేశ విశేష లక్షణములు

దేవ గ్రహోన్మాద లక్షణములు :

సౌమ్యదృష్టి, గంభీరమైన స్వభావంబును, ధైర్యంబును కలిగియుండును. కోపము లేకుండాయుండి, నిద్ర, భోజనములందు అయిష్టమును కలిగియుండును. స్వేదము, మూత్రము, పురీషము అపానవాతము చాలా అల్పమాత్రలో ప్రవర్తించుచుండును. శుభమైన పరిమళముకలిగి వికసించిన కమలమువంటి సుందరమైన ముఖమును కలిగియుండును.

---

కోపనత్వం నృశంసాభిప్రాయతా అరతి ఓజోవర్ణచ్ఛాయాబలవపుషాము
పతప్తిః స్వప్నే చ దేవాదిభిరభిభర్త్సనం ప్రవర్తనం చేత్యాగన్తునిమిత్త
స్యోన్మాదస్యపూర్వరూపాణి భవన్తి తతోఽనన్తరమున్మాదాభినిర్వృత్తిః
(చ. ని. 7/11)

1. i) చ. ని. 7/13
ii) అమర్త్యవాగ్విక్రమవీర్యచేష్టః జ్ఞానాదివిజ్ఞానబలాదిభిర్యః
ఉన్మాదకాలోఽనియతశ్చ యస్య భూతోత్థమున్మాదముదాహరేత్తమ్
(చ. చి. 9/17)
iii) గుహ్యానాగతవిజ్ఞానమనవస్థాఽసహిష్ణుతా
క్రియావాఽమానుషీ యస్మిన్ స గ్రహః పరికీర్త్యతే (సు. ఉ. 60/4)

స్వల్పముగా మాట్లాడుట, శుద్ధముగను, సత్యముగను మాటలాడుట, దేవతలు, బ్రాహ్మణులయందు భక్తి కలిగియుండుట శుక్ల మాల్యాంబరములందు నదులు పర్వతములు ఉన్నత గృహములు-వీని యందిష్టముకలిగియుండుట ఇతరులచే జయింప దగనివాడుగా నుండుట, వరప్రదాతగా నుండుట, ఈ లక్షణములు దేవగ్రహావేశమున కలుగునని వాగ్భటుని మతము.

సతోషముగానుండుట, బ్రహ్మజ్ఞానము కలిగియుండుట ఇవి దేవగ్రహ జుష్ట ఉన్మాద లక్షణములు.[1]

గ్రహముల స్వభావము :-

సుశ్రుత వచనము ననుసరించి గ్రహములు ఎప్పుడును మనుష్యులతో కలసి యుండుటగాని ఆవేశించుటగాని జరుగదు. అనగా దేవాది గ్రహములు సాక్షాత్తుగా మనుష్య శరీరమున ప్రవేశింపవు. ఆ దేవాదులే మనుజులనావహించి బాధించెదరని చెప్పువారికి భూతవిద్య సరిగా తెలియదు.

వాస్తవమునకు దేవతాది గ్రహములకు పరిచారకులుగా నుండునట్టివియు, రక్త మాంసములనాహారముగా చేసికొనుచు, భయంకర రూపములు గలిగి రాత్రులందు తిరుగుచుండు అసంఖ్యాకములైన భూతములు మాత్రమే మనుజుల నుండి

---

1. i) సౌమ్యదృష్టిం గమ్భీరమప్రధృష్టమకోపనం అస్వప్న భోజనాభిలాషిణం అల్పస్వేదమూత్రపురీషవాతం (వాతు) శుభగన్ధం ప్రఫుల్లపద్మవదనమితి దేవోన్మత్తం విద్యాత్ (చ.చి. 9-20)
   ii) సు. ఉ. 60-8
   iii) అ.హృ.ఉ. 4-13-15
2. న తే మనుష్యైః సహ సంవిశంతి న వా మనుష్యాన్ క్వచిదావిశంతి యేత్వావిశంతీతి వదంతి మోహాత్తేభూతవిద్యావిషయాదపోహ్యాః (సు.ఉ. 60/21)

బలి పూజాదుల నభిలషించి అపహించి బాధించుచుండును, నిర్ఋతి అను దిక్కునకు అధిపతిగా నుండు రాక్షసాధిపతి పుత్రికలకు దేవాది గ్రహముల సంయోగము వలన కలిగిన సంతానములే ఈ పరిచారకులుగా భావింపబడుచున్నవి.[1]

ఈ పరిచారక గ్రహములకు ఆయా దేవాది గణములయొక్క శీలము, కర్మ ఆచరణము శక్తి సామర్థ్యములు కలిగి యుండును. ఇది సత్య శౌచాది విహీను లగు వారిని పీడించి వారిచే ఇవ్వబడిన ఆహారములను గాని లేక వారి దేహమును గాని భక్షించుచుండును.[2]

"గృహ్ణన్తే—జ్ఞాయన్తే తత్తచ్ఛీలాది భిరతి గ్రహాః" అను ఉత్పత్తి ననుసరించి ప్రత్యక్ష దృశ్యములు కాక వానివాని శీల, కర్మ, ఆచారాదులచే అనుమానించి తెలిసికొనదగినవి అని అర్థము.

దేవ గ్రహములు శుచి, ఆచారము, కలిగి తపస్సంపన్నుడు వేదాధ్యయనము తెలిసినవాడు అగు మనుజునికి సాధారణముగా శుక్లపాడ్యమి దినమందు గాని త్రయోదశియందుగాని ఆవేశించును. ఇది చరకమతము. సుశ్రుతుడు పౌర్ణమి దినమున ఆవేశించునని చెప్పెను.[3]

---

1\. i) తేషాం గ్రహాణాం పరిచారకా యే కోటీసహస్రాయుతపద్మసంఖ్యాః
అసృగ్వసామాంసభుజః సుభీమా నిశా విహారాశ్చతమావిశంతి
(సు.ఉ. 60/22)

ii) నిర్ఋతేర్దుహితరస్తాసాం సంప్రసవాః స్మృతాః (సు.ఉ. 60/25)

2\. i) స్వాయుశీలక్రియాచారక్రమా ఏవ సురాదిషు (సు.ఉ. 60/25)

ii) సత్వాత్మాపదవృత్తేషు వృత్తిస్తేషాం గ్రహైఃకృతా (సు.ఉ. 60/26)

3\. i) తత్రశౌచాచారం (శౌచాచారం) తపస్స్వాధ్యాయకోవిదం నరం ప్రాయః
శుక్లప్రతిపత్త్రయోదశ్యాంచచ్ఛిద్రమపేత్యాభిధర్షయన్తి దేవాః (చ.చి. 9/21)

ii) సు.ఉ. 60/17 iii) అ.హృ. 4/9

## ఋషి గ్రహోన్మాదము

స్నానము, శుచిత్వము, ఏకాంత నివాసము వీనియందు ఆసక్తి కలిగి యుండు వానిని, ధర్మశాస్త్రములను శ్రుతి వాక్యములను బాగుగా ఎరిగిన వానిని షష్టి లేక నవమి తిధియందు ప్రాయికముగా ఋషులు ఆవహించెదరు.[1]

గురువులు, వృద్ధులు, సిద్ధులు ఋషులు మొదలగువారి అభిశాపము, అభిచారము, అభిధ్యానాదుల ననుసరించి ఆహారము చేష్టలు, వాక్కు కలిగియుండుట ఋష్యాదిగ్రహోన్మాద లక్షణములుగా తెలుసుకొనవలయును.[2]

## పితృ గ్రహోన్మాదము

తల్లిదండ్రులకు గురువులు, వృద్ధుడు, సిద్ధులు ఆచార్యులకు భక్తితో సేవ చేయువారిలో దోషమును అవకాశముగా చేసికొని ప్రాయికముగా దశమిరోజున గాని అమావాస్యరోజున గాని పితృగ్రహములు ఆవేశించును. వాగ్భటుడు దశమి అష్టమి, నవమి తిధులని పేర్కొనెను.[3]

లక్షణములు :-

అప్రసన్నమైన దృష్టి కలిగియుండుట, సరిగా చూడకుండా యుండుట, నిద్రాళుత్వము, తడబడుచు మాట్లాడుట, అన్నము నందిచ్ఛలేకుండుట, అరుచి,

---

1. స్నానశుచివివిక్తసేవినం, ధర్మశాస్త్రశ్రుతివాక్యకుశలం ప్రాయః షష్ఠ్యాం నవమ్యాం చ ఋషయః (ధర్షయన్తి) (చ.చి. 9/21)
2. గురువృద్ధసిద్ధర్షీణాం అభిశాపాఽభిచారాఽభిధ్యానాఽనురూప చేష్టాహారవ్యాహారం తైరున్మత్తం విద్యాత్ (చ.చి. 9/20)
3. i) మాతృ పితృ గురు వృద్ధ సిద్ధఆచార్యోపసేవినం ప్రాయోదశమ్యాము మావాస్యాయాం చ పితరః (ధర్షయన్తి) (చ.చి. 9/21)
   ii) సు.ఉ. 50/18 iii) అ.హృ.ఉ. 4/12

అవిపాకము, దీన వదనము, శుష్కించిన తాలువులు, చలించుచున్న కంటి రెప్పలు కలిగి యుండుట; మరణించిన వారికి దర్భలపై పిండములు వేయుచుండుట; అపసవ్యముగా వస్త్రమును ధరించి పితరులకు జలమును విడుచుట; తిలలు; మాంసము, గుడము పాయసము వీనియందు ప్రీతి కలిగియుండుట—ఈ లక్షణములు గల మనుజునికి పితృగ్రహము ఆవేశించినదని గ్రహించవలెను.[1]

## గంధర్వ గ్రహోన్మాదము

ఆవేశకాలాదులు :-

స్తుతి, గీత వాయిద్యములందు ఆసక్తి కలవానిని, పరస్త్రీలయందును గంధమాల్యాదులందును ప్రీతికలవానిని, సదాచారము కలవానిని ప్రాయికముగా ద్వాదశినాడుగాని చతుర్దశినాడు గాని గంధర్వ గ్రహములు ఆవహించును. సుశ్రుతాను సారము అష్టమియందు ఆవహించును.[2]

లక్షణములు :-

క్రోధము, హింసించు స్వభావము, సాహసము, తీవ్రత, గంభీర స్వభావము, అపజయమును ఎవ్వరితోను పొందనివాడుగను, ధైర్యము కలవాడుగను ఉండుట ముఖవాయిద్యము, గానము, నృత్యము అన్నపానములు, స్నానము,

---

1. i) అప్రసన్న దృష్టిమపశ్యన్తం నిద్రాలుం ప్రతిహతవాచం అనన్నాభిలాషం అరోచకాఽవిపాకపరీతం చ పితృభిరున్మత్తం విద్యాత్ (చ.చి. 9/20)
   ii) సు.ఉ. 60/12
   iii) అ.హృ.ఉ. 4/41-42
2. i) గన్ధర్వాః స్తుతి గీతవాదిత్రరతిం పరదారగన్ధమాల్యప్రియం చౌక్షాచారం, ప్రాయో ద్వాదశ్యాం చతుర్దశ్యాం చ (ధర్షయన్తి) (చ.చి. 9/21)
   ii) సు.ఉ. 60/17

మాలలు, ధూపములు గంధములు—వీనియందు అధిక ప్రీతి కలిగియుండుట; రక్త వస్త్రములు ధరించుటయందు, బలికర్మలు ఆచరించుట యందు, హాస్యము లందు, కథలు చెప్పుటయందు ఆసక్తి కలిగియుండుట, శరీరము మంచి పరిమళము కలిగియుండుట; హర్షముతో కూడియుండుట; ఇసుకతిన్నెలు, తోటలు వీనియందు విహరింప ప్రీతికలిగి యుండుట; శృంగార లీలలందు ఇచ్ఛకలిగి యుండుట—ఈ లక్షణములు కలిగిన గంధర్వ గ్రహము ఆవహించినదని గ్రహింపవలయును.[1]

## యక్ష గ్రహోన్మాదము

**ఆవేశ కాలాదులు :-**

సత్వము, బలము, రూపము, అభిమానము, పరాక్రమముతో కూడిన వానిని మాల్యాను లేపనములందు పరిహాసమునందును ప్రీతి కలవానిని, అధికముగా మాటలాడు వానిని ప్రాయికముగా శుక్ల ఏకాదశి నాడుగాని, సప్తమినాడు గాని సుశ్రుతుననుసరించి పాడ్యమినాడు గాని యక్షగ్రహము లావహించును.[2]

---

1. i) (చణ్డం)సాహసికం తీక్ష్ణం గమ్భీరప(వధృష్యం) ముఖవాద్యనృత్యగీతాఽన్నపానస్నానమాల్యధూపగన్ధరతిం, రక్తవస్త్రబలికర్మహాస్యకథానుయోగప్రియం, శుభగన్ధం చ గన్ధర్వోన్మత్తం విద్యాత్ (చ.చి. 9/20)
   ii) హృష్టాత్మా పులినవనాంతరోపసేవీ స్వాచారః ప్రియపరిగీత గంధమాల్యః నృత్యన్ వా ప్రహసతి చారు చాల్పశబ్దం గంధర్వగ్రహపరిపీడితో మనుష్యః (సు.ఉ. 60/10)
   iii) అ.హృ.ఉ. 4/18-19
2. i) సత్వబలరూపగర్వశౌర్యయుక్తం మాల్యానులేపనహాస్యప్రియం, అతివాక్ప్రవణం, ప్రాయశ్శుక్లైకాదశ్యాం సప్తమ్యాం చ యక్షః (చ. చి. 9/21)
   ii) సు.ఉ. 60/17 iii) అ.హృ.ఉ. 4/10

లక్షణములు :

మాటిమాటికి నిద్రించుచు ఏడ్చుచు, నవ్వుచు ఉండుట, నృత్యము, గీతములు, వాయిద్యములు, స్తోత్రములు, కథలు, అన్నపానములు, పుష్పమాలలు, ధూపములు, గంధములు-వీనియందు అధిక ప్రీతి కలిగియుండుట, కన్నులెర్రనై నీటితో నిండియుండుట, బ్రాహ్మణులను, వైద్యులను నిందించుచుండుట, రహస్యముగా మాట్లాడుట, ఎర్రని వలువని, వస్త్రములు ధరించుట, గంభీరముగా నుండుట, సహిష్ణుత, తేజస్సు, ఎవనికి దేనినిత్తునని పలుమారుచెప్పుట ఈ లక్షణములుగల మనుజునికి యక్షగ్రహ మావహించినదని గ్రహింపవలయును.[1]

## రాక్షస గ్రహోన్మాదము

ఆవేశకాలాదులు :

సత్త్వగుణము లేకుండుట, కలహములు పెట్టుట, స్త్రీలకు వసుడయియుండుట, లుబ్ధత్వము, శఠత్వము,-ఈ గుణములు కలవానికి ప్రాయికముగా ద్వితీయ, తృతీయ, అష్టమి తిధులందును, రాత్రియందును రాక్షస గ్రహములు ఆవేశించును. బహుళనవమి, ద్వాదశి, అమావాశ్య పూర్ణిమలందావహించునని వాగ్భటమతము.[2]

---

1. i) అసకృత్ స్వప్నరోదనహాస్యం(హాసినం)నృత్తగీతవాద్యకథాఽన్నపాన మాల్యధూపగన్ధరతిం, రక్తవిప్లుతాక్షం, ద్విజాతివైద్యపరివాదినం రహస్యభాషిణం చ యక్షోన్మత్తం విద్యాత్ (చ.చి. 9/20)
   ii) తామ్రాక్షః ప్రియతనురక్తవస్త్రధారీ గంభీరో ద్రుతమతిరల్పవాక్ సహిష్ణుః తేజస్వీ వదతి చ కిం దదామి కస్మై యో యక్షగ్రహపరిపీడితో మనుష్యః (సు.ఉ. 60/11)
   iii) అ.హృ.ఉ. 4
2. i) రక్షః పిశాచాస్తుహీనసత్వం పిశునం (స్త్రైతిం) (స్తేనం) లుబ్ధం శఠం ప్రాయోద్వితీయా తృతీయాఽష్టమీషు (చ.చి. 9/21)
   ii) సు.ఉ. 60/18 iii) అ.హృ.ఉ. 4/11

లక్షణములు :

నిద్రానాశము, అన్నపానములందు ద్వేషము కలుగుట, అనాహారముగ నున్నను అధిక బలము కలిగియుండుట, ఆయుధములు రక్తము, మాంసము, రక్తవర్ణపుష్పమాలికలు-వీనియందభిలాష కలిగియుండుట, ఇతరులను బెదిరించుట సురావికారములందు ఇచ్ఛ, నిర్లజ్జత, కాఠిన్యత, శౌర్యాతిశయము, కోపము కలిగి యుండుట, రాత్రియందు తిరుగుట, శుచిత్వమునందు ద్వేషము, క్రోధ దృష్టి, భృకుటి నిటలబొడిచికొనియుండుట, అకస్మాత్తుగా మనుజులను కొట్టుట, స్త్రీల యందు ఇచ్ఛ, రక్తమునుగాని మాంసమునుగాని చూచినపుడెల్ల నాలుకచే పెదవులను నాకుట, ఆహారకాలమున నవ్వుట-ఈ లక్షణములుగల మనుజుని రాక్షస గ్రహమావహించినదని గ్రహింపవలయును.[1]

## బ్రహ్మరాక్షస గ్రహోన్మాదము

ఆవేశకాలాదులు :

వేదాధ్యయనము, తపస్సు, నియమము, ఉపవాసము; బ్రహ్మచర్యాది వ్రతముల నాచరించుట, దేవతలు, యతులు, గురువులు-వీరిని పూజించుటయందు ఆసక్తిగలిగి శౌచాచారము లేనందు వానిని, బ్రాహ్మణుడయినను కాకున్నను తనను బ్రాహ్మణునిగా చెప్పుకొనువానిని, తాను శూరుడనని భావించు వానిని, దేవాలయమునందు; జలాశయమునందు విహారక్రీడలయందు ఆసక్తిగల వానిని దోషమును అవకాశముగా చేసికొని ప్రాయికముగా ఉల్లంఘించునాడైనను గ్రహము

---

1. i) నష్టనిద్రం అన్నపానద్వేషిణం అనాహారసమర్థమతిబలినం శస్త్రశోణిత మాంస-రక్తమాల్య ఉభిలాషిణం, సంతర్జకం చ రాక్షసోన్మత్తం విద్యాత్ (చ చి. 9/20)
   ii) మాంసాసృగ్వివిధసురావికారలిప్సుర్నిర్లజ్జో భృశమతినిష్ఠురోఽతిశూరః క్రోధాలుర్విపులబలో నిశావిహారీ శౌచద్విట్ భవతి చ రాక్షసైర్గృహీతః
   iii) అ.హృ.ఉ. 4/26-29 (సు.ఉ. 60/14)

నాడయందు బ్రహ్మరాక్షస గ్రహము లావేశించును. శుద్ధాష్టమి, పంచమి తిధు లందును ఆవేశించునని వాగ్భట మతము.[1]

లక్షణములు :

బిగ్గరగా నవ్వుట, నృత్యముచేయుట, దేవతలు, బ్రాహ్మణులు, వైద్యులపై ద్వేషము కలిగియుండి అవమానించుచుండుట, స్తోత్రములు, వేదమంత్రములు శాస్త్రములు, పలుమారు ఉదాహరణములతో ఉచ్ఛరించి చెప్పుచుండుట, కర్రలు మొదలగువానితో తన శరీరమును బాదుకొనుచుండుట ఇతర క్రియలచే తనను తను బాధించుకొనుట - ఈ లక్షణములు గలిగిన మనుజుని బ్రహ్మరాక్షస గ్రహ మావహించినదని గ్రహింపవలయును.[2]

## పిశాచ గ్రహోన్మాదము

ఆవేశకాలాదులు :

రాక్షస గ్రహ ఆవేశకాలాదులకు తుల్యముగానుండును. చతుర్దశి తిధినాడు ఆవేశించునని సుశ్రుత మతము.[3]

---

1. i) స్వాధ్యాయతపోనియమోపవాసబ్రహ్మచర్యదేవయతిగురుపూజాఽరతిం భ్రష్టశౌచం, బ్రాహ్మణమబ్రాహ్మణం వా బ్రహ్మవాదినం శూరమానినం దేవాగారసలిలక్రీడనరతిం ప్రాయః శుక్లపక్షాభ్యాం పూర్ణచన్ద్రదర్శనే చ బ్రహ్మరాక్షసాః (చ.చి. 9/21)
   ii) అ.హృ.ఉ. 4/11
2. i) ప్రహాస-నృత్య ప్రధానం దేవ విప్ర వైద్యద్వేషాఽవజ్ఞాభిః స్తుతి వేదమన్త్రశాస్త్రోదాహరణైః కాష్ఠాదిభిః ఆత్మపీడనేన చ బ్రహ్మ రాక్షసోన్మత్తం విద్యాత్ (చ.చి. 9/20)
   ii) అ.హృ.ఉ. 4/24-25
3. i) చ.చి. 9/21
   ii) సు.ఉ. 60/18 iii) అ.హృ.ఉ. 4/11

లక్షణములు :-

అనవ్యస్థ మనస్కుడుగ నుండుట, అనగా చంచల మనస్కుడుగనుండుట, ఏ స్థానమునందును మనస్సు కుదురకుండుటచే తనకు ఒక స్థానములేదని భావించు చుండుట, నృత్యము చేయుట, గానములు హాస్యములు వీనితో, పొద్దుపుచ్చుట, సంబంధమున్నట్టి సంబంధములేనట్టి ప్రేలాపము చేయు చుండుట; అర్థములేని మాటలు చెప్పుచుండుట, కుప్పలు, దిబ్బలు, చెత్తకుప్పలు మలినమైన గుడ్డ పీలికలు, గడ్డికుప్పలు, రాళ్ళగుట్టలు, కొయ్యలగుట్టలు-మొదలైన వానిపై ఎక్కుట యందు ఆసక్తి కలిగి యుండుట, పగిలిన కంచు గంటవంటి రూక్షమైన కంఠ స్వరము కలిగియుండుట, నగ్నముగా నుండుట; పరుగు లెత్తు చుండుట; ఒక చోట నిలకడగా నుండకుండుట, తన దుఃఖమును గురించి ఇతరులకు చెప్పు చుండుట, స్మరణశక్తి నశించియుండుట; చేతులు పైకెత్తుకొని యుండుట, శరీరము కృశించి పరుషముగా నుండుట, దుర్గంధముతో కూడియుండుట, అపరి శుద్ధముగానుండుట అధికమైన లోలత్వము కలిగి అధికముగా భుజించు చుండుట, నిర్జనమైన వనము మధ్యన ఉండుట; మద్యమాంసములందు ప్రీతి కలిగియుండుట, కారణములేకయే రోదించుట, తన గోళ్ళతో శరీరమును గీరుకొనుట, వీధులలో పడి యుండు గుడ్డ పీలికలు చుట్టుకొనుచుండుట; తృణములను మాలగా ధరించుట ఈ లక్షణములు గల మనుజుని పిశాచ గ్రహమావహించినదని గ్రహింప వల యును.[1]

---

1. i) అనవస్థచిత్తం, స్థానమలభమానం, నృత్యగీతహాసినం, బద్ధాఽబద్ధ ప్రలాపినం, సఙ్కారకూటమలినరథ్యాచేలతృణాఽశ్మకాష్ఠాదిరోహణరతిం భిన్నరూక్షస్వరం, నగ్నం, విధావన్తం, నైకత్రతిష్ఠన్తం, దుఃఖాన్యావేదయన్తం, నష్టస్మృతిం చ పిశాచోన్మత్తం విద్యాత్

(చ.చి. 9/20)

ii) ఉద్ధస్తః కృశపరుషశ్చిరప్రలాపీదుర్గంధోభృశమశుచి స్తథాఽతిలోలః బహ్వాశీ విజనహిమాంబురాత్రిసేవీ వ్యాచేష్టం భ్రమతిరుదఽపిశాచజుష్టః

iii) అ.హృ.ఉ. 4/30-33 (సు.ఉ. 60/15)

## అసుర గ్రహోన్మాదము

ఆవేశ కాలాదులు—సంధ్యాకాలమునందు (సుశ్రుత). శుద్ధ త్రయోదశి బహుళద్వాదశులందా వహించునని వాగ్భట మతము.[1]

లక్షణములు :-

అధిక స్వేదము కలిగియుండుట, ద్విజులు, గురువులు, దేవతల యందు దోషముల నెంచుట, వక్రముగా చూచుట, భయము లేకుండాయుండుట, విరుద్ధమైన దృష్టితో చూచుట, అన్న పానాదులయందు సంతృప్తిని చెంద కుండుట, దుష్టమైన స్వభావమును కలిగియుండుట, మానము, శౌర్యము కోపము, ఉత్సాహము కలిగియుండుట, మద్య మాంసము లందధిక ప్రీతి కలిగియుండుట, తననే రుద్రుడనని, స్కంద విశాఖుడనని, ఇంద్రుడనని చెప్పుకొని వాదించుట-ఈ లక్షణములు కలిగియుండు మనుజుని అసుర గ్రహమావహించినదని గ్రహింప వలయును.[2]

నాగ గ్రహోన్మాదము :-

ఆవేశ కాలాదులు. నాగ గ్రహములు పంచమియందావేశించునని సుశ్రుతుడు, బహుళ పంచమి, శుద్ధ సప్తములందా వేశించునని వాగ్భటులు వివరించిరి.[3]

---

1. i) సు.ఉ. 60/17 ii) అ.హృ.ఉ. 4/9
2. i) సంస్వేదీ ద్విజగురుదేవదోషవక్తా జిహ్మాక్షో విగతభయో విమార్గదృష్టిః
సంతుష్టో భవతి న చాన్నపానజాతైర్దుష్టాత్మా భవతి చ దేవ శత్రుజుష్టః
(సు.ఉ. 60/9)
ii) జిహ్మదృష్టిం దురాత్మానాం గురుదేవద్విజద్విషమ్ నిర్భయం మానినం
శూరం క్రోధనం వ్యవసాయినమ్ , రుద్రస్కందోవిశాఖోఽహమింద్రోఽ
హమితి వాదినమ్ సురామాంసరుచిం విద్యాద్దైత్యగ్రహగృహీతకమ్
(అ.హృ.ఉ. 4/16-17)
3. i) సు.ఉ. 60/18 ii) అ.హృ.ఉ. 4/10

లక్షణములు :-

ఒక్కొక్కప్పుడు సర్పమువలె భూమిపై పాకుట, పెదవుల వెలి ప్రక్కలను నాలుకచే నాకు చుండుట, అధికమైన కోపము కలిగి యుండుట, గుడ, మధు, దుగ్ధ పాయసములందు అధికప్రీతిని కలిగియుండుట, ఎర్రని కన్నులుకలిగి యుండుట; స్తబ్ధ దృష్టి, వక్రగతి, చలస్వభావము కలిగియుండుట, బోర్లగిలపడు కొనుట, అధికనిద్ర కలిగియుండుట పెద్దశ్వాస విడుచుచుండుట, భయపడుచుండుట ఈ లక్షణములు గల మనుజుని నాగ లేక ఉరగ గ్రహమావహించినదని గ్రహింప వలయును.[1] చరకుడు, సుశ్రుతుడు ఇనువురును గ్రహముల సంఖ్యాకములని చెప్పుచు ప్రసిద్ధమై ప్రధానముగా నున్న ఎనిమిది గ్రహములను మాత్రము వర్ణించిరి. కాని చరకునిచే వివరింపబడిన వానిలో ఋషిగ్రహము, బ్రహ్మ రాక్షస గ్రహములను సుశ్రుతుడు వదలి, అసుర, నాగ అను రెండు గ్రహములను చేర్చెను.

వాగ్భటుడు గ్రహములను 18 విధములుగా వర్ణించెను. చరకోక్తములైన 8 గ్రహములు, అసుర, నాగ గ్రహములు; ప్రేత, కూశ్మాండ, నిషాద, ఔకిరణ, వేతాళ, గురు, వృద్ధ, సిద్ధాదులు.[2]

---

1. i) భూమౌ యః ప్రసరతి సర్పవత్ కదాచిత్ సృక్కిణ్యౌ విలిఖతి
జిహ్వయాంతధైవనిద్రాలుర్గుడమధుదుగ్ధపాయసేప్సుర్విజ్ఞేయో భవతి
భుజంగమేన జుష్టః (సు.ఉ. 60/14)

ii) రక్తాక్షం క్రోధనం స్తబ్ధదృష్టింవ క్రగతి చలమ్ శ్వసంతమనిశం
జిహ్వాలావినుసృక్విణీలిహమ్ ప్రియదుగ్ధగుడస్నానమధోవదన శాయినమ్
ఉరగాధిష్ఠితం విద్యాత్త్రిస్యం తం చాత వక్రతః (అ.హృ.ఉ. 4/19,20)

2. సో ఒష్టాదశధో దేవదానవాది విభేదతః (అ.హృ.ఉ. 4/3)

ప్రేత గ్రహోన్మాద లక్షణములు—ప్రేతముతో సమానమైన ఆకృతి, కృత్యములు, గంధము, కలిగియుండుట, భీతి చెంది యుండుట, ఆహారద్వేషము, తృణములను తుంచుట-ఈ లక్షణములు గల మనుజుని ప్రేత గ్రహమావహించి నదని గ్రహింప వలయును.[1]

కూశ్మాండ గ్రహ గృహీత లక్షణములు -:

అధిక ప్రలాపము, ముఖము నల్లబడుట, మెల్లగ నడచుట, వృషణములు ఉబ్బి వ్రేలాడుచుండుట-ఈ లక్షణములు గల మనుజుని కూశ్మాండ గ్రహమావహించినదని గ్రహింప వలయును.[2]

నిషాద గ్రహ గృహీత లక్షణములు :-

కర్రలు, మట్టి గడ్డలు పట్టుకొని తిరుగుచుండుట, నార వస్త్రములు ధరించుట, నగ్నముగ నుండుట, పరుగెత్తుట. భయముతో గూడిన దృష్టి కలిగి యుండుట, తృణములను భూషణములుగా అలంకరించుకొనుట, శ్మశానమునను, శూన్య ప్రదేశములందును సంచరించుట, వీధులందలి చెట్లక్రింద యుండుట, తిలాన్నము, మద్యము, మాంసము వీనియందు ప్రీతికలిగి యుండుట, పరుషముగా మాట్లాడుట-ఈ లక్షణములు గల మనుజుని నిషాదగ్రహము ఆవహించినదని గ్రహింప వలయును.[3]

---

1. ప్రేతాకృతిక్రియాగంధం భీతమాహారవిద్విషమ్ తృణచ్ఛిదం చ ప్రేతేన గృహీతం నరమాదిశేత్ (అ.హృ.ఉ. 4/31)
2. బహుప్రలాపం కృష్ణాస్యం ప్రవిలంబితయాయినమ్ శూనప్రలంబవృషణం కూశ్మాండాధిష్ఠితంవదేత్ (అ.హృ.ఉ. 4/35)
3. గృహీత్వా కాష్ఠలోష్ఠాది భ్రమంతం చీరవాసనమ్ నగ్నం ధావంతము త్ర్రిస్తదృష్టిం తృణవిభూషణమ్ శ్మశానశూన్యాయతనురథ్యైకద్రుమసేవినమ్ తిలాన్న మద్యమాంసేషు సతతం సక్తలోచనమ్ నిషాదాధిష్ఠితం విద్యాద్వదంతం పరుషాణి చ (అ.హృ.ఉ. 4/36-38)

పౌరణ గ్రహ గృహీత లక్షణములు :-

ఉదకమును అన్నమును యాచించుట, అధైర్యముతో కూడిన ఎఱ్ఱని కన్నులు కలిగి యుండుట, ఉగ్రముగా మాట్లాడుట—ఈ లక్షణములు గల మనుజుని పౌరణగ్రహము ఆవహించినదని గ్రహింప వలయును.[1]

వేతాళ గ్రహగృహీత లక్షణములు :-

గంధమాల్యాదులందాసక్తి కలిగియుండుట, సత్యమును పలుకుట, వణకుట, బహు ఛిద్రములు కలిగియుండుట-ఈ లక్షణములు గల మనుజుని వేతాళ గ్రహమావహించినదని గ్రహింప వలయును.[2]

గురు వృద్ధాది గ్రహ గృహీత లక్షణములు :-

గురువులు, వృద్ధులు, సిద్ధులు వారి శాపములననుసరించిన ఆహార వచన కృత్యములు గమనింపబడినపుడు ఆయాగ్రహము లావేశించినవని గ్రహింప వలయును.[3]

భూతోన్మాద అసాధ్య లక్షణములు :

రెండు చేతులను పైకెత్తి క్రోధావేశుడై ఏ విధమయిన జంకు లేక ఇతరులనైనను లేక తననైనను కొట్టుచున్నచో అట్టి ఉన్మాదము అసాధ్యముగా నుండును.

---

1. యాచంతముదకంచాన్నం త్రస్తాలోహితలోచనమ్
ఉగ్రవాక్యం చ జానీయాన్నరమౌకిరణార్దితమ్ (అ.హృ.ఉ. 4/39)

2. గంధమాల్యరతిం సత్యవాదినం పరివేపనమ్
బహుచ్ఛిద్రం చ జానీయాద్వేతాళేన వశీకృతమ్ (అ.హృ.ఉ. 4/40)

3. గురువృద్ధర్షిసిద్ధాభిశాపచింతాను రూపతః
వ్యాహారాహారచేష్టాభిర్యథాస్వం తద్గ్రహం వదేత్ (అ.హృ.ఉ. 4/43)

నేత్రములనుండి అశ్రుస్రావము, మేఢ్రము నుండి రక్తస్రావము, జిహ్వపై క్షత మేర్పడుట, నాసికాస్రావము, చర్మము ఛేదించుకొనుట, మర్మ (హృదయ) స్థానమునందు ఛేదించుచున్నట్లు బాధ కలుగుట, నోటి కడ్డులేక ఇష్టమువచ్చినట్లు ప్రలాపము చేయుట, ఎల్లప్పుడు కూజనము చేయుట, శరీరవర్ణము దూషింప బడుట, అధికమైన దప్పి, పూతిగంధము కలిగియుండుట; స్థూలమైన కన్నులు కలిగియుండుట, శీఘ్రముగా అటునిటు సంచరించుట, నోటినుండి నురుగు కారు చుండగా పెదవులతో నాకుచుండుట, నిద్రాళువుగ నుండుట, క్రిందపడి బాగుగా వణకుచుండుట, ఈ లక్షణములతో గూడియున్న అన్ని విధములగు గ్రహోన్మా దములు అసాధ్యములుగా నుండును. పర్వతములు, ఏనుగులు, వృక్షములు మొద లగు వానిపై నుండి పడినపుడు, గ్రహములచే ఆవేశింపబడినపుడు అట్టి గ్రహో న్మాదములు అసాధ్యములుగా నుండును. ఏ గ్రహమైనను పదమూడవ సంవత్స రము వయస్సునందు ఆవహించినచో అసాధ్యముగా నుండును.

దిగంబరముగా నుండుట, తల వెంట్రుకలు నిట్ట పొడుచుకొని యుండుట, అస్వస్థ మనస్కుడుగా నుండుట, దీర్ఘకాలము గ్రహావేశము అనువర్తించి యుండుట-బాలుర బృందముచే ఆవర్తింపబడియుండుట-ఈ క్రింది లక్షణములతో కూడిన గ్రహావేశములు అసాధ్యములుగా నుండును.[1] ఈ లక్షణములతో గూడి యున్నపుడు హింసించుటకు (చంపుటకు) గ్రహములావహించెనని గ్రహించి వర్జించవలెను.

---

1. i) సర్వేష్వపి తు ఖల్వేషు యో హస్తావుద్యమ్య రోషసంరమ్భాత్ నిశ్శఙ్కం అన్యేష్వాత్మని వా నిపాతయేత్ స హ్యసాధ్యో జ్ఞేయః తథా యస్సాస్రు నేత్రః మేఢ్రప్రవృత్తరక్తః ప్రస్రుతనాసికః ఛిద్యమానచర్మా అప్రతిహ న్యమానపాణిః సతతం వికూజన్ దుర్వర్ణస్తృషార్తః పూతిగన్ధశ్చ హింసా ర్థున్మత్తో జ్ఞేయః తం పరిత్యజేత్ (చ. చి. 9/22)

(Contd....

## నిజ ఆగంతుకాది ఉన్మాదముల పరస్పరానుబంధత

నిజ ఆగంతుకాది ఉన్మాదములకు వేరు వేరుగా చెప్పబడిన కారణములు కలియుటచే పూర్వ రూపములు, లక్షణములు గూడా సంసర్గముగా కలుగు చుండును. అటువంటి స్థితిలో చికిత్సలు కూడా కలిపి చేయవలసియుండును.[1]

## ఆవేశ ప్రయోజనానుసార సాధ్యాఽసాధ్యత

గ్రహములు మూడు ప్రయోజనముల నాశించి మనుజుల నావహించును. అవి హింసాకామము, రతికామము, బలికామము. హింసను ఆశించి ఆవేశించు గ్రహోన్మాద లక్షణములు ముందు వర్ణింపబడినవి. గ్రహములు, హింసించుచు మనుజుని చంపు ప్రయత్నము చేయుటచే ఇవి అసాధ్యములుగా చెప్పబడినవి.

అలోపెథీ వైద్య మతానుసారము ఆత్మహత్యా ప్రయత్నము (Suicidal tendency) అనునవి మానసిక వ్యాధులలో కలుగు ఘాతక ఉపద్రవములతో సర్వ సామాన్యమైనవి. డిప్రెసివ్ సైకోసిస్ (depressive Psychosis), అధిక మైన మత్తుపదార్థ సేవన, ఇతర డిప్రెసివ్ డిజార్డర్సు Depressive disorders) లో ఆత్మహత్యకు ప్రేరేపింపబడుట జరుగుచుండును.

---

ii) స్థూలాక్షస్త్వరితగతిః స్వఫేనలేహీ నిద్రాలుః పతతి చ కంపతే చ యోఽతి యాశ్చాద్రిద్విరదనగాదివిచ్యుతః సఽ సంసృష్టో న భవతి వార్ధకేన జుష్టః (సు. ఉ. 60/10)

iii) కుమారబృందానుగతం నగ్నముద్ధతమూర్ధజమ్ అస్వస్థమనసం దైర్ఘ్య కాలికం తు గ్రహం త్యజేత్ (అ. హృ. ఉ. 4/44)

1. తే తు ఖలు నిజాగన్తు విశేషేణ సాధ్యాసాధ్యవిశేషేణ చ ప్రవిభజ్యమానాః పఞ్చసన్తోద్వావేవ భవతః తౌ పరస్పరమనుబధ్నీతః కదాచిద్యథోక్త హేతుసంసర్గాదుభయోః సంసృష్టమేవపూర్వరూపం భవతి సంసృష్టమేవ లింగంచ (చ. ని. 7/19)

### రతికామ గ్రహగృహీత లక్షణములు

ఏకాంతముగా స్త్రీ సంభోగము, స్త్రీలతో సంభాషించుట, గంధ పుష్ప భూష ణాదులు-వీనియందు ప్రీతి కలిగియుండును, సంతోషము, శాంతము కల్గియుండును. ఈ లక్షణములు రతియందు ఆసక్తిగల గ్రహము ఆవేశించిన మనుజునియందు కలుగును. ఇది కష్టసాధ్యముగా నుండును.[1]

### బలికామ గ్రహగృహీత లక్షణములు

బలి పూజాదులందు ఆసక్తిగల గ్రహము ఆవహించినపుడు ఈ క్రింది లక్షణములు కలుగును-దైన్యత్వము, చేతులతో నోటిని తుడుచుకొనుట, ఓష్ఠ ములు, గళము తాలు ఇవి శుష్కించుట; అనుమానముగా చూచుట, ఏడ్చుట, చింతించుట, అన్నమునందిచ్ఛయున్నను అన్నము పెట్టినపుడు భుజింపకుండుట ఈ లక్షణములతో కూడియుండును. ఇది సుఖ సాధ్యముగా నుండును.[2]

## ఆగంతుకోన్మాద చికిత్స

### భూతవిద్య - అమానుష ప్రతిషేధము

సాధ్యస్థితిలో ఉన్న ఆగంతుకోన్మాదమునందు రోగి, వ్యాధ్యవస్థాములను గమనించి ఆవశ్యకతానుసారము విధిననుసరించి ఈ క్రింది చికిత్సలను ప్రయో గింప వలయును.

---

1. రహఃస్త్రీరతి సంలాపగంధస్రగ్భూషణప్రియః
హృష్టశ్శాంతశ్చ దుస్సాధ్యో రతికామేన పీడితః (అ.హృ.ఉ. 3/37)

2. దీనః పరిమృశన్ వక్త్రం శుష్కోష్ఠగళతాలుకః
శంకితం వీక్షతే రౌతి ధ్యాయత్యాయాతి దీనతామ్
అన్నమన్నాభిలాషేఽపి దత్తం నాతి బుభుక్షతే
గృహీతం బలికామేన తం విద్యాత్సుఖసాధనమ్ (అ.హృ.ఉ. 38-39)

మంత్రములు, ఓషధులు, మంగళకర్మలు, బలిదానములు, ఉపహార ములు, భోజనములు పెట్టుట, హోమము, నియమములు, వ్రతములు, ప్రాయశ్చిత్తములు, ఉపవాసములు, స్వస్త్యయనములు (శాంతికర్మలు), ప్రణిపాతము (దేవాది గ్రహములకు ప్రీతిని కలిగించుటకై నమ్రతా పూర్వకమైన ఆచార వ్యవహారములు పాటించుట) మొదలగునవి ఆచరింపవలెను.[1]

రతి కామ, బలి అర్చనాది కామ గ్రహావేశములందు ఆయా ప్రయోజనముల కనురూపమైన బలులతోపాటు మంత్ర ఔషధాదులద్వారా వైద్యుడు చికిత్సింప వలయును.[2]

మాంగళిక హోమములు; ఇష్టి హోమములు, వేదోక్తనియమాచరణము, ఛత్ర, అతిఛత్రాది ఔషధ ధారణములు, సిద్ధార్థక అగదము మొదలయిన వాని ధారణము, తపస్సు, దానములనిచ్చుట, ఆధ్యాత్మ విషయ జ్ఞానమును పొందుట, దేవతలు, గోవులు, బ్రాహ్మణులు, గురువులు వీరిని పూజించుట చేయవలయును.[3]

ఈశ్వరుడు సర్వభూతముల కధిపతి అతనిని పూజించినను; లోకమున సంచరించుచుండు రుద్ర సంబంధమైన ప్రమథ, గణములను పూజించినను భూతజ ఉన్మాదములు శమించును.[4]

---

1. తయోః సాధనాని మన్త్రౌషధిమణిమఙ్గలబల్యుపహారహోమనియమవ్రత ప్రాయశ్చిత్తోపవాసస్వస్త్యయనప్రణిపాతగమనాదీనితి (చ. ని. 7/18)
2. రత్యర్చనాకామోన్మాదినౌ తు భిషగభిప్రాయాచారాభ్యాంబుద్ధ్వాతదంగోపహారబలిమిశ్రేణ మన్త్రభైషజ్యవిధినోపక్రమేత్ (చ.చి. 9-23)
3. బలిభిర్మంగల్హోమైరోషధ్యగదధారణైః సత్యాచారతపోజ్ఞానప్రదాననియమవ్రతైః దేవగోబ్రాహ్మణానాఞ్చ గురూణాం పూజనేన చ ఆగంతుః ప్రశమం యాతి సిద్ధైర్మన్త్రౌషధైస్తథా (చ.చి. 9/93-94)
4. భూతానామధిపం దేవమీశ్వరం జగతః ప్రభుం పూజయన్ ప్రయతోనిత్యం జయత్యున్మాదజం భయమ్ రుద్రస్యప్రమథానామగణాలోకేచరన్తియే తేషాం పూజాం చ కుర్వాణ ఉన్మాదేభ్యః ప్రముచ్యతే (చ.చి.9/91-92)

దేవాది గ్రహోన్మాదములందు తీక్ష్ణమైన అంజనము మొదలగు వానిని, తాడనము మొదలగు క్రూర కర్మలు ప్రయోగింపరాదు. ఘృతపానము మొదలగు మృదువైన ఔషధములు, మృదువైన అంజనములు మొదలగు వానిని పై దైవ వ్యపాశ్రయ చికిత్సలతో పాటు ప్రయోగింపవలెను.[1]

సుశ్రుత మతానుసారము మంత్ర బల్యుపహారాది దైవ వ్యపాశ్రయ క్రియలచే శమించనపుడు భూతోన్మాదములందు ధూపనస్య అంజన ఘృతాది యోగములను ప్రయోగించ వలయును.[2]

దేవాది గ్రహోన్మాదములందు అశుద్ధ అపవిత్రమైన వస్తువులను చికిత్సలో ప్రయోగించరాదు. పిశాచ గ్రహావేశమున తప్ప మిగిలిన గ్రహములందు ప్రతికూలమైన, అపవిత్రమైన వస్తువులను ఉపయోగింపరాదు. ఎందు చేతననగా అనుచిత అపవిత్ర వస్తువుల యొక్క ప్రయోగములచే మిక్కిలి బలము ఓజస్సు గలవగుటచే ఆ గ్రహములు కోపించి రోగిని చంపుటయే కాక వైద్యుని కూడా చంపును.[3]

---

1. దేవర్షిపితృగన్ధర్వైః ఉన్మత్తస్య చ బుద్ధిమాన్, వర్జయేదంజనాదీని
తీక్ష్ణాని క్రూరకర్మ చ సర్పిష్పానాది తస్యేహ మృదు భైషజ్యమాచరేత్
పూజాం బల్యుపహారాంశ్చ మన్త్రాఞ్జనవిధీంస్తథా శాన్తికర్మేష్టిహోమాంశ్చ
జపస్వస్త్యయనాని చ వేదోక్తనియమాంశ్చాపి ప్రాయశ్చిత్తాని చాచరేత్
(చ.చి. 9/88-89)

2. పూర్వసమాచరితైర్మన్త్రైర్భూతవిద్యానిదర్శితైః
న శక్యా బలిభిర్జేతుం యోగైస్తాన్ సముపాచరేత్ (సు.ఉ. 60/40)

3. న చాశుచిం ప్రయుంజీత ప్రయోగం దేవతాగ్రహే ఋతే పిశాచాదన్యత్ర
ప్రతికూలం న చాచరేత్ వైద్యాతురౌ నిహన్యుస్తే ధ్రువం క్రుద్ధా మహౌజసః
(సు.ఉ. 60/54)

భూతోన్మాదములకు చేయబడు చికిత్సలను అమానుష ప్రతిషేధములనియు భూత ప్రతిషేధమనియు అందురు. అమానుషమనగా మనుష్యులకు భిన్నమైన వారని సామాన్యార్థము. కాని కొన్ని మనుష్యుల కుండు ధర్మములు గూడా యుండి కొన్ని మనుష్యులకు లేని ధర్మములు కలిగియుండు దేవాది గ్రహములకు ఇచ్చట విశేషించి అమానుషమను పదము ప్రయోగింప బడినది. అట్టి గ్రహావేశములకు చేయు చికిత్సలు అమానుష ప్రతిషేధములనబడును. సుశ్రుతుడు ఈ చికిత్సలు వివరింపబడిన అధ్యాయమునకు అమానుష ప్రతిషేధమనియు వాగ్భటుడు భూత షేధమనియు నామము లిడిరి. భూతవిద్య అనునది సాధారణముగా భూతగ్రహావేశ హేతులక్షణ చికిత్సాదులకు ప్రయోగించు పదము. ఇది ప్రత్యేకమైన ఆయుర్వేదాంగము.

## సామాన్య మంత్ర జపాదులు

వైద్యుడు సావధాన చిత్తుడై శౌచస్నానాదులు నిర్వర్తించి, రోగికి గూడా శౌచస్నానాదుల అనంతరము "ఈశ్వరం ద్వాదశభుజమ్" అను మంత్రము జపము చేయించిన ఉన్మాద అపస్మార చిత్త విభ్రమాదులు శమించును. "మాయూరీ మహావిద్య"ను గాని 'పరమేశ్వర మహామంత్రము'నుగాని వేదోక్తములైన, భూతవిద్యాంతర్గతములైన ఇతర తగిన మంత్రములనుగాని జపింప చేయవలయును. రోగి జపించ లేనపుడు తగిన వ్యక్తిచే జపింపచేసి రోగి వినునట్లుచేయవలయును.[1]

---

1. i) ఈశ్వరం ద్వాదశభుజం నాథమార్యావలోకితమ్ సర్వవ్యాధిచికిత్సంతం జపన్ సర్వగ్రహాన్ జయేత్, తథోన్మదానపస్మారానన్యం వా చిత్త విప్లవమ్ మహావిద్యాం చ మాయూరీం శుచింతం శ్రావయేత్సదా భూతేశం పూజయేత్ స్థాణుం ప్రమథాఖ్యాంశ్చతద్గుణాన్ జపం సిద్ధాంశ్చ తన్త్రం త్రాన్ గ్రహాన్ సర్వానపోహతి (అ.హృ. 5/50-52)

ii) సు. ఉ. 60/30

## బలిద్రవ్యములు

ఎర్రని గంధము. పుష్ప మాలికలు, ఎర్రనిపూలు, రత్నములు, బీజములు, (మాష, సర్షప, యవాదులు), మధు, సర్పి, వివిధ భక్ష్యములు-ఇవి సామాన్యముగా అన్ని గ్రహములకు ప్రీతిగ నుండు బలిద్రవ్యములు కనుక అన్ని గ్రహములకు బలి రూపములో అర్పింప వచ్చును.[1]

వస్త్రములు, మద్యము, మాంసము, క్షీరము, రుధిరము, గుడము, వస-స్నానము వీనిలో ఏయే గ్రహములకు ఏయే కాలములలో ఏవేవి ప్రీతి కరముగా నుండునో, శాస్త్రాదుల వలన గ్రహించి ఆయా వస్తువులను సమర్పించి తృప్తి కలిగించ వలయును.[2]

## బలిప్రదాన కాలములు

ఏవగ్రహములు ఏయే తిథులందు మనుజులనావేశించి బాధింప చుండునో ఆయాభూతోన్మాదములందు ఆ తిథుల యందు బలిహోమాదులు ప్రయోగింప వలయును.[3]

## విశేష బలివిధానాదులు

దేవగ్రహ బలికర్మాదులు—దేవగ్రహజుష్ట ఉన్మాదమునందు దేవాలయము నకు ఉత్తర దిక్కునందు బలి లేక దేవాలయమునందు అగ్నిలో ఘృతాదుల...

---

1. i) రక్తాని గంధమాల్యాని బీజాని మధుసర్పిషీ భక్ష్యాశ్చ సర్వే సర్వేషాం
 సామాన్యో విధిరుచ్యతే (సు.ఉ. 60/31)

2. i) వస్త్రాణి మద్యమాంసాని క్షీరాణి రుధిరాణి చ యాని యేషాం
 యథేష్టాని తాని తేభ్యః ప్రదాపయేత్ (సు.ఉ. 60/32)
 ii) అ. హృ. ఉ. 5/22

3. i) హింసంతి మనుజాన్ యేషు ప్రాయశోదివసేషు తు దినేషు
 తేషు దేయాని తద్భూతవినివృత్తయే (సు.ఉ. 60/33)
 ii) అ. హృ. ఉ. 5/21

మంత్రములచేత దేవగ్రహమునకు తృప్తి కలుగునట్లు హోమము చేసి శుభ్రముగా తెల్లగానుండు పుష్పమాలికలు గంధములు, క్షీరాన్నము, లేక పాయసము, అపూపములు, ఘృతము, దధి, కుశలు, స్వస్తికములు, శ్వేత ఛత్రము-ఈ ద్రవ్యములను బలిగా సమర్పింపవలయును.[1]

హింగ్వాది ఘృతము (అ.హృ.ఉ.) పాన నస్య అభ్యంగాదులకు ప్రయోగింపవలయును.

వచా, హింగు, లశునములను బస్తమూత్రముతో నూరి, నస్యమునకు, అంజనమునకు ఉపయోగించ వలయును. ఈ ఉపక్రమములచే దేవగ్రహోన్మాదము శమించును.[2]

## అసురగ్రహోన్మాద చికిత్సలు

బలికర్మాదులు :

అసుర గ్రహోన్మాదమున వాకిలియందు లేక పశ్చిమన నాలుగు మార్గములు కలియు ప్రదేశమున అసురులకు ప్రీతికరములైన బహు విధములైన ఫలములు, ఉశీరము, కమలములు ఉత్పలములు-వీనిని బలిగా సమర్పింప వలయును.[3]

---

1. i) దేవగ్రహే దేవగృహే హుత్వాఽగ్నిం ప్రాపయేద్బలిమ్ కుశస్వస్తిక పూపాజ్యచ్ఛత్రపాయససంభృతమ్ (సు.ఉ. 60/34)
   ii) సురర్షిగురువృద్ధేభ్యప్పిద్ధేభ్యశ్చ సురాలయే దిక్వ్యర్తం స్యాం తత్రాపి దేవాయోపహరేద్బలిమ్ (అ.హృ.ఉ. 5/24)
   iii) శుచిశుక్లాని మాల్యాని గంధాః క్షైరేయిమోదనమ్ దధిచ్ఛత్రం చ ధవళం దేవానాం బలిరిష్యతే (అ.హృ.ఉ. 5/28)
2. అ. హృ. ఉ. 5/29-31
3. i) అసురాయ యథాకాలం విదధ్యాచ్చత్వరాదిషు (సు.ఉ. 60/35)
   ii) దైత్యేబలిర్బహుఫలస్సోశీరకమలోత్పలః (అ.హృ.ఉ. 5/31)
   iii) పశ్చిమాయాం యథాకాలం దైత్యఘాతాయ చత్వరే (అ.హృ.ఉ. 5/25)

ధర్వ గ్రహోన్మాదమున బలి కర్మాదులు :

గంధర్వ గ్రహోన్మాదమునందు గోవులుండు ప్రదేశమధ్యమునందు లేక వులు సంచరించు మార్గమునందు మద్యము, మాంసము ఉదకము-వీనిని వస్త్రా రణ సహితముగా బలిగా సమర్పింప వలయును.[1]

క్ష గ్రహోన్మాదమున బలికర్మాదులు :

యక్షగ్రహోన్మాదమునందు రమ్యమైన గృహమునందుగాని యక్షాలయము ), రెండు నదుల సంగమ స్థలమునగాని, పాలు, దధి ఘృతయుక్త అన్నము ాంషము, రక్తము, సురాదులు, అతిముక్తక. కుంద ఉత్పల, పద్మ పుష్పములు దారు, ఉశీరము, గుగ్గిలము మంచి వస్త్రములు స్వర్ణము, రజతము-ఈ ద్రవ లను బలిగా సమర్పింప వలయును.[2]

మూత్రాజ్యాది సిద్ధఘృతము పాన నావనాభ్యంగములకు హరీతికా ాంజనమును ప్రయోగించిన యక్షగ్రహోన్మాదము శమించును.[3]

ృ గ్రహోన్మాదమున బలి కర్మాదులు :

పితృగ్రహోన్మాదమునందు నదీతీరమున కుశలను పరచి పితృ ప్రి ములగు ద్రవ్యములను బలిగా సమర్పింప వలయును.[4]

---

i) గంధర్వస్య గవాంమధ్యే మద్యమాంసాంబుజాంగలమ్ (సు.ఉ. 60/3
ii) గంధర్వాయ గవాం మార్గే సవస్త్రాభరణం బలిమ్ (అ.హృ.ఉ. 5/2)

i) హృద్యేవేశ్మని యక్షస్య పల్మాషాసృక్ సురాదిభిః
అతిముక్తకకుందాబ్జపుష్పైశ్చ వితరేద్బలిమ్ (సు.ఉ. 60/36)
ii) యక్షాయ యక్షాయతనే పరితో ద్వా సమాగమే (అ.హృ.ఉ. 5/26)
iii) యక్షాణాం క్షీరదధ్యాజ్యమిశ్రకోదనగుగ్గులుః దేవదామాత్పలంపద్మముశీర
వస్త్రకాంచనమ్ హిరణ్యం చ బలి ర్యోజ్య (అ.హృ.ఉ. 5/34)

అ. హృ. ఉ. 5/3_38

నద్యాంపితృగ్రహాయేష్టంకుశాస్తరణ భూషితమ్ (సు.ఉ. 60/36)

నాగగ్రహోన్మాదమున బలికర్మాదులు :-

నాగగ్రహోన్మాదమున నది యందు, ఆగ్నేయ దిక్కున పుష్పములు, లాజలు, గుడాపూపములు, గుడోదనములు, పరమాన్నము, మధు, క్షీరము, కృష్ణ మృత్తిక, నాగ కేసరములు, వచా, పద్మకము, గుగ్గిలము, ఉశీరము, రక్తోత్పల దళములు-వీనితో బలిని సమర్పింపవలయును.[1]

శ్వేత కమలము, లోధ్ర, తగర సర్షపములను శీతల జలముతో నూరి నస్యాంజనార్థము ప్రయోగించిన నాగగ్రహము శమించును.[2]

రాక్షస గ్రహోన్మాదమున బలికర్మాదులు:-

రాక్షసగ్రహ జుష్ట ఉన్మాదమున, చతుష్పథమునందు గాని లేక భయంకరము లైన అడవియందుగాని మాంసము, శ్వేత కుసుమములు-వీనితో కలసిన అన్నము, పక్వమాంసము, ఆమ మాంసము, రక్తముతో తడిపిన అనుములు వీనితో బలిని సమర్పింపవలయును.

---

1. (i) తథైవోపహరేచ్చాపి నాగాయ వివిధం బలిమ్ (సు. ఉ. 6[illegible]/37)
   (ii) నాగానాం సమనోలాజాగుడాపూపగుడోదనైః పరమాన్నమ[illegible]
   కృష్ణమృగకేసరైః వచాపద్మపురోశీరరక్తోత్పలదలైర్బలిః
   (అ. హృ[illegible]. 5/32-33)
   (iii) అ. హృ. ఉ. 5/26
2. అ. హృ. ఉ. 5/33-34
3. (i) చతుష్పథే రాక్షసస్య భీమేషు గహనేషు వా (సు. ఉ. 60/38)
   (ii) అ. హృ. ఉ. 5/27
   (iii) రక్షసాం పలలం శుక్రం కుసుమం [illegible]
   బలిః పక్వామమాంసాని నిష్పావా రుధిరోక్షితాః (అ. హృ. ఉ. 5/40-41)

స[illegible]లాది ఘృతమును పానస్యాభ్యంజనములకు ప్రయోగించిన రాక్షస గ్రహోన్మాదము శమించును.[1]

**పిశాచ గ్రహోన్మాదమున బలి కర్మాదులు:-**

పిశాచ గ్రహ శాంతికై శూన్యగృహమునందు పశ్చిమదిక్కున, శీధు, పిణ్యాకము, మాంసము, దధి, మూలకము, లవణము, సర్పి, యావకము, భూతోదనము అనగా దధి హరిద్రా, లాజ తిలలు కలసిన అన్నము-వీనితో తీవ్రమైన ద్రవ్యములతో బలిని సమర్పింపవలయును.[2]

హరిద్రాది ఘృతము పానాభ్యంజనాదులకు అవే ద్రవ్యములు బస్తమూత్రముతో నూరి అంజననావనాదులకు ప్రయోగించిన పిశాచగ్రహము శమించును.[3]

**బ్రహ్మ రాక్షస గ్రహజుష్ట ఉన్మాదమున బలి కర్మాదులు:-**

అడవిలో పూర్వదిశయందు యవాన్నముచే నింపబడిన పాత్ర, జలపూర్ణ కుంభము, మాంసము, ఛత్రము, వస్త్రము, లేపనములు-వీనితో బలిని సమర్పింపవలయును.[4] గాయత్ర్యాది ఘృతము పాననస్యాభ్యంగాదులకు ఉపయోగింప వలయును. ఈ క్రియలచే బ్రహ్మ రాక్షస గ్రహము శమించును.[5]

---

1. అ. హృ. ఉ 5/41-44
2. (i) శూన్యాగారే పిశాచస్య తీవ్రం బలిముపాహరేత్ (సు. ఉ. 60/38)
   (ii) శూన్యాలయే పిశాచాయ పశ్చిమాం దిశమాస్థితే (అ. హృ. ఉ. 5/28)
   (iii) పిశాచానాం బలిశ్శీధుపిణ్యాకః పలలందధి
   మూలకం లవణం సర్పి స్సభూతోదనయావకమ్ (అ. హృ. ఉ. 5/44)
3. అ. హృ. ఉ. 5/45-47
4. (i) అ. హృ. ఉ. 5/27
   (ii) బ్రహ్మరక్షోబలిస్సిద్ధం యవానాం పూర్ణమూధకమ్ తోయస్య కుంభః
   పలలం ఛత్రం వస్త్రం విలేపనమ్ (అ. హృ. ఉ. 5/37)
5. అ. హృ. ఉ. 5/38-39

## సామాన్య గ్రహ నాశక గణము

పురాణ ఘృతము, లశునము, హింగు, సిద్ధార్థకము (తెల్లావాలు) వచ, లోమీ (దూర్వా) అజలోమీ (శ్వేతదూర్వా) భూతకేశీ (జటామాంసి), జటా, టీ (బూరుగ వేరు) సర్పగంధ, కాకోలి, క్షీరకాకోలి, శతావరి, గుడూచి యస్థా) కర్కట శృంగీ, మోహనవల్లిక (ధత్తూరపత్ర) అర్క మూలము, కటు, ప్రేంకణము, స్రోతోంజనము, మనశ్శిల, తాళకము ఇతర రక్షోఘ్న వ్యములు, సింహము, వ్యాఘ్రము (పెద్దపులి) ఎలుగుబంటు, మార్జాలము, గ్గమృగము, అశ్వము, గోవు, శ్వావి (ఏదు పంది) శల్యక, గోధా (ఉడుము) ంచె, నకుల- ఈ జంతువులయొక్క పురీషము, త్వక్, రోమములు, వస, మూత్రము, రక్తము, పిత్తము, నఖాదులు ఇవన్నియు గ్రహ నాశక గణముగా ండును.

వీనిని తైలముతోగాని, ఘృతముతోగాని పక్వముచేసి పానసస్యాభ్యంగాదుల పయోగింపవలెను. గుటికలుగా చేసి అవపీడాంజనాదులకు, క్వాథచూర్ణాదులను రిషేక అవ చూర్ణన లేపాదులకు ప్రయోగింపవలయును. ఈ విధమగు ప్రయో ములచే అన్ని విధములగు గ్రహజుష్ట ఉన్మాదములను, అపస్మారములను, అన్ని మానస వికారములను శీఘ్రముగా శమింపచేయును.[1]

---

1. పురాణ సర్పిర్లశునం హింగు సిద్ధార్థకం వచా
గోలోమీ చాజలోమా చ భూతకేశీ జటా తథా
కుక్కుటీ సర్పగంధా చ తథా కాణవిషాణికే
ఋష్యప్రోక్తా వయస్థా చ శృంగీ మోహన వల్లికా
అర్కమూలం త్రికటుకం లతా స్రోతోజమంజనమ్
నైపాలీ హరితాలం చ రక్షోఘ్నం యే చ కీర్తితాః
సింహ వ్యాఘ్రర్క్ష మార్జారద్వీపివాజిగవాం తథా

(Contd...

గజాహ్వాది యోగము నస్యాభ్యం జనేరాదులకు,శిరీషాద్యంజనము, సైంధవాద్యంజనము, ఖరాశ్వాది పురీషతైలము, నస్యాభ్యంజనాదులకు ఆవశ్యకతాను సారము ప్రయోగించిన గ్రహములు శమించును.[1]

## ఘృ త ము లు

దోషజోన్మాదములందు చెప్పబడిన ఘృతములన్నియు అవస్థాను సారము ప్రయోగింపవచ్చును.

భూత రావ ఘృతము, మహాభూతరావ ఘృతము, విశేషించి వాగ్భటునిచే భూతగ్రహ నాశకములుగా వివరింపబడినవి.[2]

## భూతగ్రహ ఉన్మాదాదిశామక ధూపములు

1. కార్పాసాస్థి, మయూరపింఛము, బృహతీ,శివనిర్మాల్యము,పిండీతకము జటామాంసి, మార్జాల పిష్టము, ఉముక, వచ, నరకేశములు, సర్పనిర్మోకము,

---

శ్వా విచ్ఛల్యకగోధానామృష్టస్య నకులస్య చ
విట్ శ్వ గ్రోమవసామూత్ర రక్తపిత్తనఖాదయః
అస్మిన్ వర్గే భిషక్ కుర్యాత్తైలాని చ ఘృతాని చ
పానాభ్యంజననస్యేషు తాని యోజ్యాని జానతా
అవపీడేఽంజనే చైవ విదధ్యాద్గుటికీకృతమ్
విదధీత పరిషేకే క్వథితం చూర్ణితం తథా
ఉద్ధూలనే శ్లక్ష్ణపిష్టం ప్రదేహే చావచారయేత్
విషమజ్వరవికారాంస్తు మానసా నవరాజితః
హన్యాదల్పేన కాలేన స్నేహాదిరపి చ క్రమాత్
(సు. ఉ. 60/46-54)

1. సు. ఉ. 60/41-44
2. అ. హృ. ఉ. 5/19-20

గజదంతము, హింగు, మరిచము-వీని చూర్ణములను ధూపము వేసిన స్కంద, పిశాచ, రాక్షస, అసుర ఆవేశ జనిత జ్వరము, ఉన్మాదము శమించును.[1]

2. అజరోమములు, ఎలుగుబంటి రోమములు, శల్యక ఉలూక రోమములు, హింగు, వీనిని బస్త మూత్రముతో తడిపి ధూపము వేసినవెంటనే బలమైన గ్రహములు గూడ వదలిపోవును.[2]

గ్రహజుష్ట ఉన్మాదములందు హితకరమైన అహారవిహారములను సద్వృత్తములను అనుష్టించు చుండవలయును. సుశ్రుత సూత్రస్థానమున హితాహితీయమున చెప్పబడిన ఆహారాది విధులననుసరింప వలయును.[3]

## అ ప స్మా ర ము

స్మృతి అనగా గడచిన అనుభవించిన విషయములనుగురించిన జ్ఞానమును తిరిగి మనసునకు తెచ్చుకొనుట. అట్టిస్మృతికి "అప" అనగా నాశనము కలుగుట అను అర్థము వచ్చు ఉపసర్గను చేర్చుటచే "అపస్మారము" అను పదమేర్పడు చున్నది.

అపస్మర్యతే - స్మృతి స్త్యజ్యతే అత్రేత్యపస్మార

"స్మృతే రపగమం ప్రాహురపస్మార భిషగ్విధ"

---

1. అ. హృ. ఉ. 5/18
2. అజర్క్షచర్మరోమాణి శల్యకోలూకయో స్తథా హింగుమూత్రంచ బస్తస్య ధూమమస్య ప్రయోజయేత్ ఏతేన శామ్యతి క్షిప్రం బలవానపి యో గ్రహః (సు.ఉ. 60/40)
3. హితాహితీయే యచ్చోక్తం నిత్యమేవ సమాచరేత్ (సు.ఉ. 60/56)

అను నిర్వచనములచే పూర్వానుభూతవిషయములు స్మరణకురాక స్తంభించి పోవుట ప్రధాన లక్షణముగా ఈ వ్యాధి యందుండుటచే దీనికి అపస్మారము అను పేరు వచ్చినదని తెలియుచున్నది.

ఈ వ్యాధి ఆధునిక వైద్య శాస్త్రమందలి ఎపిలెప్సీ (Epilepsy) అను వ్యాధికి సరిపోలు లక్షణములతో యుండును. Epilepsy ప్రపంచమంతట సుమారు 1 శాతం జనులలో వ్యాపించియున్న ఘోరమగు వ్యాధి.

**నిదానము :**

విప్రకృష్ట నిదానము — ప్రాచీన కాలమున దక్షప్రజాపతి యొక్క యజ్ఞ వినాశసందర్భమున అనేక విధములగు భూతములను, అశుచి పదార్థములను స్పృశించుటచే అపస్మారము యొక్క ఆది ఉత్పత్తి జరిగినది.

సన్నికృష్ట నిదానము :

ఆహార సంబంధకారణములు — మలినముగా నున్నట్టివి, చెడిపోయినవి, అశుచికరమైనవి, అహితమైనవి విరుద్ధమైనటువంటివి అగు ఆహారములను విషమముగా ఉపయోగించుట.

విహార సంబంధ కారణములు — శరీరవర్తనమును విషమముగా ఆచరించుట, శరీరకృత్యములను విషమముగా ఆచరించుట, ఇంద్రియార్థములను శారీరక కర్మలను అధికముగా సేవించుట అనగా ఇంద్రియముల యొక్క అతి యోగము, కర్మల (శారీరక) యొక్క అతి యోగము, విరుద్ధమైన మలినమైన విహారములు; వేగములను అలవాటుగా నిరోధించుచుండుట, రజస్వలగానుండు స్త్రీతో సంభోగించుట.

మానసిక కారణములు — రజస్తమోగుణములచే ఉపహతమైన మనస్సును కలిగియుండుట, కామము, క్రోధము, భయము, లోభము, మోహము,

హర్షము, చిన్త, ఉద్వేగము, శోకము మొదలగునవి వాని వాని కారణములచే అధికముగా కలుగుట.

ఇతర కారణములు — ఇతరమార్గములను పొందినవియు, విషమములును అగు బహు దోషములను కలిగియుండుట, శరీరము అధికముగా క్షీణించి యుండుట, పంచకర్మల యొక్క అతియోగ, అయోగ, మిథ్యాయోగములు.[1]

---

1. i) త ఏవం విధానాం ప్రాణభృతాం క్షిప్రమభినిర్వర్తన్తే తద్యథా రజస్తమోభ్యాముపహతచేతసాముద్భ్రాన్తవిషమబహుదోషాణాం సమలవికృతో పహితాన్యశుచీన్యభ్యవహారజాతాని వైషమ్య యుక్తేనోపయోగవిధినోపయుంజానానాం తన్త్రప్రయోగమపి చ విషమమాచరతామన్యాశ్చ శరీరచేష్టా విషమాః సమాచరతామత్యుపక్షీణదేహానాం వా దోషాః ప్రకుపితా రజస్తమోభ్యాముపహతా చేతసామన్తరాత్మనః శ్రేష్ఠతమమాయతనం హృదయముపసృత్య పర్యవతిష్ఠన్తే తథేన్ద్రియాయతనాని, తత్రచావస్థితాః సన్తోయదా హృదయమిన్ద్రియాయతనాని చేరితాః కామ క్రోధ భయ లోభ మోహ హర్ష శోక చిన్తోద్వేగాదిభిర్భూయః సహసాఽభిపూరయన్తి తదా జన్తురపస్మరతి (చ.ని. 8/4)

ii) విభ్రాన్త బహుదోషాణాం అహితాఽశుచి భోజినామ్
రజస్తమోభ్యాం విహతే సత్త్వేదోషావృతేహృది చిన్తాకామభయ
క్రోధశోకోద్వేగాదిభిస్తథా మనస్యభిహతే న్నాణాం అపస్మారః ప్రవర్తతే
(చ.చి. 10/5)

iii) మిథ్యాతియోగేన్ద్రియార్థ కర్మణామతి సేవనాత్
విరుద్ధమలినాహారవిహారకుపితైర్మలైః
వేగనిగ్రహ శీలానామహితాశుచిభోజినామ్, రజస్తమోఽభి
భూతానాం గచ్ఛతాం చ రజస్వలామ్ తథా కామభయో
ద్వేగ క్రోధ శోకాది భిర్భృశమ్ చేతస్యభిహతే పుంసామపస్మారోఽ
భిజాయతే (సు.ఉ. 61/4-6)

ఎపిలెప్సీ (Epilepsy) ప్రధానముగా ఈ క్రింది కారణముల వలన కలుగవచ్చునని భావింప బడుచున్నది. వంశపారంపర్యత, మస్తిష్కముపై ప్రసవ సమయమున దెబ్బతగులుట, తలపై అభిఘాతము, అర్బుదములు, జన్మజాత లోపములు, శిరోధమనీ వికృతులు, విషపూరితమైన ఔషధ సేవన - కాని ఈ కారణములు కొందరిలో మాత్రమే వ్యాధిని కలిగించ గలుగుతాయి.

## సంప్రాప్తి :

పైన వివరించబడిన కారణములచే శారీరక మానస దోషములు ప్రకోపించి వాతాది దోషములు సంజ్ఞావాహి స్రోతస్సులందు వ్యాపించియు మనోవాహిధమనులను లేక స్రోతస్సులను రజోతమోదోషములు ఆశ్రయించి హృదయమును పీడించుచు మనస్సునకు వ్యధను కలిగించుచు, బుద్ధిని, సత్వగుణమును, నశింప చేయుచు అపస్మారమును కలిగించును.[1] మనుజుడు జ్ఞానశూన్యుడగును.

## పూర్వరూపములు :

కనుబొమ్మలు ముడుచుకొనియుండుట, సతతము నేత్రము వికృతములగుట, శబ్దము వినపడక పోవుట, లాలా శింఘాణక (గట్టి శ్లేష్మ) స్రావము, అన్నము నందు ఇష్టము లేకపోవుట, అరుచి, అజీర్ణము, హృదయ గ్రహము, కుక్షియందు ఆటోవము, దౌర్బల్యము, అంగమర్దము, మోహము, తమోదర్శనము, మూర్ఛ,

---

1. i) చ. ని. 8/4

ii) ధమనీభిః శ్రితాదోషాః హృదయం పీడయన్తి హి<br>సమ్పీడ్యమానో వ్యథతే మూఢోభ్రాన్తేన చేతసా (చ.చి. 10/6)

iii) సంజ్ఞావహేషు స్రోతః సుదోషవ్యాప్తేషు మానవః<br>రజస్తమః పరీతేషు మూఢో భ్రాంతేన చేతసా (సు.ఉ. 61/7)

iv) ఉన్మాదవత్ప్రకుపితైశ్చిత్తదేహగతైర్మలైః<br>హతే సత్త్వే హృది వ్యాప్తే సంజ్ఞావాహిషు ఖేషు చ (అ.హృ.ఉ. 7/2)

అధికభ్రమ, స్వప్నమునందు మదము, నర్తనము, వ్యధనము (గుచ్చుకొనుట) బాధ మొదలగునవి కలుగును. హృదయ [illegible]వము, హృదయ శూన్యత, స్వేదము బట్టుట, ధ్యానమగ్నుడై యుండుట, ప్రమూఢత్వము (అత్యధిక సంజ్ఞానాశము) నిద్రానాశము, స్వప్నమునందు తైలపానము చేయుట. మూత్రమున మద్యము, తైలము వెడలుట క్రిందపడబోవుటకు ముందు లేని రూపములు చూచుట ఈ లక్షణములు అపస్మారము కలుగుటకు ముందు ఏర్పడు పూర్వరూపములు.[1]

Epilepsy వ్యాధి వచ్చుటకు ముందు ఆవేగమును సూచించు పూర్వ రూపావస్థ (Prodramal phase) మరియు ఆరా (Aura) కలుగును.

## సామాన్య లక్షణములు

స్మరణశక్తి, బుద్ధి, మనస్సు వీని విభ్రమముచే బీభత్స చేష్టలతోకూడి అంధకారములో మునుగుచున్నట్లు జ్ఞానశూన్యుడగుట అపస్మారమనబడును [2]

---

1. i) తస్యేమాని పూర్వరూపాణి భవన్తి తద్యథా భ్రూవ్యుదాసః సతత మక్ష్ణోర్వై కృతమశబ్దశ్రవణం లాలాశింఘాణక ప్రస్రవణమనన్నాభి లషణమరోచ కావిపాకౌ హృదయగ్రహః కుక్షేరాటోపో దౌర్బల్యమంగ మర్దో మోహస్త మసోదర్శనం మూర్ఛాభ్రమశ్చాభీక్ష్ణం చ స్వప్నే మదనర్తనపీడనవేపథు వ్యథనపతనాదీన్యపస్మారపూర్వ రూపాణి భవన్తి, తతోఽనన్తరమపస్మా రాభినిర్వృత్తి రేవ (చ.ని. 8-6)

   ii) సంజ్ఞావహేషు స్రోతః సు దోషవ్యాప్తేషు మానవః
   రజస్తమః పరీతేషు మూఢో భ్రాంతేన చేతసాః (సు.ఉ. 61-7)

   iii) అ. హృ. ఉ. 7/6-8

2. అపస్మారం పునః స్మృతిబుద్ధిసత్త్వసంప్లవాద్బీభత్స చేష్టమావస్థికం తమః ప్రవేశమాచక్షతే (చ.ని. 8/5)

అపస్మారము ఆవేగాత్మకముగా కలుగుచుండును. ఈ ఆవేగములు దోష ప్రకోపముచే 15 రోజులకొక మాసమునకు, 10 రోజులకొక మాసమునకు, మాసమునకొకమారుగాని, లేక అంతకన్న తక్కువ వ్యవధిలోగాని ఆక్షేపకముల వంటి ఆవేగముతో అపస్మారములు కలుగుచుండును [1]

వేగములు ధమనుల ద్వారా, దోషములు హృదయమును చేరి క్రమముగా సంచితమగుటచే మనస్సు వ్యాకులత చెందుటవలన ముందు చెప్పబడిన పూర్వ రూపములతో ప్రారంభమై ఆవేగము కలుగును.

వేగము కలగబోవుటకు కొద్దికాలమునకు ముందు లేనట్టివి, కనబడుచు లేనటువంటి రూపములను చూచుచు భ్రాన్తచిత్తుడై మోహయుక్తుడై తెలివి తప్పి కాళ్ళు చేతులు కొట్టుకొనుచు క్రిందపడును. ఆ సమయమున కను బొమ్మలను కన్నులను వికృతముగా కదలించుచుండును. కన్నులు వక్రముగా తిరిగి దంతములు నొక్కుకొని పోయి కొరకుచు నోటనుండి నురుగుతో కూడిన జొల్లును కార్చును. ఒకప్పుడు కండ్లు విడిపోవును.

దోషవేగము శమించినంతనే నిద్రనుండి మేల్కొనిన వానివలె తిరిగి తెలివిని పొంది యథాప్రకారముగా యుండును.[2]

---

1. పక్షాద్వా ద్వాదశాహాద్వా మాసాద్వా కుపితామలాః అపస్మారాయ కుర్వన్తి వేగం కించిదథాన్తరమ్ (చ.చి. 10/13)
2. i) పశ్యత్యసన్తి రూపాణి ప్రపతతి ప్రస్ఫురత్యపి జిహ్వాక్షిభ్రూః స్రవల్లాలః హస్తౌ పాదౌ చ విక్షిపన్ దోషవేగే చ విహతే సుప్తవత్ ప్రతిబుధ్యతే (చ.చి. 10/8)
   ii) విక్షిపన్ హస్తపాదం చ విజిహ్మభ్రూర్విలోచనః దంతాన్ ఖాదన్ వమన్ ఫేనం వివృతాక్షః పతేత్ క్షితౌ అల్పకాలాంతరం చాపి పునః సంజ్ఞాంలభేత సః (సు.ఉ. 61/9-10)
   iii) అ.హృ.ఉ. 7/2-4

ప్రలాపము, కూజనము, క్లేశము ఈ లక్షణములును సామాన్యముగా నుండును.[1]

## అపస్మార భేదములు

అపస్మారము నాలుగు విధములుగా నుండును. అవి : 1) వాతజ అపస్మారము 2) పిత్తజ అపస్మారము 3) శ్లేష్మజ అపస్మారము. 4. సన్నిపాతజ అపస్మారము.

అపస్మారము దోషజమా కాదా?

అపస్మారము అకస్మాత్తుగా కారణములు కన్పింపకయే వచ్చుటవలన, ఏమియు చికిత్స చేయకున్నను స్వయముగనే వేగశమనము జరుగుట, చికిత్స చేయుచున్నను మరల మరల కలుగు చుండుట—ఈ కారణములచే దోష ప్రకోప జన్యము కాదని కొందరు చెప్పుచున్నారు.[2]

సుశ్రుతుడు వారి మతము సరి అయినది కాదని చెప్పుచు ఈ క్రింది వివరణమును ఇచ్చెను.

వాతాది దోషములు క్రమముగా సంచయమందుట చేతనే అపస్మార వ్యాధి కలుగుచున్నది. వాతాది దోషముల స్థితులు ఒక్కొక్కప్పుడు క్షణ క్షణమునకు మారుచుండును. అట్టి సమయములందు అవి స్వాభావికముగనే ప్రకోపము తగ్గుటచే చికిత్స చేయకనే వ్యాధిశమించు చుండును. అంతమాత్రముచేత దోషజన్యము కాదనుట సమంజసముకాదు. దోష భేదములను అందరు శాస్త్రకారులు వర్ణించుటచే దోషజమని నిరూపితమగు చున్నది.

---

1. ప్రలాపః కూజనం క్లేశః ప్రత్యేకం తు భవేదిహ (సు.ఉ. 61/16)
2. i) పృథగ్దోషైఃసమస్తైశ్చ వక్ష్యతే స చతుర్విధః (చ.చి. 10/8)
   ii) సు. ఉ. 61/10
   iii) అనిమిత్తాగమాద్వ్యాధేర్గమనాద కృతేఽపి చ ఆగమాచ్చాప్యపస్మారం వదంత్యన్యేన దోషజమ్ (సు.ఉ. 61/18)

వర్షము పడుచున్నను భూమియందున్న బీజములు వాని స్వకాలమునకు మాత్రమే అంకురించు విధముగా దోషములు ప్రకోపించి యున్నను, వ్యాధి స్వభావములచే కాలానుసారముగా మాత్రమే ఉత్పన్నమగును. దేహమునందు ఎల్లప్పుడూ ఉండు దోషములు ఏదైనా కారణములచే వృద్ధి చెందినపుడు స్వల్ప కాలములోనే వాని స్వాభావిక దూషణ స్వభావముచే అనేక వ్యాధుల నుత్పన్నము చేయును. ఈ కారణములచే అపస్మారము దోషజమేనని నిరూపింపబడినది.[1]

అందుచే ఉన్మాదమునకు, దోషానుసారముగా మాత్రమే భేదములు వివరింపబడినవి. అయినప్పటికిని చరకుడు ఆగన్తు లక్షణముల కారణముల అనుబంధమును పేర్కొనెను.[2]

## భేదానుసార అపస్మార విశేష లక్షణములు

### వాతజ అపస్మార లక్షణములు :

మాటిమాటికి తరచు అపస్మార ఆవేగములు కలుగుచుండుట, వెంట వెంటనే తెలివి వచ్చుచుండుట, నేత్రములు పిండాకారముగా ఉబికి యుండుట, బిగ్గరగా ఏడ్చుట, నోటినుండి నురుగు అధికముగా వచ్చుట, కంఠము ఉబ్బుట, శిరస్సు వంకరగా నుండుట, అంగుళులు విషమముగా వంచబడియుండుట, హస్త పాదములను కదలించుచుండుట, నఖములు, నేత్రములు, ముఖము, త్వక్కు ఇవి

---

1. క్రమోపయోగాద్దోషాణాం క్షణికత్వాత్తథైవ చ అగమాద్వైశ్వరూప్యాచ్చ సతు నిర్వర్త్యతే బుధైః వర్షత్యపి యథాదేవే భూమౌ బీజాని కానిచిత్ శరది ప్రతిరోహంతి తథా వ్యాధిసముచ్ఛ్రయాః స్థాయినః కేచిదల్పేన కాలేనాభి ప్రవర్తితాః దర్శయంతి వికారాంస్తు విశ్వరూపాన్నిసర్గతః అపస్మారో మహావ్యాధిస్తస్మాద్దోషజ ఏవ తు (సు.ఉ. 61/19-21)
2. తేషామాగన్తురనుబన్ధో భవత్యేవ కదాచిత్ (చ.ని. 8/9)

అరుణముగను, పరుషముగను, శ్యావవర్ణములో ఉండును. అవ్యవస్థితముగ చంచలముగా పరుషముగా రూక్షముగా నుండు రూపములను చూచుచుండుట వాతవర్ధకాహారాదులచే అనుపశయమును వాతశామకములచే ఉపశయమును పొందుట; కంపము, తొడలు అదరుట, దంతములను కొరకుచుండుట, శ్వాసతీవ్రముగా విడుచుట, హృదయమునందు తోద, స్మృతి తప్పుటకు ముందు నల్లని వికృతాకారము మీదకు పరుగెత్తుకొని వచ్చినట్లు భావన కలుగుట.[1]

## పిత్తజ అపస్మార లక్షణములు

తరచు అపస్మార వేగములు కలుగుచుండుట వెంట వెంటనే తెలివి వచ్చుచుండుట, కంఠమునందు కూజనము భూమిని కొట్టుచుండుట; నఖములు, నేత్రములు, ముఖము చర్మము—ఇవి హరిత హారిద్ర తామ్ర వర్ణములలో నుండుట రక్తముతో కూడిన ఉగ్ర,భయానక మందు మన్న క్రోధిత రూపములను చూచుట; పిత్తకారక ఆహారాదులచే అనుపశయము, పిత్తశామకములచే ఉపశయము

---

1. i) తత్రేదమపస్మారవిశేషవిజ్ఞానం భవతి తద్యథా—అభీక్ష్ణమపస్మరన్తం క్షణే క్షణే సంజ్ఞాం ప్రతిలభమానముత్పిణ్డితాక్షమసామ్నా విలపన్త ముద్వమన్తం ఫేనమతీవాధ్మాతగ్రీవమావిద్ధశిరస్కం విషమవినతాంగులిక మనవస్థితసక్థి పాణిపాద మరుణపరుషశ్యావనఖ నయన వదన త్వచమనవస్థితచపలపరుష రూక్షరూపదర్శినం వాతలానుపశమం విపరీతోపశయం వాతేనాపస్మరన్తం విద్యాత్ (చ.ని. 8/8-1)

ii) కంపతే ప్రదశేద్దన్తాన్ ఫేనోద్వామీ శ్వసిత్యపి పరుషారుణకృష్ణాని పశ్యేద్రూపాణి చానిలాత్ (చ.చి. 10/9)

iii) వేపమానో దశేద్దన్తాన్ శ్వసన్ ఫేనం వమన్నపి, యో బ్రూయాద్వివృతం సత్వం కృష్ణ మామనుధావతి ఇతో మే చిత్తనాత్ స్యాత్ సోఽపస్మారోఽ నిలాత్మకః (సు.ఉ. 61/11)

కలుగుట, పీతవర్ణముతో కూడిన ఫేనము నోటినుండి వచ్చుట; తృష్ణ అధికముగా కలుగుచుండుట, శరీరము ఉష్ణముగా నుండుట, స్వేదమధికముగా నుండుట మూర్ఛనొందుట, పీతవర్ణపు వికృతాకారము మీదకు వచ్చుగెత్తుకొని వచ్చినట్లు స్మృతితప్పుటకు ముందు భావనకలుగుట ఈ లక్షణము పిత్తజాప స్మారమునందు కలుగును.[1]

## శ్లేష్మజ అపస్మార లక్షణములు[2]

ఆలస్యముగా అపస్మార ఆవేగములు కలుగుట, ఆవేగము కలిగిన తరువాత చిరకాలమునకు తెలివి వచ్చుట, భూమిపై పడినపుడు అధికముగా వికృతచేష్టలు చేయకుండుట, చొల్లు కారుచుండుట; నఖములు, నేత్రములు, ముఖము చర్మము— ఇవి తెల్లగానుండుట, శ్వేతముగ, గురుపుగ, స్నిగ్ధముగనుండు రూపములను

---

1. i) అభీక్ష్ణమపస్మరన్తం క్షణే క్షణే సంజ్ఞాం ప్రతిలభమానమవకూజన్తమాస్ఫాలయన్తం చ భూమిం హరిత హారిద్రతామ్రనఖనయనవదనత్వచం రుధిరోక్షితోగ్రభైరవ ప్రదీప్తరుషితరూపదర్శినం పిత్తలానుపశయం విపరీతోపశయంపిత్తేనాపస్మరన్తం విద్యాత్ (చ.ని. 8/8-[illegible])

 ii) పీతఫేనాంగవక్త్రాక్షః పీతాసృగ్రూపదర్శనః
 సతృష్ణోష్ణానలవ్యాప్తలోకదర్శీ చ పైత్తికః (చ.చి. 10/1[illegible])

 iii) తృట్ తాపస్వేదమూర్ఛార్తో ధున్వన్నంగాని విహ్వలః యో భ్రూయాద్[illegible] వృతం సత్త్వం పీతం మామనుధావతి తలోమేచిత్తనాశః స్యాత్ స పి[illegible] భదుచ్యతే (సు.ఉ. 6/1[illegible])

2. i) చిరాదపస్మరన్తం చిరాచ్చ సంజ్ఞాం ప్రతిలాభమానం పతన్తమనతివికృత[illegible] చేష్టం లాలాముద్వమన్తం శుక్లనఖనయనవదనత్వచం శుక్లగురుస్నిగ్ధరూప[illegible] దర్శినం శ్లేష్మలానుపశయం విపరీతోపశయంశ్లేష్మణాఽపస్మారితం విద్యాత్ (చ.ని. 8/8-3)

(Contd...

చూచుట కపవర్ధ కాహారాదులచే అనుపశయము, కఫ నాశకములచే ఉపశయము కలుగుట, శ్వేతఫేనము ముఖమునుండి వచ్చుట, శరీరము శీతలముగా గురువుగా ఉండుట, శరీరము గగుర్పొడుచుట, హృల్లాసము, నిద్ర అధికముగా నుండుట, క్రిందపడగానే కఫమును వాంతి చేసికొనుట, స్మృతి తప్పుటకుముందు శ్వేతవర్ణపు వికృతాకారపు జంతువు వంటిపై మీదకు పరుగెత్తుకొని వచ్చినట్లు భావన కల్గుట-ఇవి శ్లేష్మజనిత అపస్మారమునందు కలుగు లక్షణములు.

## సన్నిపాతజ అపస్మార లక్షణములు

వేర్వేరుగా చెప్పబడిన మూడు దోషముల లక్షణములు కలసి కనిపించినపుడు సన్నిపాతజ అపస్మారమని గ్రహింపవలయును[1]. ఇది అసాధ్యముగా నుండును.

Epilespy (ఎపిలెప్సీ) భేదములు :

ఎపిలెప్సీ ప్రధానముగా రెండువిధములుగా నుండును. 1. ఫోకల్ (Focal) ఆంశిక ఆక్షేపకములు కలుగును.

2. జనరలైజ్డు ఎపిలెప్సీ (Generalised Epilepsy)పూర్తి మస్తిష్క-వికృతి కలుగుటచే ఈ పేరు వచ్చినది. దీనియొక్క విభాగము మూడు విధములుగా

---

ii) శుక్లఫేనాఽఙ్గవక్త్రాక్షిః శీతో హృష్టాఙ్గజో గురుః పశ్యతి శుక్లాని రూపాణి శ్లైష్మికో ముచ్యతే చిరాత్ (చ.చి. 10/11)

iii) శీతహృల్లాసనిద్రార్తః పతతి భూమౌ వమన్ కఫం యో ... కృతం సత్త్వం శుక్లం మానుషం ... స్యాత్ సోఽపస్మారః కఫాత్మకః (సు.ఉ. 61-14-15)

1. సర్వైరేతైః సమస్తైస్తు లింగైర్జ్ఞేయస్త్రిదోషజః అపస్మారః స చాసాధ్యో యః క్షీణస్యానవశ్చ యః (చ.చి. 10-13)

నుండును. అవి 1) గ్రాండ్‌మాల్ (Grandmal) 2) పెటిట్ మాల్ (Petit-Mal) 3) ఫోకల్ సైజర్సు (Focal seizares).

రోగనిర్ణయము—రోగి చరిత్రనుబట్టి రోగ నిర్ణయము సాధారణముగా చేయవచ్చును. ఆ వేగమునందు రోగిని గమనించిన రోగనిర్ణయము మరింత సులభతరమగును. ఎలక్ట్రోఎన్‌సెఫలోగ్రాఫీ (Electroencepholo graphy) లేటరల్ స్కల్ రేడియోగ్రఫీ (Lateral skull Radiography) సి.టి.స్కాన్ (C. T. Scan) మొదలగు పరీక్షలు చేయించుట, వ్యాధి తీవ్రతను కారణమును తెలిసికొనుటకు సహకరించును.

## సాధ్యాఽసాధ్యత

సన్నిపాతజ అపస్మారములు క్షీణించియున్న రోగికికలిగిన అపస్మారము, చిరకాలమునుండి అను వర్తించియున్న అపస్మారములు (Statues Epole-pticas) అసాధ్యములుగా నుండును.[1]

ఈ క్రింది లక్షణములు కలిగియున్న అపస్మారములు అసాధ్యములుగా నుండును—అధికముగా అనేక విధములుగా వణకుచుండుట, క్షీణించియుండుట, కనుబొమలు వికారముగా కదలించుచుండుట, నేత్రములు వికారముగా త్రిప్పుచుండుట. ఇవి అసాధ్య లక్షణములు.[2]

## అపస్మార చికిత్స

అపస్మార రోగికి ప్రారంభమునందు వాతాది దోషములచే ఆవరించబడి యుండు బుద్ధి, మనస్సు, హృదయము, స్రోతస్సులు—ఇవి శుద్ధమగుటకు మనస్సు

1. సర్వైరేతైస్సమస్తైస్తు లింగైః జ్ఞేయస్త్రిదోషజః అపస్మారస్సచాఽసాధ్యః యః క్షీణస్యోఽనవశ్చయః (చ.చి. 10-12)
2. ప్రతిస్ఫురన్తం సుబహుశః క్షీణం ప్రచలితభ్రువమ్ నేత్రాభ్యాం చ వికుర్వాణం అపస్మారో వినాశయేత్ (మా.ని. 21-7)

సంప్రబోధనము అగుటకు తీక్ష్ణముగానుండు వమనాది కర్మలచే చికిత్సింప వలయును.[1]

దోషానుసారము తీక్ష్ణమగు శోధనములను చేయవలసి యుండును. ప్రాయికముగా వాతజాపస్మారములందు వస్తికర్మలచేతను, పిత్తజ అపస్మారములందు విరేచనముల చేతను, శ్లేష్మజాపస్మారములందు వమనముల చేతను ఉపచరింప వలయును.

సామాన్యముగా తీక్ష్ణమైన ఊర్ధ్వాధః శోధనములు చేయించి శిరోవిరేచనమును చేయించవలయును.

బాగుగా శోధనములు చేయించిన తరువాత పేయాది సంసర్జనాదులను విధ్యుక్తానుసారము ఆచరింపచేసి సేద దీప్తి సంశమన యోగములను ప్రయోగింప వలయును.

---

1. i) తైరావృతానాం హృత్స్రోతో మనసాం సంప్రబోధనం తీక్ష్ణైరాదౌ భిషక్
కుర్యాత్కర్మభిర్వమనాదిభిః వాతికం వస్తిభూయిష్ఠైః పైత్తం ప్రాయో
విరేచనైః శ్లైష్మికం వమనప్రాయైరపస్మారముపాచరేత్
(చ. చి. 10/14-15)

ii) సు.ఉ. 61-27 iii) అ.హృ.ఉ. 7-15-16

2. తీక్ష్ణైరుభయతో భాగైః శిరస్యాపి విశోధయేత్ (సు.ఉ. 61-26)

3. i) సర్వతః సువిశుద్ధస్య సమ్యగాశ్వాసితస్య చ
అపస్మార విమోక్షార్థం యోగాన్ సంశమనాన్ శృణు (చ. చి. 10-16)

ii) అ.హృ.ఉ. 7-17

4. అభిః క్రియాభిః సిద్ధాభిః హృదయం సంప్రబుధ్యతే
స్రోతాంసి చాపి శుధ్యన్తి తతః సంజ్ఞాం స విందతి (చ.చి. 10-52)

అపస్మార రోగికి ఆవేగసమయమునందు సంజ్ఞాప్రబోధమును కలిగించుటకై ఉన్మాద చికిత్సయందు చెప్పబడిన సంజ్ఞాప్రబోధ చికిత్సలు చేయించవలయును. ధూపములు, ప్రధమన నస్యములు, అంజనములు మొదలగు క్రియలచే స్రోతస్సులు శుద్ధములై హృదయము ప్రబుద్ధమై యథాస్థితిగ తెలివికల్గును.

ఉన్మాదమునందు చెప్పబడినట్లు సిరావ్యధనము, ఇతర కర్మలు అవస్థానుసారము చేయించవలయును.

అపస్మారములందు ఆగంతుక కారణములగు భూతావేశాది కారణములు అనుబంధములుగానుండి వాతాది దోష లక్షణములకన్న భూత సంబంధ ఆగంతు లక్షణములు అధికముగా ఉన్నచో ఆగంతు ఉన్మాదమునందు చెప్పబడిన చికిత్సలను, రుద్రపూజ అతని గణములపూజ మంగళకరవస్తుధారణ అవస్థానుసారము చేయవలయును.[1]

శారీర మానస దోషములన్నియు ఒకే సమయమున ప్రకోపించుటచే జనించిన వ్యాధి అగుటచేతను, మహామర్మము అగు హృదయము నాశ్రయించి యుండుటవలనను అపస్మారము మిగుల కష్టసాధ్యముగా నుండును.[2]

అపస్మారమును సరియగు చికిత్స చేయక ఉపేక్షించినచో చిరకాలము

---

1. i) యస్యాఽనుబన్ధస్త్వాగన్తుః దోషలింగాధికాకృతిః
దృశ్యతే తస్య కార్యం స్యాత్ ఆగన్తూన్మాదభేషజమ్ (చ.చి. 10-53)
ii) పూజాం రుద్రస్య కుర్వీత తద్గణానాం చ నిత్యశః (సు.ఉ. 61-26)
iii) సిరాం విధ్యేదథప్రాప్తాం మంగల్యాని చ ధారయేత్ (సు.ఉ. 61-42)

2. సమస్తైః కుద్ధైరపస్మారో దోషైశ్శారీరమానసైః యజ్జాయతే యతశ్చైష
మహామర్మ సమాశ్రయః (అ.హృ.ఉ. 7-36)

గడచిన రూఢమూలమై మిక్కిలి కష్టసాధ్యము కును. ఈ స్థితులయందు అపస్మార
ములను రసాయన చికిత్సలచే ఉపచరింపవలయును.[1]

అపస్మార రోగులను, ఉన్మాదరోగులను, జలము, అగ్ని, వృక్షములు, పర్వతములు, ఎత్తైన హర్మ్యములు, విషమమైన స్థానములు, హానిని కలిగించు యంత్రాదులు ఉన్న ప్రదేశములకు పోనీయక కాపాడుచుండవలయును. ఈ ప్రదేశముల చెంతకు వెళ్ళినపుడు ఆవేగము వచ్చినచో వెంటనే ప్రాణమునకు హాని కలుగు అవకాశముండును, కనుక ప్రాణరక్షణకై ముందు జాగ్రత్తగా వాని సమీపములకు పోనివ్వక నిరోధించవలయును.[2]

అపస్మార రోగమున మనోవికారము నివర్తించిన తదుపరి రోగితో అతడు పూర్వము నిందనీయమైన వికృతమైన కృత్యములు చేసిన విషయములు చెప్పరాదు. అతనికి ఎల్లప్పుడును ప్రియముగ ఉండునవియు, మనోహరములగు నవియు అగు విషయములను చెప్పుచు మనస్సునకు ఉత్సాహమును కలిగించు చుండవలయును.[3]

---

1. దుశ్చికిత్స్యో హ్యపస్మారశ్చిరకారీ కృతాస్పదః
   తస్మాద్రసాయనైరేనం ప్రాయశః సముపాచరేత్ (చ.చి. 10-65)

2. i) జలాగ్నిద్రుమశైలేభ్యో విషమేభ్యశ్చ తం సదా
   రక్షేదున్మాదినం చైవ సద్యః ప్రాణహరా హితే (చ.చి. 10-66)

   ii) అ.హృ.ఉ. 7-36

3. ముక్తం మనోవికారేణ త్వమిత్థం కృతవానితి
   న బ్రూయాద్విషయైరిష్టైః క్లిష్టం చేతోఽస్య బృంహయేత్
   (అ.హృ.ఉ. 7-37)

## అపస్మారహరములగు ఔషధ యోగములు

ఉన్మాదమున చెప్పబడిన ఘృతములను ఇతర యోగములను అవస్థాను సారము ఉ. యోగింపవచ్చును. పురాణఘృతము విశేషించి శ్రేష్ఠ అపస్మార హరము.

ఈ క్రింది యోగములు ప్రత్యేకముగా అపస్మారమునకై చెప్పబడినవి. దోషాదులను అవస్థాదులను గమనించి వీనిలో తగిన ఔషధములను ప్రయోగించ వలయును.

### ఘృత యోగములు

పంచగవ్యఘృతము-అపస్మార, జ్వరములను శమింపచేయును. (చరక)

మహాపంచగవ్య ఘృతము-అపస్మార, ఉన్మాద, విషమజ్వర, అలక్ష్మి మొదలగు వ్యాధులను శమింపచేయును. (చరక)

బ్రాహ్మీఘృతము (చరక), సైంధవాది ఘృతము (చరక), జీవనియ ఘృతము లేక యమకస్నేహము (చరక), సిద్ధార్థక ఘృతము (సుశ్రుత), కూష్మాండఘృతము (వాగ్భట)

### ఇతర యోగములు

1. తిలతైలము 5 గ్రా. లసున స్వరసము 5 గ్రా. కలిపి రోజుకు రెండు మారులు ఇవ్వవలయును.
2. శతావరి స్వరసము క్షీరముతో కలిపి త్రాగించవలయును.
3. బ్రాహ్మీస్వరసము 15 మి.లీ. తేనెతో కలిపి ఇవ్వవలయును. (భై.ర.) లేక పాలతో ఇవ్వవలయును (భై.ర.)
4. త్రిదోషజ అపస్మారమునందు పై మూడింటిని కలిపి యివ్వ వలయును.

5. వచా చూర్ణము 1/4-1/2 గ్రా. తేనెతో సేవించుచు దుగ్ధాహారము తీసుకొనుచున్న చిరకాలానుబంధిత ఘోర అపస్మారములు గూడా శమించును. (భై.ర)

6. కాశ, విదారి, ఇక్షు, కుశ వీని క్వాధశృత క్షీరము పానము చేయించిన అపస్మారము శమించును. (వాగ్భట)

7 యష్టీమధుచూర్ణము 5 గ్రా. శ్వేతకూష్మాండ రసముతో పానముచేయించిన అపస్మారము శమించును. (వంగసేన)

8. కుష్ట స్వరసమును మధుతో సేవింప చేయవలయును. (చ.చి. 15)

9. కల్యాణ చూర్ణము (భా.ప్ర) అపస్మార ఉన్మాదములను శమింపచేయును. మోతాదు 1 గ్రా.

10. సర్పగంధా చూర్ణము 1 గ్రా. రససింధూరము 200 మి.గ్రా. దుగ్ధము లేక జలముతో రోజుకు రెండుమారులు సేవించిన ఉన్మాదము, అపస్మారము, అపతంత్రకము, అనిద్ర శమించును.

11. ఉరితీయ బడిన తాడును కాల్చి భస్మము చేసి జలముతో పానము చేయించిన అపస్మారము శమించును. (భై.ర)

12. సర్పగంధా చూర్ణము 1 గ్రా. జహర్ మొహరాపిష్టి, ప్రవాళపిష్టి, గుడూచి సత్వము 200 మి.గ్రా. చొప్పున కలిపి రోజాపుష్పావ లేహ్యముతో రోజుకు రెండు మారులు సేవించిన అపస్మారము, నిద్రానాశము శమించి మస్తిష్కమునకు బలము కలుగును. (ర.త. సార. ద్వితీయ)

13. సద్యః ప్రసూత ఛాగ నాభి నాళమును ద్రవమును పిండి కాంజికముతో పక్వము చేసి భక్షించిన అపస్మారము శమించును. (భై.ర)

రసౌషధములు :—

1. రససిందూరము 100-200 మి.గ్రా తేనెతో కలిపి-శంఖపుష్పి, వచ, బ్రాహ్మీ, కుష్ట, ఏలా—వీని క్వాధముతో ఇవ్వవలయును.

2. భూత భైరవరసము-ముఖ్య ద్రవ్యములు రససింధూర, అభ్రక, లోహ, తాళక, మణిశిల 100 మి.గ్రా. తేనెతో ఇచ్చిన ఉన్మాద, అపస్మార, అనిద్రాది వ్యాధులను శమింప చేయును.

వాతకులాన్తక రసము (భై.ర)-ముఖ్య ద్రవ్యములు, - కస్తూరి, మణిశిల, కజ్జలి. 100 మి.గ్రా. రోజుకు రెండులేక మూడు మారులు ఇచ్చిన ఎంతటి ఘోరమైన అపస్మారముల నైనను శమింప చేయును. బుద్ధి భ్రంశము, మూర్ఛ, కంపము, ఆక్షేపకములను శమింపచేసి నిద్రను కలిగించును. అభ్రక భస్మము 50 మి.గ్రా కలిపిన అపస్మారములలో అధిక గుణకారిగా నుండును.

ఇంద్ర బ్రహ్మవటి (భై.ర) చండ భైరవరసము (భై.ర) ఉన్మాద గజకేసరీరసము (యో.ర) అమరసుందరీ వటి (ని.ర), ఈ ఔషధములు అవస్థాను సారము అపస్మారమున ఉపయోగింప వలయును.

స్మృతి సాగర రసము (యో.ర) కజ్జలి, హరితాళ, మణిశిల, తామ్ర భస్మము, ప్రధాన ద్రవ్యములు. ఇది వాతఘ్నము, ఆక్షేప శామకము, అపస్మారములలో ప్రధానముగా వాత కఫజనిత అపస్మారములలో మంచి గుణకారిగా నుండును. మాత్ర 50 మి గ్రా-100 మి.గ్రా తగిన అనుపానముతో.

ఇతర ఔషధములు :-

భార్గ్యాది సురా లేక వరాహసురా (సు.ఉ 61)

15-30మి.లీ ఉన్మాద, అపస్మారగ్రహబాధా శామకము.

## బాహ్య ప్రయోగాదులు

**అభ్యంగ యోగములు :-**

1. సర్షప తైలము బస్తమూత్రముతో పక్వము చేసి అభ్యంగనము చేసి గోశకృత్‌తో ఉద్వర్తనము చేసికొని గోమూత్రముతో స్నానము చేయవలయును.[1]

2. అపేత రాక్షసి (తులసి), కుష్ఠము, పన, చోరకములు గోమూత్రముతో నూరి ఉద్వర్తనము చేయించి గోమూత్రముతో స్నానము చేయించ వలయును.[2]

3. జలౌక శకృత్ : దగ్ధముచేయబడిన బస్తరోమములు, ఖరాస్థి, హస్తి నఖములు, గోపృచ్ఛరోమములు-వీనిలో దేనితోనైనను ఉద్వర్తనము చేయించ వలయును.[3]

4. పిప్పలి, సైంధవలవణము, శిగ్రు, హింగు, హింగుపత్రి, కాకోలి, సర్షపములు, కాకనాస, కైదర్య, చన్దన, కుక్కయొక్క మెదయందలి అస్థులు, నఖములు, పర్ణికలు బస్త మూత్రముతో వీనిని పుష్యమీ నక్షత్రమున

---

1. అభ్యంగస్సార్షపం తైలం బస్తమూత్రే చతుర్గుణే
సిద్ధం స్యాద్గోశకృన్మూత్రైః స్నానోత్సాదనమేవ చ (చ.చి. 10/32)

2. అపేత రాక్షసీకుష్ఠపూతనాకేశిచోరకైః
ఉత్సాదనం మూత్రపిష్టైర్మూత్రై రేవావసేచనమ్ (చ.చి. 10/39)

3. జలౌకశ్శకృతాతద్వద్దగ్ధైర్వా బస్తలోమభిః
ఖరాస్థి భిర్హస్తినఖై స్తథా గోపుచ్ఛలోమభిః (చ.చి. 10/40)

మర్దించి ప్రదేహము చేయించినను ధూపము వేసినను అపస్మారము నివర్తించును.[1]

5. కటభీ తైలము (చరక) శిగ్రువాదితైలము (సుశ్రుత) గోధాదితైలము (సుశ్రుత), పలంకషాది తైలము (చరక) వీనిలో దేనితోనైనను అభ్యంగనము చేయించ వచ్చును.

వీనిలో గోధా తైలము పానమునకు గూడా ఉపయోగింప వచ్చును. (సు.ఉ. 61/25)

పలంకషాది తైలమునకు చెప్పబడిన ద్రవ్యములు ధూపమునకు ప్రలేపమునకు గూడా ఉపయోగింపదగును. (చ.చి. 10/34-36)

**ధూపనములు :-**

1. పుష్యమీ నక్షత్రమున కుక్కపిత్తమును గ్రహించి నేతితో కలిపి ధూపమును వేసిన అపస్మారము నివర్తించును. (చ.చి 10/50)

2. నకులము, ఉలూకము (గుడ్లగూబ) మార్జాలము, గద్ద, తేలు మొదలగు కీటములు, పాము, కాకి-వీని ముక్కులు, రెక్కలు, పురీషము గ్రహించి అపస్మార రోగికి ధూపము వేయవలయును.[2]

---

1. పిప్పలీం లవణం శిగ్రుం హింగు హింగు శివాటికాం
కాకోలీం సర్షపాన్ కాకనాసాం కైడర్యచన్దనే, శునకస్కన్ధాస్థి చ
ఖరాస్పృర్మకాంశ్చే తి పేషయేత్ బస్తమూత్రేణ పుష్యర్కే ప్రదేహః
స్యాత్సధూపనః (చ.చి. 10/37-38)

2. i) నకులోలూకమార్జారగృధ్రకీటాహికాకజైః
తుణ్డైః పక్షైః పురీషైశ్చ ధూపనం కారయేద్భిషక్ (చ.చి. 10/51)

ii) అ.హృ.ఉ. 7/33

**నస్య అంజనాదులు :-**

1. కపిల వర్ణముగల గోమూత్రముతోనైనను, పిత్తములోనైనను, కుక్క, నక్క, పిల్లి, సింహము-వీనిలో వేటి మూత్రములోనైనను, పిత్తముతో నైనను అపస్మార రోగికి నస్యము చేయించుట హితకరముగా నుండును.[1]

2. a) భారంగి వచా నాగదంతీ b) శ్వేతావిషాణికా c) జ్యోతిష్మతి, నాగదంతీ-వీనిలో దేనినైనను గోమూత్రములో నూరి నస్యము చేయించ వలయును.[2]

3. ప్రధమన నస్యము-పిప్పలీ, వృశ్చికాలీ, కుష్ఠు, లవణములు, భారంగీ— వీని చూర్ణములతో ప్రధమన నస్యము చేయించ వలయును.[3]

4. అగస్త్య పత్రములు మరిచము గోమూత్రములో నూరి నస్యము చేయించ వలయును. (హారీత సంహిత)

5. త్రిఫలాది తైలము (చ.చి)తో నస్యము చేయించిన అపస్మారము శమించును.

---

1. i) కపిలానాం గవాం మూత్రం (పిత్తం) నావనం పరమం హితం
శ్వసృగాలబిడాలానాం సింహాదీనాం చ శస్యతే (చ.చి. 10/41)
ii) అ.హృ.ఉ. 7/26

2. భార్గీ వచా నాగదన్తీ శ్వేతా శ్వేతా (శత) విషాణికా,
జ్యోతిష్మతీ నాగదన్తీ పాదోష్ట్రామూత్రపేషితాః (చ.చి. 10/42)
యోగాస్త్రయోఽతః షడ్బిన్దూన్ పంచవా నావయేద్భిషక్

3. పిప్పలీవృశ్చికాలీ చ కుష్ఠం చ లవణాని చ, భార్గీ చ చూర్ణితం నస్తః
కార్యం ప్రధమనం పరమ్ (చ.చి. 10/45)

6. అంజనములు.

a) పుష్యమీ నక్షత్రమున గ్రహించిన శునకపిత్తము అంజనముగా వాడ వలయును. (చ.చి. 10/50)

b) నక్తామలక బీజములు, గౌరసర్షపములు, బస్తమూత్రముతో నూరి గుటికలు చేసి యుంచి అపస్మార ఉన్మాదములందు ఆవేగ సమయమున వాడి అంజనము చేసిన ఆవేగము శమించును (హారీత)

c) కాయస్థ వర్తితోగాని ముస్తాది వర్తితోగాని అంజనము చేయించ వల యును. కాయస్థ వర్తి అంజనము ఉన్మాద, అపస్మారాదులందు విషజ ఉన్మాదమున, నీటిలో మునుగుట ఇతర కారణములచే చైతన్య శూన్యుడై మృతప్రాయుడైనవానికి చేతనమును కలిగించుటలో అమృతోపమముగా పనిచేయును. (చ.చి 10/46-47)

## అపస్మార విశేష చికిత్సలు

సామాన్య అపస్మార చికిత్సలతోపాటు దోషానుసార ఉన్మాదములకు చేయించవలసిన శోధనములు కూడా వివరింపబడినవి.

ముందు చెప్పబడిన యోగములు ప్రయోగించునపుడు ఆయా దోషములను, లక్షణములను శమింపచేయు ద్రవ్యములు గల యోగములను ఆయా రోగులందు ప్రయోగించుట మిక్కిలి ప్రశస్తముగా నుండును. అయినను సాధారణముగా అపస్మారమున వ్యాధి ప్రత్యానీక యోగములే అధికముగా ఉండుటచే అన్ని అపస్మారములందు ప్రయోగింపదగియుండును. అయినను ఈ క్రిందివి విశేషించి ప్రశస్తముగా నుండును.

వాత కఫజ అపస్మారము లందు వచాది ఘృతము (చ. చి. 10/27) వాతజ అపస్మారమునందు కుశస్థాది ఘృతము (సు ఉ 61/28) ప్రయోగించుట హితకరముగా నుండును.

పైత్తిక అవస్మారము నందు కాకోల్యాది గణ సిద్ధ ఘృతము క్షీరము, మధు, శర్కరలతో కలిపి సేవింపవలయును.[1]

ఆమలకాది ఘృతము (చ చి. 10/31) పిత్తాపస్మారహరము.

వాత పిత్తజ అపస్మారమున కాశ్మర్యఘృతము ఇవ్వవలయును, కాశ, విదారీ, ఇక్షు, కుశ క్వాథములతో వేర్వేరుగా సిద్ధము చేసిన ఘృతములు వాత పిత్తాపస్మారములను శమింపచేయును.[2]

శ్లేష్మజ అపస్మారము నందు కృష్ణాది ఘృతమును పానము చేయించవలయును.[3]

అపస్మారమున నూతనావస్థలో రౌప్యభస్మము వాతకులాంతక రసము, తాప్యాది లోహము, ఉన్మాద గజ కేసరి మొదలగు ఔషధములలో తగిన ఔషధము ప్రయోగింపవలయును. యోగేంద్రరసము గూడా నూతనావస్థలో ఇవ్వదగిన శ్రేష్ఠమైన ఔషధము. స్మృతి సాగర రసము, వాతకఫ ప్రధాన లక్షణములతో గూడిన అపస్మారములందు నూతనజీర్ణావస్థల రెండింటి యందును ఇవ్వవచ్చును.

ఆ వేగకాలమునందు శ్వాసకుఠారసమును ప్రధమననస్యముగా ఉపయోగింపవచ్చును. ముందు చెప్పబడిన నస్యములను, అంజనములను వెంటనే ఆవేగము శమించుటకై ఉపయోగింపవచ్చును.

---

1. కాకోల్యాది ప్రతీవాపం సిద్ధం వా ప్రథమే గణే
   పయోమధు సితాయుక్తం ఘృతం తత్పైత్తికేహితమ్ (సు. ఉ. 61/29)

2. కంసే క్షీరేక్షురసయోః కాశ్మర్యేఽష్టగుణే రసే కార్షికై జీవనీయైశ్చ
   ఘృతప్రస్థం విపాచయేత్ వాతపిత్తోద్భవం క్షిప్రం అపస్మారం నియచ్ఛతి
   తద్వత్కాశవిదారీక్షుకుశక్వాథశృతం ఘృతమ్ (చ. చి. 10/29-30)

3. సు. ఉ 61/30

జీర్ణావస్థలో అభ్రకభస్మము, మల్లసింధూరము, సూతరాజరసము, మల్లాది వటి ప్రయోగింపవచ్చును. పంచగవ్యఘృతము, కళ్యాణక ఘృతము, బ్రాహ్మీ ఘృతము-వీనిలో దేనినైనను దీర్ఘకాలము ప్రయోగించిన అపస్మారమునందు మంచి ఫలితము ఉండును.

తైలధార, తక్రధార, శిరోవస్తి, పిచు వంటి చికిత్సలు విధి ననుసరించి రోగి అవస్థ ననుసరించి చేయించినచో చక్కని ఫలితములు కలుగును.

**ఉన్మాద అపస్మారములందు పథ్యాపథ్యములు :**

**పథ్యములు :**

ఆహారములు - గోధుమలు, రక్తశాలిధాన్యము, పెసలు, ఆమ్రఫలము, పురాణ కూష్మాండము, బ్రాహ్మీ, పటోలము, వాస్తూకము, తండులీయకము, శిగ్రు, ఆమలక, పరూషకము, ద్రాక్ష, కపిత్థము, పనసఫలము, నారికేళము, దాడిమము ధారోష్ణ దుగ్ధము, శతధౌత ఘృతము, తైలము, నవీన ఘృతము, పురాణ ఘృతము కచ్ఛప మాంసము, జాంగల పశు పక్షుల యొక్క మాంస రసములు ఆంతరిక్ష జలము.

విహారములు- అభ్యంగము, ప్రదేహములు, నస్యములు, ధూమపానము, స్నానము, శీతలలేపములు, నిద్ర, ధీ, ధైర్య, సత్వ ఆత్మాది విజ్ఞానము

ఇతరములు- అశ్వ, ఖర మూత్రములు.

**అపథ్యములు :**

విరుద్ధాహారములు, ఉష్ణ ఆహారములు, అభిష్యందికరమైన, గురుతరమైన, తీక్ష్ణమైన ఆహారములు, ఆనూప పలములు, [illegible] అన్ని విధములగు పత్రశాకములు, వేల్లకము తిక్త పదార్థములు, మద్యము, మత్స్యములు, నిద్ర, క్షుధ, తృష్ణ- లగు వేగములను నిరోధించుట, అతి వ్యవాయము, వ్యాయామము

పూజ్య పురుషుల పూజనము నందు వ్యతిరేకత, సాధారణముగా చింతా, ఉద్వేగ, క్రోధ, భయ శోకాదులను వర్జించుట హితకరముగా నుండును. (భై.ర.)

## అతత్వాభినివేశము

అతత్వాభినివేశమునకు మహాగదము అను మరియొక పేరుగూడా గలదు. ఈ వ్యాధి ఆధునిక వైద్యమందలి మానియా (Mania) లేక హైపోమానియా (Hypomania) లక్షణములకు దగ్గరగా నుండును.

నిదానము :-

మలినమైన ఆహారములను సేవించు స్వభావము, మలమూత్రాది వేగములను నిరోధించుటను అలవాటుగా కలిగియుండు మనుజుడు, శీత, ఉష్ణ, స్నిగ్ధ, రూక్ష గుణములు గల ఆహారాదులను అత్యధికముగా సేవించుట వలన ప్రకోపించిన వాతాది దోషములు, రజో మోహములచే ఆవృతమైన ఆత్మ కలిగి యున్నప్పుడు దోషములు మనోవహ, బుద్ధివహ, సిరలలో ప్రవేశించి హృదయమును దూషింప చేసి మనోవహ, బుద్ధివహ స్రోతస్సులందు ఆశ్రయించుకొని యుండును. రజో తమో దోషములు వృద్ధిచెంది వానిచే బుద్ధి, మనస్సు ఆవృతమైనపుడు ఈ దోష ములచే హృదయము కలత నొందును. దానిచే అతత్వాభినివేశ లక్షణములు కలుగును.[1]

---

1. మలినాహారశీలస్య వేగాన్ప్రాప్తాన్నిగృహ్ణతః శీతోష్ణ స్నిగ్ధరూక్షై
ర్హేతుభిశ్చాతిసేవితైః హృదయం సముపాశ్రిత్య మనోబుద్ధివహాః
సిరాః దోషాః సందూష్య తిష్ఠన్తి రజోమోహ వృతాత్మనః
రజస్తమోభ్యాం వృద్ధాభ్యాం బుద్ధౌ మనసి చావృతే, హృదయే వ్యాకులే
దోషైరథ మూఢోఽల్పచేతనః (చ.చి. 10/57-59)

లక్షణములు :-

కర్తవ్యాకర్తవ్య విచారము నశించుటచే మనుజుడు మూఢుడుగా నుండును. అతనిచేత నా శక్తి క్షీణించును. అందుచే అల్పజ్ఞానము గలవాడై నిత్యానిత్య వస్తువుల విషయమునను, హితాహితముల విషయమునను వ్యత్యస్థమైన బుద్ధిగలవాడై నిత్యమును అనిత్యముగను; అనిత్యమును నిత్యముగను; హితమును అహితముగను, అహితమును హితముగ వ్యత్యస్థముగా తలచుచుండును. ఇది అతత్వాభినివేశము అనబడును.[1]

చికిత్స :-

మొదట స్నేహస్వేదములను విధ్యుక్తప్రకారముగా చేయించి తరువాత వమనాది పంచకర్మలచే బాగుగా శోధనము చేసి సంసర్జనక్రమము ననుసరించి ఆహార విధులను ఆచరింప చేయవలయును.

ఆ తరువాత మేధాశక్తిని పెంపొందించు అన్నపానాదులతో ఉపచరింపవలయును.

బ్రాహ్మీస్వరసముతో కూడిన బ్రాహ్మీఘృతమునుగాని పంచగవ్య ఘృతమును గాని సేవింపవలయును.[2]

శంఖపుష్పి, గుడూచి, యష్టిమధు, వచ, సిద్ధార్థక, జటామాంసి, విదారి, శ్వేతాపరాజిత, చిత్రక, మండూకపర్ణి, బ్రాహ్మి, అపామార్గ, విడంగ, కుష్ఠ, హారీ

---

1. విషమాం కురుతే బుద్ధిం నిత్యానిత్యే హితాహితే
   అతత్త్వాభినివేశం తమాహురాప్తా మహాగదమ్ (చ.చి. 10/60)
2. స్నేహస్వేదోపపన్నం తం సంశోధ్య వమనాదిభిః
   కృతసంసర్జనం మేధ్యైరన్నపానైరుపాచరేత్ బ్రాహ్మీస్వరసయుక్తం
   యత్ పంచగవ్యముదాహృతం, తత్సేవ్యం శంఖపుష్పీ చ యచ్చ మేధ్యం
   రసాయనం (చ.చి. 10/61-62)

రకీ, శతావరి, స్వర్ణము - మొదలుగా గల ద్రవ్యములు మేధ్యములుగా చెప్పబడినవి. వీనిని తగిన మోతాదులో విధిననుసరించి సేవింపచేయవలయును.

మనస్సుకు అనుకూలురు ఐనటువంటి ఆప్తులు మిత్రులు అగువారు ధర్మార్థములను బోధించుచు త్రివర్గ విజ్ఞానమును, ధైర్యమును, స్మృతిని, సమాధి అనగా మనస్సునకు ఏకాగ్రతను కలిగించుచు మనస్సునకు కలిగిన వ్యత్యస్త జ్ఞానమును తొలగించి వాస్తవ జ్ఞానమును కలిగించవలయును.[1] అవస్థానుసారముగా అపస్మారోక్త ఉన్మాదోక్త చికిత్సలు ప్రయోగింపవలయును.

ఔషధయోగములు :-

తైలముతో లశునమునుగాని శతావరీ రసముతో క్షీరమునుగాని బ్రాహ్మీస్వరసము, కుష్టస్వరసము వేరువేరుగా పాలతోగాని వచాచూర్ణమును తేనెతోగాని సేవింపచేయవలయును.[2]

## మూర్ఛాది రోగ ప్రకరణము

**మద, మోహ, మూర్ఛ, సంన్యాస, భ్రమ, తంద్ర :**

పై వ్యాధులన్నింటికి హేతులింగ ఉపశయనాదులలో కొంత సామ్యతగలదు. తంద్ర, భ్రమ, మద, మోహము (లేక మూర్ఛ), సంన్యాసము ఇవి ఒకదాని కన్న ఒకటి అధిక బలవత్తరముగా నుండును.

---

1. సుహృదశ్చానుకూలాస్తం స్వాప్తాః ధర్మార్థవాదినః
సంయోజయేయుర్విజ్ఞాన ధైర్య స్మృతి సమాధిభిః (చ. 10/63)

2. ప్రయుంజ్యాత్ తైలలశునం పయసా వా శతావరీమ్
బ్రాహ్మీరసం కుష్ఠరసం వచాం వా మధుసంయుతామ్ (చ.. 10/64)

### మద, మూర్ఛా, సంన్యాసముల సంప్రాప్తి:-

మలినాహారములు సేవించునట్టి స్వభావము గలిగి రజోగుణము చేతను, మోహము చేతను ఆవరింపబడిన మనుజునికి ప్రకోపించిన వాతపిత్త కఫములు వేర్వేరుగనైనను అన్నియు కలిసియైనను రక్తవాహ, రసవహ, సంజ్ఞావహ, స్రోతస్సులను అవరోధించి ప్రతిహతములై ఆ స్థానమును పొంది యుండుటచే మదము, మూర్ఛ, సంన్యాసము అను వ్యాధులను ఉత్పన్నము చేయును. ఈ మూడు వ్యాధులకు హేతువులు, లక్షణములు. ఉపశయములు ఇవి ఒకదానికన్న మరియొకదానికి క్రమముగా అధిక బలము కలవిగా నుండును.[1]

రజోగుణప్రధానమైన తమోగుణ ప్రధానమైన అహితకరమైన ఆహారములు సేవించుట, ఈ వ్యాధులకు కారణములని వాగ్భటుని మతము.[2]

## మ ద రో గ ము

### సంప్రాప్తి - సామాన్యలక్షణములు :-

తన స్వకారణములచే ప్రకోపించిన వాతము ముఖ్యముగా నున్న మనస్సునకు స్థానమైన హృదయమును చేరి మనోవహ స్రోతస్సులను ప్రవేశించి మన

---

1. యదా తు రక్తవాహీని రససంజ్ఞావహాని చ। పృథక్ పృథక్ సమస్తా వా స్రోతాంసి మలినా మలాః॥ మలినాహారశీలస్య రజోమోహావృతాత్మనః। ప్రతిహత్యావతిష్ఠన్తే జాయన్తే వ్యాధయస్తదా। మదమూర్ఛాయ సంన్యాసాస్తేషాం విద్యాద్విచక్షణః యథోత్తరం బలాధిక్యం హేతులింగోపశాన్తిషు (చ.సూ. 24/25-27)
2. రజోమోహాహితాహారపరస్య స్యుస్త్రయో గదాః రసాసృక్చేతనావాహి స్రోతోరోధసముద్భవాః। మదమూర్ఛాయసంన్యాసా యథోత్తర బలోత్తరాః (అ.హృ.ని. 6/24-25)

స్సును క్షోభింప చేయుచు సంజ్ఞ అనగా జ్ఞానము నకు సంమోహమును కలిగించును. ఇదే విధముగా పిత్తము కఫము కూడా దుర్బలమైన హృదయమును ప్రవేశించి మనస్సును క్షోభింపచేయుచు జ్ఞానమును నశింపచేయుచు మోహమును కలిగించును[1]. మద్యమువలన జనించు మదమువలె శీఘ్రముగా జనించుచు శీఘ్రముగా శాంతించునది మద మనబడును. మదమునందు మోహము స్వల్పముగా నుండును మదము తర్వాత అవస్థలో మోహము వ్యక్తముగా నుండును. మద మూర్ఛా సన్యాసములు మూడును మోహరూపములుగా వర్ణింపబడును.[2]

మదభేదములు :-

మదము ఏడు విధములుగా నుండును. అవి

1. వాతజము 2. పిత్తజము 3. శ్లేషజము 4. సన్నిపాతజము 5. రక్తజము 6. మద్యజము 7. విషజము.[3]

### వాతజ మద లక్షణములు

ఆగి, ఆగి, అస్పష్టముగను, అధికముగను, వేగముగను మాట్లాడుట; చంచలమయిన తొట్రుపాటుతో కూడిన అవ్యవస్థితములయిన చేష్టలు చేయు

---

1. దుర్బలం చేతసః స్థానం యదా వాయుః ప్రపద్యతే మనో విక్షోభయన్ జన్తోః సంజ్ఞాం సంమోహయేత్తదా పిత్తమేవం కఫశ్చైవం మనో విక్షోభయన్నృణామ్ సంజ్ఞాం నయత్యాకులతాం విశేషశ్చాత్ర వక్ష్యతే

(చ.సూ. 24/33)

2 (i) జాయతే శామ్యతి క్షిప్రం మదో మద్యమదాకృతిః (చ.సూ. 24/33)

(ii) మదమూర్ఛాయసంన్యాసేషు మోహావాప్తిరియం మదేఽల్పతరో మోహోఽస్త్యుత్తరయోస్తు వ్యక్త ఏవ మోహః (చక్రపాణి)

3. మదోఽత్ర దోషైః సర్వైశ్చ రక్తమద్యవిషైరపి (అ.హృ.ని. 6/-6)

చుండుట; రూక్షముగను అరుణవర్ణముగను ఉండు ఆకారము కలిగియుండుట— ఈ లక్షణములు వాతిక మదమునందు కలుగును.[1]

## పిత్తజ మద లక్షణములు

క్రోధముగను, కఠినముగను మాట్లాడుట; కొట్టుటయందు, పోట్లాడుట యందు అధిక ప్రీతి కలిగియుండుట రక్తవర్ణ, పీతవర్ణ లేక శ్యావ వర్ణముగల ఆకారము కలిగియుండుట— ఈ లక్షణములు పైత్తికమదమునందు కలుగును.[2]

## శ్లేష్మజ మద లక్షణములు

స్వల్పముగాను అసంబద్ధముగాను మాట్లాడుట, తంద్ర, ఆలస్యముతో కూడియుండుట, ఎల్లప్పుడు పరధ్యానముగా నుండుట, పాండువర్ణము గలిగి యుండుట:- ఈ లక్షణములు శ్లైష్మిక మదమునందు కలుగును.[3]

## సన్నిపాతిక మదలక్షణములు

మూడు దోషములకు వేర్వేరుగ చెప్పిన లక్షణములు సన్నిపాతజ మదమునందు కలిసియుండును.[4]

---

1. (i) సక్తానల్పద్రుతాభాషం చలస్ఖలిత చేష్టితమ్ విద్యాద్వాతమదావిష్టం రూక్ష శ్యావారుణాకృతిమ్ (చ.సూ. 24/30)
   (ii) అ. హృ. ని. 6/26
2. (i) సక్రోధం పరుషాభాషం సంప్రహారకలిప్రియమ్ విద్యాత్పిత్తమదావిష్టం రక్తపీతాసితాకృతిమ్ (చ. సూ. 24/31)
   (ii) అ. హృ. ని. 6/27
3. i) స్వల్పాసంబద్ధవచనం తన్ద్రాలస్యసమన్వితమ్ విద్యాత్కఫమదావిష్టం పాణ్డుం ప్రధ్యానతత్పరమ్ (చ.సూ. 24/32)
   ii) అ. ని. 6/28
4. చ. సూ. 24/33

## రక్తజన్య మదము

శరీర అవయవములు, దృష్టి స్తబ్ధముగా నుండుట, పిత్తజ మదలక్షణము లతోకూడి యుండుట-రక్తజన్య మదమునందు కలుగు లక్షణములు.[1]

## మద్య జన్య మదము

చేష్టలు, స్వరము, అవయవములు వికృతముగా నుండుట మద్యజ మద లక్షణముగా నుండును.

## విషజన్య మదము

కమ్పనము, నిద్రాధిక్యత లక్షణములు విషజన్య మదమునందు కలుగును.

రక్తాది మూడు కారణములచే కలుగు మూడు మదములు గూడా త్రిదోష లక్షణములను మించి పోజాలవు.

---

1\. i) రక్తాత్సల్పదృతాఖాషశ్చలః స్ఖలితచేష్టితః రూక్షశ్యావారుణతనుర్మదే వాతోద్భవే భవేత్ పిత్తేనక్రోధనో రక్తపీతాభః కలహప్రియః స్వల్పసంబద్ధవాక్పాణ్డుః కఫాద్ధయానపరోఽలసః సర్వాత్మా సన్నిపాతేన రక్తాత్ స్తబ్ధాంగదృష్టితా పిత్తలింగం చ మద్యేన వికృతేహాస్వరాంగతా విషే కంపోఽతినిద్రా చ సర్వేభ్యోఽభ్యధికస్తు సః లక్షయేల్లక్షణోత్కర్షాద్వాతాదీర్ఘ శోణితాదిషు (అ.హృ.ని. 6/28-29)

ii) యశ్చమద్యమదః ప్రోక్తో విషజో రౌధిరశ్చయః సర్వఏతే మదానర్తే వాతపిత్త కఫత్రయాత్ (చ.సూ. 24/34)

# మూర్ఛ

## సామాన్య నిదానము - సంప్రాప్తి

శరీరము క్షీణించి అధికమైన దోషములతో కూడియున్న మనుజుడు విరుద్ధాహారములను భుజించుట, మల మూత్రాది వేగములను నిరోధించుట, శరీరమునందభిఘాతము కలుగుట అను కారణముల వలన మనస్సునందలి సత్వగుణము నశించి బాహ్యములు అభ్యంతరములు అయిన ఇంద్రియములను వహించు నాడులందు ఉగ్రరూపమును పొందిన దోషములు ప్రవేశించుటచే ఆయా ఇంద్రియములు తమ పనిని చేయుటకు శక్యముకానందున తెలివి తప్పును. ఇదియే మూర్ఛ అనబడును.[1] మోహము గూడా దీనికి పర్యాయము.[1]

## సామాన్య లక్షణములు

సంజ్ఞను (జ్ఞానమును) వహించు నాడులు ప్రకోపించిన వాతాది దోషములచే ఆక్రమింపబడుట వలన మనుజుడు చీకటిలో ప్రవేశించిన వానివలె శీఘ్రముగా సుఖదుఃఖముల అనుభవమును పొందజాలడు. అట్టి సుఖదుఃఖములు తెలియకుండుటచేత నిశ్చేష్టుడై కట్టెవలె క్రింద పడును. ఈ వ్యాధిని మోహమనియు, మూర్ఛ అనియు వ్యవహరింతురు.[2]

---

1. క్షీణస్య బహుదోషస్య విరుద్ధాహారసేవినః వేగాఘాతాదభిఘాతాద్ధీనసత్వస్య వా పునః కరణాయతనేషూగ్రా బాహ్యేష్వాభ్యంతరేషు చ నివిశంతే యదా దోషాస్తదా మూర్ఛంతి మానవాః (సు.ఉ. 46/3-4)

2. సంజ్ఞావహాసు నాడీషు పిహితాస్వనిలాదిభిః తమోఽభ్యుపైతి సహసా సుఖదుఃఖవ్యపోహకృత్ సుఖదుఃఖవ్యపోహాచ్చ నరః పతతి కాష్ఠవత్ మోహో మూర్ఛేతి తాం ప్రాహుః షడ్విధా సా ప్రకీర్తితా (సు.ఉ. 46/5-6)

మూర్ఛ సింకోప్ (Syncope) అను అవస్థకు తుల్యముగా నుండును. దీర్ఘ కాలము నిలుచొని యుండుట, స్రోతోధారణలోని లోపములు (Improper Voasomotor Control) పరిసరీయ స్రోతస్సులు ఉష్ణవాతావరణము వలన వికాసము చెందుట, అనారోగ్యము, మానసిక కారణములు, ఉద్వేగము, భయము, శోకము, దౌర్బల్యము, తీవ్రమైన వేదనలు అభిఘాతాదులచే అధికరక్త స్రావము కలుగుట కొన్ని విషపూరిత ఔషధములు, హృద్వికారములు ఇవి Syncope నకు సాధారణ కారణములుగా గమనింపబడినవి.

## మూర్ఛా భేదములు

మూర్ఛ ఆరు విధములుగా నుండును. అవి 1) వాతజ 2) పిత్తజ 3) శ్లేష్మజ 4) రక్తజ 5) మద్యజ 6) విషజ.[1]

చరకుడు సన్నిపాతజ మూర్ఛను గూడా వివరించెను.[2]

## సామాన్య పూర్వ రూపములు

హృత్పీడ (రొమ్మునొప్పి), ఆవలింతలు, గ్లాని, జ్ఞానము తగ్గియుండుట, బలము క్షీణించియుండుట, ఈ లక్షణములు అన్ని విధములగు మూర్ఛలకు పూర్వ రూపములుగా నుండును.[3]

---

1. వాతాదిభిః శోణితేన మద్యేన చ విషేణ చ తాసు షట్ స్వపి పిత్తం హి ప్రభుత్వే నావతిష్ఠతే (సు.ఉ. 46/7)

2. చ. సూ. 24/41

3. హృత్పీడా జృంభణం గ్లానిః సంజ్ఞానాశో బలక్షయః
సర్వాసాం పూర్వరూపాణి యథాస్వముపలక్షయేత్ (సు.ఉ. 46/8)

వాతజ మూర్ఛా లక్షణములు :

వాతజ మూర్ఛయందు మనుజుడు ఆకాశమును మూర్ఛ కలుగుటకు ముందు నీల, కృష్ణ లేక అరుణవర్ణముగా నుండునట్లు చూచుచు మూర్ఛను బొంది శీఘ్రము గనే తెలివిని బొందును వణకు, అంగమర్దము, హృదయమునందు పీడ, కృశత్వము, శ్యావవర్ణములోగాని అరుణ వర్ణములోగాని శరీరముండుట - ఈ లక్షణములు కలుగును.[1]

పిత్తజ మూర్ఛా లక్షణములు :

పిత్తజ మూర్ఛయందు మనుజుడు మూర్ఛ కలుగ బోవుటకు ముందుగా ఆకాశమును రక్త, హరిత లేక పీత వర్ణములో నున్నట్లు చూచుచు మూర్ఛను బొందును. తెలివి కలుగునపుడు స్వేదము, పిపాస, సంతాపము ఈ లక్షణములతో కూడి యుండును. కన్నులు రక్త, పీత లేక అరుణ వర్ణములో నుండును. మలము భిన్నముగా వెడలును. శరీరము పచ్చని ఛాయలో నుండును.[2]

---

4. i) నీలం వా యది వా కృష్ణమాకాశమథవాఽరుణమ్ పశ్యం స్తమః ప్రవిశతి శీఘ్రం చ ప్రతిబుధ్యతే వేపథుశ్చాంగమర్దశ్చ ప్రపీడా హృదయస్య చ కార్శ్యం శ్యావాఽరుణా ఛాయా మూర్ఛాయే వాతసంభవే
(చ.సూ. 24/35-36)

   ii) అ. ని. 6/30-31

5. i) రక్తం హరితవర్ణం వా వియత్పీత యథాపి వా పశ్యం స్తమః ప్రవిశతి సస్వేదశ్చ ప్రబుధ్యతే సపిపాసః స సంతాపో రక్తపీతాకులేక్షణః సంభిన్న వర్చాః పీతాభో మూర్ఛాయే పిత్తసంభవే (చ.సూ. 24/37-38)

   ii) అ. ని. 6/32-33

కఫజ మూర్ఛా లక్షణములు :

కఫజ మూర్ఛయందు మనుజుడు ఆకాశమును మేఘములచే ఆవృతమై యున్నట్లుగనైనను చీకటిచే ఆవరింపబడినట్లుగా నైనను చూచుచు మూర్ఛను బొంది చిరకాలమునకు తెలివిని పొందును. బరువైన గుడ్డలు తడిసిన చర్మము పై కప్పినట్లుండుట, ప్రసేకము, హృల్లాసము- ఈ లక్షణములు కలుగును.[1]

సన్నిపాతజ మూర్ఛా లక్షణములు :

వేర్వేరుగా చెప్పబడిన మూడు దోషములచే కలిగిన మూర్ఛా లక్షణములతో కూడియుండి నోటనురుగువచ్చుట మొదలగు బీభత్సకర చేష్టలు తప్ప తక్కిన అపస్మార లక్షణములతో గూడి శీఘ్రముగా మనుష్యుని మూర్ఛితునిగా చేయును.[2]

రక్తజ మూర్ఛా లక్షణములు :

రక్తము రూపములోను, గంధములోను, వరుసగా జల పృథివీలకు సంబంధించి యుండుట వలన ఈ రెండును తమోగుణ భూయిష్ఠములగుటచేత రక్తము యొక్క గంధము చేతనే కొందరు ద్రవ్య స్వభావముచే, రూపము చూచినంతనే కొందరు మూర్ఛనుపొందుదురు. మూర్ఛ పిత్త కఫ ప్రాయముగా చెప్పబడినది.[3]

---

1. మేఘసంకాశమాకాశమావృతం వా తమోఘనైః పశ్యం స్తమః ప్రవిశతి చిరాచ్చ ప్రతిబుధ్యతే గురుభిః ప్రావృతైరంగై ర్యథైవార్ద్రేణ చర్మణా స ప్రసేకః స హృల్లాసో మూర్ఛాయే కఫసంభవే (చ.సూ. 24/38-40)
   ii) అ. ని. 6-33-34
2. i) సర్వాకృతిః సన్నిపాతాదపస్మార ఇవాగతః స జన్తుం పాతయత్యాశు వినా బీభత్స చేష్టితైః (చ.సూ. 24-41)
   ii) అ. ని. 6-35
3. పృథివ్యంబు స్తమోరూపం రక్తం గంధశ్చ తన్మయః తస్మాద్ రక్తస్య గంధేన మూర్ఛంతి భువి మానవాః ద్రవ్య స్వభావ ఇత్యేకే దృష్ట్వా యదభి మూర్ఛతి (సు.ఉ. 46-9-10)

రక్తజ మూర్ఛయందు మనుజుడు స్తబ్ధమైన అంగములు, నేత్రములు, అస్పష్టమైన ఉచ్ఛ్వాసము-ఈ లక్షణములు కలిగి యుండును.[1]

**మద్యజ మూర్ఛా లక్షణములు :**

విషము, మద్యములయందు తీవ్రమైన, తీక్ష్ణ ఆశుకారిత్వాది గుణములు ఉండుట వలన వాని సేవనచే ఆగుణములు శరీరముపై తమ ప్రభావమును చూపి మూర్ఛను కలిగించును [2]

మద్యజ మూర్ఛయందు మనుజుడు అనేక విధములుగా విలపించుచు జ్ఞానము నశించి విభ్రాంత మనస్కుడై అవయవములను విదల్చుచు మూర్ఛనొంది మద్యము జీర్ణమగు వరకు భూమిపై పడియుండును.[3]

**విషజ మూర్ఛా లక్షణములు :**

విషజ మూర్ఛయందు వేపథు, స్వప్నము, తృష్ణ, వెంటనే కన్నులు చీకట్లు గమ్ముట, విషభేదానుసారము లక్షణములు ఉత్పన్నమగుట కలుగును.[4]

## మూర్ఛా భ్రమాదులకు పరస్పర భేదము

పిత్త తమోగుణములచేత మూర్ఛ జనించును. రజోగుణము, పిత్తము వాతము—ఈ మూడింటిచేత భ్రమ ఉత్పన్నమగును. తమోగుణము, వాతము,కఫము

---

1. స్తబ్ధాంగదృష్టిస్త్వసృజా గూఢోచ్ఛ్వాసశ్చ మూర్ఛితః (సు.ఉ. 47-12)
2. గుణా స్తీవ్రతరత్వేన స్థితాస్తు విషమద్యయోః
   త ఏవ తస్మాత్తజ్ఞాయంతే తాభ్యాం మోహాయదేరితాః (సు.ఉ. 46/11)
3. మద్యేన విలపంశ్శేతే నష్టవిభ్రాంతమానసః
   గాత్రాణి విక్షిపన్ భూమౌ జరాం యావన్న యాతి తత్ (సు.ఉ. 46/12)
4. వేపథుస్వప్నతృష్ణాః స్యుః స్తంభశ్చ విషమూర్ఛితే
   వేదితవ్యం తీవ్రతరం యథా స్వం విషలక్షణైః (సు.ఉ. 46/13)

ఈ మూడింటి చేత తంద్ర ఉద్భవించును. ఈ విధముగా దోషములలో ఈ మూడింటికి భేదము కలదు నిద్ర శ్లేష్మ తమోగుణముల చేత ఉద్భవించును.[1]

## భ్రమ లక్షణము

భ్రమ రోగమునందు మనుజుడు చక్రముపై కూర్చొనిన వానివలె వస్తువులను తిరుగుచున్నట్లు చూచును. తలతిరుగుచునట్లు అనిపించి మాటిమాటికి భూమిపై పడుచుండును. ఇది రజోగుణము, పిత్తము వాతములచేత కలుగును.[2]

భ్రమ వ్యాధియందు మానసిక దోషమగు రజోగుణము శారీరక దోషములగు వాత పిత్తముల ఆధిక్యతయుండును. తమోగుణముగాని కఫముగాని అనుబంధించి యుండక పోవుటచేత చైతన్యము నశించదు. ముఖ్యముగా తల తిరుగుచున్నట్లును తన చుట్టూ ఉన్న వస్తువులన్నియు తిరుగుచున్నట్లును కనిపించును. ఈ స్థితిని వర్టిగో (Vertigo) అందురు. ఇది ఈ క్రింది మూడు విధములలో ఉండును.

1. శరీరము మరియు తల తిరుగుచున్నట్లుండుట
2. పరిసరములు తిరుగుచున్నట్లు అనిపించుట లేక
3. కాళ్ళు శరీర అధోభాగము నిలదొక్కుకొనుటకు వీలు కానట్లు అనిపించుట. ముఖ్యకారణములు ఈ క్రింది విధముగా నుండును.

1. కర్ణమునందుండు Labyrinth (లాబిరిన్థ్) కార్య లోపములు ఉదా శోథ, అభిఘాతము, కర్ణగూథాదులచే అవరోధము, విషపదార్థసేవన మెనీయర్స్ డిసీజ్ అను వ్యాధి మొదలగునవి.

---

1. మూర్ఛా పిత్తతమఃప్రాయా రజఃపిత్తానిలాద్భ్రమః
తమోవాతకఫా త్తన్ద్రా నిద్రాశ్లేష్మతమోభవా (మా.ని. 17/19)
2. చక్రవద్భ్రమతో గాత్రం భూమౌ పతతి సర్వదా
భ్రమరోగ ఇతి జ్ఞేయో రజః పిత్తానిలాత్మకః (మా.ని. 17/20)

2. మస్తిష్కమునకు సంబంధించిన కారణములు సెరిబ్రోకార్టెక్స్ Cerebro Cortex) సంబంధించిన ధమనీ వికృతులు, అర్బుదములు, మస్తిష్క ధమనీ అవరోధములు వెర్టిబ్రోబాసిలర్ ఆర్టరీ (Vertibro basilar artery) వ్యాధులు; మస్తిష్కమునకు రక్తసంవహనమును తగ్గించు ఇతర కారణములు.

3. మానసిక కారణములు-8వ నాడీవికృతులు ఉద్వేగము అపతంత్రకము అపస్మారాదుల పూర్వరూపములలో ఎత్తైన ప్రదేశములందు ఎక్కినపుడు రైలు, విమాన ప్రయాణములు.

4. శారీరక కారణములు, ఇతరకారణములు—రక్తభారాధిక్యత, ప్రమేహము, అధికరక్త స్రావము, రక్తక్షీణత, అతిశ్రమ, ఎక్కువసేపు నిలువబడి యుండుట, ఒక ప్రత్యేకస్థితిలో బలవంతముగా నిలువబడుట, కొన్ని జ్వరస్థితులు.

వాంతి, కర్ణనాదములతో మాటి మాటికి వచ్చు భ్రమ మెనయిర్స్ డిసీజ్‌ను సూచించును[1]. భ్రమ ఒక లక్షణము కనుక ఆయా వ్యాధులకు తగిన పరీక్షలు చేసి రోగనిర్ణయము చేయవలసియుండును.

## తంద్ర

కారణములు—సంప్రాప్తి :

మధుర-స్నిగ్ధ, గురు ఆహారపదార్థములు సేవించుట, అధిక చింత, శ్రమ, శోకము, చాలా కాలమునుండి ఏదైనా వ్యాధిచే పీడింపబడుచుండుట-ఈ కారణములచే ప్రకోపించిన వాతము, కఫములు హృదయ ప్రదేశమునకు చేరి హృదయాశ్రిత జ్ఞానవహ స్రోతస్సులను అవరోధించుటచే తంద్రావ్యాధి ఉత్పన్నము అగును.[2]

---

1. A.P. Text Book of Medicine, How to Examine a patient French's Index of Differential Diagnosis.
2. మధురస్నిగ్ధగుర్వన్నసేవనాచ్చింతనశ్రమాత్ శోకాద్వ్యాధ్యనుషంగాచ్చ వాయునోదీరితః కఫః యదాఽఽస్రోతాంసి సమవస్కంధ్య హృదయం హృదయాశ్రయాన్ సంవృణోతి స్రోతాంసి తదా తంద్రోపజాయతే (మా.ని. 9/21.22)

**లక్షణములు :**

హృదయము (మనసు) వ్యాకులమగుట, చక్షురాది ఇంద్రియములకు వాని వాని విషయాలను గ్రహించు సామర్ధ్యము లేకుండుట, వాక్కు, శారీరిక చేష్టలు మాంద్యముగానుండుట, మనసు బుద్ధి అప్రసన్నముగానుండుట శరీరగౌరవము, ఆవలింతలు, బడలిక నిద్రించిన వానికి కలుగు లక్షణములు నిద్రించకనే కలుగుట ఇవి తంద్రయందు కలుగును.[1]

నిద్రించినపుడు మనస్సు ఇంద్రియార్థములను గ్రహించలేము, ఇతర కర్మలను గూడా చేయలేము. కాని తంద్రలో కేవలము ఇంద్రియములు మాత్రము తమ విషయములను గ్రహింపలేవు. తంద్ర అనేక కఫజ వ్యాధులలో లక్షణముగా కనిపించును.

## సంన్యాసము యొక్క లక్షణములు

ప్రాణాయతనమ్మైన హృదయ మస్తిష్కములను ఆశ్రయించిన ప్రబలమైన వాతాది దోషములు వాక్కు, దేహము, మనస్సు—ఈ మూడింటికి సంబంధించిన వ్యాపారములను నిరోధించి దుర్బలుడగు మనుజుని నిస్సంజ్ఞుడుగా చేయును. అనగా మూర్ఛవంటి స్థితిని కలిగించును. ఈ సంన్యాస వ్యాధియందు సంన్యస్త (ని: సంజ్ఞ-తెలివి తప్పిన) మనుజుడు చేష్టలుడిగి కాష్ఠమువలె

---

1. i) హృదయే వ్యాకులీభావో వాక్చేష్టేంద్రియగౌరవమ్
మనోబుద్ధ్యప్రసాదశ్చ తంద్రాయా లక్షణం మతమ్ (చ సి. 9/23)

ii) ఇంద్రియార్థేష్వసంవిత్తిః గౌరవం జృంభణం క్లమః
నిద్రార్తస్యేవ యస్యేహా తస్య తంద్రాం వినిర్దిశేత్ (మా.ని. 17/20)

2. నిద్రాయా మన్ద్రియ మనో మోహః లేన్ద్రాన్ద్రియా మన్ద్రియమోహః (మధుకోశ)

మృతుని భంగి నేలపైబడును. ఆసమయమునందు సద్యః ఫలితములను కలిగించు చికిత్సలను చేయకున్నచో శీఘ్రముగా మరణమును పొందును.[1]

ఈ స్థితిని కోమా (Coma) అందురు. ఈ స్థితిలో రోగికి సాధారణ మైన క్రియలతో తెలివి తెప్పించుట కష్టము. అందుచేతనే మద, మూర్ఛలకన్న ఇదివేరయిన తీవ్ర అవస్థగా పేర్కొనబడినది.

వాతాది దోషములు తమ తమ వేగములనుచూపి శాంతించునపుడు మదము మూర్ఛలు వెంటనే తమంతటనే శమించును. కాని సంన్యాసమునందు దోషవేగ ములు తమంతట తాము శమింపవు. వానికి తగిన ఔషధములు సద్యఃఫలదాయక ములగు వానిని ఇచ్చినపుడు మాత్రమే శమించును.

ఈ స్థితి అనేక వ్యాధులలో ఒక అవస్థా విశేషముగా కలుగుచుండును. ఈ స్థితిని కలిగించు ప్రధాన కారణములు ఈ క్రింది విధముగా నుండును. ఈ కారణములు కొంతవరకు భ్రమ (Vertigo) మూర్ఛ (Syncope)ల కారణములకు తుల్యముగా నున్నప్పటికి వాని తీవ్రతచే ఈ స్థితి ఏర్పడుచుండును.
1. మస్తిష్కమునకు సంబంధించిన కారణములు.

---

1. i) వాగ్దేహ మనసాం చేష్టా మాక్షిప్యాతిబలా మలాః సంన్యస్త్యబలం జన్తుం
ప్రాణాయతనసంశ్రితాః స నా సంన్యాససంన్యస్తః కాష్ఠీభూతో మృతో
పమః ప్రాణైర్వియుజ్యతే శీఘ్రం ముక్త్వా సద్యః ఫలాం క్రియామ్
(చ.సూ. 24/43-44)

ii) ప్రభూతదోషస్తమసోఽతిరేకాత్ సంమూర్ఛితో నైవవిబుధ్యతే
సంన్యస్తసంజ్ఞో భృశదుశ్చికిత్స్యో జ్ఞేయస్తదా బుద్ధిమతా మనుష్యః
(సు.ఉ. 46/20)

iii) అ.హృ.సూ. 6/37-38

శిరస్సునకు అభిఘాతము కలుగుట-శిరో అభిఘాత లక్షణములలో సంజ్ఞా నాశము చరకునిచే చెప్పబడినది. భ్రమ, మోహము, మన్యాస్తమ్భము, అర్దితము చక్షువిభ్రమము, ఉద్వేష్టనము, కాస, శ్వాస, హనుగ్రహము, మూక, గద్గదత్వము, అక్షినిమీలనము, గణ్డస్పందనము, జృంభ, లాలాస్రావము, స్వరహాని, ముఖ వక్రత ఇవి శిరోభిఘాతముచే కలుగు ఇతర లక్షణములు.[1] శిరస్సునందలి సీమంత మర్మాఘాతమునందు ఉన్మాదము, భయము, చిత్తనాశముకలిగి మరణము కలుగును.[2]

మస్తిష్కమునకు సంబంధించిన సాంక్రామిక వ్యాధులు, అభిన్యాస జ్వరము, హతౌజస జ్వరము, శిరోగ్రీవా విషజ్వరము, మస్తిష్క ధమనీ వికారములు, అర్బుదములు, విద్రధులు, మస్తిష్కప్రదాహము, మస్తిష్కాంతర రక్తస్రావము, రక్తపీడనాధిక్యజనిత వ్యాధులు మొదలగునవి, అపస్మార అపతంత్రకాదులలో తీవ్రావస్థ.

## హృదయ సంబంధ వ్యాధులు

సంజ్ఞానాశము అపస్మారాదులు హృదయాభిఘాతమున చరకునిచే పేర్కొనబడినవి. Shock (షాక్) గుండెనొప్పి మొదలగు వానిలో ఈ స్థితి కలుగును.

మానసికకారణములు — తీవ్ర ఆశాభంగము, శోకము మొదలగు కారణములు.

---

1. శిరస్యభిహతే మన్యాస్తమ్భార్దిత చక్షుర్విభ్రమ మోహోద్వేష్టన చేష్టానాశ
కాస శ్వాస హనుగ్రహ మూక గద్గదత్వాక్షినిమీలన గణ్డస్పన్దన జృమ్భణ
లాలాస్రావ స్వరహాని వదన జిహ్మత్వాదీని (చ.సూ. 9/6)

2. పంచసంధయః శిరసి విభక్తాః సీమన్తా నామ
తత్రోన్మాదభయ చిత్తనాశైర్మరణమ్ (సు.శా. 6/27)

ఇతరకారణములు- విషమాదక పదార్థసేవనాధిక్యత, నిద్రాజనకౌషధాతియోగము, రక్తమునందు మూత్రామ్లాధిక్యత (uraemia) పిత్తాధిక్యత (Choloenia) మధురాధిక్యత (Hype-glyeaemia) లోపము (Hypoglyea-emia) అంశుఘాతము (Sunstroke) తీవ్రజ్వరము, సన్నిపాతాది జ్వరముల తీవ్రావస్థ, అతిన్యాస, హాలొపిజపాది జ్వరములు, ఓజక్షయము.

సంన్యాసావస్థలో కారణమును, లేక కారణభూతమయిన వ్యాధిని అతిశీఘ్రముగా నిర్ణయముచేసిన చికిత్స సుకరముగా నుండును. రోగియొక్క పూర్వచరిత్ర ఎంతగానో సహకరించును. సంజ్ఞానాశముయొక్క తీవ్రతను, శ్వాసను, రక్తపీడనమును. దృష్టి మండలము (Pupils) పరిమాణము కాంతి ప్రతిచర్య (సంకోచ వికాసములు), నేత్రవైకృతములు పీడనాములచే కలుగు చేష్టాప్రతిచర్యలు (Motor response) నాడీపరీక్ష, మలమూత్ర రక్తాది పరీక్షలు-వీని ద్వారా కారణము నిర్ణయించవలయును.[1]

## సంన్యాసమునందు శీఘ్ర చికిత్సావశ్యకత :

లోతుగానుండు జలములో మునుగుచున్న పాత్రను క్రిందకు పోకముందే రక్షించు విధముగను, పచ్చిమట్టిపెంకు నీటిలో పడినయెడల కరిగిపోకముందే గ్రహించు విధముగను వెంటనే చికిత్సించి సన్యాసరోగి ప్రాణములను రక్షింపవలయును. ఆలస్యము అయినచో అది ప్రాణహానికి అవకాశములు పెరిగి చికిత్సించుట దుస్సాధ్యమగును.[2]

---

1. A.P.I. Text Book
2. i) మజ్జమానమివాంభసి పాత్రం త్వరయా యథా గృహ్ణీయాత్తమప్రాప్తం
తథా సంన్యాసపీడితమ్ ॥ (చ.సూ. 24/45)
ii) యథామమలోష్టం సలిలే నిక్షిప్తం సద్యోవిలయమాపద్యతేఏవ
తద్వద్విభ్రమచిత్తస్య తత్క్షణేన స్వాస్థ్యమాశు ప్రయాతమ్
(సు.ఉ. 46/21)

**అసాధ్య లక్షణములు :-**

సంజ్ఞాప్రబోధక చికిత్సలన్నింటిని ప్రయోగించినను సంజ్ఞ (తెలివి) కలుగక, శ్వాస నిలిచిపోయి, మలమూత్రములు బంధించి నోటినుండి లాలాస్రావము- ఈ లక్షణములు కనిపించినచో సంన్యాస రోగిని వర్జించవలయును.[1]

## మద మూర్ఛాదుల చికిత్సలు

ప్రారంభమున చెప్పబడినటుల మద మూర్ఛ సంన్యాసములకు బలభేదమే తప్ప హేతులక్షణ ఉపశయములలో సామ్యత ఉండుటచే చికిత్సలుగూడ సమానముగనే ఉండును. అయినప్పటికి అవస్థానుసారము మారుచుండును.

మదమూర్ఛాదులందు ప్రారంభమునందు అనగా ఆవేగము లేకుండా యుండి తెలివిగానున్నపుడు, సంన్యాసమునందు ఆవేగము లేనపుడును ఈ క్రింది విధముగా ఉపచరించవలయును.

సంశోధనము- స్నేహనము, స్వేదనము బాగుగా చేయించి దోషానుసారము రోగిబలమును, రోగబలమును అనుసరించి పంచకర్మలు చేయించవలయును.[2]

వమనము, వాతానులోమక క్రియలు వీనిని తీక్ష్ణమైన ఔషధములచే చేయించి శోధనానంతరము సంసర్జనముచేసి లఘువైన పథ్యకరములయిన ఆహారములచే ఉపచరించవలయును.[3]

---

1. అధః క్రియాభిశ్చ న లబ్ధసంజ్ఞః సానాహలాలాశ్వసనశ్చ వర్జ్యః (సు.ఉ. 46/23)
2. స్నేహస్వేదోపపన్నానాం యథాదోషం యథా బలమ్ పంచకర్మాణి కుర్వీత మూర్ఛాయేషు మదేషు చ (చ.సూ. 24/51)
3. ప్రవృత్తసంజ్ఞం వమనానులోమ్యైః తీక్ష్ణైర్విశుద్ధం లఘుపథ్య భుక్తమ్॥ (సు.ఉ. 46/[illegible]3)

మదమునందును, మూర్ఛయందును ప్రధానముగా వాత పిత్త శామక చికిత్సలను చేయించవలయును. అన్ని అవస్థలయందు పిత్త మధికముగా నుండును.[1] కనుక రక్తమోక్షణము చేయించ వలయును.

రోగి మనస్సుకు ఆఘాతము కలుగనీయ కుండా మోహకారణముల నుండి, నిదాన (కారణ)ముల నుండి రక్షింప వలయును. నిదాన రూపమైన వ్యాధులు ఉన్నచో వానికి తగిన చికిత్సలు చేయవలయును. ఉపద్రవములు ఉన్నచో వానికి గూడా తగిన ప్రతీకారము చేయవలసి యుండును.[2]

ధర్మ శాస్త్రములు తెలిసిన వారిని, సజ్జనులను జితేంద్రియులను సేవించ వలయును. ధైర్యము నవలంబించుట, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అహంకారము జీవుడు-వీనికి సంబంధించిన జ్ఞానమును పొందుట, విషయేచ్ఛను తగ్గించుట హితకరములుగా నుండును.[3]

విస్మాపనము (ఆశ్చర్యమును కలిగించుట) ప్రీతికరమైన విషయముల జ్ఞాపకము చేయుట, మనోహరమైన వస్తువులను చూపించుట, మనస్సునకు అనుకూలమైన సంగీతము వాయిద్యములను వినిపించుట, యిష్టమైన కథలను వినిపించుట మొదలగు క్రియలచే మోహమదాదులచే విచలితమైన మనస్సును ప్రాకృత స్థితికి తీసికొని రావలయును.

---

1. మదేషు వాతపిత్తఘ్నం ప్రాయో మూర్ఛాసు చేష్యతే సర్వత్రాపి విశేషేణ పిత్తమేవోపశమయేత్ (అ.హృ.చి. 7/100)
2. ప్రబుద్ధసంజ్ఞం మతిమానసుబద్ధముపక్రమేత్ తస్య సంరక్షితవ్యం హి మనః ప్రలయహేతుతః (చ.సూ. 24/53)
3. i) రక్తావసేచనాచ్ఛాస్త్రాణాం సతాం సత్త్వవతామపి సేవనాన్మద మూర్ఛాయాః ప్రశామ్యన్తి శరీరజాః (చ.సూ. 24/56)

   ii) ధర్మకర్మాణి చేష్టాని సేవనం లోకిదస్య చ సత్వస్యాలంబనం జ్ఞాన మధ్యాత్మిక షమేవ చ (అ.హృ.చి. 7/108)

ధూమపానములను, ధూమములను, అంజనములను, కబళగ్రహములను, రక్తమోక్షణము, వ్యాయామము, అభ్యంగము, ఉద్ఘర్షణము మొదలగు వానిని అవస్థానుసారము ప్రయోగింపవలయును.[1]

మదవేగము అధికముగా నుండునపుడు నోటిని, ముక్కును చేతులతో అద్దగింపవలయును. లేక చనుబాలతో నస్యము చేయించుటగాని త్రాగించుటగాని హితకరముగా నుండును.[2]

మదము, మూర్ఛ ఇవి అతి ప్రవృద్ధముగా నున్నపుడును, సంన్యాస అవస్థయందును ఈ క్రింది తీక్ష్ణమైన సంజ్ఞా ప్రబోధక చికిత్సలచే అవబోధనము కలిగించ వలయును. అనగా తెలివిని కలిగించ వలయును.[3]

## సంజ్ఞా ప్రబోధక చికిత్సలు :-

తీక్ష్ణమైనటు వంటి నస్యములు, అవపీడక నస్యములు, ధూమములు, ప్రధమనములు, సూదులతో గుచ్చుట, ముఖ్యముగా గోళ్ళసందులలో గుచ్చుట, నిప్పుచే కాల్చుట, వెంట్రుకలను కేశములను పీకుట, దంతములచే కొరకుట, తేలును కరపించుట, నోటియందు, గోళ్ళయందు కటు ఆమ్ల రసములలో నున్న ద్రవ్యము

---

1. i) విస్మాపనైః స్మారణైశ్చ ప్రియశ్రుతిభిరేవ చ పటుభిర్గీతవాదిత్రశబ్దైశ్చిత్రైశ్చ దర్శనైః॥ స్రంసనోల్లేఖనైర్ధూమైరంజనైః కవలగ్రహైః శోణితస్యావసేకైశ్చ వ్యాయామోద్ఘర్షణైస్తథా॥ (చ.సూ. 24/51-52)
   ii) సు.ఉ. 46/21 iii) అ.హృ.చి. 7/103-104.
2. ప్రసక్తవేగేషు హితం ముఖనాసావరోధనమ్ పిబేద్వా మానుషీ క్షీరం తేన దద్యాచ్చ నావనమ్ (అ.హృ.చి. 7/104)
3. మదేష్వతి ప్రవృద్ధేషు మూర్ఛాయేషు చ యోజయేత్ తీక్షణం సంన్యాసవిహితం విషఘ్నం విషజేషు చ (అ.హృ.చి. 7/109)

లను పోయుట, చిరచప్పి రోమములను, వస్త్రములను చుట్టుట-వీనిచే సంజ్ఞను పొందును.[1] అపూర్వమైన వాయిద్యములు గానములు రోగివద్ద చేయుట.

సరికొన్ని ఆభ్యంతర ప్రయోగములు-రోగి నోటి ద్వారా ఔషధములు ఇవ్వరాని అవస్థలో ఉన్నచో క్రింది ఔషధములను పానము చేయించుట ప్రశస్తము [illegible]. లేనిచో కాస్తకాస్తగా నోటిలో తడుపుటగాని లేక కల్కము వలె చేసి నాలుకకు లేపనము చేయుటగాని మంచిది.

1. అనేక విధములగు తీక్ష్ణ మద్యములందు అధికముగా కటు ద్రవ్యములను చేర్చిపానము చేయించుట.
2. మాతులుంగ స్వరసమున సొంఠి చూర్ణము కలిపిగాని లేక త్రికటు చూర్ణము సైంధవ లవణము కలిపిగాని.
3. మద్యము, అమ్ల కాంజికము, సౌవర్చలవణము, హింగు, పిప్పలీ చూర్ణము కలిపిగాని త్రాగించవలయును.
4. లశునస్వరసము త్రాగించుట శ్రేష్ఠము గా నుండును.

తెలివి వచ్చిన తోడనే రోగి స్థితిని గమనించి లఘువైన ఆహారముల నిచ్చి ఉపచారములను చేయవలయును.[2]

---

1\. i) అంజనాన్యవపీడాశ్చ ధూమః ప్రధమనాని చ సూచీభిస్తోదనం
శస్త్రం దాహః పీడానఖాన్తరే। లుంచనం కేశలోమ్నాం చ దన్తైర్దశనమేవ చ
ఆత్మగుప్తావఘర్షశ్చ హితాస్తస్యావబోధనే॥ (చ.సూ. 24/46-47)

ii) సు.ఉ. 46/22

iii) అ.హృ. 7/110-111

2\. i) సంమూర్ఛితాని తీక్ష్ణాని మద్యాని వివిధాని చ ప్రభూతకటుయుక్తాని
తస్యాస్యే గాలయేన్ముహుః॥ మాతులుంగరసం తద్వన్మహౌషధసమాయుతం

(Contd....

స్రోతోసోధనమునకై కటు తీక్ష్ణ ద్రవ్యములతో కూడిన ఆహారము నివ్వవలయును.[1]

ఔషధ యోగములు :-

1. కల్యాణక ఘృతము(ఉన్మాదోక్త) మహాతిక్తక ఘృతము, తిక్తక ఘృతము (కుష్ట చికిత్సోక్త) షట్పలఘృతము వీనిని సేవింప చేయవలయును.
2. కౌంభసర్పి(పది సంవత్సరములు కుంభమునందుంచిన పురాణ ఘృతము.)
3. ఘృతమౌద్ర శర్కరలతో కలిపిన త్రిఫలా చూర్ణముగాని.
4. దుగ్ధముతో శిలాజతు.
2. కేవల దుగ్ధమునుగాని లేక దుగ్ధములో పిప్పలినిగాని చిత్రకమునుగాని కలిపి ఐనను.
6. రసాయన ఔషధ ప్రయోగము లేకపై ఔషధములను రసాయన విధిగా సేవించుట ప్రశస్తముగా నుండును.[2]
7. త్రిఫలములు, త్రికటుకములు, శిలాజిత్తుకలిపి ఒకమాసము చక్కెరతో సేవింపుచు పురాణ ఘృతపానము చేయుచుండ వలయును.

---

తమ్। తద్వత్సౌవీరకం దద్యాద్యుక్తం మద్యాప్లకాంక్షిణే॥ హింగూషణ సమాయుక్తం మావత్సంజ్ఞా ప్రబోధనమ్॥ ప్రబుద్ధసంజ్ఞమనైశ్చలఘుభి స్తముపాచరేత్ (చ.సూ. 24/48-50)

ii) అ.చి. 7/113

1. లఘ్వన్నప్రతి తీక్ష్ణోష్ణమద్యాత్ స్రోతోవిశుద్ధయే (అ.చి. 7/113)

2. చ.సూ. 24/55-57

8. ఆయా దోషాను సార జ్వరములకు చెప్పబడిన కషాయములను పానము చేయించ వలయును.[1]

9. కోలమజ్జ, త్రికటు, ఉశీర, నాగకేసర చూర్ణము 1-2 గ్రా శీతలజలములో పానము చేసిన వమనము మూర్ఛ శమించును.

10. పిప్పలీ చూర్ణము 1-2 గ్రా. తేనెలో సేవించినను వమనము, మూర్ఛ శమించును.

11. రాత్రి సమయమునందు త్రిఫలాచూర్ణములో తేనె కలిపియు, ఉదయమున గుడార్ద్రకమును పాలను పిమ్మట సేవించుచు పథ్యభోజనము చేయుచున్న మద, మూర్ఛ, ఉన్మాదము, కాస, కామల శమించును. (చక్రదత్త 176)

12. అశ్వగంధా రిష్ట-(భై.ర) మూర్ఛ ఉన్మాద అపస్మారాదులను శమింప చేయును మోతాదు 15 మి.లి.-30 మి.లీ.

13. సుధానిధి రసము (భై.ర) రస సింధూరము, పిప్పలీ చూర్ణము కలిపి 100 మి.గ్రా. తేనెతో సేవించుచు శీత లోపచారములు చేయించిన మద మూర్ఛలు శమించును.

14. మూర్ఛాంతక రసము (భై.ర) రససింధూరము, స్వర్ణ మాక్షిక భస్మ స్వర్ణ లోహ భస్మములు శిలాజిత్తు ముఖ్య ద్రవ్యములు. 100-మి.గ్రా సేవించిన మూర్ఛాదులు శమించును.

15. తామ్రభస్మము ఉశీర, నాగకేసర, చూర్ణములలో కలిపి సేవించిన మూర్ఛాదులు శమించును. (భా.ప్ర)

---

1. i) సు.ఉ. 46/24
   ii) యథాస్వం చ జ్వరఘ్నాని కషాయాణ్యుపయోజయేత్ సర్వమూర్ఛాపరీతానాం విషజానాం విషాపహమ్ (సు.ఉ. 46/25)

16. మృగమదాసవమును గాని బృహత్ కస్తూరి భైరవమును గాని ఇవ్వ వలయును (ర.త.సా.)

మద, మూర్ఛాదిహర అంజన నస్యాదులు

1. సైంధవలవణము, మణిశిల, మరిచ-వీని అంజనము.

2. శిరీష బీజాద్యంజనము

3. మధూక సారాది నస్యము (భా.ప్ర)

## విశేష చికిత్సలు

దోషానుసారము కారణానుసారము విశేష చికిత్సలు చేయవలసి యుండును.

రక్తజ మూర్ఛయందు శీతలక్రియలు చేయవలయును. మద్యజ మూర్ఛాదు లందు వమనము చేయించి సుఖమైన నిద్ర వచ్చునట్లు చేయవలయును. మద్య మును పానము చేయించవలయును. (తగిన మాత్రలో).

విషజ మూర్ఛాదులందు తగిన విషఘ్నమైన ఔషధాదులను ప్రయోగించ వలయును.[1]

దోషజ మూర్ఛాదులందు ఆయా దోషహర జ్వరోక్త కషాయ పానములు ఇతర దోషహర శోధన వమనాదులు ప్రయోగింపవలయును.

---

1. i) రక్తజాయాస్తు మూర్ఛాయాం హితః శీతక్రియావిధిః మద్యజాయాం వమేన్మద్యం నిద్రాం సేవేద్ యథా సుఖమ్ విషజాయాం విషఘ్నాని భేషజాని ప్రయోజమేత్ (చ.ద. 17-3-4)

ii) సు.ఉ. 46-25 iii) అ.చి. 7-109

iv) భా.ప్ర. -37 v) భై.ర. 21-2

వాతజ మూర్ఛయందు కస్తూరీ భైరవరసము, అశ్వగంధారిష్ట, పిత్తజ మూర్ఛయందు కామదుధారసము, ముక్తాపిష్టి, శ్లేష్మజన్య మూర్ఛయందు పంచసూతరసము ఆవశ్యకతానుసారము ప్రయోగింపవలయును.

రక్తజన్య మూర్ఛయందు తాప్యాదిలోహము చంద్రకలారసము ఉపయోగింపవలయును. (ర. తంత్రసార)

మద్యజ మూర్ఛాదులందు ఈ క్రింది ఔషధములు దోషానుసారము ప్రయోగింపవలయును.

1. మృణాళ బిసము. పిప్పలి, అభయ-ఇవి తేనెతో ఇవ్వవలయును.

2. దురాలభా చూర్ణముగాని, ముస్తా చూర్ణముగాని శీతలజలముతో ఇవ్వవలయును.

3. ధాత్రీ ఫలరసముతోగాని హరీతకీతోగాని సిద్ధముచేసిన ఘృతము.

4. ద్రాక్షాది మధురద్రవ్య సిద్ధక్షీరము (అ.హృ.చి. 7)

## భ్రమహర చికిత్సలు

భ్రమ వ్యాధికి కారణమును గ్రహించి తత్తదనుసారము చికిత్సింపవలసియుండును. ఈ క్రింది యోగములు అవస్థానుసారము ప్రయోగింపవచ్చును.

1. శతావరి, బలామూలము ద్రాక్ష-వీనితో సిద్ధముచేసిన క్షీరమును సితాయుక్తముగా పానము చేయించవలయును.
2. బలాబీజ చూర్ణము సితా, దుగ్ధములతో సేవించిన భ్రమ శమించును.
3. దురాలభాక్వాథము ఘృతముతో (చక్రదత్త).
4. ధాత్రీరస సిద్ధ లేక హరీతకీ సిద్ధ ఘృతము (భా.ప్ర)!
5. క్రౌంచసర్పి లేక రసాయనౌషధములు లేక శిలాజతు సేవన (చక్రదత్త).

6. శొంఠి, పిప్పలి, శతావరి, హరీతకీ 10–10 గ్రాములు, గుడము 60 గ్రా కలిపి గుటికలుచేసి సేవించిన భ్రమ శమించును.

7. తామ్రభస్మము 25-50 మి.గ్రా. మోతాదులో ఘృతములో కలిపి దురాలభా క్వాథముతో సేవించవలెను. (భా.ప్ర.)

8. స్వర్ణమాక్షిక భస్మము మస్తిష్క ఉష్ణతను, పిత్తమును శమింపచేయును. 200-300 మి.గ్రా. మోతాదులో దాడిమ రసములోగాని దాడిమ పానకముతోగాని కూష్మాండావ లేహ్యముతోగాని ఇచ్చిన భ్రమ శమించును.

9. అభ్రక భస్మము 100 మి.గ్రా. తేనెతో ఇచ్చిన మనోదౌర్బల్య జనిత వాత కఫానుబంధ భ్రమ శమించును. లోహ భస్మమునుగూడా కలిపి యిచ్చిన ఇంకను గుణకారిగా నుండును.

10. సూతశేఖర రసము (మో.ర.) 100మి.గ్రా తేనెతో ఇచ్చిన తీవ్ర భ్రమగూడా శమించును.

11. స్మృతిసాగర రసము-భ్రమతోపాటు తంద్రమూర్ఛలు ఉన్నచో 100 మి.గ్రా. ఇవ్వవలయును.

ముక్తాపిష్టి, మహాసూర్యావర్తి రసము. చ్యవనప్రాశావ లేహ్యము, సారస్వతారిష్ట మొదలగు ఔషధములు అవశ్యకతానుసారము ఉపయోగించవచ్చును. (ర. త. సార)

## తంద్రా చికిత్సలు

కారణానుసార చికిత్స చేయవలయును. ఈ క్రింది ఔషధములు అవస్థానుసారము ప్రయోగించవచ్చును. కఫఘ్నములు నిద్రానాశక ఔషధములు క్రియలచే తంద్ర శమించును. కఫఘ్నమునైన శోధన శమన చికిత్సలు, వ్యాయామము, రక్తమోక్షణము, కటుతిక్త ద్రవ్యసేవన తంద్రను శమింపచేయును.[1]

---

1. కఫఘ్నం తత్ర కర్తవ్యం శోధనం శమనాని చ వ్యాయామో రక్తమోక్షశ్చ భోజ్యం చ కటుతిక్తకమ్ (చ.సి. 9.24)

1. సైంధవ లవణము, కర్పూరము, మనశ్శిల, పిప్పలి, రేణు, అశ్వలాల జలము-వీనిని నూరి అంజనము చేయించిన నిద్రరోగాదిన తంద్ర శమించును.

2. సైంధవము, శిగ్రు, సర్షపము, కుష్ఠము వీనిని బస్తమూత్రముతో నూరి నస్యము చేయించవలయును.

3. శుంఠి, పిప్పలి, వస, సైంధవలవణము-వీని నస్యము హితకరము.

4. భద్ర, అమృత, పుష్కరమూలము. నాగరము, భారంగి, హరీతకి-వీని క్వాథము తంద్రను శమింపచేయును (భా. ప్ర)

## మూర్ఛాది వ్యాధులందు పథ్యాపథ్యములు

### పథ్యములు

**ఆహారములు :**

షష్టికములు, రక్తశాలి, పురాణయవలు, ముద్గ, మసూర యూషములు, లాజమండము, రాగ, షాడవములు, సితా. పురాణ కూష్మాండము, పటోలము, కదళి, దాడిమ, నారికేళము, మధూకపుష్పము, తండులీయకము, ఉపోదిక, జాంగల జంతువుల మాంసరసములు, మృదు, తిక్త లఘు ఆహారములు, పురాణ ఘృతము, కౌంభసర్పి, గోదుగ్ధము, హరీతకి, ద్రాక్ష, ఇక్షురసము. ఖర్జూరము, అంతరిక్షజలము, నదీతీర కూపజలము.

విహారములు :

శీతల ప్రదేహములు, సేకములు, వ్యజనములు, శీతచ్ఛాయగల ప్రదేశవాసము. మణిధారణము, చందన కర్పూర లేపములు, నిద్రానాశక క్రియలు, శిరో అభ్యంగము, శిరస్సుపై శతధౌతఘృతాభ్యంగము. పూర్వోక్త వ్యాయామ ఉద్వర్తనాదులు.

### అపథ్యములు

విరుద్ధమైన అన్నపానములు, కటు పదార్థములు, తక్రము, తాంబూలము, పత్రశాకములు, దంతధావనము, స్వేదనము, ఆతపసేవన, వ్యవాయము, తృష్ణ నిద్రా నిరోధము. (అ.హృ.చి. 7-101, 102 వై.ర)

# అవ్యవస్థిత చిత్తము

మనస్సు నిలకడలేకుండగను తన స్వకార్యములగు చింత్యాదులను నిర్వర్తింపకను యుండు స్థితిని అవ్యవస్థిత చిత్తమని అనదగును.

అవ్యవస్థిత చిత్తము ఉన్మాదాది మానసిక వికారములకు ముందు కలుగవచ్చును.

ఈ క్రింది కారణములు గూడ మనో అవ్యవస్థతకు దారితీయవచ్చును—మాదక పదార్థసేవన, సన్నిపాత జ్వరము, మస్తిష్కకీటాణు సంక్రమణజన్య వ్యాధులు, మూత్రవిష రక్తమయత, ధాతుక్షయ జన్య మస్తిష్క వ్యాధులు అధిక శ్రమ.

ఉద్వేగము, చింత, శోకము, క్రోధము, మానసికశ్రమ-ఈ మానసిక కారణముల గూడా అవ్యవస్థిత చిత్తమును కలిగించును.

కారణమును గమనించి లక్షణములను గమనించి ఆయా అవస్థలలో తగిన చికిత్సలు చేయవలయును.

మేధ్యములు, మనోప్రశామకములు అగు చికిత్సలు చేయవలెను.

దీర్ఘకాల జన్య అవ్యవస్థిత చిత్తమున ధార, పిచు మొదలగు క్రియలు, మేధ్యములగు ఘృతములు ప్రయోగించుట మొదలగు వానిచే ఉపచరింపవలెను.

బోర్డర్ లైన్ పరసనాలిటీ (Borderline Personality) అనబడు పరసనాలిటీ డిజార్డర్ నందు అవ్యవస్థిత చిత్తము ప్రధాన లక్షణముగా నుండును. సాంఘిక సంబంధములందు, ప్రవర్తన, శీలము, వ్యక్తిత్వము వీటన్నింటి యందును అస్థిరత్వము ఉండును. ప్రవర్తన అనూహ్యముగా మారుచుండును. తీవ్ర అకారణ క్రోధము, నిగ్రహలోపము కన్పించును.[1]

---

1. P 1184 API Text book of Midicine (1936)

యిట్టి స్థితి వారి వారియందు స్వతసిద్ధముగనే యుండుటచే చికిత్స దుస్సాధ్యముగా నుండును. ఎంతో కష్టముమీద వారి స్వభావములో కొంత మార్పు తేవచ్చును.

## గదోద్వేగము

### పర్యాయములు

అతత్త్వాభినివేశము, అపదార్థగదము, విక్షిప్తత, గదోద్వేగము, మహాగదము- ఇవన్నియు సమానార్థక పర్యాయములు.

యీ పర్యాయములు మాధవనిదాన పరిశిష్టమున చెప్పబడినవి. అతత్త్వాభినివేశము, మహాగదము అను పేర్లతో చరకమున వర్ణింపబడిన వ్యాధి,గదోద్వేగము ఒకటియే యని చెప్పబడినవి.

కాని అతత్త్వాభినివేశము పూర్వమే వివరింపబడినది. గదోద్వేగ మిచట వివరింపబడినది.

మిథ్యాజ్ఞానముచే లేనటువంటి వ్యాధిని ఉన్నదని తలచు వ్యాధి శంక గదోద్వేగమనబడును. ఏ పదార్థము యొక్క జ్ఞానము రోగికి కలిగెనో అది అచట లేకపోవుటచే ఇది "అపదార్థ గదము"ని అనబడుచున్నది.

### నిదానము

శారీరక మానసిక శ్రమము, వైరాగ్యము, శోకము, బలము యొక్క మానము యొక్క హాని, అధిక భయము, సత్త్వహాని.

### లక్షణములు

రోగి ఏ వ్యాధిని గురించి చింతించుచుండునో దాని లక్షణములను అనుభవించును. ఈ వ్యాధి గలవారు నిరాధారమైన వ్యాధి శంకచే బాధపడుచుందురు.

ఉదా - తన పొట్టలోనికి భుజింపబడిన ఆహారముతోపాటు పాము లోపలికి పోయి తిరుగుచు భుజించిన ఆహారమును తినివేయు చున్నదనియు అది ఎపుడు బయటకు వచ్చునో అనియు సతతము అదే విచారములో మునిగిపోవును. దానిని గురించి శోకించుచుండును.

కొందరు తమ మస్తిష్కములో కప్ప ప్రవేశించినదనియు, కొందరు తమ శరీరములోనికి గాజు ముక్కలు పోయినవనియు, తనకు హృద్రోగము లేక కాన్సర్, లేక ఎయిడ్స్ వంటి వ్యాధులు కలిగినవని ఊహించుకొనుచు ఆయా లక్షణములనాపాదించుకొని తీవ్రమైన చింత ఉద్వేగము పొందెదరు. ఈ విధముగా వ్యాధి శంకచే నిరంతరము విచారగ్రస్తులై యుందురు. వారికి వ్యాధి లేదని యుక్తి పూర్వకముగా సాన్త్వన వాక్యములు చెప్పువారి మాటలు వినిపించుకొనక వారిపై కోపమును కలిగియుందురు. వారు చెప్పిన భ్రమజన్య విషయములను అమోదించు వారియందు ప్రీతిని కలిగియుందురు.

పక్వాశయమున పీడ, జిహ్వ కఫలిప్తముగా నుండుట, శ్వాసయందు పూతి గంధము, వమనము. ఉత్క్లేశము- ఈ లక్షణములు వ్యాధి జీర్ణావస్థలో కనిపించును.

కొందరికి స్పర్శ తీక్ష్ణమగును, కొందరు జలోదరాది ఉదర రోగములను, పాండును లేక ఇతర దారుణ వ్యాధులను గురించి సతతము చింతించెదరు.

దీనిచే పుంస్త్వలోపము, నిరంతర దుఃఖముచే జ్వరము, కంపము మొదలగు లక్షణములు కలుగును.

ఈ వ్యాధి అధికముగా 40 నుండి 50 సంవత్సరముల వయస్సులో కలుగుచుండును.

స్త్రీలకు మాసమాసరజస్రావముచే ధాతువులు శుద్ధమగును కనుక ఈ వ్యాధి ప్రాయికముగా కలదని మాధవనిదాన పరిశిష్టమున పేర్కొనబడినది. కాని ఈ వ్యాధి అనగా హైపోకోండ్రియాసిస్ (Hypochondoriasis) స్త్రీ పురుషులిరువురికి సమానముగా కలుగునని ఆధునిక వైద్యమున వివరింపబడినది.

వ్యాధినిర్ణయము.-రోగి చరిత్ర మొదలగునవి బాగుగా పరిశీలించినతరువాత శారీరక వ్యాధి నుండి వేరుచేయుటకై ఆయా లక్షణముల ననుసరించి సాధారణ పరీక్షలు విశిష్ట ఆధునిక పరీక్షలు జరిపి శారీరక వ్యాధి లేదని గమనించినపుడు వ్యాధి నిర్ణయము చేయవలసి యుండును.[1]

సాధ్యాసాధ్యత.- ఈ వ్యాధి మూర్ఖ ప్రవృత్తి కలవారికే వచ్చుచుండును. ఇతర వ్యాధులేవియు లేక స్వతంత్రముగా జనించినది; చాలా దుస్సాధ్యముగా నుండుననియు అల్లోపెథీ వైద్యమునందలి ఔషధములు నిరుపయోగముగా నుండునని యు అల్లోపెథీవైద్యమున వివరింపబడినది. మనోప్రసాదకచికిత్సలు మాత్రమే కొంత ఉపకరింపవచ్చును.

## గదోద్వేగ చికిత్స

ఆశ్వాసనమును కలిగించు మాటలు చెప్పుట, స్నేహమును ప్రదర్శించుట, హర్షణమును కలిగించు సంతోషప్రదాయకములగు ఉపచారములు చేయుట గదోద్వేగము నందు హితకరముగా నుండును.

వైద్యుడు రోగిలో అతనికేమియు వ్యాధిలేదను సత్యమును చెప్పక రోగి చెప్పిన విషయములను ధ్యాన పూర్వకముగా వినుచుండవలయును. ఆ విధముగా అతనికి మనోనుకూలముగా ప్రవర్తింపవలయును.

వాతానులోమనములు కలిగించునవియు, అగ్ని దీపకములును, ఆమపాచకములును అగునవియు చిత్తమును శాంతపరచునవియు కాని కఫమును అధికముగా వృద్ధి చెందింపనివియు అగు ఔషధములను గదోద్వేగము నందు ప్రయోగింప వలెను.

ఆహారములు - సులభముగా జీర్ణమగునవియు హృద్యములును, స్నిగ్ధ

1. (i) మాధవ నిదానము పరిశిష్టము P.455-456.
(ii) A. P. I. Text book of Medicine P 1178.

గుణమును కలిగి పుష్టిని కలిగించునవియు అగు అన్నపానములచే ఉపచరింపవలెను.[1]

వాత వ్యాధి చికిత్స యందు చెప్పబడిన ఘృతములు, తైలములు, రసౌషధములు, రసాయనములు విధి పూర్వకముగా అవసరమును గుర్తించి ఈ వ్యాధి యందు ప్రయోగింపవలెను[2].

### ఇతర శామకౌషధములు

యమాన్యాది చూర్ణము (భై.ర) 3-6 గ్రా. దుగ్ధము లేక షర్బత్‌తో సేవింపచేసిన గదోద్వేగము, ఉన్మాదము, నపుంసకత్వము అగ్ని మాంద్యము శమించును.

క్షీరోదధి రసము (భై.ర) కజ్జలి, అభ్రకము, శిలాజితు, స్వర్ణభస్మము మొ॥నవి ముఖ్య ద్రవ్యములు. 200-400 మి.గ్రా త్రిఫలా క్వాథముచే సేవింపచేసిన గదోద్వేగము, క్షయ, వాతపిత్త వ్యాధులు, జీర్ణ జ్వరము శమించును.

గన్ధరాజ తైలము (భై.ర) అభ్యంగాది ప్రయోగముచే గదోద్వేగము వాతవ్యాధులు కృశత్వము, అగ్నిమాంద్యము, స్నాయురోగములు- వీనిని శమింప చేయును.

---

1. సాన్త్వనాశ్వాసన వచనైః స్నేహహర్షణ తర్పణైః
   అపదార్థగదేనార్తం చికిత్సేత్సాధుసేవయా
   గదామిథ్యేతి నవదేద్భిషగస్య కదాచన
   సయద్బ్రవీతి వృత్తాన్తం సావధాన శృణోతు తత్
   వాతానులోమనం యద్యద్ దీపనం పాచనం తథా
   పిత్తహృన్నాతి కఫకృద్ భేషజం తత్ప్రయోజయేత్
   అన్నపానం చ సుపచం హృద్యం స్నిగ్ధం చ పుష్టికృత్
   అపదార్థగదే దేయం తదేవాన్యన్న శర్మకృత్ (భై.ర 78/1,5, 2, 4)
2. వాతవ్యాధిహితాన్యత్ర తైలాన్యుక్తాని యాని చ
   తాని ప్రయోజయేద్వైద్యో భేషజం చ రసాయనమ్ (భై.ర. 78/3)

# అనిద్రా ప్రకరణము

ఆహారము, నిద్ర, బ్రహ్మచర్యము, అను ఈ మూడును మానవుని ఆయు ర్దాయమును కాపాడుటకు ముఖ్యమైన మూడు ఉపస్తంభములు. వీని మూడింటి శాస్త్రవిధి ననుసరించి సేవించినచో శరీరమునకు బలము, వర్ణము, పుష్టి, కలి ఆరోగ్యము కాపాడబడుచుండును.[1]

ఇంద్రియములు మనస్సుచే ప్రేరితములై తమ తమ స్వకృత్యములు నె వేర్చుటలో అలసట చెందినపుడు మనస్సుతో కూడిన ఇంద్రియములు సంపూ విశ్రాంతి తీసుకొనుస్థితి నిద్ర అనబడును.[2]

అనగా నిద్రలో మనస్సునకు, ఇంద్రియములకు పరిపూర్ణమైన విశ్రా లభించును. నిద్రవలన సుఖము, పుష్టి, బలము, పుంస్త్వము, జ్ఞానము, ఆయు యము ఇవన్నియు లభించును.

నిద్రను సరిగా సేవించనప్పుడు అనగా అధికముగా నిద్రించినను అ ముగా నిద్రించినను నిద్రవలన కలుగవలసిన సత్ఫలితములు కలుగక దౌర్బల్యము, కృశత్వము, పుంస్త్వహాని, అజ్ఞానము(మనస్సు సరిగా పనిచేయకపోవుట)వ్యాధు కలిగి ఆయుస్సు క్షీణించును.[3]

---

1. త్రయ ఉపస్తమ్భా ఇతి ఆహారః స్వప్నో బ్రహ్మచర్యమితి ఏభిస్త్రిభిర్యుక్తి యుక్తైః ఉపస్తబ్ధముపస్తమ్భైః శరీరం బలవర్ణోపచయోపచితమనువర్తతే యావదాయుః సంస్కారాత్ సంస్కారమహితమనుపసేవమానస్యయ ఇహైవోపదేక్ష్యతే (చ.సూ. 11/35)

2. i) యదా తు మనసి క్లాన్తే కర్మాత్మానః క్లమాన్వితాః విషయేభ్యో నివర్తన్తే తదా స్వపితి మానవః (చ. సూ. 21/37)

3. నిద్రాయత్తం సుఖం దుఃఖం పుష్టిః కార్శ్యం బలాబలం వృషతా క్లీబతా జ్ఞానం అజ్ఞానం జీవితం న చ (చ.సు. 21/38)

మానసిక వ్యాధులలోను, కొన్ని మనో వికారములందు కొన్ని ఇతర వ్యాధు లందు అనిద్ర ఒకముఖ్యలక్షణముగా నుండును. కొన్ని వ్యాధులలో నిద్రను కలిగించి నచో వ్యాధి త్వరగా శమించుటకు సహకరించును.

## నిద్రానాశమునకు కారణములు

**మానసిక కారణములు :-**

చింత, మనస్సంతాపము, ఆర్థిక సంబంధమైన చింతలు, కుటుంబ కలహములు, స్త్రీ సంబంధ చింత, ఉద్యోగ వ్యాపారాదులకు సంబంధించిన చింత, ఉద్వేగము, ఉత్కంఠ, ఈర్ష్య, క్రోధము, భయము, అతిహర్షము మొదలయిన మానసిక కారణములు నిద్రను దూరముచేయును. ఏదయినా ఒక పనియందు అధిక ఆసక్తి కలిగియుండుట, ఉదా :- సినిమాలు చూచుట, క్రీడలు, అధ్యయనము మొదలగునవి. అధికమయిన సత్వగుణము కలిగియుండుటచే తమోగుణమును జయించుట- (ఈ కారణముచే కలుగు నిద్రానాశము హానిని కలిగింపదు.)

**శారీరక కారణములు :-**

విరేచనకర్మ, నస్యకర్మ, వమనకర్మ, ధూమపానము, వ్యాయామము రక్తమోక్షణము, ఉపవాసము, వార్ధక్యము, అసుఖకరమైన శయ్య, అసుఖ కరమయిన నూతనమైన అసాత్మ్యకరమైన పరిసరములు, వేదనలతో కూడిన వ్యాధులు, వాత ప్రకోపము, పిత్త ప్రకోపము, అభిఘాతము కొందరిలో స్వాభావికముగనే నిద్రాల్పత యుండును.[1]

---

1\. i) కాయస్య శిరసశ్చైవ విరేకశ్ఛర్దనం భయమ్ చింతా క్రోధః తథా ధూమో వ్యాయామో రక్తమోక్షణమ్ ఉపవాసోఽసుఖా శయ్యా సత్త్వౌదార్యం తమోజయః నిద్రా ప్రసఙ్గమహితం వారయన్తి సముత్థితమ్ ఏత ఏవచ విజ్ఞేయా నిద్రానాశస్య హేతవః కార్యం కాలో వికారాశ్చ ప్రకృతిర్వాయురేవ చ

(చ సూ. 21/55-57)

ii) నిద్రానాశోఽనిలాత్ పిత్తాన్మనస్తాపాత్ క్షయాదపి సంభవత్యభిఘాతాచ్చ ప్రత్యనీకైః ప్రశామ్యతి

(...4/41)

## నిద్రా నాశమువలన కలుగు లక్షణములు

నిద్ర తగ్గటము వలనను, రాత్రి జాగరణము చేయటం వలనను రూక్షత్వము కలిగి వాతము ప్రకోపించును.[1]

నిద్రవచ్చినప్పుడు బలవంతముగా ఆపుటవలనను నిద్రానాశము వలనను, ఆవలింతలు, అంగమర్దము, తంద్ర, శిరోవేదన, మోహము, కళ్ళు బరువుగా నుండుట- లక్షణములు కలుగును.

శరీర జడత్వము, (ఉత్సాహము లేకపోవుట), గ్లాని (బడలిక), భ్రమ, ఆహారము జీర్ణము కాకపోవుట వాతవ్యాధులు కలుగును.[2]

నిద్రను ఆపుటవలన కలుగు మానసిక అసహనత అస్వాస్థ్యము మొదలగునవి అనేక శారీరక, మానసిక వ్యాధులకు కారణమగును. ఉదా :— రక్తభారాధిక్యత, హృద్రోగము, శ్వాస, న్యూరోసిస్, వ్యాధి క్షమత్వ సామర్థ్యము తగ్గుట, మధుమేహము లాంటి ఇతర కారణములు లేకయున్నపుడు నిద్రానాశము వలన వ్యక్తావస్థను పొందును.

## అనిద్రా శామక చికిత్సలు

నిద్రానాశమునందు, నిద్రా నిరోధమునందు నిద్రాకర చికిత్సలు ప్రయోగింప వలసియున్నది.[3] అతిరిక్తమైన కొన్ని అవస్థలలో నిద్ర ధాతుసా[illegible]

---

1. రాత్రౌ జాగరణం రూక్షం (చ.సూ. 21/50)
2. i) జృమ్భాఙ్గమర్దస్తన్ద్రా చ శిరోరోగాక్షి గౌరవమ్
నిద్రా సంధారణాత్తత్ర స్వప్నస్సంవాహనాని చ (చ.సూ. 7/2[illegible])
ii) నిద్రాయా మోహమూర్ధాక్షిగౌరవాలస్యజృమ్భికాః అంగమర్దశ్చ (అ.సం.సూ. 5/10)
iii) [illegible]
[illegible] (అ.హృ.సూ. 9/5[illegible])
3. [illegible] స్వప్నః సంవాహనాని చ (చ.సూ. 7/[illegible])

తను, రోగనిరోధ నివారణను కలిగించుటలో సహకరించును. అట్టి స్థితులలో గూడా నిద్రపట్టనపుడు తగినంతగా నిద్రను కలిగించుటకై ఉపచారములను చేయ వలసియుండును. అట్టి అవస్థలు ఈ క్రింద పేర్కొనబడినవి.

1. రాత్రి జాగరణము చేసినవారు ఎంతకాలము జాగరణ చేసిరో అందులో సగము కాలము పగలు భోజనమునకు ముందు నిద్రించుట మంచిది. గ్రీష్మ ఋతువునందు రాత్రికాలము స్వల్పముగా ఉండుట వలనను, రూక్షత్వము అధికముగా ఉండుట వలనను ఆరోగ్యవంతులు కూడా పగటిపూట కొంతసేపు నిద్రించుట మంచిది.[2]

2. అధికముగా సంభాషించుట, చదువుట, సంగీతము పాడుట, బరువులు మోయుట, నడచుట, శ్రమకరమయిన ఇతరపనులు చేయుట, అధిక స్త్రీ సంభోగము, వాహనములపై ప్రయాణము చేయుట, మద్యపానము మొదలగు పనులచే శ్రమ చెందినవారును.

3. బాలురు, వృద్ధులు, దుర్బలులు, పగటి నిద్ర అలవాటుగా గల వారును.

4. అజీర్ణము, ఉరఃక్షతము, ధాతుక్షీణత, దౌర్బల్యము, క్షుత్, తృష్ణ, అతిసారము, శూలశ్వాస, హిక్క, కార్శ్యము, అభిఘాతము, మొదలగు శారీరకవ్యాధులు కలవారును.

5. ఉన్మాదము, క్రోధము, శోకము, భయము, మొదలగు మనోవికారములచే పీడింపపడుచున్న వారును.

---

1. i) గ్రీష్మవర్జేషు కాలేషు దివాస్వపాత్ ప్రకుప్యతః శ్లేష్మపిత్తే, దివాస్వప్న స్తస్మాత్తేషు న శస్యతే॥ (చ.సూ. 21/45)

ii) యావత్కాలం మను ష్యస్సాత్ రాత్రౌస్వప్నాద్వ్యపోచితాత్ తతోఽర్ధ మాత్రం తత్కాలం దివాస్వప్నమిష్యతే (తంత్రాంతర వచనము)

iii) భుక్త్వాస్వప్నం న సేవేత వృద్ధోవ్యాధిభిరో భవేత్ (హారీత సంహిత)

వీరందరు పగటిపూట కూడా నిద్రించవలయును. సాధారణముగా పగటి నిద్రవలన స్నిగ్ధత్వము వృద్ధి చెంది కఫము పిత్తము గూడా వృద్ధియగును. కాని పై అవస్థలలో తగినంతగా పగలు నిద్రించినను హానిని కలిగించక ధాతువులు సమస్థితినొంది బలము వృద్ధి పొందుటకు, శ్లేష్మము పుష్టినొందుటకు, శారీరక దార్ఢ్యత, ఆయుంవు వృద్ధి నందుటకును పగటి నిద్ర సహకరించును. వీరికి ప్రాకృతముగా నిద్రించనపుడు నిద్రాజనక క్రియలు చేయవలసియుండును.[1]

## నిద్రాజనక చికిత్సలు

బాగుగా సువాసనలు గల తైలముతో అభ్యంగనములు, సుగంధ ద్రవ్యములతో ఉత్సాదనములు, సంవాహనములు, సాన్నము, సుగంధలేపనములు మూర్ధ తైలము (అభ్యంగ, సేక, పిచు, వస్తి), ధార, తక్రధార; కర్ణ అక్షి పూరణ తర్పణ క్రియలు; శుచిగా అందముగా నుండు ఋత్వనుకూల మనోనుకూల వస్త్ర ధారణము.

---

1. i) గీతాధ్యయనమద్యస్త్రీకర్మభారాధ్వకర్శితాః అజీర్ణినః క్షతాః క్షీణావృద్ధా బాలస్తథాఽబలాః తృష్ణాతిసారశూలార్తాః శ్వాసినో హిక్కినః కృశాః పతితాభిహతోన్మత్తాః క్లాన్తాయానప్రజాగరైః క్రోధశోకభయక్లాన్తా దివాస్వప్నోచితాశ్చ యే సర్వఏతే దివాస్వప్నం సేవేరన్ సార్వకాలికమ్॥ ధాతుసామ్యం తథాహ్యేషాం బలం చాప్యుపజాయతే శ్లేష్మా పుష్ణాతి చాఙ్గాని స్థైర్యం భవతి చాయుషః (చ.సూ. 21/41-42)

ii) ముక్త్వాతు భాష్యాధ్వమద్యస్త్రీభారకర్మభిః క్రోధశోకభయైః క్లాన్తాన్ శ్వాసహిక్కాతిసారిణః వృద్ధబాలాబలక్షీణ క్షతతృట్శూలపీడితాన్। అజీర్ణ్యభిహతోన్మత్తాన్ దివాస్వప్నోచితానపి॥ ధాతుసామ్యం తథాహ్యేషాం శ్లేష్మా చాంగాని పుష్యతి॥ (అ.సం.సూ. 9/46-48)

ఇష్ట ద్రవ్యప్రాప్తి, శుచిగా అందముగా మనోను కూలముగా నుండి గాలి ... చ్చుచు ఉన్న శయ్యాగృహము. మృదువైన విస్తీర్ణము కలిగిన సుఖకరమైన ...య్య.

... రాదులు :

శాల్యన్నము, దుగ్ధము, విశేషించి మహిషక్షీరము, ఇక్షురసము, గుడ, పిష్ట ...ర్థములు, భక్ష్యములు, మాష, గోధుమ, కిలాట, సూకరమాంసము ఇతర ...నూప ఔదక మాంసరసములు, మత్స్యములు—వీనిలో సాత్మ్యము మనోను కూలము ...నవి ఇష్టవర్ణ గంధస్పర్శలు కలుగునట్లు సంస్కరించబడినవి ఇవ్వవలయును. ...ష్టమైన మద్యములు పానము చేయించవలయును.

...రములు :

మనోను కూలమైన శబ్దములు, గీతములు, ఇష్టజనులతో వార్తాలాపములు; ...ర్యసాఫల్యము కలుగుట, కృతకృత్యత,సంతోషము; బ్రహ్మచర్యమున ఇష్టము ...మ్య సుఖములందు నిస్పృహ, మనః ప్రసన్నతను కలిగించు, ఆత్మతృప్తిని ...గించు ఇతర క్రియలు.

నిద్రకు తగిన కాలము: అనిద్రకు సంబంధించిన వ్యాధులు, వేదనలు, కారణ ములు తొలగించుట—ఈ క్రియలచే సుఖకరమైన నిద్ర వెంటనే కలుగును.[1]

---

1. i) అభ్యంగోత్సాదనం స్నానం గ్రామ్యానూపౌదకారసాః శాల్యన్నం సదధి క్షీరం స్నేహో మద్యం మనఃశుభమ్॥ మనసోఽనుగుణాగన్ధాః శబ్దాః సంవాహనాని చ చక్షుషస్తర్పణం లేపః శిరసోవదనస్య చ స్వాస్తీర్ణం శయనం వేశ్మ సుఖం కాలస్తథో చితః ఆనయన్త్యచిరాన్నిద్రాం ప్రణష్టా యానిమిత్తతః (చ.సూ. 21/51-54)

(Contd....

### ఔషధములు :

1. జీవనీయ గణసిద్ధ సర్పి క్షీరానుపానముతో ఇవ్వవలయును. (అ.సం.సూ. 9/64)

2. పిప్పలీ మూల చూర్ణము 2 గ్రా. 5 గ్రా. పురాణ గుడముతో ఇచ్చిన చిరకాల జనిత నిద్రానాశము గూడా శమించును.

3. భంగును ఘృతములో భర్జితము చేసి అజాదుగ్ధముతో నూరి పాదతలము లకు లేపనము చేసిన సుఖనిద్ర కలుగును. (భై.ర.)

సర్పగంధావటి — మదాత్యయ, ఉన్మాద, రక్తపీడనాధిక్యజనిత, వృక్క-ప్రదాహజనిత నిద్రానాశనమునందు; ఇతరకారణ జనిత నిద్రానాశనమున 1 గ్రా. నుండి 2 గ్రా. వరకు నిద్రపోవుటకు రెండు గంటలు ముందు పాలతో ఇవ్వవలయును.

మా[illegible] వి [illegible] — ([illegible] అనర్హ్య) జటామాంసి, ఖురాసానివాము, అశ్వగంధ-మంచి[illegible] జనరము.

---

ii) కింమేవస్యాన్నిద్రస్తు క్షీరమిక్షురసం రసమ్। ఆనూపౌదకమాంసానాం భక్ష్యాన్ గౌడికపిష్టకాన్॥ శాలిన్సదధ్యాని మాషాంశ్చ కిలాటాన్సహిషాందధి। అభ్యంగోద్వర్తనస్నానమూర్ధ్వశ్రవణపూరణమ్॥ చక్షుషస్తర్పణం లేపం శిరసో వదనస్య చ ప్రవాతే సుశిలా వేశే సుఖాం శయ్యాం యథోచితే।సంవాహనం స్పర్శసుఖం చిత్తప్రియం విధిః। సర్పిః క్షీరానుపానం చ జీవనీయైః ప్రసాధితం పిబేత్॥ కాంతా బాహులతాశ్లేషో నివృత్తిః కృతకృత్యతా మనోనుకూలా విషయాః కామం నిద్రా సుఖప్రదాః బ్రహ్మచర్యరతే ర్గ్రామ్యధర్మేష్వస్పృహచేతసః। నిద్రాసంతోషతృప్తస్య స్వంకాలం నాతివర్తతే (అ.సం.సూ. 9/61-66)

విజయ పుష్పాద్యవ లేహ్యము — 1-3 గ్రా క్షీరముతో మనోవికారజ అనిద్రానాశకము.

ద్రాక్షాసవము (యో.ర) — 15-30 ml దౌర్బల్యజనిత నిద్రానాశమును శమింపచేయును.

రాజావర్త భస్మము — 100 మి.గ్రా. 200 మి.గ్రా. ఆమలకీ మొరబ్బా లేక రోజా పుష్పావ లేహ్యముతో సేవించిన మదాత్యయ, చిత్త విభ్రమ, ఉన్మాదములచే కలిగిన నిద్రానాశము శమించును.

ముక్తాపిష్టి — దాహ, భ్రమ, పిత్తవృద్ధితో కూడిన అనిద్రయందును, ఇతర నిద్రానాశములందును 50-100 మి.గ్రా. పాలతో ఇవ్వవలయును.

స్వర్ణమాక్షిక భస్మము — 200 మి.గ్రా. తేనెతో నిద్రాకరము.

సూతశేఖర రసము — వాతపిత్త లక్షణము భ్రమతోకూడిన నిద్రా నాశమున 100 మి.గ్రా. సితాయుక్త క్షీరముతో యివ్వవలెను.

వసంత కుసుమాకర రసము — 100 మి.గ్రా. మస్తిష్క శ్రమ జన్య నిద్రానాశమున కూష్మాండ స్వరసము లేక త్రికాలక క్వాథంతో ఇవ్వవలెను.

అపస్మారమున, అపతంత్రకమున చెప్పబడిన ఘృతాదియోగములు మనః ప్రసాదనము కొరకు ప్రయోగింపవచ్చును. అనిద్ర కారణములకు తగిన చికిత్సలు చేయుట అవసరము.

## అతినిద్ర-దివాస్వప్నము

అనిద్రకై చెప్పబడిన ఆహార విహారముల అతి ఉపయోగము చేత గాని-ఇతర కఫవర్ధక తామస ప్రధాన ఆహార విహారాదులచే గాని పగటి సమయమున గ్రీష్మ వర్ష్య ఋతువులలో నిద్రించినపుడు శ్లేష్మము పిత్తము ప్రకోపించి ఈ కింది వ్యాధులను కలిగించును.

హలీమకము, శిరశ్శూల, స్తైమిత్యము, అంగ గౌరవము, అంగమర్దము, అగ్నినాశము, హృదయోపలేపము, శోఫ, అరోచకము, హృల్లాసము, పీనసము అర్ధావభేదకము, కోఠ, ఉదర్దము,పిడక, కండు, తంద్ర, కాస, కంఠరోగములు, స్మృతినాశము, బుద్ధినాశము, ప్రమోహము, ఇంద్రియముల సామర్ధ్యము తగ్గుట, స్రోతోరోధము, శరీరమున విషమున్నచో అది వ్యాపించుట—ఈ లక్షణములు కలుగును.[1]

అతినిద్ర శమించుటకు, అతినిద్రా జనిత వికారములు శమించుటకు ముందు చెప్పబడిన నిద్రానాశక కారణములనే ఉపచారములుగా ప్రయోగించ వలయును. తంద్రా వ్యాధియందు చెప్పబడిన చికిత్సలను ప్రయోగించవలయును.

మేదస్సు అధికముగా వృద్ధి చెందినవారు, స్నేహపానమధికముగా చేయు వారు శ్లేష్మ ప్రకృతి కలవారు, శ్లేష్మ ప్రకోపముగలవారు, దూషీ విషముగలవారు వీరు గ్రీష్మకాలమునందు గూడా పగలు నిద్రింపరాదు. వీరికి గూడా అతినిద్ర కలిగినపుడు పై చికిత్సలతో శమింప చేయవలయును.[2]

---

1. హలీమకః శిరఃశూలం స్తైమిత్యం గురుగాత్రతా। అంగమర్దోఽగ్నినాశశ్చ ప్రలేపో హృదయస్య చ॥ శోఫారోచక హృల్లాస పీనసార్ధావభేదకాః। కోఠోఽరుః పిడకాః కణ్డూః తన్ద్రా కాసో గలామయాః॥ స్మృతిబుద్ధిప్రమోహశ్చ సంరోధః స్రోతసాం జ్వరః। ఇన్ద్రియాణామసామర్థ్యం విషవేగ ప్రవర్తనమ్ భవేన్నౄణాం దివాస్వప్నసాహిత్యస్య నిషేవణాత్
(చ.సూ. 21/46-49)
2. గ్రీష్మవర్జ్యేషు కాలేషు దివాస్వప్నాత్ప్రకుప్యతః। శ్లేష్మ పిత్తే దివాస్వప్నస్తస్మాత్తేషు న శస్యతే మేదస్వీః స్నేహనిత్యాః శ్లేష్మలాః శ్లేష్మరోగిణాః॥ దూషీవిషార్తాశ్చ దివా న శయీరన్ కదాచన (చ.సూ. 21/45)

## అపతన్త్రక ప్రకరణము

అపతన్త్రకము, అపతానకములను చరకుడు, వాగ్భటుడు ఒకే వ్యాధి పర్యాయములుగా భావించిరి. కాని సుశ్రుతుడు భిన్నమైన వ్యాధులుగా భావించెను.

## అపతన్త్రక సంప్రాప్తి లక్షణములు

స్వకారణములచే ప్రకోపించిన వాతము తన స్థానమునుండి ఊర్ధ్వభాగమును పొంది హృదయస్థానమున నిలచి పీడించుచు శిరస్సును, శంఖప్రదేశమును చేరి వానిని పీడించుచు శరీరమంతటిని అనగా అన్ని అవయవములను ధనుస్సువలె వంచును. అన్ని అవయవములందు ఆక్షేపము మోహము (మూర్ఛ) కలుగును. నిశ్చేష్టుడుగానగును. ఉచ్ఛ్వాసము అవరోధింపబడుటవలన కష్టముగా ఉచ్ఛ్వాసముండును. నేత్రములు నిశ్చలముగా నుండును, లేక మెల్ల మెల్లగా తెరుచును. సంజ్ఞలు నశించి కపోత కూజనమువంటి కంఠకూజనమును చేయుచు మూర్ఛను పొందును. ఇది అపతంత్రకమనబడును. వాతము హృదయమునుండి వదలినపుడు మనుజుడు స్వస్థతను పొందును. తిరిగి హృదయమును వాతము ఆవరించినపుడు మూర్ఛిల్లును. దీనినే కొందరు అపతానకమని గూడా అందురు.

సుశ్రుతుడు అపతంత్రకమును కఫయుక్త వాతవ్యాధిగా చెప్పెను. శ్వాస కఫవాతములచే అవరోధింపబడునని చరకుడు వివరించెను.[1]

---

1. i) క్రుద్ధైస్స్వైః కోపనైర్వాయుః స్థానాదూర్ధ్వం ప్రపద్యతే, పీడయన్ హృదయం గత్వా శిరశ్శంఖౌ చ పీడయన్॥ ధనుర్వన్నమయేద్గాత్రాణ్యాక్షిపేన్మోహయేత్తదా। కృచ్ఛ్రేణ చాప్యుచ్ఛ్వసితి స్తబ్ధాక్షోఽథ నిమీలకః। కపోత ఇవ కూజేచ్చ నిస్సంజ్ఞస్సోఽపతన్త్రకః దృష్టిం సంస్తభ్య సంజ్ఞాం చ హత్వా కణ్ఠేన కూజతి హృది ముక్తే నరస్స్వాస్థ్యం యాతి మోహం వృతే పునః వాయునా దారుణం ప్రాహురేకే తదపతానకమ్ (చ.చి. 9/12-15)

(Contd....

అపతంత్రకము హిస్టీరియా లక్షణములకు తుల్యముగా నుండును. ఈ వ్యాధి ఒక ప్రత్యేకమైన మనస్తత్వముగలిగిన మనుజులకు వ్యంజకమైన కొన్ని బాహ్య కారణములు తోడైనపుడు ఆవేగ (ఆక్షేప) రూపములో కలుగును. చేష్టా వికృతులు (Conversion symptoms) సంజ్ఞా జ్ఞాన వికృతులు (Disassociative symptoms) ఏ విధమైన రచనా సంబంధ వికృతి లేకుండగానే మానసిక కారణములచే కలుగుట ప్రధానాంశము.

Hysteria అనునది ఒక వ్యాధిని కాక కొన్ని మనోవ్యాధుల సమూహమునకు సామాన్యపదముగా భావింపబడుచున్నది.[1]

## అపతన్త్రిక చికిత్స

అపతంత్రక రోగికి అపతర్పణ చికిత్సలుగాని వమన, అనువాసన ఆస్థాపనాదివస్తులు కాని, తీక్ష్ణవస్తులు కాని చేయింపరాదు. ఇవి నిషిద్ధములు. వాత శ్లేష్మములచే అవరుద్ధమైన శ్వాసను తీక్ష్ణమైన ప్రధమన నస్యములద్వారా అవరోధమును తొలగించేసి ప్రాకృత స్థితికి తీసికొని రావలయును. నస్యములచే కఫ వాతములు తొలగుటవలన సంజ్ఞ (జ్ఞానము) సామ్యస్థితికి వచ్చును.[2]

---

ii) వాయురూర్ధ్వం వ్రజేత్ స్థానాత్ కుపితో హృదయం శిరః శంఖౌ చ పీడయత్యంగా న్యాక్షిపేన్నమయేచ్చ సః నిమీలితాక్షో నిశ్చేష్టః స్తబ్ధాక్షో వాఽపి కూజతి। నిరుచ్ఛ్వాసోఽథవాం కృచ్ఛ్రాదుచ్ఛ్వాస్యాన్నష్టచేతసః॥ స్వస్థఃస్యాద్ధృదయే ముక్తే హ్యావృతే తు ప్రముహ్యతి కఫాన్వితేన వాతేన జ్ఞేయ ఏషోఽపతన్త్రికః (సు ని. 1/64-65)

iii) అ.హృ.ని. 15/17-20

1. A.

2. i) అపతన్త్రికాతురం నావతర్పయేత్। వమనానువాసనాస్థాపనానినస్యేత వాతశ్లేష్మోపరుద్ధోచ్ఛ్వాసం తీక్ష్ణైః ప్రధమాపనైర్మోక్షయేత్ (సు. చి. 5/21)

(Contd....

## నస్యములు

మరిచము, శిగ్రుబీజములు, విడంగము, ఫణిజ్జకము-వీని సూక్ష్మచూర్ణముతో ప్రధమన నస్యము చేయించవలయును.[1]

## అభ్యంతరౌషధములు

1. హింగు, అమ్లవేతసము, శొంఠి, సౌవర్చలలవణము, దాడిమము-వీని చూర్ణము 6 గ్రాములు మోతాదులో యవక్వాథముతో పానము చేయించవలయును[2].

2. తుంబురులు, పుష్కరమూలము, హింగు, అమ్లవేతసము, హరీతకి త్రిలవణములు-వీని చూర్ణమును యవాక్వాథముతో పానము చేయించవలయును.

3. సౌవర్చలవణము, త్రికటుకములు అభయా వీనితో సిద్ధముచేసిన ఘృతము పానము చేయించవలయును.

---

ii) శోధనావస్తయ స్త్రిష్ణ హితాస్తస్య చ కృత్స్నశః (చ.సి. 9/20)

iii) శ్వసనం కఫవాతాభ్యాం రుద్ధం తస్య విమోచయేత్ తీక్ష్ణైః ప్రధమనైః సంజ్ఞాం తాసు ముహ్యాసు విన్దతే (చ.సి. 9/17)

1. మరిచమ్ శిగ్రుబీజాని విడంగం చ ఫణిజ్జకమ్ ఏతాని సూక్ష్మచూర్ణాని దద్యాచ్ఛీర్షవిరేచనమ్ (చ. సి. 9/17)

2. i) తుంబురు పథ్యా చ పౌష్కరం లవణత్రయమ్ యవక్వాథామ్బునా పేయం హృత్పార్శ్వార్త్యపతన్త్రకే హింగ్వమ్లవేతసం శుంఠీం ససౌవర్చలదాడిమమ్॥ పిబేద్వాత కఫఘ్నం చ కర్మహృద్రోగనుద్దితమ్। శోధనావస్తయ స్త్రిష్ణహితాస్తస్య చ కృత్స్నశః సౌవర్చలాభయావ్యోషైః సిద్ధంతు స్యాత్ఘృతం హితమ్ (చ.సి. 9/18-20)

ii) సు.చి. 5/12 iii) అ.చి. 21/35-37.

## ఇతర ఉపచారములు

1. వాత కఫ శామక విధులను ప్రయోగింపవలయును.

2. హృద్రోగ శామక కర్మలను ఆచరింపవలయును.

3. బ్రాహ్మీవటి (స.యో) లేక బృహద్వాత చింతామణి ఇవ్వవలెను.

4. మాంస్యాది క్వాథము-జటామాంసి 12 గ్రా, అశ్వగంధ 3 గ్రా. ఖురాసాని అజవాయిన్ 1 గ్రా. క్వాథము చేసి తేనెతో సేవించవలెను. ఈ క్వాథ అనుపానముగా బ్రాహ్మీవటీ బృహద్వాత చింతామణి సేవింపవలెను.

5. అపతంత్రకారివటి (చికిత్సాదర్శ) 200 గ్రా. మాంస్యాది క్వాథముతో రోజుకు మూడు నాలుగు మాత్రలు సేవించవలయును.

వాతకులాంతక రసము, చింతామణి చతుర్ముఖ రసము, పంచగవ్యఘృతము, శతధౌతఘృత శిరో అభ్యంగము మొదలగునవి అవస్థానుసారము ప్రయోగించవలయును.

## ఆత్యయిక రోగముల పరిచయము

### చికిత్స

ఆత్యయిక స్థితి అనునది కొన్ని వ్యాధుల తీవ్రావస్థలో కలుగుచుండును.

ఏ మాత్రము చికిత్సయందులో ఆలస్యము చేసినను ప్రాణహాని కలుగు అపాయము ఉన్న స్థితిని ఆత్యయిక స్థితి అందురు.

అగ్నిలో గృహము దహింపబడుచున్నపుడు రక్షించుటకు చేయు ప్రయత్నము చేయవలెను. లోతుగానుండు జలములో మునుగుచున్న పాత్ర క్రిందను పొర [illegible]

ముందే గ్రహించు విధముగను-వెంటనే చికిత్సించవనిచో, సద్యః ఫలితములనిచ్చు ఔషధములచే చికిత్సింపవనిచో రోగికి ప్రాణహాని కలుగును.[1]

ఆత్యయిక వ్యాధులన్నింటిలో సాధారణముగా ప్రాణాయతనములైన హృదయము, శిరస్సు (మస్తిష్కము), వస్తి (వృక్కములు), రస, రక్తధాతువులు వీని విషమస్థితి అనువర్తించి యుండును.

సద్యః ఫలదాయకమైన ఔషధములను ప్రయోగించి వైద్యుడు ఆత్యయిక స్థితిని తొలగించుటకు గట్టి ప్రయత్నము చేయవలెను.

ఒక్కొక్కమారు రోగకారణము, రోగ నిర్ధారణ చేయుటకు వీలుకాక పోయినను లాక్షణిక చికిత్సలు చేయవలసి యుండును.

ఆత్యయికస్థితిలో వైద్యుడు ధైర్యముగను, ఏమాత్రము ఏమరుపాటు లేకను చికిత్సను పూనుకొనవలెను.[2]

రోగి శరీరమున ప్రాణమున్నంతవరకు చికిత్సను ప్రయత్నముతో చేయుచుండవలయును. ఒక్కొక్కప్పుడు రోగి మరణాసన్నస్థితినుంచి మామూలు

---

1. i) మహావేగం అగ్నివచ్చాశుకారి చ (చ.చి. 4/5)
   ii) దుర్గేఽప్యపి యథా మజ్జన్నాజినం త్వరయా బుధః గృహ్ణీయాత్తలమ ప్రాప్తం తథా సన్న్యాస పీడితమ్ (చ.సూ. 24/45)
   iii) తస్యాశుకారిణో దావాగ్నేరివాపతితస్యాత్యయికస్యాశు ప్రశాన్తాయతితవ్యం మాత్రాం దేశం కాలం చాభిసమీక్ష్య సంతర్పణేనా పతర్పణేనా వా (చ. ని. 2/11)
   iv) యథాఽఽమలోష్టం సలిలే నిషిక్తం సముద్భవేదాశ్వవిలీనమేవ తద్వచ్చికిత్సేత్త్వరితం యో భిషక్ప్రసవేదనం మృత్యువశప్రయాతం (సు.ఉ. 46/21)
2. ఆకస్మికే హ్యాత్యయికే హ్యాతురాణాం ప్రాప్తే యత్ర సముత్పద్యంతి వైద్యస్తు ప్రయతేయతే

స్థితికి వచ్చును. చిన్న వ్యాధినైనను అశ్రద్ధచేయక చికిత్సింపవలెను. అశ్రద్ధ చేసినచో స్వల్పవ్యాధులు గూడా తీవ్రమునై అగ్ని, శస్త్రము, విషములవలె పరిణమించి అత్యయికస్థితిని పొందును.[1]

## మూర్ఛ సంన్యాసాదులు

మూర్ఛ సంన్యాసము అను అత్యయికస్థితి అనేక వ్యాధులందు మరణాసన్న సమయమున కలుగును. అందుచే దీనిని అతిత్వరితముగా గుర్తించి సద్యః ఫలదాయక చికిత్సలు చేయుట అవసరము. తీవ్రజ్వరములు, పక్షాఘాత ప్రారంభావస్థ, మధుమేహము, తీవ్ర జలధాతుక్షయము (Dehydration) రక్తమాధుర్య హాని (Hypoglycemia) యకృత్ వ్యాధులు మొదలగువానియందు మూర్ఛ కలుగును. వీని లక్షణములు మూర్ఛాప్రకరణమునందును, యకృత్ వ్యాధులందును చూడదగును.

కారణములను ఆలోచించకుండ వెంటనే చికిత్స ప్రారంభింపవలెను. మూర్ఛ సంన్యాసములందు చెప్పబడిన సంజ్ఞా ప్రబోధక చికిత్సలను రోగస్థితికి రోగ కారణమునకు వ్యతిరేకము కాని విధముగా ప్రయోగింపవలెను.

రోగిని నోటిద్వారా ఔషధాహారములు తీసికొనలేని స్థితిలో నాసానాళము ద్వారా ఔషధాహారములు ప్రయోగింపవలెను. అగ్ని స్థితిని గమనించి సద్యః ఫలప్రదమైన మందులను వేయుటను ప్రయోగింపవలెను. అత్యవసర స్థితిలో రక్తనాళముద్వారా వ్యాధికి తగిన ఔషధ ద్రవములను ప్రయోగించి ప్రాణరక్షణ చేయవలెను.

---

1. యావత్ కంఠగతాః ప్రాణా యావన్నాస్తి నిరింద్రియః
   తావత్ చికిత్సా కర్తవ్యా కాలస్య కుటిలా గతిః
   [illegible]
   అగ్నిశస్త్రవిషైస్తుల్యః స్వల్పోఽపి వికరోత్యతః

ఆహారము, మూత్రప్రవృత్తి, హృద్గతి, శ్వాస మొదలగు ప్రాణాధార క్రియలు సక్రమముగా జరుగునట్లు చూడవలెను.

హృద్గతి, నియమనమునకై బృహత్ కస్తూరి భైరవము 100 మి. గ్రా నాగవల్లీ రసముతో ముహుర్ముహు రౌషధముగా ఇవ్వవలెను మకరధ్వజము, త్రైలోక్య చింతామణి రసము, దశమూలారిష్ట, మొదలగునవి ప్రయోగింపవలెను.

శ్వాస కృచ్ఛ్రత యందు — హింగు కర్పూరవటి, బృహత్ కస్తూరి భైరవ రసము, శ్వాసానందవటి శ్వాస కుఠారరసము మొదలగు ఔషధములు ప్రయోగింపవలెను. ఉరస్సుపై కర్పూర తైలము రాచి ఉష్ణోదకము యొక్క కోశముచే స్వేదనము చేయింపవలెను తీవ్ర శ్వాస కృచ్ఛ్రతలో తగిన విధిననుసరించి ప్రాణవాయువు ప్రయోగింపవలెను.

మూత్ర కృచ్ఛ్రత యున్నచో వస్తి ప్రదేశమున రేవల్చిన్న పట్టువేయుట, మూత్ర లౌషధములైన తృణ పంచమూల క్వాథము, ఉసీరాసవము మొదలగునవి యివ్వవలెను.

మధుమేహ జనిత మూర్ఛయందు :

మధుమేహ చరిత్ర, ఔషధోప యోగమున అశ్రద్ధ, అపథ్య సేవన, మూర్ఛ మెల్ల మెల్లగా కలుగుట, శ్వాస చాలనస్లుండుట, శ్వాసయందు కుళ్ళిన ఏపిల్ వంటి వాసన (Acetone smell) నేత్ర గోళముల మృదుత్వము, మూత్రమున చక్కెర ఎసిటోన్ కన్పించుట, రక్తగత శర్కరాప్రవృద్ధి.

మధుమేహ శామక ఔషధ ఆహారాది ప్రయోగము ముఖ్యముగా వసంత కుసుమాకర రసము, శిలాజిత్తు, చంద్రప్రభావటి ప్రయోగము. అవశ్యకత యున్నచో తగిన మాత్రలో ఇన్సులిన్ ప్రయోగము.

మస్తిష్కాంతర రక్త సంచయము (Cerebral haemorrhage) :

రక్త సమ్మర్దము, శ్వాసకృచ్ఛ్రత, నాడీ మాంద్యము, తీవ్ర మూర్ఛ, దృష్టిమండల కాంతి ప్రతిచర్యా వికృతులు పక్షాఘాతము.

సంజ్ఞా ప్రబోధక చికిత్సలు, రసరాజరసము, బృహద్వాత చింతామణి పునర్నవాసవ—వీనిని ప్రయోగించుట.

## తీవ్ర జ్వరము

106°F కంటె అధికముగా జ్వరము అధిక సమయము వరకు ఉన్నచో ప్రలాపము, మనో విభ్రమము కలిగి మూర్ఛకు దారితీయ వచ్చును.

చికిత్స — జ్వరహరణానుసారము తగిన ఔషధములు ప్రయోగింపవలెను.

పిత్త జ్వరమునకు చెప్పబడిన ఔషధములు ఇతర క్రియలు ప్రయోగింపవలెను.

ముఖ్యముగా శీతల ప్రదేశమున రోగిని ఉంచుట, శీతలమైన బట్టలు మొదలగు వానిలో కప్పి 102°F వరకు వచ్చువరకు ఉంచి కమునకు ఆ బట్టలు తీసివేయవలెను.

ఉశీరయుక్త చందనయుక్త లేపములు జలసించనములు ప్రయోగింపవలెను.

ఔషధములు ముక్తాపిష్టి 200 మి. గ్రా గుడూచి సత్త్వము 200 మి.గ్రా తేనెతో ఇచ్చి ఉశీరక్వాథము త్రాగింపవలెను. సిద్ధమకరధ్వజ 100 మి. గ్రా రజత భస్మము 100 మి. గ్రా నాగపాషాణ భస్మము 100 మి. గ్రా రజత భస్మము 100 మి. గ్రా కలిపి యివ్వవలెను.

మృత్యుంజయ రసము, గోదంతి భస్మము, కలిపి ముఖ్యమహౌషధముగా ఇవ్వవలెను.

వేదనా శమనార్థము సంజ్ఞా ప్రబోధ నార్థము వాతకులాంతక రసము 200 మి. గ్రా గుడూచీ సత్త్వం తేనె కలిపి యివ్వవలెను.

వడదెబ్బ యందును ఈ చికిత్సలే చేయవలెను.

## తీవ్ర అతిసారము

విసూచి, అతిసారము, ప్రవాహిక, ఆంత్రికశోథ అనేక విధములగు కీటాణువులు ముఖ్యముగా బాసిలర్ ఇన్ఫెక్షన్, కలరా, దూషిత జలపానము వీని వలన జలయుక్త మల ప్రవృత్తి మాటి మాటికి జరిగి శరీరమందలి అర్ద్రాలువు ఊడుచుట, నేత్రములు లోనికీడ్వబడుట, చర్మము రూక్షముగ నుండి స్థితిస్థాపకత తగ్గుట, మూత్రబంధము, నాడీ మాంద్యము మొదలగు లక్షణములుండును. కారణానుసారము యితర లక్షణములుండును.

సత్వరమే వర్చ్యములను ఆపుటకు కర్పూర రసము, లశునాదివటి, సంజీవనీవటి, విషూచి విధ్వంసినీ వంటి ఔషధములు తగిన మాత్రలో యివ్వవలెను. లవణము శర్కర కలిపిన నీటిని మాటి మాటికి పానము చేయింపవలెను. దాడిమ స్వరసము, బదరీ పానకము యివ్వవలెను. పర్ణయవాని స్వరసము ముహుర్ముహు రౌషధముగా యివ్వవలెను.

అత్యవసరమైనచో సిరాద్వారా తగిన ద్రవములను అంతఃక్షేపము చేయవలెను.

మూత్ర బంధము కలుగ కుండగా వస్తిపై సర్షపతైలాభ్యంగము లేక తేవల్బివ్వి ప్రయోగము చేయవలెను.

నాడీ మాంద్యము శమించుటకై లక్ష్మీ విలాసరస మివ్వవలెను.

పిమ్మట నంతర వ్యాధిలో కారణానుసార చికిత్స చేయవలెను.

ఉదరశూల అధికముగానున్న లశునాదివటి, మహాశంఖవటి లేక శంఖవటి ఇవ్వవలెను.

## ఉదర శూల

పరిణామ శూల, యకృద్వికారములు, అజీర్ణము, కోష్ఠబద్ధము, ఆంత్రావరోధము, అపెండిసైటిస్ ఉదర కలాశోథ వీని వలన తీవ్ర ఉదరశూల కలుగును.

అభ్యంతర అవయవములందు రక్త స్రావము జరుగుట వలన కలుగు స్థితులలో మూర్ఛతో కలసియుండును. అట్టి స్థితిలో శస్త్ర చికిత్స అవసరము కాన శస్త్ర వైద్యుల వద్దకు పంపవలెను.

కుడి ఇలియాక్ ప్రదేశమున శూల, వమి, స్పర్శా సహ్యత, కోష్ఠబద్ధత యున్నచో ఎపెండిసైటిస్‌గా సందేహించి తగిన పరీక్షలకు చికిత్సలకు శస్త్ర వైద్యుని వద్దకు పంపవలెను.

ఇతర శూలలందు శూల శమించుటకై మహాశంఖవటి, శూలఘ్నవటి, శంఖవటి వీనిలో తగిన ఔషధమును కుమార్యాసవముతో యివ్వవలెను.

అజీర్ణ జనిత శూలయందు శివక్షార పాచన చూర్ణము ఉష్ణోదకముతో ఇవ్వవలెను.

వస్తిని యిచ్చిగాని మృదురేచకములగు పంచసకార చూర్ణమిచ్చిగాని విరేచనము చేయింపవలెను.

## పిత్తజ శూల (Biliary Colic)

తీవ్రశూల కుడి కుక్షి భాగమున ప్రారంభమై ఉదరము వెన్ను అంసభాగములకు వ్యాపించును. కామలా లక్షణములు గూడా కలుగును.

శూలహరమగు పై ఔషధములతోపాటు శూలవజ్రిణీవటి, కుమార్యాసము, శృంగి భస్మము, మహా వాతరాజ రసమువంటి ఔషధము లివ్వవలెను.

స్థానిక స్నేహ స్వేదములు చేయింపవలెను. అవసరమైన అనిద్ర చికిత్సలో చెప్పబడిన నిద్రా జనకౌషధము లివ్వవలెను.

## వృక్క శూల (Renal Colic)

తీవ్రముగా నుండి కటి మూత్ర నాళమునకు ఊరు లోపలి భాగమునకు వ్యాపించుచుండును. మూత్రాఘాత, మూత్రకృచ్ఛ్రాది లక్షణములుండును.

త్రివిక్రమరసము, త్రికంటకాది క్వాథము మొదలగు ఔషధములు శూల శామకములగు యితర ఔషధములు యివ్వవలెను.

## రక్త స్రావము

శరీరమున ఏ భాగమునుండైనను రక్తస్రావము జరిగినచో వెంటనే చికిత్సింపకున్న మరణమునకు దారి తీయవచ్చును.

ముందు రక్తమును స్తంభింప చేయు చికిత్సలు చేసి తరువాత కారణము నన్వేషించి కారణానుసార చికిత్సలు చేయవలెను.

స్థానికముగా శీతల ప్రదేహ పరిషేకములు రక్తమును స్తంభింపచేయును.

రక్తపిత్త కులకండనరసము, చంద్రకళారసము, రక్తబంధిని, చందనాసవము, ఉశీరాసవము, కాసుమివా, ముక్తాపిష్టి మొదలగునవి ప్రయోగింపవలెను.

రక్తక్షయముచే కలుగు ఉపద్రవశమనార్థము రక్తమును ఎక్కించుట వంటి క్రియలు ఆవశ్యకతానుసారము చేయించవలెను.

స్వల్పముగా రక్తక్షయమున్నపుడు రక్తవర్ధక ఔషధ ఆహారాదులచే ఉపచరింపవలెను.

## మూత్రావరోధము

పిత్తప్రకరము అగు ఆహారవిహారములు అశ్మరీ అర్బుదాదులచే అతిసారాది వ్యాధులచే మూత్రావరోధము కలుగును.

వస్తిపై నారాయణ తైలాభ్యంగము సేకము చేయించవలెను. తృణపంచమూల క్వాథము, మూత్ర విరేచన చూర్ణము, త్రివిక్రమ రసము, మొదలగునవి

మూత్ర కృచ్ఛ్రమున ప్రయోగించవలెను. దాహము ఉన్నచో చంద్రకళారసము ఉశీరాసవము చందనాసవము యివ్వవలెను.

అవసరమైనచో నాళికను ప్రవేశింపచేసి మూత్రప్రవృత్తి కలిగింపవలెను.

## తీవ్ర శ్వాస

తీవ్ర శ్వాసయందు తమక శ్వాస ఐనచో హింగు కర్పూరవటి, శ్వాసానందవటి, మయూర చంద్రికా భస్మము, కనకాసవము, అపామార్గ అంతర్ధూమ భస్మం మొదలైనవి ముహుర్ముహు రౌషధముగా ఇవ్వవలెను.

ఉరస్సుపై కర్పూర తైలము అభ్యంగనము చేయించి స్వేదము చేయింపవలెను.

కఫాధిక్యతలో వాసాస్వరసము తేనె కలిపి యివ్వవలెను.

శ్వాస కాస చింతామణి రసము 100 మి.గ్రా. తేనెతో ఇవ్వవలెను.

## హృచ్ఛూల

వాతకులాంతక రసము, కస్తూరి భైరవము, శృంగి భస్మము, ధన్వంతరీ గుటిక, హింగ్వాది చూర్ణము. వీనిని అర్జునారిష్టము లేక దశమూలారిష్టముతో ఇవ్వవలెను.

నిద్రాకరమగు ఔషధములు ఇవ్వవలెను.

రక్త సమ్మర్దాల్పత యున్నచో బృహద్వాత చింతామణి యివ్వవలెను.

## ఆమవాత, సంధిశూల

సంధిశూల, ఆమవాత శూలలందు గృధ్రసీ వాతమున చెప్పబడిన వేదనా శామక క్రియలు ప్రధానముగా తైలాభ్యంగము, స్వేదనములు నిద్రాకరౌషధములు ప్రయోగింపవలెను.

ఇతర అత్యయిక అవస్థల యందు ఆయా ప్రకరణములలో వివరింపబడిన ఔషధములలో యితర క్రియలలో సత్వర గుణకరమైనవి ప్రయోగింప వలెను.

## పంచకర్మ చికిత్స

చికిత్స శోధనమనియు శమనమనియు రెండు విధములు. వీనిలో శోధన చికిత్సయే పంచకర్మ అనబడును.[1]

వమనము, విరేచనము, శిరో విరేచనము, ఆస్థాపనము, అనువాసనము— ఈ ఐదు కర్మలు పంచకర్మలనబడును.

శల్యతంత్రకారుల మతము ననుసరించి-వస్తి కర్మలను రెంటిని ఒకటిగా లెక్కించి రక్తమోక్షణము గూడా పంచకర్మలలో చేర్చబడినది.

దోష నిర్హరణ శక్తి కలిగినవే శోధన కర్మలనియు అవియే పంచకర్మలనియు భావింపబడు చున్నవి. అనువాసన వస్తి అంతగా దోషనిర్హరణము కల్గించునది కాదను ఉద్దేశ్యముతో వాగ్భటుడు దీనిని వదలి రక్తమోక్షణమును పంచకర్మలలో చేర్చెను.

## పంచకర్మ ప్రయోజనము

ఆయా ఋతువులందు సంచితమగు దోషములను శోధన కర్మల ద్వారా నిర్హరణము చేయించిన వ్యాధులు కలుగక ఆరోగ్యము కాపాడబడును. వసంత ఋతువున శ్లేష్మమును వమనము ద్వారా శరదృతువున పిత్తమును విరేచనము చేతను వర్ష ఋతువున వాతమును వస్తులచేతను శోధింపవలెను.[3]

---

1. శోధనం శమనం చేతి సమాసాదౌషధం ద్విధా (అ.హృ.సూ. 1/25)
2. ఇహ వమనాదిషు కర్మలక్షణాం బహిర్వ్యతిక్త్రవ్యతా యోగిదోషనిర్హరణ శక్తి వ్యాయస్త్వమ్ (చ.సూ. 2/15)
3. హేమే వసన్తే శ్లేష్మాణం పిత్తం శరది నిర్హరేత్
వర్షాసు శమయేద్ వాయుం ప్రాగ్వికారసముచ్ఛ్రయాత్ (సు.సూ. 6/38)

లంఘన పాచనాదులచే శమింప చేయబడిన దోషములు తిరిగి ప్రకోపించు చుండును. కాని సంశోధనముచే జయింపబడిన దోషములు వ్యాధులు సమూల ముగా శమించును. ఎట్లన ఏదేని వృక్షమును మూలమును ఛేదింపనిచో తిరిగి ఉద్భవించును. మూలమును ఛేదించినచో ఆ వృక్షమునకు తిరిగి శాఖలు ఉద్భవింపవు అదే విధముగా శోధన చికిత్స వ్యాధులను సమూలముగా నిర్మూలించును.

## సంశోధనముచే కలుగు గుణములు

ఊర్ధ్వాధ స్సంశోధనముచే సంచితమైయున్న దోషములు నిర్హరణమగుటచే వాటి వలన కలుగు జఠరాగ్ని ఆవరణము తొలగి అగ్ని వృద్ధిపొందును. కోష్ఠము శుద్ధమగును. వ్యాధులు శమించును. శోధనానంతరము క్రమక్రమముగా ఆరోగ్యము వృద్ధినందును. జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు, మనస్సు బుద్ధి నిర్మలములగును. వర్ణము, బలము, పుష్టి, పురుషత్వము—ఇవి వృద్ధినంది సంతాన ప్రాప్తి కలుగును. వార్ధక్యము త్వరగా సంభవింపదు. ఆరోగ్యము దీర్ఘాయువు కలుగును. ఇవన్నియు విధిననుసరించి కాలము ననుసరించి తగిన విధముగా పంచకర్మలు చేయించు కొనినచో కలుగును.

---

1. దోషాః కదాచిత్ కుప్యంతి జితా లంఘన పాచనైః జితాః సంశోధనైః
   యేతు న తేషాం పునరుద్భవః దోషాణాం చ ద్రుమాణాం చ
   మూలేఽనుపహతే సతి రోగాణాం ప్రసవానాం చ గతానామాగతిర్ధ్రువా
   (చ.సూ. 16)

2. ఊర్ధ్వం చైవానులోమం చ యథాదోషం యథా బలమ్ ఏవం విశుద్ధకోష్ఠస్య
   కాయాగ్నిరభి వర్ధతే వ్యాధయశ్చోపశామ్యంతి ప్రకృతిశ్చానువర్తతే
   ఇంద్రియాణిమనోబుద్ధిర్వర్ణశ్చాస్య ప్రసీదతి బలం పుష్టిరపత్యం చ
   వృషతా చాస్యజాయతే జరాం కృచ్ఛ్రేణం లభతే చిరంజీవత్యనామయః
   తస్మాత్ సశోధనం కాలే యుక్తియుక్తం పిబేన్నరః (చ.సూ. 16)

## పూర్వ కర్మలు, స్నేహ స్వేదములు

స్నేహము, స్వేదము-వీనిని పంచకర్మలకు ముందు ప్రయోగించుట సామాన్యముగా అవసరమై యుండును. అందువేత వీనిని పూర్వకర్మలందురు.

స్నేహ స్వేదములచే దోషములు శాఖలనుండి వాని స్థానమైన కోష్ఠమునకు తీసికొని రాబడి సులభముగా దోషనిర్హరణ జరుగుటకు సహకరిస్తాయి.

స్నేహముచే వాతము శమించును. శరీరము మృదుత్వమును పొందును. ఆంత్రములందుండు మల సంగము నశించును. శరీరమునందు స్రోతస్సు లందు అంటుకొని యుండు దోషములు స్నేహనముచే విడిపడును. స్నేహముచే భావితము చేయబడిన పాత్ర పేన పోసిన అంటుకొనకుండా ఉండు విధముగా స్నిగ్ధము గావింపబడిన శరీరము నందు దోషములు అంటుకొని ఉండలేక విడివడి యుండును.[1]

స్నేహములు ప్రధానముగా నాలుగు విధములుగా నుండును. అవి ఘృతము, తైలము, వస, మజ్జ[2].

స్నేహము తగిన విధి ననుసరించి యోగ్యుడైన పురుషునికి పానము చేయింపబడును.

## స్వేదనము

శోధనమునకై స్నేహనము తరువాత స్వేదనము చేయింపవలెను. దీనివలన స్రోతస్సులందు అంటుకొని యుండు దోషములు కరిగి ప్రవహించి కోష్ఠమునకు చేరును. తద్వారా దోష నిర్హరణము సులభమగును. స్వేదనము సాధారణముగా వాతకఫ వ్యాధులందు ప్రయోగింపబడును.

---

1. (i) తాన్యుపస్థిత దోషాణాం స్నేహ స్వేదోపపాదనైః
పంచకర్మాణి కుర్వీత మాత్రాకాలౌ విచారయన్ (చ. సూ. 2)
(ii) స్నేహోఽనిలం హంతి మృదుం కరోతి దేహం మలానాం వినిహంతి సంగం (చ. సి. 1)
2. చ. సూ. 13
స్నిగ్ధస్య సూక్ష్మేష్వయనేషు లీనం స్వేదస్తు దోషం నయతి ద్రవత్వం (చ. సి. 1)

స్నేహపూర్వక స్వేదనముచే వాతమునకను లోమగతి గలిగి శమించును. పురీషము, మూత్రము, శుక్రము ఇవి ఎప్పుడును సులభమాపములో స్రోతస్సులను అడ్డగింపవు.

ఎండిన కట్టెలు నూనెతొసి వెచ్చచేసినచో అవి ఎట్లు మృదుత్వమును పొంది వంగునో అదే విధముగా స్నేహస్వేదములు చేయించిన శోధన కర్మ సఫలముగా జరుగును.[1]

సుశ్రుతుడు, వాగ్భటుడు స్వేదనములను ప్రధానముగా నాలుగు విధములుగా పేర్కొనిరి. అవి 1. తాప స్వేదము 2. ఊష్మస్వేదము 3. ఉపనాహ స్వేదము 4. ద్రవస్వేదము[2]

చరకుడు స్వేదనములను సాగ్ని స్వేదము అనియు నిరగ్ని స్వేదము అనియు రెండు విధములుగా విభజించెను. అవి ఈ క్రింది విధముగా నుండును.

## I. అనగ్ని స్వేదములు:

1. వ్యాయామము 2. ఉష్ణసదనము 3. గురుప్రావరణము 4. క్షుధా 5. బహు మద్యపానము 6. భయము 7. క్రోధము 8. ఉపనాహము (అనగ్ని) 9. ఆహవము (యుద్ధము) 10. ఆతపము

## II. అగ్ని స్వేదములు:

1. సంకరస్వేదము 2. ప్రస్తర స్వేదము 3. నాడీ స్వేదము 4. పరిషేక స్వేదము 5. అవగాహ స్వేదము 6. జెంతాక స్వేదము 7. అశ్మఘన స్వేదము 8. కర్షూ స్వేదము 9. కుటీ స్వేదము 10. భూ స్వేదము 11. కుమ్భిక స్వేదము 12. కూప స్వేదము 13. హోలాక స్వేదము.[3]

---

1. స్వేదసాధ్యాః ప్రశామ్యంతి గదా వాతకఫాత్మకాః స్నేహపూర్వం ప్రయుక్తేన స్వేదేనావజితేఽనిలే పురీష మూత్రరేతాంసి న సజ్జంతి కథంచన శుష్కాణ్యపి హి కాష్ఠాని స్నేహస్వేదోపపాదనైః న మయంతి యథాన్యాయం కిం పునర్జీవతో నరాన్ (చ.సూ. 14)
2. సు. చి. 32 అ
3. చ. సూ. 14

---

* పంచ కర్మలకు పూర్వ కర్మలకు సంబంధించిన ఇతర విస్తృత వివరణ కాయ చికిత్స చతుర్థ పత్రమునకు సంబంధించి యున్నది.

# అకారాద్యనుక్రమణిక

— చ —



— జ —



— త —



— ద —

— శ —




Printed at :

"RAGHAVENDRA"

S. N. Puram, VIJAYAWADA - 11.